# చంద్రభాగా తరంగాలు

## భక్త విజయము

( ప్ర థ మ భా గ ము )



ర చ యి త

స్వామి సుందర చైతన్యానంద

# చంద్రభాగా తరంగాలు

## స్వామి సుందర చైతన్యానంద

ప్రథమ కెరటం 1983, 1000 కాపీలు
ద్వితీయ కెరటం 1984, 1000 కాపీలు
తృతీయ కెరటం 1985, 1000 కాపీలు
చతుర్థ కెరటం 1987 1000 కాపీలు



ప్రచురణ
సుందర చైతన్యాశ్రమం
ధవళేశ్వరం
పిన్ : 533 125
ఫోన్ : 378

రూ 30/-

ముద్రణ :
స్టైల్‌వే ప్రింటర్స్
రాజమండ్రి-గాంధీపురం 3

పాండురంగదేవుని
పదసరోజములకు



పతిత పావన పాండురంగ భగవాన్



# శ్రీ పాండురంగాష్టకము

(శ్రీ ఆదిశంకరాచార్యకృతము)

అనువాదము : **స్వామి సుందర చైతన్యానంద**

1. మహాయోగిపీఠే తటే భీమరథ్యాం
వరం పుండరీకాయ దాతుం మునీంద్రైః
సమాగత్య నిష్టం తమానందకందం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్॥

2. తటిద్వాససం నీలమేఘావభాసం
రమామందిరం సుందరం చిత్ప్రకాశమ్
వరం త్విష్టికాయాం సమన్యస్త పాదం
పరబ్రహ్మలింగం భజేపాండురంగమ్॥

3. ప్రమాణం భవాబ్ధేరిదం మామకానాం
నితంబం కరాభ్యాం ధృతోయేన తస్మాత్
విధాతు ర్వసత్యై ధృతో నాభి కోశః
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్॥

4. స్ఫురత్కౌస్తు భాలం కృతం కంఠదేశే
శ్రియాజుష్ట కేయూరకం శ్రీనివాసమ్
శివంశాంత మీడ్యం పరంలోకపాలమ్॥
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్॥

5. శరచ్చంద్ర బింబాననం చారుహాసమ్
లసత్కుండలాక్రాంత గండస్థ లాంతమ్
జపారాగ బింబాధరం కంజనేత్రం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్॥

6. కిరీటోజ్జ్వలత్సర్వ దిక్ప్రాంతభాగం
సురైరర్చితం దివ్య రత్నైరనర్ఘైః
త్రిభంగాకృతిం బర్హ మాల్యావతంసం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్॥

7. విభుం వేణువాదం చరంతం దురంతం
స్వయం లీలయా గోపవేషం దధానమ్
గవాం బృందకానందదం చారుహాసం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్॥

8. అజం రుక్మిణీప్రాణ సంజీవనంతం
పరంధామ కైవల్యమేకం తురీయమ్
ప్రసన్నం ప్రపన్నార్తిహం దేవ దేవం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్॥

స్తవం పాండురంగస్య వైపుణ్యదంయే
పఠంత్యేక చిత్తేన భక్త్యాచ నిత్యమ్
భవాంభోనిధిం తేపి తీర్త్వాం తకాలే
హరేరాలయం శాశ్వతం ప్రాప్నువంతి॥

1. ఆనంద రూపుఁడును, అనంత సత్యస్వరూపుఁడును, పుండలీక భక్తు నికి వరములొసంగి బ్రోచుటకు, మహర్షి పరివేష్టితుఁడై, భీమానదీ తీరమున మహాయోగ పీఠము నధిష్ఠించిన పరబ్రహ్మలింగమైన పాండురంగదేవుని సదా భజింతును.

2. ప్రకాశమానమగు వస్త్రమును ధరించినవాడును, నీలమేఘశ్యాముఁడును, రమామందిరసుందరుఁడును, అనంత చైతన్య స్వరూపుఁడును పురుషోత్తముఁడును, ఇటుకపై సమన్యస్త పాదములతో నిలబడిన వాడునగు పరబ్రహ్మలింగమైన పాండురంగ దేవుని సదా భజింతును.

3. నా భక్తులైనవారికి సంసారపులోతు ఇంతమాత్రమేనని చూపుటకా యన్నట్లు తనచేతులను నడుముపై నిడుకొని నిలబడినవాడును, బ్రహ్మదేవుని మనుగడకై నాభియందు పద్మమును ధరించిన వాడును, నగు పరబ్రహ్మ లింగమైన పాండురంగ దేవుని సదా భజింతును.

4. కౌస్తుభమణితో నలంకృతమైన కంఠసీమగలవాడును, లక్ష్మీదేవిచే శ్లాఘింపబడిన కేయూరమును ధరించినవాడును, రమాకాంతుఁడును, శుభప్రదుఁడును, శాంతస్వరూపుడును, పూజనీయుఁడును, పరమమైన వాడును, లోకపాలకుఁడును నగు పరబ్రహ్మ లింగమైన పాండురంగని సదా భజింతును.

5. శరచ్చంద్ర బింబమువంటి ముఖముగలవాడును, చారుదరహాస వదనుఁడును, వినీల కుండలధారుఁడును, జపారాగ బింబాధరుఁడును కంజపత్రాయతాక్షుఁడును నగు పరబ్రహ్మ లింగమైన పాండురంగని భజింతును.

6. సర్వ దిక్ప్రాంతములను ప్రకాశవంతము చేయు ఉజ్జ్వల కిరీటధారియును, అమూల్య దివ్యరత్నములతో సదా దేవతలచే అర్చింపబడువాడును, త్రిభంగాకృతిలో నిలిచెడివాడును, బర్హి బర్హ మాల్యావతంసకుడును నగు పరబ్రహ్మలింగమైన పాండురంగని సదా భజింతును.

7. సర్వవ్యాపకుడును, వేణుగానలోలుడును, విరంతనుడును, అవి నాశియును, గోపవేషధారియును, గోపులకు ఆనందము నొసంగు వాడును, నాణ్యమైన నవ్వుగలవాడును నగు పరబ్రహ్మలింగమైన పాండురంగని సదా భజింతును.

8. పుట్టుకలేనివాడును, రుక్మిణీదేవి జీవితమునకు సంజీవినివంటి వాడును, పరమపురుషుడును, కైవల్యధాముడును అద్వయుడును, తురీయుడును, ప్రసన్నుడును ప్రపన్నార్తి హరుడును దేవాది దేవుడును నగు పరబ్రహ్మలింగమైన పాండురంగని సదా భజింతును.

**ఫలశ్రుతి :** పుణ్యప్రదమగు ఈ పాండురంగాష్టకమును నిత్యము ఎవ్వ రయితే భక్తితో ఏకదీక్షతో పఠింతురో అట్టివారు సంసార సముద్రమును చాటి మరణ కాలమందు శ్రీహరి సన్నిధాన మును పొంది తరింతురు.





# వినతి

నీటిలో చరిస్తూ చేప దప్పికతో బాధపడుచున్నది. ఇదొకవింత సమస్య. ఈ సమస్య ఎలా పరిష్కరించబడుతుంది? నీటిని పానము చేయు మరొక చేపను వీక్షించుటచేత, అనుకరించుటచేత, అనుభూతి పొందుటచేత.

ఆనంద స్వరూపుడైన జీవుడు విషాదంతో బ్రతుకును చీకటి మయం చేసుకొంటున్నాడు ఇదొక విచిత్ర సమస్య. ఈ సమస్య ఎలా పరిష్కరించబడాలి? ముక్తాత్ములై అలరారు మహాత్ములను దర్శించుట చేత, అనుసరించుటచేత, అనుభూతిని పొందుటచేత.

అనంతానంద శిఖరము నధిరోహించి అమృత రసానుభూతిలో చరించు మహాత్ముల సహచర్య భాగ్యమును కల్పించుటయే ఈ గ్రంధ రచనలో ముఖ్యోద్దేశ్యము.

భక్తులు వ్రాయమన్నారు. భగవానుడు వ్రాయించాడు మరి మరినేను? ఈ పవిత్ర కార్యము ద్వారా,నాలోని ''నేను'' ను పోగొట్టు కొనేందుకు శ్రమించిన ఆధ్యాత్మిక శిశువును వ్రాయమన్న భక్తులకు నమస్కృతులు. వ్రాయించిన ఆది దేవునకు శతకోటి ప్రణామములు

1983 వ సంవత్సరము ప్రథమ ముద్రణ జరిగింది. సంవత్స రము నడవక మునుపే ప్రతులన్నీ కదిలి వెళ్ళాయి. భక్తుల అమృత హస్తాలను అలంకరించాయి. అంతఃకరణాను భక్తితో నింపాయి. మేము ఊహించనంతగా ఆదరణ లభించింది. పాండురంగ దేవుని ప్రేమా మృత సాగరంలో మునకలేసి భక్తులు తృప్తి చెందారు. భక్తుల కోర్కె మేరకు 1984 సం॥ ద్వితీయ ముద్రణ వెలువడింది. ప్రథమ ముద్ర ణలో హృదయానందమును కలిగించగలిగాను. ద్వితీయ ముద్రణలో నేత్రానందమును కూడా కల్పించాలని సంకల్పించి, భక్తుల వర్ణ చిత్ర ములలో వారి చరిత్రలను అందించాము.

ద్వితీయ ముద్రణ వెలువడిన ఆరునెలలలోనే కాపీలన్నీ ఖర్చయి పోయాయి. భక్తుల నుండి ప్రవాహంలా వస్తున్నాయి ఉత్తరాలు పుస్తకాలు కావాలని. అవసరాన్ని గుర్తించి ఈ తృతీయ ముద్రణ వెలువడుచున్నది. స్వీకరించండి.

మకాం : భువనేశ్వరం — పాండురంగ దేవుని పవిత్ర సేవలో

తేది : 22-12-85 — మీ

గీతాజయంతి — స్వామి **సుందర చైతన్యానంద**

# విషయ సూచిక





# ఉపోద్ఘాతము

ఇతరులనుండి గ్రహించిన వస్తువును గ్రహించినపుడున్న రూపంలోనే తిరిగి అప్పగించువారు మధ్యములు. అధికశోభను చేకూర్చి అందించేవారు ఉత్తములు. పాడుచేసి ఇచ్చువారు అధములు.

మధ్యములవలన ఇతరులకు పెద్దగా సుఖం లభించకపోయినా దుఃఖం కలుగదు. ఉత్తములవలన లభించేదంతా సుఖమే. అధములవలన ఏర్పడేదంతా దుఃఖమే.

కృతజ్ఞత కుంటుబడి సహాయము చేసినవారి మనసులను కలతపెట్టే అధములకన్నా, అధికంగా సంతృప్తి పరచలేకపోయినా దుఃఖము కల్గించకుండా, ధర్మప్రవృత్తితో సమాన సహాయమందించే మధ్యములు ప్రశంసాపాత్రులు. తామెంత బాధకు గురియైనను సహనము వహించి ఇతరులనుండి పొందినదానికన్నా అనేకరెట్లు మిన్నగా అందిస్తూ, గ్రహీతులకు అధికోత్సాహమును పంచే ఉత్తములు మధ్యములకన్నా పవిత్రులు

ప్రకృతిలో పరిభ్రమించే పశుపక్ష్యాదులు అనేక విధాలుగా మానవునికి ఉపయోగపడుతున్నాయి. అందుకోవడము తెలియక అందించడములోనే బ్రతుకును ధన్యత చేసుకుంటున్నాయి. విజ్ఞానమునందించే బుద్ధి వాటికి లేనందున అమాయకంగా జీవిస్తున్నాయి, అన్యాయంగా ఆహుతి అవుతున్నాయి

మానవుని పరిస్థితి వేఱు. తాను పశుపక్ష్యాదులవలె సహజాతములత నడక సాగించేవాడు కాదు. తనలో మనోబుద్ధులున్నాయి\ మంచి/చెడులను

గ్రహించే జ్ఞానముంది ధర్మజీవనము గడిపేందుకు ఉపకరించే విజ్ఞానముంది అన్నీవుండి అగచాట్లకుగురియై అయోమయ జీవితాన్నిసాగించే మానవుని జీవనరీతి భగవానుని పవిత్ర సృష్టికే కళంకమును ఆపాదింపమన్నది మానవుని ఈ అస్తవ్యస్త జీవనానికి అయోమయ ప్రవర్తనకుకారణమేమిటి?

మానవుడు కృతజ్ఞతను మరచిపోయాడు మంచిని గ్రహించి వంచనను పంచడానికి సిద్ధపడ్డాడు బాధ్యతలను విస్మరించి బలహీనతలకు బానిసయ్యాడు తాత్కాలిక విషయ సుఖజీవన మాధుర్యంలో శాశ్వత అమృతత్వ ప్రశాంత ప్రగతినే దూరం చేసుకుంటున్నాడు తిరిగి ఇవ్వడంలో అధిక శోభను చేకూర్చి అందించే ఉత్తముడు కాలేక గ్రహించిన దానిని అదే రూపంలో తిరిగి అందించే మధ్యముడుగా నిలువలేక పొందిన వస్తువును పాడుచేసి అందించే అధముడుగా మిగిలిపోయాడు

భగవంతుడు మనకు బ్రతుకునిచ్చాడు నిర్మలమైన జీవితాన్ని ప్రసాదించాడు నిష్కల్మషమైన మనోబుద్ధుల్ని అందించాడు. మనల్ని జీవించమన్నాడు మనం జీవిస్తూ ఇతరులకు ఆదర్శంగా నిలవమని మనకు బ్రతుకును అనుగ్రహించాడు

బ్రతుకు వచ్చింది బ్రతుకుతున్నాం బ్రతుకు సాగుతుంది కొనసాగుతుంది కొనఊపిరి సమీపిస్తుంది బ్రతుకు ఆగుతుంది చితి ఎదుట నిలుస్తుంది బ్రతికిన శరీరం చితిలోపడి గతించిపోతుంది ఊయలలో ఊగిసలాడిన శరీరం శ్మశానంలో మంటగలసిపోయింది ఎవరి జీవితమైనా ఇంతే

భగవంతుడిచ్చిన జన్మతో జీవితము ప్రారంభమైంది భగవత్ప్రసాదితమైన జన్మను అనుభవించి చివరిలో ఒకనాడు భగవంతునికి సమర్పించుకుంటున్నాము అలా సమర్పించుకునే పద్ధతినిబట్టి తీరుననుసరించి మనము అధములుగానో ఉత్తములుగానో మధ్యములుగానో మిగులుతాము

కాలుష్యంలేని కల్మషం తెలియని బ్రతుకును భగవానుడు మనకు ప్రసాదించాడు. దానిని అలాగే నిష్కల్మషంగా వుంచి దేవుని ముందుంచేవారు మధ్యములు కానీ ఈ మధ్యములు ఎక్కడా కనుపించరు భగవానుని వద్ద నుండి పొందిన జన్మను సత్యము అహింస బ్రహ్మచర్యాది సద్గుణములతో

ప్రకాశింపచేసుకొని సదాచారజీవన సర్వాత్మ భావములతో గుబాళింపు జేసు కొని ముక్తపురుషులయ్యే ఉత్తములైనా ఈ ప్రపంచములో తయారవుతారు లేదా స్వార్థ జీవనంతో కామక్రోధాది అరిషడ్వర్గములకు వారసులై అభి మాన అహంకారాది రాక్షస ప్రవృత్తికి దాసులై బ్రతుకును చీకటిమయం జేసుకొనే అధములుగానైనా మిగులుతారు

ప్రకృతిలో సానబెట్టబడే మానవుడు అధముడైనా కావాలి లేదా ఉత్తము డుగానైనా నిలవాలి అంతేగాని మధ్యముడుగా మిగిలే ప్రసక్తి ఉండదు పవిత్రమైన మానవజన్మను పొంది అపవిత్రుడుగా తయారు కాకూడదు రాగద్వేషాలతో బ్రతుకును వమ్ము జేసుకొని భగవంతుని ఎదుట అపరా ధిగా నిలిచే దుర్గతి ప్రాప్తించకూడదు నిర్మల బ్రతుకును నికృష్టంగా మార్చుకొని భగవానుని ఎదుట నిలబడుటకు అశక్తులమై సిగ్గుతో తలవంచే పరిస్థితి ఏర్పడకూడదు

భగవాన్! అమాయక జీవితాన్ని నీవు నాకు ప్రసాదించావు ప్రకృతిలో నిన్ను అన్వేషించే పవిత్రకార్యంలో నా అవగాహనను పెంచుకున్నాను సత్యధర్మాది సద్గుణాచరణలో మనోబుద్ధుల్ని శుద్ధిపరచుకున్నాను నిరంతర తపోధ్యానాది సత్కర్మానుష్ఠానంలో అంతఃకరణాన్ని నిర్మలంగా మార్చు కున్నాను సమదర్శన వీక్షణంతో బ్రతుకును పండించుకున్నాను నూతన ఆధ్యాత్మిక దృక్పథం ఏర్పరచుకున్నాను నిన్ను నాలో నన్ను చరాచర భూత ప్రపంచములో చూచుకున్నాను ఏకమేవాద్వితీయం బ్రహ్మ అనుభూతిని పొందాను ద్వైతచీకటిలో నీవు నాకు బ్రతుకును ప్రసాదిం చావు అద్వైత వెలుగులో నా బ్రతుకును నీరాజనంలా నీకు అందించు కుంటున్నాను" అని భగవంతునికి బ్రతుకును పూర్ణత్వముతో తిరిగి ఇచ్చు వారే ఉత్తములు అట్టివారే మహాత్ములు భగవద్భక్తులు

భగవంతుడు ప్రేమమయుడు భగవద్భక్తులు ప్రేమాశ్రితులు సాత్వ స్మిన్ పరమ ప్రేమరూపా భగవంతుని యందలి పరమ ప్రేమయే భక్తి యని నారదమహర్షి భక్తిసూత్రాలలో తెలియజేసారు ప్రేమమార్గంలో చరించే భగవద్భక్తులు ధన్యజీవులు దోషము తెలియనివారు ద్వేషము లేనివారు మోసము చేయరు మోహము నెరుగరు జాతివర్ణ లింగభేదాలను

పాటించరు తమ ప్రేమాలింగనంతో ప్రపంచాన్నంతా ఇముడ్చుకోగలరు వారి సన్నిధిలో అజ్ఞానం పటాపంచలవుతుంది

భక్తులను వదలి భగవానుడు ఒక్క క్షణం మనలేడు "దాసర మెలిర్వ దయేయు (శ్రీ)దేవి మెలిల్లవో పురందర విఠలగే' భగవానునికి భక్తుల మీదున్న ప్రేమ తన అర్ధాంగియైన లక్ష్మీదేవిపై కూడా లేదని పురందరదాసు తెలియజేశారు

"మ జనకో తుజముక్తి సంతా చియ సంగతి ' భగవాన్ నీవు నాకు ముక్తిని ప్రసాదించనవసరం లేదు మహాత్ముల సాంగత్యము ననుగ్రహిస్తే చాలు" అని తుకారాం ప్రార్థించారు మహాత్ముల సాంగత్యములో సాధించలేనిదంటూ వుండదు ముక్తి ఉత్కృష్టమైనచో అట్టి ముక్తిని ప్రసాదించు సత్పురుషుల సాంగత్యము అంతకన్నా ఉత్కృష్ట మైనదని తుకారాంజీ అభిప్రాయము

"భక్తియే ముక్తి కానన్న" మహాత్ముల సహచర్యంలో లభించే భక్తియే ముక్తియని బసవేశ్వరులు అభిప్రాయపడ్డారు

భగవంతుని కొరకు పరితపించే భక్తి ఉత్తమము అట్టి భక్తిని హృదయంలో నిలిపే సంత్ పురుషుల సాంగత్యము దుర్లభము ఈ రెండు ఏర్పడినచో ముక్తి కరతలామలకము భగవంతుని కొరకు పరితపించే అంతఃకరణ భక్తివలన కలుగుతుంది భగవంతుని కొరకు వియోగదుఃఖాన్ని అనుభవించడము కన్నా కావలసిదేముంటుంది; "తుజే కారణ దేహ మజ పాడవ ' భగవాన్ నీకొరకు నా దేహము నేల రాలిపోనీ అని సమర్థ రామదాసు భగవద్వియోగమును భరించలేక వ్యథ చెందారు

కబీర్ సంగత్ సాధుకీ
జ్యోం గంధీ కా బాస్
జ్యోం కఛు గంధీ దే నహీంజో
భీ బాస్ సువాస్

"సత్పురుషుల సాంగత్య మనునది అత్తరు అంగడిలో సువాసన వంటిది. అంగడివాడు నీకు ఏమి ఇవ్వకపోయినను అక్కడ వెదజల్లబడే సువాసన

నను నీ వనుభవించగలవ ని కబీర్ దాస్ అభిప్రాయపడ్డారు సత్పురుషుల చెంత బోధ లభించకున్నను కొంత సేపు వారి సాన్నిధ్యంలో ఆసీనమైనను పవిత్రమేనని కబీర్ అభిప్రాయము

భగవత్ కథా సాంభ లోనె హృదయ రాఖా భావ
సత్సంగ రూపీ గంగా మాం ప్రేమే కర్‌స్నావ
బాయిా మీరా కహే తమే హరి జన ధావ
హరికె చరణమే చిత్తలగావ

భాగవత్కథా శ్రవణమనే నావనెక్కి జనన మరణ రూపమైన సంసార సముద్రమునుదాటి తరించు సత్సంగమనే గంగలో మునకవేసి పవిత్రుడవు కమ్ము సత్పురుషుల సన్నిధిలో సంత్ పురుషుల పాదాలచెంత నా మన స్సుకు ప్రశాంతత దొరికినద ని మీరాబాయి గానం చేసింది

అందరి వ్యక్తులకు అన్ని కాలాలకు ఆదర్శపురుషులు ధన్యజీవులు మహా త్ములు మహాత్ములనబడేవారు ప్రతిదేశంలోను ఉన్నారు కానీ భారత భూమిలో అసంఖ్యాకంగా జన్మించారు భౌతిక భోగభాగ్యాలు మృగ్యమైనను భారతీయులు ఆధ్యాత్మిక భాగ్యవంతులనిపించుకున్నారు "భా అనగా ప్రకా శము రతుడనగా రమించువాడని అర్థము ప్రకాశమునందు మెలుగువారు వెలుగువారే భారతీయులు ఆత్మప్రకాశమునందు సదా రమించువారే భరత మాత ముద్దుబిడ్డలు

భక్తులు జాతి వర్ణ మత లింగభేదాలకు అతీతులు విశ్వనాథుని కంకితమైన భక్తులు విశ్వపౌరులు వారి సందేశాలు విశ్వవ్యాపకములు విశ్వామోద ములు భక్తులు అన్ని కులాలలోను జన్మించి భక్తికి వర్ణభేదము లేదని చాటారు భక్తులలో బ్రాహ్మణులున్నారు బ్రాహ్మణేతరులున్నారు అంత్య జులున్నారు. పాండురంగ భగవానుని దివ్యచరణాలచెంత బ్రతుకును ధన్యత చేసుకున్న భక్తులు ఒక కులానికి సంబంధించినవారు కారు అన్ని కులాల వారున్నారు కావలసింది కులము కాదని అనుకూలమని తెలిపారు ఆధ్యా త్మిక జీవనానికి అనుకూలమైన అంతఃకరణ కలిగియుండుటయే ప్రధానమని చాటారు తుకారాం ఒక వ్యాపారి జనాబాయి పరిచారిక కన్హోపాత్ర వేశ్య

నామదేవ్ దర్జీ నందదాస్ బ్రాహ్మణుడు గోరా కుమ్మరి సేనా మంగలి.
రోహిదాసు మాదిగ సవితా తోటమాలి చొఖా అస్పృశ్యుడు

ఆధ్యాత్మిక జీవనము వర్ణవ్యవస్థపై ఆధారపడియున్నదనే అపోహకు ప్రజలు గురియైనపుడు భక్తులు అన్ని వర్ణాలలో జన్మించారు సర్వమానవ సమానత్వాన్ని బోధించారు కుతర్కాలతో శుష్క పాండిత్యముతో అనుష్ఠాన వేదాంతముకు దూరులై వాచారంభముతో ప్రజలు సంచరించే సమయంలో భక్తులుదయించి వారి ఆదర్శనీయ జీవితముద్వారా ప్రజల హృదయాలలో భక్తి జ్యోతుల్ని వెలిగించి తమస్సును దూరంచేశారు స్త్రీలు ఆధ్యాత్మిక జీవనానికి అనర్హులనెడి అపోహ దేశంలో వ్యాపించిన దుర్దశలో మహాత్ములు స్త్రీలరూపంలో కనుపించారు సన్న్యాసమే మోక్షమార్గమని భావించి జీవించే క్లిష్ట పరిస్థితులలో అది తప్పని నిరూపించుటకు మహాత్ములు గృహస్థులుగా జీవించి ఆదర్శాన్ని అందించారు

భారతదేశంలో భక్తులులేని కాలమే కనుపించదు అయినను అవసరాన్నను సరించి పదమూడవ శతాబ్దమునుండి పదునేడవ శతాబ్దమువరకు గొలుసు లాగా భక్తులుదయించారు ఎక్కువగా మహారాష్ట్రదేశంలో కనుపించారు ఆకాలంలోనే పాండురంగభక్తి ఎక్కువగా ప్రాముఖ్యము నొందినది ఈ పాండురంగ భక్తుల చరిత్రలను భక్త విజయ మను పేరుతో మహీపతి మహరాజ్ రచించారు జీవిత చరిత్రలను రచించు రచయితలలో మహీపతికి ఒక విశిష్ట స్థానమున్నది వారు మరాఠీ భాషయందు అందమైన కవితతో నలభై వేల పంక్తులలో భక్తవిజయ గ్రంథాన్ని రచించారు మహారాష్ట్ర వాఙ్మయానికి ఈ గ్రంథమొక నూతన శోభను చేకూర్చిందని భావించుటలో అతిశయోక్తి లేదు శ్రీ మహీపతి ఎక్కువగా మహారాష్ట్ర భక్తుల నుద్దేశించి రచించినప్పటికి ఇతర రాష్ట్రాలకు చెందిన కబీర్ తులసీదాస్ జయదేవ్ రోహిదాస్ నరసీమెహతా మొదలగు భక్తులనుకూడా భక్త విజయ గ్రంథములో కలిపారు తుకారాంజీవైకుంఠయాత్రానంతరము 125 సంవత్సరములకు మహీపతి ఈ భక్తవిజయ గ్రంథమును రచించారు తుకారాం మహరాజ్ మహీపతికి స్వప్నదర్శనమిచ్చి భక్తవిజయ గ్రంథములు రచించమని ఆదేశించంగా మహీపతి రచించడము జరిగినది

కలియుగ మానవులను తరింపజేయుటకు వెలసిన పరమ పుణ్యక్షేత్రము పండరీపురము పరమపావన చంద్రభాగానదీ పుణ్యతీర్థంలో మునకలేసి ఎందరో భక్తులు ముక్తిధామ మలంకరించారు ఆ పుణ్యస్థలిలో రాళ్ళు మాట్లాడుతాయి చెట్లు కథలుచెబుతాయి గాలినుండి సంగీతం వినిపిస్తుంది చంద్రభాగా పుణ్యతీర్థంలో కదిలే ప్రతి తరంగము ఒక భక్తుడుగా గోచర మవుతుంది ఆ నదీమతల్లిలో ఎన్ని తరంగాలో? ఆ పవిత్ర భూమిలో ఎందరు భక్తులో? అందుచేత భక్తుల పవిత్ర గాథలను తెలియజేయు ఈ గ్రంధానికి "చంద్రభాగా తరంగాలు అని పేరు పెట్టాను ఇది మీకు నచ్చుతుందో లేదో? మీకు నచ్చాలని పెట్టలేదు నేను మెచ్చాలని పెట్టు కున్నాను సంత్ తులసీదాస్ మహానీయుడు రామచరిత మానసమును ప్రారంభిస్తూ స్వాంత స్సుఖాయ తులసీ రఘునాథ గాథా" అని వ్రాసు కున్నాడు ఈ గ్రంథ రచన ఎవరికోసం? స్వాంత స్సుఖాయ తన ఆత్మశాంతికోసం ఈ గ్రంధానికి "చంద్రభాగా తరంగాలు అనే నామ ధారణకూడా అలాంటిదే గ్రంధానికి ప్రధానం గ్రంథనామం అంటారు ఈ గ్రంథము విషయంలో అది తారుమారైనట్లు మీరు భావించినా పరవాలేదు గ్రంథనామాన్ని వీడి గ్రంథవిషయాన్ని చూడండి "మూవ్ పేడ అనే పేరులో చక్కదనమేముంది? తినిచూస్తే ఉన్నదంతా కమ్మదనమే

పవిత్ర పండరీపురంలో వెలసియున్న పాండురంగని అవతార వైభవమునుగూర్చి అనేక విధాలుగా చెబుతుంటారు భగవానుడు అక్కడ అవతరించిన విధానాన్నిగూర్చి అనేక అభిప్రాయాలున్నప్పటికి అక్కడ వెలసియున్న స్వామి దివ్యమంగళ విగ్రహము స్వయంభువేగాని శిల్పి తీర్చిదిద్దినది కాదను విషయంలో అందరూ ఏకీభవిస్తున్నారు

శ్రీకృష్ణపరమాత్మ రుక్మిణీదేవిని పరిణయమాడిన తరువాత ఒక సంఘటనయే పాండురంగని అవతారము ఆవిర్భవించుటకు కారణమని కొందరి అభిప్రాయము ఒక పున్నమినాటి రాత్రి శ్రీకృష్ణదేవుడు రుక్మిణీ దేవిని వదలి బృందావనమరుదెంచి అచ్చట గోపభామలతో రాసక్రీడ జరుపుచుండగా భర్త వియోగమును భరించలేని రుక్మిణీదేవి స్వామి నన్వే షిస్తూ బృందావనమురాగా అచ్చట గోపికలతోగూడి రాసక్రీడ జరుపు కృష్ణభగవానుని చూచి కినుక వహించి, వైరాగ్యముతో దిండీరవనమున

కేగి కఠోరతపస్సు ప్రారంభించగా శ్రీకృష్ణపరమాత్మ రుక్మిణీదేవి నన్వేషిస్తూ దిండీరవనమునకేగి ఎంతపిలిచినను రుక్మిణీదేవి మారుపలుకక పోయేసరికి విసుగు చెందినవాడై తన రెండుచేతులను నడుముపై నుంచుకొని కటిహస్తుడై కలియుగ మానవుల నుద్ధరించవలెననెడి కరుణాపూరిత దివ్యసంకల్పమును మనస్సునందిడుకొని చంద్రభాగా భీమానదులు కలియు ఆ పవిత్ర తీరములో శిలారూపమున నిలిచిపోయారు ఆనాటినుండి నేటివరకు ఎందరో భక్తులను తరింపచేసారు తరింప చేస్తున్నారు లోహదండపురములో జరిగిన మరొక చరిత్రయే పాండురంగ భగవానుని ఆవిర్భావమునకు కారణమని మరికొందరు అభిప్రాయ పడుచున్నారు లోహదండపురములో పరమ భక్తులైన బ్రాహ్మణ దంపతులకు పుండలీకుడనే పుత్రుడుండేవాడు అతడు యవ్వన చాంచల్యముతో అనేక దురలవాట్లకు అలవాలమై తల్లిదండ్రులను కష్టపెట్టెడివాడు యుక్తవయస్సు వచ్చిన పుండలీకునికి ఒక సుగుణాల రాశినిచూసి తల్లిదండ్రులు వివాహము చేశారు భార్యామోహంలో పుండలీకుని కనులకు పొరలు క్రమ్మినవి పూజనీయులైన తల్లిదండ్రులను తిరస్కరించి ప్రవర్తించేవాడు ఒకనాడు పుండలీకుడు భార్యాసమేతుడై పుణ్యక్షేత్రమైన కాశీనగరమును దర్శించుటకు బయలుదేరాడు మార్గమధ్యంలో కుక్కుట మహాముని ఆశ్రమం చేరాడు. అక్కడ ముగ్గురు స్త్రీలు ఆయాశ్రమ ప్రదేశమును శుభ్రము చేయుచుండుట చూసి మీరెవర ని పుండలీకుడు ప్రశ్నించాడు

నాయనా! మేము గంగా యమునా సరస్వతులము పవిత్రమైన మాలో దుర్మార్గులంతా స్నానమాచరించుట వలన వారి పాపములు మాకు సంక్రమించుచున్నవి పాపపరిహారార్థము మేమునిత్యము ఈ మహాత్ముని ఆశ్రమమును శుభ్రపరచి పాపవిముక్తులమగుచున్నారము" యనితెలిపారు

పవిత్ర నదీమతల్లులలోని పాపములను ప్రక్షాళనంచేసి పవిత్రతనుకల్గించు శక్తి ఈ కుక్కుట మహామునికి ఎలా సంప్రాప్తమైనదో తెలుసుకొనవలయునని భావించి పుండలీకుడు సతీసమేతుడై ఆశ్రమములో ప్రవేశించాడు అక్కట పరమ భాగవతుడైన కుక్కుటమహాముని తన తల్లిదండ్రులకు పాదసేవచేస్తూ కనిపించారు పుండలీకుడు మహర్షిని సమీపించి "మహాత్మా! యమున సరస్వతి భాగీరథులు నీ ఆశ్రమ ప్రాంగణములో

పాపవినాశనమును కాంక్షిస్తూ సేవచేయుచున్నారు పవిత్ర నదీమ తల్లుల పాపములను ప్రక్షాళనముచేయు శక్తి తమకు ఏ సాధన నాచరించుటవలన కలిగినదో దయచేసి తెలియచేయండి అని ప్రార్ధించాడు కుక్కుట మహా ముని మందహాసవదనుడై నాయనా! నాకు ఏ సాధనలు తెలియదు మాతాపిత పాదసేవయే మహేశ్వరుని సేవగా భావించి ఆచరించుచున్నాను మాతృదేవోభవ పితృదేవోభవ అనునదియే వేదము తెలిపిన ప్రథమ సాధన నాకు ఆ సాధనయందే మనస్సు నిలిచింది బుద్ధి ప్రశాంతతను పొందింది అని తెలియజేశాడు పుండలీకుని మనస్సు నావరించిన మాయ పటాపంచలైంది తాను తల్లిదండ్రులకు చేసిన అపరాధమునకు పశ్చాత్తాప పడ్డాడు కుక్కుటమహాముని పాదాలపైబడి క్షమాభిక్ష కోరాడు మహర్షి పుండలీక దంపతుల్ని ఆశీర్వదించారు వెంటనే పుండరీకుడు లోహదండ పురముచేరి తన తప్పిదమును మన్నించమని తనతల్లిదండ్రులనుకన్నీళ్ళతో ప్రార్ధించాడు కుమారునిలో కలిగిన పరివర్తనకు తల్లిదండ్రు లచ్చెరువంది అతనిని ఆశీర్వదించారు

పుండలీకుడు చంద్రభాగా నదీతీరంలో ఒక ఆశ్రమాన్ని ఏర్పాటుచేసి తల్లి దండ్రులను ఆ యాశ్రమములో నుంచి వారికి నిత్యము సేవచేయుచు తన జన్మను చరితార్ధం చేసుకొన ప్రారంభించాడు మాతాపిత పాదసేవతో పుండలీకుని అంతఃకరణ శుద్ధిపొందింది అంతర్యంలో ప్రశాంతత నిండు కొన్నది రాగద్వేషాలు తటస్థమయ్యాయి అహంకారం అడుగంటి పోయింది అజ్ఞానం పటాపంచలయింది ఆత్మానుభూతి హృదయ కవా టాన్ని తెరవడానికి సిద్ధంగా వుంది

ఒకనాడు పుండలీకుడు తల్లిదండ్రులకు పాదసేవ చేయుచుండగా వాసు దేవుడు ఆశ్రమ గుమ్మంవద్ద నిలబడి "పుండలీకా ఇలాచూడు నేను జగన్నాధుడను నీ భక్తికి మెచ్చి నిన్ను కరుణించుటకు ఏతెంచితిని" అని తెలియజేయగా పుండలీకుడు స్వామీ! శతకోటి ప్రణామములు శతకోటి జన్మల పుణ్యఫలముంటేగాని నీ దర్శన భాగ్యము కలుగదని శాస్త్రవచనము మహానుభావా! ఈనాటి నా అదృష్టానికి కారణము నేనుచేసిన సాధనకాదు నీకు నాయందున్న కరుణే నాకీ భాగ్యమును ప్రసాదించినది నా జన్మ చరితార్థమైనది కానీ భగవాన్! నీవు నన్ను క్షమించాలి నీ ఆదేశాను

సారము నేను ఇప్పుడు నీ వద్దకు వచ్చుటకు సుముఖంగాలేను నా తల్లి దండ్రులకు సేవచేయుచున్న నేను మధ్యలో వారి సేవను ఆపిరాలేను వారి పాదసేవ పూర్తి అయిన పిదప వచ్చెదను అంతవరకు ఈ ఇటుకరాయి పై నిలబడియుండుము అని చెబుతాడు

పుండలీకుని మాతాపితసేవా పరాయణత్వమునకు వాసుదేవుడు సంతసించి ఆ ఇటుకపై నిలుచుకొని కటిహస్తుడై భక్తజన సంరక్షణార్థం విగ్రహ ముగా అవతరించాడు పుండలీకుని అనుగ్రహించి తనలో ఐక్యం చేసు కున్నాడు

పాండురంగ నామమునకు అనేక అర్థములున్నవి విష్ణు వనెడి సంస్కృత పదమును మరాఠీ కన్నడ భాషలలో విఠూ యని పిలుస్తారు విఠూ యనగా విష్ణువని భావము

సంస్కృతములో పాండు అనగా తెలుపు రంగ అనగా రంగు లేక వర్ణము పాండురంగ అనగా తెల్లని వర్ణకాంతి గలవాడని అర్థము తెలుపు సత్త్వగుణ ప్రధానమైన సమత్వమునకు చిహ్నము కనుక తెలుపు అనంత చైతన్యమునకు ప్రతీక

"విఠల" యనెడి మూడక్షరములు త్రిమూర్త్యాత్మక స్వరూపమని కొందరి అభిప్రాయము వి యనగా విధాతయగుబ్రహ్మ ఠ యనగా లయ కారకుడగు నీలకంఠుడు ల యనగా స్థితికారకుడైన లక్ష్మీపతి కనుక విఠలనామము బ్రహ్మ-విష్ణు-మహేశ్వరుల ఐక్యప్రతీక యని భావము విఠలనాథుని ఆవిర్భావమునకు పూర్వముకూడా పాండురంగ క్షేత్రము ఉండె డిది అచ్చట ఒక శివాలయము ఉండెడిది శివుడు శ్వేతవర్ణము గనుక ఆ క్షేత్రమునకు పాండురంగ క్షేత్రమని పేరువచ్చి యుండవచ్చును విఠల నాథుడు అవతరించిన పిమ్మట పాండురంగవిఠల నామము ప్రశస్తమైనది పాండురంగవిఠలయనగాశివక్షేత్రములో ఆవిర్భవించిన విఠలయని భావము మరాఠీ భాషలో "విట్" అనగా ఇటుక "ఠల్" అనగా నిలబడుట విఠల్ యనగా ఇటుకపై నిలబడినవాడని భావము

కలియుగదైవంలా ప్రత్యక్షమై ఎందరో భక్తులను తరింపచేసిన శ్రీ పాండు రంగని దివ్యకళామయమై భవమును ఈ గ్రంథమునందు పామాన్యుల కందు

బాహ్యమైన భాషలో వ్రాయడము జరిగినది ఈ గ్రంథములో పాండురంగని చరణ సేవకులైన మరాఠీ భక్తుల చరిత్రలు అధిక సంఖ్యలో యున్నను ఇతర రాష్ట్రాలలోని భక్తుల చరిత్రలనుకూడా ఇందు చేర్చడము జరిగింది ఈ గ్రంథమును నేను రచించడానికి కారణం లేకపోలేదు సంపూర్ణంగా ఒక దశాబ్దము ఆధ్యాత్మిక సేవలో గడిపిన తరువాత ఈ గ్రంథము యొక్క అవశ్యకత ఎంతైనావుంది నాకు స్ఫురించింది గత పది సంవత్సరాలుగా గీతాయజ్ఞాలు నిర్వహిస్తూ ఆధ్యాత్మికోపన్యాసములిస్తూ వివిధ ప్రదేశములు పర్యటించి విభిన్న మనస్తత్వాలను ఆకళింపు చేసుకొన్న తరువాత ఈ గ్రంథాన్ని రచించాలని ఆతురత ఏర్పడినది

ఆధ్యాత్మిక మార్గములో ప్రయాణము ఎంత సులభమో అంత కష్టము కూడా భగవంతుని చేరేందుకు అనేక మార్గాలు మార్గము ఎప్పుడూ మార్గమేగాని గమ్యముకాదు కాబోదు మార్గము ననుసరించి గమ్యాన్ని చేరవచ్చు గమ్యాన్ని చేర్చగలిగే మార్గము ఏదయినా శ్రేష్ఠతమమే ఒక్కొక్కరి మనోవికాసాన్ననుసరించి ఒక్కొక్క మార్గము సరిపోతుంది అన్ని మార్గాలు ఒక గమ్యమువైపు ప్రయాణము సాగించునపుడు మార్గాలమధ్య భేదమును చూడనవసరములేదు భక్తికన్నా జ్ఞానం గొప్పదని కొందరి అభిప్రాయము జ్ఞానంకన్నా భక్తి విశిష్టమైనదని మరికొందరి అభిభాషణము కర్మయే ముక్తికి సోపానమని ఇంక కొందరి అంగీకారము అవిద్యాజనితమైన కర్మ జ్ఞానమునెలా ప్రసాదిస్తుందని పూర్వపక్షముచేయు వాదము కలియుగ మహిమ! ఆచరించేవానికి ఇవన్నీ ఆలోచించే అవకాశమే ఉండదు ఆచరణరహితుడైనవానికి మిగిలేవి ఆలోచనలే ఈ అర్థరహిత ఆలోచనలను నెమరువేసుకొంటూ తాను ఆందోళనకు గురియై ఇతరులను ఆవేదనకు ఆహుతి చేస్తాడు

భక్తిలేని జ్ఞానము అహంకారానికి కూతురు జ్ఞానములేని భక్తి మూర్ఖత్వానికి కోడలు భక్తి జ్ఞానమనునవి రెండు చక్రాలై కర్మయనెడి కాడి మనోబుద్ధులనే ఎద్దులద్వారా జీవితమనే బండిని లాగితే ఆ బండి తప్పక మోక్షధామం చేరుతుంది

నా స్వల్ప విజ్ఞానముతో గత పది సంవత్సరాలుగ ఆధ్యాత్మిక మార్గంలో సేవచేస్తూ ఆ మార్గంలో పయనించే వ్యక్తులను చూస్తూనేయున్నాను మన జీవితంలో ఆచరించే నిత్యకృత్యాలలో ఒకటిగ వేదాంతము మిగులుతున్నదే గాని అంతకుమించి దాని ప్రాశస్త్యము గుర్తించబడటము లేదు విశ్రాంతి సమయాలలో చరించుకొనే కాలక్షేప విషయంగా కొందరు గ్రహిస్తే తమకేదో తెలుసునన్న అహంకారాన్ని పదుగురిముందు బహిరంగపరచాలనే ఉద్దేశ్యముతో కొందరు చర్చిస్తే సమాజంలో తమ పలుకుబడిని ఇనుమడింపజేయడానికి వేదాంతము ఒక పనిముట్టుగా మరికొందరు భావిస్తే ఇలా ఎక్కువశాతము అజ్ఞాన పరిధులను కౌగిలించుకొనే వారి సంఖ్య నానాటికి పెచ్చు పెరుగు తున్నట్లు నాకు గోచరించింది అంతేకాదు ఏవో వచ్చీరాని మాటలు నాలుగు నేర్చుకొని వేదికలెక్కి భక్తి ఒక మానసిక బలహీనతయని పారవశ్య మొక ఉన్మాదస్థితియని తాము జ్ఞానముతో నిండినట్లు పండినట్లు ఊకదంపుడు ఉపన్యాసాలిచ్చే దౌర్భాగ్య శిఖామణులు కూడా ఈ కాలంలోనే నిండుగా కనుపిస్తున్నారు

మీరు నన్ను క్షమించాలి ఎక్కువ సంఖ్య ఎలా ప్రవర్తిస్తున్నారో తెలియజేశానేగాని అంతమాత్రాన బుధజనులు లేరనికాదు నిత్యానుష్ఠాన పరులు నిష్కల్మషచిత్తులైన భక్తుల మనుగడే భరతమాతకు ఆధారము దినదినానికి కలతచెందుతున్న సమాజంలో భక్తులు మాత్రము ఎంతకాలము తమభక్తిని కోల్పోకుండా ఉంచుకోగలరు? అది సంస్కారానికివదలి పెట్టాల్సిన విషయమైంది మరి ఊపరిస్థితి ఎలామారాలి? అసలీవిధంగా సంస్కృతి ఎందుకు తయారవుతున్నది? దీనికి కారణమేమిటి? ఇలా ఆలోచించినపుడు అహంకారమే సకల అనర్థములకు కారణమని తెలిసింది ఆధ్యాత్మిక మార్గంలో చరించే జీవికి అహంకార మెలా ఉదయిస్తుంది? హృదయంలో భక్తి సన్నగిల్లడంచేత మానవ హృదయాలలో భక్తి నిండినచో ఈ అస్తవ్యస్త ధోరణులు సమసిపోగవని అనుష్ఠానపూర్వక వేదాంతము హైందవ సమాజంలో వెల్లివిరియగలదని భావించాను అంతే నేను నిర్వహించే గీతా యజ్ఞాలతో సందర్భానుసారంగా భక్తుల జీవితగాథలలోని ఒక ముఖ్య ఘట్టాన్ని వివరింపడానికి ప్రారంభించాను ఇలా కొంతసే నిముషాలు నడిచే ఉపన్యాసంలో ఒక పది నిమిషాలు భక్తుల చరిత్రలను వివరించడానికి

వినియోగించేవాణ్ణి పరమభక్తుల జీవితగాధలను వివరిస్తుంటే శ్రోతలు తన్మయత్వముతో శ్రవణం చేసేవారు నేత్రాలవెంట బాష్పధారలు కూడా కనుపించేవి ఆహా! ప్రాపంచిక వస్తు ప్రపంచమును చింతిస్తూ ఏడ్చేవారే కాని భగవానుని కొరకు కన్నీటిబొట్లురాల్చే హృదయాలెంత పవిత్రమైనవి! తాళంచెవి ఎక్కడుందో తెలియంది హృదయ కవాటమును తెరచుటకు భక్తియే సాధనమని బోధపడింది సుశ్రావ్యంగా కీర్తనలు అభంగాలు అష్టపదులు మధ్యలో గానంచేస్తూ భక్తుల దివ్యచరిత్రలను ప్రవచిస్తుంటే వింటున్న శ్రోతలు చెబుతున్న నేను కలసి ఊహించని ఏవో లోకాలకు ప్రయాణం చేసివచ్చేవాళ్ళం ఇలా కొంతకాలము జరిగిన పిమ్మట భక్తిలోని మాధుర్యం అర్థమయిందేమో అనేకమంది పూర్వపు వాసనలు వదలిపెట్టి ఆచరణ యోగ్యమైన వేదాంతాన్ని అనుష్ఠించుటకు ప్రారంభించారు

గీతాయజ్ఞములకు హాజరయ్యే బుధజనులలో అనేకులు భక్తుల చరిత్రలను అందరికి అందుబాటుగనుండు భాషలో రచించమని నన్ను బలవంతపెట్టసాగారు ఇలా జరుగుతుండగా ఒకనాడు ఉన్నపళంగా బయలుదేరి భ్రమరాంబా సమేత శ్రీ మల్లికార్జునస్వామి దర్శనానికి శ్రీశైలము వెళ్ళాము స్వామిని సేవించిన తరువాత గర్భాలయ ప్రాంగణములో ఆసీనుడనై ధ్యానము చేయుచుండగా ఈ భక్తవిజయ గ్రంథమును రచించి ఆంధ్ర దేశములోని ఆస్తిక జనులకు సేవచేయవలెననెడి సంకల్ప ముదయించినది ఆ సంకల్పము మల్లికార్జునస్వామి ప్రసాదంగా భావించాను ఇందుకేనేమో ఉన్నపళంగా నన్ను ఇక్కడికి రప్పించుకున్నాడని రెండు కన్నీటిబొట్లు వదిలాను ఆ సమయంలోనే గ్రంథనామం చంద్రభాగా తరంగాలు అని పెడితే బాగుటుందని నా మనస్సుకు తట్టింది హే మల్లికార్జునా మహాదేవా నీ ఆలయ ప్రాంగణములో కదిలే ప్రతి సంకల్పము నీదేకాని నాదికాదంటూ గ్రంథ రచనకు ఉపక్రమించాను పూర్తిచేసాను ఇందులో పనినాది పనితనము పాండురంగనిది

నాకు తోచిన మాట చివరగా మీతో చెప్పి సెలవు తీసుకొంటాను భక్తచరితామృతపానమే భవరోగ నివారణకు దివ్యౌషధము

భక్తుల గాధలు భగవానుని విభూతులు అవి అమరజీవనానికి నాడులు మోక్షతీరమును జేర్చు ఓడలు

భక్తకథా శ్రవణమనునది పావన మంత్రజపముకన్న అధికము అది మనో మాలిన్యమును కడిగే సరస్సు తమస్సును దూరముచేయు తపస్సు భక్తులారా! భక్తుల చరిత్రలు సత్యగాధలు విశ్వాసముతో చదవండి విశ్వసించు వారిచే చదివించండి నమస్తే

ప్రణవ ప్రేమలతో
భగవత్సేవలో
భక్తజన పాదరేణువు
స్వామి సుందర చైతన్యానంద





# చంద్రభాగా తరంగాలు

## భక్త కబీర్‌దాస్

మొక్కకు పువ్వు ఎలాగో సమాజానికి మహాత్ములు అలాంటివారు

అన్యోన్యాశ్రయమే అందులో అగుపించే విశిష్టత మొక్క రాటు దేలియుంటుంది మోటుగా నిలబడియుంటుంది దానిలో సామరస్యం గోచరించదు సందేశం ప్రభవించదు చలికి చెదరిపోవడం ఎండకు తలవంచడం ప్రస్ఫుటంగా తెలుస్తుంది భూమినుండి ఆహారాన్ని నీటినుండి జీవనాన్ని ప్రకాశంనుండి ప్రగతినిపొంది స్వార్థంతో నడక సాగిస్తుంది

సంకుచితమైన మొక్కనుండి సందేశాత్మకమైన జీవనాన్ని కలిగి పువ్వు వికసిస్తుంది తాను మొక్కనుండే ఆవిర్భవించింది సుకుమారమై విలసిల్లే తనలో తనకు జన్మనిచ్చిన మొక్కలోని గరుకుతనంలేదు గట్టితనము లేదు పువ్వులో గోచరించే శోభంతయూ మొక్కనుండి గ్రహించినదే మొక్కలో అవ్యక్తమైయున్న చైతన్యాన్ని వెలికితీసి అందులోని సౌందర్యాన్ని పువ్వు తను పులుముకొని ప్రకాశిస్తుంది అలుముకొని ఆనందిస్తుంది

పువ్వు సున్నితము దాని సందేశము సువిశాలము వ్యసనము నుండి వ్యవస్థను వెలికితీయడమే తన జీవిత సందేశము జీవనపరిధిలో కనుపించే సాధారణ స్థితిగతుల నుండి అసాధారణ అమూల్య ఔన్నత్యాన్ని సాధించ డమే తన జీవన విధానము అపురూప సౌందర్యరాశియై చూసువారి నేత్రా లకు విందు చేస్తుంది అమోఘ పరిమళ భరితమై ఆఘ్రాణించు వ్యక్తుల హృదయాలకు నూతనోత్సాహాన్ని కలిగిస్తుంది జీవనకాలము అతి స్వల్ప మైననూ జీవించే మూడుఘడియలు ముచ్చటగా చక్కటి మూర్తిమత్వాన్ని ప్రదర్శించి తరించాలని సందేశాన్నందిస్తుంది విశిష్టతను ప్రకటించే సంద ర్భములో తన అందానికి ఆధారమైన ఆరాధ్య భగవానుని అనంత విశిష్టతను గుర్తుచేస్తుంది తను మృదువుగా ఉంటుంది తనలో మాధుర్య మకరంద మును కల్గియుంటుంది తనలోని మధురపదార్థాన్ని తాను ఆస్వాదించక తుమ్మెదలను ఆహ్వానిస్తుంది తీపితేనెను అందిస్తుంది తుమ్మెదలను తృప్తిపరచడములోనే తన తృప్తి నిండియున్నదని భావిస్తుంది

వ్యక్తి నివసించే మానవ సమాజముకూడా మొక్కవలె స్వార్థపూరిత మనుగడను సాగిస్తూయుంటుంది మంచికి దూరమైన సమాజము వంచనకు మారుపేరుగా నిలుస్తుంది క్షణిక భావోద్రేకాలకు నిలయమై ఉంటుంది ఆదాయానికి అర్రులుచాచివుంటుంది ఆక్రోశాన్ని ప్రదర్శిస్తూ ఉంటుంది క్రుళ్ళిన తన ఒడిలోకి మళ్ళిన మానవుని జీవనప్రగతిని చావుదెబ్బ కొడు తుంది నిత్యమూ ఆశయాలను వల్లిస్తూ ఆచరణలో నిర్జీవ ప్రతిమలా నిలబడిన ఈ సంఘమొక స్వార్థ పంకిలము

మొక్కనుండి పువ్వు వికసించినట్లు స్వార్థపూరిత మానవ సమా జమునుండి పుష్పసౌందర్యముతో మహాత్ములుదయిస్తారు వారు సంఘము నుండే ఉద్భవిస్తారు సంఘంకొట్టే ఉలిదెబ్బలకు ఓర్చుకొని తమ బ్రతుకు లను సజీవ శిల్పాలుగా తీర్చిదిద్దుకుంటారు సంఘజీవనములోని మంచిని గ్రహించి చెడును నిగ్రహించి ఆగ్రహావేశాలను అంతరింపచేసుకొని ఆదర్శపురుషులుగ అనుకరించదగిన దివ్యచైతన్య స్వరూపాలుగ రాణిస్తారు

అభిమాన అహంకారాలకు నిలయమైన మానవ జీవితాకాశంలో త్యాగ సేవానిరతిగల పవిత్ర జ్యోతులను వెలిగించి మహాత్ములు తాము తరిస్తారు తమదరిజేరిన సకలమానవాళిని తరింపజేస్తారు ఆధ్యాత్మిక జీవనకాంతులతో తాము మనుగడను సాగిస్తూ తమ ఆదర్శనీయ జీవితముద్వారా అనంత కృపానిధియైన భగవానుని ఉనికిని జ్ఞప్తికితెస్తారు సత్త్వగుణ ప్రధానులై ఉంటారు ప్రేమను పంచుతారు ప్రేమలో మునుగుతారు తమకంటూ ఏదీ మిగుల్చుకోరు ఇతరుల సుఖమే తమ సుఖముగా గ్రహిస్తారు ఇతరులు తరించుటయే తమ ప్రధాన కర్తవ్యముగా భావిస్తారు అట్టిమహాత్ములకోవకు చెందిన భక్తాగ్రగణ్యుడు సంత్‌కబీర్‌దాస్

క్షీరసాగరమున శేషతల్పముపై శయనించియున్న మహావిష్ణువు పవిత్ర పద సరోజములను లక్ష్మీదేవి ఒత్తుతూ స్వామి కలియుగ మహిమ చూశారా? భూలోకములో ఎప్పుడుజూచినను ధనవ్యామోహాతురైన నా భక్తులున్నారేగాని మోక్షాపేక్షగల మీ భక్తులు అసలు ఉన్నారా? అని నాకు సందేహముగా నున్నది అని నారాయణమూర్తితో అంటుంది

దేవీ! నీ మాటల్లో నిజమెంత వున్నదో అపద్ధముకూడా అలాగే వున్నది భూలోకంలో నా భక్తులు లేని కాలమంటూ లేదు ప్రపంచ మను గడకు భక్తులే ఆధారభూతులు కాకులు అన్నిచోట్ల కనుపిస్తాయి హంసలు అరుదుగా అగుపిస్తాయి నీ భక్తుడు అన్నిచోట్ల దర్శనీయం ప్రపంచ శాంతికి అనర్థదాయకం నా భక్తులు కొన్నిచోట్లనే లభ్యం విశ్వశాంతికి మంగళదాయకం అని మహావిష్ణువు చమత్కరిస్తూ లక్ష్మీదేవితో అంటారు

లక్ష్మీదేవి మనసు చివుక్కుమన్నది స్వామీ మీరు సత్యస్వరూపులైనను ఎందులకో ఈ విషయంలో మీ మాటను విశ్వసించలేక పోతున్నాను క్షమించండి మీరు చెప్పిన భక్తులుండడం దుర్లభమని అనుభవ రీత్యా నాకు తెలియుచున్నది అలాంటి భక్తులున్నట్లయితే దయచేసి వారెక్కడున్నారో తెలపండి పరమపవిత్రుడైన అట్టి భక్తుని చూడాలనివుంది అని లక్ష్మీదేవి ఉష్ణమూర్తితో చెబుతుంది

దేవీ కాశీక్షేత్రంలో రామానందస్వామి అను సాధువున్నాడు ఆతడు త్రికరణశుద్ధిగా నన్ను భక్తిచేసి తరించిన ముక్తపురుషుడు అని విష్ణుమూర్తి లక్ష్మీదేవికి తెలియచేస్తాడు

రామానందస్వామిని పరీక్ష చేయవలెనని విష్ణుపత్ని భావించింది వైకుంఠాన్నివీడి కాశీకి కదలివచ్చింది నిత్యమూ రామానందస్వామి స్నానానికి గంగానది కరుదెంమట చూసింది ఒకనాడు రామానందస్వామి వచ్చే సమయానికి తన మాయాప్రభావముతో చక్కటి గులాబీతోటను అందమైన పుష్పపంక్తితో సృష్టించింది రామానందస్వామి యధావిధిగా స్నానమాచరించి ఆలయమునకు వెడుతూ మధ్య నగుపించే గులాబితోటను చూశారు దగ్గరకెళ్ళి ఒక పుష్పాన్ని కోసి చేతపట్టుకొన్నారు ఇంతలో లక్ష్మీదేవి మారువేషములో ప్రత్యక్షమై ఈ గులాబీతోట నాది నీవు అనుమతి లేకుండా పుష్పాన్ని అపహరించావు" అన్నది

"తల్లీ! క్షమించు అందమైన పూలు కనుపించగానే భగవనుని చరణ కమలములచెంత ఉంచాలనిపించింది కోసాను అంతేగాని నేను దొంగను కాను " అంటూ ఆ పుష్పాన్ని అక్కడవదలి రామానందస్వామి వెళ్ళిపోయారు.

లక్ష్మీదేవి ఆ పుష్పాన్ని చేతపట్టుకొని వైకుంఠం చేరింది విష్ణుమూర్తిని సమీపించి చూశారా! మీరు చెప్పిన రామానందుడు భక్తుడు కాదు ఆతడు దొంగ ఈ పువ్వే అతని చోరత్వానికి నిదర్శనము " అన్నది లక్ష్మీదేవి దేవీ! చాలా పొరపాటు పడ్డావు ఈ పువ్వు అతని చోరత్వానికి నిదర్శనముకాదు అతని అపారభక్తికి తార్కాణము చూశావా! అతను నా విగ్రహంముందు ఈ పుష్పాన్నుంచాలని భావించాడు అతని భక్తి విశేషము చేత నీవే స్వయంగా ఆ పుష్పాన్ని తెచ్చి నాకు సమర్పించావు " అని మందహాసం చేశారు ఆదిదేవులు

లక్ష్మీదేవి చిన్నబోయి తలవంచుకుంది స్వామి మృదువచనములతో "దేవీ! మంచి చెడులనేవి మనోస్థాయిలో జరుగుతాయి రామా

జరిగిననూ అది భగవానుని కృపగా పరిగణిస్తారు కోపాలు ప్రకటించరు లోపాలకు పోటివ్వరు ఇతరుల తప్పులను క్షమించగలరు తమలో తప్పు కనబడితే ఎన్నడు కోరు ఎంతటి భయంకర ప్రాయశ్చిత్తము ననుభవింపుట కైనా వెనుకాడరు అట్టి పరమ భక్తుల దర్శనము పావనము వారి కథా శ్రవణము పవిత్రము

షోలాపూర్ జిల్లాలో బర్సీ అనెడి గ్రామముకలదు. ఆ గ్రామములో జోగా అనెడి భక్తుడుండేవాడు చిన్ననాటినుండియు జోగాలో భగవత్సం దర్శనాభిలాష మెండుగా యుండెడిది భగవానుని దివ్యనామం చెవిని పడ గానే నిశ్చేష్టుడై నిలబడిపోయేవాడు బాల్య క్రీడలయందు ఆసక్తి చూపక తోటి బాలురను ఒకచోటచేర్చి తాను నామజపంచేస్తూ వా చేత చేయించెడి వాడు భక్తులెవరైనా ఆ గ్రామమునకు రాగానే పరుగెత్తుకుంటూ వెళ్ళి వారి పాదాలపైబడి ప్రణమిల్లేవాడు మహాత్ముల దర్శనానికై చంద్రుని కొరకు తపించే చకోరంలా నిరీక్షించేవాడు భగవద్గుణ శ్రవణకీర్తనాదులు జరుగుచోట కూర్చుండి ప్రశాంతచిత్తముతో ఆలకించెడివాడు

జోగా పెరిగి పెద్దవాడగుచున్నాడు తన వయస్సుతోపాటు తన హృదయమునందలి భక్తి కూడా దినదినప్రవర్ధమాన మవుతున్నది సదా భగవంతుని స్మరణతప్ప మరియొకటి తెలియదు హృదయం భక్తితో నిండియుండ నేత్రాలు కన్నీటితో నిండియుండేవి భగవంతుని దివ్య సందర్శనానికి మనసు అహోరాత్రులు విలపించేది భగవాన్! ఈ ఆవే దనను నేను అనుభవించలేను ఈ విరహాన్ని నేను భరించలేను నీభక్తిలో నేను పిచ్చివాణ్ణయ్యాను ఏడ్చిఏడ్చి కన్నీరంతా నీకొరకు ఖర్చుచేశాను అయినా నీకు నామీద దయ కలుగలేదు తెలిసింది ప్రభూ లోపమంతా నాలోనేవుంది కానుక విత్తనమునాటి కల్పవృక్షము రావాలంటే వస్తుందా? గతంలో ఏపుణ్యకార్యమూ ఆచరించక ఈజన్మలో నీ దర్శనభాగ్యము లభించలేదని దుఃఖిస్తేమాత్రం ఏంలాభం" అని పసిబిడ్డలా విలపించేవాడు

జోగా శూద్ర కులజుడు వంశపారంపర్యమున సంక్రమించిన కుల వృత్తినాశ్రయించి తైలవర్తకుడుగా జీవించేవాడు బ్రహ్మముహూర్తమున

నిద్రలేచేవాడు స్నానానంతరము దేవాలయానికి వెళ్ళేతీరు ఆశ్చర్యంగా ఉంటుంది నదిలో స్నానమాచరించి అక్కడనుండి ఆలయానికి నడక సాగించేవాడు భగవద్గీతలోని ఒక శ్లోకం చెబుతూ శ్లోకం పూర్తికాగానే నేలపైబడి సాష్టాంగ నమస్కారము చేసేవాడు ఈ విధముగా భగవద్గీత లోని ఏడువందల శ్లోకాలు పూర్తిచేసి ఏడువందల సాష్టాంగ నమస్కార ములు చేసి ఆలయములో ప్రవేశించేవాడు ఆహా! ఎంతటి కఠోర సాధన ఎంతటి నిరహంకారత నిత్యము ఇలా క్రమం తప్పకుండా ఆచరిస్తూ తృప్తి చెందేవాడు

జోగా ఒకనాడు ఆలయంలో ప్రవేశించాడు ఆనాడు కృష్ణాష్టమి పర్వదినము పాండురంగ భగవానుని ఎదుట కన్నీళ్ళతో నిలబడ్డాడు తన విరహతాపం తీవ్రస్థాయికి చేరింది శరీరం కంపిస్తున్నది పెదవులు వణు కుతున్నాయి స్వామికి నమస్కరిస్తూ హే భగవాన్! పాండురంగా కరుణాపారీణా భక్తవత్సలా! ఈ ఎడబాటును నేనిక సహించలేను నా హృదయం విడుదలను కాంక్షిస్తున్నది నేను ప్రపంచపంజరములో బంధీనై ఉన్నాను నాకు విముక్తిని ప్రసాదించవా ప్రభూ! ప్రాపంచిక భోగ భాగ్య లన్నీ నా దృష్టిలో గడ్డిపోచల్లా కనపడుతున్నాయి క్షణికమైన విషయ సుఖాలు నాగసర్పమువలె గోచరింపుచున్నవి పంచదార నీటిలో కలియు లాగున నా వ్యక్తిత్వాన్ని నీలో లయింపచేసి తృప్తిచెందాలని హృదయం ఆరాటపడుతున్నది

భగవాన్! ప్రపంచములో నేనొక్కడినే దుఃఖితుడనని ఇంతవరకు భావించాను విచారణ సలిపినకొలది ప్రపంచమే దుఃఖస్వరూపమని తెలింది తెలిన సత్యం హృదయాన్ని గాయపరచి మరీ వెళ్ళింది వైద్యులు మాన్ప లేని వ్రణము హృదయంలో తయారైంది "హే పుండరీకవరదా నీ ప్రేమ రసాన్ని పూసి నా గాయాన్ని మాన్పవా ప్రభూ!" అంటూ విలపించసాగాడు జోగా.

జోగా హృదయావేదన భగవానుని కదిలించింది ప్రేమవీక్షణాలను జోగాపై ప్రసరింపచేశాడు పాండురంగడు కృష్ణాష్టమి పర్వదినాన జోగా

హృదయంతో శ్రీకృష్ణ జననం జరిగింది శరీరం పులకించి పోయింది హృదయం ద్రవించింది కన్నీరు ప్రవాహంలా కారుతున్నాయి ఏదో అని ర్వచనీయ ప్రశాంతత అంతఃకరణ నావహించింది కృతజ్ఞతతో మనసు మెత్తబడిపోయింది స్వామి ఎదుట చేతుల జోడించి నమస్కరిస్తూ నిల బడ్డాడు జోగా

దయాస్వరూపుడైన పాండురంగడు దర్శనమిచ్చాడు దేదీప్యమా నంగా వెలిగిపోతున్న పాండురంగని దివ్యదర్శనంతో జోగా పులకాంకితు డయ్యాడు జోగా ఈనాటితో నీ కష్టాలు తొలగిపోయాయి నీలో నిశ్చల భక్తి ఏర్పడింది నీ జీవనరథాన్ని నడిపే చోదకుడు ఈనాడు నీ దగ్గరకు వస్తున్నాడు అతని దర్శనంతో నీ సాధన మలుపు తిరుగుతుంది నీవు ధన్యాత్ముడవు అని పలికి పాండురంగడు అదృశ్యమయ్యాడు

పూర్ణ చంద్రుని దర్శనంతో సాగరతరంగములు ఉరకలు వేయునట్లు పాండురంగభగవానుని పూర్ణ చంద్రవదనాన్ని వీక్షించగానే జోగా హృదయ సాగరమునందలి ప్రేమతరంగములు ఉవ్వెత్తునలేచి నాట్యము చేయసాగి నవి అధికోత్సాహముతో అనిర్వచనీయ ప్రేమోన్మాదంతో పాండురంగని దివ్యనామాన్ని శ్రావ్యంగా గానంచేస్తూ గానానికి అనుగుణంగా నృత్యభంగి మలను అభినయిస్తూ గృహోన్ముఖుడయ్యాడు జోగా

ఉత్తరదేశమునుండి ఒక యతివరేణ్యుడు బర్షీ గ్రామానికి వచ్చినట్లు జోగాకు తెలిసింది జోగా సంతోషానికి అవధులులేవు పాండురంగడు తెలియచేసిన తనజీవన రథచోదకుడు ఈ మహాత్ముడేనేమో తనను తరింపచేయుటకు ఏతెంచిన పుణ్యపురుషుడు సద్గురోత్తముడు ఇతడేనేమో జోగా మనసు పరవశన్ని త్రొక్కుతున్నది ఆ మహాత్ముని దర్శనానికి హృదయం ఆరాటపడుతున్నది ఇక విలువ వశక్తుడై అక్కడ నుండి బయలుదేరాడు జోగా

ఆలయములోనున్న ఆ మహాత్ముని దర్శించదానికి బర్షీ గ్రామ ప్రజలంతా వెడుతున్నారు జోగా వారిని వెంబడించాడు స్వామి బసచేసి

యున్న పాండురంగస్వామి దేవాలయంవద్దకు వచ్చారు ప్రసన్న వదనంతో ఆసీనులైయున్న స్వామిని దర్శించారు అతడే పరమానందస్వామి ఉత్తర దేశ ఆశ్రమవాసి దక్షిణదేశ యాత్రకై బయలుదేరి మధ్యలో బర్శీ నగరానికి వచ్చారు ఆ మహాత్ముని దర్శనం జోగాలో అణిగియున్న వైరాగ్య జ్వాలను వెలికితీసింది పవిత్రాత్ములైన పరమానందస్వామిని చూస్తున్న కొలది జోగాలో వినూత్న పరిణామం కలుగుతున్నది జగత్తుపై విరక్తి జనిస్తున్నది జగదీశ్వరునిపై అనురక్తి ప్రబలుతున్నది

స్వామి ఇంతలో సత్సంగము ప్రారంభించారు భగవానుని దివ్య లీలలనుగూర్చి సుశ్రావ్యంగా గానం చేయసాగారు శ్రీకృష్ణుని కథా విభూతులను మనోహరంగా ప్రవచిస్తున్నారు కదంబవృక్షముక్రింద పద్మాసనస్థుడై మురళీగానంచేస్తూ భక్తులను సమ్మోహింపచేయుచున్న శ్రీకృష్ణదేవుని రసమయ స్వరూపమును పరమానందస్వామి వర్ణిస్తుంటే జోగా హృదయమే కదంబవృక్షముగామారి స్వామి మురళీనాదాన్ని శ్రవణంచేస్తూ పరవశిస్తున్న అనుభూతి జోగాకు కదిలింది

కంసచాణూరాదులను శ్రీకృష్ణుడు వధించే భయానక సంఘటనలను పరమానందస్వామి తెలియచేస్తుంటే తనలోని కామక్రోధాది కంసచాణూరాదులను జగన్నాథుడు నశింపచేసినట్లు జోగాకు భావస్ఫురణ జరిగింది

పాలు పెరుగు వెన్న అమ్మడానికి వచ్చిన గోపిక కృష్ణప్రేమ మాధుర్యాన్ని అంతర్యంలో అనుభవిస్తూ మైమరచి పాలు పెరుగు వెన్న అను నామములకు బదులుగా మాధవ దామోదర గోవింద అని పిలిచే దివ్యోన్మాదస్థితిని పరమానందుడు వివరిస్తుండగా ప్రేమోన్మాద భరితుడైన జోగా తన తైలవర్తకమును త్యజించి నారాయణ నామస్మరణతో భిక్ష మెత్తుకొని జీవించాలనే దృఢ నిశ్చయానికి వచ్చాడు.

సంత్ పురుషుల దర్శనభాగ్యమలాంటిది శ్రవణప్రభావమలాంటిది పరమానందుని దివ్యబోధ ప్రభావముతో జోగామహాశయుని జీవితం నూతన దృక్పథాన్ని అలవరచుకున్నది

సంకీర్తనా సత్సంగము పూర్తయింది దివ్యనామ సంకీర్తనతో సభ ముగిసింది అక్కడ గుమిగూడిన భక్తులందరు వరుసగావచ్చి పరమానంద స్వామి పవిత్ర పాదాలపై పడి తీర్థప్రసాదములు స్వీకరించి వెడుతున్నారు జోగా వెనుక నిలబడి ఈ దివ్యదృశ్యాన్ని కళ్ళారా గాంచుతున్నాడు భక్తులందరూ తీర్థప్రసాదములు స్వీకరించివెళ్ళారు చివరగా జోగా స్వామి పాదాలపై వాలాడు తన కన్నీటితో స్వామి పాదాల నభిషేకించాడు దుఃఖము కట్టలు త్రెంచుకొని ప్రవహించుచుండ కదల నశక్తుడై స్తంభించి పోయాడు

జోగా భక్తిపారవశ్యాన్ని పరమానందుడు గ్రహించాడు జోగాను మెల్లగా పట్టిలేపాడు తన అమృత దృక్కును జోగా నయనాలలో ప్రసరింపచేసి చల్లగా చూశాడు "నాయనా! జోగా! ఎందుకీ విషాదం? అని సూటిగా ప్రశ్నించారు పరమానందుడు

చేతులు జోడించి పరమానందస్వామికి నమస్కరిస్తూ గురుదేవా! నేను వేదాన్ని చదువలేదు వాదాన్ని నేర్వలేదు నామాన్నాశ్రయించాను నాదాన్నాలపించాను అంతకుమించి నాకు ఏ జ్ఞానములేదు మిమ్మల్ని సందర్శించగానే మీరే నా గురుదేవులని నా అంతరాత్మ ప్రబోధించింది నన్ను కరుణించి కాపాడండి ఉపదేశమిచ్చి ఉత్తీర్ణున్ని చేయండి అని భక్తితో తన మనోభీష్టాన్ని స్వామి ముందుంచాడు జోగా

పరమానందస్వామి దరహాసవదనుడై జోగా! నీవు పాండురంగని దయకు పాత్రుడవైన భాగవతోత్తముడవు నీవు ఈ జన్మలోనే తప్పక తరించగలవు సదా నామజపం కొనసాగించు సకల ప్రాణుల రూపములో ఉన్నది పాండురంగడేనని ఎరుకగలిగియుండు ఎవరినీ ద్వేషించక సర్వులను ప్రేమించడం అలవరచుకో భోగకాలగా గోచరించే ఈ ప్రపంచమొక రోగ నిలయమనే జ్ఞానం కలిగియుండు ఈ ప్రపంచములో ఏర్పడే వ్యామోహాలే మనలను మృత్యుముఖంలో పడద్రోసే యమపాశాలని గుర్తుంచుకో ప్రతి రోజాపుష్పము వెనుక ఒక ముల్లుంటుదని మరచిపోకు ముళ్ళను అంటకుండా పుష్పాన్ని పట్టుకోవడం నేర్చుకో అసత్యాన్ని విడచిపెట్టి

సత్యాన్ని ఆశ్రయించు నీకు అతిముఖ్యమయిన విషయమును చెప్పుతున్నాను జాగ్రత్తగావిను అధ్యాత్మిక సాధకుడు కాలకూట విషాన్నయినా లోపల ఉంచుకోవచ్చు కానీ అహంకారాన్ని మాత్రం లోపల చొరనీకుండా సదా ప్రయత్నిస్తూ ఉండాలి ఎవరి హృదయంలో అహంకార మమకారాదులు తిష్ఠవేసియుంటాయో వారిజన్మ వృధాయన్న సత్యాన్ని సదా మనసులో ఉంచు కొని జీవనయాత్రను సాగించుము అని ప్రబోధాత్మక సందేశాన్ని అందించాడు

జోగా మనసులో ఇంతవరకు చోటుచేసుకొనియున్నసంశయ పండు టాకులు పరమానందుని విజ్ఞాన ఝంఝామారుతమునకు ఎదురు నిలువలేక రాలిపోయినవి అనాటినుండి సదా నామస్మరణలో కాలం గడుపుతూ పర మానందుని అడుగుజాడలో పయనిస్తూ అహంకార మమకారాదులు లేక ప్రశాంత చిత్తముతో జోగా జీవిస్తుండెవాడు. అనాటినుండి జోగాను సద్గురు నామంతోకలిపి జోగా పరమానంద" అని పిలిచెడివారు

గురుదేవుని దివ్యప్రబోధము జోగా వీనులలో ప్రతిధ్వనిస్తూనే యున్నది వర్తకమువందు జోగాకు కుతూహలం నశించింది వర్తకాన్ని విసర్జించాడు అక్షయపాత్రను చేతపట్టుకొని నామస్మరణ చేసుకొంటూ ఊరిలో భిక్షాటనచేసి తన కుటుంబీకులను పోషిస్తూ నిర్వికార చిత్తముతో జీవించుచుండెను

ఒకనాటి రాత్రి కుండపోతగా వర్షము కురిసింది ఉదయము లేచు నరికి గ్రామమంతయు వర్షపునీటితో నిండి ఎటూచూసినను బురద ఏర్పడి నడుచుటకు వీలులేకుండెను జోగా తన దినచర్య ప్రకారం ఏడువందల శ్లోకములను ఉచ్చరిస్తూ ఏడువందల సాష్టాంగ నమస్కారములు చేయుచు దేవాలయమునకు వెళ్ళవలసియున్నది జోగా స్నానమాచరించి యధాప్రకా రం గీతాశ్లోకమును చదువుతూ శ్లోకానంతరము ఆ బురదనీటియందేపడి సాష్టాంగ నమస్కారముచేయుచు వెళ్ళుచుండెను ఈ దృశ్యమును ఒక వ్యాపారి చూశాడు ఆతనికి ఈ భక్తుని వింతప్రవర్తన ఆశ్చర్యాన్ని కలి గించింది బురదనీరనే భావనకూడాలేక నిరహంకారియై నిరాడంబరముగా

భగవంతునికి అడుగడుగునా సాష్టాంగ నమస్కారము చేయుచు నడుస్తున్న జోగా భక్తికి ఆ వ్యాపారస్తుని హృదయము కదిలిపోయింది వెంటనేవెళ్ళి ఒక నూతన పీతాంబరమును కొనితెచ్చాడు జోగాను సమీపించి నమస్కరించాడు పీతాంబరమును గ్రహించవలసిందని జోగాను ప్రార్థించాడు తనను ఆశీర్వదించవలసిందని ప్రార్థించాడు

జోగా ఆ వ్యాపారస్థునివైపు తదేకంగా దృష్టిసారించాడు నాకు పీతాంబరాలపై మోజులేదు నా మనస్సంతా విఠలుని పవిత్రనామమునందే లగ్నమై యుంటుంది భగవానుని నామస్మరణచేస్తూ భిక్షాటన చేసుకొని జీవించే నాలాంటివారికి ఈ పీతాంబరాల అవసరమేముంది? దయచేసి తీసుకొని వెళ్ళవలసిందని జోగా వ్యాపారస్తునికి తెలియచేస్తారు జోగా ఎంత వద్దని వారిస్తున్ననూ వినకుండా పీతాంబరమును జోగా హస్తముకో ఉంచి ఇదికూడా పాండురంగని సంకల్పమేనని భావించి మీరు ధరించండి మీరు కాదంటే నా మనస్సును గాయపరచినవారవుతారు అని పలికి వ్యాపారి వెళ్లాడు

మరునాడు ఉదయాన్నే యధాప్రకారం స్నానమాచరించి వ్యాపారస్థుడిచ్చిన నూతన పీతాంబరమును ధరించి దేవాలయానికి బయలుదేరుతాడు జోగా సాష్టాంగనమస్కారము చేయునపుడు పీతాంబరము మలినమవుతుందనే భావన కలుగుతుంది పీతాంబరమును నడుముకు బిగించి మట్టి కాకుండా వుండుటకు సాష్టాంగ నమస్కారమునకు బదులు మోకాళ్ళపై కూర్చుని నమస్కరిస్తూ కొంతదూరం ప్రయాణం చేస్తాడు అది చాలాకష్టతరంగా కనుపించింది సాష్టాంగనమస్కారము చేస్తే పీతాంబరము మట్టిపాలవుతుందని భయం ఆవరించింది ఇక చేయగలిగిందిలేక మిగతా సగ దూరము నిలబడే నమస్కరించుకొంటూ భగవద్దర్శనార్థం ఆలయానికి వెళ్ళాడు.

ఆలయంలో స్వామిని దర్శించాడు కీర్తన పాడాడు- కానీ స్వామి ముఖారవిందము చిన్నబోయింది మునుపటిలాగా దరహాసవదనంతో స్వామి దర్శనమీయలేదు జోగా మనసులో కలవరం ప్రారంభమైంది

కారణం అన్వేషించిడానికి బుద్ధి ప్రయత్నించింది స్వామి తనపై కినుక వహించుటకు కారణము నూహించుటకు ఎక్కువకాలం పట్టలేదు నిత్యమూ ఏడువందల సాష్టాంగ నమస్కారములుచేసి ఆలయమునకు ఆరుదెంచే జోగా ఈనాడు అలాచేయలేకపోవడానికి కారణమేమిటి? నూతన పీతాంబరమును ధరించుటయే వస్త్రముపైనున్న అభిమానమే సాధనను వక్రింపచేసింది ఇక దేహాభిమానమును జయించుటెట్లు? జోగా మనసులో సంకల్పాలు సుడులు తిరుగుతున్నాయి తనుచేసిన తప్పిదమేమిటో తెలిసివచ్చింది స్వయం ప్రాయశ్చిత్తమే దానికి తరుణోపాయమని గ్రహించాడు

ఒక రైతు రెండు ఎద్దులకు కాడినిగట్టి వాటిని నడిపించుకొంటూ పొలమునకు పోవుచుండెను అదిచూడగానే జోగా మనసులో మెరుపులా ఒక ఆలోచన తట్టింది రైతునుపిలిచి మిత్రమా! నావద్దనున్న ఈ ఖరీదైన నూతన పీతాంబరమును నీకు ఇచ్చెదను బదులుగా నీ కాడెద్దులను నాలుగుగంటలకాలము నాకు ఇవ్వవలసింద ని కోరగా రైతు అందులకు సమ్మతించి పీతాంబరమును తీసికొని కాడెద్దులను జోగాకు ఇస్తాడు జోగా ఒక్క త్రాడు తీసుకొని తనరెండుకాళ్ళకు కట్టుకుంటాడు ఆ త్రాటి మరియొక చివరను కాడికి కడుతాడు చేతిలో కర్రపట్టుకొని రెండుఎద్దులను తరుముతాడు ఆ రెండు ఎద్దులు దౌడుతీస్తాయి భయకంపితమైన ఆ వృషభములు ఆగకుండా వేగముగా జోగాను ఈడ్చుకుంటూ పరుగెత్తుతున్నాయి ముళ్ళలో పయనించాయి రాళ్ళలో పరుగెత్తాయి గుట్టలపై ప్రయాణము చేశాయి చేస్తున్నాయి జోగా శరీరమంతా పగిలిపోయింది రక్తము ధారాప్రవాహంగా స్రవిస్తున్నది చర్మమంతా ఊడిపోయింది మాంస కండరములు ముక్కలైపోయాయి శరీరమంతా అస్థిపంజరములా తయారయింది శరీరంనుండి ప్రాణం నిష్క్రమించడానికి సిద్ధమవుతున్నది కానీ జోగా ఏమాత్రం చలించకుండా పాండురంగ నామజపం చేస్తూనేయున్నాడు

జోగాను ఈ స్థితిలో చూడలేక దీనదయాళుడైన పాండురంగడు ప్రత్యక్షమయ్యాడు ఎద్దులను ఆపి త్రాడు విప్పాడు జోగాను త్రాటినుండి విడిపించాడు రక్తపుమడుగులో మాంసపుముద్దలా పడియున్న జోగాను

చూసి జోగా! ఎందుకింత అఘాయిత్యం చేసుకున్నావు నీవు నిరపరాధివి అన్యాయంగా నిన్ను నీవు బాధించుకున్నావు నా భక్తుడవైన నీకు నశింపు లేదు లే అంటూ ప్రేమతో జోగాను కౌగలించుకొంటాడు పాండురంగ భగవానుడు భగవానుని పవిత్ర స్పర్శతో జోగా శరీరం దివ్యదేహమైంది పాండురంగని కృపావాత్సల్యమునకు గగుర్పాటుచెంది పాండురంగదేవుని దివ్యపాదాలపై పడి తనువును మరిచాడు జోగా

జోగాను ఆశీర్వదించి పాండురంగడు అదృశ్యమయ్యాడు సదా విరల నామోచ్ఛారణతో తన బ్రతుకును ధన్యత చేసుకొన్నాడుజోగా ఆదర్శ మైన భక్తుడుగా దాససంప్రదాయంలో నిలిచి తన ఎనుబదవఏట వాసుదేవ చైతన్యములో ఐక్యమయ్యాడు

జోగా పరమానంద కీర్తనలు గానంచేస్తూవుండగా నామదేవుల వారి గురువూ ముక్తాబాయి శిష్యుడూ అయిన విశోబాఖేచర్ లేఖకుడుగా వుండి గ్రంథస్థం చేశారు జోగా పరమానంద వ్రాసిన భక్తిగేయాలలో ఒకదానిని శిక్కుమత ముఖ్యగ్రంథమైన గ్రంథసాహెబ్ లో కూడా చేర్చియున్నారు

జై జై పాండురంగహరి





# సంత్ జ్ఞాన దేవ్

మనుష్యులు ప్రవర్తనమబట్టి మూడు విధాలుగా తెలియబడుచున్నారు. 1) సత్కర్మానుష్టానపరులు. 2) దుష్కర్మానుష్టానపరులు. 3) మిశ్రమ కర్మానుష్టానపరులు.

సత్కర్మానుష్టానము చేయువారు సత్పురుషులు. వారి జీవితములో ఎన్ని అడ్డంకులు ఏర్పడినను, ఆటంకములు కలిగినను మంచిచేయుడం మానరు. శ్వాసయాడుము ఆగగానే మనిషి ఎలాతల్లడిల్లిపోతాడో తమనుండి మంచిజరుగనిచో మహాత్ములు అలా తల్లడిల్లిపోతారు.

దుష్కర్మానుష్టానపరులు దుర్జనులు. స్వార్థజీవనపునాదిపై అహంకారసౌధాన్ని నిర్మించువారు. మంచికి దూరులు. మాయాలోలురు మోహాన్నే కోరుతారు. మోసానికి మారుపేరు. ఇతరుల సుఖాన్ని చూసి సహించరు. తమ దుఃఖాన్ని ఇతరులపై రుద్దడానికి వెనుకాడరు. తేలులా కుట్టుతుంటారు. పాములా కరుస్తుంటారు. వారివి సర్పజన్మలు. వృశ్చిక బ్రతుకులు.

మిశ్రమ కర్మానుష్టానపరులు అయోమయ జీవులు. మనసుకు బానిసలు. కోరికలకు దాసులు. పరిస్థితులకు లొంగుతారు. పరిసరాలకు తలవంచు

తారు ఒక క్షణం మధుర పదార్ధములపై వ్రాలి మరొకక్షణం మలిన పదార్థ ములను భక్షించే ఈగలవంటివారు గాలి ఎటువీస్తే అటు ఎగిరిపోయే ప్రతి విస్తరి లాంటివారు

ఈ ప్రపంచములో పైన తెలిపిన మూడు తెగలవారు నివసిస్తుం టారు తమ నడకను సాగించడానికి ముగ్గురికీ ఈ ప్రపంచమే ఆధారము ప్రగతిని సాధించాలన్నా పతనాన్ని అనుభవించాలన్నా ఈ ప్రపంచములోనే జరగాలి

ఆలోచనలవలన కోరికలు కలుగుతాయి కోరికలవలన కర్మలు జరు గుతాయి కర్మలు ఆచరించడంవలన ఫలితాలు వస్తాయి ఫలితానుభవంలో వాసనలు తయారవుతాయి వాసనలే ప్రేరేపించి కర్మలను చేయిస్తుంటాయి కర్మలలో మార్పు జరగాలంటే వాసనలు మారాలి వాసనలు అవగాహనతో మారుతాయి

బుద్ధిలో అవగాహన జరగాలి సత్యవివేకం కలగాలి సత్యం అవగా హనతో దుష్కర్మలనుండి మిశ్రమకర్మలకు నడక సాగించవచ్చు సత్య దర్శనంతో మిశ్రమ కర్మలనుండి సత్కర్మలకు ప్రయాణం చేయవచ్చు సత్కర్మానుష్టానంలో సద్భావం మిగులుతుంది సద్భావంతో మెలిగేవారె సత్పురుషులు ధన్యజీవులు లోకాన్ని ఎరిగినవారు శోకాన్ని దాటినవారు అట్టి పవిత్రాత్ములకోవకుచెందిన అనుభవ వేదాంతప్రవక్త అమృతానుభవ గ్రంథకర్త జ్ఞానేశ్వరి భగవద్గీత వ్యాఖ్యాత సంత్ జ్ఞానేశ్వర మహారాజ్ వారినే జ్ఞానదేవులనికూడా అంటారు

గోదావరీతీరాన ఆప్‌గాంవ్" అను గ్రామములో గోవిందపంత్ నిరూబాయి అను పుణ్యదంపతులు జీవిస్తుండేవారు అనేక వ్రత ఫలితముగా వారికి ఒక కుమారుడు కలిగాడు అతనికి విఠల్‌పంత్ అని నామకరణ మొనరించారు విఠల్‌పంత్ చిన్నతనమునుండియు భగవద్భక్తి కలవాడు హరికథలు జరుగు ప్రదేశములకెళ్ళి హరినామ సంకీర్తన చేయుచుండెడి వాడు అతనికి యుక్తవయస్సు వచ్చింది తల్లిదండ్రులు వివాహ ప్రయ త్నం చేశారు విఠల్‌పంత్ మనసు భగవంతుని పావన చరణములందే

లగ్నమై యున్నందున అతనికి వివాహాది విషయములందు ఇచ్ఛలేకుండా పోయింది ప్రపంచముపైననే విరక్తిఏర్పడింది మనసులో తీవ్రమైన వైరాగ్య ముదయించిది తల్లిదండ్రుల అనుమతిబడసి తీర్థయాత్రలు చేయడానికి బయలుదేరాడు అనేక తీర్థక్షేత్రములను దర్శించి పూనా సమీపమునగల "ఆలంది" అను పుణ్యక్షేత్రమునకు వచ్చాడు అచ్చట సిద్ధేశ్వరాలయమున బసచేశాడు భగవద్దర్శనార్థం ఆలయమునకు వచ్చిన భక్తులలో సిద్ధోపంత్ అను గృహస్థ భక్తుడున్నాడు సిద్ధోపంత్ విరల్‌పంత్‌ను చూశాడు ఈ యువకుడు వైరాగ్యవంతుడైన వినయమూర్తిగా సిద్ధోపంత్‌కి గోచరించాడు సిద్ధోపంత్ విరల్‌పంత్‌ను సమీపించి వివరాలు ప్రశ్నించి తెలుసుకొన్నాడు విరల్‌పంత్ వైరాగ్యజీవనాన్నిగూర్చి ఆలకించిన సిద్ధోపంత్ సంతుష్టచిత్తు డయ్యాడు తమ ఇంటికి అరుదెంచి ఆతిధ్యాన్ని స్వీకరించవలసిందనికోర విరల్‌పంత్ సరేనని సిద్ధోపంతు ననుసరించాడు

విరల్ పంత్‌ను సత్కరించి విందారగింపచేశాడు సిద్ధోపంత్ భోజనానంతరము విరల్‌పంత్‌దగ్గర ఆసీనుడై అతడు బోధించిన సూక్ష్మ ఆధ్యాత్మిక రహస్యాలను శ్రవణంచేసి తృప్తిచెందాడు సిద్ధోపంత్ ఆనాటి రాత్రి సిద్ధోపంత్‌కు స్వప్నంలో పాండురంగడు దర్శనమిచ్చి తన కుమార్తెయైన రుక్మాబాయిని విరల్‌పంత్‌కిచ్చి వివాహము చేయమని ఆమె గర్భమున జనించు శిశువులు లోకకళ్యాణము నొనర్చు జ్ఞానులగుదురని తెలియచేసాడు సిద్ధోపంత్ మేలుకొని స్వప్న వృత్తాంతమును విఠల్‌పంత్‌కు తెలియచేసి తన కుమార్తెయైన రుక్మాబాయిని పరిణయమాడమని కోరాడు వివాహాది విషయములందు అనురక్తిలేని విరల్‌పంత్ అందుల కంగీకరించలేదు ఆ స్వప్నవృత్తాంతము యథార్థమైనచో పాండురంగడు తనకేల తెలియచేయ లేదని ప్రశ్నించాడు భగవానుడు తనకు తన స్వప్నంలో తెలియచేసినచో అంగీకరించగలనని తెలిపెను

మరునాటి రాత్రి స్వప్నములో విఠల్‌పంత్‌కు పాండురంగడు దర్శ మిచ్చాడు సిద్ధోపంత్ కుమార్తె రుక్మాబాయిని వివాహమాడవలసిందనియు ఆమె గర్భమున నలుగురు జ్ఞానులు జన్మించగలరనియు తెలుపగా విఠల్

పంత్ భగవదాజ్ఞను శిరోధార్యముగా భావించి వివాహమునకు సమ్మతించి రుక్మాబాయిని పరిణయమాడాడు

వివాహమై కొన్ని సంవత్సరాలు గడిచాయి అయిననూ సంతానం కలుగలేదు విఠల్ తీవ్రంగా మనోవేదనకు గురయ్యాడు స్వప్న సందేశానికై నిరీక్షిస్తూ తన బ్రతుకును వృధాచేసుకోవడం భావ్యం కాదనిపించింది వయసుగతించి శరీరము శిధిలమయ్యేలోగా భగవదనుభూతిని పొందలేనిచో జీవితమే నిరర్థకమని భావించి ఒకనాటి రాత్రి అందరూ నిద్రింపుచుండగా ఎవ్వరికి చెప్పకుండా వెళ్ళిపోయాడు తిరిగి తిరిగి కాశీక్షేత్రం చేరాడు అక్కడ రామానందస్వామిని దర్శించి వారివద్ద శిష్యుడుగా చేరాడు తన గృహస్థజీవనముగూర్చి కళత్రమునుగూర్చి రామానందస్వామి ప్రశ్నించగా అబద్ధముచెప్పి వారివద్ద సన్యాసాశ్రమము స్వీకరించాడు సన్యాస దీక్షనంతరము విఠల్‌పంత్‌కు చైతన్యాశ్రమస్వామి అని రామానందస్వామి నామకరణం చేశారు

కొంతకాలము గడచిన తరువాత ఆశ్రమ బాధ్యతలు చైతన్యాశ్రమస్వామికి అప్పగించి కొందరు శిష్యులను వెంటబెట్టుకొని తీర్థయాత్రలకు బయలుదేరారు రామానందస్వామి తీర్థక్షేత్రాలు దర్శిస్తూ ఆలంది గ్రామానికి వచ్చారు యతివరేణ్యులు తమ గ్రామానికి అరుదెంచారన్న వార్త వినగానే ఆలంది గ్రామస్థులంతా వెళ్ళి దర్శనం చేసుకొంటున్నారు సిద్ధోపంత్ తన కుమార్తె రుక్మాబాయిని వెంటనిడుకొని స్వామి దర్శనానికి వచ్చారు రుక్మాబాయి స్వామి పాదాలకు వినమ్రతతో నమస్కరించింది రుక్మాబాయి భక్తి శ్రద్ధలకు సంతసించి పుత్రవతీభవ" అని ఆశీర్వదించారు రామానందస్వామి ఆ మాట వినగానే రుక్మాబాయి ఫక్కున నవ్వింది ఆమె నవ్వు రామానందస్వామిని కలతపెట్టింది అలా నవ్వడానికిగల కారణాన్ని ప్రశ్నించారు రామానందస్వామి సిద్ధోపంత్ జరిగిన వృత్తాంతమంతా వివరించి చెప్పారు వివరాలన్నీ సేకరించిన తరువాత రామానందస్వామికి సందేహం కలిగింది తనదగ్గర సన్యాసాశ్రమము స్వీకరించిన చైతన్యాశ్రమ స్వామియే ఈమె భర్త అయివుండవచ్చని గ్రహించారు తనతో అబద్ధముచెప్పి తన గృహస్థజీవనమును మరుగుపరచి సన్యాసము స్వీకరించా

డని అర్థం చేసుకున్నారు సిద్ధోపంత్‌ను రుక్మాబాయిని వెంటబెట్టుకొని కాశీ నగరం చేరారు సంతానములేని గృహస్థుడు భార్య అనుమతి లేకనే సన్యాసము స్వీకరించుట దోషమనియు అట్టి శిష్యునకు సన్యాసదీక్ష నొసంగిన గురువుకూడా అపచారము చేసినవాడేనని తెలిపి చైతన్యాశ్రమస్వామికి నచ్చచెప్పి గృహస్థాశ్రమ ధర్మాన్నే నిర్వహించవలసిందని అనతిచ్చి విఠల్ పంత్ సిద్ధోపంత్ రుక్మాబాయిలను ఆశీర్వదించి ఆలంది గ్రామమునకు పంపేశారు

విఠల్ పంత్ ఆలందిచేరి గృహస్థ జీవనాన్ని ప్రారంభించాడు ఆలందిగ్రామ ప్రజలంతా విస్తుపోయారు సన్యాసి తిరిగి గృహస్థాశ్రమంలో ప్రవేశించడం అనుచితమని భావించారు విఠల్‌పంత్ భ్రష్టుడయ్యాడని నిర్ణయించారు అతని ముఖం చూడడానికికూడా వారిమనసు అంగీకరించలేదు వర్ణానికే అప్రతిష్ఠ తెచ్చాడని నేరారోపణ చేశారు విఠల్‌పంత్ చేసినపని ధర్మవ్యవస్థనే చావుదెబ్బకొట్టిందని భావించారు అతనితో ఎవరూ మాట్లాడకూడదని నిర్ణయించారు చివరకు కులంనుంచే వెలివేశారు

కొంతకాలానికి సిద్ధోపంత్ మరణించాడు విఠల్‌పంత్ రుక్మాబాయి ఇరువురే మిగిలారు సంఘజీవనంలో వారికి సముచిత స్థానంలేదు జీవచ్ఛవాల్లా బ్రతకవలసి వచ్చింది విఠల్‌పంత్ ఆలోచించాడు ఇక ఆలందిలో ఉండటం సబబుకాదనిపించింది వెంటనే ఒక అరణ్య ప్రదేశములో ప్రవేశించి అచ్చట ఒక చిన్న కుటీరాన్ని ఏర్పరచుకొని జీవించసాగాడు గ్రామంలో ప్రవేశించి భిక్ష తీసుకొనివెళ్ళి అరణ్య ప్రదేశములో భార్యాభర్తలు జీవిస్తుండేవారు

కొంతకాలానికి వారికి సంతానం కలిగింది ముగ్గురు కుమారులు ఒక కుమార్తె కలిగారు పెద్దవానికి నివృత్తిదేవుడని రెండవవానికి జ్ఞానేశ్వరని మూడవవానికి సోపాన్ అని అమ్మాయికి ముక్తాబాయి అని నామకరణం చేశారు

పాండురంగని వరప్రసాదంగా జన్మించిన ఈ నలుగురు పిల్లలు చతుర్వేదాలుగా కనపట్టసాగారు మృదుభాషణము సదాచారజీవనము పెద్దల

యెడ పూజ్యభావము నిరంతర హరినామ సంకీర్తనము వారికి ఉగ్గుపాలతో అబ్బినవి వారు ఎంత గుణశీలురైనను సంఘదృష్టిలో దోషులుగానే పరిగణింపబడుతూ వచ్చారు తండ్రిచేసిన తప్పిదానికి అమాయకులైన ఆ పిల్లలను అవమానపరచేవారు తన బిడ్డలకు ఏర్పడిన ఈ దీనావస్థను చూచి తల్లిదండ్రులు లోలోపల కుమిలిపోయేవారు

త్రయంబకేశ్వరములో జరిగే రథోత్సవములో పాల్గొనడానికి తనపిల్లలను భార్యను వెంటపెట్టుకొని బయలుదేరాడు విఠల్‌పంత్ రథోత్సవ వైభవమును కనులారా వీక్షించి తిరిగి వచ్చుచుండగా మార్గమధ్యంలో ఒక పులి గాండ్రింపుట వినిపించింది నడుస్తున్న ప్రజలంతా చెల్లాచెదరయ్యారు విఠల్‌పంత్ భార్యాపిల్లలను వెంటబెట్టుకొని ఒక సురక్షిత ప్రాంతంచేరాడు కానీ విఠల్‌పంత్ జ్యేష్ఠకుమారుడైన నివృత్తి తప్పిపోయాడు నివృత్తి పరుగెత్తుకుంటూవెళ్ళి ఒక గుహలో ప్రవేశించాడు ఆ గుహలో గోరక్‌నాథుని శిష్యుడైన గహినీనాథ్ తపమాచరించుచుండెను నివృత్తిని చూడగానే గహినీనాథ్ అతనిని ఆశీర్వదించి దీక్షనొసగి శ్రీకృష్ణుని దివ్యలీలను గానంచేయుచూ నామప్రభావాన్ని ప్రజలలో ప్రచారము గావించుచు జీవించమని తెలియచేసెను నివృత్తి గహినీనాథ్‌చే ప్రభావితుడై నాథ్ సంప్రదాయంలో చేరి నివృత్తినాథ్‌గా మారెను గురువుగారివద్ద సెలవుతీసుకొని స్వగృహముచేరి తన సోదరుడైన జ్ఞానదేవులవారికి దీక్ష నొసంగెను గురువు సోదరుడైన నివృత్తినాథుని వద్దనుండి గ్రహించిన జ్ఞానమును జ్ఞానేశ్వరులు సోపాన్‌కు ముక్తాబాయికి తెలియచేసి దీక్ష నొసంగిరి

దిన దిన ప్రవర్ధమానమవుతున్న తన పిల్లలకు ఉపనయన సంస్కారము చేయించవలయునని విఠల్‌పంత్ సంకల్పించాడు తన అభీష్టమును ప్రధాన పురోహితులకు విప్రోత్తములకు తెలియచేయగా వారు అందులకు నిరాకరించారు ఆశ్రమభ్రష్టత్వం పొందిన విఠల్‌పంత్ శిక్షార్హుడనియు చేసిన తప్పిదమునకు ప్రాయశ్చిత్తముచేసుకొనవలయుననియు విఠల్‌పంత్ చేసిన అపరాధమునకు నదిలోదూకి మరణించుటయే ప్రాయశ్చిత్తమని నిర్దాక్షిణ్యంగా తెలియచేశారు వారిమాటల నాలకించిన విఠల్‌పంత్ తీవ్రంగా

ఆలోచించాడు తన మనుగడవలన బుద్ధిమంతులైన తన పిల్లలకు అపకీర్తి లభించుచున్నదనియు తాము మరణించినచో వారి బ్రతుకులు బాగుపడునేమోనని భావించాడు. బ్రతికి చేయలేని సహాయము మరణించి చేయగలమని భావించి భార్య వెంటబెట్టుకొని అలహాబాదు వెళ్ళి భార్యాసమేతుడై త్రివేణి సంగమములో దుకి మరణించారు

అహా! సంఘజీవనమా? తోటి మనిషిని నిర్దాక్షిణ్యంగా హింసించి చంపే పైశాచిక సమాజమా? ధర్మశాస్త్రాలను ఆత్మవృద్ధికి సోపానాలుగా గుర్తించకపోగా తోటివ్యక్తి భుజాలపై ఎక్కి స్వారీచేయడానికి ఉపయోగించే పరికరాలుగా మలుచుకొన్న నిర్దయ దౌర్భాగ్య సంఘమా? సాటి మనిషి దుఃఖాన్ని తొలగించలేని కర్కశమానవుడు కైవల్యం చేరుతాడా? మంచిని వంచించే నరహంతకులు ధర్మనిర్వాహకులా! కాదు మతంపేరిట చెలామణి అయ్యే విద్రోహశక్తులు తమ స్వార్థజీవనానికి మతాన్ని ఆటబొమ్మగా ఉపయోగించుకొనే చండాలురు కులప్రాతిపదికతో సమాజ వికాస వృక్షాన్ని కూకటివ్రేళ్ళతోసహా పెకలించి భగవంతుని దృష్టిలో నీచులుగా వ్యర్థజీవులుగా చిత్రించబడ్డ రాక్షసులు

తల్లిని తండ్రిని పోగొట్టుకొన్న నలుగురు పిల్లలు చెట్టును విడచిన పక్షులుగా మిగిలారు. ఈ స్వార్థసమాజంలో నిరాధారంగా మిగిలిపోయారు ముక్కుపచ్చలారని వయసులో బ్రతుకుబాటను స్వహస్తాలతో నిర్మించుకోవాల్సిన పరిస్థితికి గురయిన అమాయక జీవులు

తల్లిదండ్రులు మరణించారు తమకు ఉపనయన సంస్కారము జరిపించవలసిందని జ్ఞానదేవులవారు ప్రధాన పురోహితుల వద్దకు వెళ్ళారు నివృత్తి సోపాన్ ముక్తాబాయివెంట నడిచారు ప్రధాన పురోహితుని గృహద్వారంవద్ద జ్ఞానదేవులవారిని పురోహితులు అడ్డగించారు శుద్ధి సంస్కారంలేనిదే ప్రధాన పురోహితుని చూచుటకు వారికి అర్హతలేదని చెప్పారు. ఆ మాటలు వినగానే నివృత్తినాధుడు ముందుకువచ్చి "నా పేరు నివృత్తినాధుడు ప్రవృత్తితో నాకు పనిలేదు" అన్నాడు "నేను జ్ఞానదేవుడను చైతన్యస్వరూపము నెరిగినవాడను అన్నాడు జ్ఞానదేవుడు సోపాన్

ముందుకువచ్చి "నన్ను సోపాన్ అంటారు సర్వులను భగవన్నామమందు లయింపనట్లుచేసి ముక్తిధామమునకు సోపానములు ఏర్పాటుచేయువాడను" అని తెలిపెను వచ్చీరాని ముద్దుపలుకులతో "నేను ముక్తాబాయిని అందరికి ముక్తిద్వారమును తెరచుట నాపని అని ముక్తాబాయి చెప్పింది

ఆ మాటలువిని ఆశ్చర్యచకితులైన పురోహితులు ఆగ్రహావేశపరులై దారినపోతున్న దున్నపోతునుచూసి అదిగో అది దున్నపోతు దానిపేరు జ్ఞానదేవ్ నీవూ ఆ దున్నపోతూ సమానమేనా? అని జ్ఞానదేవులవారిని పురోహితుడు ప్రశ్నించాడు

జ్ఞానదేవులవారు నవ్వుతూ సందేహమువలదు అందరిలోనున్నది ఒకే చైతన్యము నీవు ఉపాధినిచూస్తూ అధిష్ఠానవస్తువును దర్శించలేకున్నావు భ్రాంతిలో లేనివస్తువును ఉన్నట్లు గాంచుచున్నావు సమ్మోహింపబడిన అంతఃకరణతో ఉన్నవస్తువును లేనట్లు భావించుచున్నావు స్వప్నప్రపంచములో నివసించే నీ మనుగడకు స్వస్తిచెప్పు ఒక్కసారి మేలుకో సత్యదర్శన మవుతుంది మేలుకొన్నవానికి కలలురావడం అసంభవము కదా?' అన్నారు జ్ఞానదేవులవారు

ఏమిటీ మాకే జ్ఞానమును బోధించుచున్నావా? అందరిలో ఉన్నది ఒకే చైతన్యమయినచో ఆ దున్నపోతు మాట్లాడగలదా? అని గద్దించాడు పురోహితుడు

జ్ఞానదేవులు నిశ్చల చిత్తముతో, మీరు బ్రహ్మవేత్తలు మీది సత్యవాక్కు మీ నోటినుండి వచ్చిన మాటలు వృధాగావు దున్నపోతు మాట్లాడుటఏమి? వేదమంత్రాలనే ఉచ్చరించగలదు అనివెళ్ళితన హస్తమును దున్నపోతు శిరముపై వుంచాడు వెంటనే శృతిబద్ధంగా వేదమంత్రాలను దున్నపోతు ఉచ్చరించసాగింది అందరూ నివ్వెరపోయారు ఆ ఆశ్చర్యమును చూచుటకు ప్రజలంతా గుమిగూడారు ప్రధాన పురోహితుడుకూడా వచ్చిచూసి నిర్ఘాంతపోయాడు జ్ఞానదేవులు దైవాంశసంభూతులని గ్రహించారు జ్ఞానదేవులవారు తన హస్తమును దున్నపోతు శిరస్సునుండి తీయగానే వేదమంత్రోచ్చారణ ఆగిపోయింది ప్రధాన పురోహితుడు సమ్మతించి వారికి ఉపనయనము చేయించాడు

ఒకనాడు ముక్తాబాయి రొట్టెలు తయారుచేయుటకు మట్టికుండలను కొనుటకు సంతకు వెళ్ళింది కుండలను కొన్నది విశోబా అనే ధనికుడు అక్కడకువచ్చాడు ముక్తాబాయినిచూడగానే అతడు కోపోద్రిక్తుడయ్యాడు సన్యాసి సంతానమైన ఈ నలుగురు పిల్లలు గ్రామానికి అపఖ్యాతిగా నున్నారు వీరికి ఎవరూ ఏ సహాయము చేయకూడదు వీరిని ఈ గ్రామంలో లేకుండా చేయాలి అని విరుచుకుపడి ముక్తాబాయి చేతిలోవున్న కుండలను పగులగొట్టాడు

ముక్తాబాయి దుఃఖవదనంతో గృహానికి చేరింది సోదరులనుచూచి విలపించింది కారణమడిగి తెలుసుకొన్న జ్ఞానదేవులవారు ముక్తా దుఃఖించకు నా వీపుపై రొట్టెలు తయారుచేయి అని జ్ఞానేశ్వరులు వంగి కూర్చుని యోగాగ్నిని ప్రజ్వలింపచేశారు వీపు అగ్నివలె ఎర్రబడింది నోటివెంబడి మంటలు వస్తున్నాయి ముక్తాబాయి జ్ఞానేశ్వరుల వీపుపై రొట్టెలు కాల్చెను ఈ సంఘటనను కిటికీద్వారా చూస్తున్న విశోబా పశ్చాత్తాపముతో కుమిలిపోయాడు జ్ఞానదేవులు సాక్షాత్తు నారాయణ స్వరూపమని భావించాడు వెంటనే లోపలికరుదెంచి తన తప్పిదమును క్షమించమని జ్ఞానదేవుల పాదాలపై పడ్డారు తననుక్షమించి కృపచూపుమని ప్రార్థించాడు జ్ఞానదేవులవారు చిరునవ్వునవ్వి విశోబాను ఆశీర్వదించి అతనికి ఉపదేశమివ్వమని ముక్తాబాయికి చెబుతాడు ముక్తాబాయి విశోబాకు ఉపదేశమిస్తుంది ఈ విశోబాఖేచరుడే నామదేవులవారికి గురువై ఉపదేశమిస్తారు

ఒకనాడు ముక్తాబాయి స్నానమాచరించడానికి నదికివెళ్ళి ఇంటికి వచ్చుసరికి తలుపువేసి లోపల గడియపెట్టి ఉంటుంది ముక్తాబాయి తలుపు తట్టుతుంది లోపలున్నవారు తీయలేదు అనేకసార్లు తడుతుంది అయినా తీయలేదు కారణం ఆవిడకు అంతుపట్టలేదు ఇంటి కిటికీనిఎక్కి లోపలకు చూసింది జ్ఞానదేవులవారు ఒక మూలకూర్చొని విషాదంతో ఉన్నారు తాను భిక్షకెళ్ళినపుడు భ్రష్టసన్యాసి పుత్రుడు అని ఒక దుర్మార్గుడు హేళనచేయగా మానసికంగా గాయపడిన జ్ఞానదేవులు దుఃఖపూరిత హృదయంతో ఇంటిలో కూర్చుని గడియవేసుకున్నాడు ఎన్నిసార్లు పిలిచినను తీయలేదు

ముక్తాబాయి జరిగిన విషయమేమిటో జ్ఞానదృష్టితో గ్రహించింది వెంటనే ఒక అభంగమును భావగర్భితంగా పాడింది దీనినే చ్వారకీర్తన అంటారు తటీనే అభంగ మని మరాటీ భాషలో చెబుతుంటారు

నిర్మలమైన అంతఃకరణకల్గి ఇతరుల అపరాధములను క్షమించు వాడే సన్యాసి క్రోధముతో ప్రపంచము నిప్పులా దహించుకుపోతుంటే. శాంతముతో జలములా చల్లగా జీవించేవాడే సాధువు పరుషవాక్కులతో ప్రజలు తనను బాధించినపుడు వాటిని సముచిత సలహాలుగా తలచువాడే యోగి భగవంతుడనే ఒక దారముతో నేయబడిన వస్త్రమే ఈ ప్రపంచము జ్ఞానేశ్వరా! తలుపుతీయుము అని ముక్తాబాయి గానం చేయగానే ఆనంద ముతో జ్ఞానదేవులవారు తలుపుతీశారు

ముక్తాబాయి జీవించిన కాలము పదునెనిమిది సంవత్సరాలే అంత చిన్నవయసులో అద్భుత మహిమలను ప్రదర్శించింది కవయిత్రియై అభంగాలు రచించింది ఆమె వ్రాసిన అభంగాలు చాలావరకు లభ్యం గాకుండా కాలగర్భంలో కలసిపోయినవి ప్రస్తుతము అరువది అభంగములు మాత్రము లభించుచున్నవి మహారాష్ట్ర దేశములో ముక్తాబాయి అగ్రస్థా నాన్ని ఆక్రమించి యున్నది

మహాత్ములు మహిమలను ప్రదర్శించరు వారికి అలాంటి చౌకబారు ప్రదర్శనలందు అనురక్తి ఉండదు అయినను కొన్నిక్లిష్ట సమస్యలు ఎదు రైనపుడు దుస్సంఘటనలు తలఎత్తినపుడు ధర్మసంస్థాపనార్థం మహాత్ముల గుండా కొన్ని మహిమలు జరుగుతూవుంటాయి అలా వారు ప్రదర్శించేవి కొన్ని అయితే భగవానుడు వారిద్వారా వ్యక్తంచేసేవి మరికొన్ని నీటిమీద అలలు వచ్చిపోయినట్లు వారిలో మహిమలు వచ్చి పోతుంటాయి వారు మాత్రం సముద్రమువలె చలించరు

ఒక బ్రాహ్మణుడు తన గృహములో జరుగు పితృశ్రాద్ధమునకు నివృత్తి జ్ఞానదేవ్ సోపాన్ ముక్తాబాయిలను ఆహ్వానిస్తాడు ఆహ్వానము ననుసరించి వీరు వెడుతారు జ్ఞానదేవ్ సోదరులను చూడగానే పురోహి తులు కోపోద్రిక్తులై ఈ భ్రష్ట సంతానము ఇక్కడున్నచో మేము

పుండము వెళ్తున్నాము" అనిచెప్పి ఎంతచెప్పినా వినకుండా వెళ్ళి పోయారు

బ్రాహ్మణుడు నిమంత్రణ జరపడానికి ఖిన్నుడయ్యాడు వెంటనే జ్ఞానదేవులవారు మీకేమీ భయమువలదు మీ పితృదేవతలు స్వయంగా వచ్చి భుజించెదరు మీరు యథావిధిగా కార్యక్రమమును నిర్వహించుమని" తెలిపారు అమితానందభరితుడైన ఆ బ్రాహ్మణుడు స్నానమాచరించి సకల భక్ష్యములను సిద్ధముచేసెను జ్ఞానదేవులవారు మంత్రాక్షతలుచల్లి పితృదేవులను ఆహ్వానించగా ఆ గృహమంతయూ దివ్యవెలుగులతో శోభించింది దేవతా శరీరధారులై పితృదేవతలువచ్చి దర్శనమిచ్చారు బ్రాహ్మణుని హృదయం ఆనందముతో సముద్రంలా పొంగింది బ్రాహ్మణుడు పితృదేవతలకు నమస్కరించి వారి పాదములు కడిగి పూజచేసి భోజనమును వడ్డించగా పితృదేవతలు ఆరగించారు తదనంతరము దక్షిణ తాంబూలాదులు సమర్పించి సాష్టాంగ నమస్కారం చేయగానే పితృదేవతలు అంతర్ధానమయ్యారు బ్రాహ్మణుడు నిగ్రహించుకోలేని ఆనందముతో జ్ఞానదేవుల పాదాలపైపడి పరవశించిపోయాడు ఈ దృశ్యాన్నంతా బయట కిటికీగుండా వీక్షిస్తున్న పురోహితులు లోనికివచ్చి తమ అపరాధమును మన్నించవని జ్ఞానదేవులవారిని ప్రార్థించారు

జ్ఞానదేవులవారు నివృత్తి సోపాన్ ముక్తాబాయిలతో కలసి తీర్థయాత్రలకు బయలుదేరారు పండరీపురంలో సదా నామసంకీర్తనతో తన్మయత్వం చెందే పాండురంగభక్తుడు నామదేవుని దర్శించి అతనినికూడా వెంటబెట్టుకొని తీర్థయాత్రలు చేయవలెనని సంకల్పించి పండరీపురం చేరుతారు నామదేవులవారి భక్తిశ్రద్ధలనుచూసి వారుచేయు సంకీర్తనల నాలకించి జ్ఞానదేవులు తృప్తిచెందుతారు చంద్రభాగానదిలో స్నానమాచరించి విఠలనాథుని పవిత్రాలయంలో ప్రవేశిస్తారు ఆలయ ద్వారములో నిలబడగానే జ్ఞానదేవులు పారవశ్యంతో ఒక కీర్తనగానం చేస్తారు

దేవాచియాద్వారీ! ఉభేక్షణభరీ
తేణెముక్తి చారీ! సాధియేలా

హరిముఖేమ్హాణా! హరిముఖేమ్హాణా॥
పుణ్యాచీగణనా! కోణకరీ
అసానీ సంసారీ: జిహ్వావేగుకరీ
వేదశాస్త్ర ఉభారీ: బాహ్యాసదా
జ్ఞానదేవమ్హాణే: వ్యాసాచియాఖుణే
ద్వారకీ చారాణా! పాండవాఘరీ॥

పాండురంగ భగవానుని ఆలయమందు ఎవ్వరైనను ఒక్క క్షణము నిలబడినను సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య ముక్తులను పొందగలరు హరినామమును స్మరించు హరినామమును కీర్తించు భగవన్నామము చేయువాని పుణ్యమును ఎవరు లెక్కించగలరు ? ప్రపంచములోనే మనుగడను సాగిస్తూ నీ కర్తవ్యమును నిర్వహిస్తూ సదా భగవానుని స్మరించుచుండుము ధర్మమార్గములో పయనించు ధర్మశాస్త్ర ప్రబోధముల ననుసరించి జీవించు పాండవులయొక్క భక్తికి లొంగి భగవంతుడు వారికి ఎలా సేవచేశాడో నీకు తెలియదా?

అని జ్ఞానదేవులవారు గానం చేస్తూండగా నామదేవులవారు ఆనంద భాష్పాలను రాల్చారు భక్తమండలి అంతయూ పులకాంకితులయ్యారు

భక్తమండలితో అహమ్మదాబాద్ జిల్లాలో నెవాసే అనే గ్రామమునకు వస్తారు జ్ఞానదేవులవారు అచ్చట సచ్చితానందబాబా అనునతడు నయముగాని వ్యాధితో బాధపడుచుండుట జ్ఞానదేవులవారు చూశారు సచ్చిదానందబాబా కర్మపరిపక్వమై రోగవిముక్తుడు కావలఎన క్షణమువచ్చింది జ్ఞానదేవులవారు తన పవిత్ర హస్తముతో స్పర్శించగానే తన రోగము అదృశ్యమైనది బాబా వెంటనే జ్ఞానదేవులవారి పాదాలపైపడి శిష్యుడయ్యాడు అక్కడ ఒక దేవాలయంలో కూర్చొని భగవద్గీతపై జ్ఞానదేవులవారు ప్రవచించడం ప్రారంభించారు భక్తులు అసంఖ్యాకముగ హాజరై శ్రవణానందముగా ఆలకించారు ఆ ఉపన్యాసాలను సచ్చితానందబాబా

గ్రంథస్థం చేశారు దానికి భావార్థదీపిక అని నామకరణం చేశారు ఆ గ్రంథమే తరువాత జ్ఞానేశ్వరి అను పేరుతో వెలువడింది ఈ గ్రంథము మరాఠీభాషలో భగవద్గీతకు వ్యాఖ్యానము చక్కటి ఉపమానములతో జ్ఞాన యోగ కర్మ భక్తి మొదలగు యోగములనన్నిటిని సమన్వయంచేస్తూ జ్ఞాన దేవులవారు అందించిన ఈ గ్రంథము పరమ పవిత్రమైయున్నది మహారాష్ట్రదేశములో ప్రతి గృహములోకూడా ఈ గ్రంథము దర్శనీయము

జ్ఞానదేవులవారి చరిత్రలో మరొక అపూర్వ సంఘటనయున్నది ఈ సంఘటనలో అద్భుతమహిమను ప్రదర్శించి చూపారు జ్ఞానదేవు వారు చాంగదేవుడని ఒక యోగివుండేవాడు యోగమార్గములో పయనించి అతడు అనేక సిద్ధులు గడించాడు జ్ఞానదేవులవారు తన పరిసర ప్రాంతమునకు వచ్చియున్నారని విని జ్ఞానదేవులవారిని దర్శించాలని అభిప్రాయపడ్డాడు జ్ఞానదేవులవారికి ఒక ఉత్తరము వ్రాసి శిష్యునిద్వారా పంపాలని అభిప్రాయపడ్డాడు వ్రాయడానికి ఉత్తరము తీసుకొన్నాడు వ్రాయడానికి ఉపక్రమించాడు కానీ వ్రాయలేకపోయాడు జ్ఞానదేవులవారిని ఎలా సంబోధించాలో తనకు అర్థంకాలేదు పూజ్యులని సంబోధించుటకు అహంకారము అడ్డు వచ్చింది చిరంజీవి అని అంతటి జ్ఞానిని సంబోధించడం సభ్యతకాదని పించింది ఎంత ఆలోచించిననూ మరొక మార్గము కనుపించలేదు ఏమీ వ్రాయకుండా ఖాళీఉత్తరాన్ని తన శిష్యునిద్వారా జ్ఞానదేవులవారికి పంపాడు

జ్ఞానదేవులవారు ఆ ఉత్తరాన్ని తీసుకొని చూశారు విషయము అర్థముచేసుకొన్న జ్ఞానదేవులవారు నవ్వును ఆపుకోలేకపోయారు చాంగ దేవుడు ఇంకా ఖాళీగానే ఉన్నాడన్నమాట " అని పరిహాసంగా మాట్లాడింది ముక్తాబాయి చాంగదేవునికి జ్ఞానబోధచేస్తూ ఆ ఉత్తరములోనే 64 శ్లోకాలు వ్రాసి పంపారు జ్ఞానదేవులవారు దీనినే చాంగదేవపచాసి" అంటారు

జ్ఞానదేవులవారు పంపిన ఉత్తరములోని విషయమును చాంగదేవుడు చదువుకున్నాడు భావార్థమును గ్రహించలేకపోయాడు చివరకు జ్ఞానదేవుల వారిని దర్శించడానికి నిర్ణయించుకొన్నాడు జ్ఞానదేవులవారికి తన యోగ

శక్తులను ప్రకటించి చూపాలని భావించి ఒక పులిపై ఆసీనుడై కొరడాగా చేతిలో త్రాచుపామును ధరించి జ్ఞానదేవులవారి దర్శనానికి వస్తాడు. అదే సమయానికి జ్ఞానదేవులు నివృత్తినాథుడు సోపాన్ ముక్తాబాయిలు ఒక చిన్నగోడపై కూర్చుని శాస్త్రచర్చ చేస్తుంటారు. చాంగదేవుడు వ్యాఘ్రముపై ఆసీనుడై రావడం జ్ఞానదేవుడు చూస్తాడు. అతనికి గుణపాఠం నేర్పాలని భావించి తాము ఆసీనులైయున్న గోడను కదిలించి ఎదురుగావెళ్ళి చాంగదేవుని ఆహ్వానిస్తారు జ్ఞానదేవులవారు. చాంగదేవుడు జ్ఞాన దేవులవారి మహామనుచూచి దిగ్భ్రాంతి చెందుతాడు. క్రూరజంతువైనను వ్యాఘ్రము చైతన్యముతో నడిచే ప్రాణి. కానీ జడమైన కుడ్యమును నడిపించడము అద్భుత మహిమాన్వితకార్యము. వెంటనే చాంగదేవుడు దగ్గరకువచ్చి జ్ఞాన దేవుల పాదాలపైబడి జ్ఞానభిక్ష కోరుతాడు.

చాంగదేవుని హృదయంలో దాగియున్న అహంకార శేషమునుకూడా నిర్మూలించదలిచాడు జ్ఞానదేవుడు. చాంగదేవా నీ కొరకు ప్రాణాన్ని ఇవ్వగలిగేవారెవరైనా ఉన్నారా? ఉపదేశ సమయములో ప్రాణదక్షిణ కావలసియున్నది అని చెప్తారు జ్ఞానదేవులవారు.

స్వామీ నాకు కొన్నివేలమంది శిష్యులున్నారు. అవసరమైతే నా కొరకు ప్రాణాల్ని అవలీలగా ఇవ్వగలరు అని చాంగదేవుడు చాటి చెప్పాడు. "అయితే రేపు ఉదయానికి ప్రాణత్యాగానికి సిద్ధంగావున్న వ్యక్తిని తీసికొనిరమ్ము. రేపు ఉదయమే నీకు ఉపదేశము ఇవ్వబడుతుంది" అని జ్ఞానదేవులవారు తెలిపారు.

చాంగదేవుడు బయలుదేరి వెళ్ళాడు. తన శిష్యగణాన్నంతా కలుసుకొన్నాడు. విషయం తెలియచేశాడు. కానీ తనకోసం ప్రాణత్యాగం చేయడానికి ఎవ్వరూ సమ్మతించలేదు. పైగా స్వార్థపరుడని దూషించసాగారు. చాంగదేవునిలో చక్కటి పరివర్తన కలిగింది. హృదయం ఆవేదనతో నిండిపోయింది. ఈ ప్రపంచములో ప్రకటించబడే అభిమానాలు ఎండమావులలో నీళ్ళవంటివని గ్రహించాడు. జ్ఞానదేవులవారి వద్దకు వెళ్ళినమ

స్ఫురించి తన కొరకు ప్రాణత్యాగం చేసేవారు ఒక్కరుకూడా లభించవేద నియు తన శిరస్సునే సమర్పించగలననియు చాంగదేవుడు తెలియచేస్తాడు జ్ఞానదేవులవారు నవ్వుతూ బలిజరిగిపోయింది అహంకారాన్ని బలిఇవ్వ డమే నిజమైన త్యాగము నీ అహంకారం సమూలంగా నశించిపోయింది నీవు దీక్షను గ్రహించుటకు అర్హుడవైతివి అని చెప్పి ముక్తాబాయిని ఉపదేశమివ్వమని తెలియచేశాడు ముక్తాబాయి చాంగదేవునకి ఉపదేశమిచ్చి ఆశీర్వదించింది

ఆధ్యాత్మిక ప్రచారముచేయుచూ ముముక్షువులను సక్రమమార్గంలో నడిపిస్తూ యాత్ర పూర్తిచేసుకొని జ్ఞానేశ్వరులవారు భక్తబృందముతో ఆలంది చేరారు అక్కడ తన సోదరుడు గురువు అయిన నివృత్తినాథుని ప్రేరణచే అనుభవామృతము అను గ్రంధమును రచించారు

తన ఇరువది ఒకటవఏట భక్తులందరూ గాంచుచుండగా జీవసమాధి అయ్యారు చేతిలో జపమాలను పట్టుకొని భగవద్గీత తొమ్మిదవ అధ్యాయ మును పారాయణచేసి సమాధిలో పద్మాసనస్థుడై ధ్యానములో నిమగ్న మయ్యాడు నివృత్తినాథుడు ఆ సమాధిపై రాతిబండనుంచి సమాధిచేసాడు

జ్ఞానేశ్వరులవారు ఆ సమాధియందు సజీవులై ముముక్షువులకు మార్గదర్శకులై యున్నారని అనంతకోటి భక్తజన విశ్వాసము

* జై జై వాసుదేవ హరి *



నందుడు మనసునుదాటి మనుగడను సాగించే మహనీయుడు పుష్పాన్ని నాకు సమర్పించాలనే పరాభక్తితప్ప స్వార్థంతో అపహరించాలనే ఆలోచన అతనికిలేదు నీవు అనవసరంగా శ్రమపడ్డావు అన్నాడు

భగవాన్! నా అపరాధం క్షమించండి పరమభక్తులను శంకించడం మహాపాపం అందుకు పరిహారంగా అతని అభీష్టమును అనుగ్రహించి తృప్తిచెందుతాను అన్నది లక్ష్మీదేవి

విష్ణుదేవులు సంతృప్తిచెందిన మనసుతో దేవీ రామానందుడు వాంఛారహితుడు వాంఛాతీతుడు అతనికి అభీష్టములులేవు అభిమానాలుండవు అతనికి మనమేమివ్వగలము? అయితే నీవు అభిలషిస్తున్నావు గాబట్టి తరుణోపాయము చెబుతున్నాను వినుము రామానందుడు భక్తిని ప్రజలలో వృద్ధిచేయడమే ప్రధానకర్తవ్యముగా కలవాడు అతని భక్తి ఉద్యమానికి సహకరించి ఉపకరించే ఉత్తమ భక్తుని శిష్యునిగా పంపడమే మనము అతనికి చేయదగిన సహాయము ఇదిగో ఈ పుష్పము రామానందుడు భక్తితో నాకు సమర్పించబోయినది ఈ పుష్పమునకే జీవంపోసి రామానందుని ముఖ్య శిష్యులలో ప్రధానుడుగా ఉండునట్లు అనుగ్రహించెదను అని పలుకుతూ పుష్పాన్ని ఆశీర్వదించి గంగానదిలో వదిలారు

ఆ పుష్పము గంగానదిలో తేలియాడుతూ తనతోపాటు తేలియాడుతున్న పద్మపత్రముపై చేరింది ఆ పుష్పము అందమైన బాలుడుగామారి తేలివస్తున్నది నీరూ అనే నేతపనిచేయు మహమ్మదీయుడు ఆబాలుని చూపి తీసుకొనివచ్చి "కబీర్ అను నామముతో పెంచుచుండెను కబీర్ అనగా మహాత్ముడని భావము

శైశవదశయందే కబీరుకు భక్తిశ్రద్ధలు అలవడినవి ఎక్కువ కాలము ఒంటరిగ జీవించేవాడు సదా భగవంతునిగూర్చి ధ్యానిస్తుండేవాడు విద్యార్జనకై గురువుల దగ్గరకు పంపేవారు తల్లిదండ్రులు కబీర్‌కు జ్ఞానార్జనయందు అనక్తిమెండు అతడు వేసేప్రశ్నలకు గురువులు సమాధానం

చెప్పలేక పీకాకు పడేవారు విద్యను బోధించకనే పంపేసేవారు అందు చేత కబీర్ పెద్దగా విద్యార్జన చేయలేకపోయాడు పుష్పము వికసించగానే పరిమళమును వెదజల్లునట్లు కారణజన్ముడైన కబీర్ విద్యార్జన చేయకపోయి ననూ విద్యావంతుడయ్యాడు కవియై గేయాలు వ్రాశాడు భక్తుడై కీర్త నలు రచించాడు గాయకుడై సుశ్రావ్యంగా గానం చేశాడు

భక్తి జ్ఞానాలతోపాటు కబీర్‌లో తీవ్రవైరాగ్యము నిండియుండేది ప్రపంచమంతా నిస్సారంగా గోచరించేది అనుక్షణమూ జీవితంయొక్క అస్థిరత్వమే కళ్ళకు కట్టినట్లు కనుపించసాగింది

మాలీ ఆవత దేఖ్‌కే
కలియాం కరీ పుకార్
ఫూలీ ఫూలీ చున్‌లియే
కాల్ హమారీ బార్

సమీపిస్తున్న తోటమాలినిచూచి మొగ్గలు విలపించాయి వికసించిన
పూలు ఈ రోజు కోయబడ్డాయి మనవంతు రేపు వస్తుంది
మృత్యువును ఆలింగనం చేసుకోక తప్పదు
అని చెట్టులోని మొగ్గలు విలపిస్తున్నట్లు చింతించాడు కబీర్

భగవంతుని చేరాలని అనుక్షణమూ కబీర్ ఆరాటపడేవాడు హైందవపండితులచెంత ఆసీనుడై ధర్మశాస్త్రాలను ఆలకించేవాడు మహ మ్మదీయ గురువులయొద్దచేరి కురాన్ ప్రవచనాలు వినేవాడు సూఫీప్రవ క్తలమధ్య ప్రవేశించి ప్రేమపారాలు శ్రవణంజేసేవాడు భిన్నవ్యవస్థలను ప్రచారంచేసే వివిధ మహాత్ముల చెంతకు వెళ్ళడములోనే కబీర్ జ్ఞానతృష్ణ ఎలాంటిదో మనము అవగాహన చేసుకోవచ్చు

విద్యార్జన జరుగలేదనే భావంతో కబీరుకు వంశవృత్తియైన నేతను నేర్పాడు పెంచుతున్న తండ్రి కబీర్‌కు ఏపని చేయుమన్నను భగవంతుని

ధ్యాసే మనసులో నిలిచియుండేది నేతనేస్తూ మధ్యలో ఆగిపోయేవాడు శబ్దబ్రహ్మముద్వారా నిశ్శబ్ద బ్రహ్మములో ప్రవేశించేవాడు

ఒకసారి కబీర్ నడచివెడుతూ దారిలో ఒకచోట ఒక స్త్రీ జొన్నలు తిరుగలిలోవేసి త్రిప్పుతున్న దృశ్యాన్ని గాంచాడు తనలో కలవరం ప్రారంభమయింది హృదయాన్నెవరో ఎండుతున్నట్లనిపించింది దుఃఖము పొంగి పొరలి వస్తున్నది కంఠం గద్గదమైంది శిశువులా ఏడ్వసాగాడు! అదే సమయానికి నిపటనిరంజనుడను సాధువు అచ్చటకు వస్తాడు దుఃఖి స్తున్న కబీర్‌నుచూసి నీదుఃఖానికి కారణమేమిటి? అని అడుగుతాడు

మహాత్మా అదిగో ఆ ఇంటివరండాలో చూడండి తిరుగలిలో జొన్నలువేసి పిండిచేస్తున్న ఆస్త్రీని చూడండి ఆదృశ్యమే నన్ను కలవర పరచింది సంసారమనే తిరుగలిలో జొన్నలనే జీవులనువేసి మృత్యువనే స్త్రీ ఎలా పిండిచేస్తున్నదో చూడండి జొన్నలు పిండిగా మారులాగున జీవులందరూ మృత్యువాతబడి మరణిస్తున్నారు ఈమృత్యు తిరుగలినుండి బయటపడే మార్గము తెలియచేయండి అని నమస్కరిస్తూ అడుగుతాడు కబీర్

కబీర్ వైరాగ్యమునకు సంతసించి నిపటనిరంజనుడు నాయనా దిగులు చెందకు ఆశించే మనసుండాలేగాని అనుభవించడం తథ్యం బాగా ఆ దృశ్యాన్ని పరిశీలించి చూడు తిరుగలిలోపడిన జొన్నలన్నీ పిండి కావడంలేదు కొన్ని తిరుగలి మధ్యనున్న కొయ్యమేకుచుట్టూ చేరియున్నవి అవిమాత్రము తిరుగలిలోపడి పిండిగాకుండా నిలిచియున్నవి అలాగే సంసారమనే తిరుగలిలోపడిననూ ఎవరైతే భగవానుడనే మేకును ఆశ్ర యించి యుంటారో వారు మృత్యువాతపడరు అని తెలియచేస్తాడు

ఆ మహాత్ముని దివ్యబోధతో కబీర్ ప్రభావితుడవుతాడు భగవ న్నామామృతపానమే తన దినచర్యగా మారిపోయింది మరొకరు జ్ఞాపకం చేస్తేగాని ఆకలి తెలిసేదిగాదు నిద్ర అందని అనుభూతిగా మిగిలింది

కుమారుని అయోమయస్థితిని ధ్యానాభిలాషను గుర్తించిన తండ్రి కబీర్‌కు ఏ పని అప్పగించక తానే కష్టపడి నేతనేసి ఇంటిని పోషించేవాడు

కాలచక్రం ముందుకు నడిచింది కబీర్ తండ్రి నీరూ కన్ను మూశాడు కుటుంబభారమంతా కబీర్‌పై పడింది తండ్రి మరణంతో కబీర్ వైరాగ్యము తీవ్రస్థాయి నందుకుంది కుటుంబపోషణ కష్టంగా పరిణమించింది బట్టలునేసి తీరవలసిందేనని తల్లి బలవంతము చేయసాగింది తల్లి వత్తిడిపై కబీర్ నేతపని కుపక్రమించాడు పని సాగేదికాదు మధ్యలో పని ఆపి ధ్యానంసాగిస్తుండేవాడు కబీర్ ధ్యానంలోవున్న సమయములో భగవానుడే నేతపని చేసేవాడు కబీర్ మామూలు స్థితికివచ్చి పనికి సిద్ధం కాగానే స్వామి అదృశ్యమై కబీర్ హృదయంలో దాగేవాడు

బట్టలు తయారయ్యాయి జగన్నియామకుని అదృశ్యహస్తం పని చేయడంవల్ల బట్టలు సర్వాంగ సుందరంగా గోచరిస్తున్నాయి బట్టలు విక్రయించి డబ్బుతీసుకొనిరమ్మని కబీరుని తల్లి ఆజ్ఞాపించింది కబీర్ బట్టలు తీసుకొని అమ్మడానికి సంతకు వెళ్ళాడు కబీర్ దగ్గర బట్టలు ఎవరూ కొనలేదు అంత విలువైన బట్టలు మనము కొనలేమంటూ అందరూ వెళ్ళిపోతున్నారు నిజమేకదూ! భగవంతుడే స్వయంగా తయారుచేసిన బట్టలకు ఖరీదెవరు నిర్ణయించగలరు? కబీర్ మాత్రము నిశ్చింతగా ధ్యాన స్థితిలో ఉన్నాడు

ఇంతలో ఒక బ్రాహ్మణుడువచ్చి కబీరుముందు నిలిచాడు "అయ్యా నేను పేదవాడను ధరింపుటకు వస్త్రములులేవు కొనుటకు నా వద్ద ధనములేదు దయచేసి మీరు సహాయంచేయండి అని ప్రార్థిస్తాడు వెంటనే కబీరు తన దగ్గరఉన్న గుడ్డలో సగభాగము అతనికిస్తూ గ్రహిస్తున్నవ్యక్తి రాముడేననే అనుభూతి పొందుతాడు

బ్రాహ్మణుడు సంతోషముతో వెళ్తాడు కొంతసేపటికి ఒక ముస్లిమ్ ఫకీరు వస్తాడు దయయుంచి ఈ పేదవాడైన ఫకీరుకు బట్టను దానం చేయగలరా?" అని కబీర్ నడుగుతాడు తనవద్ద మిగిలియున్న బట్టను ఆ

ఫకీరుకు సమర్పించుకొని కబీర్ తృప్తిచెందుతాడు నా ధ్యానాన్ని కుంటు పరుస్తున్న ఈ గుడ్డనుకూడా ఇచ్చేశాను ఇక నాకు నిశ్చింతగా ధ్యానం జరుగుతుందని భావిస్తూ సంతసముతో ధ్యానాచరణకు ఉపక్రమిస్తాడు

కబీర్ త్యాగనిరతిని భగవద్భక్తిని పరీక్షించడానికి భగవానుడే బ్రాహ్మణుని రూపములోను ఫకీరురూపంలోను వచ్చి కబీర్‌నుండి బట్టను దానంగా గ్రహించాడు. వేదశాస్త్ర పారంగతుడైన బ్రాహ్మణుడుగా వచ్చి ననూ మహమ్మదీయ ఫకిరుగా వచ్చిననూ ఇద్దరికీ నిష్పక్షపాతంగా దానం చేశాడు కబీర్ ఎవరు వచ్చారు అనేది కబీర్ దృష్టికాదు వచ్చిన వ్యక్తిలో పరమాత్మని దర్శించడమే కబీర్ ప్రత్యేకత తనను ఇతరులు మోసగిస్తు న్నారనే ధ్యాసెలేదు

కబిర్ ఆప్ ఠగాయియే
ఔంర ఠగియే కోయ్
ఆప ఠగే సుఖ ఊపజే
ఔర్ ఠగే దుఃఖహోయ

ఇతరులను మోసగించుటకన్నా ఇతరులచేత మోసగించబడటమే శ్రేయోదాయకమని కబీర్ అభిప్రాయము మోసగించబడటములో శాంతి కల్గుతుంది మోసగించడంలో అశాంతి మిగుల్తుంది అని బోధకుడైన తరువాత కబీర్ తెలియచేస్తున్నాడు

కబీర్ వద్దనున్న గుడ్డనంతా భగవానుడే మాయారూపాలలో వచ్చి అపహరించినను కబీర్ గృహోన్ముఖుడు కాలేదు సంతలోనే కూర్చుండి ధ్యానము చేస్తూంటాడు భగవానుడే మారువేషంలో కబీర్ గృహానికి వెళ్ళాడు కబీర్ మాతృదేవితో అమ్మా! నీ కుమారుడు కబీర్ సంతలో బట్టలు అమ్ముటకు బదులు ధ్యానము చేయుచున్నాడు ఒక బ్రాహ్మణునికి ఫకీరుకి గుడ్డనంతా దానంచేసి తాను నిశ్చింతగా ధ్యానము చేయుచున్నాడు నాకు బాధ కలిగి మీకు తెలియచేయాలనివచ్చాను మీరు కబీర్‌ను అదుపులో ఉంచకపోతే లాభంలేదు అని భగవానుడు హితవచనములు పలుకుతాడు

కబీర్ తల్లికి ఆవేశం ఆకాశాన్నంటింది వెంటనే బయలుదేరి సంతకు వచ్చింది ఫిర్యాదుచేసిన జగన్నాటక సూత్రధారికూడా ప్రక్కనే ఉన్నాడు తల్లి కబీర్‌ను చూసింది ఆక్రోశంతో ఒక్క అరుపు అరచింది కబీర్ చలి చలేదు గద్దించి పిలిచింది అతీంద్రియ స్థాయిలో ఉన్న కబీరుకు వినిపించలేదు ఇంతలో ప్రక్కనున్న బ్రాహ్మణ వేషధారి తన చేతిలోవున్న కర్రను ఆమెచేతికి అందించాడు క్రోధావేశంలో ఆ తల్లి వెంటనే ఆ కర్రను తీసుకొని కబీర్‌ను కసితీరాకొట్టింది కబీర్ చలించలేదు కానీ కర్ర అందించిన బ్రాహ్మణుడు దెబ్బలకోర్చుకోలేక గోలచేశాడు ఆ బ్రాహ్మణుని శరీరంపై వాతలుపడ్డాయి బీర్ కళ్ళు తెరిచాడు వెంటనే ఎదురుగానున్న బ్రాహ్మణుడు కోదండధారియైన శ్రీరామచంద్రమూర్తిగా దర్శనమిచ్చాడు కబీర్ ఆనందముతో పరవశించి నమస్కరించాడు

భగవానుడు అదృశ్యమయ్యాడు తల్లి కబీర్‌ను ఆలింగనం చేసుకొని సుపుత్రా నీకు తల్లికావడమనే పుణ్యఫల విశేషంచేత రామదర్శనంపొందాను అని ఆనందాశ్రువులు విడిచి కుమారుని ఇంటికి తీసుకొని వచ్చింది

కుమారుని భక్తికి సంతసించిననూ కబీర్‌లో వస్తున్న మానసిక పరిణామానికి తల్లి కలతచెందసాగింది ఇలాగే కొనసాగితే బిడ్డ తనకు దక్కడనే భావం గాఢంగా ఏర్పడింది వివాహముచేస్తే ధ్యాస మారుతుందని ఆశపడ్డది తన కుమారునితో ప్రస్తావించింది

జీవితమే క్షణభంగురమని భావించే కబీర్‌కు వివాహముపై ఆశ ఉంటుందా? ప్రపంచములో వ్యక్తి జీవించేది మూడురోజులు మూడురోజుల బ్రతుకును మూడుముళ్ళు వేసిమాత్రం రక్షించుకోగలమా ? వివాహము అనర్థదాయకమని బీర్ అభిప్రాయపడెవాడు

ఎక్ దిన్ ఐసా హూయగా
కో ఊ కాంగా కా నహీం
ఘరకే నరీ కో కహే
తనకీ నారీ నాహీం

"నీవు ఎవరికీ ఉపయోగపడని రోజంటూ ఒకటి వస్తుంది నీ
గృహంలోని నారియే (భార్య) గాక నీ శరీరములోని నారి (నరము)
కూడా నిన్ను వదలిపెట్టి విశ్రమిస్తుంది
అని గానం చేసేవాడు కబీరు

కబీర్ వివాహితుడు కావాలని తల్లి కృతనిశ్చయురాలైంది కబీర్ ఎంతవారించాలనిచూసినా లాభంలేకుండా పోయింది వివాహం అనివార్య మైంది తల్లి మాటను నిరాకరించలేని కబీర్ ఆమె ఆజ్ఞను శిరసావహించాడు లోయీ అనే అందమైన యువతినిచ్చి కబీర్‌కు వివాహంచేశారు

వివాహం విద్యకు ఆనకట్టవంటిదని చాలామంది అభిప్రాయ పడు తుంటారు అది వాస్తవముకాదు సంస్కారవంతులను వక్రింపచేసే శక్తి ప్రపంచములో ఎవ్వరికీలేదు. వివాహానికి జ్ఞానసముపార్జనకు విరోధ మెక్క డున్నది? చూసేవాడిలో తప్పు వివాహము చేసుకోగానే వ్యక్తిలో జ్ఞాన తృష్ణ నశిస్తుందని భావించడం భావ్యమా? అదే నిజమైతే అవివాహితులంతా జిజ్ఞాసువులై యున్నారా? అదంతా వ్యక్తి సంస్కార ప్రభావముపై ఆధార పడియుంటుంది సంస్కారి వివాహితుడైననూ జ్ఞాన సముపార్జన చేయ గలడు అసంస్కారి అవివాహితుడైనను వక్రమార్గంలో పయనించక తప్పదు

కబీర్ వివాహితుడైననూ అతనిలో జ్ఞానతృష్ణ తగ్గలేదు వైరాగ్య జ్వాల ఆరలేదు భగవదనుభూతికై అతడు ఆరాటపడసాగాడు హైందవ గురువుల దగ్గరకువెళ్ళి తనను శిష్యుడుగా స్వీకరించమని ప్రాధేయపడ్డాడు కబీర్ మహమ్మదీయుడని అతనిని శిష్యునిగా స్వీకరించుటకు వీలులేదని హైందవ గురువులు నిరాకరించేవారు నిరాశచెందిన కబీర్ మహమ్మదీయ మతప్రవక్తల వద్దకువెళ్ళి జ్ఞానభిక్షకోరేవాడు తనకు కావలసింది మతము కాదు మహిమాన్వితమైన సత్పదార్థము. కబీర్ ప్రవర్తన ఖురాన్ ప్రవచ నములకు విరుద్ధముగా యున్నందున అతనికి జ్ఞానబోధచేయడం అసంభవ మని మహమ్మదీయ గురువులు తెలియచేశారు

కబీర్ హృదయం ముక్కలైపోయింది కలతచెందిన మనస్సుతో ఆనాటి రాత్రి కాశీక్షేత్రములో గంగానదీ తీరమున నడుస్తున్నాడు బాధతో హృదయం కుంచుకుపోతున్నది గురువు లేక జ్ఞానాన్ని సముపార్జించడము సంభవమా? మరి నా జీవితంలోకి గురువు ప్రవేశించలేదు నా జన్మ వృధా కావలసిందేనా? అని దుఃఖిస్తూ తన హృదయపు లోతులనుండి పెల్లుబికే విషాదభావాల్ని గేయరూపంలో గానంచేశాడు

కౌన్ బతావేవాట్! గురుబిన్
బడావికట్ యమఘాట్ ॥కౌన్॥
కామక్రోధ దో పర్వతఠాఢే
లోభ చోర సంఘాత్ ॥కౌన్॥
మద మత్సర కా మేహ బరసాత్
మాయాపవన్ బడేదాట్ ॥కౌన్॥
కహత కబీర్ సునోభాయీ సాధో
కస్ తరనా యహ ఘాట్ ॥కౌన్॥

"యమపాశము భయంకరమైనది కామక్రోధాది పర్వతములు అడ్డుగా నిలచి జీవన నౌకాయానమును నిరోధించుచున్నవి మరొక తీరమును చేరెదమనిన అచ్చట దోచుకొనుటకు లోభము సిద్ధముగా యున్నది మదమాత్సర్యములనెడి జల్లులు నౌకపై పడుతున్నవి మాయాగాలులు వీచుచున్నవి ఇట్టి పరిస్థితులలో గురువుతప్ప కరుణించి కాపాడే వారెవరు?

అని దుఃఖిస్తూ నడుస్తున్నాడు కబీర్

బాధ భరించలేని స్థాయికిచేరింది వ్యక్తి నీరసించిపోయాడు నిరాశా నిస్పృహలు హృదయాన్నావరించాయి కదలలేకపోయాడు గంగాతీరంలో మెట్లపై పడిపోయాడు శరీరము అలసిపోయింది మనసు ఆవేదనతో చితికిపోయింది కబీర్ అక్కడే నిద్రపోయాడు

ఉదయం బ్రహ్మ ముహూర్తకాలం సమీపిస్తున్నది పవిత్ర గంగా నదిలో స్నానంచేయడానికి రామానందస్వామి వస్తున్నారు. మసక చీకటిలో చూడకుండా తన పాదము కబీర్ మస్తకముపై పడింది రామానందస్వామి వెంటనే గ్రహించి "రామ్" అని ఉచ్చరించాడు. కబీర్ పులకాంకితుడై లేచి రామానందస్వామి పాదములపై పడి "మహాత్మా! ఆ అమృత వాక్యానికై నేను నిరీక్షిస్తున్నాను: మీరే నా గురుదేవులు. మీ పాదాలచెంత నా బ్రతుకును ధన్యత చేసుకొంటాను," అని తెలియజేశాడు.

రామానందస్వామి కబీర్ హృదయమును గ్రహించి అతనిని ఆశీర్వదించి తన శిష్యునిగా స్వీకరించాడు. ఇంతకాలము వ్యథచెందిన కబీరు హృదయము రామానందుని ఆశీస్సులతో కుదుటపడింది. హృదయమునుండి ప్రేమజల్లులు వర్షింపసాగాయి. గురుకృపతో తనలోవున్న అహంకారము సమూలంగా తుడిచిపెట్టబడిందని కబీర్ వ్రాశాడు. ఆనాటినుండి రామనామము నాశ్రయించి నామదాసుడై కబీర్ దాసు అను నామముతో పిలవబడు చుండెడివాడు.

జబ్ మైథా తబ్ గురూనహీం
అబ్ గురూహైం హమ్‌నాహీం
ప్రేమగలీ అతిసంకరీ
తామే దోన సమాహీం

"నాలో అహంకారమున్నంత వరకూ గురుసాన్నిధ్యం లభించలేదు, ఇప్పుడు గురువు లభించాడు అహంకారము అదృశ్యమైంది. ప్రేమమార్గము సంకుచితమైనది. అహంకారాన్ని, భగవంతుని - ఇద్దరినీ తనలో ఉంచుకోలేదు", అని కబీర్ గానంచేశాడు.

ఒకనాటి రాత్రి ఎనిమిది గంటల సమయంలో కబీర్‌దాసు ఇంటికి కొందరు సాధుమహాత్ములు వస్తారు. ఆహ్వానంలేకనే ఇందరు మహాత్ములు అరుదెంచి తనను, తన గృహాన్ని పావనంచేసినందుకు కబీర్ ఆనందానికి

అవధులులేవు మహాత్ములను లోనికి ఆహ్వానించాడు వారి పవిత్ర పాదాలను కడిగి ఆ పరిశుద్ధ జలాన్ని శిరముపై చల్లుకున్నాడు వారికి విశ్రాంతి ఏర్పాటుచేశాడు వెంటనే భార్యను దూరంగాపిలిచి తాను వారితో సంభాషించు చుందుననియూ ఈలోగా వంట తయారుచేయమనిచెప్పి తనువెళ్ళి మహాత్ములచెంత ఆసీనుడవుతాడు కబీరుదాస్

భార్య ఆలోచించింది ఇంటిలో సరుకులులేవు చేతిలో పైసాలేదు ఇందరు మహాత్ములకు వంట సిద్ధముచేయడమెలా? ఎంత ఆలోచిచినా తనకు మార్గమేమిటో గోచరముకాలేదు భర్తకు చెబుదామని గుమ్మంవద్దకు వచ్చి చూచింది సంత్ పురుషులమధ్య పరవశించి రామనామామృతాన్ని పానంచేస్తున్న కబీర్‌ను చూసింది తన భర్తను పిలిచి చెబితేమాత్రం ఏమి ప్రయోజనం? రామనామ మాధుర్యంతప్ప మరొకటి తెలియని తన భర్తకు చెప్ప ఏమిలాభం? తానే ఆలోచించింది సంతకువెళ్ళి సరుకులు అప్పడిగి తేవడానికి బయలుదేరింది అప్పటికే రాత్రి తొమ్మిదిగంటల కాలమైంది. కొట్టులన్నీ మూసియున్నారు చివరికి ఒక్క కొట్టుమాత్రము మూయడానికి సిద్ధంగావుంది కబీరుదాస్ భార్య లోయీ ఆ కొట్టువద్దకు వెళ్ళింది కొట్టు యజమాని తులసీశేఠ్‌ను చూసింది ఏమండీ నేను కబీర్‌దాస్ భార్యను నన్ను లోయీ అంటారు ఈనాడు మా ఇంటికి సాధుమహాత్ములు వచ్చారు వారికి ఆతిధ్యమివ్వాలి సరుకులులేవు మీరు సరుకులు ఇప్పించినచో వారికి ఆతిథ్యమివ్వగలము ఓ సొమ్ము రేపు ఇచ్చేస్తాము దయఉంచి ఈ సహాయము చేయండి మీకు జీవితమంతా ఋణపడి ఉండగలము" అని వినమ్రతతో తులసీశేఠ్‌ను ప్రాధేయపడింది లోయీ

తులసీ శేర్ ఆలోచించాడు లోయీ సౌందర్యవతి అందానికి మారుపేరు ఆమె రూపలావణ్యము అతనిలో దుష్టభావాన్ని రేకెత్తించింది సరే! నీవు ఇంతగా ప్రాధేయపడుతున్నావుకనుక నీకు సహాయం చేయాలని నిర్ణయానికి వచ్చాను నీవు సరుకులు వలసినంత తీసుకోవచ్చు సొమ్ముకూడా తిరిగి ఇవ్వనవసరములేదు నేను నీ కోర్కె తీరుస్తాను

ప్రతిఫలంగా నీవూ నా మనోభీష్టాన్ని నెరవేర్చి తృప్తిపరచాలి అని తన దుష్టభావాన్ని లోయా ముందుంచాడు తులసీశేర్

లోయాకి తనచుట్టూవున్న ప్రపంచము ఎదిర్భమిస్తున్నట్లు గోచరిస్తున్నది శరీరం చలనంలేకుండా ఆగిపోయింది కళ్ళు చెమ్మగిల్లాయి ఒళ్ళంతా చెమటలు పోయసాగాయి హృదయస్పందనమే ఆగినట్లనిపించింది నిశ్చేష్ఠురాలై నిలబడిపోయింది

ఏమిటమ్మా? ఏదోఒకటి తేల్చిచెప్పు మేము కొట్టుమూయాలి అన్నాడు తులసీశేర్.

ఆ మాటతో మళ్ళీ లోయా మనసు బహిర్ముఖమైంది కానీ ఏం చేయాలి? ప్రతి హిందూ స్త్రీ పరమ పవిత్రంగాను ప్రాణ సమానంగాను భావించే పవిత్ర శీలాన్ని ఇక్కడ కోల్పోవడమా ? అలాగని అదృష్ట వశాత్తు ఇంటికి వచ్చిన సంత్‌పురుషులకు ఆతిథ్యమివ్వకుండా తరిమి వేయడమా? ఆమెలో సంఘర్షణ తీవ్రమైంది కొట్టు కట్టేయాలి తొందరగా చెప్పమని శేర్ ఒకప్రక్క బలవంతం చేస్తున్నాడు

ఏది ఏమైనా మహాత్ములకు ఆతిథ్యమివ్వడమే ప్రధాన కర్తవ్యం అనిపించింది లోయాకి వెంటనే తన అభిప్రాయాన్ని తులసీశేర్‌కు తెలియ చేసింది నేను మీ కోరికతో ఏకీభవిస్తున్నాను అయితే ఒక షరతు నేను అశ్లీలంగామారి మహాపురుషులకు ఆతిథ్యమివ్వలేను మీరు సరుకు లివ్వండి తీసుకొనివెళ్ళి వంటచేసి వారికి వడ్డించి తరువాత వెంటనేవచ్చి మీకోర్కె తీర్చుతాను " అని చెప్పింది లోయా

తులసీశేర్ వెంటనే కోరిన సరుకులన్నీ ఇచ్చాడు ఇంటికివెళ్ళి లోయా వంట తయారుచేసింది భార్యాభర్త లిరువురు మహాత్ములకు ఆహారం వడ్డించారు వారిని సంతృప్తి పరచారు భోజనానంతరము ఇరువురు కలసి మహాత్ములకు పాదసేవ చేశారు వారు నిద్రించగానే తాము భుజించటానికి ఇరువురు బయలుదేరి వంటగదివైపు నడుస్తున్నారు మహా

త్ముల సేవాభాగ్యము లభించినందుకు కబీర్ హృదయం సంతృప్తితో నిండి పోయింది పొంగివస్తున్న తన ఆనందాన్ని వ్యక్త చేస్తూ లోయీ! ఇంత మంది సంత్ పురుషులకు ఆతిథ్యమిచ్చే భాగ్యాన్ని భగవానుడు ఈనాడు మనకు ప్రసాదించాడు ఇది నిజంగా మనజీవితంలో మరువలేని మరపు రాని మధుర సంఘటన అన్నాడు కబీర్దాస్

భర్తమాటలను ఇంతవరకూ ఆలకిస్తున్న లోయీ భర్తవైపు తిరిగి చూసింది ఆమెకళ్ళు కన్నీటితో నిండియున్నాయి పెదవులు వణుకు తున్నాయి శరీరం కంపించి పోతున్నది అదేమిటి లోయీ! ఎమిటా కన్నీరు నాకు తెలుసు అవి కన్నీరుకాదు ఆనందబాష్పాలు సాధు పురు షులకు ఆతిథ్యమిచ్చిన తృప్తినిన్ను అంతగా పరవశింప చేసింది అన్నాడు కబీర్దాస్

లోయీ ఆ మాటలు వినగానే భోరుమని విలపించసాగింది కబీర్ దాసెకు పరిస్థితి అర్థంకాలేదు కారణమేమిటో చెప్పమని భార్యను అడి గాడు జరిగిన పరిస్థితంతా పూసగ్రుచ్చినట్లు భర్తతో చెప్పింది లోయీ తన లాంటి దుర్మార్గురాలైనస్త్రీ చరిత్రలోనే కనుపించదని దుఃఖించసాగింది భర్తకు ఇంత ఘోరఅన్యాయము తలపెట్టిన స్త్రీ అన్వేషించినా అగుపించ దని ఏడ్వసాగింది

కబీర్దాస్ ప్రశాంతంగా లోయీని సమీపించి లోయీ! పిచ్చి దానా! ఎందుకింతగా దుఃఖిస్తున్నావు? నీవు చేసింది తప్పుకాదు నీలో ఏ దోషమూలేదు క్లిష్టసమస్యలో నీవు చక్కటి నిర్ణయం తీసుకొన్నావు ఒక భయంకర సన్నివేశంలో బహుచక్కటి పరిష్కారాన్ని రూపొందించావు భక్తుల సేవయే భగవంతుని సేవ భక్తుల సేవకన్నా మించిన భాగ్యము లేదు అనవసరంగా దుఃఖించకు నీవు చాలా పవిత్రురాలవు అంతేకాదు భక్తులకు ఆతిథ్యమిచ్చే ఈ అపూర్వ అవకాశాన్ని మనకు ప్రసాదించిన ఆ తులసీశేర్ కూడా నా దృష్టిలో పవిత్రుడే అతడు సరుకులివ్వకపోతే మనము ఆతిథ్య మివ్వగలవారమేనా? అతడు సాక్షాత్తూ భగవంతుడేననే భావం నాకు

కలుగుతున్నది లోయీ। బోధింపద నీవు అతనికి మాటిచ్చావు ఇచ్చిన మాటను నెరవేర్చడం భక్తులమైన మన కర్తవ్యం ఇప్పుడు చాలా రాత్రయింది పైగా వర్షం పడుతున్నది నేను వచ్చి నిన్ను అక్కడ వదులుతాను మళ్ళీ నీవు బయటకు రాగానే తీసుకొనివస్తాను అని ఆవిడను తీసుకొని వీధిగుమ్మంవైపుకు నడుస్తాడు గొడుగుపట్టి ఆవిడను తులసీసేర్ ఇంటికి తీసుకొని వెడతాడు

సేర్‌గారి వరండాలో కబీర్ నిలబడ్డాడు లోయీ లోపలికెళ్ళింది తులసీశేర్ దిగ్భ్రాంతిచెందాడు ఆమె నిజాయితీకి ఆశ్చర్యపోయాడు నీవు వచ్చావా ఇంతరాత్రిపూట ఈ వర్షములో ఎలా రాగలిగావు? అన్నాడు తులసీశేర్ లోయీ తలవంచుకొని "నాభర్త తీసుకొని వచ్చాడు అన్నది ఆ సమాధానం శేర్‌జీని కలవరపెట్టింది నీ భర్త తీసికొనివచ్చాడా? నీ విక్కడికి కెందుకు వస్తున్నావో అతనికి తెలుసా? అని ప్రశ్నించాడు తెలుసు జరిగిన విషయమంతా చెప్పాను సాధుజనులకు ఆతిధ్యమిచ్చేందుకు సహాకరించిన మీరు భగవత్స్వరూపులని చెప్పి నన్ను వెంటబెట్టుకొని తీసుకొనివచ్చారు అన్నది లోయీ

తులసీశేర్ ఆశ్చర్యపోయాడు నీ భర్త ఎక్కడున్నాడు? అని అడిగాడు బయట వరండాలో నాకోసం వేచియున్నారు అని సమాధానమిచ్చింది లోయీ తులసీశేర్ బయటకువచ్చి కబీరును చూశాడు ప్రశాంత చిత్తముతో నిశ్చింతగా రామధ్యానం చేస్తున్న కబీరును చూశాడు పశ్చాత్తాపంతో క్రుంగిపోయాడు తాను చేసిన అపరాధానికి సిగ్గుపడిపోయాడు శేర్‌జీ పరమభక్తులను కష్టపెట్టినందుకు వ్యధచెందాడు లోయీపాదాలపైబడి క్షమాభిక్ష కోరాడు ఆపుకోలేని దుఃఖముతో కబీరు పాదాలపైబడి నేను దుర్మార్గుడను నా పాపానికి నిష్కృతిలేదు నన్ను క్షమించి రక్షించండి" అంటూ దుఃఖించాడు తులసీశేర్

సూర్యకాంతిలో మంచుగడ్డ కరగులాగున కబీరు దివ్యతేజస్సు ముందు తన కామవాంఛలు కరిగిపోయాయి తులసీశేర్‌లో నూతన పరివ

ర్తన కలిగింది అతని జీవితములోనే నూతన పరిణామం ఏర్పడింది ఊహించని తీరానికి జీవితం మలుపు తిరిగింది బ్రతుకుకు సార్థక్యం ఏమిటో గ్రహించడానికి మనసు పరితపిస్తున్నది గత జీవన విధానానికి స్వస్తిచెప్పి క్రొత్తజీవితాన్ని చేపట్టడానికి అంతర్యంలో నిర్ణయాలు జరుగుతున్నాయి కబీరు ప్రేమపూరితంగా తులసీశేర్‌ను అలింగన చేసుకొన్నాడు పశ్చాత్తాపంగల మనిషి దైవత్వంగల వ్యక్తియని తెలియచేశాడు జరిగిన తప్పిదానికి పశ్చాత్తాపంచెందడం మంచిదేకాని అలాంటితప్పే రెండవసారి జరగకుండా చూసుకోవడం ఉత్తమమని సూచించాడు నివ్వెరపోయి నిలబడియున్న తులసీశేర్‌ను సమీపించి తన అమృత సందేశాన్ని కీర్తనద్వారా గానం చేశాడు

ఘుంఘట్ కాపట్ ఖోలరే
తోవే పీవ మిలేంగె
ఘట ఘటమేఁ వోయీ సాయీ రమతా
కటుక వచన మత్ బోలరే ,,
శూన్య మహాలమేఁ దీప బిరాజే
బాజే అనహద డోలరే ,
కహాత కబీరా సునోభాయీ సాధో ,,
అసనసే మత డోలరే ,,

"తెరను తొలగించు నీవు రాముని సాన్నిధ్యం పొందగలవు ప్రతీ హృదయంలో భగవానుడున్నాడు ఎవరినీ కష్టపెట్టే మాటలు మాట్లాడకు అంధకార బంధురమైన హృదయంలో దీపాన్ని వెలిగించి అందు సదా ధ్వని చే ప్రణవనాదమును ఆలకించుము
అని తులసీశేర్‌కు జ్ఞానబోధ చేశాడు కబీరుదాస్

పరనారీపైని ఛురీ
మత్ కోయిలావో అంగ్
రావణకే దస్ సీస్ గయే
పర నారీకే సంగ్

"పరపురుషుని భార్య సొనపట్టిన కత్తివంటిది ఆవిడ శరీరాన్ని ఆలింగనం చేసుకొనేందుకు అర్రులుచాచకు పరపురుషుని భార్యను ఆశించడంవలననే రావణుడు తన పదితలలను పోగొట్టుకొనవలసి వచ్చింది

అనేది పరస్త్రీలపట్ల కబీర్‌దాస్ అభిప్రాయము

కబీర్‌దాస్‌కు ఒక కుమారుడు కలిగాడు అతనికి "కమాల్ అని నామకరణ చేశారు కమాల్ శైశవదశలోనే పరధ్యానంగాఉండేవాడు రామ నామం చెవిని పడగానే ఎడుపుమానేవాడు హరికథలు జరుగుచోట నిశబ్ద ముగా కూర్చొని ఆలకించేవాడు సంకీర్తన జరుగు స్థలమునకు వెళ్ళి గంతులు వేసేవాడు ఆ కుర్రవానికో ప్రస్ఫుటంగా తెలియవచ్చే భక్తి శ్రద్ధలుచూసి అందరూ ఆశ్చర్యపడేవారు

కమాల్ పండ్రెండు సంవత్సరముల బాలుడయ్యాడు ఒకనాడు తండ్రిని సమీపించి తాను పుణ్యక్షేత్రమైన ద్వారకను సందర్శించవలయునని కుతూహలంగా ఉన్నదని కమాల్ తెలచేస్తాడు కుమారునిలోని జ్ఞాన తృష్ణకు కబీర్ సంతసించి పంపుతాడు

కమాల్ బయలుదేరాడు మార్గమధ్యంలో రామనామమును గానం చేస్తూ తన్మయత్వంతో నడుస్తున్న ఆ బాలునిచూసి ఇతడు అపర శుక బ్రహ్మవలె యున్నాడని భావించి అతనికి ఆతిథ్యమిచ్చి సత్కరించేవారు సంకీర్తన చేయించుకొని ఆలకించేవారు ఆ పసివాడు చేసేబోధలను అవ ధానంతో శ్రవణంచేసేవారు

ఇలా భక్తిని ప్రచారం చేసుకొంటూ కమాల్ ద్వారక చేరాడు అక్కడ కొన్నిరోజులుండి స్వామిని మనసారా సేవించి తిరిగి కాశీ క్షేత్రా నికి ప్రయాణమయ్యాడు మార్గములో చిత్రకూటమనే గ్రామానికి చేరాడు ఆ ఊరిలో విష్ణుదాసుడనే భాగవతోత్తముడు కలడు అతడు సంపన్న కుటుంబీకుడు కమాల్ ముఖసరోజమును గాంచగానే అతడు మహాభక్తు

దని గ్రహించాడు తన గృహంలో ఆతిధ్యాన్ని స్వీకరించవలసిందని ఆహ్వానించాడు. కమాల్ విష్ణుదాస్ గృహములో సంకీర్తన చేశాడు కమాల్ అమృతగానమునకు భక్తులంతా సమ్మోహితులయ్యారు ఎవరు ధన రూపేణా ఏది ఇచ్చిననూ కమాల్ గ్రహించక నిరాకరించేవాడు కమాల్ యొక్క వైరాగ్యమునుచూసి విష్ణుదాసుడు విస్మయమొందాడు

కమాల్‌కు ఏదన్నా పారితోషకంగా సమర్పించాలని విష్ణుదాసు మనసులోవుంది ఒక విలువైన మాణిక్యాన్ని తెచ్చి కమాల్‌కు ఇవ్వబోయాడు కమాల్ నిరాకరిస్తూ "విష్ణుదాసా! ఏమిటి నీవు చేయునది? విప్రులకు విత్తము మహారాజులకు మాణిక్యాలు పేదవారికి పక్వాన్నము విరాగులకు వస్త్రము సమర్పించవలయుననునది మీకు తెలియదా? కనుక నీకు అభీష్టముగానున్నచో ఒక గుడ్డముక్కను నాకు ఇప్పించుము చాలును నాకు మాణిక్యములు ధనము అవసరములేదు అని చెప్పాడు

విష్ణుదాసు ఆలోచించాడు కమాల్‌ను ఒప్పించడం తనతరముకాదు నూతన వస్త్రమును తెప్పించాడు అందులో తెలియకుండా లోపల ఈ మాణిక్యమునుంచి కమాల్‌కు అందించాడు అది వస్త్రమేననే భావనతో కమాల్ స్వీకరించాడు భక్తులయొద్ద సెలవు తీసుకొని స్వస్థలానికి బయలు దేరాడు కమాల్

కమాల్ ఇల్లుచేరాడు తన యాత్రా విశేషాలన్నీ తండ్రికి చెబుతున్నాడు కబీర్‌దాస్ ఆనందానికి అవధులు లేవు కమాల్ తన సంచినుండి వస్తువులు తీయడంలో విష్ణుదాసు ఇచ్చిన వస్త్రమునుండి మాణిక్యము క్రింద పడినది కబీరుదాసు ఆ మాణిక్యాన్ని చూశాడు కోపోద్రిక్తుడయ్యాడు "కమాల్ విలువైన రత్నాలను రేగుబండ్లకు దారబోయునట్లు అమూల్యమైన రామనామాన్ని విక్రయించి ఈ నిర్జీవమైన మాణిక్యాన్ని సంపాదించావా? ఛీ! నీ ముఖము నాకు చూపకు ఈ మాణిక్యమును తీసుకొని వెళ్ళి ఎవరు నీకిచ్చారో వారికి తిరిగి ఇచ్చిరమ్ము అట్లు చేయనిచో నీవు నా కుమారుడవుకావు నేను నీకు తండ్రినికాను అని శాసించాడు కమాల్

తాను వద్దని నిరాకరించిననూ విష్ణుదాసుడు తనకు తెలియకుండా ఈ పని చేసాడని చెప్పి తండ్రి ఆజ్ఞానుసారము చిత్రకూటంవెళ్ళి విష్ణుదాసునకు సమర్పించి తిరిగివచ్చాడు కమాల్ శ్రద్ధాభక్తులనుచూసి అందరూ అతనిని భక్త కమాల్ అని పిలిచెడివారు

కామినీ కాంచనములను జయించినవాడే నిజమైన వేదాంతి ఈ రెండింటికి బానిస అయినవాడు భక్తుడుకాలేడని కబీర్‌దాస్ అభిప్రాయము

గాంఠీదామ న బాంధయీ
నాహిఁ నారీసే నేహ్
కహే కబీర తా సాధూకే
హామ చరనన కీ ఖేహ్

కాంచనము గిట్టనివాడు కాంతను ముట్టనివాడు నిజమైన సాధువు నేను అతని పాదధూళివంటివాడను "

అని కబీర్‌దాస్ తెలియజేశాడు

కాశీ నగరములో ఒక ధనికుడుండేవాడు అతనికి దైవచింతనయే గిట్టదు ప్రాపంచిక విషయవాసనలలోపడి కాలాన్నంతా వృధాచేసుకొనే వాడు ఒకనాడు గంగానదీతీరములో కబీర్ శిష్యులకు బోధచేయుచుండగా ఆ ధనికుడు వస్తాడు కబీర్‌ను చూస్తాడు అహంకారముతో అనరాని మాటలు అంటాడు కాలాన్ని వృథాచేసుకొనే పిచ్చిసన్యాసులని వ్యాఖ్య చేస్తాడు కబీర్ అతనిని సమీపించి నీవుచేసిన వ్యాఖ్యానము చాలా రసవత్తరముగా యున్నది కానీ ఒక్క విషయములో మాకు సందేహమున్నది చేయరాని పనులన్నీచేసి ధనం కూడబెట్టావు అన్యాయార్జితంలో బ్రతుకంతా నడిచావు మరి ఇంత ధనాన్ని సంపాదించావుగదా ఎవరికొరకైతే పడరానిపాట్లుపడి ధనాన్ని ప్రోగుచేశావో రేపు నీకు ఆపదసమయ మొచ్చినపుడు వీరిలో ఎవరైనా ఆదుకోగలరా? నీ బాధల్ని పంచుకొనే వారెవరైనా ఉన్నారా? అని సూటిగా ప్రశ్నించాడు కబీర్‌దాస్

నన్ను ప్రాణసమానంగా చూసుకొనే వారెందరో ఉన్నారు నా భార్యాపిల్లలు అవసరమైతే ప్రాణాన్నైనా ఇవ్వడానికి వెనుకాడరు అన్నాడాషావుకారు

మిత్రమా నీ మాటలు సత్యదూరంగావున్నాయి ఈ విషయములో సత్యమెంతో గ్రహించాలంటే నీవు జ్వరపీడితుడవైనట్లు నటించు బాధలు పంచుకొనే వారెవరో చూడగలము నిన్ను ప్రేమించే వారు మీ గృహంలో ఎందరున్నారో తేలిపోతుంది అన్నాడు కబీరు

షావుకారు సమ్మతించి బాధపడుతున్నవాడిలా అభినయిస్తూ ఇంటిలో పడుకున్నాడు భార్యా పిల్లలు బంధువులంతా చుట్టుముట్టారు లేనిజబ్బు గనుక ఎంత వైద్యం చేయించినా నయం కావటంలేదు పరిస్థితి అధ్వాన్నంగా మారింది ఇక బ్రతకడనే నిర్ణయానికి వచ్చారు

ఏమండీ! మీ తరువాత నన్నంత బాగా ఎవరు చూసుకొంటారు, పిల్లలు నామాట వింటారనే నమ్మకమేముంది? దయయుంచి ఆస్థి నాపేరిట వ్రాయండి అప్పుడు పిల్లలదగ్గర నాకు విలువుంటుంది అని భార్య విలపించింది

నాన్నా ఇంటికి పెద్దవాడ్నిగనుక ఆస్తినంతా నాపేరిట వ్రాయండి అన్ని విషయాలు నేను చూసుకుంటాను పైగా మీ చితాభస్మాన్ని పుణ్య నదులలో కలుపవలసినవాడను అన్నాడు పెద్దకుమారుడు

నాన్నా! నేను అందరిలో చిన్నవాడను మీ ముద్దుల కొడుకును పెద్దవాళ్ళకిస్తే వాళ్ళు నన్ను మోసంచేయవచ్చు ఆస్థినంతా నా పేరిట వ్రాయండి ప్రతియేటా మీ పేరున బ్రాహ్మణులకు అన్నసంతర్పణ చేస్తాను అన్నాడు చిన్నకుమారుడు.

షావుకారు బంధువులంతా కబీర్‌దాస్ చుట్టూమూగారు మహాత్మా మీరు భగవత్స్వరూపులు ఎలాగైనా ఇతనిని బ్రతికించండని ప్రాధేయ పడ్డారు కబీరుదాసు అలాగేనని ముందుకు వచ్చాడు ఒక గిన్నెతో పాలు

తీసుకొని రమ్మన్నాడు పాలుతెచ్చారు ఎవరైతే అతనిని అమితంగా ప్రేమిస్తున్నారో వారు ఈ పాలు త్రాగితే అతనిజబ్బు నయమవుతుంది అని కబీరు తెలియజేసాడు వెంటనే అందరూ ముందుకొచ్చి మేము త్రాగుతామని చెప్పారు

నేను త్రాగాలంటే నేను త్రాగాలంటూ పోటీపడి ముందుకొచ్చారు పరస్పరము పోరాటానికికూడా దిగుతున్నారు ఆగండి అనవసరంగా ఆవేశ పడకండి నే చెప్పేదంతా జాగ్రత్తగా వినండి ఎవరైతే ఈ పాలు త్రాగుతారో వారు మరణిస్తారు బదులుగా ఈ షావుకారు ఆరోగ్య వంతుడవుతాడు అన్నారు కబీరుదాస్

నేను చనిపోతే పిల్లల బాధ్యత ఎవరు నిర్వహిస్తారు అని వెనుకడుగు వేసింది భార్య

నాకు భార్యాపిల్లలున్నారు నేను గతిస్తే వారి జీవితాలేమవు తాయి అని దురంగా వెళ్ళాడు పెద్దకుమారుడు

నేను మరణిస్తే నా భార్య జీవించలేదు అనవసరంగా రెండు హత్యలు అవుతాయి అని ముఖం త్రిప్పుకున్నాడు రెండవకుమారుడు

మా నాన్నకు నేనంటే ప్రాణం నా ప్రాణంతో మా నాన్నను బ్రతికించినా ఆ తరువాత నేనులేననే బాధతో ఆ ప్రాణం ఎలాగు నిల వదు కనుక నేను పాలుత్రాగను అన్నాడు చిన్నకుమారుడు

తన కుటుంబీకులే కాదంటూవుంటే మాకుమాత్రం ఏం పట్టింది? అంటున్నారు బంధువులు మిత్రులు

అందరూ కబీర్‌వైపుతిరిగారు మహాత్మా మీరు నిస్వార్ధపరులు త్యాగశీలురు మీకు దేహధ్యాసలేదు ప్రాపంచిక సంగత్వముండదు దయ ఉంచి మీరే ఆక్షీరమును పానంచేసి వారిని రక్షించకూడదా? తోటిప్రాణికి సేవచేయడమేకదా మీ ధర్మం అన్నారు

కబీర్‌దాస్ నవ్వుతూ అలాగే నేనే పానం చేస్తాను అని పాలుత్రాగి ఆ షావుకారును పడకమీదనుంచి లేపుతాడు ప్రశ్నార్థకంగా అతని చూస్తాడు ఆ ధనికుడు ఎగ్గుతో తలవంచుకుంటాడు ఎవరికొరకై తే అమితంగా కష్టించి ధనాన్ని ప్రోగుచేశాడో వారి ప్రేమయి ఎలాంటివో ప్రత్యక్షంగా చూశాడు

మహాత్మా! చీకటిదారిలో పయనించి బ్రతుకను నిరర్ధకంగా మార్చుకున్నాను పాపాన్ని మూట గట్టుకున్నాను ఈ రోజు మీరు నా కళ్ళు తెరిపించారు ఇక మిగిలిన నా శేషజీవితాన్ని సన్మార్గంలో నడుపుకుంటాను మీరు ఉపదేశించి ఆశీర్వదించండి మీ బోధను శిరసావహించి ఆచరణలో ఉంచుకొని తరిస్తాను అని పశ్చాత్తాప హృదయంతో ఆ షావుకారు కబీర్‌దాస్ పాదాలపై పడ్డాడు

కబీర్ అతనిని చేయిపట్టిలేపి అలింగనచేసుకొని తన అమర సందేశాన్ని కీర్తనద్వారా గానంచేసాడు

ని ధనకే ధనరామ హమారే
భోరనలేవై ఘుటఘున జవై కష్టమె ఆవై కామ
దిన దిన హోత సవాయీ దౌలత్ నహిఛదామ్
॥ని॥

జాగత సోవత ఊఠత బైఠత జపో నిరంత నామ
అంతకాలమే ఛోడ చలతే సబపాస నఏక్ ఛదామ్
కహత కబీరాయే ధనకే ఆగే పారసకో క్యాకామ్ ॥ని॥

"ధనహీనులకు రామనామమే ధనము రామనామము సంపద పెరుగుతుందేవి తరగదు మేలుకువనందు నిద్రయందుకూడా నిరంతరము నామజపము చేయుము మృత్యువు సమీపించు సమయములో అందరూ నిన్ను విడిచిపెట్టువారేగాని నీ వెంట నడిచేవారొక్కరు కనుపించరు రామనామము ఎదుట పరుసవేదికూడా నిరుపయోగమే

అని కబీర్‌దాస్ ఆ షావుకారుకు బోధ చేసాడు.

తాను జీవించడమే కాకుండా తోటివారినికూడా కబీర్‌దాస్ సన్మార్గములో నడిపించేవాడు భగవన్నామమునందు అతని విశ్వాసము మేరు పర్వతమువంటిది సంపూర్ణ శరణాగత మార్గంలో జీవితము గడిపేవాడు భగవన్నామ ప్రభావమెరిగిన భక్తులంటే కబీరుదాస్‌కు ప్రాణం అవసరమైతే వారికొరకు ప్రాణాన్నిసైతం త్యజించగల త్యాగజీవి

ఒకనాడు జ్ఞానదేవ నామదేవులు భక్తులతోగూడి తీర్థయాత్రలు చేయుచూ కాశీనగరానికి వచ్చి కబీరుదాసు గృహానికి అతిధులుగా వస్తారు కబీరు సంతోషముతో పొంగిపోతాడు వారికి వసతి సదుపాయాలన్నీ చూస్తాడు భక్తులు విశ్రమిస్తారు

కబీరుదాస్ భార్య లోయీ భర్తను సమీపించి మరునాడు భక్తులకు అతిథ్య మివ్వడానికి ఇంటిలో సరుకులు ఏమీలేవని చెబుతుంది కబీరు అలోచిస్తాడు మార్గం గోచరించలేదు అప్పుడు అర్ధరాత్రయింది ఏ కొట్టు నుంచైనా సరుకులు దొంగిలిస్తే ఎలా ఉంటుందని ఆలోచించాడు దొంగతనం పాపమని తెలుసు తాను దొంగతనమనే చిన్న తప్పునుచేసి పవిత్రాత్ములకు ఆతిధ్య మివ్వడమనే బృహత్కార్యాన్ని నిర్వహించవచ్చు ననుకొన్నాడు తన కుమారుడైన కమాల్‌ను వెంటబెట్టుకొని కన్నము వేయుటకు అవసరమైన గునపము కత్తి తీసుకొని బయలుదేరాడు మహాభక్తుడైన కబీర్‌దాస్ దొంగతనమునకు వెళ్ళుటయా! దీనదయాళుడైన రాముడు ఈ సంఘటనద్వారా కబీర్‌దాస్ కీర్తిని లోకానికి తెలియచేయాలని భావించాడేమో!

తండ్రీ కుమారులు ఒక కొట్టువద్దకు చేరారు చుట్టుప్రక్కల అందరూ నిద్రిస్తున్నారు ఇంటికి కన్నం వేశారు కమాల్‌ను పిలిచి, "నాయనా! నీవు లోపలికివెళ్ళి సంత్ పురుషులకు అతిధ్యమిచ్చుటకు కావలసిన పదార్ధములను మాత్రమే తీసుకొనిరమ్ము" అని కబీర్ చెప్పాడు కమాల్ కన్నముగుండా లోనికి వెళ్ళాడు అవసరమైన ఆహారపదార్థాలన్నీ మూటలు కట్టాడు. కన్నముద్వారా తండ్రికి అందించాడు ఇక తాను

కన్నముద్వారా బయటకు నిష్క్రమించేందుకు సిద్ధంగాఉన్నాడు. ఈలోగా అతనికి ఒక సంకల్పము కలిగింది ఇక్కడ ధనమూ బంగారు ఆభరణములు ఉన్నాయి తాము వెళ్ళినతరువాత తస్కరుడెవడైనా ఈ కన్నము ద్వారా లోనికి ప్రవేశించి వాటిని అపహరిస్తాడెమోననే సందేహము కల్గింది కాస్తదూరంగా నిద్రిస్తున్న కొట్టుయజమాని దగ్గరకు వెళ్ళాడు కమాల్ అతనిని తట్టి నిద్రలేపాడు ఏమండీ మేము దొంగలముకాము అవసర నిమిత్తము ఒక సత్కార్యముచేయు నుద్దేశ్యముతో కొన్ని పదార్ధములు తీసుకొని వెళ్తున్నాము మేము వేసిన కన్నము అలాగే వున్నది మీరు జాగరూకులై యుండండి " అని చెప్పి త్వరగా కన్నముగోదూరి బయటికి రావడానికి ప్రాకుతున్నాడు వ్యాపారి పరుగెత్తుతూ వచ్చి నడుమువరకు కన్నములో దూరిన కమాల్‌ను సమీపించి అతని కాళ్ళు గట్టిగా పట్టేశాడు "దొంగ దొంగ" అని కేకలేస్తున్నాడు పరిస్థితి తారుమారైంది కమాల్ ఆలోచించి తండ్రితో చెబుతాడు నాన్నా! ఇక లాభంలేదు అతను నాకాళ్ళను గట్టిగా వాటేసుకొనియున్నాడు ఇక కొద్దిసేపట్లో జనం పోగవుతారు మన చోరత్వం తెలిసిపోతుంది ఆదియునుగాక మనం దొంగతనం చేశామని తెలిస్తే పుణ్యాత్ములైన జ్ఞానదేవ నామదేవాదులు ఒక్క క్షణమైనా మన గృహములో నిలువరు అతిథ్యం స్వీకరించరు నేను నా జీవితాన్ని త్యాగం చేయవలసిన పవిత్ర సమయమాసన్నమైనది నీవు నాతలనుకోసి ఆ సరుకులను నా శిరసును తీసుకొనివెళ్ళుము " అని కమాల్ చెప్పగానేకుమారుని ఔదార్యానికి త్యాగశీలతకు సంతసించి కబీర్ తన దగ్గరున్న కత్తితో కమాల్ శిరమును కోసి సరుకులు శిరమును తీసుకొని వెళ్తాడు

కబీర్‌దాస్ ఇంటికివెళ్ళి సరుకులన్నీ భార్యకు అప్పగిస్తాడు కుమారుడెక్కడని అడుగుతుంది లోయీ కబీర్ మాల్ శిరస్సును లోయీ చేతిలో పెడతాడు జరిగిన వృత్తాంతమంతా చెబుతాడు లోయీ ఆనందభాష్పాలు వదులుతుంది కమాల్ చేసిన త్యాగానికి సంతసిస్తుంది కమాల్‌లాంటి పుత్రరత్నం కలగడం తమ భాగ్యమని మురిసిపోతుంది ఆహా ఎంతటి మహత్తర అవగాహన! సాధుసత్తములకు అతిథ్యమిచ్చుటకై తన ఏకైక పుత్రుని త్యాగంచేసిన ఉదాసీనత ఎలాంటిది? కబీర్‌దాస్ తన రచనలలో

ప్రేమనే అనుక్షణమూ ప్రతిపాదిస్తాడు ఈనాడు తన కుటుంబమంతా ప్రేమకే జీవితాల్ని ఆహుతి చేయడానికి సిద్ధపడ్డాడు ఆహుతి చేశారు

ప్రేమ బిక్ నూత్ మైం సునా
మాంథే సాటే హాట్
బూఝుత్ విలమ్బన కీబియే
తత్ ఛిన దీజై కాట్

తలకు బదులుగా ప్రేమను సంతలో విక్రయించుచున్నట్లు నీవు విన్నచో ఆలస్యం చేయవద్దు శిరమును పోగొట్టుకొని ప్రేమను సంపాదించు"

అని వ్రాశాడు కబీర్‌దాస్

ఎంతటి ఉదాత్తమైన భావన ప్రవచించడముకాదు తమ జీవితములో ఈనాడు ఆ పరమ సత్యాన్ని ఆచరించి చూపారు

కుమారుని శిరస్సును దాచిఉంచింది లోయీ ఉదయాన్నే షడ్రసోపేతముగా భోజనము తయారుచేసింది జ్ఞానదేవులవారు సందేశాన్నందించి సంతృప్తిపరచారు నామదేవులవారు సంకీర్తన నాలపించి పరవశింపజేశారు అందరూ ఆతిథ్యాన్ని స్వీకరించారు సాయంత్రము వెళ్ళడానికి బయలుదేరారు సంకీర్తన చేసుకుంటూ నడుస్తున్నారు

కబీర్‌దాస్ గడచినరాత్రి కమాల్ శిరమును తీసికొనిరాగా మొండెము అక్కడే వుండిపోయింది వ్యాపారి గ్రామస్థులనంతా ఒక్కచోటచేరి జరిగిన విషయమంతా వివరించాడు ఆ మొండెము ఎవరిదో గ్రామస్తులుకూడా గుర్తించలేకపోయారు వీధిలో ఒక స్తంభమునుపాతి ఈ మొండెమును దానికి కట్టారు తల్లిదండ్రులు తప్పక వస్తారని అభిప్రాయపడ్డారు

జ్ఞానదేవ నామదేవులు భక్త సమూహముతోగూడి సంకీర్తన చేయుచూ మొండెమును వ్రేలాడదీసియున్న దారిలోనే వెళ్ళవలసివచ్చింది వారు సమీపమునకురాగానే కమాల్ మతృదేహము రెండుచేతులు జోడించి

మహాత్ములకు నమస్కరించింది వారు గానంచేయుచున్న సంకీర్తనకు అనుగుణ్యముగా చేతులతో తాళము వేయుచున్నది

జ్ఞానదేవులు ఈ దృశ్యాన్నిచూపి స్తంభించిపోయారు నామదేవుల వారు నిశ్చేష్టులై నిలబడ్డారు భక్తులంతా దిగ్భ్రాంతి చెందారు జ్ఞానదేవుల వారు కబీరుదాస్‌ను పిలిచి "ఏమిటీ అద్భుతము మృతకళేబరము నమస్కరించుచున్నది సంకీర్తన కనుగుణ్యముగా కరతాళముచేయుచున్నది కబీర్! ఈ రహస్యమేమిటో నీకు తెలిసియుండాలి భక్తులకు నివేదించండి అని చెప్పారు

మిశ్రమ భావాలతో కబీర్‌దాస్ హృదయం కలతచెందియున్నది మేఘము నీటిని వర్షించచేయునట్లు తన నేత్రమేఘాలు కన్నీటి వర్షాన్ని కురిపించడానికి సిద్ధంగా ఉన్నాయి కబీర్‌దాస్ జ్ఞానదేవులవారికి చేతులెత్తి నమస్కరిస్తూ మహాత్మా! ఇతడెవరో విష్ణుభక్తుడై ఉండాలి మీ దర్శనానికి మీరు గానంచేయు సంకీర్తన నాలకించడానికి ఇంకా ప్రాణాన్ని నిల బెట్టుకొని యున్నాడు" అనగానే కంఠము గద్గదమై మూగపోయింది.

జ్ఞానదేవులవారు తన జ్ఞానదృష్టిద్వారా జరిగిన విషయమంతా గ్రహించారు భక్తకమాల్ ప్రహ్లాదునివంటి భాగవతోత్తముడని కొని యాడారు కబీర్‌దాస్ ధర్మపత్ని లోయిని పిలిచి కమాల్ శిరమును తీసు కొనిరమ్మని చెప్పారు జ్ఞానదేవులవారు ఆ మొండెమును క్రిందికిదించారు నామదేవులవారు పాండురంగ భగవానుని దివ్యనామమును గానముచేయు చుండగా జ్ఞానదేవులవారు కమాల్ శిరమును మొండెముపై వుంచారు కమాల్ సజీవుడయ్యాడు భక్త కమాల్ వెంటనే పరుగెత్తుతూవచ్చి జ్ఞాన దేవులవారికి నామదేవులవారికి భక్తమండలికి సాష్టాంగ దండప్రణామం ఆచరించాడు

జై జై పాండురంగ విఠలా!—అందుచేతనే నేమో "తస్మిన్ తజ్జనే భేదాభావాత్ భక్తులకు భగవంతునికి భేదాభేదని నారదమహర్షి ప్రవచించారు

దైవప్రభావాన్ని ప్రపంచానికిచాటి భక్తుల హృదయ మందారాలలో నామదీపాన్ని వెలిగించారు కబీర్‌దాస్ వృద్ధాప్యం సమీపించింది ఒకనాడు భక్తులందరూ గుమిగూడియుండగా రామనామాన్ని గానంచేస్తూ కబీర్ రామ చైతన్యంతో ఐక్యమయ్యారు

కబీర్‌దాసు మృతకళేబరానికి అంత్యక్రియలు నిర్వహించాలి కబీర్ ముస్లిం గనుక అతని దేహాన్ని పూడ్చిపెట్టాలంటారు మహమ్మదీయులు భక్తకబీర్ హిందువుగనుక అతని శరీరాన్ని దహనం చేయాలంటారు హిందువులు వాగ్వివాదాలు పెరిగాయి తన జీవితకాలమంతా ఏ సమస్య తలఎత్తిందో మృత్యుముఖంలో ప్రవేశించినపుడుకూడా అదే సమస్య రూపు దాల్చింది ఇంతలో అక్కడికి ఒక సాధువు వచ్చారు జరిగిన విషయ మంతా ఆలకించారు "సరే దీనికి పరిష్కారమొక్కటే ఈ శరీరాన్ని రెండు భాగాలుగా విభజించి మీరిరువురు తీసికొని మీఇష్టంవచ్చిన విధంగా శవసంస్కారం చేయండి అని పలుకుతూ ఆ సాధువు కబీర్ మృతదేహ మును సమీపించి ఆ మృత కళేబరముపై కప్పియున్న వస్త్రాన్ని తొల గించారు ఆశ్చర్యము కబీర్ మృతదేహము అచ్చట అదృశ్యమయింది బదులుగా తాజాపుష్పాలు కబీరు దేహరూపంలో నిండివున్నాయి పుష్పా లన్నీ ప్రోగుచేసి ఇరువురికి సమంగా పంపారు హిందువులు ఆ పుష్పా లను తీసుకొనివెళ్ళి దహనం చేశారు మహమ్మదీయులు తీసుకొనివెళ్ళి పూడ్చిపెట్టారు

కబీర్‌దాస్ పువ్వుగా జన్మించాడు వేదాంతపుష్పమై విజ్ఞాన సౌర భాన్ని విరజిమ్మాడు చివరకు మృతదేహంకూడా అదృశ్యంచేసి పూలే మిగిల్చి వెళ్ళాడు పుష్ప సౌందర్యముతో పుష్ప సందేశముతో పుష్ప జీవనాన్ని కలిగి తరించండని అమృత సందేశాన్ని అందించాడు

సంత్ కబీర్‌దాస్ మహరాజ్‌కీ జై !

కబీర్‌దాస్ ప్రబోధము ఒక నూతన పంథాలో నడిచింది బాహ్య ప్రదర్శనలను తాను నిరసించాడు అంతరంగిక స్వేచ్ఛను సౌందర్యాన్ని

ప్రతిపాదించాడు సనాతన ధర్మము బోధించే కర్మసిద్ధాంతమును పునర్జ న్మను మోక్షభావనను సన్యాస స్వీకారమును కబీర్ అంగీకరించారు

కర్మకాండను విగ్రహారాధనను వర్ణవ్యవస్థను కబీర్‌దాస్ నిరసించాడు తాను శాస్త్రప్రమాణాన్ని అంగీకరించలేదు అనుభవ ప్రబోధాన్నే అందించారు కబీర్‌దాస్ ఒక కీర్తనలో ఇలా గానం చేస్తారు

పుణ్యనదులలో స్నానమాచరించుటవలన ప్రయోజనములేదు!
నేను అందులో మునిగాను అవి నీళ్ళేనని తెలుసుకున్నాను!
ఆలయాలలో విగ్రహాలన్నీ నిర్జీవమైనవి అవి మాట్లాడలేవు
నేను ప్రతి ఆలయములో విగ్రహంముందు నిలబడి ప్రార్థించాను
విగ్రహము కేవలము స్థాణువేనని భావించాను।
శాస్త్రకన్యను తెర తొలగించి చూశాను
పురాణమంతా పలుకులేనని
కురానంతా పదకులుకేనని గ్రహించాను!

తన అనుభవ భూమికలోనుండి కబీర్ ప్రవచిస్తున్నాడు నమ్మండి తరించండి" అని గానం చేశాడు కబీర్‌దాస్

కబీర్‌దాస్ పైన గానం చేసిన కీర్తనవిని విగ్రహారాధన తప్పని పుణ్యతీర్థస్నానము అనుచితమని శాస్త్రావగాహన అనర్థమని భావన చేసినచో ఆయనపట్ల అతని సమకాలికులు ఎంత అన్యాయంగా ప్రవర్తించారో అంతకన్నా ఎక్కువగానే మనం అపార్థం చేసుకున్నామని అన్యాయంగా ప్రవర్తించామనే భావించాలి

అనాటి సాంఘిక ఆచారాన్ని కబీరు క్షుణ్ణంగా పరిశీలించాడు సద్గురువులమని అహంకార ఫలకాన్ని ధరించి శిష్యుల అజ్ఞానముపై స్వారిచేసి దేవుళ్ళమధ్య తేడాచూపించి కొన్ని ఆలయాలలోనే ప్రవేశించాలని కొన్ని ఆలయాలలో ప్రవేశించడంకూడా పాపమని ఆ దేవుని నామమును నామధేయముగా ధరించడముకూడా నరకమని ప్రబోధించే అయోమయ అప్రయోజక అనర్థపాండిత్య గురువుల అజ్ఞాన ప్రబోధాలను ఆలకించి

కబీరు కలతచెందాడు ప్రజావాహినిని అక్రమ మార్గాలలో నడిపే అవివేకుల ప్రలాపాన్ని తుదముట్టించాలని సంకల్పించాడు గ్రంధులను ఇనుప కుడ్యాలవలె ఏర్పరమకొని గ్రంధాలను వల్లించడములో అందలి సిద్ధాంతములను ఏకరువు పెట్టడములో కాలాన్నంతా వృధాచేసుకొనుచున్న మానవాళిని తన విజ్ఞాన ప్రబోధదండముతో భుజముతట్టి లేపారు

పోధీ పఢ్ పఢ్ జగము ఆ
పండిత హు ఆ న కోయ
ఢాయీ అక్షర్ ప్రేమకా పఢే
సో పండిత హోయ

గ్రంధ పరిశోధనలో కాలాన్నంతా వృధాచేసుకొని ఎందరో నశించి పోయారు ఎవరైతే రెండున్నర అక్షరాన్ని ( శ్రీరాం ) జపించారో వారే తరించారు

అని ప్రబోధించారు

భగవన్నామాన్ని ఆశ్రయించి తరించవచ్చని కబీరు ప్రగాఢ విశ్వాసము నామము భక్తుని భగవంతునిగా మార్చుతుందని కబీర్ అభిప్రాయము అనుభవము మనము అన్వేషించే ఆనందము వస్తుప్రపంచములో మృగ్యమని అంతర్యములోనే లభ్యమని ప్రబోధించారు

కస్తూరీ కుండలం బసే
మృగ ఢూంఢే బనమాహీం
ఐసే ఘటమేం పీవ్ హై
దునియాం జానే నాహీం

"కస్తూరి తననాభియందున్నదనే జ్ఞానములేక కస్తూరి మృగము అరణ్యమంతా అన్వేషించినట్లు భగవంతుడు హృదయమునందున్నాడనే విజ్ఞానము నశించి మానవులు బాహ్యంలో భగవంతుని అన్వేషిస్తున్నారు"

అని కబీర్ ప్రచారం చేసారు

కబీరుదాస్ సూచించినబాట ప్రవచించినమాట సత్యమునకు సమీపము సాక్షాత్కారమునకు సన్నిహితము బహిర్ముఖమయ్యే మనసును బాహ్యవస్తువులయందు లగ్నంచేసి సాధన కొనసాగించినచో అంతరంగిక అనుభవము లభించడం అతికష్టమని అభిప్రాయపడ్డారు నామోచ్చారణతో హృదయ కుహరంలో అణిగే ప్రక్రియనే తాను బోధించారు

ప్రియతమ కో పతియాఁ లిఖూఁ
జో కహూఁ హోయ బిదేస
తనమేఁ మనమేఁ నైనమేఁ
తాకో కహా సందేశ్

"ప్రియుడు పరదేశములో నున్నచో అతనికి నేను ఉత్తరము వ్రాయక తప్పదు అతడు నా శరీరములో మనసులో నయనాలలోనే వసించునపుడు అతనికి సందేశము పంపించ నవసరమేమున్నది? -

అని అంతర్యామియైన భగవానునిలో లయించే ఉత్తమ ప్రక్రియను తెలియచేశారు

అంతర్యంలో భగవంతుని దర్శించడంలో ఆలస్యం జరగకూడదని కబీర్ అభిప్రాయము మార్గము గమ్యము ఒకటై సమరసం కావాలనేదే అతని అభిమతం అందుచేతనే నామముద్వారా హృదయములో వెంటనే లయించమని తెలియచేశారు

నీవు జపమాల త్రిప్పునప్పుడు జరుగుచున్నదేమిటో తెలుసా? కాలచక్రము జపమాలతోపాటు తిరుగుచున్నది కాలం గతించిపోతున్నదే గాని హృదయసౌందర్యమును నీవు దర్శించలేక పోతున్నావు జపమాలను పారవేసి హృదయ జపమాలను త్రిప్పుటకు సిద్ధంకా నిన్ను నీవు తెలుసుకోగలవు" అని ప్రవచించారు

భక్త కబీర్‌దాస్

కబీర్ యొక్క జ్ఞానతృష్ణను హృదయావేదనను మనం పై సందేశము ననుసరించి గ్రహించవచ్చును Who is the meditator? Ask the question first There is no need to meditate ధ్యానించేవాడెవరు? ఆ విషయాన్ని మొదట ప్రశ్నించిచూడు తరువాత ధ్యానించవలసిన అవసరముండదు అనిన రమణ భగవానుని అడుగుజాడలు కబీరు ప్రవచనాలలో కనుపిస్తుంటాయి

మహాత్ములు నడచిన బాటే బాట వారు ప్రవచించిన మాటే మాట అదే తరించే మార్గం సందర్శించే యోగం

భక్త మండలికీ జై





# యోగా పరమానంద

పుట్టిన ప్రతివ్యక్తికి స్థూల, సూక్ష్మ, కారణ శరీరములుండునని శాస్త్ర ప్రవచనము. ఈ మూడు శరీరములేగాక నాల్గవ శరీరమైన భావ శరీరముకూడా ఒకటి కలదనియు, అది పరమభక్తులలోనే లభ్యమనియు చైతన్య మహాప్రభువు తెలియచేసి యున్నాడు. హృదయపరివర్తనమే భావశరీరము. భావశరీర జన్య[illegible] భక్తి దివ్య పారవశ్య సంజనిత మధురానుభూతియే భక్తికి లక్ష్యము. [illegible] ప్రేమయొక్క పరాకాష్ఠయే భక్తి. ప్రేమకు జాతి, కుల, [illegible]లేవు. ప్రేమకు రెండవ వస్తువు కనుపించదు ప్రేమతప్ప. ప్రేమ [illegible]గాయపరచదు. గాయపడదు. సంకుచిత మనసులలో ప్రేమ విలువలేక జారిపోతుంది. ప్రాపంచిక విషయవాసనలతో నిండిన అంతఃకరణలో ప్రేమరసం కారిపోతుంది.

భగవద్భక్తులు ప్రేమస్వరూపులు, త్యాగజీవులు. భగవంతునికి దూరమై ఒక్కక్షణంకూడా జీవించలేరు. భగవన్నామామృతాన్ని సదా పానంచేస్తూ ఆధాత్మిక మత్తులో ప్రపంచాన్ని మరచి జీవిస్తారు. లోక వాసనలు వారిలో కనుపించవు. లోక బాంధవ్యాలు వారిలో అగుపించవు. మహిమలు చూపరు, మాయలు చేయరు. వారిద్వారా ఎంతటి ఘనకార్యం

ష్టమని గ్రహించాడు వెంటనే లేచి తులసీదాస్ పాదాలపై పడ్డాడు క్షమా భిక్ష కోరాడు

తులసీదాసు నేత్రాలు తెరచిచూశాడు హనుమంతుడు విశ్వరూపం ధరించి దర్శనమిస్తున్నట్లు భావనస్ఫురించింది రామభక్తుడైన తనను హనుమంతుడు రక్షించికపోతే మరెవరు రక్షిస్తారు? తులసీదాస్ హృదయము ఆనందముతో పొంగిపోయింది నేత్రములు ధారాప్రవాహముగా ఆనంద భాష్పాలను కార్చాయి తులసీదాస్ హ ను మ ం తు ని కి నమస్కరించి

జయ హనుమాన జ్ఞానగుణసాగర
జయకపీశ తిహుంలోకవుజాగర

అని స్తుతిస్తూ గానము చేశాడు ఆ యమృతగానమే హనుమాన్ చాలీసా భారతదేశములో కొన్ని లక్షలమంది నిత్యపారాయణజేయు హనుమాన్ స్తుతి పాదుషా తులసీదాస్ పాదాలపైబడి అతడి బంధములను తొలగించెను వానర సమూహమంతయు అదృశ్యమయ్యెను తాను తరింపు మార్గమును బోధించమని పాదుషా తులసీదాస్‌ను శరణుజొచ్చెను సకల భూతములందు రామచంద్రుని దర్శించు తులసీదాస్ పాదుషాపై ఇసుమంతైనను ద్వేషభావంలేక తన అమృత సందేశమును గానము చేసెను

రామరామ జపు జియ సదా సానురాగరె
కలిన బిరార జోగ జాగ తపత్యాగరే ॥రామ॥

రామ నామ మహామని ఫని జగ జాలరే
మని లియే ఫనిజియై బ్యాకుల బిహాలరే ॥రామ

రామ నామ ప్రేమ పరమారథ కో సారరే
రామ నామ తులసీకో జీవన ఆధార రే ॥రామ

ఓ మానవుడా సదా ప్రేమాతిశయముతో రామనామమును జపించుము కలియుగమున అదియే ఉత్తమోత్తమ సాధనము వైరాగ్య యోగ యాగ తప దానాదులకన్నను రామజపమే ఉత్కృష్టము రామనామము మణిలాంటిది జగత్తు సర్పమువంటిది మణిని

గ్రహించినచో సర్పము కలతచెంది నశింమను అలాగే రామనామ మను మణిని గ్రహించినచో జగత్తను సర్వము మాయమగును రామనామమే ప్రేమసాగరము రామనామమే పరమార్థస్వరూపము రామనామమే తులసీదాసునకు జీవనాధారము

అని కీర్తనద్వారా బోధించిన తన కుటీరమున కేగెను

కాశీక్షేత్రములో ప్రియదాసను పండితుడుండెను అతడు భక్తుల చరిత్రలనుగూర్చి భక్తవిజయమను గ్రంథమును రచించెను దానిని ప్రతి దినము సాయంత్రము ఒక ఆలయములో కూర్చుండి భక్తులకు వినిపింమ చుండెడివాడు ఇలా జరుగుచుండగా ఒకనాడు ప్రియదాసు గ్రంథమును చదువుట కుపక్రమించగా ఆ గ్రంథము మధ్యలో తులసీదాసు మహనీయుని చరిత్రము వ్రాయబడి యుండెను ప్రియదాసు ఆశ్చర్యపడెను తాను తులసీదాసు చరిత్ర వ్రాయలేదు అలాంటప్పుడు గ్రంథమధ్యమున ఆ చరిత్ర ఎలావచ్చింది? దానిని రచించినదెవరు? ఈ వైభవమును ఊహించు టకు ఎక్కువకాలము పట్టలేదు రాముని చరిత్రమును రామచరిత మాన సమను పేర తులసీదాసు రచించుచుండ తులసీదాసు చరిత్రమును శ్రీరామ చంద్రుడే రచించి ప్రియదాసు గ్రంథములో చేర్చినాడు భక్తులనిన భగ వానుని కెంత ప్రీతియో ఈ సంఘటనద్వారా తేటతెల్లమగుచున్నది

ఈ అద్భుత మహిమనుగాంచి అచ్చెరువంది ప్రియదాసుడు భక్త జనులతోగూడి తులసీదాసు దగ్గరకేతెంచెను తులసీ పాదాలపైబడి జరిగిన వృత్తాంతమంతయూ ప్రియదాసుడు వివరించెను తులసీ ప్రియదాసుని కౌగి లించుకొని రామకృపనుగాంచి పరవశుడై కన్నీరుగార్చెను రామచంద్రుని ప్రేమ యలాంటిదని రామనామముపై విశ్వాసముంచి తరించుమని తెలియ జేసెను

ఐసో శ్రీ రఘువీర భరోసో

మీరాకే మారన కే కారన పతియా జహార ఖరోసా
రామనామ అమృతభయ తాకో హాంసిహాంసి పానకరోసో



# రోహిదాసు

నిప్పు కనుపించలేదు. పొగ కనుపించింది. విద్యుచ్ఛక్తి అగుపించ లేదు వెలుతురు అగుపించింది. గాయకుడు గోచరము కాలేదు. గానము వినిపిస్తున్నది. మానవుని జీవితము అర్థమవుతుంది. ఆ జీవితము వెనుక గాఢంగా పెనవేసికొనియున్న కారణ సంఘాతము అర్థంకాదు.

పండితుని కుమారుడు శుద్ధపామరుడు. వికారుని పుత్రిక సర్వాంగ సుందరి. వాచాలుని బిడ్డ మూగవాడు. మూగవాని సంతానము వక్తృత్వానికి మారు పేరు.

శైశవదశలోనే కొందరు జ్ఞానవంతులు. వృద్ధాప్యములో కూడా ఎందరో మూర్ఖులు. మంచిగా బ్రతకాలని ప్రయత్నించి ఓడిపోయినవారు కొందరు. మంచిగా జీవించినవారు కొందరు. వంచనకు తలవంచినవారు ఇంకను కొందరు.

ఆలోచించేవానికి అనూహ్యమంటూ ఒకటుండదు. ఆలోచనారహితునకు ఉన్నదంతా అయోమయమే. నేటి మన జీవితం మనకు తెలుసు. గత జన్మల గాథలు తెవియవు. భవిష్యత్తులో జరిగే పరిణామాలు ఊహాకందవు

గతము ననుసరించి నడుస్తున్నది వర్తమానము వర్తమానము ననుసరించి నడిచేది భవిష్యత్తు నేటి జీవితమునకు గతం కారణమైనప్పుడు నేటి మన జీవనరీతి ననుసరించి గతంలో ఎలా చరించామో గ్రహించవచ్చు వర్తమానము ననుసరించే భవిష్యత్తు రూపొందించబడుతుంది కనుక నేటి మన ప్రవర్తన ననుసరించి భవిష్యత్తులో ఎలా నడుస్తామో ఊహించవచ్చు

గతం అందించిన పరిస్థితి మన అందుబాటులో లేదు వర్తమానం తీర్చిదిద్దే ప్రవర్తన మన అధీనంలో ఉంటుంది ప్రవర్తనను అందుబాటులో ఉంచుకొని వర్తమానంలో నడువగలిగితే భవిష్యత్తు అత్యుత్తమముగా తీర్చ బడుతుంది

ఇలా ఎందరికి సాధ్యం? ప్రయత్నించినవారికి అసాధ్యమంటూ ఉండదు ప్రయత్నమే ప్రారంభించనివ్యక్తి సాధించేదంటూ ఉండదు ప్రయత్నశీలురు ఫలితార్థులు ముఖ్యంగా ఆధ్యాత్మికరంగంలో వ్యక్తి చేయు సాధన ఇసుమంతైనా వృథాపోదు జీవితాంతము సత్వగుణముతో మెలిగి కఠోరసాధన ననుసరించి అనివార్యకారణాలవల్ల మరణించినచో ఆ వ్యక్తి మరుజన్మ ప్రారంభములోనే మహాత్ముడుగా కదులుతాడు మధుర జీవనాన్ని గడుపుతాడు అలాంటి వ్యక్తులు ఎక్కడో అరుదుగా అగుపిస్తారు జ్ఞాన దేవ్ కబీర్ కాన్హోపాత్ర ప్రహ్లాద సమర్థరామదాస్ పుట్టుకతోనే జ్ఞాను లుగా ఆవిర్భవించినవారు అట్టి పవిత్రాత్ముల కోవకు చెందిన పరమ భాగవ తోత్తముడు భక్త రోహిదాసు

పరమ పవిత్రమైన కాశీక్షేత్రములో రఘు అనే వ్యక్తి వుండేవాడు అతడు కులవృత్తిననుసరించి చెప్పులుకుట్టేవాడు రాత్రులందు రాజుగారి ఆస్థానములో కాపలాదారుగాకూడా ఉండేవాడు చాలాకాలంగా అతనికి సంతానములేదు పుత్రసంతానము ననుగ్రహించమని భగవానుని ధ్యాని స్తుండేవాడు భగవత్ప్రసాదంగా అతనికొక పుత్రుడు జన్మించాడు అతనికి రోహిదాసని నామ కరణం చేశాడు

పుట్టినది మొదలుకొని కుర్రవాడు విలపించలేదు సదా ప్రశాంత వద నుడై కనపించేవాడు పానీయములనుకూడా త్రాగడంలేదు ఇతని ప్రవ ర్తన కుటుంబములోని వారినేగాక నగరవాసులందరినికూడా ఆశ్చర్యచకి తుల్ని చేసింది ఊరిప్రజలంతావచ్చి చూసేవారు బ్రహ్మజ్ఞాన కాంతులీను ఆ బాలుని ముఖసరోజమునుచూసి ఇతడు మహాజ్ఞానివలె కన్పట్టుచున్నాడు యోగభ్రష్టుడై ఇలా జీవించాడేమో అని చెప్పుకొనేవారు

ఒకనాడు ఈ వింతవార్త విని రాజకొలువులోనున్న నర్తకి రోహి దాసుని చూడటానికి వస్తుంది ప్రసన్నవదనుడై ఊయలలో పడుకోను న్నాడు నర్తకి రోహిదాసును సమీపించి చూసింది ఆ బాలునిలో గోచ రించే ఆధ్యాత్మిక సౌందర్యమునుచూసి ఆశ్చర్యపోయింది ఎంతటి బ్రహ్మ వర్చస్సు గత జన్మలో మీరు గొప్ప సాధుకులై ఉండాలి ఎనాటి బంధమో! ఇక్కడ జన్మించారు జన్మరహస్యము తెలియ నెవరితరము! మహాత్మ ఎవరు మీరు " అని అప్రయత్నంగా అన్నది రాజనర్తకి

వెంటనే ఊయలలో పడుకొని వీక్షిస్తున్న రోహిదాసు నవ్వుతూ ఒకనాడు గురుఆజ్ఞానుసారము నీ ఇంట నైవేద్యమునకు వలయు వస్తు సామాగ్రిని నిరాకరించిన బ్రాహ్మణ యువకుడను గురుశాపవశాత్తు ఈ ఇంటిలో కడతేరుటకు రోహిదాసుగా జన్మించినాడను అనెను

నర్తకి మనసులో ఆలోచన సుడిగుండం ప్రారంభమైంది అవును తనకింకా జ్ఞాపకముంది ఇటీవలనే కొన్ని సంవత్సరాల క్రితం జరిగిన సంఘటన ఇది ఒక జన్మలోని సమకాలికులంతా బ్రతికివుండగా ఇతడు బాల్యముననే మరణించి ఈ ఇంటిలో మరల జన్మించాడు

కాశీక్షేత్రంలో భాగవతోత్తముడైన రామానందస్వామి ఉండేవాడు. వారివద్ద అనేకమంది శిష్యులుండేవారు ఒకనాడు శిష్యులలో ఒకరిని పిలిచి భగవానునకు నైవేద్యమును సమర్పించుటకు వస్తుసామాగ్రిని ఒక గృహ స్థుని వద్దనుండి అడిగితెమ్మని చెప్పాడు అయితే ఒక షరతు ఆ గృహ స్థుడు భక్తుడై వుండాలి శీలవంతుడై వుండాలి ఉత్తమమార్గంలో జీవన యాత్ర చేసేవాడుగా వుండాలి అని చెప్పారు రామానందస్వామి

శిష్యుడు బయలుదేరాడు ఒక ఇంటిముందు నిలబడ్డాడు తన అభీష్టము తెల్లియచేశాడు ఆ ఇంటిలోనుండి ఒక స్త్రీ కావలసిన వస్తువులన్నీ ఒక ఎశ్ళెములో ఉంచుకొని తెచ్చింది గురువుగారి షరతులు జ్ఞాపకిమొచ్చాయా బ్రహ్మచారికి "మీరేవిటి? అని ప్రశ్నించాడు నేను రాజనర్తకిని అని సమాధానం చెప్పింది ఎందుకో బ్రహ్మచారి మనసు వాటిని గ్రహించుటకు అంగీకరించలేదు వద్దనిచెప్పి వెళ్ళాడు

ఇంతలో వర్షం ప్రారంభమైంది గాలి జోరుగా వీస్తున్నది కుండపోతగా వర్షం కురుస్తున్నది ఒక ఇంటిముందు పంచలో బ్రహ్మచారి తలదాచుకున్నాడు ఇంటి యజమానివచ్చి చూశాడు ఆ బ్రహ్మచారినిగూర్చి వివరాలడిగి తెలుకొన్నాడు తనవద్ద ఆ వస్తుసామాగ్రిని గ్రహించి తన బ్రతుకును చరితార్థం చేయమని ప్రార్థించాడు వర్షం తీవ్రంగా కురుస్తున్నది ఇంతకన్నా మరోమార్గం కనుపించడములేదు ఆ యింటి యజమాని చెప్పులుకుట్టి జీవించే మాదిగ కులమునకు చెందినవాడు అయిననూ చేయగలిందేమీలేక అతనివద్దనుండి సంభావన గ్రహించాడు అది తీసుకొని గురువుగారివద్దకు చేరాడు త్రికాలవేదితుడైన రామానందస్వామి జ్ఞానదృష్టితో సమస్తమూ గ్రహించాడు

వత్సా! నా ఆజ్ఞకు వ్యతిరేకముగా వర్తించావు సీచవృత్తిలో జీవించే మాదిగవాని ఇంట సంభావనతెచ్చి అపవిత్రంచేయ సంకల్పించావు నీవు దీనికి పరిహారంగా మాదిగవాని ఇంటనే జన్మించగలవు" అని శపించాడు

అశ్రుపూరిత నయనాలతో బ్రహ్మచారి గురువుగారి పాదాలకు నమస్కరిస్తూ "మహాత్మా మోక్షధామం చేరాలని మీ పాదాల నాశ్రయించాను చివరకు నా బ్రతుకిలా నరకతుల్యమైంది అంటూ బోరునా ఏడుస్తాడు

రామానందుడు బ్రహ్మచారిని ఓదార్చుతూ నాయనా! దిగులు చెందకు ఇందునేను నిమిత్తమాత్రుడను ఇదంతా భగవత్సంకల్పమైన

పాండురంగదేవుని దివ్యసంకల్పము నీకిది చివరి జన్మ మోక్షధామమును చేర్చుటలో అది కడపటి సోపానము భక్తికి జాతి వర్ణ లింగభేదాలు లేవని నీ జీవితముద్వారా ప్రపంచానికి తెలియచేయాలని భగవానుడు అభిప్రాయపడ్డాడు ఇప్పుడు జరిగినదంతయు కాకతాళీయన్యాయమే నని తెలియచేయగా గురుకృపకు పులకాంకితుడైన బ్రహ్మచారి రామానందుని పాదాలపైపడి తన కన్నీటితో గురుపాదాల నభిషేకం చేస్తాడు

తరువాత కొంతకాలానికి బ్రహ్మచారి గతిస్తాడు అతడే తను సంభావన గ్రహించిన రఘు అనే మాదిగవాని ఇంట రోహిదాసుగా జన్మిస్తాడు ఈనాడు తనను దర్శించడానికి వచ్చిన నర్తకి ఎవరోకాదు గత జన్మలో తాను సంభావనను గ్రహించుటకు నిరాకరించినది ఈ నర్తకివద్దనే

తన గతజన్మ వివరాన్ని తెలియజేయగానే రాజనర్తకి దిగ్భ్రాంతి చెందింది రోహిదాసుకు నమస్కరించి మహాపురుషా మీరు జ్ఞానస్వరూపులు మీకు తెలియనిదిలేదు మీకు మేము చెప్పకల్గిందిలేదు మీరు ఆహార పానీయములను విసర్జించుట యుక్తముకాదు అలా చేయుటవలన మీరుకాని దేహాన్ని మీరు శుష్కింపచేయుచున్నారు ఈ శరీరము భగవానునిది ఈ దేహాన్ని పనిముట్టుగా స్వీకరించి భగవానుడు తాను చేయదలచిన కర్యముని నిర్వహించాలి మీరునిరాహారంగాజీవించి శరీరమును శుష్కింప చేయుచు భగవానుని దివ్యసంకల్పానికి అవరోధము కల్పించిన వారగుచున్నారు అని రాజనర్తకి చెబుతుంది

నర్తకి ప్రబోధము బాలుడైన రోహిదాసులో చక్కటి పరిణామం తెచ్చింది అప్పటినుండి తాను ఆహారమును గ్రహించుటకు అంగీకరించాడు తల్లిదండ్రులు ఆనందభరితులయ్యారు

రోహిదాసు దినదిన ప్రవర్ధమానుడగుచున్నాడు కానీ అతని వ్యక్తిత్వము ప్రవర్తన ఎవరికీ అంతుపట్టని రహస్యాలుగా మిగిలాయి ఎవరితోను మాట్లాడడు ఏపని చేయడు తండ్రికి వృద్ధాప్యం సమీపిస్తున్నది కుమారుడైన రోహిదాసును తన కులవృత్తిలోవుంచి తాను విశ్రాంతి తీసు

కోవాలనుకుంటాడు తండ్రి కానీ రోహిదాసు మనసు అందుకు భిన్నంగా ఉంది జంతువుల చర్మాలతో చెప్పులుకుట్టడం తనచేత కావడంలేదు జీవ కారుణ్యంతో హృదయం కంపించిపోసాగింది ఎపనీ చేయక నిరంతరము ఒంటరిగా మసలుతున్న రోహిదాసు ప్రవర్తన తండ్రిని ఆవేదనకు గురి చేసింది

ఒకనాడు రామానందస్వామి తన ఇంటిముందు నడుస్తుంటాడు రోహిదాసు తండ్రి రఘు చూస్తాడు వెంటనే వెళ్ళి రామానందస్వామి పాదాలపై పడి నమస్కరించాడు మహాత్మా! నాకు రోహిదాసనే ఏకైక పుత్రుడున్నాడు అతనికి యుక్తవయస్సు సమీపిస్తున్నది అయిననూ ఉదాసీనంగావుంటూ ఏ పనియందు ఆసక్తి చూపక నిరర్థకంగా కాలాన్ని హరింపచేస్తున్నాడు వృద్ధులమైన మాకు అతడొక్కడే ఆధారము తమ కరుణావీక్షణములతో అతనిని మార్గం మళ్ళించి క్రియాశీలుడగునట్లు అను గ్రహించవలసింది అని రామానందుని ప్రార్థిస్తాడు

రఘు ప్రార్థనవిన్న రామానందస్వామి మనసు ద్రవించింది రఘు ఇంటివైపు నడిచాడు రోహిదాసును చూశాడు రోహిదాసు ఎవరోకాదు తన శిష్యుడేనని తొలిచూపులోనే గ్రహించాడు రామానందస్వామి "వత్సా! ఏం చేస్తున్నావు? అని ప్రశ్నించాడు రామానందస్వామి, తన గురువైన రామానందస్వామి ఇంకా జీవించేవున్నారని రోహిదాసు హృదయం పొంగి పోయింది గురుదేవా! రా మ నా మా మృ తా న్ని పానంచేస్తున్నాను అన్నాడు ఇకమీదట ఏమిచేయదలచుకొన్నావు?" అని ప్రశ్నించాడు రామానందస్వామి మీ ఆజ్ఞ కొరకే వేచియున్నాను తమరెలా జీవించ మంటే అలా జీవించడానికి సిద్ధంగా ఉన్నాను అన్నాడు రోహిదాస్

"రోహిదాసా నీ తల్లిదండ్రులు చేయమన్న పనిని నిస్సంకోచ ముగా ఆచరించు కులవృత్తి ఎంత అధమమైనదైనను దానిని ఆచరించు టలో దోషములేదు హృదయంలో రామరూపాన్ని ప్రతిష్టించుకొని నాలు కపై రామానామము కదులుచుండ కరచరణాదులతో నియమితమైన కర్మల నాచరిస్తూ తరించు అని రామానందస్వామి ఉపదేశించి వెళ్ళారు

ఆనాటినుండి రోహిదాసులో మానసికంగా మార్పువచ్చింది తండ్రికి విశ్రాంతినిచ్చాడు తాను తండ్రిగారి కులవృత్తిని చేపట్టాడు నిత్యము రామ నామాన్ని ఉచ్చరిస్తూ చెప్పులుకుట్టేవాడు వైష్ణవులకు ఉచితంగా పాదరక్షలు కుట్టి సమర్పించుకొనేవాడు రోహిదాసుకో వచ్చిన పరిణామానికి తల్లిదండ్రులు అమితానందమొందారు

ఒకనాడు తన తండ్రియైన రఘుకు అనారోగ్యం కలిగింది రాజ భవనంలో రాత్రి కాపలా వెళ్ళలేక తన కుమారుడైన రోహిదాసును వెళ్ళ మని ఆజ్ఞాపించాడు తండ్రి ఆజ్ఞను శిరసావహించి రోహిదాసు రాజభవన కాపలాదారుగా వెళ్ళాడు అర్ధరాత్రయింది రామనామామృతపాన చిత్తుడైన రో హి దా సు ను తమోగుణజనిత నిద్ర దరిచేరదు భగవానునిగూర్చి స్తోత్రము చేయసాగాడు అర్ధరాత్రి నిశ్శబ్ద సమయంలో తాను పరవశించి స్తోత్రము చేయడము రాణీగారికి నిద్రాభంగమైంది ఆ విషయమై రాజు గారికి ఫిర్యాదు చేయబడం జరిగింది రాజుగారు రోహిదాసును పిలిపించి విచారించారు తాను నిద్రాభంగం చేయాలని ప్రయత్నపూర్వకంగా భావించి చేయందికాదని తన పారవశ్య భ క్తి త న్మ య త లో అప్రయత్నంగా స్తోత్రాలు చేయడం జరిగిందని రోహిదాసు రాజుగారికి తెలుపుతూ తన తప్పిదమునకు క్షమించవలసిందని రాజుగారిని కోరుతాడు రోహిదాసు విన మ్రతా వచనములకు రాజుగారి మనసు శాంతిస్తుంది రాత్రి కీర్తించిన స్తోత్రములను మళ్ళీ గానం చేయమని రాజుగారుకోరగా రోహిదాసు స్తోత్ర ములను పఠించి వాటి భావంకూడా తెలియచేస్తాడు రోహిదాసు ప్రజ్ఞా విశే షములకు రాజుగారికి సంతృప్తి కలుగుతుంది

అధమకులములో జన్మించిన రోహిదాసు ఇంతటి విజ్ఞానము ఎలా కలిగిందాయని రాజు విస్మయమొందుతాడు "రోహిదాసా! నీలో ఇంతటి జ్ఞానము ఎలా ఉదయించింది? అని రాజు ప్రశ్నిస్తాడు

రోహిదాసు నమస్కరిస్తూ ప్రభూ నాకేమీ తెలియదు నిరంత రము భగవన్నామస్మరణతప్ప మరియొకటి నేనెరుగను నామమహిమ వర్ణ నాతీతము నామము మృతముకాదు నామము నుచ్చరించుకొలది ఆనందము

పెరగడమేగాని తరగడమంటూ వుండదు  అంటూ  తన హృదయ పారవశ్యంలో చక్కటి కీర్తన గానం చేసాడు

అబకై సేధున్నైై నామ రటురాగీ  ॥అబకై సే॥

ప్రభుజీ తుమ చందన హామపానీ
జాకీ అంగ అంగ శాస సమానీ

ప్రభుజీ తుమఘున—బనహామ మోరా
జైసే చితవత చందచకోరా  ॥అబ॥

ప్రభుజీ తుమదీపక హామబాతీ
జకీ జోతీ బరై దిన రాతీ  ॥అబ॥

ప్రభుజీ తుమమోంతీ హామ ధాగా
జైసే సో నహిం మిలతనుహాగా  ॥అబ॥

ప్రభుజీ తుమస్వామి హామదాసా
ఐసీ భక్తికరై రోహిందాస  ॥అబ॥

"భగవన్నామమునందు ప్రీతిజనింపవలెనేకానీ  జనించిన ప్రీతి నశించదు ఓ ప్రభూ  నీవు చందనమువంటివాడవు  మేము జలము లాంటి వారము  మమ్ములను నీవే సుగంధముతో నింపుచున్నావు ప్రభూ! నీవు మేఘమువంటివాడవు  మేము నిన్నుచూపి నర్తింప నెమళ్ళము  నీవు చంద్రునివంటివాడవు  మేము చకోరములవంటి వారము

ప్రభూ! నీవు దీపమువంటివాడవు  మేము వత్తివంటివారము  నీ వెలుగుచే మేము రాత్రింబవళ్ళు ప్రకాశిస్తాము
ప్రభూ! నీవు ముత్యమువంటివాడవు  మేము  దాని నంటియున్న దారమువంటివారము  బంగారుకు పరిమళమబ్బినట్లు నీవలననే మా కొక విలువ ఏర్పడుచున్నది

ప్రేమా నీవు స్వామివి మేము నీ దాసులము రోహిదాసుయొక్క
భక్తి ఇదే

అని అమృతగానంచేశాడు రోహిదాసు భక్తికిమెచ్చి రాజుగారు సంభావన లిచ్చి సత్కరించారు

ఒకనాడొక బ్రాహ్మణుడు రోహిదాసుయొక్క గొప్పతనమును విని అతనిని పరీక్షించిచూడవలెనని అసూయతో రోహిదాసు ఇంటికి వస్తాడు అదే సమయానికి రోహిదాసు పూజామందిరములో కూర్చొని పూజచేస్తుంటాడు రోహిదాసు పూజావిధానమును వీక్షించవలయునని బ్రాహ్మణుడు సంకల్పించి ఇంటి కిటికీగుండా లోనికి చూస్తాడు రోహిదాసు చర్మముతో తయారుచేసిన ప్రతిమను పూజచేయడం చూస్తాడు వెంటనే లోనికివెళ్ళి ఓయీ! రోహా! జన్మతః నీకు సంక్రమించిన నీచవృత్తిని వదలలేక పోతున్నావు పరమ పవిత్రుడైన భగవానుని చర్మప్రతిమగాచేసి పూజింతు ఓయీ? ఛీ ఛీ అపచారము నీవు పాపము చేయుచున్నావు అన్నాడు

రోహిదాసు బ్రాహ్మణునికి నమస్కరిస్తూ విప్రోత్తమా! మీరు సర్వజ్ఞులు తమకు తెలియనిదంటూలేదు చర్మమెలా నీచమైంది? పూజ చేయువానిపై కప్పబడియున్నదికూడా చర్మమేకదా జింక చర్మమునే ఆసనముగా వేసుకొని జపధ్యానాదు లాచరించుచున్నాముకదా! భగవత్సంకీర్తనాదులలో ఉపయోగించే మృదంగము చర్మముతో చేసినదేకదా! చర్మముతో చేసిన మృదంగమును చర్మపుచేయి ప్రయోగించగా చర్మపుచెవి వినుచున్నది అలాంటప్పుడు చర్మము ఎలా నీచమైంది? భగవంతుని చర్మప్రతిమగా పూజించడం ఎలా పాపమైంది? పోనీ వేదేసే పూజావిధానము శాస్త్ర సమ్మతము కానిచో మీరు తెలియచేయండి ఇకమీదట ఆ విధంగా ఆచరిస్తాను అని అడుగుతాడు

బ్రాహ్మణుడు రోహిదాసు మాటలకు కోపోద్రిక్తుడవుతాడు ఓయీ! భ్రష్టమానవా! నీ వ్యర్థప్రసంగములను ఆపు నీచకులజుడవైన నీకు ఉత్తమ కులస్థుడనైన నేను పూజ నేర్పుటయా! నీకా అర్హతలేదు ఉప

నయన సంస్కారములేని నీ జాతికి అలాంటి అవకాశములేదు అని బ్రాహ్మణుడు మండిపడతాడు

ద్విజోత్తమా జన్మతో అందరూ శూద్రులుగానే జన్మిస్తారు కర్మ చేత విప్రులవుతారు కర్మభ్రష్టులైన విప్రులు శూద్రులుకారా? అలాంటప్పుడు అంతఃకరణ శుద్ధిగల శూద్రునకు బ్రాహ్మణత్వమెందుకురాదు? మహాత్మా ఇవన్నీ ఆనర్థావేశంతో దురవగాహన్ధతో మనం ఏర్పరచుకున్న సంకుచిత కుడ్యాలు భగవానుని దృష్టిలో అందరూ సమానమే నాకు ఉపనయన సంస్కారము భగవంతుడేచేసి ఈ జన్మకు పంపించాడు అని నమ్రతతో చెబుతాడు రోహిదాసు

నీ వాచావేదాంతానికొక హద్దున్నట్లు కనుపించడంలేదు అసత్యా నికి మారుపేరులా కన్పట్టుచున్నావు ఉపనయనము జరిగిందని బొంకు తున్నావు ఉపనయనము జరిగినట్టయితే యజ్ఞోపవీతమేది? అదికూడా ఉన్న ట్లేనా? బహుశా మాకంటికి కనబడనివిధంగా ఉన్నదా? అవునులే భగవం తుడు ఉపనయనం చేశాడుకదూ? అందుచేత యజ్ఞోపవీతము మాకు ఎలా గోచరమవుతుంది? అని చమత్కరిస్తాడు

వెంటనే రో హి దా సు నాకు యజ్ఞోపవీతముకూడా ఉన్నది చూడండి అంటూ హృదయాన్ని చీల్చి లోపల యజ్ఞోపవీతమును చూపు తాడు బ్రాహ్మణుడు ఆశ్చర్యపడి తన పొరపాటును గ్రహించి భక్తులు జాతి కుల మతభేదాలకు అతీతులని భావించి రోహిదాసు పాదాలపై పడి క్షమాభిక్ష కోరుతాడు

రోహిదాసుకి వివాహమైంది పిల్లలు కలిగారు రోహిదాసు తల్లి దండ్రులు మరణించారు రోహిదాస్కు దారిద్ర్యంతో పోరాడవలసివచ్చింది హృదయంలో రామనామాన్ని ధరించి సదా రామనామస్మరణచేస్తూ సంతృ ప్తితో జీవిస్తుంటాడు ఒకనాడు భగవానుడు సాధురూపంలోవచ్చి దర్శన మిస్తాడు రోహిదాసుచేయు భక్తికి తృప్తిచెంది స్పర్శవేదిని బహూకరిస్తాడు రోహిదాసా! ఇది స్పర్శవేది దీనితో ఏ లోహపు వస్తువును స్పృశించి నను అది బంగారంగా మారుతుంది నీమీదున్న ప్రత్యేక ప్రేమతో దీనిని

సిద్ధిస్తున్నాను జాగ్రత్తగా ఉంచుకోవలసింది అని చెబుతాడు రోహి దాసు పనిలో నిమగ్నమైయుండుటచేత మహాత్మా! నేను పనిలోవున్నాను ఆ గూటిలో ఉంచండి అని చెబుతాడు భగవానుడు గూటిలో పరుసవేది నుంచి వెళ్తాడు

కొంతకాలమైన తర్వాత సాధువు మళ్ళీ తిరిగివచ్చి రోహిదాసా నేనిచ్చిన స్పర్శవేది ఎమైనది? అని అడుగుతాడు స్వామీ మీరు ఉంచిన చోటనేఉంది చూడండి అని రోహిదాసు చెబుతాడు సాధువు చూడగా అది అక్కడేఉంది రోహిదాసా! నీవు ఈ స్పర్శవేదిని ఉపయోగించ లేదా? అని సాధువు అడుగుతాడు మహాత్మా క్షమించండి అలాంటి విషయాలలో నాకు ఆసక్తి వుండదు మానవజీవితము మూడునాళ్ళ భోగ భాగ్యాలతో తులతూగాలని సిరిసంపదలతో వెలిగిపోవాలని భావించడం అజ్ఞానముకాదా? తరగని సుఖము చెదరని ఆనందము భగవన్నామమునందే యున్నవి నా జీవితములో ఒక్క క్షణమైనను వృధాపోకుండా నిరంతరము భగవానుని పూజ్యచరణారవిందములయందు మనసు లగ్నమగునట్లు ఆశీ ర్వదించండి అని రోహిదాసు ప్రార్థిస్తాడు రోహిదాసు భక్తికి సాధువు సంతృప్తిచెంది ఒక సాలగ్రామమును ఇచ్చి దానిని పూజించి తరించమని చెప్పి తన నిజరూపమగు శంఖు చక్ర గదా పద్మములతో దర్శనమిచ్చి అంతర్ధానమవుతాడు

రోహిదాసు సూర్యోదయాత్పూర్వమే గంగానదిలో స్నాన మాచ రించి సాలగ్రామమునకు పూజచేసేవాడు పూజపూర్తి కాగానే ఒక బంగారు నాణెము సాలగ్రామముముందు కనుపించేది రోహిదాసు భగవత్ప్రసాద ముగా భావిస్తూ దానిని విక్రయించి ఆ వచ్చినడబ్బుతో పేదలకు అన్న సంతర్పణ వస్త్రదానము చేసేవాడు ఇలా నిత్యాన్నదానశాంతులతో రోహి దాసు తన జన్మను సార్థకం చేసుకున్నాడు

రోహిదాసువద్ద ఒక సాలగ్రామము ఉన్నదనియు అది ప్రతినిత్యము ఒక బంగారునాణెమును ఇచ్చుచున్నదనియు దానివలన అన్నవస్త్ర దానా

దులుచేసి ప్రజలలో కీర్తిప్రతిష్టలు సంపాదింప మన్నాడనియు రాజుకు తెలియచేస్తారు మంచిని చూడలేని కర్కశ మానవులు

రాజు రోహిదాసును పిలిపిస్తాడు తాను పూజచేయు సాలగ్రామ మును రాజమందిరమునకు చేర్చమని చెబుతాడు తనకు భగవంతుడు స్వయంగా ఆ సాలగ్రామమును అనుగ్రహించాడనియు అది తనకు ప్రాణ సమానమైనదనియు ఆ పవిత్ర సాలగ్రామమును తనకు దూరంచేయవద్దని రోహిదాసు రాజుగారిని ఎంతగానో ప్రార్థిస్తాడు రాజు ఆగ్రహించెంది బల వంతముగా రోహిదాసు ఇంటిలోని సాలగ్రామమును తీసుకొనిరమ్మని ఆజ్ఞా పిస్తాడు భటులు రోహిదాసు గృహానికివెళ్ళి రోహిదాసు పూజామందిరంలో వున్న సాలగ్రామమును తీసుకొనివస్తారు రాజు తన పూజామందిరంలో వుంచుకుంటాడు రోహిదాసు పరితపిస్తూ రామా! సాలగ్రామమును నాకు దూరంచేయగలరేమోగాని నిన్ను నా హృదయమునుండి దూరంచేయగలరా? అది ఎవరితరముకాదు అని భావిస్తూ ఇల్లు చేరుతాడు

మరునాడు రాజుగారు పూజామందిరానికి వెళ్తారు సాలగ్రామము పెట్టినచోట లేదు రోహిదాసు మరునాడు పూజమందిరానికివెళ్ళిచూచు సరికి సాలగ్రామము యధాప్రకారం దర్శనమిచ్చింది జై జై భక్తవత్సల భగవాన్‌కీ

రాజు తనతప్పిదమును గుర్తించి రోహిదాసును క్షమాభిక్ష కోరుతాడు భగవంతుడికి భక్తుడికి అడ్డునిలిచేవారెవరున్నారు? అందుచేతనే హైందవా లయాలలో భక్తునికి విశిష్టస్థానం ఇవ్వబడింది గర్భాలయంలో స్వామికి ఎదుట భక్తుని విగ్రహము వుంటుంది రామ విగ్రహము ఉన్నచోట ఎదు రుగా ఆంజనేయస్వామి శివసన్నిధిలో నందీశ్వరుడు విష్ణుసన్నిధిలో గరు త్మంతుడు విఘ్నేశ్వరాలయంలో మూషికము వుంటాడు. భగవంతుని నిరంతరము మోసుకొనితిరిగే భక్తుల పవిత్రతకు చిహ్నంగా వారికాస్థానం కల్పించడం జరిగింది ఆ కారణంచేతనే భగవానునికి భక్తునికిమధ్య నడువ కూడదని అంటారు దాని అంతర్భావమేమిటి? భక్తునిదృష్టి సదా భగవం

తునిపైనే ఉంటుంది దానికి అడ్డునిలవవద్దని అర్థము ఇది కేవలము దేవాలయములోనేగాక నిత్యజీవితములోకూడా ఆచరించవలయునని భావము భక్తులను పరీక్షించుట అవహేళనచేయుట వారికి కష్టాలు కల్గించుట చేయ కూడదు అంతకన్నా మించిన పాపము మరొకటి వుండదు

భగవద్భక్తులు ప్రేమస్వరూపులు త్యాగజీవులు సేవాపరాయణ త్వముతో జీవితమును సాగించే ఆదర్శమూర్తులు వారి దివ్య దృష్టిలో ప్రతిజీవియు భగవంతుడే ఏ వ్యక్తి బాధపడినా చూసి భరించలేరు భగవానుడే బాధల్లో యున్నాడనే స్ఫురణ వారికి కలుగుతుంది తోటి మానవుని సుఖసంతోషాలను వీక్షించి తృప్తి చెందే భక్తుని అంతఃకరణ నిరంతము సేవాదృక్పధములోనే నడుస్తూ యుంటుంది భక్తులు ఇతరుల బాధలను తొలగింపువారే గాని బాధలను కల్గించువారుకారు అట్టి పవిత్రాత్ములైన భక్తులను పరీక్షించుట మహాపరాధము ఆంతరంగిక ఆధ్యాత్మిక సౌరభముతో జీవించే భక్తుల జీవనరాగ విన్యాసములు మనకు అర్థంకావు అంత మాత్రాన అపార్థం చేసుకొని భక్తులను అవమానించ కూడదు అసహ్యించుకోకూడదు ఆపదలను అందించకూడదు అందరిలా గాకుండా అతీతంగా జీవించడములోనే వారి ఔన్నత్యము దాగి యుంది భక్తుల సహచర్య భాగ్యం లభించుట మహద్భాగ్యమని భగవత్ప్రసాదమని భావించి జీవించి చరించే జీవులు తప్పక తరించగలరు

పరమ భాగవతోత్తముడైన రోహిదాసు తన శేషజీవితమును నిత్య సమారాధనలో నిరంతర జప సంకీర్తనాదులలో చరితార్థం చేసుకొని,

తన ఆదర్శనీయజీవితముద్వారా అనుకరింపదగిన అద్భుతచరితాత్ముడుగా భక్తుల హృదయాలలో స్థిరంగా నిలిచిపోయారు

తన జీవితమంతయు భగవదారాధనలో గడిపి అంతిమ సమయంలో భగవన్నామమును గానము చేయుచు అనంత చైతన్యములో లీనమయ్యారు

భక్తవత్సల భగవాన్‌కీ జై





# సంత్ నామ్‌దేవ్

భరతభూమి భక్తులభూమి. భారతజీవన గగన వీధులలో భక్త ధ్రువతార ప్రకాశించని కాలమంటూ గతంలో కనుపించదు. భక్తుల మనుగడే భరతమాతకు శరణ్యం. ఐహిక ప్రపంచములోని దుఃఖమయ నిస్సార జీవనాన్ని తిలకించి, మోక్షదాయకమైన భక్తిమార్గాన్ని చేపట్టి, నిరంతరం భగవద్గుణ కీర్తనాదులతో తన్మయులై మైమరచిన మేనులతో, మయూరాలవలె నృత్యంచేస్తూ, తోటివారికి మార్గగాములై, తాము తరించి, సర్వులను తరింపచేసే త్యాగమయులు భగవద్భక్తులు వారి గాధలు చిర స్మరణీయమై భక్తుల మనోవీధులలో కదులుతూనే ఉంటాయి. పరమ పవిత్రమైన భక్తులు స్మృతి పథంలో మెదలగానే అప్రయత్నంగా తలలు భక్తితో వాలుతాయి. కన్నీళ్ళు రాలుతాయి, మేనులు వంగుతాయి. కేశ ములు తలెత్తుతాయి.

భగవంతుని కొరకు సదా పరితపించే హృదయమే భక్తికి పునాది. అది సామాన్య పరితాపముకాదు. విడ్డూరపు విరహజ్వాల. వైద్యులు బాగుచేయలేని మహావ్రణము. భగవత్ప్రేమామృతమును పానంచేస్తేనే

గాని బాగుపడని ఒక విచిత్రరోగము ఎంత మధురమైనదీ వ్యాధి? ఎంత మాధుర్యమైనదీ బాధ? అనుభవిస్తేగాని అర్ధంగాని విచిత్రానుభూతి ఆహారం రుచించదు కంటిపై రెప్పవాలదు రాత్రింబవళ్ళకు తేడా తెలియదు నిష్ఫురవ్వలా ఏర్పడిన విరహము దావాగ్నిలా రగుల్కొంటుంది భుజించేకొద్దీ ఆకలి తీరినట్లు బాధ పెరుగుతున్నకొద్దీ ఆనంద శిఖరాలను అందుకుంటుంది ఆ మైకంలో బ్రతుకే ఆహుతి అవుతుంది

తొలి చూపులోనే తన బ్రతుకును దీపానికి అంకితంచేసి కన్ను మూస్తుంది వెలుతురు పురుగు ప్రధమానుభూతిలోనే తమ బ్రతుకులను భగవంతుని పాదాలకు అంకితంచేసి ప్రపంచానికి మృతులవుతారు భక్తులు అనుమానాలు తెలియనివారు అవమానాలు లెక్కచేయనివారు తనను మలినం చేస్తున్నారనే ధ్యాస లేకుండా వారినే పునీతం చేస్తూ నడకసాగించే నదీమతల్లి వలె తమను అసహ్యించుకున్న వ్యక్తులపై అభిమానాన్ని చిందించి తమ బ్రతుకులను ఆపదలకు గురిచేసిన వ్యక్తులకు సైతము అనురాగాన్ని అందించి కఠోరబాధామయ స్థితిగతులలో నవ్వుతూ నడక సాగించే ఆదర్శ మహనీయులు భగవద్భక్తులు

భక్తులు నడిచేబాట ప్రేమబాట అది కంటకములకు నిలయము ఆటంకములకు ఆలయము ఆ మార్గంలో నడక సాగించడము దుర్లభము ఆ దారి ననుసరించే వ్యక్తి ఉరికంబానికి చేరుతాడు ఆ ఉరికంబాన్ని ఎక్కడానికి ఏడు మెట్లున్నాయి అవి 1 విశ్వాసము 2 బ్రహ్మచర్యము 3 శీలము 4 సత్యము 5 సహనము 6 సమత్వము 7 త్యాగము ఈ సప్తసోపానాలెక్కి ఉరికంబమువద్ద నిలబడి అహంకారాన్ని ఉరితీస్తాడు మమకార చిదుగులుచేర్చి చితి రగిలిస్తాడు అహంకారము దగ్ధమై పోతుంది అందుండి ఆత్మవిదుడు ఉద్భవిస్తాడు అలా ఆవిర్భవించిన ఆత్మవిదులలో పాండురంగని పావన చరణాలవద్ద బ్రతుకును ధన్యతచేసుకున్న సంత్‌నామదేవ్ అగ్రగణ్యులు

భక్తజన సంరక్షణార్ధం కలియుగ అవతారమూర్తియై పాండురంగ భగవానుడు వెలసియున్న పవిత్ర పుణ్యస్థలియైన పంఢరీపురంలో

దామాశేర్ గుణాబాయి అనే పుణ్యదంపతులుండేవారు సంతానములేని ఆ దంపతులు నిరాశ చెందినవారై నిరంతరము పాండురంగని సేవచేస్తూ వ్రతము లాచరిస్తూ కాలము గడుపుచుండెడివారు ఒకనాడు దామాశేత్ స్వప్నంలో పాండురంగడు దర్శనమిచ్చి మరునాటి ఉదయమే చంద్రభాగా పుణ్యతీర్థంలో ఒక బాలుడు తేలియాడుచూ కనిపించుననియూ ఆ బాలుని తెచ్చి పెంచుకోమని తెలిపాడు భగవదాజ్ఞను శిరసావహించి మరునాటి ఉదయమే దమాశెర్ చంద్రభాగా పుణ్యతీర్థమును సమీపించగా ఆ నదిలో పసి బాలుడు తేలియాడుచు వచ్చుచుండుటచూచి అతనిని తెచ్చి పెంచుకొనుచు భగవత్ప్రసాదమైన ఆ బాలునికి నామదేవుడని పేరు పెట్టారు సదా ప్రశాంతవదనుడై లోకములోని శోకమును పారద్రోలుటకు అవతరించిన భగవదంశయా అన్నట్లు నామదేవ్ కనుపించేవాడు

నామదేవునికి అయిదు సంవత్సరముల వయస్సు వచ్చింది దామాశేర్ ఒకనాడుస్వంతపనిమీద పొరుగూరువెళ్ళుతూ పాండురంగనికి నిత్యము తాను అర్పించే నైవేద్యమును నామదేవ్‌ద్వారా పంపమని భార్యకుచెప్పి వెళ్తాడు గుణాబాయి నైవేద్యమును తయారుచేసి నామదేవుని పిలిచి ఆలయంలో స్వామికి నైవేద్యమును అర్పించిరమ్మని చెబుతుంది నామదేవ్ నైవేద్యమును తీసుకొని ఆలయంలోకి ప్రవేశిస్తాడు స్వామిముందు నైవేద్యము ఎంతసేపు ఉంచినను స్వామి గ్రహించలేదు పళ్ళెములో తెచ్చిన నైవేద్యము అలాగేయున్నది తాను సమర్పించిన నైవేద్యమును స్వామి గ్రహించలేదని నామదేవ్ దిగులుచెందుతాడు స్వామీ భుజించండిస్వామీ! నేను తొందరగా వెళ్ళాలి అన్నాడు అయినా స్వామి గ్రహించలేదు స్వామికి నైవేద్యము సమర్పించకుండా ఇంటికివెళ్తే తల్లిదండ్రు లేమంటారోనన్న భయం ఒకవైపు బాధిస్తున్నది ఇక చేయగలిగిందిలెక స్వామి పాదాలవద్ద తన శిరస్సును బాదుకుంటూ ఏడుస్తాడు ఆ పసిహృదయంలో జరిగే ఆరాటాన్ని అర్థంచేసుకున్న కారుణ్యమూర్తి పాండురంగడు ప్రత్యక్షమై నైవేద్యమును స్వీకరిస్తాడు నామదేవ్ అమితానందముతో ఖాళీపళ్ళెమును చేతపట్టుకొని ఇంటికి వస్తాడు ప్రసాదములేని ఖాళీపాత్రను నామ

దేవ్ తీసుకొనిరావడంచూసి ప్రసాదమేక్కడని గుణాబాయి అడిగితే పాండురంగడు ఆరగించాడని నామదేవ్ చెబుతాడు నమ్మశక్యముగాని ఈ వార్త తల్లి మనసును చాలా కలవరపెడుతుంది భర్తరాగానే జరిగిన విషయాన్ని తెలియచేస్తుంది నామదేవ్ కారణజన్ముడని తెలిసిన దామాశేత్ మరుసటి రోజుకూడా నామదేవ్‌చేతనే నైవేద్యము పంపమనిచెప్పి నామదేవ్ గుడిలో నైవేద్యము సమర్పించు సమయానికి గుడి గుమ్మందగ్గరదాగి భగవానుడు ప్రత్యక్షంగా నామదేవ్ సమర్పించిన నైవేద్యమును ఆరగించే ఆ పవిత్ర దృశ్యాన్నిచూసి పులకాంకితుడవుతాడు దామాశేత్‌కు ఈ విధంగా దర్శనమివ్వాలని పాండురంగడు సంకల్పించాడేమో

నామదేవులవారు ఖాళీపాత్రను పట్టుకొని ఇంటికి పరుగెత్తుతున్నాడు. దేవాలయము దాటగానే దామాశేత్ నామదేవుని పిలుస్తాడు

తండ్రిని చూడగానే "నాన్నా స్వామికి నైవేద్యము ఇప్పుడే సమర్పించి వస్తున్నాను స్వామినవ్వుతూ ఆరగించాడు అంటూ ముద్దులొలుకు మాటలతో తెలియచేస్తాడు నామదేవుడు

నామదేవుని కౌగలించుకున్నాడు దామాశేత్ తనయునిపై ముద్దుల వర్షం కురిపించాడు నేత్రాలవెంట ఆనందభాష్పాలు రాలుతున్నాయి నామదేవుడు తండ్రిని చూశాడు తండ్రి ఎందుకలా కన్నీరు కారుస్తున్నాడో అర్ధంకాలేదు తండ్రి కన్నీటిని తుడుస్తూ ఎందుకునాన్నా ఏడుస్తున్నారు? నేను నిజంగా స్వామికి నైవేద్యం సమర్పించాను నేను అబద్ధం చెప్పడం లేదు నాన్నా! కావాలంటే స్వామిని అడగండి అని అమాయకంగా పలికాడు నామదేవుడు

నామదేవులవారిని బుజ్జగిస్తూ లేదుబాబూ! నీవు నైవేద్యం సమర్పించలేదని నేను బాధపడటంలేదు ఇవి కన్నీళ్ళు కావుబాబూ! ఆనంద భాష్పాలు మహానందతరంగాలు ప్రతి తండ్రి తన కుమారుని అభివృద్ధినే కాంక్షిస్తాడు బిడ్డ భవిష్యత్తులోనే తన బ్రతుకుకు వెలుగుందని భావిస్తాడు

తన కొడుకు ప్రయోజకుడయ్యాడని తెలియగానే తండ్రి హృదయ ఆనందంలో పరవశ్ళు త్రొక్కుతుంది అలాంటప్పుడు తన కుమారుడు సాక్షాత్తు భగవానుని కరుణకు పాత్రుడైన పరమభక్తుడని తెలిసినపుడు మరి ఆ తండ్రి ఆనందం ఎలా వుంటుంది? తన కుమారుని చేతినుండి పరమాత్మ నైవేద్యమును స్వీకరించాడనే సత్యం ఏ తండ్రిని పులకాంకితుని చేయకుండా వుంటుంది? నా సంతోషంలో ఆనందభాష్పాలు రాలుతున్నాయి కుమారా! అంటూ మళ్ళీ ముద్దుపెట్టుకున్నాడు దామాశేర్

తండ్రి పరిస్థితి నామదేవులవారికి అర్థంకాక అయోమయంగాఉంది అదేమిటి నాన్నా! అందులో గొప్పతనమేముంది? మనం సమర్పించే నైవేద్యమును స్వామి ఆరగించడములో విశిష్టత ఎముంది? అందరూ నైవేద్యాన్ని సమర్పిస్తూనే ఉంటారుగా నీవూ ప్రతినిత్యము నైవేద్యము సమర్పిస్తూనే ఉన్నావుగా అలాగే నేను స్వామికి నైవేద్యాన్ని సమర్పించాను అందులో విశేషమేముంది? గొప్పతనమేముంది? అని అమాయకంగా తండ్రిని ప్రశ్నించారు నామదేవులవారు

నామదేవా! మేము అర్పించడంవేరు నీవు సమర్పించడమువేరు స్వామి ఆరగించాలనే ఉద్దేశ్యంతో మేము అర్పిస్తాము స్వామి ఆరగించాడని సంతృప్తిచెందుతాము కానీ తీసుకొనివెళ్ళిన నైవేద్యము అలాగే ఉంటుంది దానిని భగవత్ప్రసాదంగా మేము భుజిస్తాము నీ విషయంవేరు నీవు సమర్పించగానే స్వామి ప్రత్యక్షంగా ఆరగించాడు ఆ సందర్భములోనే ప్రథమంగా నాకు స్వామి దర్శనమైంది తండ్రికి భగవద్దర్శనభాగ్యం కల్పించగలిగిన నీవు సామాన్యుడవు కాదు అపారభాగవతోత్తముడవు అని పలికాడు దామాశేర్ నామదేవులవారు ఆలోచనలో పడ్డారు బాబూ తొందరగా ఇంటికివెళ్ళు నేను ఇప్పుడేవస్తా నని తండ్రి నామదేవులవారిని వదలి సంతవైపు నడిచాడు

నామదేవులవారి మస్తిష్కంలో ఆలోచనలు సుడులు తిరుగుతున్నాయి తనతోనే భగవంతుడు ప్రత్యేకించి భాషించాడని తాను సమర్పించిన నైవేద్యమునే భుజించాడని తెలియగానే అవగాహనలో మార్పు

వచ్చింది ఇంటివైపు నడవకుండా మళ్ళీ దేవాలయములోకి ప్రవేశించాడు తడబడుతున్న అడుగులతో గర్భాలయంలోనికి ప్రవేశించాడు చిన్నబోయిన వదనంతో దిగులుగా నిలబడ్డాడు గర్భాలయ కుడ్యమును అనుకొని నిలు చున్నాడు దుఃఖము కట్టలు త్రెంచుకొని వస్తున్నది

నామదేవా మళ్ళీ వచ్చావేంనాన్నా నీవు సమర్పించిన నైవేద్య మును ఆరగించానుగా మళ్ళీనాతో నీకు ఏంపనిబడింది? అన్నాడు పాండు రంగడు

నామదేవులవారు చేతులు జోడించి నమస్కరిస్తూ హే భక్తజన రక్షకా! పుండరీకవరదా ఇంతక్రితం నీ కొరకు వచ్చాను నీకు నైవేద్య మును సమర్పించాలని వచ్చాను ప్రభూ ఇప్పుడు నా కొరకు వచ్చాను నీ భక్తుడనైన నాకు ఏమిస్తావని అడగడానికి వచ్చాను నీ పాదరేణువైన నా మ దే వు ని ఎలా అనుగ్రహిస్తావని అడిగి తెలుసుకోవాలని వచ్చాను తరింపచేస్తావో అంతరింపచేస్తావో తెలుసుకుందామనివచ్చాను" అన్నాడు నామదేవుడు

"నామదేవా! ఏమిటినాన్నా ఈ దినం చాలా విచిత్రంగా మాట్లాడు తున్నావు నీవు నాకు భక్తుడవు నీలాంటిభక్తులను విడచిపెట్టి నేను క్షణం జీవించలేను మీ కొరకే గతంలో చేయరాని పనులు చేశాను పడరానిపాట్లు పడ్డాను చెప్పు నామదేవా! నీకేం కావాలి? నిస్సంకోచముగా చెప్పు అన్నాడు పాండురంగడు

నామదేవులవారు పులకాంకితులై తన హృదయపు లోతులనుండి బయలుదేరిన ఆ భ్య ర్థ న ను స్వామిముందు నిలబడి కీర్తనద్వారా గానం చేశాడు ఈ జన్మలోనే తరించాలని లేక ఒకవేళ కర్మశేషంవల్ల జన్మ వచ్చేటట్లయితే ఆ జన్మలోకూడా నీ పాదాలచెంత వుండాలని కీర్తించాడు

పండరీచెవాస! చంద్రభాగెస్నాన
అణీక దర్శనః విరలాచే ॥పండరీ॥
హేంచి మజఘుభో జన్మ జన్మాంతర్
మాగణే (శ్రీ)హరి నాహీందుజేః ॥పండరీ॥

సాదాముఖేనామ సంతాచె దర్శన
జనీ జనార్ధనా ఏసా భావ
నామామ్హాణే నిత్యాతు జే మహాద్వార్
కీర్తన గజరీ సప్రేమాచే ॥పండరీ॥

హే పాండురంగా! పండరీపురంలో జననము చంద్రభాగా పుణ్య తీర్థములో స్నానము నీ పవిత్రపాద దర్శనము నాకు జన్మ జన్మ లకు ప్రసాదించు శ్రీహరీ! ఇంతకుమించిన కోరిక నాకులేదు

నీ నామామృతాన్నే సదా పానంచేసేలా అనుగ్రహించు

సత్పురుషుల సాంగత్యాన్ని ప్రసాదించు సకల ప్రాణులలో నిన్ను దర్శించే అపూర్వ దృష్టిని అందించు

నీ గర్భాలయ ద్వారంవద్ద నామదేవుడు హృదయపూర్వకంగా ప్రార్థిస్తున్నాడు నీ నామాన్ని గానంచేస్తూ తరించేలా కృపచూడు

హే కరుణాలయా! పాండురంగా అంతకుమించి నిన్ను నేను ఏమీ కోరను నిరంతరము నీ నామామృతాన్ని గానంచేసే భాగ్యం నాకు చాలు చిఱుతలు తంబుర ధరించి సకలమును త్యజించి అహంకార మమకారాదు లను మనసులో చొరనివ్వకుండా చేసుకొని హృదయము నిండా భక్తి తొణికిసలాడుచుండ నీ కీర్తనచేస్తూ జీవిస్తాను అహోరాత్రులు నీ నామా స్మరణయందే కాలంగడుపుతాను పాడుతాను పాడుతూ తిరుగుతాను తిరు గుతూ పాడుతాను కాలం కలిసినచోట రాలిపోతాను ఈ జన్మకు అంతకన్నా కావలసిన వరంలేదు ప్రభూ అంటూ దుఃఖమును ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడుస్తూ పాండురంగని పవిత్ర పాదద్వయాన్ని కౌగలించుకొంటాడు

నామదేవులవారి భక్తిపరాకాష్ఠను తిలకించిన పాండురంగని హృద యం ద్రవించి కారుణ్యంతో నిండిపోయింది "నామదేవా! లెమ్ము కలి యుగంలో నీ నామము సార్థకమై యుంటుంది భావిలో అవతరించే భక్త

లకు నీవే మార్గగామివి అవుతావు నామదేవా! లే నిన్ను ఈ జన్మలోనే నేను ఉద్ధరిస్తాను అన్నాడు పాండురంగడు. ఆ ఎంత మధురమైన మాట అమృతములొలుకు మహావాక్యము నిన్ను ఉద్ధరిస్తానని భగవంతుడు ఎందరు భక్తులకు హామీఇచ్చి ఉంటాడు? జై జై నామదేవ సమర్థ

మహాభక్తాగ్రగణ్యుడు జన్మతః మహాజ్ఞానియైన జ్ఞానదేవుడు భక్తులతోగూడి తీర్థయాత్ర వెళ్ళుచూ పండరీపురం వస్తాడు నామదేవుని సంకీర్తనా మహిమనుగూర్చి గతంలో విన్న జ్ఞానదేవుడు ఈనాడు ప్రత్యక్షంగా ఆలకించి తన్మయుడై తనుచేసే తీర్థయాత్రలో పాల్గొనవలసిందని నామదేవులవారిని కోరుతారు పాండురంగని విడిచి రాలేనని నామదేవుడు చెబుతాడు జ్ఞానదేవులు తప్పకుండా రావాలని పట్టుబడతారు తప్పక వెళ్ళవలసి వచ్చింది పాండురంగని విడిచి వెళ్ళలేక బయలుదేరేముందు నామదేవుడు పసిపిల్లవానిలా ఏడుస్తాడు హృదయంలో పొంగిపొరలే భక్తి ప్రేమల్ని తను రచించిన కీర్తనలో అతిముఖ్యమయిన పక్షిని ప్రఖ్యాతి అనే కీర్తనలలో ఇలా గానం చేస్తాడు

తల్లి పక్షి తన బిడ్డకు ఆహారమును సంపాదించటానికి
గూడును వదలిపోగా ఆ తల్లి కొరకై పిల్ల పక్షి
దుఃఖముతో అలమటించులాగున నా పరిస్థితి
దుర్భరమై వున్నది నిన్ను చూడాలని రాత్రింబవళ్ళు
నిద్రాహారాలుమాని పరితపిస్తున్నాను దూడ పశులశాలలో
బంధించబడగా ఆవు మేతకు వెళ్ళింది
దూడమనసేమో తల్లికొరకు ఆవేదన చెందుచున్నది
పాండురంగా నేనూ నీ దర్శనానికి అలాగే అలమటిస్తున్నాను"

అని నామదేవులవారు గానంచేశారు

భగవంతునికై పరితపించి బాధపడే హృదయాలు ఎంత పవిత్రమైనవో! భక్తులు ఎప్పుడూ బాధలే ఆశించారు If suffering was sold

In market I would hurry to buy it బాధలు బజారులో లభింప గలిగితే నేను వెంటనే కొంటాను అన్నదొక కవయిత్రి

ఎలాగో ఒప్పించి మెప్పించి నామదేవుని వెంటనిడుకొని జ్ఞానదేవుడు యాత్రకు వెళ్తాడు ఒకరు జ్ఞానవర్షాన్ని మరొకరు నామామృతాన్ని కురిపిస్తూ భక్తులను పరవశింపచేశారు ఉత్తర హిందుస్థానంలో వీరి ప్రచార కార్యక్రమంలో పాల్గొని ముగ్ధుడై కబీర్‌దాస్ వీరి మార్గాన్ని అనుసరిస్తారు ఇలా ప్రచారము చేయుచూ నాగనాథక్షేత్రానికి చేరుతారు ఆనాడు మహాశివరాత్రి పర్వదినము జ్ఞానదేవ నామదేవాదులు నదీస్నానం చేసి భక్తులతోకూడి నాగనాథుని దర్శనానికై ఆలయంలోకి ప్రవేశించారు

ఆలయంలో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న నాగనాథుని దర్శించగానే నామదేవులవారికి నాగనాథునిలో పాండురంగడు దర్శనమిచ్చాడు నామదేవులవారి ఆనందానికి అవధులులేవు కీర్తన ప్రారంభించాడు పరవశించి గానం చేస్తున్నాడు గానానికి అనుగుణ్యంగా నృత్యం చేస్తున్నాడు నామదేవులవారిచే ప్రభావితులైన భక్తులు నామామృతాన్ని గ్రోలుతూ నృత్యం చేయసాగారు ఆలయమంతా భక్తి సమూహంతో నిండిపోయింది

నామదేవులవారి సంకీర్తనవల్ల భక్తులు సంకీర్తననే శ్రవణంచేస్తూ వుండిపోతున్నారు దర్శనార్ధం వచ్చేవారిసంఖ్య తగ్గుతున్నది పూజారులకు ఆదాయం ఎన్నగిల్లుతున్నది ఈ సంకీర్తనను ఇలాగే కొనసాగిస్తే తమ బ్రతుకులు ఈ నాటికింతేనని భావించారు పూజారులు నామదేవులవారి వద్దకువచ్చి "భక్తులు భగవదర్శనార్ధం వస్తున్నారు నీవు సంకీర్తనము ఆపు అన్నారు పూజారులు సంకీర్తనా సామ్రాజ్యంలో దివ్యోన్మాద స్థితిలోవున్న నామదేవులవారికి వారిమాటలు వినిపించలేదు కొంతసేపు చూశారు పూజారులు సంకీర్తన ఆగలేదు ఆలయ పూజారులు కోపోద్రిక్తులయ్యారు నామదేవులవారి భుజముపై చేయివేసి ఈడ్చుకొనివచ్చి గుడివెనుకవైపున పడేశారు: ఇక్కడ నీ యిష్టమొచ్చినట్లు గంతులు వేయి అన్నారు పూజారులు

నామదేవులవారి మనస్సు చివుక్కుమంది చూస్తున్న భక్తులంతా బాధతో తలలు వంచారు నామదేవులవారు పూజారులకు నమస్కరిస్తూ ఆయ్యా! భగవదాలయంలో పూజచేసే మీరు పవిత్రాత్ములు భగవానునికి సంకీర్తనకన్నా కావలసిందేముంది? అన్నారు

మేము బ్రాహ్మణులులము ధర్మశాస్త్రము తెలిసినవారము శూద్ర కులజుడవైన నీవు మాకు బోధింపుటయా? అని విసురుకుంటూ వెళ్ళిపోయారు

నామదేవులవారు సంకీర్తన బయటే ప్రారంభించారు నాగనాథుడు ఇక్కడే దర్శనమిస్తాడు నాగనాథుడు దర్శనమీయనిచో ఇక్కడే నా ప్రాణాలు సమర్పిస్తాను అని ప్రతిజ్ఞచేసి అమృతగానం చేస్తున్నారు నామదేవులవారు జ్ఞానదేవ్ సోపాన్ నివృత్తి ముక్తాబాయి మొదలగు భక్తులంతా వీక్షిస్తున్నారు సంకీర్తన చరమస్థాయికి చేరింది నామదేవుల వారు పరవశించి పోయారు చుట్టూనున్న భక్తులంతా కరతాళధ్వనులుచేస్తూ గంతులేస్తున్నారు ఆహా! ఎంతటివైభవము! ఎట్టి అపూర్వ సన్నివేశము! నామదేవులవారి సంకీర్తనకు నాగనాథుని హృదయం ద్రవించింది

తూర్పుముఖముగా ఉన్న నాగనాథుని ఆలయము పశ్చిమంగా తిరిగింది నాగనాథుడు నామదేవాది భక్తులకు దర్శనమిచ్చాడు జైజై భక్త వత్సల భగవాన్‌కీ బిడ్డఆకలి తల్లికి ఎవరు చెప్పాలి? భక్తుల ఆర్తనాదాలు భగవంతుడు గాకుంటే మరెవరు వింటారు? నామదేవుడు నేత్రములవెంట ఆనంద బాష్పములు రాలుచుండ నాగనాథుని పాదపద్మాలపై వాలాడు ఆనాడు నాగనాథుడు నామదేవులవారిని అనుగ్రహించిన రీతిని నామదేవుల వారే ఒక చక్కటి కీర్తనగా రచించారు

హంసత ఖేలత తేరే దేవ్హారె ఆయా
భక్తికరత "నామా" పకర ఉఠాయా
హీనడీ జాత మేరీ జాదవ రాయా
ఛీపెకే జన్మ కాహెూకో ఆయా॥

కైసే కమలీ చల్యో పలరాయీ
దేహురై పాసై బైరా జాయీ
జడ జడ "నామా" హరిగుణ ఉచరై
భక్తజనాకో దెహురాఫిరై ॥హంసత॥

ఒకనాడు హృదయంలో భక్తి పొంగుచుండ నామదేవుడు దేవాలయంలో ప్రవేశించాడ తన భక్తి తన్మయతలో సభ్యతను మరచి పిచ్చివాడులాగా పారవశ్యంతో నృత్యం చేయసాగాడు అహంకార ప్రేరితుడైన పూజారి నామదేవులవారిని బయటకు గెంటాడు

నామదేవులవారు హృదయావేదనతో భగవాన్! నన్ను అధమ కులంలో జన్మింపజేసి తత్కారణంగా ఇలాంటి అవమానాలకు గురిచేయుచున్న నీవే నా బాధలన్నిటికి బాధ్యుడవు అని పలుకగానే భగవంతుడు భక్తుని మొరి ఆలకించి దేవాలయాన్నే మరొకవైపుకు త్రిప్పాడు భగవానుని అనంతకృపకు పరవశించి నామదేవుడు గానంచేస్తుండగా చూస్తున్న భక్తజనులందరు నామదేవుల పాదాలపై పడి నమస్కరించారు అని నామదేవులవారు జరిగిన సంఘటనను గూర్చి గానంచేశారు

యాత్రాస్థలాలు దర్శిస్తూ జ్ఞానదేవ నామదేవాదులు తెర్దాకీ అనే గ్రామానికి వస్తారు ఆ గ్రామములో గోరాకుంభార్ అనే భక్తుడు కుండలు చేసి అమ్ముతూ నిరంతరము పాండురంగ స్మరణతో జీవిస్తుంటాడు జ్ఞానదేవులవారు ఆ గ్రామానికి అరుదెంచారన్న వార్త తెలియగానే గోరా మహాత్ములను దర్శించి సాష్టాంగ నమస్కారముచేసి తమ ఇంటిలో పాదముంచి పవిత్రత కల్గించమని తానిచ్చే అతిధ్యమును స్వీకరించి తన ననుగ్రహించమని ప్రార్థిస్తాడు గోరాకుంభారుని ఆహ్వానమును పురస్కరించుకొని జ్ఞానదేవ నామదేవులు భక్త సమూహంతో కలసి గోరా ఇంటిలో అతిధ్యమును స్వీకరించుటకై వెళ్తారు అచ్చట సంకీర్తన సత్సంగము మహావైభవముగా జరుగుచున్నది సంకీర్తన పూర్తికాగానే జ్ఞానదేవులవారు గోరాకుంభార్‌ను పిలిచి అచ్చట ఆసీనులైన భక్తులలో

పూర్ణపురుషులెవరో తెలియచేయవలసిందని కోరుతారు పూజ్య జ్ఞానదేవుల ఆజ్ఞానుసారము గోరాకుంభార్ తాను కుండలుచేయు కొయ్యదిమ్మెతో భక్తుల శిరస్సులను తాకుతూ ఆధ్యాత్మికంగా వారివారి స్థాయిని తెలియ చేసాడు నామదేవులవారిని పరీక్షించడానికి రాగానే నామదేవులవారు నిరాకరిస్తూ పాండురంగని అంతరంగిక భక్తుడనైన తననుకూడా పరీక్షిం చడమా అని ఆగ్రహం చూపుతారు

జ్ఞానదేవులవారు నామదేవులవారిని వారించి సభలో పక్షపాతము దోషమని తెలియచేస్తారు జ్ఞానదేవులవారిపై గౌరవముంచి నామదేవులవారు అంగీకరిస్తారు గోరాంకుభారు అందరినీ పరీక్షచేసినట్లు నామదేవులవారిని కూడా పరీక్షచేసి ఈ కుండ సగమే కాలింది ఇంకా సగం పచ్చిగానే ఉన్నదని తెలియచేస్తాడు అది విన్న నామదేవులు చెదరిన మనసుతో పండరీపురం రాగానే పాండురంగని ఆశ్రయించి గోరా మాటలలోని నిజ మెంతో చెప్పవలసిందని ప్రార్థిస్తాడు? గోరా చెప్పిన మాటల్లో అసత్యమేమీ లేదని గురువు వెంత విద్యనార్జించక పోవుటచేత నామదేవుడు పూర్ణ జ్ఞానాన్ని పొందలేక పోయారని విశోబాఖేచరుని గురువుగా స్వీకరించి తత్త్వజ్ఞానోపదేశమును పొందమని పాండురంగడు నామదేవులవారికి తెలియచేస్తాడు

నామదేవులవారు విశోభాఖేచరుని దర్శించడానికి వెళ్తారు శివా లయంలో నేలపై పరుండి శివలింగంపై తనపాదాలుంచి చూస్తున్న విశో బాను నామదేవులు చూస్తారు ఆ దృశ్యం నామదేవుల హృదయాన్ని కల వర పరుస్తుంది శివలింగముపై పాదాలుంచడం అపవిత్రమని నామదేవులు విశోబాతో చెబుతారు అలాగైనచో భగవంతుడు లేనిచోట తన పాదా లుంచమని విశోబా చెబుతాడు నామదేవులు వెంటనే విశోబా పాదాలుతీసి నేలపై ఉంచుతారు ఆ పాదాలుంచినచోట శివలింగం ఆవిర్భవిస్తుంది ఇలా ఎన్నిచోట్ల పాదాలుంచినా అన్నిచోట్లా శివలింగాలు ఉద్భవిస్తూనే ఉన్నాయి నామదేవులు ఆశ్చర్యంతో విశోబావైపు చూస్తారు

భగవంతుడు దేవాలయాలకే పరిమితంకాదని భగవంతుడు అన్ని చోట్ల ఉన్నాడని అది తెలిసి జీవించడమే సమ్యక్ దృష్టియని విశోబా

తెలియచేస్తారు ఏశోబా తత్వోపదేశంతో పూర్ణపురుషుడై సమదర్శనం కలిగి నామదేవ్ ఆదర్శజీవితాన్ని సాగిస్తుంటారు ఆ మహాత్ముని అడుగు జాడల్లో ఎయనించి తరించిన శిష్యకోటిలో జనాబాయికూడా ఉన్నది

ఒకనాడు భక్తులందరు చంద్రభాగా నదీతీరంలో సంకీర్తనా సత్సంగము నిర్వహించి తదుపరి సమిష్టిగా భోజనము చేయునపుడు ఒక కుక్క ప్రవేశించి నామదేవుని విస్తరికోని రొట్టెను తీసుకొని పరుగెడుతుంది అది చూసిన నామదేవుడు పాండురంగా గట్టిగా శిలలావున్న ఆ రొట్టె ముక్కను కొరికి తినడంవల్ల నీ దంతాలకు బాధ కలుగుతుంది నేతిలో ముంచుకొని మరీ తినవలయందని నేతిగిన్నె తీసుకొని వెంటబడతాడు కొద్దిదూరం అలా వెళ్ళగానే శునకము అదృశ్యమై పాండురంగడు దర్శనమిస్తాడు నామదేవా! ఇప్పుడు నీవు పూర్ణ జ్ఞానివయ్యావు ఇక మీదట లోకకళ్యాణమే నీ జీవితము అంధకారంలో అలమటించే సంసారులకు భక్తిమార్గమును బోధించి తరింపచేయుము అని పాండురంగడు తెలియచెప్ప అంతర్ధానమయ్యాడు

నామదేవులవారు సామాన్యగృహస్థులు నిరాడంబర జీవితమును గడిపి నామధ్యానముతోనే బ్రతుకును పండింపుకున్న సంత్ పురుషులు గృహస్థాశ్రమ ధర్మాన్ని ఆచరిస్తూ సదా భగవన్నామస్మరణద్వారా మహాత్ముల సందర్శనముద్వారా తరించవచ్చునని తన ఆదర్శనీయ జీవితముద్వారా తెలియచేశారు నామదేవులవారు దర్జీవృత్తిచేసి జీవించేవారు తాను చేసే వృత్తిని ఆధ్యాత్మికంగా ఎలా సమన్వయం చేశారో ఒక కీర్తనలో తెలియచేశారు

మనమేరోగాజో జిహ్వా మేరీకాతీ
మపిమపి కాటఊ జమకీ ఫాంసీ
కహా కర ఉ జాతీ కహా కరవు పాతీ
రామకో నామ జప ఊ దినరాతీ॥

రంగని రంగవు సేవని సేవ ఊ
రామనామ బిన ఘకీఎన జీవ ॥
భక్తికరఉ హరికె గుణగావు ॥
ఆరాపహార అపనా ఖసమ ధ్యాన ॥
సోనేకీ సోయీ రూపేకా ధాగా
"నామ్యే" కాచిత్త హరిసి ఉలాగా!

"నా మనస్సు దర్జీవాని వద్దనున్న కొలబద్దలాంటిది నా నాలుక దర్జీ వద్దనున్న కత్తెరవంటిది జీవితమనే వస్త్రాన్ని మనసనే కొల బద్దతో కొలిచి భగవన్నామమనే కత్తెరతో కత్తిరిస్తాను ఆవిధంగా నిత్యము హరినామస్మరణ చేస్తుంటాను

భగవన్నామముతప్ప నా కులాన్ని వృత్తినినేను లెక్కచేయను జీవితమనే వస్త్రానికి భక్తి అనే రంగువేసి నామమనే సూదితో కుడుతాను

భగవన్నామముతప్ప నా జీవితానికి మరో శరణ్యంలేదు భగవత్పూజా సంకీర్తనాదులలో నా కాలాన్ని ఖర్చుపెడతాను నామదేవుల వారి వద్దనున్న బంగారు సూదిలో వెండిదారాన్ని దూర్చి ఏకాగ్ర బుద్ధితో రాత్రింబవళ్ళు నామదేవుడు దర్జీగా కుడుతూ దర్జాగా నామ జపం చేస్తుంటాడు అని రచించాడు నామదేవుడు

లేనివాటికై ఆశలు పెంచుకొంటూ ఆక్రోశించేవారేకాని ఉన్న దానితో తృప్తిచెంది ఆధ్యాత్మిక దృక్పథం ఏర్పరచుకోగలిగే వారెంద రుంటారు? విశోబాఖేచరునిద్వారా ఉపదేశమును పొందినపిదప నామదేవుల వారు రాగద్వేషరహితులై అహంకార అభిమానాలను దూరం చేసుకొని సమదర్శనంతో సంతృప్తిగా జీవించసాగాడు

ఒకనాడు నామదేవులవారి ఆంతరంగిక ప్రగతిని పరీక్షించాలను కుంటారు జ్ఞానదేవులవారు జ్ఞానదేవ నామదేవాదులు నామప్రచారముచేయు నిమిత్తం ఒక గ్రామానికి పోతుంటారు మధ్యలో ఇద్దరికి దాహంవేస్తుంది ఒ బావి దగ్గకు వెళ్లారు ఆ బావి చాలా లోతుగా ఉంది చేదడానికి తాడు బొక్కెనలేవు జ్ఞానదేవులవారు ఒక చిలుకగామారి బావిలో దిగి నీరు త్రాగి వచ్చారు నామదేవులవారు గట్టుపైనే ఉన్నారు నామదేవా! చూశావా! యోగాభ్యాసమువలన ఎలాంటి శక్తుల వసాయో నామాన్ని ఆశ్రయించిన నీవు ఇప్పుడు చేయగలిగిందేమిటి? అని ప్రశ్నించారు నామదేవులవారు జ్ఞానదేవులవారికి నమస్కరిస్తూ మీరు సర్వజ్ఞులు మీకు తెలియనిదిలేదు భగవంతుని నేత్రాలు విశ్వాన్నంతా వీక్షిస్తున్నాయి అర్హత ననుసరించి అనుకూలత ఎర్పడుతుంది నాకు నీరు ఇవ్వదలచుకుంటే ఎలా ఇవ్వాలో భగవంతునికి తెలుసు ఈ దేహంలో నన్ను ఎంతవరకు ఉంచదలచాడో అంతవరకు అన్నీ సమకూర్చగలవాడు పాండురంగడే మధ్య నా కర్తవ్య మేముంది? భగవానుని దయతో బ్రతుకుతున్నాను భగవానుని దయతో మరణిస్తాను అని పాండురంగ నామం ఉచ్ఛరించసాగాడు బావినుండి నీళ్ళు పైకివచ్చాయి నామదేవులవారు అడుగైనా ముందుకు వేయకుండా నిలబడినచోటనేవుండి నీళ్ళుతాగారు నామదేవులవారి నిరాడంబరతకు నిరహంకారము శరణాగత జీవనానికి జ్ఞానదృష్టికి జ్ఞానదేవులవారు సంత సించారు

నామదేవులవారి పవిత్ర దృష్టితో భగవంతునికి భగవన్నామమునకు తేడాలేదు నామజపమే ముక్తికి సూటియైన దారియని నామదేవులవారు నొక్కి వక్కాణించారు తన జీవితమంతయు నామమును గానము చేయుచూ నామ ప్రచారము గావించుచూ జీవించారు నామ సంకీర్తనతోనే తన బ్రతుకు పండిపోయింది నామ మాధుర్యముతో తన హృదయం నిండి పోయింది విషయ ప్రపంచము తనను ప్రేరేపించలేక పోయింది అరిష డ్వర్గాలు అతడిపై ఆధిపత్యాన్ని చలాయించలేకపోయాయి భగవదనుభూతి కన్నా అన్యమైన అనుభవములను అతడు లక్ష్యపెట్టలేదు దాహమైనా ప్రాణత్యాగము చేయవలసి వచ్చినను చాతకపక్షి స్వాతి చినుకును వదలి

సామాన్య నదీజలమును పానము చేయని విధముగ నామదేవుడు భగవదను భూతియను స్వాతి చినుకును వదలి ప్రాపంచిక విషయము లనెడి నదీజం పానము చేయడు

నామదేవులవారు విశాలమైన సాంఘిక జీవనదృక్పథము కలవారు కులతత్త్వాలు మానవుని అభ్యున్నతిని పాడుచేయు శృంఖలములని తెలియ జేశాడు విశ్వప్రేమయే ఆధ్యాత్మిక పురోగతియని ప్రవచించాడు భావశుద్ధి లోపించి యాంత్రిక జీవనరీతిగా పరిణమించిన కర్మకాండను తాను బాహా టంగా నిరసించాడు

తాను సదా నామజపము చేయుచూ పారవశ్య దివ్యానందములో ఓల లాడు చుండెడివాడు నిరంతరము తన హృదయేశ్వరుడైన పాండురంగ భగవానుని అంతర్యములో దర్శిస్తూ చరించేవాడు ఒకనాడు ద్వారకలో శ్రీ నామదేవులవారు సంచరించుచుండ పండరీనాథుడు మొగలాయిచక్రవర్తి వేషధారియై కనుపించెను నామదేవులవారు తొలిచూపులోనే తన హృద యేశుని గుర్తించి గగుర్పాటు చెందెను తన్మయత్వముతో నేత్రములవెంట ఆనందభాష్పములు రాలుచుండ భగవానుని దివ్యరూపమును దర్శించుచూ ఇలా గానము చేసెను

హే బహువిధరూపా భాగవతప్రియా! విఠలా! నీవు ఎన్ని రూపములు మార్చినను నా దృష్టిని దాటిపోలేవు ఏ దుస్తులలో కనుపించి నను నీ రూపము మంజులమే ఏ భాషలో పలికినను నీ మాట మధురమే నీవు అనంతుడవు నీకు అనేక నామములు అనంత రూపములు అయి నను నామదేవుని అపార భక్తిని ఏవీ అడ్డగించలేవు ఆదిదేవా! నీ వెక్క డున్నను ఎలా ఉన్నను నీ భక్తుడనైన నామదేవుడు గుర్తించగలడు అని కీర్తన ద్వారాగానము చేసెను పాండురంగడు మందహాసమును చిందించి మధురస్వరముతో నామదేవా నామ ప్రభావమునుగూర్చి విశేష ముగా ప్రజలలో ప్రచారము గావించి తరించుము" అని తెలిపి అంతర్ధాన మయ్యెను

భగవదాజ్ఞానుసారము నామదేవులవారు నామప్రచారముగావించుచు భక్తులకు మార్గదర్శకులై చివరకు పాండురంగనిలో ఐక్యమైరి

* ఓం భక్తజన ప్రియాయ నమః *



# గోరాకుంభార్

ప్రపంచములో నివసించు మానవులలో ఎవ్వడైతే "నాది" అను దానిని ప్రక్కకు నెట్టగల్గుతాడో వాడే సుఖజీవనము గడుపువాడు. స్వార్థముతో జీవించువాడే దుఃఖజీవనమును సాగించువాడు. పరమాత్మకన్నా అన్యమనుగడను కొనసాగించినంతవరకు స్వార్థము దూరంకాదు. తనవ్యక్తిత్వమును భగవానుని అనంత చైతన్యముకో లయం చేయగల్గినపుడే స్వార్థము అదృశ్యమై అవగాహనతో త్యాగము అంకురిస్తుంది.

మానసిక బలహీనతయే సర్వ అనర్థములకు మూలము. అజ్ఞానపు గాలము. అజ్ఞాన జనిత మానసిక బలహీనతచేత మానవుడు దుష్కర్మలాచరిస్తాడు. తద్వారా అరుదెంచే దుఃఖఫలితాల ననుభవిస్తూ శోకగ్రస్తుడై జీవిస్తుంటాడు. కనుక అజ్ఞానమును పారద్రోలి మానసిక బలహీనతలకు దూరులై, స్వార్థజీవితమునకు స్వస్తిచెప్పి జీవనయాత్ర సాగించే మానవుడే ముక్తపురుషుడవుతాడు.

త్యాగముచేయని దోషముతో మళ్ళీ శోకగ్రస్తుడై జన్మిస్తాడు. శోకమనుభవిస్తూ పాపం చేస్తాడు. పాపంవల్ల నరక ప్రవేశం చేస్తాడు. మళ్ళీ

భావదారిద్ర్యంతోనే జన్మిస్తాడు ఈ అపసవ్య చక్రాన్ని అంతమొందించాలి అది ఒక్క అవగాహనతోనే సాధించబడుతుంది

బాధలను చూసి భీతిచెందకూడదు బాధలకు దూరంగా పరుగెత్త కూడదు భగవంతుని దగ్గర చేర్చేందుకు బాధలు మనల్ని సమీపిస్తాయి భరించలేని బాధలలోనే మనకు భగవంతుడు స్మృతిలో మెదుల్తాడు హృదయంలో కదుల్తాడు

బాధలు రెండువిధాలు (1) శారీరక బాధలు (2) మానసిక బాధలు ఈ రెండుకూడాను దేహమనో బుద్ధుల స్థాయిలోనే అనుభవ గ్రాహ్యం మనసును దాటిన వ్యక్తికి దేహబాధలు అంతమవుతాయి మనోవ్యధలు అదృశ్యమవుతాయి తాను శరీరానికన్నా వేరని భావించడముచేత అతడు హాయిగా జీవిస్తాడు మనసులో కదిలే భావాలను తాను చూస్తువున్న చూస్తున్న తాను చూడబడే వాటికన్నా అన్యమైనవాడు గనుక మనోజనిత వికారాలను చూస్తూ ఉదాసీనంగా ఉంటాడు అట్టి వానిని బాధలు ముట్టలేవు పట్టలేవు

భక్తులు అందుచేతనే బాధల నాహ్వానించారు అవగాహనతో బాధల ననుభవిస్తూ తమ జీవిత గాథల్ని రమణీయంగా చిత్రించుకున్నారు నిరంతరము హృదయములో భగవంతుని ప్రతిష్ఠించుకొని మనసులో దైవ చింతన కొనసాగిస్తూ కరచరణాదులతో పనిముట్లవలె కర్మలాచరించారు కర్మ ఫలితాలను దైవప్రసాదంగా భావించారు ఇక్కట్లను దైవానుగ్రహాలుగా స్వీకరించారు అట్టి పరమ భక్తుల కోవకు చెందిన సంత్ పురుషుడు పరమ భక్తశిఖామణి గోరాకుంభార్

మహారాష్ట్ర దేశంలో ఉస్మానాబాద్ జిల్లాలో తెర్ఢోకి అను గ్రామము కలదు ఆ గ్రామమునందు గోరా అనే కుమ్మరి నివసిస్తుండేవాడు అతని భార్య గంగాబాయి ఆ పుణ్యదంపతులకు నిదూ అనే సంవత్సరము వయస్సుగల పిల్లవాడు కలడు గోరా పరమ భక్తుడు సదా పాండురంగ దివ్యనామామృత పానంచేస్తూ పారవశ్యంలో మునిగియుండేవాడు పనిచేస్తున్నంతసేపు భగవానుని కర్మలాచరిస్తున్నట్టుభావించి తృ

చెందేవాడు నడుస్తున్నప్పుడు పాండురంగని అనంత చైతన్యములో కదులుతున్నట్లు భావించి పులకాంకితుడయ్యేవాడు మాట్లాడునపుడు తన నోటినుండి వెలువడే శబ్దమునకు వెనుక ఆధారమై వెలుగుతున్న అనాహత శబ్దాన్ని ప్రణవనాదాన్ని ఆలకిస్తూ శబ్దబ్రహ్మముతో ఏకీభూతమై గగుర్పాటు చెందేవాడు చూస్తున్నంతసేపు తన చూపుకు కారణమైన దివ్య చక్షువైన ఆత్మప్రకాశమునుగూర్చి చింతిస్తూ బహిర్ముఖమవుతున్న దృష్టిని దారిమరల్చి అంతర్ముఖంచేసి ఆత్మస్వరూపములో లయింపచేసి కదలికలేక నిశ్చలుడై కనులెంచేవాడు ఆహారమును భుజించునపుడు తాను భుజించిన ఆహారమును జఠరాగ్నిరూపంలో కదిలి జీర్ణము చేయుచున్న పాండురంగ దేవుని క్రియాశక్తిని స్మృతిలో తలచి నోరు కదిలించలేక ఆగిపోయేవాడు

నిరంతరము పారవశ్యజనిత దివ్యోన్మాదంలో కాలాన్ని సాగించే గోరా తన కులవృత్తి ననుసరించి కుండలు చేయుచు వాటిని పండరీపుర సంతలో విక్రయించి కుటుంబయాత్ర సాగించేవాడు ఆరాధించే అంతఃకరణ వుండాలేగాని మనం సాగించే ప్రతి కర్మ యజ్ఞమే అవుతుంది కుండలుచేసే అమ్మడముకూడా భక్త గోరాకుంబారునకు సాధనగానే పరిణమించింది తాను మట్టిని కలుపునపుడు తన మనసును గురించి చింతిచేవాడు ఈ మట్టి ఎంత కఠినంగా వున్నదో రాగద్వేషాలకు ఆలవాలమైన నా మనస్సుకూడా అంత కర్కశంగానే యున్నది – అని తలపోసేవాడు మట్టిలో నీటినిపోసి తడుపునపుడు భక్తిసాధనను గురించి భావించేవాడు కఠినమైన మట్టిని జలము మెత్తగా మార్చింది కర్కశమైన మనసును పాండురంగ దివ్యనామమనే అమృతజలం సున్నితంగా మారుస్తుంది అని సంకల్పించేవాడు కలిపిన మట్టిని సారెపై పెట్టి త్రిప్పునపుడు అంతరంగిక పరిణామాన్నిగూర్చి యోచించేవాడు సారెపైనుంచిన మట్టిముద్ద చక్ర పరిభ్రమణంలో విశాలమవుతున్నదిదైవ నామంచేత పరితప్తమైన మనసు విశాల దృక్పథము నలవరచుకుంటున్నదని ఆలోచించేవాడు సారెపై తిరుగుతున్న కుండకున్న వక్రాల్ని సరిచేయుటలో ఆత్మోద్ధరణనుగూర్చి అనుసంధానం చేసేవాడు చేతిలో మట్టిని మలచుటలో కుండయొక్క వక్రాలు తొలగించబడి రూపం ఏర్పడుతున్నది అవగాహనతో మనసును సంస్కరించుటలో

అంతఃకరణలో ఎర్పడియున్న ద్వంద్వాలు సమసిపోతున్నట్లు అర్థచేసుకొనేవాడు సారెనుండి దించిన పచ్చికుండను కొయ్యదిమ్మెతో చివరిసారిగా సరిచేయునపుడు అంతరేక్షణ జరుగుతున్నట్లు అనుభవించేవాడు చివరగా కుండరూపం తీర్చిదిద్దబడుతున్నది అంతిమ సాధన భూమికగా నాలో మిగిలియున్న వాసనలుకూడా క్షాళనంచేయబడుతున్నవని గ్రహించేవాడు కుండను కాల్చునపుడు పరిపూర్ణాత్వాన్ని అనుభవించి తరించేవాడు అగ్నిలో కాలిన కుండ పూర్ణరూపాన్ని పొందింది జ్ఞానాగ్నిలో అంతఃకరణ దగ్ధంకాగా స్వస్వరూపం మిగిలిందని అనుభూతిని పొందేవాడు

గోరా ముద్దుబిడ్డడైన విఠూ జన్మించి సంవత్సరమైంది జన్మదిన వేడుకను ఎంతో ఘనంగా చేయాలని తల్లి గంగాబాయి నిర్ణయించింది అన్ని ఎర్పాట్లు సక్రమంగా చేసింది ఉదయాన్నే గృహాన్ని చక్కగా అలంకరించింది ఇంటిముంగిట రంగురంగుల ముగ్గులు తీర్చింది గుమ్మానికి మామిడి తోరణాలు అలంకరింపచేసింది ఎకైక పుత్రుడైన విఠూకి శిరస్నానం చేయించింది క్రొత్తబట్టలు తొడిగింది నదికివెళ్ళి నీరు తీసుకొనిరావడానికి బయలుదేరింది ఇంటిముంగిట తన భర్త గోరా పాండురంగి నామం చెబుతూ మట్టి త్రొక్కుతున్నాడు విఠూ గుమ్మందగ్గర కూర్చొనియున్నాడు గంగాబాయి నదికి వెళుతూ విఠూని చూస్తుండమని తన భర్తకు చెప్పి మరీ వెళ్ళింది తన భార్య చేసిన హెచ్చరిక గోరాకు వినిపించలేదు అంతేకదూ! అంతర్యంలో భగవానునితో ఐక్యమైయున్న భక్తునికి బాహ్య శబ్దాలెలా వినిపిస్తాయి?

గోరా మట్టి త్రొక్కుతున్నాడా? నాట్యం చేస్తున్నాడా? నీటితో తడిపిన మట్టిపై చిందులు వేయడం వలన అతడు మట్టి త్రొక్కుతున్నాడనే భావించాలి కాని మూతపడియున్న అతని నేత్రాలు దిక్కులు పిక్కటిల్లేలా అతని కంఠం నుండి వినిపిస్తున్న భగవన్నామం ఊర్ధ్వంగాయున్న భగవంతుని అందుకొనేలాగున ఎత్తబడియున్న అతని చేతులు నామసంకీర్తనకు అనుగుణ్యంగా లయవిన్యాసం చేస్తున్న పాదద్వయము-ఇవన్నీచూస్తే అతడు నృత్యం చేస్తున్నట్లే గోచరిస్తున్నది అది మామూలు నాట్యంకాదు జీవాత్మ పరమాత్మల ఐక్యానుభూతిని వ్యక్తచేయు దివ్య నృత్యతాండవము

గోరా నామం చెబుతూ నృత్యంచేస్తున్నాడు గోరా ముద్దుబిడ్డడైన విఠూ మెల్లమెల్లగా తప్పటడుగులు వేసుకుంటూ తండ్రి త్రొక్కుతున్న మట్టి దగ్గరకు వచ్చాడు తనను ఎత్తుకొని ముద్దాడమని తండ్రికి సంజ్ఞ చేశాడు చేతులందించాడు ధ్వనిచేస్తూ పిలిచాడు భక్తితన్మయత్వంలోవున్న గోరాకు బాలుని ఆక్రందన వినిపించలేదు తండ్రిని చేరడానికి ఉబలాట పడుతున్న పసిహృదయం ముందుకు ఉరకడానికి ప్రయత్నించింది మెల్లగా నడుస్తూ మట్టిని పట్టుకొని పైకిఎక్కి తండ్రి పాదాలను పట్టుకోవడానికి విఠూ ప్రయత్నించాడు పట్టుకోలేక జారి మట్టిలో పడ్డాడు నృత్యంచేస్తూ గానం చేస్తున్న గోరాకు బిడ్డ స్పర్శే తెలియలేదు గంతులేస్తున్న గోరా పాదాలక్రింద పిల్లవాడు పడిపోయాడు గోరా తన కాలి అడుగులు క్రూర వాడిపై వేస్తున్నాడు విఠూ చావుబ్రతుకులమధ్య సతమతమై చివరకు ప్రాణాలు విడిచాడు మట్టి మట్టిలో కలిసిపోతున్నది ఈ ఘోరాన్ని చూడ లేమంటూ ఆ చిన్నారి శరీరమునుండి ఎముకలు పొడుచుకొని ముందు కొచ్చాయి రంగుకలిసినట్లు బిడ్డ రక్తంతో మట్టంతా ఎర్రగా మారింది ఆహా ఏమిటీ దారుణము ఎందులకీ పారవశ్యం? పాదాలంటడానికి వచ్చిన పసిబిడ్డను పాదాలక్రింద పడవేసి కాలరాయడమా? జన్మదిన వేడు కకు బదులు మృత్యు ఒడిలో పడదోయడమా?

గంగాబాయి నీరు తీసుకొని ఇంటికి వచ్చింది "బాబూ! విఠూ? విఠూ అంటూ ఇల్లంతా వెతికింది ఇంకెక్కడి విఠూ తన విఠూ విఠల నాథునితో కలిసిపోయాడని ఆ మాతృమూర్తికేం తెలుసు? ఇంటి నలుమూ లలా వెతికింది బయట గుమ్మంవద్దచూసింది వీధిలోనూ అన్వేషించింది ఎక్కడా విఠూజాడ కనుపించలేదు ఆవేదన తీవ్రస్థాయికి చేరింది భర్త దగ్గరకు పరుగెత్తుకొంటూవచ్చి ఏమండీ విఠూ కనుపించడంలేదు మీరు చూశారా? అని ప్రశ్నించింది "రామకృష్ణహరి! జైజై పాండురంగ హరి నామ మాధుర్యాన్ని గ్రోలుతూ పరవశించియున్న గోరాకు భార్య మాటలు వినిపించలేదు ఆందోళనాపూరిత హృదయురాలైన గంగాబాయి "ఏమండీ అని కేకవేస్తూ భర్తను గట్టిగా పట్టి అంది

నిద్రనుండి మేల్కొన్నట్లు కళ్ళుతెరిచాడు మట్టిలో కూరుకొనిపోయి వున్న తన పాదాలను మెల్లగా లేపదీస్తున్నాడు ఇంతలో గంగాబాయి మట్టి వైపు చూసింది అరుణారుణమైన మృత్తికను చూసింది సత్యం తేటతెల్ల మయింది దుఃఖం కట్టలుత్రెంచుకొని ప్రవహించసాగింది ఏమండీ ఎంత పని చేశారండీ ఒక్కగానొక్క బిడ్డను మట్టికి అంకితం చేశారా? ముక్కు పచ్చలారని చిన్నారి తండ్రిని ఉపవయస్కుడైన బంగారు బిడ్డను భూమాత ఒడిలో పారవేశారా? పుట్టినరోజు పండుగకు బదులుగా మృత్యు దినానికి ముహూర్తం పెట్టారా! మధుర పదార్థముల రుచి చూడవలసిన నోటిలో మట్టిని నింపారా! అని మట్టిపై పడి విలపించసాగింది

ఇరుగు పొరుగులంతా గుమిగూడారు జరిగిన ఘోరాన్ని ప్రత్య క్షంగా తిలకించారు గోరా కిరాతకుడిలా ప్రవర్తించాడని పలవరిస్తున్నారు భక్తికయినా ఒక హద్దంటూ వుండాలని నిర్ణయిస్తున్నారు ఇది క్షమించ రాని నేరమని నిర్ధారణ చేస్తున్నారు

ఆవేదనతో క్రుంగిపోతున్న గోరా తల పైకెత్తి గుమిగూడిన జన సమూహమునకు చేతులెత్తి నమస్కరిస్తూ "తల్లులారా! తండ్రులారా! ఈ గోరా మీబిడ్డలాంటివాడు క్షమించండి ఏనాడో చేసుకున్న పాప ఫలితమే చేజేతులా తనయుడ్ని చంపుకొని వ్యథ చెందుతున్నాను నా బిడ్డకు అన్యా యంచేసి నేను మీ ఎదుట దోషిగా నిలబడ్డాను మీరైనా మీబిడ్డవైన గోరాను అర్థం చేసుకోండి అన్నాడు

"ఆహా! ఎంతటి ఉదాసీనత? ఇతడికి హృదయంలేదు" అన్నాడొక పెద్దమనిషి ఎంత పాషాణగుండె కాకపోతే తనబిడ్డనే హత్యచేస్తాడా?" అన్నాడు మరొక యువకుడు పాపం ఆ తల్లి కడుపును పుత్రశోకంతో నింపిన కఠినాత్ముడు అంటున్నది ఒక ముదుసలి

గోరా ఒక్కసారి జనసమూహాన్ని చూశాడు మట్టిలో పొర్లాడుతూ మట్టిలో కలిసిపోయిన తన బిడ్డకై పిచ్చిదానిలా కేరింతలు పెడుతున్న తన భార్య గంగాబాయిని చూశాడు ముక్కలవుతున్న హృదయాన్ని కూడగట్టు కొని మహాజనులారా ఏ తండ్రయినా తన స్వహస్తాలతో తన బిడ్డను

వధించుకుంటాడా? వంశనామాన్ని శాశ్వతంగా నిలిపే పుత్రరత్నాన్ని ఎంతటి దుర్మార్గుడైన చంపుకుంటాడా? బిడ్డ నాకాళ్ళక్రింద పడ్డాడనే విషయమే నాకు తెలియదు పాండురంగని నామామృతాన్ని పానం చేస్తున్న నాకు బాహ్య స్మృతి నశించింది అందుచేత ఈ ఘోరం జరిగిపోయింది నాస్థితిలో మీరుంటే ఏం చేసేవారో ఒక్కసారి ఆలోచించండి పాండురంగని వర ప్రసాదమంటూ మాకు ఒక్కగానొక్క బిడ్డ కలిగాడు అతటూ దక్క కుండా పోయాడు బిడ్డను పోగొట్టుకొని మేము చింతిస్తుంటే సానుభూతి చూపడానికి బదులుగా అపనిందలు వేస్తున్నారా? ఇది మీకు భావ్యమా? అని గోరా పలుకగా మారుపలుకలేని ఇరుగుపొరుగు తమలో తాము గొణు గుతూ వెళ్ళిపోయారు

బిడ్డను పోగొట్టుకున్న దంపతులు మిగిలారు గోరా తన భార్యను సమీపించాడు ఓదార్చడానికి ప్రయత్నించాడు ఆవిడకు భర్తపై కోపమింకా చల్లారలేదు మీరు నన్ను సమీపించకండి నాపట్ల మీరు తీరని అన్యాయం చేశారు నన్ను నా బిడ్డను వేరుచేసిన కఠిన హృదయం మీది అన్నది గంగాబాయి

ఎచ్చిదానా విఠూ నీకొక్కదానికే బిడ్డడా? నాకు మాత్రం కాదా? ఆవేశంలో నీవు ఏమి మాట్లాడుతున్నావో నీకు తెలియడంలేదు " అన్నాడు గోరా

అవును నాకెలా తెలుస్తుంది తొమ్మిదిమాసాలు మోసి కన్న తల్లికి మీ గుండె నిబ్బరమెలా వస్తుంది మీకున్న ఆత్మస్థైర్యం ఎలా కల్గు తుంది " అంటూ విలపిస్తుంది

ఆవిడనెలా శాంతపరచాలో గోరాకు అర్థంకాలేదు గంగాబాయి! బాగా ఆలోచించు గతంలో మనంచేసిన కర్మలయొక్క ఫలితాలే ఈనాటి మన అనుభవాలుగా తొంగిచూస్తాయి కర్మలకు ఫలితాలిచ్చేవాడు పాండు రంగడు విఠూకి మనకు ఉన్న సంబంధం ఒక్క సంవత్సర కాలమే బంధం తీరిపోయింది శరీరం దూరమైపోయింది మధ్యలో నేనొక మిషగా మిగిలాను దైవనిర్ణయాలను దాటటం ఎవరితరము? ఇచ్చినవాడే తీసుకొని

పోయాడు అన్నిటికీ పాండురంగడే శరణ్యమని భావించి జీవించడములోనే జీవితానికి సార్థకతఉంది బ్రతుకుకు పారమార్థికత కల్గుతుంది అనిచల్లగా చెబుతాడు గోరా గంగాబాయి ఆక్రోశం ఆకాశాన్నంటింది భగవంతుడా! ఇక ఆ దౌర్భాగ్యుడి పేరు నావద్ద ఎత్తకు భగవంతుడనేది కేవలమొక మానసిక భావన అసలు భగవంతుడు లేనేలేడు అసమర్థులైన కొందరు వ్యక్తులు భగవంతుని సృష్టించారు అప్రయోజకులైన కొందరు సోమరులు "కర్మ-జన్మ అని ఏకరువు పెడుతున్నారు దైవమనేది మానవుని మనసులో ఏర్పడిన జాడ్యం కడిగినాపోని కాలుష్యం" అంటూ ఇంకా ఏదేదో చెప్పసాగింది గోరా కోపోద్రిక్తుడయ్యాడు తనను నిందిస్తే భక్తుడు సహించగలడుగాని భగవంతుని దూషిస్తే భరించగలడా? గోరా ఆవేశాన్ని ఆపుకోలేకపోయాడు చూడు ఈ క్షణమే నిన్నేం చేస్తానో? అంటూ చేయిఎత్తి గంగాబాయి మీదకు ఉరికాడు భయకంపితురాలైన గంగాబాయి వణికిపోతూ తప్పించుకొనుటకు మరొక తరుణోపాయంలేక నన్ను ముట్టుకుంటే పాండురంగని శాసించినట్లే అని ఒట్టేసుకుంది

గోరా ఎత్తిన చేతిని దించేసుకున్నాడు ఇలా కొన్నిరోజులు గడిచాయి ఆవేశంలో తానన్నమాట పాపం ఆవిడ విషయంలో శాపంగా పరిణమించింది నన్ను ముట్టుకుంటే పాండురంగనిమీద ఆన అనడాన్నిగోరా యధాతథంగా గ్రహించాడు ఆనాటినుండి భార్యను ముట్టడం మహాపాపంగా భావించాడు పాపం గంగాబాయి బ్రతుకు సరాసరి గంగలో కలిసినట్లైంది ఉన్న బిడ్డడు గతించిపోయాడు తాను పెట్టిన ఒట్టు తన జీవితానికే తీరని అన్యాయం చేసింది గోరా ఆడినమాట తప్పడు ఇక తనకు పిల్లలు కలిగే అదృష్టం లేదు వంశనామంకూడా ఆడుగంటిపోయే ప్రమాదం వాటిల్లుతున్నది ఆలోచనారహితంగా మాట్లాడినమాట ఇన్ని ఆపదలకు దారితీస్తుందని పాపం తనకుమాత్ర మేమితెలుసు? రోజులు రోజుల వెంబడి వారాలు వారాల వెంబడి మాసాలు గడుస్తున్నాయి కానీ గంగాబాయి హృదయంలో వ్యాపించియున్న అంధకారం అదృశ్యం కాలేదు

పుత్రశోకం దూరం కావడానికి తల్లిదండ్రులువచ్చి గంగాబాయిని పుట్టింటికి తీసుకొని పోయారు గంగాబాయికి జరిగిన అన్యాయాగూర్చి

తల్లిదండ్రులు చింతించారు తరుణోపాయ మాలోచించారు గంగాబాయికి ఒక ఒక్కటి ఆలోచన వచ్చింది తన భర్త సత్యసంధుడు తన నిర్ణయ మికమారదు తనవంశనామం నిలవడానికి మార్గంమొక్కటే గోచరిస్తున్నది తన భర్తకు రెండవపెళ్ళి చేయడమే సరియైన మార్గమని తోచింది తన సోదరియైన విమల అయితే అనుకూలవతియని భావించి తన అభీష్టమును తల్లిదండ్రులకు తెలియచేసింది బుద్ధిమంతుడైన గోరాకు విమల నిచ్చి పెండ్లి చేయడానికి తల్లిదండ్రులు అంగీకరించారు

గంగాబాయి పెద్దాకి చేరుకుంది భర్తను సమీపించి తన మనోభీష్ట మును తెలియచేసింది గోరా నవ్వుతూ గంగాబాయి! బాగా ఆలోచించు కరుణాసముద్రుడైన పాండురంగడు మనపై కృపాదృష్టిని సారించాడు బంధాలన్నీ మనకు దూరంచేశాడు మనమధ్యకూడా ఒక పవిత్ర బంధాన్నే మిగిల్చాడు సదా భగవన్నామామృతమును గ్రోలుతూ తరించే అవకాశాన్ని మనకు ప్రసాదించాడు అశాశ్వతమైన వంశ ప్రతిష్టలకు అర్రులుచాస్తూ మోహవలయంలో పరిభ్రమించడం ఎంతటి అవివేకమో బాగా ఆలోచించు ద్వితీయ వివాహము ఆశించదగింది కాదు అని తెలిపాడు

గంగాబాయికి గోరా మాటలు రుచించలేదు ఎలాగైనా ద్వితీయ వివాహము జరిగి తీరవలసిదేనంటూ పట్టుపట్టింది గోరా ఆలోచించాడు పుత్రశోకంతో అలమటిస్తున్న గంగాబాయికి ఈ విధంగానైనా మనశ్శాంతి ఏర్పడుతుందేమోనని భావించి ద్వితీయ వివాహానికి అంగీకరించాడు

గోరా విమలల వివాహము వైభవంగా జరిగింది గంగాబాయి మనసు శాంతించింది కన్యాదానం చేసిన మామగారు గోరాను సమీపించి "నాయనా! గోరా నీవు గుణవంతుడవు బుద్ధిమంతుడవు నీలోని సుగుణ ములను చూసే మేము మా ఇద్దరు బిడ్డలను నీకు అప్పగించినాము ప్రాజ్ఞుడ వైన నీకు ప్రత్యేకించి చెప్పనవసరంలేదు గంగాబాయిని ఎలాచూసుకుంటు న్నావో విమలాబాయినికూడ అలాగే చూసుకోవలసిందని అని తెలియ చేశాడు

మామగారి మాటలు గోరాకు మరోవిధంగా స్ఫురించాయి గంగా

బాయిని చూసుకుంటున్నట్లే విమలాబాయినికూడా చూసుకోమని మామగారు తెలియచేశారు గంగాబాయిని తాను తాకడు కనుక మామగారి మాట ప్రకారం విమలాబాయినికూడా తాకడానికి వీలులేదు అలాగే జీవించాలని గోరా నిర్ణయించుకొని ఇద్దరు భార్యలతో కలిసి పెర్డాకి చేరాడు

గోరా ప్రవర్తన గంగాబాయికి అంతుపట్టలేదు విమలాబాయి పట్ల తాను ఎందుకు ఇంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తున్నాడో తెలియచేయవలసిందని ఒకనాడు గోరాను ప్రశ్నించింది గోరా జరిగిన విషయమంతా పూసగ్రుచ్చినట్లు గంగాబాయికి తెలియచేశాడు గంగాబాయికి మతిపోయినట్లయింది తన జీవితంలో జరిగిన ఏ అన్యాయాన్ని రూపుమాపడానికి తాను ప్రయత్నించిందో ఆ అన్యాయమే తన సోదరి జీవితంలోకూడ తొంగిచూసిందని తెలియగానే దుఃఖం ఆపుకోలేక పోయింది తానే తన చేతులారా విమలాబాయి గొంతు కోసినట్లు భావించసాగింది ఎంత ఆలోచించి మాత్రం ఏం లాభం? గోరా నైతిక శిక్షణగల వ్యక్తి తానంటూ నిర్ణయం తీసుకొన్న తరువాత ఇక ఎట్టి పరిస్థితులలోనూ వెనుకాడుటమంటూ వుండదు

ఒకనాటి రాత్రి గోరా నేలపై పడుకొని నిద్రించుచుండగా గంగాబాయికి ఒక ఆలోచన స్ఫురిస్తుంది తన ఆలోచన ప్రకారం గంగాబాయి విమలాబాయిలు గోరాకు ఇరువైపుల పడుకుంటారు గోరా నిద్రించుటను కనిపెట్టి గోరా చేతుల్ని ఇద్దరి హృదయాలపై ఉంచుకొంటారు ఎలాగూ గోరా చేతులు నిద్రలో తమపై పడ్డాయిగనుక ఇక దోషములేదని నిర్ణయించవచ్చునని గంగాబాయి సంకల్పము

గోరాకు మెలుకువ వచ్చింది తన చేతులు తన భార్య లిరువురిపై వుండటము గ్రహించాడు తెలిసిచేసినా తెలియకచేసినా తప్పు తప్పేనని భావించాడు చేసిన అపరాధానికి ప్రాయశ్చిత్తం చేసుకొన సంకల్పించాడు కత్తిని తీసుకొనివచ్చి స్తంభమునకుకట్టి తన రెండు చేతులను ఖండించుకొన్నాడు రక్తము ప్రవాహమువలె స్రవించుచుండగా గోరాకుంభారు ప్రశాంతచిత్తుడై పాండురంగ నామ జపంచేస్తూ కూర్చున్నాడు

ఈ భయంకర దృశ్యాన్ని గాంచిన గంగా విమలాబాయిలు ఆవేద నతో కుంమకుపోయారు భర్త సాహసానికి దిగ్భ్రాంతి చెందారు గంగా బాయి కలతచెందిన మనస్కురాలైంది తాను ఏది సంకల్పించినా దాని పర్యవసానము విడ్డూరంగానే మారుతున్నది ఇక తమ జీవితంలో శాంతి ఘడియలు దూరమైనట్లే గంగాబాయి భావించింది

తమ గృహస్థ జీవనంలో చీకటి కిరణాలు ప్రసరింపసాగాయి శాంతిలేని సంసారమైంది సుఖంలేని కుటుంబంగా తయారైంది మానసి కంగా ఎలాగూ ఛిద్రంగానేవుంది భౌతికంగాకూడా దినదినానికి పరిస్థితి దిగ జారి పోతూవుంది

గోరా భార్యలిద్దరినీ ఓదార్చాడు ఆధ్యాత్మిక జీవనమనేది నల్లేరు పై బండినడక నా ప్రారబ్దము ననుసరించి నా కరద్వయము ఖండించబడి నదేగాని ఇందులో మీ పాత్ర ఇసుమంతైనా లేదు అనవసరంగా వ్యథ చెందకండి నేను కరవిహీనుడనయ్యానని మన భుక్తి జరుగదని మీరు భావించి బాధపడనవసరము లేదు నా చేతులు పోయాయి నాకుండినవి రెండు చేతులే భగవంతునికి అనంతహస్తాలు మనల్ని అనుగ్రహించి కాపాడడానికి తనకు మార్గాలున్నాయి భక్తపరాధీనుడైన భగవానుని అభయహస్తము భక్తులకు రక్షించడానికేవుంది సంశయాలను సాగరంలో వేసి ప్రశాంత చిత్తముతో నామస్మరణ కొనసాగించండి అంటూ తెలియ చేస్తాడు గోరా

సంపూర్ణ శరణాగతుడై జీవించే గోరాను పాండురంగడు తప్ప మరెవరు ఆదుకుంటారు? ఒకనాడు పాండురంగడు మారువేషంతో ఊర్లోకి వచ్చి గోరా ఇంటికివస్తాడు గోరాను సమీపించి అయ్యా నేను కుమ్మ రిని పండరీపురము మా స్వగ్రామము వృత్తి లభించని కారణముచేత ఈ గ్రామమునకు వచ్చాను నాకు పని ఇచ్చి కాపాడండి నాకు అన్నవస్త్రము లిచ్చిన చాలును ధనంతో నాకు పనిలేదు అని తెలియచేస్తాడు

గోరా సంతసించి నాయనా! పండరీపురమునుండి ఏతెంచిన నీవు సాక్షాత్తు పాండురంగదేవునివలె కన్పట్టుచున్నావు సమయానికివచ్చి మాకు

సాయం చేస్తున్నావు నాకు కరములు లేవు నీవు నే నుపయోగించు ఎని ముట్లతో కుండలుచేసి విక్రయింమము వచ్చిన పైకము పాండురంగ ప్రసాదంగా భవించిజీవిస్తాము అని పలుకగా పాండురంగడు సంతసించి గోరా గృహాన్నే దేవాలయంగా మార్చుకొని నివసించసాగాడు

పాండురంగడు మట్టికలిపి కుండలు చేసేవాడు ఆ మట్టి పనిముట్లు ఎంత పుణ్యం చేసుకున్నాయో! తాను తయారుచేసిన కుండల్ని పండరీపురం తీసుకొనివెళ్ళి విక్రయించేవాడు భగవానుడు తయారచేసిన ఘటములపై శంఖచక్రాదులు ప్రస్ఫుటంగా తెలియవచ్చేవి ప్రజలంతా విశేషంగా కొని తెసుకెళ్ళేవారు

కార్తీక శుద్ధ ఏకాదశి పర్వదినం వచ్చింది జ్ఞానదేవ నామదేవాదులు పండరీపుర ఆలయంలో సంకీర్తన చేయడానికి వచ్చారు గర్భాలయంలో ప్రవేశించారు పాండురంగదేవుని దర్శించారు స్వామిని దర్శించిన జ్ఞాన దేవ నామదేవుల ముఖసరోజాలు వాడిపోయినవి స్వామి విగ్రహం చైతన్య విహీనమైయుంది పాండురంగడు ఆలయాన్ని వీడి ఎక్కడికో ప్రయాణం సాగించి యున్నాడని గ్రహించారు భక్తవత్సలుడైన భగవానుడు భక్తుల కొరకే పయనమయ్యుంటాడని గ్రహించారు భగవానుని అన్వేషిస్తూ జ్ఞాన దేవ నామదేవులు బయలుదేరారు దారిలో సంతనుండి కుండలు కొని తీసుకవెళ్తున్న కొందరు భక్తులు కనిపించారు శంఖచక్రాదులు పేర్చిన యున్న ఆ కుండల్ని జ్ఞాన దేవులవారు చూసారు అవి ఎవరు తయారు చేశారో నామదేవులవారు అడిగి తెలుసుకున్నారు ఆ వ్యక్తి తెర్డోకికో గోరాకుంభారు ఇంటిలో వున్నాడని తెలుసుకొని అక్కడకి వెళ్ళారు

గోరా అమితానంద భరితుడై జ్ఞానదేవ నామదేవాదులను ఆహ్వానించాడు "గోరా మీ ఇంటిలో కుండలుచేయువ్యక్తి ఎవరు? అతనితో మాట్లాడాలని వచ్చాము అన్నారు జ్ఞానదేవులవారు వెంటనేగోరా ప్రసన్న వదనంతో స్వామీ! అతడొక త్యాగపురుషుడు నిష్కల్మషహృదయుడు జీవకారుణ్యంతో నిండిన అంతఃకరణ కలవాడు ఇప్పుడే లోనికి వెళ్ళారు పిలుస్తాను అంటూ లోనికివెళ్ళిచూస్తాడు ఇంకెక్కడుంటాడు? జ్ఞానదేవ

నామదేవాదులు వచ్చిన మరుక్షణమే రక్షకభటుల్నిచూచి చోరుడు ఎలాయ నంచి త్రగించినట్లు పాండురంగడు గుట్టు చప్పుడుగాకుండా బయలుదేరి పండరీపురం గుడిలో ప్రవేశించాడు

సంభ్రమాశ్చర్యాలతో గోరా తిరిగివచ్చి స్వామీ ఆశ్చర్యంగా యున్నది అతడు ఇంతకుముందే ఇలాగే ఇంటి లోపలికి వెళ్ళాడు చూస్తుండగానే మటుమాయం కావడం నా మనసుకు ఊహాతీతంగాఉంది అని చెబుతాడు

పులకాంకితుడై నేత్రములవెంట బాష్పములు రాలుచుండ నామ దేవులవారు గద్గద స్వరముతో గోరా ఆ వ్యక్తి ఇంకెక్కడుంటాడు? అతడు అదృశ్యం కావడంలో ఆశ్చర్యమేముంది? అంతా నిండినవాడు ఎక్క డికి పరిమితం? అంటూ మాట్లాడలేక ఆగిపోతాడు

విస్మయచిత్తుడైన గోరాకు నామదేవులవారి మాటల్లోని భావం అర్థం కావేము ఆ వెమిటి స్వామీ! మీరేమంటున్నారు? నాకు అర్థం కావ డం లేదు అని నమ్రతతో అర్థిస్తాడు గోరా

జ్ఞానదేవులవారు గోరాను చూచి గోరా! మీ ఇంటిలో పనిచేసిన వ్యక్తి ఎవరోకాదు మనస్వామి పాండురంగడే భక్తాగ్రగణ్యుడవైన నీకు వచ్చిన ఇక్కట్లనుచూచి ఓర్చుకోలేక పాండురంగడే నీ ఇంటిలో సేవ చేయడానికి అరుదెంచాడు గోరా నీ వెంతటి పుణ్యపురుషుడవో వర్ణించు టకు నాకు శక్తి చాలకున్నది పరంధామునే నీ ఇంటి పనివాడుగా పెట్టు కున్నావు నీకొరకు స్వామి మట్టికాలిపాడు కుండలుచేశాడు ఆ కుండల్ని మోసుకొనివెళ్ళి విక్రయించాడు ఆ కుండల్ని కొన్నవారెంత అదృష్టవం తులో కదా! అంటు గగుర్పాటుతో స్తంభించి నిలబడిపోతారు

గోరా నేత్రాలవెంట కన్నీళ్ళు ధారాప్రవాహంలో కారుతున్నాయి నోటినుండి మాట పెగలడంలేదు దీనదయాళుడైన పాండురంగ భగవానుని అనంత దయాస్వరూపమును అనుభూతి పొందిన జ్ఞానదేవ నామదేవ గోరా కుంభారాదులు గాలిలేనిచోట ఉంచబడిన దీపాలవలె నిలచిపోయారు

కంఠావరోధ రోమాఞ్చాశ్రుభిః పరస్పరం లపమానాః పరమ భక్తులు పరస్పరము గద్గద స్వరముతో పులకాంకితగాత్రులై ఆనంద

బాష్పములు రాలుచు డ భగవద్భక్తినిగూర్చి సంభాషించుకొనుచున్నారని" నారదమహర్షి భక్తి సూత్రాలలో తెలియచేస్తారు

జ్ఞానదేవులవారు గోరాను సమీపించి గోరా! మేము స్వామిదర్శ నార్థమై పండరీపురం వెళ్తున్నాము నీవూ కుటుంబసమేతముగా మాతో రావలసిందని తెలుపగా గంగా విమలాబాయిలతో కలసి జ్ఞానదేవ నామ దేవుల వెంట గోరా పండరీపురం చేరుతాడు

చంద్రభాగా పవిత్ర పుణ్యతీర్థంలో స్నానమాచరించి గర్భాలయం లోకి ప్రవేశిస్తారు పాండురంగడు ప్రసన్నవదనంతో దర్శనమిస్తాడు నామ దేవులవారి ఆనందానికి అవధులులేవు వెంటనే నామదేవులవారు అమృత గానాన్నాలపిస్తూ నృత్యం చేయసాగారు భక్తులందరు మేనులు మరచి నామంచెబుతూ నృత్యం చేస్తున్నారు గోరా హృదయం ద్రవించింది తాను గంతులువేస్తూ చేతులు చరచశానికి అప్రయత్నంగా ప్రయత్నించాడు జై జై పాండురంగవారి గోరా కరద్వయము మామూలుగా వచ్చేసింది భగవానుని దయనుగాంచి భక్తులంతా పరవశులయ్యారు

పదునారు దివ్యకళలతో పా ం డు ర ం గ దే వు డు గోరాకు దర్శన మిచ్చాడు రుక్మిణితల్లి ప్రత్యక్షమై గోరా కుమారుడైన విఠూని గంగా బాయికి అందించింది ఈ అపూర్వ దృశ్యమునుగాంచి నామదేవులవారు ఆనందభాష్పాలు విడిచారు

పాండురంగ భగవానుడు గోరాను సమీపించి మందహాసవదనంతో గోరా అంతఃకరణ శుద్ధితో నన్ను చేరు భక్తులకు గృహస్థాశ్రమమే ఆదర్శమైనది నీవు నీ భార్య లిరువుర్ని గ్రామంచు భగవద్గుణ శ్రవణ కీర్తనాదులయందు మనసును లగ్నంచేసి జీవించు నీవు తరించు ఇతరులు తరింపటకు సాయపడు అని తన అమూల్య సందేశాన్నిచ్చి అదృశ్య మయ్యాడు

భగవానుని సందేశమును హృదయములో ప్రతిష్టించుకొని ఆదర్శ జీవనమును గడిపి చివరికి పాండురంగని దివ్యచైతన్యంలో గోరా ఐక్య మయ్యాడు.

♦ జై జై భక్తవత్సల భగవాన్‌కీ ♦



# జనాబాయి

భగవంతుడు మాధుర్యమూర్తి భగవన్నామం అతి మాధుర్యదీప్తి భగవద్భక్తులకు భగవన్నామం ప్రాణం బ్రతుకును నడిపించే మణిదీపం భక్తుల మనోవీధులలో నామం సదా విహరిస్తూనే ఉంటుంది భక్తులు ఏది విన్నా నామ మాధుర్య శబ్దంగానే ప్రతిధ్వనిస్తూ ఉంటుంది మధురాతి మధురమైన నామం వీనులకు విందు చేయడమేగాక జీవితానికే స్వస్థతను చేకూరుస్తుంది బ్రతుకు బాట చూపిస్తుంది మనసుకు ఊరట కల్పిస్తుంది

చంద్రభాగాతీర నివాసియై, భక్తులపాలిట కల్పవృక్షమై ఊహాకందని దివ్యవిభూతులతో విరాజిల్లే పాండురంగని నామం నమ్మిన ప్రతి ఒక్కరిని ధన్యజీవులుగా మార్చింది మధురమైన నామామృతాన్ని పానంచేసి ఎందరో ముక్తిధామమలంకరించారు నామ మహిమ వర్ణనాతీతం దివ్య నామ స్మరణ ప్రభావముచే భగవంతునితో భాషించిన భక్తులు క్రీడించిన భాగవతోత్తములు, పరమాత్మచే గృహకృత్యాలు చేయించుకున్న భక్త సాధ్వీమతల్లులు భగవద్భక్తిని నిరూపించిన సంత్ పురుషులు పాండురంగ భక్త విజయములో అడుగడుగునా దర్శనమిస్తారు

ప్రేమమయుడైన భగవంతుని అపార కరుణా దృష్టియే భక్తి విజయమునకు పునాది భక్తులనువిడచి వుండలేని భగవంతుని అశక్తతయే భక్త జనులకు శ్రీరామరక్షయై వారి కీర్తి ఆచంద్రార్కం శోభిల్లునట్లు చేయించింది అంతటా నిండియున్న చైతన్య స్వరూపుడైనను భక్తుల విషయములో భగవానుడు పరాధీనుడైనాడు ఆడించినట్లు ఆడాడు పాడించినట్లు పాడాడు

చిలిపి కృష్ణుని కొంటెపనులు అరికట్టవలయునని యశోదామాత శ్రీకృష్ణుని త్రాటితో రోటికి కట్టాలని సంకల్పిస్తుంది బంధించడానికి తెచ్చిన త్రాడు చాలలేదు మళ్ళీ కొంత త్రాడు తెస్తుంది అదీ చాలలేదు ఇంకా అనేక పర్యాయాలు ప్రయత్నిస్తుంది ప్రయత్నాలు ఫలించటము లేదు అలసిపోయిన యశోదాదేవియొక్క నిస్సహాయ స్థితిని గమనించి ప్రేమతో తనకు తానుగా లొంగిపోతాడు శ్రీకృష్ణుడు బ్రహ్మాండమంతయు తన గర్భంలో ఇముడ్చుకొనియున్నను బ్రహ్మాదిదేవతలు తనకు శిరసావహించి విధేయులైయున్నను తాను సర్వశక్తిసంపన్నుడయ్యును తనకై జీవించే భక్తులకు లొంగిపోతాడనే సత్యమును చాటిచూపినాడు

పరమ పవిత్రమైన ఈ భారత భూమిలో ఎందరో భక్తులు ఈ సత్యాన్ని తమ జీవితాలద్వారా ఋజువుచేశారు కష్టసమయాలలో సంపూర్ణ శరణాగతులై భక్తులు జీవనయాత్రను సాగించుచుండ భగవంతుడు స్వయంగా వారి చెంతచేరి కష్టాలను రూపుమాపిన సన్నివేశాలు ఎన్నో గలవు భగవత్ప్రేమకు పాత్రులై భగవద్భక్తిని ప్రపంచములో ప్రకటించి ప్రదర్శింపచేసిన భక్తపుంగవు లెందరో గలరు అట్టి భక్తులకోవలో పరాకాష్టనందిన ఆదర్శజీవి భక్త జనాబాయి పాండురంగని చరణదాసియై తరించిన పుణ్యజీవి

పరమ పుణ్యదినమైన కార్తీక శుద్ధ ఏకాదశినాడు అయిదు సంవత్సరముల బాలికయగు జనాబాయిని వెంటపెట్టుకొని ఆమె తల్లిదండ్రులు పాండురంగ దర్శనానికై పండరీపురం వస్తారు చంద్రభాగాలో స్నానమాచరించి విఠలనాధుని దర్శనానికై వెళ్తారు ప్రప్రథమంగా జనాబాయి పాండు

రంగని దర్శించింది ఆ ప్రథమ సమాగమములోనే తన జీవితాన్ని పాండు రంగని పాదాలకు అంకితం చేసేసింది దర్శనానంతరం ఇంటికి వెళ్దాం రమ్మని తల్లి దండ్రులు పిలుస్తారు కానీ తాను కాలు కదపలేక పోతుంది దయామయుడైన పాండురంగని సేవలో తన జీవితాన్ని చరితార్థం చేసు కుంటానని స్వామిని వదలి తాను ఇంటికి రాలేనని సమాధానమిస్తుంది ముక్కుపచ్చలారని ఆ పసిబాలిక నుండి వచ్చిన మాటలు తల్లి దండ్రులను తీవ్ర శోకానికి గురిచేశాయి

అమ్మా! జానా! నీవలా మాట్లాడటం బాగులేదు కని పెంచి పెద్ద చేస్తున్న తల్లి దండ్రులను వదలి ఈ ఆలయంలో ఉండిపోతాననడం సబ బుగా ఉందా? నీమీద మేమెన్ని ఆశలు పెట్టుకొని జీవిస్తున్నామో నీకు తెలుసా? నిన్ను వదలి మేము జీవించగలమా? జనా! రాతల్లీ! నా మాటవిని ఇంటికిపోదాంపద అంటూ ప్రేమపూర్వకంగా పిలిచింది జనాబాయి తల్లి.

తల్లి మాటలు తదేకంగా విని. చిరునవ్వును ఒలకబోస్తూ అమ్మా! జన్మనిచ్చిన మాతృమూర్తివి నిన్నుబాధిస్తున్నందుకు క్షమించు మిమ్మల్ని వదలి నేను ఈ ఆ ల య ం లో ఉండిపోతాననడం సరి కాదన్నారు బాగుంది మీరు శాశ్వతంగా నన్ను మీ దగ్గరే ఉంచుకుంటారా? ఉంచుకో గలరా? పెళ్ళిచేసి అత్తవారింటికి పంపరా? అనాడైనా ఈ ఎడబాటు తప్పదు గదా ఈ మాయా ప్రపంచములో వ్యక్తులపై మనం ఏర్పరచుకొనే మమా తానురాగాలు ఒకనాడు నిర్దాక్షిణ్యంగా ఖండించబడుతాయనే సత్యం మీకు తెలియనిదికాదు దయఉంచి నన్ను క్షమించండి పాండురంగని దర్శించిన మరుక్షణమే నా హృదయం స్వామి పాదాల కంకితమైపోయింది పండరీ నాథుని సేవలో నా జీవితాన్ని ధన్యం చేసుకుంటాను నా శరీరంలో ప్రాణ మున్నంతవరకు పండరీపురం వదలడమంటూ జరుగదు ఇదే నా నిశ్చ యము నిర్ణయము అని ఖచ్చితంగా చెప్పింది జనాబాయి

ప్రయత్నాలన్నీ విఫలమయ్యేసరికి ఆ బాలికను ఆలయంలో వదలి పెట్టి తల్లి దండ్రులు హృదయావేదనతో వెళ్ళిపోయారు

జనాబాయి వెనుతిరిగి ఆలయంలోకి వెళ్ళింది కోటి సూర్య సమ ప్రభావంతో వెల్గొందుచున్న పాండురంగ భగవానుని తదేకంగా చూసింది భగవాన్ నీ కొరకు అందరిని వదలుకొని ఒంటరిగా వచ్చేశాను అని అప్రయత్నంగా పలికింది జనాబాయి సాగర తరంగాలవలె ఉవ్వెత్తున లేస్తున్నాయి జనాబాయి హృదయంలో ప్రేమకెరటాలు పరవశించిపోతూ తన మనోష్టాన్ని కీర్తనద్వారా తెలియచేస్తూ గానం చేసింది

యేరే యేరే మాఝ్యా రామా
మన మోహాన మేఘ శ్యామ
అహో సంతా మలా భేటీ
దేయి దేయి కృపా గోష్టి
ఆముచీ చుకవీ జన్మ వ్యాదీ
అమ్హా దేయివో సమాధీ
జానీ మ్హాణే చక్రపాణీ
కరీ ఎసే హో కరోని "యే రే"

"ఓ దయాస్వరూపా! మోహనాకారా ! నీవు నా హృదయంలో ప్రవేశించావు నా జన్మ ధన్యమైనది భగవాన్ నాకు సాధుజనుల సాంగత్యమును కల్పించు సంత్ పురుషుల ఆధ్యాత్మిక అనుభవము లను శ్రవణంచేసి తరించు భాగ్యమును నాకు అనుగ్రహించు సంసార భవబంధాలనుండి విముక్తిచేసి నాకు సద్గతిని ప్రసాదించు హే చక్రపాణీ సదా నీ దర్శనభాగ్యమును అందించి రక్షించుము అని అప్రయత్నముగా సుశ్రావ్య గానం చేసింది

భక్తాగ్రేసరుడైన నామదేవుడు అదే సమయానికి ఆలయానికి వస్తాడు జనాబాయిని చూస్తాడు ఆమె గానం వింటాడు ప్రసన్నవదనులైన ఆ బాలికలో గోచరించే భక్తిప్రవత్తులు నామదేవులవారిని ఆకర్షించాయి ఆమెను గురించి వివరాలు అడుగుతాడు వెంటనే జనాబాయి నా పేరు జనాబాయి పాండురంగడు నా జనకుడు రుక్మిణీదేవి నా జనని మీరు నా గురుదేవులు నన్ను రక్షించి దారిచూపండి అని పాదాలపై

పడుతుంది నామదేవులవారు అమితానందముతో జనాబాయిని తీసుకొనివెళ్ళి తనతల్లి గుణాబాయికి అప్పగిస్తాడు

ఒకరాత్రి పెద్దగాలివాన వస్తుంది నా మ దే వు ల వా రి ఇంటిలో అందరూ నిద్రిస్తుంటారు ఆ గాలివానకు వారి ఇంటిపైనున్న పూరికప్పు ఎగిరిపోతుంది అది గ్రహించిన పాండురంగడు సుదర్శనచక్రాన్ని ఇంటిపై గొడుగులా నిలిపి చెదరిపోయిన ఇంటికప్పును మరమ్మత్తుచేస్తుంటాడు జనాబాయి ఈ అపూర్వ దృశ్యాన్నిగాంచి ఆనందభరితురాలవుతుంది

ఇక్కడ ఒక సంశయము కలుగవచ్చు నామదేవులవారిపై భగవానునకు అంతటి ప్రేమయున్నదో పూరికప్పుబాగుచేయవలసిన అగత్యమెందుకు ఏర్పడింది? తనశక్తిచే సుందరమైన భవంతినే ప్రసాదించవచ్చునుగదా? అనే సందేహం రావచ్చు భగవంతుడు కరుణామయుడు అష్టైశ్వర్యములు భక్తులకిచ్చి వారిని ప్రాపంచిక తాపత్రయములో పడద్రోయడం తనకు ఇష్టముండదు బిడ్డ ఏడ్వగానే అవసరమైన సముచితమైన ఆహారాన్ని తల్లి అందించి తృప్తపడులాగున భగవంతుడు భక్తునకు ముఖ్యావసరములు మాత్రమే తీర్చుతూ భక్తిశ్రద్ధలు వక్రించకుండా కనికరిస్తూ కాపాడి రక్షిస్తుంటాడు భక్తుని పరిశుద్ధమొనర్చి తనపాదాలచెంతకు తీసుకుంటాడు

నామదేవులవారి ఇంటికప్పు సరిచేసి పాండురంగడు క్రిందికి దిగుతాడు జనాబాయి వెంటనే వెళ్ళి స్వామి పాదాలపై పడుతుంది హే భక్తవత్సలా దీననాథా! నీ అపారకరుణకు అనంతకోటి జోహార్లు నామదేవులవారి ఇంటిని బాగుచేయుటకు స్వయంగా నీవే రావాలా? భక్తులయెడ నీకుగల దయకు ఇది నిదర్శనము నా గురుదేవులైన నామదేవులవారు నిష్కళంక భాగవతోత్తములు వారిసేవ నాకు లభించుటకూడా నీ అనుగ్రహమే ప్రభూ నామదేవులవారి పరిచర్య భాగ్యమువల్లనే ఈనాడు మీ సహచర్య అదృష్టము కలిగింది అంటూ పారవశ్యంతో నమస్కరించింది జనాబాయి

పాండురంగడు మందహాసముతో జనాబాయి నామదేవుడు నా భక్తుడు నాకత్యంతప్రియుడు బాల్యమునుండి భగవదారాధన తప్ప మరో

కటి ఎరుగడు. భాగవతుల సేవయే పరమోత్కృష్టముగా భావించేవాడు సదా భగవన్నామాన్నే గానముచేస్తూ క్షణకాలము నామానికి దూరమైతే నీటి నుండి వేరుచేసిన చేపలా అల్లాడిపోయేవాడు నన్ను దర్శించనిదే జీవించ లేడు నాకు నైవేద్యము సమర్పించనిదే తాను గంగైనా ముట్టడు నామ దేవుని సంకీర్తన నా వీనులకు విందుగా ఉంటుంది నామదేవుడు దివ్య పారవశ్యంతో కీర్తన గానము చేస్తుంటే నేను తనువు మరచేవాణ్ణి నృత్యము చేసేవాణ్ణి ఈ విధంగా నిరంతరము నాసేవలో అహోరాత్రాలు తపించే నామదేవుని ఇక్కట్లు నేను తొలగించకపోతే మరెవరు తొల గిస్తారు? అందుకనే నామదేవునికి నిద్రాభంగము కలుగకుండా నేనే వచ్చి ఇంటికప్పును సరిచేశాను అని తెలియచేశాడు.

భగవానుని దివ్యకరుణను భగవానుని అమృతవాక్కులద్వారానే విన్న జనాబాయి శరీరము కంపించింది గద్గద స్వరముతో "హే భక్తా ధీనా! భాగవతప్రియా! విఠలా! నీ కృపవర్ణింప వీలులేదు నీ సేవచేయు భక్తులు ధన్యులు భక్తుల నుద్ధరింమటకు ప్రత్యేకముగా ఏతెంచిన అవ తారపురుషడవునీవు స్వామీ! కృపాసాగరా ఈ దీనురాలిని రక్షించు ప్రభూ ఒక్క క్షణమైనా నా హృదయముతో నీ నామస్మరణ దూరము గాకుండా ఉండేలా ఆశీర్వదించు పాండురంగని దాసిగా నామదేవులవారి పరిచారికగా ఈ జీవితము సాగిపోయేలా దీవించు అని జనాబాయి ప్రార్ధించింది

నామదేవులవారు ఇంతలో మేలుకొన్నారు దేదీప్యమానంగా కిరీటి ధారియై శోభిస్తున్న పాండురంగ భగవానుని అపూర్వ దర్శనమునకు అచ్చెరువంది భక్తిభావముతో స్వామి పాదాలనంటి సాష్టాంగ నమస్కా రము చేశారు నామదేవులవారు

"స్వామీ అర్ధరాత్రి సమయాన తమరు ఈ దీనుడి గృహంబున కరుదెంచుటకు కారణమేమియో గ్రహించవచ్చునా? అని వినమ్రతతో అడిగాడు నామదేవుడు

"నామదేవా ఈనాడు నాకు చాలా ఆకలిగా యున్నది జనాబాయి చేతివంట భుజించాలని వచ్చాను తయారు చేయించు అంటాడు ఆకలంటే ఏమిటో తెలియని దివ్యశరీరధారి పాండురంగ భగవానుడు

నామదేవులవారు మహాప్రసాదమనుకొంటూ "స్వామీ! అతిత్వరలో తమకు ఆహారము సిద్ధము కాగలదు అలసిపోయినట్లున్నారు ఈలోగా విశ్రాంతి తీసుకోండి అంటూ స్వామికి దిగువగా కూర్చొని పాదసేవ చేస్తుంటాడు నామదేవుడు

జనాబాయి వంటపూర్తి చేసింది పాండురంగ భగవానునితోకూడి నామదేవులవారి కుటుంబ సభ్యులంతా భోజనానికి కూర్చుంటారు జనాబాయి వడ్డిస్తుంట్టుంది పాండురంగడు అమితానందముతో విందారగించడానికి ప్రారంభిస్తాడు జనాబాయి వంటఇంటిలోకి వెళ్ళి దుఃఖవదనురాలై విల పిస్తుంది "హే పండరీవాసా పాండురంగా! నేను చేసిన నేరమేమిటి? నీతోడుగా కూర్చుని నీ పవిత్ర సన్నిధానములో భుజించే అపూర్వ అవ కాశమునకు నోచుకొని అభాగ్యురాలను అదృష్టహీనులను ఎవరూ సరి చేయలేదేమో?" అని దుఃఖిస్తుంది సకలజీవకోటికో అంతర్యామిగా యున్న పాండురంగ భగవానుడు జనాబాయి హృదయములో కదలిన కల్లోల తరం గాలను గుర్తించాడు నామదేవా నాకు కొంత విశ్రాంతి అవసరమై యున్నది తరువాత భోజనము చేస్తాను నా ఆహారమును వేరుగా భద్ర పరచవలసింది " అని చెప్పి వెళ్ళి పడుకుంటాడు నామదేవులవారు స్వామికి పాదసేవ చేస్తారు స్వామి నిద్రించినట్లు నటిస్తారు నామ దేవులవారు కూడా వెళ్ళి పడుకుంటారు అందరూ నిద్రపోయారు

పాండురంగడు లేచాడు జనాబాయిని లేపాడు జనా! నాకు ఇప్పుడు ఆకలిగా యున్నది భద్రపరచిన ఆహారమును తీసుకొనిరమ్మా!" అన్నాడు

జనాబాయి ఆహారము తెచ్చిపెట్టింది స్వామి భుజించడానికి కూర్చు న్నాడు జనాబాయి స్వామికి ఎదురుగా కూర్చుని ఆ దివ్యమంగళ స్వరూ పాన్ని వీక్షిస్తూ ఉండింది స్వామి కొద్దిగా రుచిచూసాడు "జనా! భోజ

నము చాలా రుచికరముగా ఉంది ఇంత మధురమైన రుచికర పదార్ధములను నేనెప్పుడూ ఆరగించలేదు నీవు కొస్త తిను అంటూ స్వామి స్వహస్తాలతో జనాబాయికి తినిపించాడు ఆహా! ఎవరికి కలుగుతుందా భాగ్యం? బ్రహ్మాదిదేవతలుకూడా ఆ అదృష్టానికి నోచుకోలేదు స్వామి అమృత హస్తాలతో అందించిన పదార్ధమును భుజించగానే జనాబాయి అనూహ్య ఆధ్యాత్మిక అనుభవ శిఖరాలనందుకుంది స్వామి తాను ఆరగిస్తూ జనాబాయికి తినిపించిన ఈ అపూర్వ అవకాశము ఎందరికి లభించి ఉంటుంది? బృందావనంలో గోపబాలురకు కలిగి ఉంటుందేమో రాధాదేవికి ప్రాప్తించి ఉంటుందేమో ఆ కోవకు చెందిన పరమ భక్తురాలు గనుకనే జనాబాయి ఆ అదృష్టానికి నోచుకుంది జనాబాయితో ఆధ్యాత్మిక విషయాలు ముచ్చటించి బ్రహ్మముహూర్తకాలంలో అదృశ్యమై ఆలయంలో భక్తులకు దర్శనమివ్వడానికి బయలుదేరి వెళ్ళాడు పాండురంగిడు

ఒకసారి ఆషాఢ శుద్ధ ఏకాదశినాడు నామదేవులవారి గృహానికి జ్ఞానదేవులు నివృత్తినాధుడు సోపాన్ ముక్తాబాయి వస్తారు వారివెంట రామానందస్వామి కబీర్‌దాస్‌కూడా వస్తారు ఆ సమయానికి నామదేవుల వారు ఇంటిలోలేరు ఇంతలో జనాబాయి తాను ఆవుపేడతో చేసిన పిడకలు ప్రక్కింటి ఆవిడ తీసుకవెళ్ళిందని ఆవిడతో జగడమేస్తూ వుంటుంది వాగ్వివాదాలు తీవ్రమవుతుంటాయి ఈ సన్నివేశాన్ని వీక్షిస్తున్న భక్తులకు ఆశ్చర్యము కలుగుతుంది భక్త కబీర్‌దాస్ ముందుకువచ్చి అమ్మా! జనాబాయి! నీవూ నీ పొరిగింటి ఇల్లాలు ఇద్దరూ పిడకలు తయారుచేశారు ఆవిడ తీసుకున్నది నీవు తయారుచేసినవేనని ఎలా చెప్పగలవు? అని ప్రశ్నిస్తారు అందులకు జనాబాయి మహాత్మా? వాస్తవాన్ని గ్రహించగలిగే ఉత్తములు ధన్యజీవులుమీరు న్యాయమెవరిదో మీరే తీర్పుచెప్పాలి నేను పిడకలు చేయునపుడు నా ఆరాధ్యదైవమైన పాండురంగని నామం చెబుతూ చేశాను మీరు నేను తయారుచేసిన పిడకలను చెవిదగ్గర ఉంచుకోగానే అవి పాండురంగని నామాన్ని వినిపిస్తాయి" అని చెబుతుంది కబీర్‌దాస్ పరీక్షచేసి చూస్తారు జనాబాయి తయారుచేసినపిడకలు శ్రావ్యమైన ధ్వనితో పాండురంగ పాండురంగ యని దివ్యనామాన్ని వినిపిస్తాయి

జనాబాయి భక్తిప్రపత్తులకు కబీర్‌దాసాది భక్తులు పరవశులై ఆనందాశ్రువులు విడుస్తారు

జనాబాయి కీర్తిప్రతిష్టలు నలువైపులా వ్యాపించాయి మహాభక్తురాలంటూ ప్రజలంతా ప్రశంసించేవారు ఆ పుణ్యమూర్తి దర్శనమే పావనమంటూ ఎందరో భక్తులు జనాబాయిని దర్శించడానికి అనేక గ్రామాల నుండి వచ్చేవారు జనాబాయిలో మహిమలు లేవు నామమహిమ తప్ప మరొక మహిమను ఆవిడ లక్ష్యపెట్టదు కరుడుగట్టిన భావరహిత సిద్ధాంతాలను ఆవిడ వల్లించదు అజీర్ణం చేసేటంతగా శాస్త్రవిషయాలను ఏకరువు పెట్టదు ఆచరణయే ఆవిడ వేదాంతము అహంకారము ఆవిడలో అన్వేషించినా అగుపించదు నమ్రతయే జీవనాధారంగా భావించి ప్రవర్తించేది ప్రేమయే జీవన రహస్యమని విశ్వసించేది పాండురంగడు తనపై ఇంతటి కృపారసమును వర్షింపుటకు కారణమేమని భక్తులడిగిన ప్రశ్నకు జనాబాయి నవ్వుతూ భగవానుని తాను పొందిన విధానమును ఒక చక్కటి కీర్తన ద్వారా తెలియచేసింది

ధరిలా పండరీచ చోర గలా బంధోని యా దోర
హృదయ బందీఖానా కేలా ఆంత విఠల కోందిలా
శబ్దకెలీ జుడా జుడీ విఠలాపాయీ ఘాతలీ బేడీ
సోహం శబ్దాచా మారా కేలా! విఠల కాకులతీ ఆలా
జనీమ్హణే బాఫిఠలా జీవేం నసోడీ మితులా॥

"భక్తి అనే గుడ్డను మెడలో వేసి పండరీచోరిని నేను పట్టుకొన్నాను నా హృదయాన్ని కారాగారంగా మార్చి అందులో విఠలుని బంధించాను ప్రణవనాదమనే గొలుసుతో పాండురంగని పాదపద్మాలను కట్టేశాను నిర్గుణ పరబ్రహ్మస్థితిని నేను అనుభవించినను నాకు సుగుణరూపాన్నే దర్శించాలని అభీష్టము నా గోపాలుని అనంతప్రేమ సాగరంలో నేను ఒదిగిపోయాను" అని గానం చేసింది

గుణాబాయి ఒకనాడు జనాబాయిని పిలిచి జొన్నలు అవసరంగా పిండి చేయాలని చెబుతుంది ఆరాత్రి అందరూ నిదపోయిన తరువాత

జనాబాయి పాండురంగని గూర్చి కీర్తన ఆలపిస్తూ జొన్నపిండి తయారు చేయడానికి సిద్ధమవుతుంది తిరగలిలో జొన్నలు పిండిగా మారుతుంటే భగవన్నామమనే తిరగలిలో సంచిత కర్మలనే జొన్నలను వేసి త్రిప్పినచో నామరూపాత్మకమైన ప్రపంచము అదృశ్యమై వాసుదేవుని దివ్యచైతన్యమే అనుభూతి కలుగుతుందనెడి భావనతో పాడుతూ త్రిప్పుతూ ఉంటుంది

ఆమె అపూర్వ భావగర్భిని సుశ్రావ్యగానానికి చలించిన పాండు రంగడు వెంటనే ఆమెకు ప్రత్యక్షమవుతాడు మధుర భాషణము చేస్తాడు ఆధ్యాత్మిక రహస్యాలు తెలియచేస్తాడు ఆ రాత్రంతా జనాబాయి ఆధ్యాత్మిక దివ్యోన్మాద స్థితిలో పరవశించి పోతుంది జొన్నలను పిండిచేయుటలో భగవానుడు ఆమెకు సహకరిస్తాడు

ఉదయం బ్రహ్మముహూర్తకాలము సమీపించింది చంద్రభాగా తీరంలో స్నానానంతరము భగవద్దర్శనార్థమై పుండరీకవరదా పాహిమాం-పాండురంగ విఠలా రక్షమాం అనెడి భక్తుల నినాదాలు వినపడుతున్నాయి "స్వామీ భక్తులు తమ దర్శనార్థం ఆలయానికి వస్తున్నారు తమరింకా ఇక్కడే ఉండటం భావ్యముకాదు వెళ్ళి భక్తులను కరుణించండి అంటుంది జనాబాయి పిండి విసరునపుడు తిరగలి ప్రక్కనే స్వామి ఉంచిన ఆభరణాలు అక్కడే ఉంచి జనాబాయి కప్పుకొనే బొంతను పైన వేసుకొని దేవాలయంలో ప్రవేశిస్తాడు

దర్శనార్థం తలుపులు తెరవగానే ఆభరణాలు పీతాంబరము అదృశ్యమై వాటిస్థానే చిరిగిన బొంత కన్పిస్తుంది భక్తులు పూజారులు దిగ్భ్రాంతి చెందుతారు ఇంతలో ఒకరు ఆబొంత జనాబాయిదని గుర్తించి చెబుతారు పూజారులు కోపోద్రిక్తులవుతారు ఈ విషయాన్నే న్యాయాధీశునికి తెలియచేస్తారు పరీక్షా నిమిత్తము అందరూ కలసి జనాబాయి ఇంటికి వెడతారు నిజమేమిటో చెప్పమని ప్రశ్నిస్తారు తనకేపాపము తెలియదని జనాబాయి చెబుతుంది ఇల్లు వెతికి చూడమని న్యాయాధిపతి చెబుతాడు తిరగలి సమీపంలో స్వామి ఆభరణాలు కనుపిస్తాయి జనాబాయి చోరత్వము చేసిందని నేరారోపణచేసి ఆమెకు ఉరిశిక్ష విధిస్తారు నామదేవులవారు ఎంతగా నచ్చచెప్పాలని చూసినా లాభము లేకపోయింది

ఉరితీసే రోజు వచ్చింది చంద్రభాగాతీరంలో సకల జనులు వీక్షించుచుండగా ఆమెను ఉరితీయునట్లు ఆజ్ఞాపించారు భక్తురాలైన జనాబాయికి ఎఱ్ఱటి వస్త్రాలు ధరింపచేశారు ఎఱ్ఱటి పూలహారాన్ని మెడలో వేశారు నడుముకు త్రాడుకట్టి వీధిలో ఆమెను లాగుతున్నారు నడవలేక పడిపోయింది నిర్దాక్షిణ్యంగా ఈడ్చుకొనిపోతున్నారు శరీరము పగిలిపోతున్నది రక్తము కారుతున్నది జనాబాయి చేతులు జోడించి మీరు కోరిన చోటికి నేను నడిచివస్తాను నన్నిలా హింసించకండి అని ప్రార్థించింది ఎట్ట కేలకు ఆవిడను ఉరికంబం ఎక్కించారు ఇక కొద్దిక్షణాల్లో జనాబాయి శాశ్వతంగా కళ్ళుమూస్తుంది భక్తులంతా కళ్ళవెంబడి నీళ్ళు కారుస్తు న్నారు కులతత్వాలతో కరుడుగట్టిన కాఠిన్య హృదయాలు లోలోన సంతోషిస్తున్నాయి అధమ కులంలో జన్మించిన జనాబాయి భక్తురాలు కావడమా! అని వారి ఆవేదన

భగవానుని దృష్టినాకర్షించేది భక్తియొక్కటేగాని కులతత్త్వాలు కాదు సిరిసంపదలంతకన్నా కాదు 'నమే భక్తచతుర్వేది మద్భక్తః శ్వపచప్రియః' నాలుగువేదాలు అధ్యయనము చేసినను భక్తిలేని బ్రాహ్మ ణుడునాకిష్టుడుగాడు అలాగే నిరక్షరకుక్షియైన చండాలుడైనను భక్తుడైతే నాకు ప్రియుడు అని స్వయముగా భగవంతుడే తెలియచెశాడు

ఉరికంబమెక్కిన జనాబాయి ఒక్కసారి చేతులు జోడించి పాండు రంగని ప్రార్థించింది హే విఠలా నీవు సత్యస్వరూపుడవు నిజానిజాలు నీకొక్కడికే తెలుసు నేను దొంగనా? చేయని నేరానికి నాకెందుకింత శిక్ష విధించావు? నీచేత నా ఇంటిపనులు చేయించుకున్నానని కోప మొచ్చిందా? తమరు ఏపనీ చేయనవసరం లేదని తమ దర్శన భాగ్యమే మహాప్రసాదమని ఎన్నోసార్లు ప్రార్థించాను నేను అశక్తురాలినని ఏదో చేయూతగా ఉంటానని నీవే చేసేవాడివి అంతా తెలిసి ఈనాడు ఇంత ఘోరం జరుగుతూవుంటే హాయిగా చూస్తూ వున్నావా? భక్తజన రక్షకుడ వైన నీవేమా మొర ఆలకించనిచో మాకు మరెవ్వరుదిక్కు పాండురంగా మృత్యువునకు భయపడేటంతటి పిరికి మన స్తత్వము నాదికాదు మృత్యువు

నన్ను శాశ్వతంగా నీ పాదసన్నిధికి చేర్చుతుంది అని ప్రార్థిస్తూ అక్కడ గుమిగూడియున్న వేలాది భక్తులనుద్దేశించి పరమ పవిత్రులాం భక్తులారా! మీకు నా శతకోటి ప్రణామములు ఇంతవరకు మీరు దయతో నాకు వీడ్కోలు ఇవ్వడానికి వచ్చారు మీకు నేనెప్పుడూ ఋణ పడి యుంటాను చావుఅనేది చూడముచ్చనైన సంఘటనకాదు మీరు వెళ్ళిరండి చివరిసారిగా పాండురంగని పాదదాస నామదేవులవారి పరివారిలోనైన ఈ జనాబాయి మీకు చేతులెత్తి నమస్కరించి ఒక విషయం చెబుతున్నది పాండురంగడు ఆశ్రితజన రక్షకుడు భగవన్నామమే జీవితానికి మార్గదర్శకము భక్తులై తరించండి అని నమస్కరించి ధ్యాన మనస్కురాలైంది

హరితియడానికి ప్రారంభించారు జై జై పాండురంగహరి హరి కంబము అదృశ్యమై దానిస్థానే పరిమళాలు వెదజల్లే పుష్పసంక్తితో గూడిన లతలు అవతరించాయి భక్తులంతా జయజయ ధ్వనాలు చేశారు అసూయా పరులంతా తలలు వంచుకున్నారు పాండురంగని అపార కృపామహిమకు ప్రేమాతిశయంతో పరవశించిన జనాబాయి కళ్ళవెంబడి ఆనంద బాష్పాలు కట్టలు త్రెంచుకొని ప్రవహించాయి భక్తిమండలికీ జై

ఒకనాడు పాండురంగడు ఏదో వ్రాస్తుంటాడు జ్ఞానదేవులవారు వెళ్ళి స్వామీ ఎమిటి వ్రాస్తున్నారు? అని అడుగుతారు జనాబాయి గానంచేసిన కీర్తనలు వ్రాస్తున్నాను అని పాండురంగడు సమాధానమిస్తాడు ఇదేమిటి స్వామి వ్యాస వాల్మీకాదులు తమ కీర్తిని మహోత్తమంగా కొనియాడి రచనలు చేసి యుండ ఈ జనాబాయి కీర్తనలు మీరు వ్రాయనవసరమేమిటి? అని ప్రశ్నిస్తారు జ్ఞానదేవా జనాబాయి కీర్తనలు గానంచేసి తదనుగుణంగా జీవించువారు తప్పక నాపాద సన్నిధిని చేరగలరు ఇది నా శాసనము అని సెలవిచ్చారు

భగవానుని అనంతకృపకు పాత్రురాలై తాము తరించి ఇతరులు తరించుటకు మార్గమును చూపిన భక్తజనాబాయి జీవితచరిత్ర ఆదర్శము పరమపావనము మోక్షదాయకము

• ఓం శ్రీ భక్తజనప్రియాయ నమః •



# సంత్ తులసీదాస్

ఈ విశ్వమెలా కదిలింది? ఎలా కదులుతున్నది? ఈ సృష్టిలో నిర్మాణాత్మకమైన చట్టాలను చేసిందెవరు? నిబంధనల నేర్పరచిందెవరు? ఏ శక్తిపై ఆధారపడి సకలము చరించుచున్నది? మనము తినిన ఆహారమును జీర్ణింపచేయు శక్తిఏమిటి? అరణ్యములలోని జంతువులకు ఆహారము సమకూర్చినదెవరు? ఏశక్తిపై ఆధారపడి ఋతువులు కదులుచున్నవి? రాత్రింబవళ్ళు తిరుగుతున్నవి? నిశ్చలమైన ఆకాశములో వాయుస్పందనను కలిగించు అదృశ్య హస్తమెవరిది? అడవిలోని వృక్షజాలమును కని పెట్టి పోషించు అదృశ్య తోటమాలి ఎవరు? ఎవరి ఆజ్ఞకు లోబడి జలము ఆవిరగుచున్నది? ఏ కట్టుబాటు ననుసరించి ఆ విరి మేఘమగుచున్నది? ఏ శక్తికి తలవంచి మేఘము వర్షించుచున్నది? చెట్టులోని ఫలమునకు మలినము అంటకూండా అందమైన చర్మపు పొరను దానిపై కప్పిందెవరు? అనంతకోటి బ్రహ్మాండ స్వరూపము ఎవరి గర్భంలో తలదాచుకొని యున్నది? రెండుపాళ్ళు ఉదజని, ఒకపాలు ప్రాణవాయువును కలిపి ప్రాణాధారమైన నీరము నందించిన అద్భుత శాస్త్రజ్ఞుడెవరు? అతడే సృష్టికర్త. సృష్టికి కారణభూతుడు. ఆధారమైనవాడు. ఆకృతియే తానైనవాడు. వ్యష్టిగా

గోచరింపునది తానే సమష్టిలో తాండవింపునది తానే ఉన్నదంతా తానే తన కన్యమైనదేదియు లేదు భ్రాంతితప్ప

భ్రాంతికిలోనైన మానవుడు సత్యపదార్థముస్థానే అసత్యపదార్థమును దర్శిస్తుంటాడు ముత్తెపుచిప్పను వెండియని భావిస్తాడు గాజుజాతిని రత్నమని ఊహాస్తాడు త్రాడునుచూసి పామని కలవరపడతాడు సిండిసీళ్ళను పాలని నిర్ణయిస్తాడు దీనికంతటికి భ్రాంతియె మూలకారణమై యున్నది భ్రాంతి తొలగగానే బ్రహ్మదర్శన మవుతుంది మరి బ్రహ్మదర్శన మెలా కలుగుతుంది? భ్రాంతి ఎలా నిర్మూలింపబడుతుంది? సత్యదర్శనమే భ్రాంతిని నిర్మూలించగలదు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులైన సద్గురువుల నాశ్రయించి శ్రవణ మనన నిదిధ్యాసలద్వారా తత్త్వచింతన చేసినపుడె సత్యదర్శనం కలుగుతుంది ఎక్కువ శాతము ఇలాగే తరిస్తారు కొందరి అనుభవము అందులకు భిన్నంగా యుంటుంది వారిలో పరిణామము విచిత్ర పంథాలో కలుగుతుంది గతజన్మ పుణ్యఫల విశేషముచేత ఎ గురువునాశ్రయించకనే ఏ సాధన చేయకనే ఒక శుభఘడియకో ఎదో ఒక సంఘటనకు గురియై అమాంతంగామారి కూర్చుంటారు ఆ క్షణంనుండి ఆధ్యాత్మిక చైతన్యముతో చరిస్తారు ఆదర్శ పురుషులుగా రాణిస్తారు అట్టి ఆకస్మిక పరిణామంతో చరించి తరించిన పుణ్యపురుషులలో సంత్ తులసీదాస్ ఒకరు

ఒకనాడు పాదుషా కొలువులో తులసీదాస్ ప్రవచనము చేస్తున్నాడు ప్రొద్దుగ్రుంకుమన్నది తులసీదాసు మనస్సు ప్రవచనమునందు రమించలేక పోతున్నది అతడి మనసులో ఆందోళన ప్రారంభమైనది తాను నూతన వివాహితుడు అందచందాలకు మారుపేరైన తన అర్ధాంగి రత్నావళి హృదయంలో నిండియున్నది ఆమెను చూడవలయునని ఆమెతో భాషించవలయునని మనస్సు ఉరకలు వేయుచున్నది తన మనస్సులో చెలరేగే ఆవేశమును ఆపుకోలేక పోయాడు పాదుషావద్ద అనుమతిపొంది ఇంటికి చేరడానికి బయలుదేరాడు మార్గమంతా చీకటిగావుంది అంతకన్నా దట్టంగా తన హృదయంలో కామాంధకారము అలముకొనియున్నది మనస్సు ఊహాలోకాల్లో సంచరింపుమన్నది కాళ్ళు అప్రయత్నంగా నడిచిపోతున్నాయి

తులసీదాస్ ఇల్లు చేరాడు అందాలరాశియైన తన భార్య రత్నావళి కనపించలేదు ఇల్లంతా వెదికాడు వీధి అంతయూ అన్వేషించాడు ఆమె జాడ తెలియలేదు ఆవేదనతో అందరిని అడుగుతున్నాడు ఇంతలో ఒకావిడ ముందుకొచ్చి రత్నావళి తల్లికి అనారోగ్యంగా యున్నందున ఆమె సోదరుడు వచ్చి పుట్టింటికి తీసుకవెళ్ళాడు మీరు పాదుషా కొలువునుండి ఆలస్యముగ వచ్చెదరనియు గనుక మీతో చెప్పుమని చెప్పి వారిరువురు ఊరికి వెళ్ళారు అని తులసీదాస్‌తో చెప్పింది

తులసీదాస్ గృహంలో ప్రవేశించాడు స్నానము చేయుట్కగాలేదు ఆకలి నశించిపోయింది ఆలోచనలు విజృంభించాయి తులసి దృష్టంతా రత్నావళి మీదనే యున్నది ఇంటిలో నిలువలేకపోతున్నాడు ఆమె పుట్టిల్లు పదిమైళ్ళ దూరముంది ఏమయినను ఆమెలేనిదే ఈ దినము తాను నిద్రించలేడు రాత్రియనికూడా లెక్కచేయకుండా రత్నావళిని సమీపించాలని సంకల్పించాడు తానొక్కడే ఎయలుదేరి నడక సాగించాడు అర్ధరాత్రి సమయానికి రత్నావళి పుట్టింటి గ్రామాన్ని చేరాడు అత్తగారిల్లు తలుపు గెడియ వేయబడియున్నది పిలిస్తే వచ్చి తలుపు తీస్తారు కానీ కామాంధుడై నిశాసమయమని గూడ లెక్కించక ఏతెంచినందులకు అత్తమామలు తనను అపహాస్యంమకొందురేమోయని ఆలోచించసాగాడు ఇంటి వెనుకవైపు నడిచాడు వారిది మిద్దెఇల్లు మిద్దెపైనున్న గదిలో తన భార్య రత్నావళి నిద్రిస్తూయుంటుంది ఎవ్వరికి తెలియకుండా మేడఎక్కి రత్నావళిని సమీపించాలనుకున్నాడు మిద్దె ఎలా ఎక్కాలి? ఆ మిద్దెకు ఒక త్రాడు వేలాడదియబడి యున్నది దానిని పట్టుకొని పైకి ఎక్కాడు మెల్లగా మేడగది గుమ్మంముందు నిలబడి తలుపు తట్టాడు రత్నావళి దీపము చేతపట్టుకొని వచ్చి చూసింది తనభర్త ఎదురుగా నిలబడియున్నాడు తన కళ్ళను తానే నమ్మలేకపోయింది ఇలా ఆగంతుకంగా అరుదెంచుటకు కారణమును ప్రశ్నించింది

తులసీ తదేకంగా ఆమెను చూశాడు కామము ఉట్టిపడుతున్న కళ్ళతో "రత్నా నీవు నా జీవన ప్రేమమంజరివి నా బ్రతుకు బాటను తీర్చిదిద్దే సుందరివి నీ శరీర సరోవరమునకు దూరమై నా నేత్రయుగళము

జీవించలేవు పసందైన నీ పొందుకై అర్రులుజాచు నా మనస్సు నిన్ను వదలి క్షణకాలమైనా జీవించేస్థితిలో లేదు నీ స్పర్శకు నోచుకోని నా శరీరము కొయ్యముద్దులా పడియుంటుంది మృత్యుముఖంలో ప్రవేశించువానికి అమృతము లభించినచో అతడు యౌవ్వనవంతుడగునాగున వియోగబాధ చే శుష్కించిన నా దేహేంద్రియ మనోబుద్ధులు నీ యధరామృత పానముచే నూతనోత్సాహమును బడసి ఆనంద యవ్వనముతో ప్రకాశించును దేవీ నిన్ను గూర్చియే కలలుగంటూ ఇల్లు చేరాను నీవు అచ్చట లేవని తెలియగానే నా మనస్సు ముక్కలై పోయింది మనస్సు పట్టుతప్పింది పక్షిలా ఎగిరివచ్చి నీముందు నిలిచాను రత్నా నీ కౌగిటి రాజ్యంలో మకుటంలేని మహారాజుగా నన్ను వెలిగిపోనీ నీ హృదయమనే రత్నఖచిత హంస తూలికా తలపంపై చక్రవర్తిలా శ య ని ం చ నీ అంటూ దగ్గర చేరబోయాడు

భర్త ప్రవర్తన రత్నావళికి ఆయోమయంగావుంది మీరు ఇంటిలోకి ప్రవేశించటకు ఎవరు తలుపు తీశారు?" అని రత్నావళి ప్రశ్నించింది

నేను తలుపు తట్టనూలేదు మరొకరు తీయనూలేదు అని గంభీరంగా బదులుపలికాడు తులసీదాస్

ఎవరూ తలుపు తీయకుంటే మీరు మేడమీదకెలా రాగలిగారు? అని ప్రశ్నించింది రత్నావళి

తులసీదాస్ మందహాసము చిందిస్తూ "రత్నా! నేనంతటి అమాయకుడననుకున్నావా? నీకు నామీదున్న ప్రేమను గ్రహించలేనంతటి అసమర్థుడనని భావించావా? వీధి గుమ్మంవైపు తలుపు గడియవేసి వుంది తలుపు తట్టిచూద్దామని ప్రయత్నించాను మీతల్లిదండ్రులు మరోవిధంగా భావిస్తారేమోనన్న సంశయము నాలో కలిగింది వెంటనే ఇంటివెనుకవైపుకు వచ్చాను రత్నా! నేను వస్తానని ముందుగానే గ్రహించి నేను ఎక్కిరావడానికి నీవు ఏర్పాటు చేసియున్న త్రాటిని చూశాను అంతే ఆ త్రాటిని పట్టుకొని మేడెక్కి నా పుత్తడిబొమ్మ ప్రక్కన నిలిచాను అన్నాడు

తులసి మాటలు రత్నావళికి అర్థముకాలేదు తాను త్రాటిని ఏర్పాటు చేయడమేమిటి? ఈతడు ఎక్కిరావడమేమిటి? అంతా అగమ్య గోచరంగా వుంది దీపమును చేతబట్టుకొని గోడదగ్గరకు వచ్చింది తులసీదాస్ ఆమెను వెంబడించి నడుస్తున్నాడు తీరా పరిశీలించిచూస్తే అక్కడ త్రాచుపాము వ్రేలాడు తున్నది తులసీదాస్ పట్టుకొని ఎక్కివచ్చింది పామునని రూఢయింది త్రాచుపామును చూడగానే తులసీ ఉలిక్కిపడ్డాడు ఏమిటి? ఇది త్రాచుపామా? రత్నా నీవు నాకొరకు త్రాడును వేలయుంచి నది అసత్యమా? తెల్లబోయాడు

రత్నావళి భర్తను తదేకంగా చూస్తూ ఒకరికి మరొకరు త్రాటిని అమర్చవలసిన అగత్యమేమున్నది? ఎవరి త్రాటిని వారే తయారు చేసు కుంటున్నారు మోహజీవితంలోపడి ఆ త్రాటితోనే ఉరి తీసుకుంటున్నారు చూడండి కామమోహాతులైన మీకు త్రాటికి పాముకు తేడా తెలియకుండా పోయింది ఒక స్పర్శను వాంఛించడములో శరీరమునకు స్వాభావికమైన స్పర్శజ్ఞానమే నశించింది అనిత్యమైన శరీరమును వాంఛించి రాత్రియని కూడా సందేహించక ఇంతదూరము ప్రయాణముచేసి వచ్చారు భయాన్ని విస్మరించారు బాధను విసర్జించారు ఏమున్నదీశరీరముకో? రక్తమాంసా లతో నింపబడిన ఈ దుర్గంధమలిన కూపంపై ఎందుకంత వ్యామోహము? చర్మముతో కప్పబడిన పెంటకుప్పపై ఎందులకంత మమకారము?

హార్ ఘన్ కో దేహ్ ముంత పర్ జిత్ ని ప్రీతి
తిస్ అధి జో రామ ప్రీతి అవస్ మిట్టి భవ భీత్

రక్త శల్య మాంసాదులతో నిర్మితమైన స్త్రీ శరీరముపై మీ వ్యామోహము ఎంత సమంజసమో ఆలోచించు అందులో ఏ కొద్దిపాటి ప్రేమనైనను పరంధాముడైన రామచంద్రునిపై మరల్చగలిగినచో మీరు ఈపాటికి వైకుంఠ ప్రాప్తినే పొందియుండెడివారు అని రత్నావళి ఆవేశ పూరితంగా మాట్లాడేసింది

రత్నావళి అమరసందేశము తులసి హృదయముపై చెదరని ముద్ర వేసింది తన తప్పిదమేమిటో తెలిసివచ్చింది ఇంతవరకు తన కన్నులను

కప్పియున్న కామపు పొరలన్నీ కరిగిపోయాయి హృదయములో భగవంతుని కొరకు ఆరాటము ప్రారంభమైంది రత్నావళి పలుకులలోని సత్యము అతని అంతఃకరణను కదిలించివేసింది రామువొక్కడే జీవితగమ్యము రాముడే బంధువు రాముడే రక్షకుడు రాముని కరుణా ప్రభావముచేతనే త్రాహిమాం తనను కరువతేదు తులసీదాస్ తీవ్రంగా ఆలోచించాడు తన బ్రతుకుకొక ప్రణాళికను రూపొందించుకున్నాడు రామదర్శనము చేయనిదే మళ్ళీ మానవ సమాజములో కాలుపెట్టకూడదని నిర్ణయించుకున్నాడు జ్ఞానబోధచేసి తనకళ్ళు తెరిపించిన తన భార్య రత్నావళిని గురువుగా భావించి నమస్కరించాడు సమస్తమును త్యజించి త్యజించుటకు వీలుగాని శరీరమును మనస్సును తోడుతీసుకొని బయలుదేరాడు

మైంహారి పతితపావన సునై
మై పతిత తుమ్ పతిపావన్ దోఊ బానక బనై ॥మైహారి॥
వ్యాధగనిక గజ అజామిళ సాఖి నిగమన బనై
ఔర్ అధమ్ అనేక తారే జాతికాపై గనై ॥మైహారి॥
జానినామ అజాని లీన్హై నరక సురపుర మనై
దాసతులసీ సరన ఆయో రాఖియే ఆపనై ॥మైహారి॥

"భగవానుడు పతితపావనుడని నేను విన్నాను నేను పతితుడను నాస్వామి పతితపావనుడు ఆహా! ఎంత చక్కటి సంబంధము కలిగినది?
గనిక గజేంద్ర అజామిళాది ఎందరో పాపులను భగవానుడు ఉద్దరించినట్లు శాస్త్రము ప్రవచిస్తున్నది
ఎందరో పాపులు భగవానుని అనంత కృపారసమునకు పాత్రులై ముక్తులైనట్లు తెలియుచున్నది
భగవన్నామమును ఇచ్ఛలేకుండా నుచ్ఛరించిననూ నరకద్వారము నుండి బయటపడి స్వర్గమును ప్రవేశింతురు
ప్రభూ నీ నామప్రభావమును గుర్తెరిగి నేను నీ పాదపద్మముల నాశ్రయించినాను" అని దుఃఖము కట్టలు త్రెంచుకొని ప్రవహించు

మంత తులసీదాస్ గానము చేయుచూ రామదర్శనానికై పరితపిస్తూ నడక సాగించాడు.

తులసీదాస్ ఒంటరిగా బయలుదేరాడు. తీర్థక్షేత్రాలన్నీ దర్శించాడు. చివరగా కాశీక్షేత్రము చేరాడు. పుణ్యక్షేత్రమైన కాశీలో స్థిరపడి సాధన సాగించాలని భావించాడు. నిత్యము గంగానదిలో స్నానమాచరించేవాడు. ఒక రావిచెట్టుక్రింద కూర్చుని కఠోర తపస్సు నారంభించాడు. నిత్యము పవిత్ర గంగానదిలో స్నానమాచరించి ఒక చెంబులో గంగాజలము తీసుకొనివచ్చి రావిచెట్టుకుపోసి ఆచెట్టుక్రింద ఆసీనుడై సాధన చేయ సాగాడు. ఒకనాడు తాను సాధన కుపక్రమించుసరికి ఆ రావిచెట్టుమీద నుండి ఒక బ్రహ్మరాక్షసి దిగివచ్చి తులసీదాస్ముందు ప్రత్యక్షమయింది. తులసీ ఆశ్చర్యపడ్డాడు. ఇదేమి వైపరీత్యం? పుణ్యానికిపోతే పాపం ఎదురైనట్లు రామదర్శనాన్ని కాంక్షించి సాధన చేయడమేమిటి? రాక్షస దర్శనము లభించడమేమిటి. తులసీదాస్కు ఏమీ అవగతము కావడము లేదు. ఇంతలో ఆ బ్రహ్మరాక్షసి తులసీదాస్కు నమస్కరించి "మహాత్మా! నేనొక శాపవశాత్తు ఈ రావిచెట్టుపై బ్రహ్మరాక్షసినై యుంటున్నాను. నీవు పవిత్ర గంగాజలము చల్లుటచే నాపాపమంతయూ ప్రక్షాళనమై నేను పవిత్రమయ్యాను. నాకు ఇంతటి మహోపకారము చేసిన నీకు ఏదైనా సహాయము చేయవలయునని నా మనస్సు ఉవ్విళ్ళూరుతున్నది. ఇంతకీ నీవెవరు? దేని నాశించి ఇక్కడ తపమొనర్చుచున్నావు? యని ప్రశ్నించింది.

తులసీదాస్ కొన్నిక్షణాలు మౌనము వహించాడు. తన గతజీవిత చరిత్రపుటలు మనోనేత్రమునందు తిరుగుతున్నాయి. ప్రసన్నవదనుడై తన జీవితగాధను బ్రహ్మరాక్షసికి చెప్పడానికి ప్రారంభించాడు. పరమ పవిత్రమైన తీర్థప్రయాగకు సమీపమునగల రాజ్పూర్ యనుచోట ఆత్మారాం దూబె హులసి అను దంపతులకు నేను బిడ్డనై జన్మించాను. నా జననము అశుభఘడియలో జరిగినదనియు నావలన కుటుంబమునకు అపాయము సంభవించగలదనియు భావించి నాతల్లి నన్ను పరిచారికయగు స్త్రీకి దానము చేసింది. ఐదు సంవత్సరములు నాకు నిండాయి. నన్ను పెంపు

తున్న ఆ సాధ్వికూడా కన్నుమూసింది అంతకుముందే జన్మనిచ్చిన తల్లి దండ్రులుకూడా చనిపోయారు చెట్టువిడిచిన పక్షివలె దిక్కులేని వాడ నయ్యాను బిచ్చమెత్తుకుంటూ జీవించసాగాను ఒకనాడు పార్వతియన్నే కరుణామయి నాపై దయవహించి నన్ను కాపాడి పోషించసాగింది

కొంతకాలానికి నరనారాయణానంద స్వాముల వారొకరు నా బాధ్య ను స్వీకరించారు నాకు రామ్‌బోలా యని నామకర్ణము చేశారు అయో ధ్యకు తీసు వెళ్ళి ఉపనయనము చేయించారు తారకమంత్రోపదేశము ారు మొదటిసారిగా వారినుండే రామచరితమును వినడము తటస్థించి నది అనంతరము కాశీ క్షేత్రవాసియైన శేషసనాతన స్వాములచెంత ఆసీను డనై వేదవిద్య నభ్యసించాను విద్య పూర్తిచేసుకొని మా స్వగ్రామమైన రాజ్‌పూర్ చేరాను అక్కడ పాదుషా కొలువులో ఉద్యోగానికి చేరాను ం ాికి అందాలరాశియైన రత్నావళి అను సుగుణవతిని వివాహ మాడాను

ఎంతవిద్య గడించినను ఆధ్యాత్మిక సాధనలో నేను అడుగు ముందుకు వేయలేకపోయాను నా భార్య రత్నావళి ప్రబోధముచే నాలో తీవ్రవైరాగ్య ముదయించినది కామతెరలు తొలగిపోయాయి రామదర్శన వాంఛ తీవ్రమయింది ఒంటరిగావచ్చి ఇక్కడ రామదర్శనాన్ని వాంఛిస్తూ తపస్సు చేయుచున్నాను అని తులసీదాస్ బ్రహ్మరాక్షసికి తెలియజేశాడు

తులసీదాస్ జీవితగాధను ఆలకించిన బ్రహ్మరాక్షసి భక్తశేఖరా! నీవు నాకు పాపవిముక్తిని ప్రసాదించావు దానికి కృతజ్ఞతగా నేను నీవు తరించు మార్గమును తెలియజేసెదను రామదర్శనము పొందుటకు నీకు చక్కటి ఉపాయమును తెలిపెదను నీవు హనుమాన్ ఘాట్ దగ్గరకు వెళ్ళుము అక్కడ ప్రతినిత్యము ఒక మహాత్ముడు రామాయణ ప్రవచ నము చేయుచుండును అచ్చోటికి ఆంజనేయస్వామి అనుదినము అరుదెం చును అతడు సామాన్యునివలె గన్పట్టును ఉపన్యాస స్థలమునకు అందరి కంటెను ఎవరైతే ముందుగా వత్తురో ఉపన్యాసానంతరము ఎవ్వరయితే చివరగా వెళ్ళుదురో ఆ ముదుసలియే హనుమంతుడని గుర్తించుము నీవు అతని ననుసరించుము అతడు నిన్ను లక్ష్యపెట్టడు నీపై కోపగించు

కొనును తిరస్కారభావముతో జూమను అయినను నీవు అతనిని వదం కుండా వెంబడించు అంజనీపుత్రుని ఆశీర్వాదబలముతో నీకు రామదర్శ నము కలుగగలదని ని తెలియజేసి బ్రహ్మరాక్షసి అంతర్ధానమయ్యెను

తులసీదాసు పరమోత్సాహముతో హనుమాన్‌ఘాట్‌లో ప్రవచనము జరుగు ప్రదేశాని కరుదెంచాడు మొదటే ప్రవేశించి చివరన నిష్క్రమించే హనుమంతుని గుర్తించాడు అతని ననుసరించి నడిచాడు హనుమంతుడు ఒక అరణ్యములో ప్రవేశించాడు తులసీదాస్ ఆంజనేయుని అనుసరించి నడుస్తున్నాడు హనుమంతుడు తులసీదాస్‌ను చూశాడు తన ననుసరించ వలదని సైగచేశాడు తులసీదాప్ పవనకుమారుని పవిత్ర పాదాలను గట్టిగా పట్టుకున్నాడు తన జీవితాన్ని కడతేర్చమని ప్రార్థించాడు తనకు రామ దర్శనము కలుగు మార్గమును తెలియజేయమని విలపించాడు తులసీ ఆవే దన మారుతి హృదయాన్ని కదిలించి కరిగించింది తులసీ వ్యథచెందకు నీవు చిత్రకూటపర్వతమున చేరి అక్కడ తారకమంత్రమును జపించుము నీకు త్వరలోనే రామదర్శనము కాగలదు" అని హనుమంతుడు తెలియ జేశాడు

తులసీదాస్ చిత్రకూట పర్వతముపై నివసిస్తూ తారకమంత్రజపము చేయసాగాడు ఒకనాడు చిత్రకూటపర్వతముముందే ఇద్దరు రాకుమారులు గుర్రాలపై వచ్చి అచ్చట కొంచెముసేపు విశ్రమించి వెళ్ళడము జరిగినది తులసీదాస్ ఆ రాకుమారులను పలుకరించలేదు వారు వెళ్ళిన తరువాత ఆంజనేయుడు ప్రత్యక్షమై "తులసీ! రామదర్శన వాంఛతో జీవిస్తున్న నీవు రాముని గౌరవించకపోవడమేమిటి? కొద్ది నిముషాల క్రింద రాకుమారుల వేషములో అరుదెంచిన ఇరువురు రామలక్ష్మణులే సుమా" అని తెలియ జేయగా తులసీ గుండెబాదుకుంటూ రాముని పలుకరించలేకపోయినందుకు దుఃఖించాడు రామునికి నమస్కరించలేకపోయినందులకు పసిబిడ్డలా విల పించసాగాడు ఆంజనేయస్వామి మందహాసమును చిందిస్తూ తులసీ! దుఃఖించవలదు నీవు త్రికరణశుద్ధితో తారకమంత్రమును ధ్యానించుము అతి త్వరలోనే మళ్ళీ నీకు రామదర్శనము కలుగగలదు" అని చెప్పి హను మంతుడు అంతర్ధానమయ్యెను.

ఒకనాడు ఒక అందమైన బాలుడువచ్చి తులసీదాస్ పర్ణశాలముందు నిలబడి తనకు కొంచెము చందనలేపమును ఇవ్వవలసిందని కోరుతాడు తులసీదాస్ గంధమును తయారుచేస్తుంటాడు ఇప్పుడుకూడా తులసీదాస్ రామచంద్రుని గుర్తించలేకపోతున్నాడని గ్రహించిన అంజనేయస్వామి రామచిలుకి రూపమును ధరించి నీనుండి చందనమును గ్రహించువాడె రామచంద్రుడు అని గానము చేస్తాడు

చిత్రకూట్ కే ఘాట్ పర్ భాయి సంతన్ కీ భిర్
తులసీదాస్ చందన్ ఘిసే తిలక్ దేత్ రఘువీర్॥

సాధు మహాత్ములు వసించు చిత్రకూటపర్వతమువద్ద రామభద్రుడు తులసివద్దనుండి సుగంధలేపమును గ్రహించుచుండ రామచంద్రుని తులసి గుర్తించలేకపోతున్నాడు అని గానము చేశాడు

అంజనేయుని అమృతవచనములు తులసి చెవినిపడ్డాయి తులసీదాస్ శరీరము కంపించిపోయింది నేత్రాలు అశ్రుపూరితమయ్యాయి శ్రీరాముని పాదాలపైపడి దుఃఖించసాగాడు శ్రీరామచంద్రుడు తులసీని అనుగ్రహించాడు ఆశీర్వదించాడు కరుణాదృష్టిని ప్రసరింపచేసి అంతర్ధానమయ్యాడు

పవనపుత్రుడు తులసీదాస్‌కు దర్శనమిచ్చి తులసీ రామదర్శనముతో నీ జన్మ ధన్యమైనది నీవు కారణజన్ముడవు నీవు మరచిపోయిన కార్యమును జ్ఞాపకముచేయుటకు నేను నీకడకేతెంచినాను శ్రీ వాల్మీకి మహర్షి విరచితమైన శ్రీమద్రామాయణ మహాకావ్యమును హిందీలో "రామచరిత మానసము"ను పేర నీవు రచించవలసియున్నది రామకథా రచన కొనసాగించి నీ జన్మను సార్ధకమొనర్చుకొనుము నీవు నీ భార్యతో గూడి వానప్రస్థాశ్రమమున ప్రవేశించి నిత్యము రామకథను వ్రాయుము వ్రాసిన ప్రతులను మహాభక్తురాలైన నీ భార్యకు వినిపించుము నిరంతరము రామ ధ్యానముతో రమించి తరించుము అని ఆశీర్వదించి అంతర్ధానమయ్యెను

హనుమంతునిసలహాను శిరోధార్యంగా భావించి భార్యను పిలిపించి వానప్రస్థాశ్రమ ప్రవేశముచేసి రామచరిత మానసమను పవిత్ర గ్రంథ

మును హృదయరంజకముగా రచించుట కుపక్రమించెను రామకథ నడచు చుండగా సాక్షాత్తు రాముడే తనముందు కదిలియాడుచున్నట్లు తులసీదాసు నకు అనుభూతి కలిగేది నిరంతరము రామజ్యోతిని హృదయ మందిర ములో ప్రతిష్ఠించుకొని రామనామామృతమును పానముచేయుచూ రామ రూపమును దర్శించుచూ రామగానము నాలకించుచూ తన ధర్మపత్నియగు రత్నావళి సేవలుచేయుచుండ రామచరిత మానసమును రచింపసాగెను

ఒకనాడు తులసీదాసు కుటీరములోకి ఇరువురు చోరులు ప్రవేశిం చారు తులసీదాసు దేవతార్చనచేయు పాత్రలలో భక్తులు బహూకరించిన వెండి స్వర్ణపాత్రలు యుండేవి వాటిని అపహరించవలయునని దొంగలు రాత్రిపూట ప్రవేశించారు పాత్రలను మూటగట్టుకున్నారు నిష్క్రమించి చోవు సమయములో కుటీరముముందు ఇద్దరు కావలాదారులు తుపాకులు ధరించి నిలబడియున్నారు రాత్రంతయు చోరులు కుటీరములోనే వుండి పోవలసి వచ్చింది ఉదయముననే తులసీదాసు లేవగానే చోరులిరువురు తులసీదాసు పాదాలపైబడి క్షమాభిక్షకోరారు గుమ్మమువద్ద నిలబడియున్న కావలావారెవరని ప్రశ్నించారు తులసీదాసు వచ్చిచూడగా అక్కడ కావలా దారు లెవరూలేరు నేనే రామ సేవకుడిని నాకు సేవకులా? అని తులసీ చింతించసాగాడు పరిస్థితంతయూ అర్థమైంది తనను కాపాడుటకు రామలక్ష్మణులే కావలాదారులుగా వచ్చారని గ్రహించాడు రామలక్ష్మణుల దర్శనభాగ్యము పొందిన చోరులు పుణ్యాత్ములని భావించి వారి పాదాలపై బడ్డాడు తులసీదాసు భక్తి ప్రపత్తులు చోరులను పూర్తిగా మార్చేశాయి వరిలోకూడా భక్తిబీజాలు మొలకెత్తాయి అహా! మహాత్ముల సాహ చర్యములో లభించనిదేముంటుంది!

రామచంద్రుని కృపావాత్సల్యమునకు తులసీ గగుర్పాటు చెందాడు "హేరామా నేనెంత అపరాధము చేశాను? విలువైనపాత్రలు కుటీరములో ఉంచుకొని చోరుల మనస్సులలో వాంఛలు కలిగించాను వాటిని రక్షించ డానికి త్రిభువనపాలకుడవైన నీవు రాత్రంతయు కుటీరముముందు కావలా దారుగా మండవలసి వచ్చినది రామా ఇలాంటి వ్యామోహాలకు భక్తుల

మనస్సులలో స్థానముండకూడదని అర్థమైంది అని చింతిస్తూ తన కుటీరములోనున్న స్వర్ణ రజతపాత్రలను పేదలకు దానం చేశాడు

"రామా! సంకెళ్ళనుండి విముక్తి పొందాను ఇకమీదట సదా నీ నామస్మరణ చేయుచూ జీవిస్తాను నీ భక్తులకు సేవచేయుచూ మనుగడను సాగిస్తాను నీ గుణగానముతో కాలమును సద్వినియోగము చేసుకుంటాను అనిత్యమైన ప్రాపంచిక వస్తువులను విషతుల్యంగా భావిస్తాను నీదయను రుచిచూపిన నామనస్సు భవబంధాలను తయారు చేసుకోదు రామా! కోదండపాణి ఆశ్రిత జనరక్షకా! కరుణించు తండ్రీ నీ భక్తుడైన తులసీదాసునియందు ఇసుమంతైనను విషయవాసనలు ప్రవేశించకుండా అనుగ్రహింపుము" అని తులసీదాస్ ప్రార్థించాడు

ఒకనాడు తులసీదాస్ తన కుటీరములో భక్తులకు అన్నసంతర్పణ చేస్తాడు భక్తుల సంతృప్తిలోనే భగవంతుని సంతృప్తి నిండియున్నదని తులసీదాస్ విశ్వాసము షడ్రసోపేతమైన పదార్థములు తయారుచేయిస్తాడు భక్తులందరూ వస్తారు వారిని ఆహ్వానించి సముచిత స్థానములందు ఆసీనులగునట్లు ఏర్పాట్లుచేస్తాడు వడ్డించబోవు సమయానికి ఒక నూతనవ్యక్తి ప్రవేశించి జై జై రామచంద్ర రఘునాథా" యని తులసీదాస్‌కు నమస్కరిస్తాడు తులసీదాస్ రామనామము పలికిన ఆ వ్యక్తిలో రాముని దర్శిస్తూ అతనినికూడా భోజనానికి ఆహ్వానిస్తాడు అతడు వచ్చి పంక్తిలో ఆసీనుడవుతాడు అతడిరాకను గమనించిన ఇతరులు తులసీదాస్‌ను పిలిచి "తులసీ నీవు ఇప్పుడు భోజనానికి ఆహ్వానించిన వ్యక్తి చాలా దుర్మార్గుడు హంతకుడు భక్తులకు జరుగు సమారాధనలో అతను భుజించుటకు వీలులేదు. అతడు భుజించినచో సమారాధనమే అపవిత్రము గునని పలికిరి

తులసీదాస్ భక్తులకు నమస్కరిస్తూ "అయ్యా! క్షమించండి అతడు నావద్దకు వచ్చి రామనామము నుచ్చరించెను రామనామ ముచ్చరించినచో సకల పాపములు ప్రక్షాళనమగునని తమకు తెలియనిదికాదు అందుచే నేను ఆతనిని ఆహ్వానించాను అదియునుగాక ఒకరి పాపముల నెంచుటకు

మన మేపాటివారము? ఇతరుల పాపముల జాబితాను లెక్కించమని భగవానుడు మనలను ఈ లోకానికి పంపలేదు మన పాపములను గుర్తించి ప్రక్షాళనం చేసుకొని తరించమని పంపించాడు కనుక దయచేసి వచ్చిన అతిథికి భుజించుటకు అనుమతినివ్వండి అని ప్రార్థిస్తాడు

తులసీదాస్ అభ్యర్థన వారికి నచ్చలేదు "తులసీ నీ వాదము నిరాధారముగా కన్పట్టుచున్నది అతడి రాకచే ఇప్పటికే ఈ ప్రదేశము అపవిత్రమైనది అతడు మాతో కలసి భుజించినచో ఆహారముకూడా శుద్ధిని కోల్పోవును నీవు చెప్పు మాటలను యదార్థమని నమ్మలేకపోవు చున్నాము నీవు మాకేదైనా నిదర్శనము చూపగలిగినచో మేము నమ్మగలము" యని పలికిరి

తులసీదాస్ తన హృదయాంతర్యామియైన రామునకు నమస్కరించాడు భక్తులనుద్దేశించి మహాత్ములారా! మీ ఉద్దేశ్యము అదే అయినచో తప్పక నిదర్శనము గోచరించగలదు భగవంతుని ఆమోదము లభించిన ఎమ్మటనే మీరు భుజించవచ్చును రండి యని భక్తులను వెంటబెట్టుకొని తన ఆశ్రమప్రదేశము ప్రక్కనేయున్న శివాలయములోకి ప్రవేశించెను ఒక పళ్ళెరములో ఆహార పదార్థములుంచి అవి ఆలయములో శివసన్నిధిలో ఉంచాడు తులసీదాస్ భక్తులందరు వీక్షించుచుండ తులసీ చేతులు జోడించి "హే భక్తవత్సలా! విశ్వేశా రామనామము వ్యక్తి పాపములను పోగొట్టలేదా? పతితుడైన భక్తుడు భుజించుటచే సమారాధన మలినపడుతుందా? నేను చేసినది అపరాధమా? నేను నిరపరాధినైనచో ఈ ఆహారమును నందీశ్వరుడు భుజించుటయే నిదర్శనము" యని పలికి నేత్రములు మూసుకొని రామనామస్మరణ చేయుచుండెను.

జై జై విశ్వేశ్వర! విశ్వనాథా భక్తసమూహము వీక్షించుచుండగనే నందీశ్వరుడు కదలివచ్చి ఆహారమును భుజించెను భక్తులందరు ఆశ్చర్యచకితులై తులసీదాస్ పాదములపై బడిరి భక్తవత్సలుడైన భగవానునికి భక్తులయందున్న అపార ప్రేమకు తులసీదాస్ నేత్రములనుండి ఆనంద బాష్పములు రాలినవి

ఒకనాడు ఒక స్త్రీ విలపిస్తూ తులసీదాసు చెంతకు వస్తుంది భక్తు డైన తులసీదాసును ఆమె ఆర్తనాదము ఆవేదనకు గురిచేస్తుంది వెంటనే తులసీదాసు ఆమెవైపు చూచి దీర్ఘసుమంగళీభవ అని ఆశీర్వదిస్తారు ఆ యాశీర్వాదము ఆమె దుఃఖమును రెట్టింపు చేసింది "మహాత్మా నాభర్త ఇప్పుడె చనిపోయాడు నేను ఆ నరకయాతన ననుభవించలేక తమ సన్ని ధికి పరుగెత్తుకుంటూ వచ్చాను తమరుకూడా నన్ను అపహాస్యం చేస్తు న్నారు అని దుఃఖించసాగింది.

తులసీదాసు నిర్ఘాంతపోయాడు "తల్లీ! నీభర్త మరణించిన విషయం వాస్తవంగా నాకు తెలియదు నానోటినుంచి అప్రయత్నముగా ఆ పలుకులు వచ్చినవి రాముడే నాచేత అలా పలికించాడు రాముని అమృత వాక్కులు వృథాకావడానికి వీల్లేదు నీవు వెళ్ళి చనిపోయిన నీ భర్త చెవిలో రామనామము నుచ్ఛరింపుము సందేహించవలదు విశ్వాస ముతో వెళ్ళుము రామరామమహిమ అపారము" అని తులసీదాస్ తెలియ జేశాడు

ఆమె పరుగెత్తుకుంటూ ఇల్లు చేరింది తనభర్త చెవిలో "రామ రామ యని విశ్వాసముతో ఉచ్చరించింది అంతే ఆమెభర్త నిద్రనుండి లేచినట్టు లేచి కూర్చున్నాడు అందరూ విస్మయమొందారు రామనామ ప్రభావమునకు ఆశ్చర్యచకితులైనారు తులసీదాస్‌లోని భక్తి ప్రపత్తులకు శిరమోడ్చి నమస్కరించారు.

ఈవార్త నగరమంతయు వ్యాపించినది తులసీదాస్ మహాభక్తుడని జనులందరు కొనియాడసాగారు తన కేమియు తెలియదనియు అంతయూ రామచంద్రుని వైభవమేననియు తనను స్తుతించు జనులకు తులసీదాస్ తెలియజేసేవాడు తులసీదాస్ కీర్తి నలువైపులా వ్యాపించినది తులసీ దాస్‌ను చూడవలయునని భక్తులు తండోపతండాలుగా రాసాగారు తనను దర్శించ వరుదెంచు భక్తులకు రామనామ వైభవమును గూర్చి తెలియజేసే వాడు తాను రచిస్తున్న రామచరిత మానసము ను చదివి వినిపించెడి వాడు ఆర్తుల దుఃఖాన్ని తన అమృత వచనములచే రూపుమాపేవాడు.

తన ప్రేమ దృష్టిచే జనుల హృదయాలలో సమభావమును నింపేవాడు నిరాడంబర జీవనముతో నిష్కల్మష ప్రవర్తనతో అందరిని ఆకర్షించి ఆనందింపజేసేవాడు

రామనామ ప్రభావముచే చనిపోయిన వ్యక్తిని తులసీదాస్ పునర్జీవింప చేశాడనెడివార్త నలుమైపుల వ్యాపించింది విస్తృతంగా వ్యాపించిన ఈవార్త పాదుషా కొలువులోకూడా ప్రాకింది పాదుషా తులసీదాస్ నాహ్వానించాడు తులసీదాస్ పాదుషా కొలువులో ప్రవేశించాడు సముచిత మర్యాదలొనర్చి తులసీదాసును ఉచితాసనంపై కూర్చుండమని గౌరవించారు పాదుషా తులసీదాసును కొనియాడుతూ మానసీయ మీరు మహాత్ములు మీరు జూపిన అపార మహిమలనుగూర్చి విని మేము మిక్కిలి ముదమందినాము తమబోటి భక్త శేఖరులను దర్శించుటచే మా జన్మ పావనమైనది తమరు ప్రదర్శించు మహిమలు వీక్షించవలయునని మా మనస్సు ఆనందముతో యున్నది మా ఆస్థానమునందు సర్వులు వీక్షించుచుండగా మీ మహిమలు ప్రదర్శించి మమ్మానందింపజేసి మేము సమర్పించుకొను సంభావనలనుపొంది తృప్తిచెందవలసిందని తెలుపుతాడు

పాదుషా అమాయకత్వానికి తులసీదాసు ఆశ్చర్యపడ్డాడు భగవంతుని నుండి ఆవిర్భవించిన అనుగ్రహాన్ని చౌకబారు ప్రదర్శనలని భావించుటయా? భక్తుల జీవితాలలో ఆనాలోచితముగా కదలిన వైభవములను గారడిగా పరిగణించుటయా? భగవత్కృపచే భక్తుల మానసములలో అప్రయత్నముగా వెలువడి బాహ్యములో రూపురేఖలు దిద్దుకొను విభూతులను వినోద క్రీడలుగా దర్శించుటయా? అపచారము అజ్ఞానజనిత అప్రస్తుత ప్రసంగము అవివేకపూరిత అయోమయ ప్రలాపము ఒక్క మాటలో చెప్పాలంటే అగ్నితో చెలగాటము తులసీదాసు పాదుషాకు నమస్కరిస్తూ సార్వభౌమా! క్షమించండి నన్నుగూర్చి మీరు విన్నది నిజముకాదు నేనొక అమాయకుడను రాముని పాదములుతప్ప అన్యమెరుగనివాడను సదా రామ ధ్యానములో కాలము గడుపువాడను నిరంతరము రామకధా రచనా వ్యాసంగములో కాలక్షేపము చేయువాడను నాదగ్గర మాయలులేవు నాకు మహిమలు తెలియవు నాద్వారా గతములో అలాంటి మహిమలు జరిగినచో అవి నేను

ప్రయత్నపూర్వకముగా చేసినవికావు రాముడే నాద్వారా అలాచేయించాడు నన్ను పనిముట్టుగా గ్రహించి తానే క్రీడించాడు ఇది యధార్థము నన్ను క్షమించండి మీ మనస్సును కలవరపెట్టినచో క్షంతవ్యుణ్ణి అని నమ్రతతో తెలిపాడు

పాదుషా అభిమానము దెబ్బతిన్నది తనలో అహంకారజ్వాల ప్రజ్వ లించింది తులసి తనమాటను నిరాకరించాడనే భావన మనస్సులో ఏర్ప డింది సభలో తాను చాలా మలకన చేయబడ్డాను భావించాడు తులసీవైపు తీక్షణంగా చూశాడు పాదుషా చూపుల్లో క్రౌర్యము నాట్యము చేస్తున్నది క్రోధము విజృంభిస్తున్నది ప్రతీకారము వెలరేగుమన్నది తులసీని సమీ పించి భేష్ తులసీ నీ సాహసము ప్రశంసనీయమైనది ఈ రాజ్యానికి మేము చక్రవర్తుల మన్నమాటను విస్మరించి నీవు అధిక ప్రసంగము చేశావు మాకే నీతులుబోధించడానికి సిద్ధపడ్డావు మమ్ము తిరస్కరించడము వలన కలిగే పర్యవసానాన్నికూడా నీ మనస్సు ఊహించలేకపోయింది నలుగురు అమాయకులు నిన్ను మట్టుముట్టి భక్తుడని కీర్తించగానే నీ అహంకారము అవధులు దాటింది నీవెలా ప్రదర్శించవో చూచెదము అని సేనాపతిని పిలిచి తులసీదాస్‌ను స్తంభమునకుకట్టి కొరడాచే బుద్ధి చెప్ప వలెనందని ఆజ్ఞాపిస్తాడు

రాజభవనములో స్తంభమునకు తులసీదాస్‌ను కట్టి బంధించారు జనులందరు మట్టూచేరి ఈ ఘోరాన్ని తిలకిస్తున్నారు సేనాధిపతి కొరడా తీసుకొనివచ్చి తులసీదాస్ ముందు నిలిచాడు చీమకైనా కీడు తలపెట్టని మహాత్ముని అంతభయంకరముగా హింసింపుటకు అధికారదుష్టమానవులు వెనుకాడలేదు తులసీదాస్ నేత్రాలుమూసి రామనామామృతాన్ని పానం చేస్తున్నాడు సేనాధిపతి కొరడా ఝళిపించాడు అంతే అత్యద్భుత మహిమ ప్రదర్శింపబడింది రాజభవనమంతా మనిషి ఎత్తుగల కోతులు నిలిచియున్నాయి ప్రతి రాజభటుని ఒక కోతి అనుసరించియున్నది ఆవేశ పూరితమైనగన్పట్టు ఆ వానర సమూహమునుచూసి పాదుషా దిగ్భ్రాంతి చెందాడు ఇదంతయు భక్తుడైన తులసీదాస్‌ను బాధింపుటచే ఏర్పడిన అరి

తులసీదాస విశ్వాస లామకో జో నరహరి కరోసో
ఔర్ ప్రభావ కహాఁలగి వరణౌఁ సోయమరాజ డరోసో॥

రామనామ విశ్వాసప్రభావము వర్ణనాతీతము నిముషమును మీరాబాయి నవ్వుతూ పానము చేసింది దైవముపై ఆమెకుగల విశ్వాసము విషమును అమృతంగా మార్చింది తులసీదాసునకు రామనామమునందుగల విశ్వాసము వర్ణించుటకు వీలుకానిది రామచంద్రునిపై విశ్వాసముంచి జీవించువారినిజూచి యముడుకూడా భీతిచెందును అని తులసీదాసు పారవశ్యముతో గానముచేశాడు.

ఒకనాడు జహంగీరు పాదుషా తన ఆస్థానమునకు తులసీదాసును రప్పించి అతనికి బహుమానముగా ధనమీయబోయెను తులసీదాసు నిరాకరించుచూ భక్తుడైన వానికి ధనముతో పనిలేదు ధనవ్యామోహమువలన మనసు కలతచెంది ధ్యానము వక్రించునని తెలిపెను అంతట జహంగీరు కలుగజేసుకొని మహాత్మా ధనము మీకు అవసరములేదని నాకు తెలుసు మీలాంటి మహాత్ముల దగ్గర ధనముండినచో అది సత్కార్యమునకు ఉపయోగపడగలదు అని తెలుపగా తులసీదాసు చిరునవ్వును చింగిస్తూ మాయ ఏ రూపములో వచ్చినను నాలో ప్రవేశించుటకు నేను అనుమతింపను మీ ధనమును మీ దగ్గరే ఉంచుకొని చేయదగిన మంచి పనులేమిటో మీరే చేయండి మీముందు నా అరచేతిని చాపినచో మీరు అందులో ఉమ్మివేసినను నేను భరించవలసి వచ్చును అని తెలియజేయగానే జహంగీరు సిగ్గుతో తలవంచుకొనెను

శ్రీమద్వాల్మీకి రామాయణమును హిందీలో రామచరితమానసము అను పేర రచింపబూని ఆ పవిత్ర గ్రంధమును అయోధ్యలో పూర్తి చేసెను శ్రీ తులసీదాసు మహర్షీయుడు 125 సంవత్సరములు సంపూర్ణ జీవితమును కొనసాగించినట్లు తెలియుచున్నది రోహిదాస్ నందదాస్ మీరాబాయి ఇత్యాది భక్తులతో తులసీదాసు మహర్షీయునికి పరిచయమున్నట్లు తెలియుచున్నది ఈతడు దోహావలి వినయపత్రిక జానకీమంగళ్ గీతావళి రామచరితమానసము మొదలగు గ్రంధములను రచించిరి వీరి

రచనలలో వినయపత్రిక, రామచరితమానసము అతిప్రాముఖ్యమైన గ్రంథములు

నిర్మలమైన జీవితమును గడిపి నిరాడంబరముగా మెలిగి సదా రామనామోచ్చారణతో బ్రతుకును ధన్యత చేసుకొని ఇతరులకు ఆదర్శప్రాయుడై నిలిచిన మహానుభావుడు సద్గురుసంత్ తులసీదాస్ మహాశయుడు

మానవజన్మ ప్రాప్తించినది భగవంతుని పొందుటకేననియు నిరంతరము భగవన్నామామృతపానము చేయువారు ధన్యజీవులై మోక్షసామ్రాజ్యము నధిష్ఠించెదరని తులసీదాసు మహనీయుడు తన దివ్యసందేశము నందించాడు

బ్రహ్మాంభోధి సముద్భవం కలిమల ప్రధ్వంసనం చావ్యయం
శ్రీమచ్ఛంభు ముఖేందు సుందర వరం సంసేవితం సర్వదా
సంసారామయ భేషజం సుఖకరం శ్రీజానకీ జీవనం
ధన్యాస్తే కృతినః పిబంతి సంతతం శ్రీరామ నామామృతమ్

బ్రహ్మాంబోధి సముద్భవము కలికల్మషహారము అక్షయము

శంకర సేవితము సంసార రోగముల రూపుమాపు ఔషధము సుఖకరము జానకీ జీవనమైన రామనామామృతమును సదా సేవించువారు ధన్యజీవులు

అని తులసీదాస్ తన అంతిమ అమరసందేశమును గానముచేసెను

* జై జై భక్తమందారాయ నమః *





# సావిత్రమాలి

విశ్వంలో అగుపించే శక్తులన్నిటిలో అద్భుత మహిమాన్వితమైన శక్తి విశ్వాసము మానవ జీవితములో ప్రతి శ్వాస విశ్వాసము మీదనే ఆధారపడి జరుగుచున్నది సృష్టికర్తకు తనపై ఉన్న విశ్వాసమే సృష్టికి మూలకారణమై యున్నది భార్యాభర్తల అనురాగ దాంపత్యానికి పరస్పరము ఏర్పరచుకొన్న విశ్వాసమే కారణము గురుశిష్యుల పవిత్ర అనుబంధానికి విశ్వాసమే పట్టుగొమ్మ వైద్యుని విశ్వసించి మన శరీరాన్నే అతని చేతిలో ఉంచుతున్నాము విశ్వాసముతోనే విశాల దృక్పథము ఏర్పడుతుంది

విశ్వాసము పర్వతాలను కదిలిస్తుంది సాగర చలనాన్ని నిరోధిస్తుంది అగ్నిని చల్లబరుస్తుంది నీటిని పల్లమునుండి ఎత్తునకు ప్రవహింప చేస్తుంది

విశ్వంలో మనము అన్నిటిని విశ్వసిస్తున్నాము కానీ విశ్వానికి ఆధారభూతుడైన విశ్వనాథుని విశ్వసించలేకపోతున్నాము క్షణికమైన విశ్వగారడి వినోదములో కాలాన్ని హరింపచేసుకుంటున్నామేగాని శాశ్వత బ్రహ్మానందాన్ని అనుభవించటానికి ప్రయత్నించలేకపోతున్నాము

విశ్వమంతయూ విశ్వనాధుని దయతో నడుస్తున్నది విశ్వాసము మనిషిని అనంతునిగా చేస్తుంది అనుమానము వ్యక్తికి అనర్థాన్ని తెచ్చి పెడుతుంది

జగజ్జీవనుడైన జగన్నాధునిపై విశ్వాసముంచి ఎందరో భక్తిచేసి తరించారు ఆంజనేయుని అనంత విశ్వాసములో సముద్రము చాలా చిన్నదై పోయింది నామదేవుని పరిపూర్ణ విశ్వాసములో విగ్రహము మానవా కృతిలో కనుపించి మాట్లాడింది అగస్త్యుడు అసంశయ విశ్వాసముతో సముద్రపానము చేయడము జరిగింది మీరాబాయిలోని విశ్వాసమే విషాన్ని అమృతముగా మార్చింది తనను విశ్వసించిన భక్తులను భక్తభూషణుడైన భగవానుడు సదా కాపాడుతూనే వుంటాడు

అరుణభేండి అను గ్రామములో సావితా అనే తోటమాలి ఉండే వాడు జన్మ సంస్కార ప్రభావముచే అతనికి బాల్యమునుండి భక్తి అల వడింది మాటలురాని చిఱుత ప్రాయములోనే భగవంతుని కీర్తనలను విన పడినచో చెవులప్పగించి వినెడివాడు దానికితోడు గృహవాతావరణము కూడా ఈతనికి చాలా అనుకూలముగా ఉండెడిది భగవద్భక్తులైన ఈతని తల్లిదండ్రులు అతిథి అభ్యాగతాదరణలోను భగవత్కైంకర్య నిర్వహణ లోను ఆదర్శ జీవితమును గడుపుచుండెడివారు చక్కటి కంఠస్వరముతో తమఇంటి ఆరాధ్యదైవమైన పాండురంగస్వామినిగూర్చి తండ్రి కీర్తనలు పాడేవాడు పసిబాలుడైన సావితామాలి నిర్మలమనస్కుడై ప్రశాంత వదనంతో ఆలకించేవాడు

భక్తి ప్రవృత్తులతో దినదిన ప్రవర్ధమానమవుతున్న ఆ బాలుని ఆధ్యా త్మిక చింతనచూసి తల్లిదండ్రులు అమితానంద భరితులైరి తండ్రి పాండు రంగ భగవానుని అనంత లీలావిశేషములను కుమారునికి తెలియచేయు చుండెడివాడు జన్మతః తనలో మొలకెత్తిన భక్తిబీజములను తన తండ్రి సమకూర్చు సంకీర్తనాది ఎరువువేసి పదవగాహనాది జలముపోసి వికసించు నట్లు చేసుకొని ఆధ్యాత్మిక జీవన పుష్పములతో విరాజిల్లునట్లు తీర్చిదిద్దు కున్నాడు

యుక్తవయస్సు వచ్చిన సావితామాలి విద్యయందు ఆసక్తిచూపక తన తండ్రివలె తోటమాలి వృత్తిలో జీవితమును కొనసాగించుమండెను బ్రహ్మముహూర్తములో నిద్రలేచి స్నానానంతరము జప సంకీర్తనాదులు ముగించుకొని తల్లిదండ్రులను సేవించి తోటకు వెళ్ళేవాడు అచ్చట తోట పనులన్నియు చక్కగా నిర్వహించెడివాడు కరచరణాదులు తోటలో కర్మలాచరించుచుండ మనసును తన ఆరాధ్యదైవమైన పాండురంగ భగవానునియందు లగ్నముచేసి సంకీర్తన చేయుచుండెడివాడు

సావితామాలి తీర్చిదిద్దే ఆ వనములో ప్రతిచెట్టు ఒక సందేశాన్నందిస్తుంది ప్రతి పుష్పము ఒక ఆధ్యాత్మిక రహస్యాన్ని తెలియచేస్తుంది ప్రతిఫలము మోక్షధామాన్ని గుర్తుతెస్తుంది ప్రతి నీటికాలువ సుశ్రావ్య సంకీర్తనను వినిపిస్తుంది

భగవత్ప్రీతికరంగా కర్మల నాచరించువాని చేతిలో ప్రతికర్మ ఒక యజ్ఞముగా మారుతుంది సావితామాలి యవ్వనవంతుడయ్యాడు అతనికి వివాహము చేయాలని తల్లిదండ్రులు నిర్ణయిస్తారు జనాబాయి అనే సుగుణాలరాశిని అతనికిచ్చి వివాహము చేస్తారు

సంస్కారవంతులకు వివాహమొక ప్రతిబంధకము కాదు తాను వివాహితుడైనను అతనిలోని వివేక వైరాగ్యాలు భక్తిప్రపత్తులు వృద్ధి చెందుతున్నాయేగాని క్షీణించడములేదు ఆధ్యాత్మికముగా పెరుగుతున్న తన మనస్సుకు గృహస్థజీవనము ఏ విధముగానూ అంతరాయము కలిగించలేదు గృహస్థజీవనములో అనుకరింపదగిన వ్యక్తిగా సావితామాలి రాణించసాగాడు

తనయుని శీలసంపదను ఆధ్యాత్మిక జీవనమును చూసితృప్తిచెందుతున్న సావితామాలి తల్లిదండ్రులు కన్నుమూశారు జననీ జనకుల అస్తమయము అతనిలో వెలుగుతున్న వైరాగ్యజ్వాలకు ఆజ్యము పోసినట్లయింది జీవితముయొక్క అస్థిరత్వాన్ని బాగా గ్రహించాడు అశాశ్వతమైన ప్రాపంచిక వ్యామోహాలు వాంఛనీయము కాదని తెలుసుకున్నాడు

సంసారిక జీవనములో అరుచి గోచరింపసాగింది నిరంతరం భగవత్కథా సంకీర్తనాదులయందు మనసును లగ్నము చేయసాగాడు

ఒకనాడు సావితా ధర్మపత్ని జనాబాయియొక్క బంధువులు పలుకరించడానికి వస్తారు జనాబాయి వారిని ఉచితరీతిని సత్కరిస్తుంది కానీ సావితా అంత ఉత్సాహపూరితంగా కనుపించడు బంధువులు వెళ్ళిన తరువాత జనాబాయి గాయపడిన హృదయముతో సావితాను సమీపించి "మీ ప్రవర్తన సబబుగా ఉన్నదా? ఇంటికి వచ్చిన బంధువులతో ఇలాగేనా ప్రవర్తించేది? వాళ్ళు నాకు సంబంధించిన వారనేగదా మీరు ఈ విముఖత చూపడము మీభక్తి ఇంత సంకుచితమైనదా? అని ఆవేశాన్ని అపుకోలేక మాట్లాడుతుంది.

సావితా భార్యవంక ప్రసన్నంగాచూస్తూ నా ప్రవర్తన నీకు అపభ్యముగా కనుపించివుంటే అది నా తప్పుకాదు నీ నా అనే భేదాలు నాకు తెలియవు విఠలనాథుని పూజ్యచరణారవిందములయందు లగ్నమైన నా చిత్తమునకు ప్రాపంచిక విషయములందు ఆసక్తి కనుపించడములేదు నశించిపోయే దేహాదులతో ఏర్పరచుగానే సంబంధాలు స్వప్నతుల్యములు గతములో ఎన్నో జన్మలు కలిగియున్నాము ఆ జన్మలలో మనము ఏర్పరచుకొన్న బాంధవ్యాలు బంధువులు ఏమయ్యారు? మనతో శాశ్వతముగా కలవవచ్చే బాంధవ్యము ఒక్కటే అదే అచంచల భగవద్భక్తి భగవద్భక్తిగల పవిత్ర భక్తులే నా బంధువులు అట్టివారికి నేను దాసుడను వారి పవిత్ర పాదాలు కడిగి పూజిస్తాను వారి పాదధూళిని శిరోధార్యముగా భావిస్తాను అంతేకాని ప్రాపంచిక బాంధవ్యాలకు నా మనస్సులో స్థానము లేదు నా ప్రవర్తన నీకు మనోక్షోభను కల్గించియున్నట్లయితే నన్ను క్షమించు" అని తనలో భాసించే వైరాగ్యాన్ని విశదీకరించి చెబుతారు భర్త మానసికస్థితిని గ్రహించిన జనాబాయి తన తప్పిదమును మన్నించి క్షమించమని భర్త పాదాలపై పడి కన్నీరు కారుస్తుంది

సావితామాలి భక్తి సౌరభము అన్నివైపుల విరజిమ్మబడుతుంది సావితాలోని ప్రగాఢ భక్తి విశ్వాసములను విని నామదేవులవారు బయలుదేరి సావితామాలిని చూడటానికి వస్తారు భాగవతోత్తముడైన నామదేవుల

వారి రాకను గమనించి సావితామాలి సంభ్రమాశ్చర్యాలతో వారిని ఆహ్వానించి అతిథి మర్యాదలాచరిస్తారు సావితా హృదయవిశాలతకు అకుంఠిత భగవద్భక్తికి నామదేవులవారు సంతృప్తి చెందుతారు ఎరాత్పరుడైన పాండురంగ భగవానుని వైభవములను దివ్యవిభూతులనుగూర్చి ముచ్చటించుకుంటూ ఆ రాత్రంతా ఆనందముగా గడుపుతారు

మరునాడు మధ్యాహ్నము భోజనానికి కూర్చొగానే జీర్ణవస్త్రములతో సంస్కారహీనమైన జుట్టుతో ఒక ఫకీరువచ్చి వారిముందు నిలుస్తారు తనకు వారితోపాటు భోజనము ఆరగించవలయునని కుతూహలముగా ఉన్నదనియు తనకు ఆ అవకాశము ఇవ్వమని అడుగుతాడు అతిథిని నారాయణ స్వరూపముగా భావించే సావితామాలి ఆ ఫకీరుకు నమస్కరించి అతనిని కూడా భోజనానికి ఆహ్వానిస్తాడు

అశుభ్రముగా కనుపిస్తున్న అతిథి ప్రక్కన కూర్చుని భుజించడానికి నామదేవులవారి మనస్సంగీకరించదు వెలితి హృదయముతో భోజన మారగించడానికి ప్రారంభిస్తారు సావితాలో ఏ విధమైన మార్పులేదు ద్వంద్వాలను తటస్థపరచిన సావితా ఆనందముగా ఎందారగిస్తాడు భోజనానంతరము సావితామాలికి నామదేవులకు నమస్కరించి వెళ్ళడానికి శలవు కోరుతాడు అతిథిగా వచ్చిన ఫకీరు సావితా ఫకీరుకు నమస్కరించి సాగనంపుతాడు

ఆరోజు సాయంత్రము నామదేవులవారితో కలసి సావితామాలి దేవాలయానికి వెళ్తారు ఆలయములో ప్రవేశించగానే వారొక విచిత్ర దృశ్యాన్ని చూచి ఆశ్చర్యపోతారు గర్భాలయములో స్వామి విగ్రహము ఉండేచోట విగ్రహము అదృశ్యమై సావితామాలి గృహములో విందారగించిన ఫకీరు కనుపిస్తాడు నామదేవులవారు నిర్ఘాంతపోతారు సావితామాలి దిగ్భ్రాంతి చెందుతారు వారలా చూస్తుండగానే ఆ రూపము అదృశ్యమై యధావిధిగా విగ్రహము కనుపిస్తుంది

భగవానుడే అతిథి రూపములో వచ్చి అతిథ్యము స్వీకరించి తమ జన్మ చరితార్థం చేసారని సావితామాలి భావిస్తారు పాండురంగని పవిత్ర దర్శనముతో తమ బ్రతుకులు పావనమయ్యాయని భావిస్తారు సర్వభూతా

లలో అంతర్యామియై భాసించే పాండురంగ భగవానుని అ తి థి గా వచ్చిన ఫకీరులో చూడలేకపోయినందులకు నామదేవులవారు చింతిస్తారు తనలో వున్న భేదదృష్టిని తొలగించుటకే భగవనుడలా వచ్చాడని గ్రహిస్తారు అతిథిలో నారాయణ స్వరూపమును గాంచిన సా వి తా మా లి పూర్ణదృష్టికి సంతోషపడుతారు

దేవాదిదేవుడైన విఠలనాథుని మందిరములో ఒకనాడు జ్ఞా న దే వ నామదేవులు సంకీర్తనము చేయుచుండగా పాండురంగ భగవానుడు ప్రత్యక్ష మవుతారు భక్తరక్షణ నిమిత్తము తాను ఆలయమును వదలి ఒహాంళ అను గ్రామమునకు వెళ్ళుచున్నాననియు జ్ఞానదేవ నామదేవులను కూడా అనుసరించవలసిందని తెలియచేస్తారు భక్తులయెడ భగవానునకుగల కృపా విశేషములు తెలిసిన జ్ఞానదేవ నామదేవులు మారుపలకకుండా అనుసరిస్తారు మార్గమధ్యములో ఒక తోటవద్ద నిలబడి తనకు దాహం ఎక్కువగా వున్న దనియు కనుపించే ఆ తోటలోకి వెళ్ళి నీరు త్రాగి రావలయుననియు అంత వరకు వారిరువురిని అక్కడే వుండవలసిందనిచెప్పి తో ట లో కి పాండు రంగడు ప్రవేశిస్తాడు

చెట్లకు నీరుపెడుతున్న సావితామాలి దీనదయాళుడైన విఠలనాథుని దర్శనభాగ్యం కలిగినందులకు పరవశిస్తూ భగవానుని పాదాలపైబడి నమ స్కరిస్తాడు భగవానుని పవిత్ర దర్శనముతో చరణకమల స్పర్శతో తన జన్మ తరించిందని ఆనందిస్తాడు భక్తవత్సలుడైన భగవానుడు సావితా మాలిని చూసి సా వి తా నీవు నాకు ఒక సహాయము చేయాలి అని కోరుతాడు

భగవాన్ త్రిలోకాలకు నీవే ఆధారభూతుడవు నేను నీకు సహా యము చేయుటయా? ఈ దీనుని దుస్థితిని భగవానునకుకూడా వేళాకోళంగా యున్నదా? అని సావితా వినమ్రతతో అంటాడు

అంతట భగవానుడు సావితా! భక్తులతో నేను ఏనాడూ వేళాకోళ మాడలేదు నేను యథార్థమే చెబుతున్నాను ఈనాడు నీ అవసరమువుంది నీవు సహాయమొనర్చి నన్ను కాపాడాలి ఇద్దరు దొంగలు నన్ను వెంట

డించి తరిమారు వారి బారినుండి బయటపడాలని నేను ఇటు పరుగెత్తాను నన్ను ఆ దొంగల కంటపడనీక ఎక్కడైనా దాపవలసిందని సావితాను కోరుతాడు

భగవాన్ ఆదిదేవా! నిన్ను దాచుటకు అనుకూలమైన ప్రదేశము ఎక్కడున్నదో నాకు తెలియడము లేదు అనంతుడవైన నిన్ను ఏ ప్రదేశ ములో దాచేది? సర్వగతమైన ఆకాశమును పాత్రలో ఉంచగలమా? అనంత మైన సముద్రమును బావిలో నింపగలమా? ఇవి ఎలా సాధ్యములుకావో స్వామీ మిమ్ములను దాచుటకూడా నాకు సాధ్యముకాద ని సావితామాలి పాండురంగనికి తెలియచేస్తాడు

సావితా! వేదాంతావగాహనకు ఇది సమయముకాదు నన్ను మొదట ఎక్కడైనా దాచి తరువాత మాట్లాడవలసింది ని పాండురంగడు ఆదేశిస్తాడు

సావితామాలి ఆలోచిస్తాడు భగవానుని దాచుటకు అనువైన ప్రదే శమును గూర్చి కొన్ని క్షణాలు యోచిస్తాడు తాను తోటలో పనికి ఉపయో గించే కత్తిని తీసుకొని ఆ కత్తితో తన పొట్ట చీలుస్తాడు భగవాన్! మిమ్మల్ని దాచుటకు ఇంతకన్నా క్షేమకరమైన స్థలములేదు మీరు వెంటనే నా హృదయములో ప్రవేశించండి అని ప్రార్థిస్తాడు భగవానుడు అంగుష్ట ప్రయాణమై సావితామాలి హృదయములో ప్రవేశిస్తాడు

స్వామి రాకకై తోటబయట వేచియున్న జ్ఞానదేవ నామదేవుల వారు స్వామి రాక ఆలస్యమైనందుకు కారణము తెలియక వనములోకి ప్రవేశిస్తారు భక్తి పారవశ్యముతో చలనములేని స్థాణువులా కూర్చుని యున్న సావితామాలిని చూస్తారు సావితాను కలసినందులకు నామదేవుల వారు సంతృప్తి చెంది సావితా మన స్వామిపాండురంగడు ఇటు రావ డము నీవు చూసితివా? అని ప్రశ్నిస్తారు

సావితామాలి జ్ఞానదేవ నామదేవులకు నమస్కరిస్తూ పాండురంగని జాడ తనకు తెలియదన్నట్లు తల ఊపుతాడు ఆవుకు దూరమైన లేగదూడ భరింపరాని బాధను వెలిబుచ్చునట్లు తల్లి పొందుకై శిశువు పరితపించునట్లు

భగవానుని రాక తెలియక నామదేవులవారు భయాందోళనంతో దిగులు చెందుతారు నామదేవుని విషాదమునుచూసి భరించలేని రుక్మిణీనాధుడు సావితామాలి హృదయమునుండి నామదేవా! ఇదిగో ఇక్కడే ఉన్నాను అని పలుకుతాడు భగవానుడు తాను భక్తుల హృదయ నివాసినని తెలియ చేయడానికే ఇలా చేశారని గ్రహించి బహిర్గతమవుతున్న విఠలనాధుని దర్శించి జ్ఞానదేవ నామదేవులు సాష్టాంగ నమస్కారము చేస్తారు

నామదేవులవారు స్వామికి నమస్కరిస్తూ భగవాన్! ఇప్పటికే చాలా ఆలస్యమైనది మనము బయలుదేరాలి అని చెబుతారు

సావితామాలి స్వామికి నమస్కరిస్తూ కరుణాపారీణా! పాండు రంగా! తమరి ప్రయాణ మెచ్చటికో తెలుసుకోవచ్చునా అని వినమ్రుడై అడుగుతాడు

సావితా నీలాంటి భక్తులను ఉద్ధరించు నిమిత్తమే మేము ప్రయా ణమై వెడుతూ మార్గమధ్యంలో నిన్ను చూడటం తటస్థించింది అని భగ వానుడు చెబుతాడు

సావితామాలిలో ఒక ఉత్సాహము జనిస్తుంది భగవాన్! ఎవరా పవిత్ర భక్తుడు? తమరి అనుగ్రహానికి పాత్రుడై తమరినే తనవద్దకు రప్పించుకుంటున్న ఆ పుణ్యాత్ముడెవరు? అని అడుగుతాడు

దీనదయాళుడైన విఠలనాధుడు జ్ఞానదేవులవారి వైపుతిరిగి జ్ఞాన దేవా! మన ప్రయాణ ఉద్దేశ్యమును నా భక్తుడైన సావితామాలికి తెలియ చేయవలసింద ని చెబుతాడు

భగవదాజ్ఞను శిరసావహించిన జ్ఞానదేవులవారు సావితా! పైఠాన్ అనే గ్రామములో కూర్మదాసనే బ్రాహ్మణుడున్నాడు ఆతడు పుట్టుకతోనే కరచరణవిహీనుడై జన్మించాడు ఒకనాడు పైఠాన్ గ్రామమున ఒక హరి దాసు పాండురంగ మహాత్మ్యమునుగూర్చి హరికథ చెబుతుండగా కూర్మ దాసు కూడా వెళ్ళాడు పాండురంగ భగవానుని దివ్య వైభవలీలను శ్రవ ణం చేయగానే అతనికి పాండురంగని దివ్యదర్శనము చేయవలెననెడి తీవ్ర సంకల్పము కలిగింది కాళ్ళు చేతులులేని తాను ఏలా క్షేత్ర దర్శనము

చేయగలడు? అతడు తీవ్రంగా ఆలోచించసాగాడు భగవద్దర్శనార్థమై భజనలు చేసుకుంటూ వచ్చుచున్న భక్త సంఘములను ప్రార్థించి తనను వెంటతీసుకొని వెళ్ళవలెనందని ప్రార్థించాడు కరచరణ విహీనుడైన ఆ కూర్మదాసును వెంటతీసుకొని వచ్చుటకు ఎవ్వరునూ అనుగ్రహించలేదు భగవద్దర్శనాభిలాష తనలో పెచ్చుపెరుగుచుండ విఠలనాథునిపై భారము వేసి తానే ఒంటరిగా రావడానికి నిర్ణయించుకున్నాడు విఠలనామాన్ని స్మరిస్తూ బల్లివలె ప్రాకుతూ ప్రయాణము సాగించాడు నాలుగు నెలలు ప్రయాణము చేసి లహుళ అనే గ్రామానికి చేరాడు తన శరీరమంతా పగిలి రక్తధారలవుతున్నది ఇక కదలలేకపోయాడు దిగులుతో దుఃఖముతో కృశించిపోతున్నాడు అదే సమయానికి పాండురంగని దర్శనార్థము సంకీర్తనచేస్తూ వస్తున్న భక్త సమూహామునుచూసి కన్నీరు కార్చుతూ కూర్మదాసునైన తాను పుట్టుకలో కరచరణ రహితముగా జన్మించిన విధి వంచితుడనని భగవద్దర్శనార్థము ప్రాకుతూ లహుళ వరకు వచ్చి రాలేక ఆగిపోయానని దీనదయాళుడైన పండరీనాథునికి తెలియజేయమని చెబుతాడు భక్తుడైన కూర్మదాసు విన్నపము ఆభక్తుల హృదయములను కరిగిస్తుంది వారు పండరీ క్షేత్రమునకువచ్చి కూర్మదాసు విజ్ఞప్తిని స్వామికి తెలియచేయగా శ్రీవారు నన్ను నామదేవులవారిని వెంటనిడుకొని కూర్మదాసును ఉద్ధరించుటకు లహుళ గ్రామమునకు ప్రయాణము సాగించగా మధ్యలో భక్తశేఖరులైన మీ దర్శనభాగ్యం కలిగిందని జ్ఞానదేవులవారు సావితామాలితో చెబుతారు

కూర్మదాసుయొక్క హృదయవిదారకమైన గాధను వినగా సావితామాలి నేత్రాలు చెమ్మగిల్లాయి అంత సావితా చేతులు జోడించి నమస్కరిస్తూ భగవాన్! నాకు ఆ భక్తుని చూడవలయునని కుతూహలం జనించుచున్నది నాకూ ఆ దివ్యావకాశమును ప్రసాదింపుడని ప్రార్థించగా జ్ఞానదేవ నామదేవ సావితామాలితో కలిసి పాండురంగడు లహుళచేరి కూర్మదాసునికి దర్శనమిస్తాడు

భక్తులను వెంటనిడుకొనివచ్చి తన అపూర్వ దివ్యదర్శనమును చూపిన పాండురంగని అనంత కృపావాత్సల్యమునకు కూర్మదాసు ఆనందా

మృతచిత్తుడై భగవాన్! నా జన్మ సార్థకమైనది మీ దివ్యదర్శన భాగ్య ముతో నా జననమరణ చక్రము తుత్తునియమైనది అని పసిబిడ్డలా ఏడు స్తాడు

భక్తుని దీనావస్థనుచూసి పాండురంగని హృదయము తడిసిపోతుంది తన అమృతహస్తాలతో కూర్మదాసును ఆలింగనం చేసుకుంటాడు కూర్మ దాసు నూతన ఆరోగ్యముతో కరచరణయుతంగా సలక్షణంగా మారుతాడు కూర్మదాసా! నేను నిన్ను అనుగ్రహించాను నీకేదైనా వరం కావలయు నేమో కోరుకొమ్మ ని అడుగుతాడు

కూర్మదాసు నమస్కరిస్తూ భగవాన్ అనంత కృపాసాగరా! పాండురంగా! వరాల పేరుతో కోరికల సరాఖు తయారుచేసుకోమని దారి మళ్ళిస్తున్నావా? హే భక్తవత్సలా కరుణానిధీ! కోరికలే అనంత దుఃఖా నికి కారణములని నీవే నా మనస్సులో నిర్ణయము చేశావు? అజ్ఞాన జనిత మైన కోరికల మాటున జీవితాన్ని వమ్ము చేసుకోమని ఆదేశిస్తున్నావా పుండరీకవరదా? ఒక ధనికుడు స్వప్నములో బిచ్చగాడైనందున మేల్కొ నిన తరువాతకూడా అక్షయపాత్ర చేతపట్టుకొని భిక్షాటనకు పోవునా? హే లీలామానుష విగ్రహా నిన్నువినా కోరవలసింది కోరదగినది ఏమున్నదీ ప్రపంచములో? అత్యాశతో వరాలు కోరిన రావణాదులు సాధించిందేమిటి? సత్యనాథా! అనిత్యమైన కోరికలు గాకుండా లోకసేవ నిమిత్తము కోర వచ్చుగదా అని నీ అభిప్రాయమేమో? వివరలా క్షమించు నాకలాంటి విషయములందుగూడ ఆసక్తి జనించడములేదు నా మ న స్సు పట్టు తప్పింది బుద్ధిలో ఆలోచనలు అణగారిపోయాయి ఇంద్రియాలు మూగ బోయాయి గాఢనిద్రతో యున్నవానిని బలవంతముగా నిద్రనుండి లేపినచో వాడు అప్రయత్నముగా మళ్ళీ పడుకొని నిద్రించులాగున నీ పవిత్ర రూప మును గాంచిన నా నేత్రములు మరొక వస్తువును చూడలేక నీ రూపము నందే ఓలలాడుచున్నవి నీ అమృత వచనముల నాలకించిన నాచెవులు బాహ్యశబ్ద విఘాతమును భరించలేకున్నవి మకరంద భాండములో పడిన తేనెటీగ ఆ మాధుర్యరసాస్వాదనలో మేను మరచి బ్రతుకును అంకితము చేసుకొనులాగున నీచైతన్య కాంతిలో మునకవేసిన నేను ప్రపంచానికి

మృతుడనయ్యాను బ్రతుకును అమృతంగా మార్చుకున్నాను భగవాన్ నాలో ఏ ఆశలూ లేవు నీ దర్శన భాగ్యముతో నేను సంపూర్ణుడనయ్యాను కానీ! ఆదిదేవా నా తన్మయత్వములో నీఆజ్ఞను త్రోసిపుచ్చలేను నీవు కోరమంటున్నందున నీ ఆజ్ఞను శిరోధార్యముగా భావించి మిమ్ములను నేను ఒక్క వరాన్ని ప్రసాదించమని వేడుకొంటున్నాను భగవాన్ నాలాగే మీ దర్శనభాగ్యమునకు రాలేని ఎందరో విధివంతులకు పేదలకు నిర్భాగ్యులకు దర్శనమిచ్చే నిమిత్తము ఈ బహుళ గ్రామములో వుండిపోవలసిందని ప్రార్థించగా పాండురంగడు అచట శిలారూపములో వెలసి తన భక్తులైన జ్ఞానదేవ నామదేవ సావితామాలిలతో అదృశ్యమవుతాడు ఇప్పటికిని పండరీక్షేత్రమునకు వెళ్ళు భక్తులు బహుళ గ్రామమునందు ఆగి కూర్మదాసు భక్తి చిహ్నముగా వెలసిన పాండురంగ భగవానుని సేవించి వెళ్తుంటారు

వెలసిన ఆ పాండురంగ భగవానుని నిత్యారాధనలో తన శేషజీవితాన్ని అంకితం చేసుకొని ఆషాడశుద్ధ ఏకాదశి పుణ్యదినంనాడు కూర్మదాసు పాండురంగనిలో ఐక్యమయ్యారు

తన పారవశ్య సంజనిత భక్తితో ఎన్నో కీర్తనలు రచించి కార్తీక శుద్ధ ఏకాదశినాడు సావితామాలి విఠలనాధుని అనంత చైతన్యములో తన చైతన్యమును సమరసం చేసి లయించిపోయారు

♦ జై జై భక్తవత్సల భగవాన్‌కీ జై ♦





# సమర్థ రామదాసు

"బాబూ! క్షణకాలమాగి ఆలోచించు ఆవేశం అనర్థదాయకమని మరచిపోకు జీవికి గృహస్థాశ్రమ ప్రాశస్త్యమేమిటో మననంచేసుకో పెళ్ళిపీటలమీద నుండి లేచి పరుగుదీయడం ఎంతటి అధర్మమో చింతన చేసి చూడు ఒక అమాయకురాలి నిండు ప్రాణాల్ని బలితీసుకోవడం మానవత్వానికే మచ్చలాంటిది ఆలోచించు ఆగు" ఇలా ఎందరు ప్రాధేయపడుతున్నను ఆలకించకుండా పెళ్ళిపీటల మీదనుండి లేచి బాణంలా దూసుకుంటూ పెళ్ళికుమారుడు వెళ్ళిపోయాడు

పెళ్ళిపందిరి వెలవెలపోయింది పెళ్ళికూతురు బ్రతుకు మూగబోయింది ఆనందోత్సాహంతో అలరారుతున్న వివాహమండపము విషాదఛాయలకు నిలయమైంది కార్యకర్తలు స్తంభించిపోయారు బంధువులంతా నిశ్చేష్టులయ్యారు మంగళకర శబ్దముల నందించు భజంత్రీలు ఆపినట్లు ఆగి సంతాపానికి సంకేతాల్లా మిగిలారు కొన్ని క్షణాల్లో పరిస్థితంతా తారుమారైపోయింది ఆహా! కాలనర్తకి విన్యాసాల్లో బ్రతుకు మారడమెంతసేపు

"వివాహం ఇష్టం లేకపోతే ఆవిషయం ముందే చెప్పేయొచ్చుగా!" అంటున్నారు కొందరు ఒక అబల జీవితాన్ని అన్యాయం చేసిన అప్రయోజకుడు అంటున్నారు ఇంకకొందరు ఇలాంటి దుర్మార్గులను వెలివేయాలి అంటున్నారు మరికొందరు పాపం! ఇష్టపడి పెళ్ళిపీటల మీద కూర్చున్నవాడు ఉన్నపళంగా లేచి వెళ్ళాడంటే అనూహ్యమైన కారణమంటూ ఏదోఉండాలి మానవుడు విధి చేతుల్లో కీలుబొమ్మ పాపం ఆకుర్రవాడిని నిందించి మాత్రం ప్రయోజనమేముంది? ఎంతటి వారికైనా కర్మఫలాన్ని అనుభవించడం తప్పుతుందా? అని సానుభూతి వాక్కులు పలుకుతున్నారు ఇకమిగిలిన కొందరు

ఎవరేమంటున్నారనే ధ్యాసకూడా లేక క్షణకాలంలో కనుమరుగైపోయాడు పెళ్ళికుమారుడు అతడే నారోబా దిగ్భ్రాంతి గొలిపిన ఈ అనూహ్య సంఘటనకు ముఖ్యకారకుడు చూచువారల మనస్సులలో అప్రయోజకుడుగా అసమర్ధుడుగా మిగిలిపోయిన మూగజీవి యదార్ధానికి అతడు అప్రయోజకుడు కాదు జీవన తీరాన్ని చేరలేక మునిగిపోయే నావయొక్క అయోమయ స్థితిని గమనించి ధైర్యంతో సాగరమున దుకి ధైర్య సాహసాలతో ఈది బ్రతుకును రక్షించుకొని గట్టు చేరిన ధీరపురుషుడు అతడు అసమర్థుడు కాదు త్యాగజీవన బాటలో తన జీవన రధాన్ని ఉజ్జ్వలంగా నడిపి ముక్తిధామం చేరిన అమరజీవి అసమర్ధతను అంతంచేసి సమర్ధతకు పట్టంగట్టిన సమర్ధ రామదాసు మానవ విశ్వ మందిరములో ఆరని మణిదీపం

మహారాష్ట్ర దేశంలో ఔరంగాబాద్ జిల్లాలోని అంబాద్ తాలూకాకు చెందిన జాంబ అను గ్రామములో సూర్యాజీపంత్ సిరూబాయి అను దంపతులుండేవారు వారి కలిగిన ఏకైక పుత్రుడే నారోబా / నారోబాకు ఎనిమిది సంవత్సరములు రాగానే పితృ వియోగము కలిగింది తండ్రి మరణ వార్తను నారోబా లేతహృదయం భరించలేక పోయింది నారోబా మనసులో చెప్పలేనంత వెలితి చోటు చేసుకున్నది ప్రపంచముపై రోత పుట్టింది హృదయములో వైరాగ్య ముదయించింది భగవదనుగ్రహానికి మనసు ఆరాటపడసాగింది

ఒకనాడు ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళి గ్రామ పొలిమేరలోవున్న అంజనేయస్వామి ఆలయానికి వెళ్ళాడు నా రో బా ప్రేమస్వరూపుడైన హనుమంతుని దివ్యమంగళ విగ్రహాన్ని చూడగానే నారోబా పులకాంకితుడయ్యాడు నేత్రాలవెంట కన్నీరు జలపాతంలా కారుతున్నాయి మారుతి పవిత్ర సన్నిధానంలో చేతులు జోడించి నమస్కరిస్తూ హనుమా నికృష్టమైన ప్రాపంచిక విషయ వాసనలలోపడి బ్రతుక వృధాగాకుండా నిరంతర భగవన్నామామృతపాన చిత్తుడనై తరించాలనివుంది జననమరణ సంసార చక్రములోపడి పరిభ్రమించకుండా మోక్షధామం చేరాలని తీవ్రసంకల్పముతో నీ పాదాలచెంత చేరాను అంటూ పసిబిడ్డలా ఏడుస్తూ మారుతీ పవిత్ర పాదద్వయాన్నంటి తన అశ్రువులతో స్వామి పద సరోజాలను అభిషేకం చేశాడు తన నిర్మల భక్తికిమెచ్చి హనుమంతుడు నారోబాను ఆశీర్వదించాడు ఆనాటి అపూర్వ సంఘటనను తన ప్రథమ అధ్యాత్మికానుభవాన్ని ఒక చక్కటి కీర్తనలో తానే ఈ క్రింది విధముగా తెలియచేసియున్నారు

ఆమ్హాం సాహ్యంసీ హనుమంత। ఆరాధ్యదైవత రఘునాథ
గురు శ్రీరామ సమర్థ। కాయఉణే దా సాసి।
బాతా ఏక రఘునందన। వరకడ లంటే దే ఈల కోణా
తే సోడోని అన్యజన। కోణా ప్రతీ మాగావేం
మ్హణోనీ ఆమ్హీ రామదాస। రామచరణే ఆముచే విశ్వాస
కోసలోని పడో రే ఆకాశ। ఆణికాచీం వాసన నాహీం

"హనుమంతుని సహాయముతో నాకు రామదర్శనము జరిగినది
రాముడే నా ఆరాధ్యదైవము నేను రాముని దాసుడను రామదాసును నాకు రామునియందలి విశ్వాసము వర్ణించుటకు వీలుకానిది
ఆకాశము విరిగి నా తలపై పడిననూ రామునే ధ్యానించి తరించాలనే
నా నిర్ణయాన్ని మార్చుకొను

అంజనేయుని అపూర్వ దర్శనమును సంపూర్ణ అనుగ్రహమును పొంది తద్వారా రామచంద్రుని దర్శించే అవకాశము కలిగినట్లు పైకీర్తన

ద్వారా తెలియమన్నది అనంతుడైన భగవానుని దివ్యదర్శనము లభించ వలయుననిన ఆదర్శమూర్తులైన భక్తకోటి సహాయము ఎంతయినా అవస రమని ఈ సంఘటన ఋజువు చేయుమన్నది

నారోబా కనుపించకపోయేసరికి తల్లి రేణూబాయి కలతచెందిన మనసుతో తనయుని అన్వేషిస్తూ ఆంజనేయస్వామి ఆలయంలో ధ్యాన మగ్నుడై యున్న నారోబాను చూసింది నారోబా ముఖములో ప్రస్ఫుటించే వైరాగ్యజనిత ఉదాసీనతను చూచుసరికి తల్లి హృదయము తల్లడిల్లి పోయింది తన ఏకైక పుత్రుడైన నారోబా సన్యాసియై తనకు శాశ్వతంగా దూరమవుతాడేమోనన్న భయం మనసు నావరించింది

నాన్నా! నారోబా! ఇంటికి పోదాం పద మెల్లగా లాలిస్తూ పిలి చింది తల్లి రేణూబాయి

అమ్మా! నేను ఇంటిలోనే ఉన్నాను స్వగృహములోనే యున్నాను తాత్కాలిక నివాసాలన్నీ స్వగృహాలని మనమంతా భ్రమిచెందు తున్నాం అవన్నీ అశాశ్వతమైనవి అస్థిరమైనవి భగవానుని పవిత్ర పాద సన్నిధియే మన శాశ్వత నివాసము నేను స్వగృహములోనే యున్నాను అని అనాలోచితంగా జవాబిచ్చాడు నారోబా

నారోబా! పోనీ నీకు జన్మనిచ్చిన తల్లిదండ్రులైనా ఉన్నారనే ధ్యాస నీకు ఉందా? లేదా? వారుకూడా తాత్కాలిక నివాసములో అగుపించిన బాటసారులేనా? ఉద్వేగాన్ని ఆపుకోలేక ప్రశ్నించింది రేణూబాయి

సత్యం పలికావు తల్లీ! తల్లి తండ్రి సోదరులు బంధువులు అంతయూ భగవానుడే ప్రతి జన్మలోనూ తల్లిదండ్రులున్నారు ఇప్పటికి మనం ఎన్ని జన్మలలో పయనించామో అందరు తల్లిదండ్రులున్నారు కానీ అన్ని జన్మలలో మనలను రక్షించి అనుగ్రహించే జగత్పిత దీననాధుడైన భగవానుడొక్కడే అని పారవశ్యంతో చేతులు జోడించి కళ్ళుమూసాడు నారోబా

తనయునిలో రగుల్కొంటున్న తీవ్రవైరాగ్యానలమును చూసి రేణూబాయి దుఃఖించసాగింది నేత్రములవెంట బాష్పములు రాలుచుండ నారోబాను బుజ్జగించి సమాధానపరచి చివరకు ఇంటికి తీసుకొని వచ్చింది

నారోబాకు పండ్రెండు సంవత్సరములు వచ్చాయి ఆధ్యాత్మిక చింతన నుండి కుమారుని దృష్టి మరల్చవలయునన్న వివాహమునకు మరొ మార్గము లేదని తల్లి నిర్ణయించి నారోబా వద్దని ఎంత వారించుచున్నను వినకుండా వివాహము నిశ్చయించింది వివాహము చాలా వైభవముగా జరుగుచున్నది పురోహితులు వివాహ మంటపములో మంత్రోచ్చారణ ప్రారంభించారు "శుభమస్తు ఇది శుభఘడియ మంగళదాయకమైనది అంటూ పురోహితులు ప్రారంభించారు పురోహితుల వాక్యాల్ని నారోబా పదేపదే మననము చేయసాగాడు నిజమే ప్రపంచాన్ని త్యజించుటకు ఇంతకన్నా మించిన శుభఘడియలేదు అని భావించి పెళ్ళిపీటలమీదనుండి కథాప్రారంభములో పరుగుతీసినవ్యక్తి ఎవరోకాదు అతడే నారోబా భవిష్యత్తులో సమర్థ రామదాసుగా రాణించి భక్తుల హృదయ పీఠాల నలంకరించే సంత్‌పురుషుడు

భగవానుని దర్శించవలయుననెడి తీవ్రకుతూహలంతో రామదాసు ఒక అరణ్యములో ప్రవేశిస్తాడు ప్రాపంచిక జనులెవ్వరూ ప్రవేశించలేని ఆ నిర్జనప్రదేశమున తన తపస్సునకు భంగము వాటిల్లదని భావిస్తాడు ఆ అరణ్య ప్రదేశమునందు తపస్సు నారంభిస్తూ హే రామచంద్రా! కరుణాలయా! రక్తమాంసాలతో నిండిన ఒక స్త్రీ శరీరమునకు ఆశపడి జీవితమును అంధకార బంధురముగా మార్చుకొనుటకు ఇష్టపడక నీ పదసరోజముల నన్వేషిస్తూ ఏకాకినై బయలుదేరి వచ్చాను ప్రభూ! అనుగ్రహించి తరింపచేస్తావో? ఆగ్రహముతో అంతరింపచేస్తావో! నీవు ఏది అనుగ్రహించినా అది నాకు ప్రసాదము ప్రభూ ఈ దీనుడి మొర ఆలకించు అని కన్నీటి బాష్పములు రాలుచుండ తన ఇష్టదైవమైన శ్రీరామచంద్రమూర్తిని ప్రార్థిస్తాడు

రామదాసు హృదయావేదనను గాంచిన రామచంద్రునిలో కారుణ్య ముదయించి రామదాసా! నీవు ధన్యాత్ముడవు భవిష్యత్తులో ఎందరి దుఃఖాన్నో పారద్రోలవలసిన నీవు ఈనాడు దుఃఖించడము సమంజసము కాదు నీవు నా భక్తుడవయ్యావు ఇక దిగులు చెందనవసరము లేదు కృష్ణానదీ తీరమున నివాస మేర్పరచుకొని తపస్సు నారంభించుము నీకు కలిగిన అనుభవములను ప్రపంచములో భక్తులకు పంచుతూ వారిని భక్తి మార్గమున నడిపించి భక్తిమార్గమును ప్రచారము చేసి తరించెదవు అని చెప్పి శ్రీరాముడు అంతర్ధానమయ్యెను

రామచంద్రుని ఆజ్ఞను శిరసావహించి కృష్ణానది తీరములో పన్నెండు సంవత్సరములు తీవ్రముగా తపస్సు చేశాడు నిరంతరము శ్రీరామ జయరామ జయజయరామ అను నామముచ్చరిస్తూ కఠోర సాధనచేసి రామతత్త్వానుభూతిని పొంది తరించాడు తనకు తెలియకనే అనేక అపూర్వ శక్తులు తనలో చోటు చేసుకున్నాయి రామ ధ్యానంతో పన్నెండు సంవత్సరములు తీవ్రసాధనసల్పి తన బ్రతుకును పండించు కున్న భక్తరామదాసు ఇకమీదట తన శేషజీవితాన్ని భక్తుల సేవకు భాగవతధర్మ నిర్వహణకు వినియోగించాలని నిర్ణయించుకున్నాడు సువి శాల భారతదేశమంతయూ కాలినడకతో పర్యటించారు ఎన్నో శిథిలమైన ఆలయాలను పునరుద్ధరించారు ఎందరి భక్తులకో మంత్రదీక్ష నొసంగి ఆశీర్వదించారు రామదాసు మార్గమును నొక ఆధ్యాత్మిక పంథాను ఏర్పరచి ఎందరో ముముక్షువులకు మార్గమును చూపి అనుగ్రహించారు

ఒకనాడు స్వామి రామదాసు కృష్ణానదీతీరములో ధ్యానమగ్నుడై యుండ ఒక వ్యక్తిమృతకళేబరాన్ని శ్మశానవాటికకు గొనిపోవుచుండిరి. భర్తవియోగ దుఃఖాన్ని భరించలేని భార్య ఏడుస్తూ ఆ శవము వెంబడి నడుస్తూ అప్రయత్నముగా తన దృష్టిని ప్రక్కవైపుకు సారిస్తుంది అక్క డికి కొంతదూరములో రామదాసస్వామి ప్రసన్నవదనంతో ధ్యానస్థితిలో వుండుట గమనిస్తుంది ఆ మహాత్మునిలోని ప్రశాంతత ఆవిడ నాకర్షిం చింది తన దుఃఖాన్ని రూపుమాపగల దివ్యపురుషుడు ఇతడేయని ఆవిడ గ్రహించింది ఒక్కపరుగున స్వామిదగ్గరకు వెళ్ళి బోరున ఏడుస్తూ స్వామి

పాదాలపై పడింది అనుగ్రహించమని విలపించసాగింది కరుణామయులైన రామదాసుస్వామి కళ్ళు తెరిచారు ఆవిడ దీనాలాపంచూసి ద్రవించిన హృదయము కలవారై శుభమస్తు! సుపుత్రా ప్రాప్తిరస్తు అని దీవించెను ఆ దీనురాలు తన అశ్రువులతో స్వామి పాదాలను అభిషేకముచేసి "స్వామీ నేను అభాగ్యురాలను నా కా అదృష్టము లేదు నా భర్త మరణించాడు అతనిని వల్లకాటికి తీసుకొని పోవుమన్నాము అని తెలియచేసింది నా నుండి వెలువడిన మాటలు నావిగావు రామునివి రాముని మాటలు ఎన్నడూ వృధాపోవు ఆ శవాన్ని ఇలా తెప్పించండి అని చెబుతారు

శవాన్ని తెచ్చి రామదాసు ముందుంచుతారు అప్పట గుమిగూడిన వందలాది జనులను భక్తి శ్రద్ధలతో శ్రీరాం జయరాం జయజయరాం అని నామోచ్చారణ చేయమని రామదాసు సెలవిస్తాడు జనులందరు ఏక కంఠముతో శబ్దము ఆకాశాన్నంటేలా శ్రీరాం జయరాం జయజయరాం అని నామభజన చేస్తారు ప్రతిధ్వనించిన పవిత్ర భగవన్నామము మృత జీవిని సజీవునిగా చేస్తుంది జనులందరూ రామదాసునికి రామనామము యందున్న అత్యంత భక్తిశ్రద్ధలను విశ్వాసమునుచూసి విస్మయ మొందుతారు రామదాసస్వామి సామాన్యుడుగాదని మృత్యువును సైతం శాసించ గల సమర్థుడని భావిస్తారు అనాటినుండి రామదాసస్వామిని సమర్థ రామదాసు" అని ప్రజలు పిలువసాగారు

జై జై రామదాస సమర్థ "

తీర్థయాత్రలు చేస్తూ సమర్థరామదాసస్వామి కలియుగ వైకుంఠమైన పండరీపురం వస్తారు రామదాసస్వామి రామభక్తుడు రామచంద్రునికి పాండురంగనికితేడాలేదు సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి ఏ నామముతో జపించినా ఏ రూపములో ఆరాధించినా అధిష్ఠానమైన ఆది దేవునకే చేరుతుంది భగవంతుడు రూప నామ క్రియా రహితుడు అయినను భక్తుల నుద్ధరింపుటకై వారి వారి అభీష్టము ననుసరించి రూపమును ధరిస్తాడు భక్తులను అనుగ్రహిస్తుంటాడు భగవంతుడు వ్యక్తపరిచే రూపాలలో భేదాలున్నా భగవంతునిలో భేదాలుండవు ఈ రూపరహస్యము రామ

డానుకు బాగా తెలుసు అయినను తను దర్శించి తరించిన ఆరాధ్యదైవము శ్రీరామచంద్రుని వీక్షించుటకో తను అనురక్తిమెందు

సమర్థ రామదాసస్వామి చంద్రభాగా పుణ్యతీర్థముకో స్నానమాచరించి పాండురంగస్వామి ఆలయముకో ప్రవేశిస్తారు ఆలయంలో అడుగిడగానే మహోజ్జ్వల నిరుపమాన కళాకాంతులతో కోటిసూర్యసమప్రభావమై వెల్గొందుచున్న పండరీనాథుని దివ్యరూపమునుగాంచి కలతచెందిన మనసుగలవాడై హే రామా అయోధ్యావాసీ! జానకీరమణా కృపాసాగరా! ఏమిటి తండ్రీ! ఇచ్చట నీ రూపము మనోవిధముగా గన్పట్టుచున్నది! నాకు రామరూపమే కావాలి! రామసాన్నిధ్యమే మిగలాలి! రామధ్యానమే కలగాలి! రామస్మరణమే కదలాలి రామచంద్రుని రూపమును వదలి మరొక రూపమును నేను ధ్యానించలేను హే సుగుణాభిరామా! భక్తకల్పద్రుమా! అన్ని రూపాలు నీవే అన్ని నామాలు నీవే కనుక రామరూపంలో నాకు దర్శనమివ్వు మరొక రూపములో నిన్ను గాంచలేని నా అశక్తతను మన్నించి నన్ను కృపచూడుము" అని ప్రార్థించెను రామదాసుని హృదయావేదనను గాంచి పాండురంగడు రామచంద్రుని రూపములో దర్శనమిచ్చి ఆనందింపచేసినట్లు రామదాసు కీర్తనలో తెలియచేయుచున్నాడు

యెథే కాం ఉభా శ్రీరామా!
మన మోహన మేఘశ్యామా॥
కాయ కెలీ సీతాబాయీ యేథ రాహీ రుక్మాబాయి
కాయ కేలే సరయూ గంగా యే థే ఆణిలి చంద్రభాగా॥
ధనుష్బాణ కాయ కేలే కరకటావరీ ఠేవిలే
కాయ కేలే హనుమంత యే థే రాహిలా పుండరీకభక్తా
రామీ రామా దాస భావ
తైసా హూయా పండరీరావ॥

"హే రామా! ఎందుకిలా ఈ ఆలయములో నిలబడి యున్నావు! మా సీతమ్మతల్లి ఎక్కడ? ఆమె స్థానంలో ఇక్కడ రుక్మిణీదేవి నిలిచియున్నదేమి? సరయూనదిని గంగానదిని వదలి చంద్రభాగా

తీరమున నివసించితి వెందుకని? నీ హస్తమునందలి ధనుర్బాణము లను ఏమిచేసితివి? ఇచట కటిహస్తుడవై నిలబడుటకు కారణమేమి? నా కిచ్చట హనుమంతుడు కనుపించదేమి? అతని స్థానములో పుండరీకుడు దర్శనమిమ్మన్నా దది ఏల?

ఇలా కీర్తించుచుండగనే దీనదయాళుడైన భగవానుడు విరల రూపాన్ని వదలి రామచంద్రునిలా దర్శనమిచ్చాడు ఆ దివ్యరూపమును గాంచి పరవశుడైన రామదాసస్వామి కీర్తనను ముగించు సమయములో హే రామా! రామదాసుని భావమెరిగి రామచంద్రునిలా దర్శనమిచ్చి రక్షిస్తున్నావా ప్రభూ! అంటూ పులకాంకితుడయ్యాడు

పండరీపురములో కొంతకాలము సంకీర్తన తపోధ్యానాదులయందు కాలం గడిపి అక్కడనుండి సింఘన్‌వాడికి రాగా అచ్చట మహారాష్ట్ర నిర్మాణ కర్తయైన శివాజీ మహారాజు స్వామి రామదాసును చూస్తాడు ఒక్కచూపులోనే సమర్థ రాముని ఆధ్యాత్మిక ప్రతిభను గుర్తించిన శివాజీ మహారాజు స్వామి పాదాలపైపడి శాంతిభిక్ష కోరుతాడు దేశభక్తుడైన శివాజీ చక్రవర్తిలోని అచంచల భక్తి శ్రద్ధలనుచూసి అచ్చెరువంది శివాజీకి రామదాసస్వామి జ్ఞానబోధచేస్తారు స్వామి జ్ఞానపేరణతో ఉత్తేజితుడైన శివాజీ స్వామికి సాష్టాంగ దండప్రణామము లాచరిస్తారు సర్వసంగ పరిత్యాగియైన స్వామి వాంఛించ దగినదంటూ ఏముంటుంది ప్రపంచములో? నిరాడంబరియై అక్షయ పాత్రను చేబూని బిచ్చమెత్తుకొని జీవించే తనకు ఆశ లేముంటాయి?

ఒకనాడు శివాజీ మహారాజు కొలువు దీరియుండగా భిక్షపాత్రను చేబూని రామదాసస్వామి వచ్చి నిలబడతారు జ్ఞానదాతయైన సద్గురువునకు ఏమి సమర్పించవలయునో తెలియక తన రాజ్యమును శ్రీ స్వాముల వారికి దానము చేసినట్లు దానపత్రమును వ్రాసి అక్షయపాత్రలో పడవేస్తారు శివాజీ మహారాజు ఆపత్రమును తీసి చదువుకొని శివాజీ త్యాగజీవనమునకు సంతసించి శివాజీని చేరబిలచి "నాయన శివాజీ నీవు నీ రాజ్యమును నాకు దానము చేసితివి. ఈ క్షణమునుండి ఈ రాజ్య

మునకు ప్రభువును నేనే సర్వసంగ పరిత్యాగులమైన మాకు రాజ్యాలతో రాచరికాలతో పనిలేదు నిన్ను నా ప్రతినిధిగా ఈ రాజ్యభారము వహించు టకు నియమించుచున్నాను జాతిచిహ్నముగా కాషాయరంగు జెండాను ధరింపచేసి ధర్మపరిపాలన చేయుము అని స్వామి ఆజ్ఞాపించెను రామదాస స్వామి ఆదర్శ ప్రబోధము నాంకించి ఆరు సంవత్సరములు ఆదర్శపాలన చేశారు శివాజీ

సమర్ధ రామదాసస్వామి అక్కడనుండి బయలుదేరి జాంబ గ్రామ మునకు అరుదెంచునట్లు వార్త తెలియవచ్చింది ఆ మహనీయుని దివ్య దర్శనముతో పాదస్పర్శనముతో తమ బ్రతుకులను ధన్యత చెందించుకో వాలని జాంబ గ్రామములోని ఆబాలగోపాలము వేయి కన్నులతో ఎదురు చూచుచుండిరి ఏ మహాత్ముని గొప్పతనమును విని తని ఏర్మనార్ధము పతి గాపులు గాచుచుండిరో ఆ మహాత్ముడే గతములో ఒకనాడు తమ వూరికో వివాహ మండపమునుంచి పలాయనం చిత్తగించిన నారోబాయని జాంబ గ్రామ ప్రజలకు తెలియదు

రామదాసస్వామి జాంబ గ్రామములో ప్రవేశించారు భక్తులందరు గుమిగూడి స్వామికి పాదాభివందనము చేయుచున్నారు జై జై రఘువీర సమర్ధ అనెడి జయజయ నాదాలు ఆకాశాన్నంటుతున్నాయి ఇంతలో రామ దాసుని తల్లి రేణూబాయి యతివరేణ్యుని దర్శించాలని వస్తుంది తల్లిని దూరముగా చూడగానే రామదాసస్వామి పరుగెత్తుకుంటూ వెళ్ళి ఆ తల్లి పాదాలపైపడి తన కన్నీటితో ఆమె పాదాల్ని అభిషేకము చేస్తాడు

ఈ సంఘటననుగాంచి దిగ్భ్రాంతిచెందిన రేణూబాయి మహాత్మా మీ దర్శన భాగ్యముతో ఎందరో తరిస్తున్నారని విని మీ పాదస్పర్శతో పునీతం కావాలని మీ దరిచేరాను పుణ్యానికి పరుగులిడితే పాపం ఎదురై నట్లు మీరు నా పాదాలుతాకి నన్ను నరకకూపములో పడేశారు అని విల పిస్తుంది

తల్లి దీనాలాపన విని హృదయం ద్రవించిన స్వామి అమ్మా! ఉవుకులేని ఖ్యాతి దూడకు ఎలా కలుగుతుంది? చెట్టుకులేని రుచి కాయకేలా

వస్తుంది? అమ్మా! నా వైభవమంతా జన్మనిచ్చిన నీదే తల్లీ ఈ స్వామి ఎవరో కాదు నీ ముద్దుబిడ్డడు నారోబాయే నంటూ తల్లి ఒడిలో తలదాచుకుంటాడు

తనయుని తనివితీరా నిమురుతూ తన ఆవేదన కట్టలుత్రెంచుకొని ప్రవహిస్తుండగా నాయనా! ఇంత ప్రయోజకుడివయ్యావా? ఇంతటి అపారశక్తి నీకెలా లభించింది తండ్రీ? అని ప్రశ్నిస్తుంది రేణూబాయి "తల్లీ? రామనామ మహిమ వర్ణనాతీతము సర్వమును త్యజించి రాఘుచంద్రుని పదసరోజముల నాశ్రయిస్తేచాలు సర్వమూ సమకూరుతుంది బ్రతుకులో జ్ఞానోదయమవుతుంది

మజలా అనాధా ప్రభు తూంచ్ దాతా
మీా మూాఢకీజాణ అసేచ ఆతా
దాసామనీ ఆరవ పీస రేనా
తుజవీణ రామా మజకంఠ వేశా

హే రామ! అనాధనైన నాకు నీవే నాధుడవు దాతవు నేను మూర్ఖుడను జ్ఞానహీనుడను నీ దాసుడను నిన్నువదలి జీవించలేను నీ కరుణలేనిదే తరించలేను ఇలా విలపించేవాణ్ణి బిడ్డ విలపించగానే తల్లి ఎలా దరిచేరుతుందో భక్తుడు విలపించగానే భగవంతుడూ అలాగేవచ్చి కాపాడుతాడు ఇదే నా అనుభవము అంటూ స్వామి తల్లికి తెలియ చేస్తారు

కుమారుని మృదుమధుర జ్ఞానవాక్కులు విని తల్లి అమితానంద భరితురాలవుతుంది ఇంతకాలానికి తనకుమారుని ఈ స్థితిలోచూస్తున్నందుకు తన ఆనందానికి అవధులులేవు కానీ అంధురాలైన తనకు తనకుమారుని చూసే భాగ్యం లేదు దుఃఖము కట్టలు త్రెంచుకొని ప్రవహించుచుండ "నాయనా! నాలాంటి నిర్భాగ్యురాలు ఈ ప్రపంచములో ఉండదు కన్నబిడ్డ ఇంత కాలానికి కనుపిస్తే కనులారగాంచి తృప్తిచెందుటకు నోచుకోని పాపిష్టిదానను అంధురాలినైన నాకు నీ అందచందాలు వీక్షించే భాగ్యమెక్కడిది? అంటూ రేణూబాయి విలపిస్తుంది

రామదాసస్వామి తల్లిని ఓదార్చుతూ తన అమృత హస్తమును తల్లి నేత్రాలపై ఉంచుతాడు మరుక్షణమే తల్లికి చూపు వస్తుంది అధికోత్సాహముతో తనయుని కౌగలించుకొని ఆనందాశ్రువులు రాలుస్తుంది రేణూబాయి ఈ విచిత్ర సంఘటననుచూపి ఆశ్చర్యచకితులై నిలబడియున్న జన సమూహమునుచూసి రామనామ మహామ అనిర్వచనీయమని నామప్రభావముతో సాధించలేనిదంటూ ఉండదని రామదాసస్వామి తెలియచేస్తారు.

స్వామి జాంబా గ్రామములోనే తల్లికి సేవచేస్తూ కొంతకాలము గడుపుతారు తల్లికి మరణసమయ మాసన్నంకాగానే తాను దగ్గరుండి ఆమెకు ముక్తిని ప్రసాదించవలసిందిగా రామచంద్రమూర్తిని ప్రార్థిస్తాడు తనయుడుగా తల్లియెడ తన ధర్మమును నిర్వహించి అంత్యక్రియలు జరిపి అచ్చటినుండి బయలుదేరుతారు

తల్లిని ఉద్ధరించిన రామదాసస్వామి సకల జీవులను ఉద్ధరించి తరింపచేయు సంకల్పముతో బయలుదేరుతారు మహాత్ముల ప్రేమ సువిశాలము ఇతరుల ప్రగతిని వాంఛిస్తారేగాని తమ ప్రాబల్యాన్ని అభిలషించరు హాంసంచినవారిని సైతము ప్రేమించే అమృత హృదయులు వంచించిన వారికికూడా మంచినిపంచే విశాల దృక్పధము కలవారు

ఒకనాడు శిష్యసమేతుడై శివాజీ మహారాజును చూచుటకు రామదాసస్వామి బయలుదేరి వస్తుంటారు మార్గమధ్యములో ఒక చెట్టుక్రింద కొంతసేపు విశ్రాంతి తీసుకుంటారు స్వామి విశ్రాంతి తీసుకొనుచుండ శిష్యులు ప్రక్కనేయున్న చెఱకు తోటలో ప్రవేశించి చెఱకుగడలు విరుచుకొని తింటూవుంటారు ఈ దృశ్యాన్ని ఆ తోట యజమాని చూస్తాడు కోపోద్రిక్తుడైన ఆ రైతు తన చేతిలోవున్న చెఱకుగడతో శిష్యులను కొడతాడు అంతటితో ఆగక ప్రేమమూర్తి అయిన రామదాసస్వామి వీపునుకూడా లెక్కచేయడు స్వామి అతనుకొట్టే దెబ్బలన్నీ ప్రేమతో సహిస్తారు చేయరాని పనులు చేయడము వలన పడరానిపాట్లు పడక తప్పదని గ్రహించి స్వామి చిరునవ్వుతో ముందుకునడుస్తారు అహా! శిష్యగణమా శిష్యులుండాలేగాని గురువుగారిపని గోవిందుడికే ఎరుక ఇది అన్నికాలాలకు అన్వయించే ధర్మంలావుంది

స్వామి శివాజీ మహారాజు అస్థానానికి వస్తారు ఆమితానందముతో స్వామిని ఆహ్వానిస్తారు శివాజీ పరిచర్యలు చేస్తారు తానే స్వయముగా రామదాసస్వామికి స్నానము చేయిస్తుండగా స్వామి వీపుపై దెబ్బలు కనువిస్తాయి ఇలా ఏర్పడుటకు కారణమేమిటో తెలియచేయమని శివాజీ ప్రార్థిస్తారు తోటి ప్రాణిని హింసించుటకు ఇష్టపడని రామదాసస్వామి నవ్వి మౌనము వహిస్తారు

శివాజీ మనసులో ఆవేదన అరలేదు శిష్యులద్వారా జరిగిన వృత్తాంతమంతా తెలుసుకుంటారు రామదాసస్వామి సింహాసనాసీనుడై యుండ తాను స్వామికి పరిచర్యలుచేయు సమయములో స్వామిని హింసించి బాధించిన చెఱకుతోట యజమానిని పిలిపిస్తారు స్వామిని శివాజీ మహారాజు కొలువులో అగ్రాసనపై చూడగానే తానుచేసిన తప్పిదమేమిటో ఆ రైతుకు తెలిసింది రామదాసస్వామి పాదాలపై పడి క్షమాభిక్ష నర్థిస్తాడు చెఱకుతోట యజమాని

ఆవేశపూరితుడైన శివాజీ స్వామిని సమీపించి దివ్యాత్మా! ప్రేమ స్వరూపులైన తమకు బాధ కలిగించిన ఈ దురాత్ముని క్షమించుటకు వీలు లేదు ఇతనికి ఎలాంటి శిక్ష విధిస్తే సరిపోతుందో సెలవీయండి అని ప్రార్థిస్తాడు కరుణాసముద్రులైన రామదాసస్వామి ఆ యజమాని చెఱకు తోటలో ప్రవేశించి చెఱకు అపహరించినందుకు నష్టపరిహారముగా ఇరువది యైదు గ్రామములు అతనికి సమర్పించవలసిందని ఆజ్ఞాపిస్తారు ఆహా! ఎంతటి ఔదార్యము ఎంతటి నిష్కళంక ప్రేమ! జై జై సమర్థ రామదాస్‌కీ!

గురువు సాక్షాత్తు భగవత్స్వరూపము గురువుకు భగవానునికి భేదం లేదు గురుకృపతో మనం ముక్తికాంతను పొందవచ్చు రామదాసస్వామికి భోలారాం అనే శిష్యుడుండెవాడు అమాయకుడు గురుపాదమే శరణ్యమని విశ్వసించి జీవించువాడు స్వామి సతారా జిల్లాలోని సజ్జన్‌గాడ్ పర్వతముపై తపస్సు చేయునప్పుడు క్రిందనుండి పర్వతముపైకి నీటిని తీసుకెళ్ళి స్వామికి స్నానము చేయించేవాడు

సమర్ధ రామదాసు శిష్యగణముతో కాశీ క్షేత్రాన్ని దర్శించడానికి బయిలుదేరుతారు స్వామి తన శిష్యుడైన భోలారాంను పిలిచి తాము కాశీ క్షేత్రము వెళ్ళి తిరిగివచ్చినంతవరకు దేవాలయ బాధ్యత నిర్వహించ వలసిందని నిత్యము సీతారాములకు నైవేద్యము సమర్పించవలసిందని తెలియ చేస్తారు గురువచనమే దైవాజ్ఞగా భావించి నిర్వహిస్తుంటాడు భోలారాం రామదాసస్వామి కాశీ వెళ్ళారు

భోలారాం దేవాలయంలో కార్యక్రమాలు భక్తిశ్రద్ధలతో నిర్వహి స్తుంటాడు ఒకనాడు నైవేద్యము తీసుకొని ఆలయంలోకి వస్తాడు భోలా రాం ఆరగించమని సీతారాముల ముందుంచుతాడు వారు ఆరగించరు నిష్కారణముగా ఇలా ప్రవర్తిస్తున్నందుకు సీతారాములపై భోలారాంకు కోపమొస్తుంది నైవేద్యం స్వీకరించనిచో తనకు కోపము వస్తుందని వారిని బెదిరిస్తాడు సీతారామమూర్తులు సామాన్య మానవులని అతని అభి ప్రాయము అయినా నైవేద్యం స్వీకరింపబడలేదు ఆందోళనా మనస్కు డైనా భోలారాం తినకుంటే తన గురువుగారు రాగానే ఫిర్యాదు చేస్తానని హెచ్చరిస్తాడు అయినను వారు నైవేద్యం స్వీకరించరు చివరకు విసుగు చెంది మీరు ఆహారము తీసుకోనిచో మీ పాదాలదగ్గరే ప్రాణాహుతి చేసు కుంటానని తన శిరస్సును రామపాదాలకేసి బాదుకుంటాడు

భోలారాం అమాయక ప్రవృత్తికి నిష్కళంక భక్తికి ఆశ్చర్యపడి సీతారాములు నైవేద్యం స్వీకరిస్తారు భోలారాంకు కొద్దిగాకూడా మిగల్చ కుండా ఆరగిస్తారు భోలారాం ఆకలితో బాధపడుతున్నాడని గ్రహించి సీతా దేవి అట్లు తయారుచేసి ఆరగించమని భోలారాం ముందుంచుతుంది అట్లు చూడగానే భోలారాం మనసు అదోలా మారిపోయింది తన గురువుకు అట్లు అంటే చాలాఇష్టం గురుదేవునికి అట్లు సమర్పించుకోవాలనే ఆశ కలి గింది భోలారాంకు వెంటనే రామచంద్రునివైపు తిరిగి "మీరు ఈ దేవా లయాన్ని చూస్తూవుండండి నేను కాశీకివెళ్ళి మా గురువుగారికి అట్లు సమ ర్పించి వస్తాను అని చెబుతాడు

భోలారాం మీ గురువుగారు ఈపాటికి కాశీ చేరేఉంటారు అంత దూరము నీవెలా ప్రయాణముచేసి వెళ్ళగలవు? అంటారు రామచంద్ర మూర్తి

నా గురువు అద్భుత మహిమాన్వితుడు ఆయన దయయే నన్ను ఆయన దగ్గరకు చేర్చుతుంది అంటూ భోలారాం అట్లు చేతపట్టుకొని పరుగు తీస్తాడు

రామచంద్రుడు హనుమంతుని పిలిచి హనుమా! భోలారాం ఇక తనపట్టు విడవడు దేవు భోలారాంను రామదాసస్వామిచెంత చేర్చవలసిం దంటూ తెలియచేస్తాడు రామాజ్ఞచే హనుమంతుడు భోలారాంను తన భుజా లపై కూర్చుండబెట్టుకొని కాశీకి తీసుకవెళ్తాడు తన గురువే ఈ కోతిని పంపి తన కోర్కెను నెరవేర్చునట్లు భోలారాం భావిస్తాడు కాశీనగరానికి ఆకాశమార్గాన ప్రయాణంచేసి వచ్చారు ఆంజనేయస్వామి అప్పుడే కాశీ నగర వీధులలో ప్రవేశింపుమన్న రామదాసస్వామిని చూస్తాడు భోలారాం ఆనందాన్ని ఆపుకోలేక జై జై రఘువీర సమర్థ అని వినాదాలు చేస్తాడు భోలారాం భోలారాం కంఠధ్వని నాలకించి ఆకాశంవైపు చూస్తారు రామ దాసస్వామి వజ్రకాయుడైన హనుమంతుని భుజముపై ఆసీనుడై వస్తు న్న భోలారాంను చూస్తారు

భోలారాం ఇక్కడికెలా వచ్చావు? దేవాలయము వదలిపెట్టి వచ్చావు అక్కడ కార్యక్రమాలు ఎవరు చూస్తున్నారు? అసలు నీవిక్కడ కెందుకు వచ్చావు? అని ప్రశ్నిస్తారు రామదాసస్వామి

భోలారాం గురువుగారికి నమస్కరిస్తూ స్వామీ మీరు నాకు అప్పగించివచ్చిన ఆ సీతారాములు చాలా మొండివారు వేళకు ఆహారము తీసుకోరు నన్నుఎడిపించిగాని ఆహారాన్ని స్వీకరించరు నేను ప్రాణాహుతి చేసుకుంటానని ప్రతిజ్ఞచేసిన పిదపగాని వారు ఆహారాన్ని స్వీకరించలేదు అదియునుగాక నాకు కొంచమైనను మిగల్చకుండా ఆహారాన్నంతా వారిద్దరే తినేశారు నేను నిష్ఠూరపడితే సీతాదేవి నాకు అట్లుకాల్చి ఇచ్చింది స్వామీ మీకు అట్లు చాలా ఇష్టమని మీకు సమర్పించుకోవాలని పించింది దేవాల

యొన్ని చూస్తుండమని ఆ సీతారాములకు చెప్పి నేను మీ దగ్గరకు బయలు దేరాను మీ దయతో ఈ కోతిని నా వద్దకు పంపారు ఆ కోతి సహాయ ముతో ఇక్కడకు రాగలిగాను మీ దర్శన భాగ్యము పొందగలిగాను అని అశ్రుపూరిత నయనాలతో రామదాసస్వామి పాదాలపై పడి దుఃఖిస్తాడు భోలారాం

రామదాసస్వామి భోలారాం గురుభక్తికి ఆశ్చర్యపడి భోలారాంను తన కౌగిట్లో బంధిస్తారు భోలారాంయొక్క శ్రద్ధ గురుభక్తి సీతారామ చంద్రులను దేవాలయంవద్ద కాపలావ్యక్తులుగా ఉంచింది భోలారాం నిష్క ల్మష విశ్వాసము ఆ జనేయస్వామిచేత సేవలు చేయించుకున్నది ప్రతి ఒక్కరు అచంచల భక్తితో అంకురిత విశ్వాసముతో - భగవన్నామామృత పానంచేసి తరించండి అని రామదాసస్వామి తనతోటి శిష్యబృందమునకు అమృత సందేశాన్ని అందిస్తారు

నిరాడంబరత నిరహంకారతయే మోక్షమునకు ముఖ్య సోపానము లని రామస్వామి అభిప్రాయము అహంకారి ఆత్మసామ్రాజ్యములో ప్రవేశించలేడు నమ్రత సహనశీలతయే వాంఛింపదగినదంటూ రామదాస స్వామి ప్రబోదించారు వివేక వైరాగ్యములు కలిగి భక్తి శ్రద్ధలతో నడక సాగించమని ప్రబోధించుచూ మనసు నుద్దేశించి ఆధ్యాత్మిక ప్రబోధములు తెలియచేయు చక్కటి గ్రంధమును రచించారు ఈ గంధమే మనాచీ శ్లోకముఌ అనుపేర ప్రామర్యము నొందింది ఇందు 205 శ్లోకములు గలవు అందు 15 శ్లోకములో

మనా పాహతాం సత్యహే నృత్యు భూమి
జతాంబోలతీ స్వాహి జీవమీూమీూ
చిరంజీవహే సద్వాహి మానితాప్తే
ఆకస్మాత సాండునియూ సర్వజాతీ॥

"ఓ మనసా అశాశ్వతమైన ఈ ప్రపంచములో జీవించే ప్రతి ఒక్కరు తాము జీవించే రెండు రోజులు నేను నేనని అహంతో బ్రతుకుతున్నారు తమ మనుగడ స్థిరమని భ్రాంతిచెంది చివరకు

సమస్తమును వదలి అమాయకముగా మృత్యుముఖంలో ప్రవేశించు చున్నారు

అహంకారము అన్ని సమయాలలోను విడువదగినదని రామదాస స్వామి సందేశము, అహం నశించనిదే ఆత్మదర్శనము దుర్లభమని వారి ప్రబోధము

ఒకనాడు రామదాసస్వామి శివాజీ మహారాజు దగ్గరకు వస్తారు అదే సమయానికి శివాజీ ఐదువేలమంది కూలీలచేత చక్కటి కోట ఒకటి నిర్మాణము చేయించుచుండెను 5 వేలమంది ప్రజలకు పని కల్పించితిననెడి అహంకారము శివాజీ మనస్సులో ఉదయించింది అది కనిపెట్టిన రామదాస స్వామి శివాజీని పిలిచి శివాజీ ఒక కూలీని పిలిచి ఈ రాయిని పగుల గొట్టించ వలెననది ఒక రాయిని చూపుతారు శివాజీ అలాగే కూలీని పిలిచి రాయిని పగులగొట్టిస్తారు రాయి రెండుగా పగులుతుంది వెంటనే అందుండి ఒక కప్ప ఎగిరి బయటకు వస్తుంది ఆ కప్ప నివసించు నిమిత్తము అందు కొంత నీరుకూడా ఉంటుంది వెంటనే రామదాసస్వామి శివాజీ! చూచి తివా? ఎందరికో నీవు జీవనోపాధి కల్పించితివని నేను భావించాను కానీ నీ రాజ్యములో నీ అవసరము లేశమంతైనను ఆశించక ఎన్ని ప్రాణులు జీవిస్తున్నాయో చూశావా రాతిలోని కప్పకు నీరు సమకూర్చెందెవరు? సర్వజ్ఞుడైన రాముని దయతో ప్రపంచమంతా నడుస్తున్నది అని తెలియ చేస్తారు శివాజీ తన తప్పిదమును గుర్తించి అహంకారము అనర్థదాయక మని గ్రహించి గురుదేవా మీ అనుగ్రహముతో సత్యమేమిటో గ్రహించాను నా అహంకారమును రూపుమాపి నా కళ్ళు తెరిపించారు అంటూ స్వామి పాదాలపై బడి శరణు వేడుతాడు

సమర్థ రామదాసుని చరిత్రలో మనకు కనుపించే కమనీయ గుణం ఏమిటి? అతడు అందరివలెనే రక్తమాంసాల మయమైన గర్భంనుంచి ఉద్భవించాడు మామూలు మనిషిగా పెరిగి పెద్దవాడయ్యాడు

కసరి బుసకొట్టు యవ్వనంలో ప్రవేశించాడు అయితే అందరివలె కామవాంఛలకు లొంగిపోయాడా? లోనయ్యాడా? ఊహుం!

జీవుడై పుట్టినందుకు దేవుణ్ణి చూడగలగడంలోనె బ్రతుకుకు పరమార్థం ఉన్నదని త్రికరణశుద్ధిగా విశ్వసించాడు వెనుక ముందులు ఆలోచించలేదు కళ్యాణ ముహూర్తానికే కాషాయరంగు పులిమాడు మనసుకు పరంధాం దెసకు ప్రయాణమయ్యాడు

రామదూతను శరణన్నాడు రమ్యచరితుడుగా రాణించాడు

కామాది రాక్షసగణాన్ని ఇట్టె జయించాడు 12 యేండ్లు నిత్య నిరంతర రామధ్యానంచేసి కట్టకడకు కళ్యాణరాముని చర్మచక్షువులతో దర్శించగలిగిన పుణ్యపురుషుడు ఈ సమర్థ రామదాసు

ఇక్కడ మనమందరం చూడవలసింది ఒకే ఒక సత్యాన్ని

ఆత్మశుద్ధి సర్వం రామమయం అనే శుభదృష్టి నామజపం కఠోర తపస్సు ఆది మధ్యాంతరహితుని కనుగొనాలనే ఘనవాంఛ ఉండాలేగాని ఏ ఒక్కరైనా - ఏ పరదేశంలోనో కాదు - ఇక్కడే - ఈ కన్నులతోనే - కంబుజాక్షుని కనుగొని ధన్యత నందవచ్చునని ఘంటాపథంగా చాటాడు సమర్థుడైన రామదాసు

సమర్థ రామదాసస్వామి మనాచీ శ్లోకములతోపాటు దాస బోధ కూడా రచించాడు మరాఠి వాఙ్మయములో దాసబోధ ప్రాశస్త్యమైన గ్రంధము జ్ఞానేశ్వరి తరువాత దాసబోధ ప్రబోధాత్మకమైన గ్రంధము

యథాహి వట బీజస్థ ప్రాకృతోహ మహాన్ ద్రుమః
తథాహి రామ బీజస్థ జగదేత చ్ఛరాచరమ్॥

ఆవగింజంతటి బీజమునందు మహా వటవృక్షము ఇమిడియున్నట్లు శ్రీ రామ నామ బీజమునందు సకల చరాచర ప్రపంచమంతయు ఇమిడియున్నదని ఉపనిషత్ తెలియచేయుచున్నది

నిరంతరము రామ నామామృతపానంచేస్తూ సదా రామధ్యానంలో రమిస్తూ ఎందరో ముముక్షువులను రామ మార్గంవైపు నడిపించిన దాస జ్యోతి అఖండ రామదీపములో ఐక్యమైనది

* ఓం అనంతనామరూపాయ నమః *



# భక్త చోఖా మేళ

ఉన్నదంతా ఒక్కటే. రెండు యనునది కల్పితము. ఉన్న ఒక్క దానిని దర్శించు దృష్టి కమనీయము. రెండవ వస్తువును దర్శించు దృష్టి కలుషితము. రెండింటిని దర్శించు భేదదృష్టి అమంగళకరమైన పామర త్వము. ఏకవస్తువును దర్శించు అభేదదృష్టి మంగళకరమైన పాండిత్యము.

పండిత పామరులు. ధనిక దరిద్రులు, స్త్రీ పు రు షు లు, హెచ్చు తగ్గులు యనేడి భేదాలు మానవుని దృష్టిలోనేగాని భగవంతుని దివ్యదృష్టిలో అగుపించవు. అధముడు జ్ఞానముతో కదిలితే ఉత్తముడవుతాడు. ఉత్తముడు కాలుజారితే అధముడుగా మారుతాడు. మంచిచెడుల మధ్య పరిభ్రమించే మానవులను నడిపించే చైతన్యము ఒక్కటేగాని రెండుగాదు. సర్వచరాచర ములయందు సూక్ష్మమై నిండియున్న శక్తియే చైతన్యము భగవంతుడు చైతన్యస్వరూపుడు. జీవులుకూడా చైతన్య స్వరూపమే. జీవులందరూ వస్తుతః చైతన్యమే అయినపుడు జీవులమధ్య భేదభావము పొడ సూపడా నికి ఆస్కారములేదు. చైతన్యము చైతన్యమును ఏవగించుకోదు. అస హ్యించుకోదు. అరిష్టమైన భేదదృష్టి ఎక్కడ పొడ చూపుతుందో అక్కడ భగవంతుడు అదృశ్యమవుతాడు.

సర్వజీవులలో సమస్తములో భగవానుని దర్శించే దృష్టియేజ్ఞానము. పరమ పవిత్రులైన భక్తమహాశయులు తమ మంగళకర దృష్టితో సర్వత్రా పరమాత్మని దివ్యసందర్శనాన్ని అనుభవించితరిస్తారు తరించారు సంస్కార హీనులై భగవంతుని ఒక వ్యాపార వస్తువుగా భావించి జీవించిన జడో న్మత్తులు నిస్సారమైన జీవనాన్ని కొనసాగించారు కొనసాగిస్తున్నారు తమ స్వార్థ జీవనానికి మహాభక్తులను సైతము ఎంచించారు భగవంతునికూడా మోసగించడానికి యత్నించారు

భగవానుడు చదువు సంధ్యలు చూడడు సిరిసంపదలను లక్ష్యపెట్టడు కులభేదాలను పాటింపడు అందచందాలు ఆశించడు తాను వాంఛించేదల్లా నిరాడంబర జీవనము నిష్కల్మష హృదయము నిరంతర భగవద్భక్తి సర్వభూత సేవానిరతి అచంచలమైనతపస్సు సమదర్శనముచేయు మనస్సు ఎవరియందు పై లక్షణాలు సంపూర్ణముగా కనుపిస్తాయో అట్టి పవిత్రాత్ముల హృదయాలలో భగవానుడు సదా నివసిస్తుంటాడు అడుగడుగున వారి జీవ ననౌకకు తన దయయనే తెరచాపను కట్టి నడిపిస్తాడు ఆపదలలో ఆదు కుంటాడు ఆనందాన్ని అందిస్తాడు వారి జీవితాలలోని వెలితిని తొలగించి తానే సర్వముసై వెలుగొందుతాడు తల్లిదండ్రి తానై యుంటాడు మిత్రుడై మిగుల్తాడు బంధువై కదుల్తాడు గురువై నిలుస్తాడు గురుతు చూపిస్తాడు సుఖానికి చేరువ చేస్తాడు శోకాన్ని పారద్రోలుతాడు దయాస్వరూపుడైన అట్టి భగవానుని అమృత దృక్కుకు నోచుకున్న భక్తులుఆ దృష్టవంతులు ధన్యజీవులు

పుణ్య ధామమైన పవిత్ర పండరీపురములో భాగవత ప్రియుడైన పాండురంగని ఆలయము ముందు సుశ్రావ్యకంఠంతో ఒక వ్యక్తిసంకీర్తన చేస్తున్నాడు భక్తితన్మయతలో మైమరచి నృత్యంచేస్తున్న వ్యక్తిని భక్తు లంతా మట్టిముట్టి చూస్తున్నారు ఆ భక్తునిలో జనించే పారవశ్యానికి జనుల హృదయాలు ద్రవిస్తున్నాయి అతనినుండి పెల్లుబికే మధుర గానానికి గుమిగూడిన భక్తుల మానసములు పట్టుతప్పుతున్నవి గంగా ప్రవాహంలా సాగిపోయే ఆ సంకీర్తన అప్పుడప్పుడు అప్రయత్నముగా ఆగిపోతున్నది రోమాంచలమై కదిలిపోతున్న అతని శరీరము ఒక్కొక్కసారి స్థాణువులా

కదలికలేనిదగుచున్నది కంఠం గద్గదమై మూగబోవుచున్నది నేత్రముల వెంట బాష్పములు రాలుచున్నవి భగవన్నామామృతాన్ని పానంచేస్తూ అతడు ఒక్కొక్కసారి గంతులువేస్తాడు ఆలయములో ప్రవేశించి విఠలనాథుని దర్శించలేని తన దురదృష్టానికి చింతిస్తూ కదలలేక పడిపోతాడు ఎవరి భక్త శిఖామణి? అతడే ఆదర్శ మహనీయుడు పాండురంగ భగవానుని సేవలో తన జీవితాన్ని తరింపజేసుకొన్న ధన్యజీవి భక్త చోఖామేళ

చోఖామేళ అత్యకులజుడు అస్పృశ్యుడగు అతనికి దేవాలయ ప్రవేశము లేదని నిర్ణయించారు అగ్రకులజులు అతడు జన్మించిన కులాన్ని ఏవగించుకుంటున్నారేగాని ఆతనిలో జనించే సంస్కారాన్ని చూడలేక పోతున్నారు పుట్టుకతో అనారోగ్యముతో జన్మించిన ఎందరు శిశువులు పెద్దవారై ఆరోగ్యవంతులు కాలేదు? పుట్టగానే మాటలురాలేదని మాట్లాడే వయస్సురాగానే అతని మాటలు వినకుండా చెవులు మూసుకుంటున్నామా? పుట్టగానే కళ్ళు తెరవలేదని పెద్దకాగానే నేత్రాలు తీసివేస్తున్నామా? ఇవన్నీ ఆమోదయోగ్యమైనపుడు జన్మించిన కులాన్ని ఆధారము చేసుకొని వ్యక్తిని అసహ్యంచుకోవడము మూర్ఖమనిపించుకోదా? అధికారముందని అహంకారాన్ని ప్రదర్శించి ఇలాంటి అన్యాయాలు మానవులు సాగించవచ్చునేమోగాని కరుణామయుడైన భగవానుని ప్రేమ నేత్రాలలో ఈ తారతమ్యములు కనుపించవు

పరమ భక్తుడైన చోఖామేళుని వైష్ణవ హృదయము పాండురంగ దర్శనానికై ఆరాటపడసాగింది దేవాలయ ప్రవేశము తనకు నిషేధించబడము వలన ఆలయ ముఖద్వారముముందు నిలబడి చోఖామేళ భగవానుని నోరార కీర్తించేవాడు విఠలనాథుని ఆలయంముందు ఈనాడు చోఖామేళ పరవశించి చేస్తున్న సంకీర్తనను భక్తులందరు గుమిగూడి వింటున్నారు ఆనందిస్తున్నారు

సంకీర్తనామృతమును తనివితీరా గ్రోలి ఉన్మత్తునివలె ఊగుతున్న చోఖామేళాను ఒక వ్యక్తి పట్టి అపుతాడు నీవు కనుపరచే పారవశ్యము వాస్తవమైతే నీలోని భక్తి యధార్థమైతే భక్తజన రక్షకుడైన పాండురంగడు నీకు ఆలయ ప్రవేశమెందులకు కల్పించడు? అర్హతలేని విషయా

ముతో అగ్రులుచూచడం అనుచితం బ్రాహ్మణ పంక్తిలో శునకము కూర్చుని భుజించగలదా? రాజమందిరములోనికి యాచకుడు ప్రవేశించగలడా? వ్యర్థప్రయాసలు విడిచిపెట్టి దూరముగావెళ్ళు మని చోఖామేళుని క్రింద పడేలా అమానుషంగా తోస్తాడు క్రిందపడిపోయిన చోఖామేళుడు మెల్లగా లేస్తూ అయ్యా! నేను అంత్యకులజుడనన్న మాట ఎంత వాస్తవమో నా లోని భక్తికూడా అంత వాస్తవమే అస్పృశ్యుడనైనంత మాత్రాన నేను భగవానుని కరుణకు అనర్హుడనా? బురదలో ఉద్భవించిందని పద్మాన్ని వికసింప చేయుటకు సూర్యుడు నిరాకరిస్తున్నాడా? మేఘాలు తాము వర్షించే జలాన్ని పుణ్యనదులకే పరిమితముచేసి మురికి గుంటలను విస్మరించు చున్నవా? సహనశీలయైన భూమాత అస్పృశ్యులు తనపై నడువకూడదని ఆదేశించుచున్నదా? నేను అంత్యకులజుడనైనంతమాత్రాన నా ఆరాధన భగవంతునికి ప్రియము గాకపోతుందా?" అని వినమ్రతతో విన్నవించుకొని బరువైన హృదయంతో ఇంటివైపు నడుస్తాడు భర్తరాకను గమనించి ఎదురుగావచ్చి భర్త పాదములు కడిగి ఆ పవిత్ర జలమును శిరముపై చల్లుకొని భోజనము ఆరగించుటకు ఆహ్వానిస్తుంది చోఖామేళుని సతీమణి సాయిరాబాయి అవమానముతో వాలిపోయిన కనురెప్పలనుమెల్లగా ఎత్తి భార్యవంక దీనముగా చూస్తాడు చోఖామేళ భర్త ముఖములో అగుపించె విషాదఛాయల్ని గుర్తించిన సాయిరా భర్తను సమీపించి "ఎందుకలా ఉన్నారు?" అని ప్రశ్నిస్తుంది చోఖామేళ సాయిరాను తదేకముగాచూస్తూ ఎలా వున్నాను ఇంతకన్నా మరోవిధముగా వుండడానికి వీలులేదని నా జన్మ శాపించింది తెలిసి నేను ఏ నేరము చేయలేదు దోషపూరిత మనస్తత్త్వము అధర్మయుత ప్రవర్తనము నాకు తెలియవు ఎంత నిర్మలంగా జీవించినను నాకు సమాజములో స్థానంలేదు నా ఆరాధ్య దైవమైన పాండురంగని దర్శించుటకు కూడా నాకు అర్హతలేదు అలజడులతో అవమానాలతో బ్రతుకు కృశించిపోవలసిందేగాని ఆనందముగా జీవించే అవకాశము మనకి జన్మకులేదు" అని బోరున పసిబిడ్డలా ఏడుస్తాడు సాయిరా భర్తను వారించాలని ఎంతగానో ప్రార్థిస్తుంది భోజన మారగించమని ప్రాధేయపడుతుంది గాయపడిన అతని హృదయము నుండి శోకరక్తము

ప్రవిస్తూనేయున్నది ఆహారము భుజించ నిచ్చగించక వెళ్ళి పడుకుంటాడు నిద్రపట్టడంలేదు ఆవేదన అణగటంలేదు జీవితములో ఏదో భయంకర నిర్ణయము తీసుకొనేస్థితిలో కనుఎంచసాగాడు భయాందోళనలతో సాయిరా కంఎంచసాగింది

అర్ధరాత్రయింది చోఖామేళ హృదయములో అలుముకున్న చీకటి బయట ముసిరియున్న అంధకారంకన్నా దట్టంగావుంది కనులు మూతపడ టంలేదు భర్త పరిస్థితినిచూసి ఆందోళనచెందుతున్న సాయిరా కంటిపై రెప్ప వేయక కాచుకొని కూర్చునియున్నది ఇంతలో అద్భుత మహామాన్వితుడు భక్త బాంధవుడైన పాండురంగ భగవానుడు చోఖామేళ గృహములో దర్శనమిచ్చారు కోటిసూర్యసమ ప్రభావముతో వెల్గొందు విఠలనాధునిదివ్య ప్రకాశమునకు బాహ్యాంతరాలలోని అంధకారం అదృశ్యమైంది

మనోవికలతతో క్రుంగిపోతున్న చోఖామేళ దంపతులు భగవానుని దర్శనముకాగానే పారవశ్యముతో కన్నీరు కారుస్తూ స్వామి పావనచరణా లపైపడి విలపిస్తారు కరుణాసాగరుడైన విఠోబా వారిని ఓదార్చుతాడు పరిమ భక్తులైన చోఖామేళ దంపతులను ఉద్ధరించుట తన కర్తవ్యమని తెలియజేస్తాడు భగవానుని నోటినుండి దయాపూరిత అమృత వాక్కులు వినగానే కలతచెందిన ఆ పుణ్యజీవుల మనసులు కుదుటపడ్డాయి పాండు రంగడు చోఖామేళ చేతిని పట్టుకొని నడచి బయటకు వస్తాడు దేవాలయ ప్రాంగణములోకి చోఖామేళని నడిపించుకొని వస్తాడు? గది తలుపులు తీయకుండా ఎవరికీ కనుపించకుండా చోఖామేళుని తీసుకొని తన గర్భా లయములోకి ప్రవేశిస్తాడు

చోఖామేళ హృదయము ద్రవించింది భగవాన్! నేను అంత్య కులజుడను అస్పృశ్యుడను పావనమూర్తివైన తమ పవిత్రాలయములో నేను ప్రవేశించుటచే ఆలయమునకు మాలిన్యము అంటవచ్చు అర్హతలేని నన్ను అందలమెక్కిస్తున్నారు అని తన హృదయావేదనను చోఖామేళ తెలియచేస్తాడు

స్వామి ప్రసన్నవదనుడై చోఖామేళుని కూర్చుండబెట్టి చోఖా!

నీలాంటి భక్తులను తరింపచేయటానికే నేను కలియుగములో అవతరించి నది మీరులేని నా నివాసము అమావాస్య చీకటి వంటిది నీలాంటి భక్తులకు ఆలయ ప్రవేశము లేకపోవుటచేత నా గర్భాలయము అంధకార బంధురమై తేజోహీనమై యుండేది ఈనాడు నీరాకచే నూతనశోభ లీనుచున్నది చోఖా! దుర్లభమైన మానవజన్మనెత్తి భగవంతుని సాయుజ్యమును పొందుటకు ఎవడైతే యత్నించడో వాడే అంత్యజుడు భగవన్నామామృత పానముచేయు భక్తులను ఎవడైతే అసహ్యించుకుంటాడో వాడే అస్పృశ్యుడు అని తన భావగర్భిత సందేశపవనాలద్వారా చోఖామేళ హృదయాకాశములో వ్యాపించియున్న సందేహ మేఘాలను చెదరగొట్టాడు

భగవానుని అమృత సందేశమును విని చోఖామేళ తృప్తిచెందుతాడు తన ఇష్టదైవమైన పండరీనాథునకు నమస్కరిస్తూ భగవాన్! నిన్ను చేరుటకు నిరంతరము తపించే భక్తులు నీ పవిత్ర సన్నిధిలో మోక్షము నొందుటకు అనుసరించవలసిన సాధనమేమి? అని ప్రార్థనాపూర్వకముగా ప్రశ్నిస్తాడు

అనంతావతార స్వరూపుడైన పాండురంగడు దరహాసవదనముతో తన మధుర సందేశాన్ని అందిస్తాడు చోఖా! కలియుగములో నన్ను చేరగోరు భక్త మహాశయులు మూడు విషయములను మనస్సులో నుంచుకొని జీవనయాత్ర సాగించాలి (1) నిరంతరము భగవన్నామమును స్మరించుట కలియుగములో భగవన్నామ స్మరణయే అన్ని సాధనలకన్నా ఉత్తమోత్తమమైన సాధనము కలౌ నామ సంకీర్తనం స్మృతః అని శాస్త్రవచనము నాపమునకు నామికి తేడాలేదని గ్రహించి సదా భగవన్నామామృతమును భక్తులు పానము చేయాలి (2) సుగుణ సంపద భగవత్సాన్నిధ్యమును చేరగోరు భక్తుడు సుగుణాల రాశియై జీవించాలి సత్యము అహింస ఇంద్రియ నిగ్రహము దయ సహనము బ్రహ్మచర్యాది దైవగుణములను అలవరచుకోవాలి (3) మహాత్ముల సాంగత్యము నిరంతరము భగవద్గుణ కీర్తనాదులయందు మనసును తదేకంగా లగ్నంచేసి అనవరతము భగవన్నామమును గ్రోలుతూ జీవించు సంత్ పురుషుల సాంగత్య మహిమ వర్ణనాతీతము వారి సన్నిధిలో అజ్ఞానము పటాపంచలవుతుంది మానవునిలో

అనేక జన్మసంప్రాప్తమైన కాలుష్యమును తొలగించి చిత్తమును పరిశుద్ధ మొనర్చు సాధు పురుషుల సేవాభాగ్యము లభించుట దుర్లభము అమోఘ మైన అట్టి మహాత్ముల సాంగత్యమును పొంది తరించుటయే మానవ కర్తవ్యము

భగవన్నామ సంకీర్తన చేయుచు దైవీసంపదనుగల్గి మహాత్ముల సాంగత్యముపొంది ప్రశాంతముగ జీవించు దాసుడు నన్ను తప్పకచేరును నీవును అలాగే జీవించి ఇతరులకు ఆదర్శమై తరింపుము అని రుక్మిణీ నాథుడు చోఖామేళకు ఉపదేశిస్తాడు

రాత్రంతయు ఈ విధమైన దివ్య సంభాషణలతో గడిచిపోతుంది బ్రహ్మ ముహూర్తాన గుడితలుపులు తీయడానికి అర్చకులు వస్తారు గర్భ గుడిలో ఎవరో మాట్లాడుచున్నట్లు శబ్దం వినిపిస్తుంది వేసిన తలుపులు వేసినట్లే ఉన్నాయి మరి లోపల మాట్లాడుతున్న దెవరాయని తలుపులు తెరుస్తారు తలుపులు తెరువగానే చోఖామేళ కనపిస్తాడు ఆ దృశ్యమును గాంచి అర్చకులు కోపోద్రిక్తులవుతారు చోఖామేళకు భగవంతుడు సజీవంగా కనుపిస్తున్నాడు అర్చకులకు భగవానుడు విగ్రహంగానే కనబడు తున్నాడు "పవిత్రాలయ గర్భగుడిలో ప్రవేశించే అధికారం నీ కెవరిచ్చారు? చోరునివలె గర్భగుడిలోనికి ప్రవేశించావు నీవు చేసిన నేరమునకు నిన్నెం దులకు శిక్షించగూడదు? అని అర్చకులు ప్రశ్నిస్తారు

చోఖామేళ శిరమువంచి అర్చకులకు నమస్కరిస్తూ "అయ్యా నేను చోరుడనుకాను భగవానుని లీలలు అనంతములు అద్భుతములు భక్త వత్సలుడైన పాండురంగడే నన్ను చేయి పట్టుకొని నడిపించి తన పవిత్ర సన్నిధికి తీసుకొని వచ్చాడు నేను ఏ నేరము చేయలేదు ఆలయములో ప్రవేశించుటకు నేను అర్హుడనో కానో నాకు తెలియదము లేదు నేను అస్పృశ్యుడను కావచ్చునేమోగాని నా ప్రవేశము వలన ఆలయము ఎన్నటికి అపవిత్రం కాదు పాపాత్ములు స్నానమాచరించుట వలన గంగామాత పవి త్రత కోల్పోవుచున్నదా? అస్పృశ్యులు శ్వాసించడము వలన గాలి అపవిత్ర మగుచున్నదా? అంత్యజులు సంచరించడము వలన ఆకాశము మలిన పడు

మన్నదా? బిడ్డ మురికిగా వుందని తల్లి విడిచిపెడుతుందా? భగవానుని కావలసింది భక్తి యొక్క ఉగాని జన్మాధిక్యతలు కాదు అని తెలియ జేస్తాడు

చోఖామేళుని సమాధానము అర్చకులను తీవ్ర ఆగ్రహానికి గురి చేస్తుంది చోఖామేళుని ప్రవర్తన అనుచితమని నిర్ణయిస్తారు అతడు శిక్షార్హుడని ఏకగ్రీవంగా తీర్మానిస్తారు అంత్యజుడైన చోఖామేళ ఆలయ ప్రవేశం చేయడం సహించలేక పోతారు అతడు ఆ ప్రాంతములోనే ఉన్నచో పాండురంగడు ఇలాగే అతనిని అనేకసార్లు ఆలయములోకి తీసుకొనివచ్చే ప్రమాదము వుదని గ్రహించిన అర్చకులు అతనిని దూరముగా పంపడానికి నిర్ణయిస్తారు తానుచేసిన నేరానికి ఫలితముగ పండరీపురములో చోఖామేళ నివసించుటకు వీలులేదని చంద్రభాగా నదికి ఆవలివైపున నివసించవలయు నని శాసిస్తారు అసూయాపూరితమైన వారి ఆదేశమును దైవశాసనంగా భావించి భార్యాసమేతంగా చోఖామేళవెళ్ళి చంద్రభాగా నదినిదాటి ఆవలి వైపున ఒక కుటీరమును నిర్మించుకొని జీవిస్తుంటాడు

ఒకనాడు తన కుటీరము ముందు చెట్టునీడన కూర్చుని చోఖామేళ భోజన మారగిస్తుంటాడు అతని భార్య సాయిరా వడ్డిస్తుంటుంది భక్తుడైన చోఖామేళుని వదలి పండరీపురంలో మనలేక పాండురంగడు చోఖా నివసించు ప్రదేశమున కరుదెంచాడు భక్తాధీనుడైన పాండురంగడు తనకూ ఆకలిగా వుందని ఆహారము వడ్డించమని కోరుతాడు భగవంతుని దర్శన ముతో పులంకాకితులైన చోఖామేళ దంపతులు స్వామి చరణ కమలము లకు పూజసల్పి భోజనము వడ్డిస్తారు స్వామి భోంచేస్తుండగా సాయిరా పెరుగు వడ్డించబోయి చేయిజారడంవలన స్వామిపై పెరుగు దొర్లిస్తుంది స్వామి పీతాంబరమంతయు పెరుగుతో తడిసిపోతుంది చోఖామేళ ఆవేశ మును ఆపుకోలేక ఎంతపని చేసితివి? భోజనముచేయు అతిథి పాండురంగ భగవానుడని నీకు తెలియదా? నీ దృష్టి ఎక్కడున్నది? అని గద్దిస్తాడు అదే సమయానికి ఆ దారిన నడుస్తున్న దేవాలయార్చకుడు ఆ మాటలు విని తననే చోఖామేళ పరోక్షంగా హేళన చేస్తున్నాడని భావించి దగ్గరకు వెళ్తాడు భోజనము చేయుచున్న పండరీనాధుడు అర్చకునికి కనుపించడు

అర్చకుడు ఆవేశముతో చోఖాను నిందిస్తాడు చెంపపై తీవ్రంగా కొడు తాడు అంత్యజుని తాకినందుకు నదిలో స్నానమాచరించి దేవాలయమునకు వెళ్తాడు నిష్కారణంగా తననిలా కొట్టినందుకు చోఖామేళ బాధపడడు భక్తుని అవమానము యధార్ధానికి భగవంతునికే అవమానము ఈ సంఘట నను చూచి భరించలేక విఠోబా అదృశ్యమవుతాడు చోఖామేళుని దారుణంగా బాధించిన అర్చకుడు దేవాలయములోకి ప్రవేశిస్తాడు గుడి తలుపులు తీయ గానే దిగ్భ్రాంతిచెంది ఆగిపోతాడు విఠలుని నేత్రములవెంట కన్నీరు కారు తున్నది భగవానుని చెంప ఎర్రగా కమిలిపోయి వున్నది ఆ దృశ్యమును గాంచిన అర్చకుని శరీరము కంపిస్తున్నది మనస్సు పట్టుతప్పుతున్నది హృదయములో భయాందోళనలు ఆవరించాయి తాను చేసిన అపరాధ మేమిటో తెలియవచ్చింది భక్తాగ్రేసరుడైన చోఖామేళుని యెడ తాను ప్రవ ర్తించి తీరే ఈ అనర్ధమునకు కారణమని గ్రహించాడు పశ్చాత్తాపంతో కుమిలిపోతున్నాడు ఏమి చేయాలో అవగతం కావడంలెదు వెంటనే శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులైన ఆచార్యుల నాశ్రయించాడు తాను చేసిన తప్పిద మును వివరించి అందులకు తరుణోపాయము తెలియచేయమని ప్రార్థిం చాడు సర్వజ్ఞులైన ఆ మహాత్ములు జరిగిన విషయమంతా సవ్యంగా విన్నారు భగవంతుడు భక్తాధీనుడు భక్తునికి జరిగిన అవమానమునకు కలతచెందిన భగవానుని హృదయమును శాంతింపచేయుటకు భక్తులకుతప్ప మరొకరికి శక్యంకాదు కనుక చోఖామేళుని శరణుజొచ్చుటయే మార్గమని తెలియచేసారు

అర్చకుడు ఒక్క నిముషములో చోఖామేళ నివాస స్థలమునకు పరు గెత్తుకుంటూ వస్తాడు నిశ్చింతగా వృక్షఛాయలో కూర్చుని భగవన్నామ మును గానంచేయుచున్న చోఖామేళుని పాదాలపైపడి క్షమాభిక్ష కోరుతాడు అనూహ్యమైన ఈ సంఘటన చోఖామేళునికి గుర్పాటు కల్గిస్తుంది అయ్యా అగ్రకులజులైన మీరు అంత్యజుడనైన నాకు నమస్కరించుట భావ్యంకాదు అని వెంటనే అర్చకుని పాదాలపైపడి నమస్కరిస్తాడు చోఖామేళుని నమ్రత అర్చకుని హృదయాన్ని కదిలించివేస్తుంది జరిగిన విషయమంతయు చోఖామేళునికి విశదపరచాడు ఈ విపత్కర పరిస్థితి

నుండి కాపాడవలసిందని అర్చకుడు ప్రార్థించి చోఖామేళుని చేయి పట్టుకొని తీసుకొనివచ్చి గర్భాలయంలో పాండురంగ భగవానునిముందు నిలుపుతాడు

విఠలనాథుని నయనాలలో అశ్రువులను దర్శించగానే చోఖామేళుని దుఃఖం కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తుంది చోఖామేళ పాండురంగనికి నమస్కరిస్తూ హే భక్తవత్సలా! పాండురంగా బిడ్డ తెలియకచేసిన తప్పుకు తల్లి బాధపడుతుందా? నీ బిడ్డలమైన మేము అజ్ఞానముతో ఎన్నో తప్పులుచేసి యుండవచ్చు మా తప్పులను నీవే మన్నించనిచో మా కెవరిక దిక్కు? హే దీనవత్సలా విఠలా! బాధాపూరితమైన నీ ముఖమును చూసి జీవించే శక్తి మాకులేదు మా అపరాధమును మన్నించి నీ దివ్య మంగళ స్వరూపమునుచూపి మమ్ములను కృతార్థులను చేయవలసింది అని ప్రార్థిస్తాడు భక్తుని హృదయావేదననుగాంచి పాండురంగడు తన యథార్థ స్వరూపమునుచూపి అనుగ్రహిస్తాడు. జై జై పాండురంగహరి

పాండురంగని పరాభక్తిలో నడచి తరించిన భక్తపుంగవులలో ముఖ్యులైన శ్రీ నామదేవులవారు ఒకనాడు ఆలయంలో సంకీర్తన చేయుచుండగ విఠలనాథుని నేత్రాలవెంట కన్నీరు కారడం జరుగుతుంది ఆ దృశ్యమునుగాంచి వ్యాకులచిత్తులైన నామదేవులవారు నేత్రములనుండి అశ్రుధార స్రవించుటకు కారణము తెలియచేయవలసిందని పాండురంగని ప్రార్థిస్తారు జగత్పాలకుడైన పాండురంగ భగవానుడు "నామదేవా! పరమ భాగవతుడు భక్తాగ్రగణ్యుడైన చోఖామేళ కూలిపనికి వెళ్ళి అక్కడ ఒక గోడకూలిపోగా తోటి కూలీలతోపాటు కొన్నిక్షణాల క్రితమే కన్ను మూశాడు నిరంతరము నా నామమునే స్మరిస్తూ సుఖ దుఃఖాలయందు సమభావముతో జీవిస్తూ త్యాగమయ జీవితమును కొనసాగించిన భక్తశేఖరుడు చోఖామేళ అంత్యకాలములోకూడా నా స్మరణముతోనే తన జీవన యాత్ర సాగించాడు అని చెబుతాడు

భక్తునియెడ భగవానునకుగల అపార ప్రేమను స్వామి అమృత వాక్కులద్వారా వినిన నామదేవులవారికి తన్మయత్వం కలిగింది గద్గదమైన

కంఠస్వరముతో భగవాన్! అనంత కృపానిధివైన నీ చల్లటి దీవనచే నీ భక్తులకు శరణ్యమైయున్నవి నీ పాదద్వయమును ఆశ్రయించి భక్తిచేసిన ఎందరో మహాత్ములకు మోక్షధామం ప్రసాదించినట్లు భక్తాగ్రేసరుడైన చోఖామేళుని ఈనాడు ఉద్ధరించావు నీపవిత్ర పాదసన్నిధికి చేర్చుకున్నావు అని స్వామి పాదాలపైబడి విలపిస్తాడు

భక్త హృదయ నివాసియైన పాండురంగడు నామదేవులవారిని ఓదార్చి నామదేవా భక్త శిఖామణియైన చోఖామేళునికి ఒక కోర్కె యుండేది అది ఫలించలేదు ఆకోర్కెను ఇప్పుడు నీవు తీర్చాలి అని చెబుతాడు. పరాత్పరుడైన విఠలనాథుని ఆజ్ఞను శిరోధార్యముగా భావించే నామదేవులవారు భగవాన్! తస్మిన్ తజ్జనే భేదా భావాత్ నీకు నీ భక్తులకు తేడాలేదని భాగవతప్రియుడైన నారదమహర్షి ప్రవచనము నిరంతర భగవన్నామ స్మరణతో తన జీవితమును ధన్యత చేసుకొన్న చోఖామెళ మహాశయుని కోర్కె తీర్చగల్గుట నా భాగ్యము విఠలా! నీ కృపాకటాక్షముతో నిర్వర్తించెదను సెలవివ్వండి అని చెబుతారు

పరమోదారుడైన రుక్మిణీవల్లభుడు నామదేవా! మరణానంతరము తన మృతదేహమును నా ఆలయము ముందు సమాధి గావించవలయునని అతనిలో ప్రగాఢవాంఛ యుండేది కానీ ఆ అవకాశము లేకుండ అతడు భయంకర ఆకస్మిక మరణానికి గురికావలసివచ్చింది ప్రమాదంలో తనతో పాటు మరణించిన వారందరిని కలిపి సామూహికముగా దహనంచేశారు కను అతని కోర్కె ఫలించకుండా పోయింది నీవు వెళ్ళి భక్తపుంగవుడైన చోఖామేళుని శల్యములనుతెచ్చి ఆలయముముందు సమాధి గావించవలసింది అని చెబుతారు అంతట నామదేవులవారు భగవాన్! సామూహిక శవదహన సంస్కారము జరిగినట్లు తమరే సెలవిచ్చారు అలాంటప్పుడు చోఖామేళుని శల్యములను నేను ఎలా వేరుచేసి రాగలను అని అడుగుతారు

"నామదేవా! అంతిమ క్షణములోకూడ నా భక్తుడైన చోఖామేళ నామస్మరణతో ప్రాణాలు విడిచాడు నీవు ఎముకలను చెవి దగ్గర పెట్టుకో

గానే ఏ ఎముకలనుండి పాండురంగ నామము వినపడుతుందో ఆ ఎముకలు చోఖామెళుడివని నిర్ణయించవలసింది అని పాండురంగడు తెలియజేస్తాడు

నామదేవులవారు వెళ్ళి భగవానుని ఆదేశానుసారము పరిశీలిస్తారు అందులో కొన్ని శల్యములను చెవిదగ్గర ఉంచుకోగానే "విఠలా విఠలా పాండురంగ అని దివ్యనామం వినిపిస్తుంది నామదేవులవారు నిశ్చేష్టులై చోఖామేళుని భక్తికి తన్మయత్వంచెంది కన్నీరు కారుస్తారు భక్త మహాశయుడు చోఖామేళుని శల్యములను తీసుకొనివచ్చి పాండురంగని పవిత్రాలయం ముందు సమాధి చేయిస్తారు ఇప్పటికిని భక్త చోఖామేళుని సమాధి ముందు భక్తులు నిలబడి పూజ చేయడం జరుగుతూనే యున్నది

భక్త చోఖామేళ అమరజీవి ఆప్తకాముడై తరించిన ముక్తజీవి భగవన్నామమనే యుద్ధభేరిని మ్రోగిస్తూ జీవిత సంగ్రామములో కాలిడి కామక్రోధాది సైన్యమును తుదముట్టించి అభిమాన అహంకారాది సేనాధిపతులను అంతమొందించి అజ్ఞాన ఆధిపత్యాన్ని ఓడించి మోక్షసామ్రాజ్యమును చేపట్టిన చోఖామేళ ధన్యజీవి

విఠలుని రూపముతప్ప అన్యమైనదానిని తాను వీక్షించలేదు విఠలుని నామముకన్నా అన్యమైన శబ్దమును తాను వినడు వినలేదు విఠలుని మహాత్మ్యమును తప్ప అన్యమైన విషయమును పలుకలేదు పాండురంగ చైతన్యముతో చోఖామేళ మనస్సంతా తడిసిపోయింది

రామనామ ప్రభావముతో ఆనాడు రాళ్ళు సాగరంలో తేలియాడాయి భగవన్నామ ప్రభావంతో చోఖామేళ సంసార సాగరంలో మునిగిపోకుండా ఆనంద తరంగాలపై తేలియాడాడు

భక్తికి జాతి కులాది భేదములు లేవని తన జీవితముద్వారా తెలియజేశాడు భక్తికి కులములేదు జాతిలేదు రూపములేదు ధనములేదు సదా భక్తిని తన హృదయములో భావించి జీవించేభక్తునికి భేదాలెలా తెలుస్తాయి?

"నాస్తి తేషు జాతి విద్యా రూపకుల ధనాధిభేదః॥"

భగవద్భక్తులయందు జాతి విద్యా రూప కుల ధనాది భేదములు లేవని నారదభక్తి సూత్రములు తెలియజేయుచున్నవి

"జాతి పతి పూఁచై నాకోయ్
హరి కో భజెసో హరి కాంహూయ్||"

నీ జాతి ఏమిటని భగవానుడు అడుగడు ఎవ్వడైతే భగవన్నామమును సదా గానము చేయుచుండునో వాడే భగవంతునిచే ఎన్నుకొనబడునని కబీర్ గురుదేవులైన రామానందస్వామి ప్రబోధము

పై శాస్త్ర వాక్యములు ఆప్తవచనములు భక్త చోఖామేళ జీవితములో తొంగిచూసినవి చోఖామేళ చిరంజీవి ఆయన జీవితము బోధలు ముందు తరాలవారికి మార్గగాములనుటలో సందేహము లేదు

• ఓం శ్రీ పాండురంగాయ నమః •





# నందదాస్

ఉవ్వెత్తున లేస్తుంది సాగరము ఉరకలేస్తూ వస్తుంది కెరటము. జలతారు పోగులతో అంచులు తీర్చిదిద్దిన వస్త్రమువలె రజత వర్ణకాంతులతో పొంగివచ్చే తరంగాలను వీక్షిస్తూ ఎవరు తిరిగి రాగలరు? రాకుండా నిలబడటంతప్పా? నిరీక్షించడం అపచారమా? అక్కడ జరిగేదేమిటి? అర్థం కాని ఆరాధన సౌందర్య జీవన సమారాధన

చూస్తున్నామనే సంకల్పం లేని చూపు వీక్షిస్తున్నామనే విచక్షణ ఎరుగని రూపు అన్యవస్తువులను మనస్సునుండి దూరం చేసిన మరపు హృదయపు లోతులలో సౌందర్యం కొరకు పరితపించే అరపు

చూపు అందించిన రూపు-రూపు కలిగించిన మరపు-మరపు చిందించిన అరపు-అనురాగపు భవంతులా? ఆనందపు స్రవంతులా?

మనసుకు చిక్కేది అనురాగం మనసుకు దక్కనిది ఆనందం అనురాగం ఊహకందుతుంది ఆనదం ఊహాతీతమై ఉంటుంది

ప్రకృతి సొగసులో తెలుస్తుంది పరమాత్మ వయసు పరమాత్మ స్పందనలో దాగుంటుంది ప్రకృతి యశస్సు యశస్సు అందించే శోభలో

తమస్సు అదృశ్యమవుతుంది అదృశ్యమయ్యే తమస్సును చీల్చుకొని ఉషస్సు ఉదయిస్తుంది ఉదయించిన ఉషస్సు వర్చస్సును కదిలించి హృదయాలను కరిగిస్తుంది ఆ హృదయ స్పందనతో కవులు కదలగలరు సౌందర్య పిపాసులు ఆవిర్భవించగలరు కళాకారులుస ృష్టింపబడగలరు సకల సౌందర్యాలకు మూలవస్తువైన పరతత్వాన్ని ఆపోశించి అనుభవించే వేదాంతులు తయారుకాగలరు

అనంత సృష్టిలో దాగియున్నది సౌందర్యము సాగర చలనము ఇంద్రధనస్సులోని సప్తవర్ణ చిత్రణము కోకిల గొంతులోని మధుర స్వరము పర్వత పంక్తులలో నిండియున్న గంభీర నిశ్శబ్దము గలగల పారే జీవనదులలోని ప్రణవనాదము పక్షుల కిలకిలారావము మేఘ గర్జనము అన్నిటిలో అన్నిచోట్ల కనుపించేది సౌందర్యమే వినిపించేది సౌందర్య అలికిడి మాత్రమే

అరణ్య ప్రాంతాలలో నిల్చియున్న వృక్షపంక్తిని ఆ పంక్తిలోని ఒక వృక్షమే చూసిందని భావిస్తాము తాను వృక్షముగా వ్యష్టి అయినా వృక్షపంక్తి సమిష్టి శోభలో తానూ భాగస్వామియే సముద్రంనుండి లేచిన ఒక అల తన వెంటలేచిన మరొక అలను దర్శించినపుడు తన స్థితిఏమిటి? తన అస్థిత్వము అలరూపంలో తాత్కాలికముగా గోచరించినా సముద్ర సమిష్టి పూర్ణ రూపములో గోచరించే వడిలో పరవడిలో ఉరవడిలో తానూ భాగస్తురాలే ఇక్కడ ఎవరు చూస్తున్నారు? ఎవరిని చూస్తున్నారు అది ఎలావున్నా చూస్తున్నంతవరకు నిలిచేది సౌందర్యము చూసేదెవరో గ్రహించిన తరువాత మిగిలినదంతా సౌందర్యమే సౌందర్యము సౌందర్యమునే వీక్షిస్తున్నది చూసేశక్తి సౌందర్యము చూసేదృష్టి సౌందర్యము చూడబడే సృష్టి సౌందర్యము వ్యష్టి సమష్టుల ఏకైక కలయిక సౌందర్యము అంతా సౌందర్యమే ఉన్నదంతా సౌందర్యమే

ఒక యువకుడు దారిన వెడుతూ ఒక ఇంటిముందు అప్రయత్నముగా ఆగాడు కాళ్ళు ముందుకు నడవడంలేదు కదలడానికి వీలులేదని మనసు సమ్మోహచేస్తున్నది ఆ ఇంటి గుమ్మం ముందు ఒక ఆవిడ తల

దువ్వుకుంటూ నిలబడివుంది ఏ దేవలోకంనుండో దిగివచ్చిన రంభయా అన్నట్లుంది ఆవిడ సౌందర్యము ఆమె అందాన్ని చూడగానే ఈ యువకుడు ముగ్ధుడైపోయాడు ఇంతటి అందమైన యువతిని గతములో తానెక్కడా గాంచలేదు సృష్టిలో భగవంతుడు ఈమెను ప్రత్యేకముగా చిత్రించాడెమో ననిపిస్తుంది ఆవిడ శరీర సౌష్ఠవమును వీక్షించుటకు అదృష్టం కూడా ఉండాలి ఇలా ఆలోచిస్తూండగానే ఆవిడ తల దువ్వుకొని లోపలికి వెళ్ళింది

ఆవిడ లోపలికి వెళ్ళింది ఆమె రూపము యువకుని హృదయంలోకివెళ్ళి శాశ్వత తిష్ఠవేసింది బరువుగా కదలలేని కాళ్ళను కదిలిస్తూ ఇల్లు చేరాడు యువకుడు నిద్ర రావడంలేదు భోజనము పాషాణంలా దర్శనమిస్తున్నది ఆమె అందాన్ని మళ్ళీ వీక్షించాలని హృదయము ఆరాటపడుతున్నది కనురెప్పలు సమాంతర రేఖలవలె నిలిచిపోయాయి రాత్రంతా ఆవిడ అందాన్నిగూర్చిన తలంపుతోనే గడిచిపోయింది

సూర్యోదయమైంది ఆవిడను వీక్షించే శుభఘడియ కొరకు నిరీక్షిస్తున్న వ్యక్తి తొందరగా పనులు చక్కబరచుకొని ఆవిడ దర్శనానికి బయలుదేరాడు ఆమె ఇంటివద్దకు వచ్చి నిలబడ్డాడు నిరీక్షిస్తున్నాడు ఆవిడ కనుపించలేదు హృదయము పరితాపముతో ముక్కలైపోతున్నది నేత్రాలు కన్నీటితో నిండి పొరలడానికి సిద్ధంగా ఉన్నాయి ఆవిడ ఇంటి ముందు కాస్తదూరముగా నిలబడి ఏ క్షణాన ఆవిడ దర్శనమవుతుందా అని ఆతృతతో ఎదురు చూస్తున్నాడు

ఆ రోజంతా గడిచిపోయింది ఆమె కనుపించలేదు ఎంతకాలమైనా సరే ఆవిడ దర్శనమైతేనే ఇంటికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు ఒకవేళ ఆవిడ శాశ్వతంగా తనకు కనుపించకపోతే తాను నిలుచున్నచోటనే ప్రాణత్యాగము చేసుకోవాలని నిశ్చయించుకున్నాడు

రెండవరోజు గడిచిపోయింది అయినా ఆవిడ కనుపించలేదు ఆశ సన్నగిల్లింది, అలాగని తన నిర్ణయాన్ని మార్చుకొనే స్థితిలోలేడు ఆ

యువకుడు ఆవిడ అందాన్ని వీక్షించడమో లేదా తనువును చాలించడమో ఏదో ఒకటి జరగాలని నిర్ణయించుకున్నాడు

ఇంతకూ ఆవిడ ఎవరు? ఆవిడ అవివాహితయా లేక వివాహితయా? ఆవిడ కులమేమిటి? ఏమో అవేమీ ఈ యువకుడికి తెలియవు ఒకవేళ ఆవిడ మరొకరికి అర్ధాంగి అయితే? కావచ్చు అప్పుడు తనేమవుతాడు అతడేమికావాలనుకుంటున్నాడో ఎవరికి తెలుసు? తను ఆశిస్తున్నదేమిటో కనీసము ఆ యువకుడికైనా తెలుసా? తెలియదనుకుందాం తెలియకుంటే ఇలా ఎందుకు వ్యధ చెందుతాడు? పోనీ తెలుసుననుకుందాం తెలిస్తే ఇలా ఉన్మాదిలా ప్రవర్తించడమేమిటి ?

ఒకావిడ అతనిదగ్గరకొచ్చింది బాబూ! నీవెవరు? రెండు రోజుల నుండి చూస్తున్నాను నీవు ఇక్కడే నిలబడియున్నావు? అని ప్రశ్నించింది

యువకుడు కనురెప్పలు పైకెత్తి నీవెవరన్నట్లుగా ఆవిడవైపు చూసాడు నేను ఆ ఎదురింటిలో పరిచారికను అని అతని సంశయాన్ని గ్రహించి సమాధానమిచ్చింది పరవాలేదు పూజారి స్నేహం లభించిందనుకొన్నాడు మీరిక్కడ ఎందుకున్నారు? మీకేంకావాలి? అని మళ్ళీ అడిగిందావిడ

ఏం కావాలంటుందేమిటి ? ఆవిడేమన్నా కామధేనువా? కల్ప వృక్షమా? ఎవరైతేనేం అడిగింది చెప్పాలనుకున్నాడు నేను బ్రాహ్మణ యువకుడను నా పేరు నందదాస్ నేను మూడురోజులక్రితం ఈ ఇంట్లో ఆవిడ గుమ్మంవద్ద నిలబడి దువ్వుకుంటుండగా చూశాను ఆవిడ అందానికి నేను పిచ్చివాడనయ్యాను మళ్ళీ ఆవిడను దర్శించడానికి వచ్చాను ఆవిడను చూసినంతవరకు నిద్రాహారాదులు మానేశాను అని సంకోచము లేకుండా యధార్థాన్ని పండు ఒలిచి చేతిలో ఉంచినట్లు చెప్పాడు

పరిచారికకు మతి పోయినంతపనైంది ఇంత బాహాటముగా స్వేచ్ఛగా చెప్పాడేమిటి? ఇతనికి ఉన్మత్తత లేదుకదా? అని ఆలోచిస్తూ "ఆవిడ మా యజమానురాలు వివాహమైన క్షత్రియ స్త్రీ అన్నది

ఆవిడ మాట పూర్తిచేయకముందే అందుకొని అయినా ఫరవా లేదు అన్నాడు నందదాసు

ఫరవాలేదంటాడేమిటి? వస్తువును కొనడానికి సంతలో ప్రవేశించి నట్లు ఇతని వాలకం ఆవిడకర్థం కాలేదు నీ ప్రవర్తన నీకు తప్పని ఎంచడములేదా? అన్నదావిడ

అంతటి పెద్ద పదం నాకు తెలియదు అది నా జీవితములో అన్వేషించినా అగుపించని వస్తువు ఆవిడకు అందాన్నిచ్చినవాడే నాకు నేత్రాలిచ్చాడు నాకు నేత్రాలను ప్రసాదించినవాడే నీకు నోరిచ్చాడు ఇందులో ఎవరితప్పు ఎంత? అని అప్రయత్నంగా సమాధానమిచ్చాడు నందదాసు

మరి నీవిలా వేచియున్నట్లు అమ్మగారితో చెప్పేనా? అన్నదావిడ

అది నీ ఇష్టం అన్నాడు నందదాసు ఆవిడ ఒక్కక్షణంలో లోపలికెళ్ళింది జరిగిన విషయమంతా పూసగ్రుచ్చినట్లు యజమానురాలికి తెలియచేసిందాపరిచారిక నిద్రాహారాదులు మాని ఆవిడ దర్శనానికి నంద దాసు నిరీక్షిస్తున్నాడనియు దర్శనము లభించనిచో ప్రాణత్యాగానికి సిద్ధంగా ఉన్నాడనియు తెలిపింది

యజమానురాలు ఆలోచించింది ఆలోచన పెరిగి ఆనందానికి చేరు వైంది తన అందాన్ని అంతగా ఆరాధించే ఆ పురుషుని చూడాలనుకుంది తన మనోభీష్టాన్ని నిస్సంకోచంగా వెల్లడించిన ఆ యువకుడు ఉత్తమ వ్యక్తి అయివుండాలని భావించింది వేడికి పాలు పొంగకపోవచ్చునేమో గాని పొగడ్తలకు స్త్రీలు పొంగకుండా ఉండలేరు

వెంటనే వీధిగుమ్మం వద్దకు వచ్చి వయ్యారంగా ఆ అందాలరాశి నిలబడింది కళ్ళనార్పకుండా ఆవిడవంక తదేకంగా చూశాడు నందదాసు ఆమె అందాన్నంతా ఒక్కచూపులో ఆకళింపుకున్నాడు ఆమె సౌంద ర్యాన్ని పానంచేస్తున్నాడు ఇంతలో ఆవిడ లోనికివెళ్ళింది

సంతృప్తిచెందిన నందదాసు ఇంటివైపు నడిచాడు అంతటి అపు రూప సౌందర్యాన్ని సృష్టించి వీక్షించడానికి రెండు కనులిచ్చి భగవంతుడు

అన్యాయము చేశాడని భావించుకుంటూ ఇల్లుచేరాడు మరునాడు నిద్ర లేచాడు ఎరాసరి ఆవిడ ఇంటిముందు వెళ్ళి నిలుచున్నాడు సుప్రభాత దర్శనానికి వేంచేసిన భక్తుడులాగ పరిచారిక చూసింది యజమానురాలితో చెప్పింది ఆవిడ బయటకువచ్చి నిలబడింది నందదాసు దర్శించాడు. ఆవిడ తిరిగి లోపలికెళ్ళింది నందదాసు తృప్తిచెంది ఇంటికి తిరిగి వచ్చాడు

ప్రతిరోజూ ఇలా జరుగుతూ వుంది నందదాసుకు తన దైనందిన జీవితములో ఇది ప్రాధాన్యాంశమైంది తన నిత్యకృత్యాలలో ఆవిడ దర్శనమనేది ప్రముఖస్థానము నాక్రమించింది విసుగులేకుండా ఈ సౌందర్య పిపాస యజ్ఞం నిత్యమూ నిర్వహించబడుతూ వుంది

ఇంటి యజమాని ఈ దృశ్యాన్ని చూశాడు నందదాసు ప్రతిరోజూ తన ఇంటిముందు నిలుచొని తన భార్యను వీక్షించివెళ్ళడము గమనించాడు ఒకనాడు నందదాసు యథాప్రకారం వచ్చాడు నందదాసును లోపలికిరమ్మని పిలిచాడు ఆ ఇంటి యజమాని నందదాసు లోపలికివచ్చి నిలబడ్డాడు ప్రతి రోజూ నీవు మాఇంటి ముందువచ్చి నిలబడుటకు కారణమేమి? అని ప్రశ్నించాడు ఇంటి యజమాని

నందదాసు యజమానికి నమస్కరిస్తూ అయ్యా నేను అందాలరాశియైన మీ అర్ధాంగిని చూశాను ఆమె అందము నన్ను ఉన్మాదిగా మార్చింది నేను ఇంటికోవున్నా ఆవిడ అందమే నా కనులముందు నిలుస్తున్నది రోజుకు ఒక్కసారైనా ఆమెను దర్శించలేనిదే నేను జీవించలేక పోతున్నాను " అని తెలిపాడు

యజమాని దిగ్భ్రాంతి చెందాడు అతని ధైర్యం ఋజుత్వము మనసుకందని విషయాలుగా మిగిలాయి అతనికి ప్రాయశ్చిత్తము చేయాలో లేదా అతనిని పశ్చాత్తాపంతో వదలిపెట్టాలో ఇంటి యజమానికి అర్థం కాలేదు మారుపలుకకుండా వెళ్ళిరమ్మని చెప్పాడు స్వతహాగా కృష్ణ భక్తుడైన ఇంటి యజమానికి నందదాసులో అర్థంగాని అమాయకత్వము గోచరించింది

నందదాసు దినచర్యమామూలుగానే కొనసాగుతున్నది తీగ పందిరిని అలుముకున్నట్లు నందదాసు సౌందర్యోపాసన గ్రామమంతా వ్యాపించింది ఊరిలో వదంతులు బయలుదేరాయి గుసగుసలు హద్దుదాటి గల్లంతుల య్యాయి అనకట్టలేని జలప్రవాహములాగా ప్రజల నోళ్ళు పలుకుతు న్నాయి సమాజ ప్రలాపాలకు నందదాసు చెవిటివాడు తన ఆరాధన యధా విధిగా సాగుతూనే వున్నది

గ్రామములో జరిగే విమర్శలు యజమాని చెవిన పడ్డాయి అతడు అవమానముతో కుంచుకపోసాగాడు ఆవేదనతో అంతఃకరణను భగ్నం చేసుకున్నాడు పరిష్కారమేమిటా అని ఆలోచించాడు కొంతకాలము ఆ ఊరు వదలిపెట్టడమే సరియైన పరిష్కారమని భావించాడు గోకులములో విఠల్‌నాథ్ అనె తన గురువు ఉన్నాడు అతనివద్ద కొంతకాలముండి సాధన చేస్తూ శాంతి మనుగడను సాగించవచ్చని సంకల్పించాడు ప్రయణానికి అన్నీ సిద్ధం చేసుకున్నాడు మరునాటి ఉదయమే బయలుదేరి వెళ్ళాలని భార్యాభర్తలు నిశ్చయించుకున్నారు గోకులానికి యమునానదిలో ప్రయా ణముచేసి వెళ్ళాలి పడవవానితో మాట్లాడాడు సూర్యోదయాత్పూర్వమే పడవను సిద్ధం చేయమని ఏర్పాటు చేశాడు

మరునాటి ఉదయం బయలుదేరి భార్యాభర్తలిరువురు రేవువద్దకు వచ్చారు పడవను సమీపించగానే స్తంభించినట్లు నిలిచిపోయారు వారు ఎక్కబోయే పడవలో నందదాసు ఆసీనుడైయున్నాడు వారిరువురు గోకు లం వెళ్తున్నారని ఏలాగో తెలుసుకున్న నందదాసు ముందెవచ్చి పడవలో ఆసీనుడయ్యాడు

నీ విక్కడికి ఎందుకొచ్చావ్?" అని యజమాని నందదాసును ప్రశ్నించాడు

మీరు వెళ్తున్నారని తెలిసి వచ్చాను ఆమెను చూడకుండా నేను జీవించలేను అన్నాడు నందదాసు

ఆ యజమాని కోపోద్రిక్తుడయ్యాడు పడవవానిని పిలిచి ఆతను పడవలో ప్రయాణము చేసినచో తాము రామని చెప్పాడు వెంటనే పడవ

వాడు బలవంతముగా నందదాసును దింపాడు. నందదాసు తీరంలో నిలుచుని చూస్తున్నాడు. తన కళ్ళముందే పడవ కనుమరుగైపోయింది.

నందదాసు యమునానదీతీరంలో ఒంటరిగా నిలబడిపోయాడు. ఆవిడ వెళ్ళింది. ఆవిడ సౌందర్యము నన్వేషిస్తూ తన హృదయమూ వెళ్ళింది. తనవైపు నడచివస్తున్నట్లున్న యమునా తరంగాలను చూసాడు. ఆవిడ నుండి ఏదో సందేశాన్ని తెస్తున్నట్లు అనిపించింది నందదాసుకు. తదేకంగా చూసాడు. అలలనుచూసే దృష్టికి స్వస్తిచెప్పి యమునానదిని సంపూర్ణంగా దర్శించడానికి ప్రయత్నించాడు. యమునయొక్క దివ్యరూపము తన సాక్షాత్కరించింది. హిమాలయ పర్వత శ్రేణులనుండి ప్రవహిస్తున్న ఈ యమున తీరంలోనే జరిగిపోయాయి. తనలోని భావకెరటాలు ఆకాశాన్నంటేలా లేచాయి. యమునానది సౌందర్యములో తాను మేను మరచాడు. యమున సౌందర్యము క్షీణించనిది. యమున ఒక వ్యక్తి కాదు. తనకు జీవత్వం లేదు. వృద్ధాప్యం రాదు. యమునను వీక్షిస్తున్న నందదాసు కవితాకన్య కొంగుపట్టుకొని అద్భుత సౌదర్య శిఖరాల నధిరోహించాడు. వెంటనే కీర్తన గానం చేశాడు.

"ఓ యమునా? దివినుండి
భువికి దిగివచ్చావు నీవు
ప్రేమ కొరకేగాని నీ కొరకుగాదు
నదిగా నడుస్తున్నావు
పరవళ్ళు త్రొక్కుతున్నావు
నీవు కీర్తి పొందాలని కాదు
నీ భక్తుల ఆర్తిని తీర్చాలని
అనురాగంతో మమ్ము ఆశీర్వదించావు
అమరులైతిమి మేము నీ అండచేరి
నిన్ను దరిచేరిన మానవులేగాక
నిన్ను దరిచేర్చిన మాధవుడు కూడా
పరవశించెదరు నీ పొంగుచూసి

నింగి నాడించిన ఓ సుందరాంగి
చల్లబడినది ఉల్లము కోమలాంగి

అని అలౌకిక అనురాగ సుధామయమైన అమర భావనతో కీర్తన గానము చేశాడు

నందదాసు హృదయంలోని క్షత్రియస్త్రీ అదృశ్యమైంది ఆమె స్థానే యమునాకన్య ప్రవేశించింది యమునారాధనలో మేను మరచి పరవశించి పోతున్నాడు నందదాసు

విచిత్రమైన దీతని మనఃప్రవృత్తి విడ్డూరంగా గోచరిస్తున్న దీతని సౌందర్యోపాసన క్షత్రియ స్త్రీకో అతను చూఎందేమిటి? యమునా తరంగాలలో చూస్తున్నదేమిటి? వీటికి సామ్యమెక్కడ? అతడు సౌందర్యఉపాసా, అందాన్ని తూచగలిగే కవిశేఖరుడా? ఆనందాన్ని చిరజిమ్మే గాయకుడా?

క్షత్రియ దంపతులు గోకులం చేరారు గురువుగారైన గోస్వామి విరలనాథుని ఆశ్రమం చేరారు గురువుగారికి ఫలపుష్పాదులను సమర్పించి సాష్టాంగ నమస్కారము చేశారు గురువుగారికి దగ్గరగా ఆసీనులై ఏదో చెప్పబోయారు గురువుగారు మందహాసంచేస్తూ "ఆ బ్రాహ్మణ యువకుని యమున ఆవలి ఒడ్డున ఎందుకు వదిలారు? అని ప్రశ్నించారు క్షత్రియ దంపతులకు మతిపోయింది ఏమి మాట్లాడాలో తెలియక అలాగే స్థాణువుల్లా నిలిచిపోయారు

నందదాసు మహాభక్తుడు అతని హృదయాంతరాళాలలో ప్రవహించే సౌందర్య సుధారస ప్రవాహాన్ని మీరు గాంచలేకపోయారు అర్థం చేసుకోకపోగా అపార్థం చేసుకున్నారు ఆదరించదగిన పుణ్యాత్ముని అవమానాల పాలుచేశారు అన్నాడు గురువిరలనాథుడు

క్షత్రియ దంపతులు గురువుగారి పాదాలపైబడి తమ తప్పు క్షమించమని కోరారు విరలనాథుడు తన శిష్యులలో ఒకరిని పిలిచి నందదాసు వివరాలు తెలియచేసి అతనిని తీసుకొనిరమ్మని చెబుతాడు శిష్యుడు వెళ్ళి యమునానదీ సౌందర్యాన్ని వీక్షిస్తున్న నందదాసును తీసుకొని వస్తాడు

నందదాసు గోస్వామి విఠలనాథ్ ఎదురుని దర్శించాడు తనలో ఇంతవరకు ఏదో అర్థంకాని అయోమయ స్థితిలోవున్న ఉపాసన అదృశ్యమైంది అవ గాహన మనసు నావరించింది విఠలనాథుని పాదాలపైబడి నమస్కరించాడు అతని జీవనతీరమేమిటో అర్థమైంది తన బ్రతుకుకు గమ్యమేమిటో గురు పాదాలచెంత గ్రహించాడు వెంటనే గురుసాన్నిధ్యములో అనువుగా కీర్తన గానం చేశాడు ప్రస్తుతము తన హృదయములో నిండియున్న మధుర దృశ్యాన్ని రమణీయంగా రచిస్తూ కమనీయంగా కీర్తించాడు

అదిగో – అల్లదిగో
నందకిశోరుని సుందర రూపము ॥అదిగో॥
యమునాతటిపై గోపభామలతో
ఆడుతు పాడుతూ అల్లరిచేసెడి ॥అదిగో॥
మకరకుండల మోహనవంశీ
మోరమకుట పీతాంబర ధారి ॥అదిగో॥
రాధ రాధ యని మురళీ నాదము
ఘల్లుఘల్లుమని రాసబృందము
చూచువారలకు జన్మధన్యము
విన్నవారలకు బ్రతుకు పుణ్యము ॥అదిగో॥

అంటూ ఆనందపారవశ్యములో నందదాసు గానంచేస్తూండగా అందరూ బాష్పధారలు విడిచారు

మధురానగర సమీపాన రాంపూర్ అను గ్రామములో జీవరాం అనే సనధ్య బ్రాహ్మణవంశమునకు చెందిన భక్తుడు జీవిస్తుండేవాడు క్రీ శ 1570లో అతనికి ఒక కుమారుడు కలిగెను ఆ పిల్లవానికి నంద దాసు" అని నామకరణం చేశారు

నందదాసు బాల్యమునుండియు భగవచ్చింతనలో కాలము గడిపెడి వాడు సత్సంగములు జరుగుచోట తాను ముందుండేవాడు హరికథా గానం జరుగుచోటికి వెళ్ళేవారిలో మొదటివాడు తిరిగివచ్చేవారిలో చివరి వాడు మన నందదాసే తన తండ్రియైన జీవరాం భక్తుడగుటవలన అనేక

మంది సాధువులు పవిత్రాత్ములు నారిగ్మహానికి వచ్చేవారు నందదాసు అతి శ్రద్ధాభక్తులతో సాధువులకు సేవ చేసెడివాడు సత్పురుషుల సేవలో పొందలేనిదంటూ ఏముంది॰

"ఇస సత్సంగమే లాభ బహుతహై
తురత మిలావై గురూసే

"సత్పురుషుల సాంగత్యములో అధికలాభమున్నది సద్గురువును గుర్తింపగలిగే శక్తిని సత్సంగము శిష్యునికి అందిస్తుంది అని కబీర్‌దాసు ప్రబోధించాడు బాల్యముననే గురువులను సేవించిన నంద దాసు భక్తి తనను గురు విఠలనాథుని పాదాలవద్దకు చేర్చింది

నందదాసుని బాల్యముననందే తల్లిదండ్రులు మరణించారు తాత గారింట్లో పెరిగాడు నరహరి పండిట్ అనునతడు నందదాసుకు సంస్కృతము నేర్పాడు నందదాసు శాస్త్రము నధ్యయనం చేశాడు కానీ తనకు భాగవతమునందు ప్రీతిమెండు విద్యయందు నందదాసుయొక్క శ్రద్ధాసక్తులు ప్రజ్ఞావిశేషాలు చూపి సంస్కృత పండితులకు నిలయమైన కాశీ నగరానికి పెద్దచదువులు చదవడానికి పంపించారు కాశీలో విద్యనభ్యసించు కాలములో ఆతనికి తులసీదాస్‌తో పరిచయమైంది మహాభక్తుడు రామ చరితమానస గ్రంథకర్తయైన తులసీదాసుని సహచర్యంతో తన జీవనరథం ఆధ్యాత్మిక బాటలో మలుపుతిరిగింది

కాశీలో నందదాసు తులసీదాసువద్దనే వుండేవాడు. ఒకనాడు కొందరు వైష్ణవులు తీర్థయాత్రలకని బయలుదేరారు నందదాసుకూడా పుణ్యక్షేత్రాలు దర్శించాలని కుతూహలం కలిగింది అతనిలో ఏదో మార్పు వచ్చే సమయమాసన్న మవుతున్నదని అందులకే ఈ కోరిక కలిగిందని జ్ఞానస్వరూపులైన తులసీదాసు గ్రహించారు వెళ్ళిరమ్మని నందదాసును పంపారు మార్గమధ్యంలో ఒక గ్రామములో బసచేశారు నందదాసు ఒంటరిగా ఆ గ్రామాన్ని చూడటానికి వెళ్ళాడు ఒక ఇంటిముందు క్షత్రియ స్త్రీ అందమును చూపి ఆగిపోయాడు యాత్రికులు తమమార్గాన సాగిపోయారు

వారు నందదాసు అక్కడే ఉండిపోయాడు ఆ కారణంగానే తాను ఈనాడు గోకులంలో గురువిఠలనాథుని పాదాలచెంత చేరగలిగాడు

గురుకృపా కిరణప్రసారం జరుగగానే నందదాసు హృదయకమలం వికసించింది సమస్యలు సమసిపోయాయి అస్తవ్యస్తధోరణి అదృశ్యమై అవగాహనతో భక్తి ఏర్పడింది గురుమహిమ అలాంటిది

"సాధూ సీపి సముద్ర కే సద్గురు స్వాంతి బుంద
తృషాగయి ఎక బుందసె క్యా లె కరూం సముంద'

"ముముక్షువులు సాగరములోని ముత్యపుచిప్ప వంటివారు సద్గురువు అందు వర్షించే స్వాతిచినుకు వంటివాడు వర్షపు నీటిలోని ఒక చినుకుతో దాహం తీరుతుంది ఉప్పునీరు సముద్రమంత ఉండి మాత్రం ఏం ప్రయోజనం?

పవిత్రమైన వ్రజభూమిలో నిత్యానుష్ఠానపరుడై భగవద్గుణ సంకీర్తనాదులందు పాల్గొంటూ నందదాసు జీవితాన్ని సాగిస్తున్నాడు పరమ భక్తాగ్రేసరుడై నటువంటి సూరదాసుతో అక్కడే పరిచయమైంది నంద దాసుకు సూరదాసు భక్తి ప్రబోధంతో నందదాసులోని శరణాగతి పరమ స్థాయి నందుకుంది

గోస్వామి విఠలనాథుడు వ్రజభూమిలోయున్న గాయకభక్తులను ఒకచోటచేర్చి వారిని కృష్ణతత్త్వముపై రచనలు సాగించుటకు ప్రోత్స హించాడు వారినే అష్టఛాపు లంటారు వారిలో పెద్దవాడు సూరదాసు చిన్నవాడు నందదాసు ఆ ఎనిమిదిమంది భక్తులలో నలుగురు వల్లభా చార్యులవారి శిష్యులైయుండ నలుగురు విఠల్‌నాథుని శిష్యులుండేవారు ఆ కాలంలోనే రాధాకృష్ణ ప్రేమతత్త్వమునుగూర్చి వ్రజభాషలో అమూల్య మైన సాహిత్యము తయారైంది

నందదాసు రాధాకృష్ణ ప్రేమనువర్ణిస్తూ చక్కటి కీర్తనలు వ్రాశాడు రాసలీలా వైభవమును అత్యద్భుతంగా చిత్రించాడు తన జీవితమంతా వ్రజభూమిలోనే గడపాలని నిర్ణయించుకున్నాడు

నందదాసుయొక్క కృష్ణభక్తి అందరిని ఆకర్షించింది నలుమూలలా అతనికీర్తి వ్యాపించింది తన యశస్సును విని ఆనందించిన తులసీదాసు కాశీనుండి నందదాసుకు ఒక ఉత్తరం వ్రాశాడు నీవు రామభక్తుడివికదా! ఇప్పుడు కృష్ణభక్తివైపుకు మరలితివేం? అని తులసీదాసు వ్రాశాడు

తులసీదాసు ఉత్తరాన్ని చదువుకొని "నీ రాముడు ఏకపత్నీవ్రతుడు మా కృష్ణుడు బహు భార్యాసమేతుడు అని ప్రత్యుత్తరమిచ్చాడు నంద దాసు హృదయంలోని కృష్ణభక్తి విశేషాన్ని ఆ వాక్యము చదువగానే అర్థం చేసుకొని ఆనందించాడు తులసీదాసు

వ్రజభూమిలో నివసిస్తూ భక్తి వజ్రముగా తయారయ్యాడు నంద దాసు కృష్ణభగవానునిపై తనకున్న భక్తిని గోకులంపై తనకున్న ప్రేమను చక్కగా ఒక కీర్తనలో వర్ణించాడు

ఓ మనసా పర్వత శిఖరాల నధిరోహించాలని నీవు ఉత్సాహపడు తున్నావు అయితే గోవర్ధనగిరిని సమీపించుము
చక్కటి గ్రామములో నివసించాలని ఉబలాటపడుతున్నావా అయితే గోకులమునకు పొమ్ము
అందమైన పట్టణములో మనుగడ సాగించాలని కుతూహలపడు తున్నావా, అయితే మధురాపురికి వెళ్ళుము
పుణ్యనదిలో మునకవేయాలని అభిలషిస్తున్నావా పవిత్రయమునలో స్నానమాచరించు నీ కోరికలన్నీ నెరవేరుతాయి
వనములో సంచరించాలని అభిప్రాయపడుతున్నావా, బృందావనానికి చేరుము

అని రసవత్తరంగా గానంచేశాడు నందదాసు

నందదాసు భాగవతాన్ని వ్రజభాషలోకి వ్రాయాలని ప్రయత్నించారు వ్రాశారు పూర్తిచేశారు కొందరి బ్రాహ్మణులకు అదొక కంట కంగా తయారైంది భాగవతము సంస్కృతములో ఉండుటచేత సంస్కృత భాష తెలియనివారికి ప్రవచనముచేసి సంభావనలు పొందేవారు అట్టి భాగ

వతము మాతృభాషయైన వ్రజభాషలో వ్రాయబడితే ఇక వారి ప్రవచనాలు ఎవరువింటారు? సంభావనలు ఎవరిస్తారు? బ్రాహ్మణ పండితులంతా గగ్గోలుమన్నారు గురుగోస్వామి విరలనాథునితో వెళ్ళి మొరపెట్టు కున్నారు ఆ విషయాన్ని వినిన నందదాసు విప్రోత్తములారా! బాధ పడకండి ఇతరులకు ఆనందాన్ని కల్గించాలని నేను గ్రంధాన్ని వ్రాశాను ఆపని కొందరికి దుఃఖాన్ని కలిగిస్తుందని ఇంతవరకు నాకు తెలియదు క్షమించండి శ్రీ కృష్ణ భగవానుని లీలావిశేషములను జీవితవైభవమును భక్తులకు తెలియచేయవలెననెడి సత్సంకల్పముతోనే ఈపని చేశాను మిమ్మల్ని ఆవేదనకు గురిచేయాలనికాదు మీరు కష్టపడినా నేను చూడ లేను మీలోవున్న అంతర్యామి నా కృష్ణుడే మీరు వ్యధచెందడమంటే భగవంతుని బాధించినట్లే అవుతుంది వాసుదేవుని బాధను నేను భరించ లేను ఇదిగో నేనువ్రాసిన గ్రంధాన్ని ఇప్పుడే యమునలో పారవేస్తాను అని దశమ స్కంధాన్నిమాత్రం ఉంచుకొని సంపూర్ణముగా తాను వ్రాసిన భాగవతగ్రంధాన్ని యమున ఒడిలో విసరివేసారు ఆ విధంగా భక్తనంద దాసుని పవిత్ర హృదయంనుండి వెలువడిన భాగవతము యమునాగర్భంలో కలిసిపోయింది నందదాసుయొక్క సర్వభూతదయను మనం ఈ సంఘ టనలో అర్ధంచేసుకోవచ్చు

ఆదర్శ జీవనము గడిపి అమూల్యమైన కీర్తనలను భక్తకోటికి అందించి తన అరువదవఏట శ్రీకృష్ణ పరమాత్ముని దివ్యచైతన్యంలో ఐక్యమయ్యారు

• ఓం శ్రీ జగన్నాధాయ నమః •





# భక్త పురందరదాసు

తూర్పున ఉదయించే సూర్యునిలో మార్పులేదు. వసంత ఋతువులోని కోయిల గొంతుకలో మార్పురాదు. కానీ మానవ జీవితాలలో ప్రతిబింబించే జీవన సూత్రాలలో మార్పు అనివార్యమైన సత్యం ప్రతివ్యక్తి మార్పును వాంఛిస్తాడు. ఆ మార్పును సాధించుటకు ప్రయత్నిస్తాడు. కొందరు సాధిస్తారు. కొందరు ఓడిపోతారు.

ఈ మార్పు కొందరి జీవితాలలో అప్రయత్నంగా తొంగిచూస్తుంది. మనిషిని లొంగదీస్తుంది. ముఖ్యంగా ఆధ్యాత్మికరంగములో ఈ విధంగా ఆకస్మికంగా మారిన వ్యక్తులు కోకొల్లలు. ఒక దివ్యఘడియలో తమ గత జీవితానికి సమాధికట్టి, నూతన జీవితాన్ని చేపట్టి, తాము నడుస్తూ, ఇతరులను నడిపిస్తూ తత్త్వచింతనలో చరించి తరించిన భక్తులు, భాగవతోత్తములు ఈ పుణ్యభారతావనిలో ఎందరో ఉద్భవించారు. అయితే వారి జీవితాలలో మార్పుకు పెద్దకృషి కనుపించదు. అయినా పూర్వజన్మ ఫలవిశేషముచే భగవత్కృపకు పాత్రులై ఆ పరిణామ దివ్యక్షణము రాగానే ఉన్నపళంగామారి ఎందరికో స్ఫూర్తిని కలిగిస్తారు. భగవన్మూర్తులుగ కనుపిస్తారు.

స్త్రీ మోహంలో ఎచ్చివాడిలా పరిభ్రమించి మానవత్వమురేని మని షిగా సంచరించి తనవారికి తోటివారికి క్లేశకారకుడైన వ్యక్తి ఆకస్మికంగా మారి వేమనయై అందరి హృదయాలలో ఒక సముచిత స్థానాన్ని ఏర్పరచు కొన్నాడు శల్యగతమయిన ముదుసలిని శోకగ్రస్తుడయిన రోగిని శ్మశాన వాటికకు తరలపోయే శవాన్నిచూసి సిద్ధార్థుడు అప్రయత్నముగా మారి బుద్ధుడయ్యాడు కళింగ యుద్ధములో ప్రవహించిన రక్తపు మడుగులను కనులారగాంచి కలతచెందిన అశోకుడు బుద్ధభగవానుని అడుగుజాడల ననుసరించి శోకానికి దూరమయ్యాడు పైకోవకు చెందినవారిలో వాల్మీకి బిల్వమంగళుడు కన్హోపాత్ర తులసీదాసు లాంటివారు ఎందరో కలరు అట్టి మహాత్ముల కోవకుచెందిన మహనీయుడు పరమ భాగవతోత్తముడు భక్త పురందరదాసు

పూనాకు పదునైదుమైళ్ళ దూరానగల పురందరగడలో క్రీ॥శ॥ 15వ శతాబ్దములో ఇతడు జన్మించాడు ఇతనికి శ్రీనివాస నాయకుడని నామకరణం చేశారు తనతండ్రియైన వరదప్ప నాయకునివలె శ్రీనివాసుడు కూడా కన్నడ భాషలో మంచి ప్రవేశము కలవాడై వంశపారంపర్యముగ వచ్చుచున్న రత్నాలవ్యాపారము చేయుచు గొప్పగధనాన్ని సంపాదించాడు అతని భార్య సరస్వతీబాయి ఉత్తమభక్తులకోవకు చెందిన ఆదర్శమహిళ సుగుణశీల శ్రీనివాసుడు మహాలోభి ధనికుడైయున్నను మహాదరిద్రుడిలా జీవించాడు రోగంవస్తే ప్రకృతి వైద్యమేగాని పైసా ఖర్చుపెట్టిమందు తీసుకోడు ప్రాణాన్ని నిలుపుకోవడానికి అవసరమైన ఆహారమే తీసుకొనే వాడు ఆకాశాన నక్షత్రాలను లెక్కించవచ్చునేమోగాని అతనిలెక్కల చిను గులకు వేసిన అతుకులను లెక్కపెట్టలేము బిచ్చగాడిని పరమ శత్రువుగా భావించేవాడు గడ్డివామిపై కూర్చొని తాను గడ్డితిన పశువులను తిననివ్వక పెత్తనం సాగించే కుక్కవలె తను అనుభవించక ఇతరులకు సహాయము చేయక జీవితమును నిరర్ధకంగా సాగించేవాడు

ఒకనాడు పేదబ్రాహ్మణుడొకడు తన కుమారునికి ఉపనయనం చేయ దలచి శ్రీనివాసుని దగ్గరకువచ్చి ధనసహాయం చేయమని ప్రార్థిస్తాడు శ్రీని వాసుడు సరేనని రేపు-మాపుఅంటూ ఆరునెలలు తనచుట్టూ త్రిప్పుకుంటాడు

పేద బ్రాహ్మణుడు ఆశపడి ఆరునెలు తిరిగాడు కానీ వాయిదాలు పడుతున్నాయేగాని ప్రయోజనము కనుపించలేదు ఒకనాడు బ్రాహ్మణుడు వచ్చేసరికి శ్రీనివాసుడు ఇంటిలోలేడు ఈ బ్రాహ్మణుడు ఆరునెలుగా తన భర్తదగ్గరకు వచ్చి వెళ్ళడం గమనిస్తున్న సరస్వతీబాయి "అయ్యా! మీరెందుకిలా వస్తున్నారు? అని అడిగింది జరిగిన విషయమంతా సరస్వతికి చెబుతూ కనీసం తన కుమారునికి ఉపనయనం చేయలేని తన అసమర్థతకు బ్రాహ్మణుడు విలపించాడు ఆతని విషాదాన్ని చూసి సరస్వతీబాయి హృదయం ద్రవించింది వెంటనే లోనికివెళ్ళి తన ముక్కుపుడక తెచ్చి బ్రాహ్మణునికిచ్చి ఇకమీదట రావద్దని చెప్పింది

బ్రాహ్మణుడు ఇంటికివెళ్ళి తన కుమారుని పిలిచి ఆ పుడకను విక్రయించి రమ్మని చెబుతాడు విషయం తెలియని ఆ కుర్రవాడు శ్రీనివాసుని కొట్టుకెళ్ళి అమ్ముతాడు పుడకను చూడగానే అది తన భార్యదని గుర్తించాడు శ్రీనివాసుడు తాను ధర నిర్ణయించాలని తరువాత రమ్మని ఆ కుర్రవానిని పంపి పుడకను పెట్టెలోపెట్టి తాళంవేసి కొట్టు తలుపుకు తాళంవేసి సరాసరి ఇంటికి వస్తాడు

క్షణమైనా కొట్టును వదలిపెట్టని శ్రీనివాసుడు యిలా ఆకస్మికంగా రావడం సరస్వతికి ఆశ్చర్యంగానూ, అనూహ్యంగాను యుండి హృదయములో ఆందోళన ప్రారంభమైంది ఆమెను చూడగానే నీ ముక్కుపుడక ఏమైంది పెట్టుకోలేదేమి?" అన్నాడు "ఉన్నదండీ! స్నానం చేయాలని తీసి పూజగదిలో ఉంచాను" అని అనాలోచితంగా చెప్పింది వెంటనే తీసుకొనిరమ్మని గద్దించాడు శ్రీనివాసుడు సరస్వతి భయకంపితురాలై వెళ్ళింది తన భర్త స్వభావము తనకు బాగా తెలుసు ఇప్పుడు ముక్కుపుడక తెచ్చి ఇవ్వకుంటే తనను నిర్దాక్షిణ్యంగా హింసిస్తాడు భర్తను ఇలా బాధించినందుకు దుఃఖపడుతూ భరించలేని ఆవేదనతో ఆత్మహత్యేమేలని ఒక గిన్నెలో విషం కలుపుకుంటుంది పాండురంగా! ఆత్మహత్య మహాపాపమంటారు కానీ ఈక్షణంలో నాకు ఇంతకన్నా మార్గంలేదు క్షమించు అంటూ విషం త్రాగబోతుంది ఇంతలో ఆ గిన్నెలో తన ముక్కుపుడక కనిపి

స్తుంది మహాప్రసాదమని భావిస్తూ భగవంతుని కృపకు గురి అంకితయై ఆ పుడకను తెచ్చి భర్తకిస్తుంది

శ్రీనివాసుడు సంభ్రమాశ్చర్యాలతో దిక్కుతోచక ఆ ముక్కుపుడకను తీసుకొని కొట్టువద్దకు పరుగెత్తుకొని వెళ్తాడు తాను కొట్టుకొ ముక్కుపుడకనుంచి తాళంవేసి వచ్చాడు మరి అది ఇక్కడికెలా వచ్చింది? అని ఆలోచిస్తూవెళ్ళి కొట్టును చూశాడు వేసినతాళాలు వేసినట్లే ఉన్నాయి తలుపులు తెరచాడు పెట్టెకు వేసినతాళంకూడా వేసినట్లేవుంది పెట్టె తెరిచాడు కానీ అందులోవుంచిన పుడకలేదు ఏమిటీఆశ్చర్యం? పెట్టెలోపెట్టి తాళంవేసిన పుడకను తన భార్యకు అందించినవాడెవరు? అతడెవరయినా అన్నిచోట్ల వుండేవాడై యుండాలి అతనికే ఇదిసాధ్యం అతడెవరు? పాండురంగడే సర్వత్ర వ్యాపించియుండే దీనదయాళుడు భక్తవత్సలుడైన పాండురంగ భగవానుడు తన భార్యను ఉద్ధరించాడనే భావనరాగానే మనిషిలో మార్పువచ్చింది వెంటనే ఇంటికివచ్చి భార్యయైన సరస్వతీబాయిని గురువుగా భావించి సంబోధిస్తూ ఆమె పాదాలపైపడ్డాడు తను ఇక పాండురంగని దాసుడనని ప్రకటించాడు ఆ దినమే బ్రాహ్మణులను పేదలను పిలిపించి ఆస్తినంతా దానంచేశాడు కేవలము తంబూర చిఱుతలు పట్టుకొని సతీసమేతుడై పండరీపురం బయలుదేరాడు

శ్రీనివాసుడు సతీసమేతుడై ప్రక్కగ్రామానికి చేరాడు రాత్రయింది అక్కడ విశ్రమించారు స్వప్నంలో పాండురంగడు దర్శనమిచ్చాడు హాంపి నగరానికి వెళ్ళి అచ్చట వ్యాసరాయ గురుదేవులయొద్ద మంత్రదీక్షను స్వీకరించమని ఆజ్ఞాపిస్తాడు ఆ తరువాత పండరీపురం వచ్చినచో తన దర్శనం ప్రాప్తించుననని తెలియచేస్తాడు

శ్రీనివాసుడు హంపీనగరం చేరుతాడు వ్యాసరాయలవారిని దర్శిస్తాడు వారి పవిత్ర పాదాలపై పడి నమస్కరిస్తాడు గురుదేవా! అజ్ఞానాంధకారంలో గతాన్నంతా పాడుచేసుకొనిన అప్రయోజకుడను భగవంతుని విస్మరించి నిరంతరము బంగారును స్మరించిన వ్యర్థజీవిని భగవదనుగ్రహంతో నా భార్యద్వారా నాకు జ్ఞానోదయమైనది సమస్తమునూ త్యజించి

పాండురంగని అన్వేషిస్తూ బయలుదేరాము మీ పవిత్ర పాదాలను సేవించి ధన్యత చెందాలని వచ్చాను పాండురంగని సూచన మేరకు తమను గురువుగా స్వీకరించి తరించాలని వచ్చాను కనికరించండి అంటూ వ్యాసరాయలవారి పాదాలపై పడ్డాడు శ్రీనివాసుడు

శ్రీనివాసా! పక్వానికి వచ్చినంతవరకు కాయ చెట్టును అంటిపెట్టుకొనే ఉంటుంది పక్వానికి రాగానే పండుగామారి తినంతటదే తొడిమను వీడి క్రింద పడిపోతుంది భగవదనుగ్రహంతో నీ జీవన ఫలం పక్వానికొచ్చింది సంసారవృక్షానికి దూరమైపోయింది అంతా భగవానుని కరుణ. నీవు తప్పక తరిస్తావు అని ఆశీర్వదించారు వ్యాసరాయలవారు శ్రీనివాసునికి మంత్రదీక్ష నొసగి అనుగ్రహించారు దాససంప్రదాయములో శ్రీనివాసుని గ్రహించి అతనికి పురందరదాసని నామకరణం చేశారు నామసంకీర్తనతో బ్రతుకును పండించుకొని ముక్తిధామమలంకరించమని తెలియజేశారు

పురందరదాసు హంపినుండి తిరుపతి వచ్చారు వేంకటరమణుని దర్శించడానికి తిరుమల చేరారు గర్భాలయంలో ప్రవేశించగానే పురందరుని హృదయం పారవశ్యంతో విస్మృతి పొందింది నయనాల వెంబడి బాష్పాలు రాలుతున్నాయి వేంకటేశ్వరుని కనులారా గాంచాడు కానీ స్వామి దృష్టి తనపై ప్రసరించడంలేదనే సంశయం కలిగింది పురందరునికి స్వామీ ముఖకమలముపై తీర్చిదిద్దిన నామాలు స్వామి నేత్రాలను మూసి ఉన్నాయి పురందరుని హృదయంలో విషాదం నిండుకుంది స్వామీ నీ కృపాదృష్టి నాపై ప్రసరించకపోవడానికి కారణమేమి? ఈ పాపాత్ముని వీక్షించుటకు మీకు అయిష్టంగా వుందా ప్రభూ! నిజమే బ్రతుకుకు ఒక లక్ష్యమంటూ లేక అన్యాయం చేసుకున్నాను అర్థవుండికూడా దీనజనులను ఆదుకోలేని అసమర్థుడను నాలాంటి దుర్మార్గుడు నీ సన్నిధానానికి వస్తేమాత్రము నీ కృపావీక్షణాలు మాపై ప్రసరిస్తాయా! అని దుఃఖావేశములో నేత్రాలు మూసాడు

నేత్రాలు మూయగానే పురందరుని మనోగగనంలో కోటిసూర్యసమ ప్రభావంతో బాలాజీ ఉదయించి దర్శనమిచ్చాడు కౌస్తుభమణి హారా

లతో శంఖచక్రగదా పద్మాలను హస్తమునందిడుకొని మందహాసముతో లక్ష్మీసమేతుడై దర్శనమిచ్చాడు తిరుమలేశుడు అంతవరకు పురందరుని మనోగగనంలో వ్యాపించియున్న విషాదపికట్లు చెల్లాచెదరయ్యాయి ఆనందపు వెలుగులు ప్రసరించాయి వికాసకిరణాలు విరజిమ్మబడ్డాయి

అభయహస్తమును చూపి ఆశీర్వదించాడు లక్ష్మీపతి పురందరుడు కళ్ళుతెరచి చూశాడు తన హృదయంలో దర్శనమొసంగిన వేంకటరమణుడు విగ్రహంలా కనపించాడు పురందరుని అంతఃకరణ అవగాహనతో నిండిపోయింది "భగవాన్ సత్యాన్ని గ్రహించాను నీ నేత్రాలను నామాలుకప్పి ఉంచడములోని అంతర్యాన్ని గ్రహించాను దృష్టిని బహిర్ముఖంగా వస్తుప్రపంచముపై సారించడమువలన ఉపయోగములేదనియు అంతరంగిక దృష్టిలో ఆత్మానుభూతినిపొంది తరించుటయే కర్తవ్యమనియు గ్రహించాను అంతర్యమునో అనుభూతిపొందిన ఎమ్మట బాహ్యమంతా బ్రహ్మమయంగానే గోచరిస్తుందనే సందేశాన్ని భగవాన్ నీవు ప్రవచించకనే ప్రదర్శిస్తున్నావు" అని వేంకటాచలపతి అనంత గుణములను కీర్తించాడు

ఆలయమునుండి బయటకు వస్తున్న పురందరుని ఒక ధనవంతుడు చూశాడు పురందరుని ముఖంలో అతనికి వేంకటరమణుడు కనుపించాడు భక్తిపారవశ్యంతో పురందరుని పాదాలపై పడ్డాడు జేబులోనుంచి కొంత ధనం తీసిఇస్తూ ఆ పైకమును స్వంత ఖర్చులకు ఉపయోగించుకోమని అవసరమైతే ఇంకా ఇవ్వగలనని చెబుతాడు పురందరుడు నవ్వి ధనం ఆవసరం నా జీవితములో దూరమైంది ధనధాన్యాలమధ్య చితికిపోయిన బ్రతుకు వాటిని త్యజించి ఈనాడు సంతృప్తిచెందినది పండరీనాథుని పవిత్ర పాదాలకు నేను సంపూర్ణ శరణాగతుడనయ్యాను నా అవసరాలన్నీ పాండురంగడే తీరుస్తాడు ఈ ప్రపంచ ఎండమావిలో అమృతజలంకొరకు అన్వేషించే అలవాటు నాలో అదృశ్యమైంది మీ ప్రేమకు చాలా సంతోషము నాకు ధనము వద్దు మీకు నాపై అంత ప్రేమ యున్నచో నిత్యము కొంతసేపు భగవన్నామ సంకీర్తన చేయండి మీరు అలా చేయగలిగినచో నాకు సంతృప్తి కలుగుతుంది మీకు సద్గతిప్రాప్తిస్తుంది" అని బోధిస్తాడు

పురందరుని ప్రబోధమునకు ఆశ్చర్యముచెందిన ఆ ధనికుడు మహాత్మా! మిమ్మల్ని చూడగానే మీరు దైవాంశసంభూతులని నా మనసు ఊహించింది ఇప్పుడు మీరిచ్చిన సందేశముతో మీరు సాక్షాత్తు దైవమే నన్న దృఢసంకల్పం ఏర్పడింది ఈ దీనుని కరుణించండి ఈ ధనము మీకు అవసరం లేకపోయినా మీ సాన్నిధ్యంలో పేదలకు సాధువులకు అన్నసంతర్పణ చేయుటకు నాకు అనుజ్ఞ ఇవ్వండి ఈ విధంగా నా ధనానికి సార్థక్యం ఏర్పడుతుంది దీననారాయణ సేవను మీ చేతిమీదుగా జరిపించండి అని ప్రార్థిస్తాడు

ధనికుని భక్తిపూర్వక విన్నపమును ఆలకించి పురందరుడు సమ్మతిని తెలియచేస్తాడు అన్నసంతర్పణకు ఏర్పాట్లు జరుగుతున్నాయి అప్పన్న అనే భక్తుడు పురందరదాసుకు సహకరిస్తుంటాడు షడ్రసోపేతముగా ఆహార పదార్థములు తయారు చేయబడ్డాయి సాధువులు పేదలు అన్న సంతర్పణలో పాల్గొన్నారు అందరిలో పాండురంగని దర్శిస్తూ చేతులెత్తి నమస్కరిస్తూ పురందరుడు వారిని ఆహ్వానిస్తున్నాడు అందరూ ఆసీనుల య్యారు వడ్డన ప్రారంభముకానున్నది ఆసీనులైన భక్తులంతా హరేరామ నామజపం చేస్తున్నారు పురందరుడు భోజన పత్రములపై నేతిని వడ్డించమని అప్పన్నను కేకవేశాడు అప్పన్నవచ్చి నేయి వడ్డించాడు అందరికి పదార్థాలన్నీ తృప్తిగా వడ్డించారు భక్తులంతా తృప్తిగా భుజించి ఆనంద పడ్డారు సంతర్పణ ఏర్పాటుచేసిన ధనికుడు అమితానందం చెందాడు

పురందరుడు సత్రము వీధి గుమ్మముపై పు నడుస్తుండగా అప్పుడే స్నానంచేసి వస్తున్న అప్పన్న కనుపించాడు

అప్పన్నా ఎక్కడనుండి వస్తున్నావు?' అన్నాడు పురందరుడు

"పుష్కరిణిలో స్నానమాచరించి వస్తున్నాను అని అప్పన్న సమాధానం చెప్పాడు

స్నానమాచరించకనే ఘృతాన్ని వడ్డించావా? అని పురందరుడు క్రోధోద్రిక్తుడయ్యాడు

"మహాత్మా! నేను నేయి వడ్డించడమేమిటి? నేను గంటముందు స్నానానికి పుష్కరిణికి వెళ్ళాను వడ్డన ప్రారంభమైనదేమోనని ఆందోళనతో తొందరగా వస్తున్నాను అని అప్పన్న బదులు చెప్పాడు

పురందరుడు లోనికివెళ్ళి చూశాడు. వడ్డిస్తున్న అప్పన్న అక్కడ కనుపించలేదు పురందరుని హృదయం ద్రవించింది శరీరం కంపించి పోయింది నేత్రములవెంట ఆనందబాష్పాలు రాలుతున్నాయి హే ఏడు కొండలవాడా! వేంకటాచలపతీ! వైష్ణవ అన్న సంతర్పణలో సాక్షాత్తు వైకుంఠవాసుడవైన నీవే వచ్చి వడ్డన ప్రారంభించావా తండ్రీ! భక్తులపై నీ కరుణ వర్ణించను సాధ్యంకాదు అంటూ పులకాంకితుడయ్యాడు పురందరుడు.

అనుభవామృతమును గ్రోలుతూ పురందరుడు తిరుపతినుండి ఎయలు దేరి చెన్నకేశవస్వామి దర్శనానికై బేలూరు చేరాడు స్నానానంతరం చెన్నకేశవస్వామి ఆలయంలోకి ప్రవేశించాడు చెన్నకేశవ స్వామిని దర్శించాడు పురందరుని దృష్టికి స్వామి బాలకృష్ణుడు విలపిస్తున్నట్లుగా దర్శనమిచ్చాడు స్వామి ఏడుస్తూవుంటే పురందరుని హృదయము కరిగింది మాతృవాత్సల్యం ఏర్పడింది ఆవాత్సల్యానుభూతిలో తాను యశోదయైనట్లు భావన ఏర్పడింది వేంటనే స్వామిని ఓదార్చుతూ ఒకకీర్తన గానం చేశాడు స్వామివిలపించుటకుగల కారణములను ప్రశ్నిస్తూ సుశ్రావ్యంగా కీర్తించాడు. ఇప్పటికి కూడాను కర్ణాటక దేశములో పిల్లలు ఏడ్చినపుడు తల్లులు ఈకీర్తనను పాడుతుంటారు

అలువ ధ్యాతా కోరంగ! నీన త్తి శే అంజిపగుమ్మా
హరి దేలె దినదల్లి మత్త రక్కసియ కొన్దె
ముట్టి మోలెయ హాల నుండ కారణాం దింద
దృష్టి తాగితె నినగె రంగయ్య ॥అలు॥
తురువ కాయలు పోగి బీరుదిన మలె సురియె
బెరలోలు బెట్టవ నేగపిందా కారణా
బెరలులు కితె నినగె రంగయ్య ॥అలు॥

శరణు వేలాపురద చెలువ చెన్నిగరాయా
శరణు సలహువ దొరె నీ నల్లవె
గురూ పురందర విఠలా – రంగయ్యా ॥అలు॥

కన్నయ్యా ఎందుకు అనవసరంగా ఏడుస్తున్నావు? ఏం జరిగిందని? ఏడుపు ఆపకుంటే గ్రుడ్లగూబను పిలుస్తాను కృష్ణా! నీవు బాలుడుగా వున్నప్పుడు పూతన అనే రాక్షసి నీకు పాలివ్వడానికి వచ్చింది నీదివ్యమహిమచే ఆ పూతన ప్రాణాలే హరించావు అది చూసి నిన్నవరైనా దిష్టి పెట్టారేమో? నీదుఃఖానికి కారణమిదేనా కన్నయ్యా!

గోవులను కాచుటకు నీవు వెళ్ళినపుడు భయంకరముగా వర్షము పడింది నీఅనంత బలపరాకమముతో గోవర్ధన పర్వతమును చిటికిన వ్రేలితో ఎత్తి గోకులాన్ని రక్షించావు ఆపర్వతాన్ని ఎత్తుట వలన నీవ్రేలుకు నొప్పి కలిగినదా? అందుకు ఏడుస్తున్నావా కన్నయ్యా?

ఓ పాండురంగా భక్తజనరక్షకా నీఏడుపునాపి దర్శనమిమ్ము నీ దర్శనముద్వారా మా ఏడుపును రూపుమాపుము

అని పురందరుడు ప్రార్థించగా స్వామి ఏడుపుమాని మందహాసముతో పురందరదాసుని ఆశీర్వదించారు

బేలూరునుండి పండరీపురము బయలుదేరాడు పురందరదాసు పవిత్ర చంద్రభాగనదిలో స్నానమాచరించి పాండురంగని దర్శించాడు పాండురంగ దర్శనముతో పురందరుడు పూర్ణపురుషుడయ్యాడు ఆప్తకాముడుగా మారాడు నిరంతరము స్వామి దర్శనంతో సంకీర్తనతో తృప్తి చెందుతూ పండరీపురంలోనే స్థిరపడిపోయాడు పురందరుడు పండరీపురము వదలి వెళ్ళలేని అసమర్థత అతనిలో బాగావ్యాపించింది పాండురంగనికి దూరమై జీవించలేని అశక్తత తనలో చోటుచేసుకున్నది.

పురందరునికి ఎనభై సంవత్సరములు నిండాయి శరీరము అశక్తతకు నిలయమైంది బ్రహ్మముహూర్తంలో చంద్రభాగాకు వెళ్ళి స్నాన

మాచరించె శక్తి సన్నగిల్లింది తనతోబాటు జీవించె అప్పన్న ప్రతిరోజు వేకువజామున బ్రహ్మముహూర్తంలో నీళ్ళుతెచ్చిపెట్టి పురందరునికి స్నానానికి ఎద్దం చేసేవాడు స్నానానంతరము ఆలయానికి వెళ్ళి పాండురంగని సుప్రభాత సేవలో పాల్గొనెవాడు పురంద దాసు

ఒకనాడు అప్పన్న అలసి నిద్రపోయాడు పురందరునికి స్నానానికి నీళ్ళు తీసుకొనిరావెదు సుప్రభాత దర్శనం లభించదేమోనని పురందరుడు ఆందోళనచెందసాగాడు చివరకు పాండురంగడే అప్పన్నరూపంలో నీళ్ళు తెచ్చి ధించాడు ఆలస్యంగా నీళ్ళుతెచ్చినందుకు పురందరుడు కోపగించి అప్పన్నను శిరముపై కొట్టాడు తొందరగా స్నానమాచరించి ఆలయానికి వెళ్తున్నాడు దారిలో నీళ్ళుతీసుకొని అప్పన్న వస్తున్నాడు గురుదేవా! చందనతిరుచూర్ణాదులు ధరించి ఎయుదేరారు స్వామి దర్శనానికని భావిస్తున్నాను స్నానం చేయకనే వెళ్తున్నారా? ఈ దినము కాస్త ఆలస్యముగా నిద్రలేచాను అందుచేత నీళ్ళుతిసుకొని రావడము ఆలస్యమైనది క్షమించవలెంది అంటాడు అప్పన్న

పురందరుడు నిర్ఘాంతపోయాడు "అదేమిటి అప్పన్నా! నీవు నీళ్ళు తెచ్చిపెట్టావుగా నీవుతెచ్చిన నీళ్ళతోనే నేను స్నానమాచరించాను పైగా ఆలస్యముగా తెచ్చావని నీ శరీరంపై దెబ్బ వేశానుకూడా అన్నాడు పురందరుడు

"స్వామీ! క్షమించండి ఈరోజు ఇదే నాకు మీ ప్రధమ దర్శనము నేను నిద్రలేచి చంద్రభాగాకు వెళ్ళి సాన్నమాచరించి మీకు నీళ్ళు తెస్తున్నాను ఇంతకుముందే నేను నీళ్ళు తెచ్చిపెట్టానని మీరనుట నాకు ఆశ్చర్యముగా నున్నది" అన్నాడు అప్పన్న

పురందరునికి విషయము అవగతమైంది హే పాండురంగ ఈ ముదుసలి భక్తునికి స్నానానికి నీళ్ళుకూడా తెచ్చిపెట్టావా తండ్రీ! అనాడు తిరుపతిలో అప్పన్న రూపంలో అరుదెంచి అన్న సంతర్పణలో ఘృతం వడ్డించావు ఈనాడు అప్పన్న రూపంలోనే ఇక్కడికి ఏతెంచి స్నానానికి

సిద్ధంచేశావు పైగా నాచేతి దెబ్బలుకూడా తిన్నావాతండ్రీ అని పశ్చాత్తాపముతో కుమిలిపోతూ ఆలయంపైపుకు నడిచాడు పురందరుడు

సుప్రభాత దర్శనం లభించింది కాని అక్కడొక వింతదృశ్యము కన్పించింది పాండురంగని శిరముపై వాపుఏర్పడి యున్నది స్వామి శిరస్సు అలా వాయడానికి కారణమేమిటా అని భక్తులంతా మాట్లాడుకొనుచున్నారు పురందరునికి విషయం అర్థమైంది "హే విఠలా ! తెలియకచేసిన నేరానికి నన్ను దోషిగా నిలబెడుతున్నావా! అప్పన్న అనే భావముతో నేను కొట్టాను అప్పన్నరూపంలో వచ్చింది నీవేనని తరువాత తెలిసింది క్షమాపణ కోరడానికి నీ సన్నిధికి వచ్చాను నీవు ప్రత్యక్ష సాక్ష్యంగా ఇక్కడనిలబడి నా అపచారాన్ని భక్తులకంతా తెలియచేస్తున్నావు అంతటా నిండియున్న నీకు నే కొట్టినదెబ్బ అంతవాపును కల్గించిందా? కాదు నన్ను దోషిగా నిలబెట్టడానికి నీవలా నటిస్తున్నావు ఈ దీనుడిపై అంతకినుక ఎందుకు ప్రభూ! నీ చరణాల నాశ్రయించినవాడను క్షమించి కనికరించివా తండ్రీ అని పురందరుడు ప్రార్థనచేయగానే పాండురంగని శిరముపైనున్నవాపు అదృశ్యమైంది మందహాసంతో పండరీనాథుడు దర్శనమిచ్చాడు

పురందరుడు తన శేషజీవితాన్ని పాండురంగని పాదాలచెంతనే గడిపాడు నిత్యము చంద్రభాగా పవిత్రజలంలో స్నానమాచరిస్తూ విఠలనాథుని దర్శిస్తూ కీర్తనలు గానంచేస్తూ చివరికి పాండురంగనితో ఐక్యమయ్యాడు

పురందరుని హృదయం చాల విశాలమైంది అతనిది సంకుచిత దృష్టికాదు అతని దృష్టి ప్రపంచ వలయమూలలకు ప్రాకగలదు అతనికి కులమత భేదప్రసక్తియే లేదు అతని ప్రేమాలింగనములో ప్రపంచమంతా ఇమిడిపోతుంది అతడు కీర్తనలద్వారా భక్తిని ఎంతగానో ప్రచారము చేశాడు పురందరుడు నాలుగు లక్షల డెబ్బదిఐదువేల కృతులు వివిధరాగాలలో రచించాడు దాసరేందర దాసర పురందర దాసర" అను సామెత కర్ణాటకదేశములో బాగా వ్యాపించింది. పురందరదాసుడొక్కడే దాసుడుగానీ ఇతరులు దాసులుకారని దాని అర్థం

భగవంతుని దర్శించేందుకు గ్రంథాలు ఎల్లవేయనక్కరలేదని శుష్క పాండిత్యంతో భగవంతునిపొందుట కష్టమని తీర్థక్షేత్రాలు తిరిగి తిరిగి అలసిపోనక్కరలేదని తెలిపాడు అంతఃకరణశుద్ధి హృదయముకో భగవత్ప్రేమ నచ్ఛీలము చాలునని చాటాడు

భక్తుల చరిత్రలో పురందరదాసునికి ఒక విశిష్ట స్థానముంది భక్త ప్రపంచములో పురందరదాసు అమరజ్యోతి అందుచేతనే త్యాగరాజస్వామి వంటి భక్తుడుకూడా ప్రహ్లాద భక్తవిజయంలో పురందరునిగూర్చి ఇలా వ్రాశాడు

దురితము లెల్లను పరిమార్చెడి
హరిగుణముల బాడుచు నెపుడున్
పరవశుడై వెలయు పురం
దరదాసుని మహిమలను తలచెద మదిలోన్

• ఓం శ్రీ హృషీకేశాయ నమః •



సేశ్ళు సిద్ధంచేశావు పైగా నాచేతి దెబ్బలుకూడా తిన్నావాతండ్రీ అని పశ్చాత్తాపముతో కుమిలిపోతూ ఆలయంపైపుకు నడిచాడు పురందరుడు

సుప్రభాత దర్శనం లభించింది కాని అక్కడొక వింతదృశ్యము కన్పించింది పాండురంగని శిరముపై వాపుఏర్పడి యున్నది స్వామి శిరస్సు అలా వాయడానికి కారణమేమిటా అని భక్తులంతా మాట్లాడుకొనుచున్నారు పురందరునికి విషయం అర్ధమైంది "హే విఠలా ! తెలియకచేసిన నేరానికి నన్ను దోషిగా నిలబెడుతున్నావా! అప్పన్న అనే భావముతో నేను కొట్టాను అప్పన్నరూపంలో వచ్చింది నీవేనని తరువాత తెలిసింది క్షమాపణ కోరడానికి నీ సన్నిధికి వచ్చాను నీవు ప్రత్యక్ష సాక్ష్యంగా ఇక్కడనిలబడి నా అపచారాన్ని భక్తులకంతా తెలియచేస్తున్నావు అంతటా నిండియున్న నీకు నే కొట్టినదెబ్బ అంతవాపును కల్గించిందా? కాదు నన్ను దోషిగా నిలబెట్టడానికి నీవలా నటిస్తున్నావు ఈ దీనుడిపై అంతకినుక ఎందుకు ప్రభూ! నీ చరణాల నాశ్రయించినవాడను క్షమించి కనికరించవా తండ్రీ అని పురందరుడు ప్రార్ధనచేయగానే పాండురంగని శిరముపైనున్నవాపు అదృశ్యమైంది మందహాసంతో పండరీనాధుడు దర్శనమిచ్చాడు

పురందరుడు తన శేషజీవితాన్ని పాండురంగని పాదాలచెంతనే గడిపాడు నిత్యము చంద్రభాగా పవిత్రజలంలో స్నానమాచరిస్తూ విఠలనాధుని దర్శిస్తూ కీర్తనలు గానంచేస్తూ చివరికి పాండురంగనితో ఐక్యమయ్యాడు

పురందరుని హృదయం చాల విశాలమైంది అతనిది సంకుచిత దృష్టికాదు అతని దృష్టి ప్రపంచ వలయమూలలకు ప్రాకగలదు అతనికి కులమత భేదప్రసక్తియే లేదు అతని ప్రేమాలింగనములో ప్రపంచమంతా ఇమిడిపోతుంది అతడు కీర్తనలద్వారా భక్తిని ఎంతగానో ప్రచారము చేశాడు పురందరుడు నాలుగు లక్షల డెబ్బదిఐదువేల కృతులు వివిధరాగాలలో రచించాడు దాసరేందర దాసర పురందర దాసర" అను సామెత కర్ణాటకదేశములో బాగా వ్యాపించింది. పురందరదాసుడొక్కడే దాసుడుగానీ ఇతరులు దాసులుకారని దాని అర్థం

తననే గతిగా భావించి సంపూర్ణ శరణాగతులైన గోపబాలురను ఉద్ధ రించుటకై గోవర్ధన పర్వతమునెత్తి కాపాడిన అపార కృపారసము కాళి యుని మదమణచి తోటి గోపాలురతోపాటు పశువులకు సైతం భయభ్రాం తులను దూరంచేసిన అనంత ప్రేమస్వరూపం ఎడికెడుఅటుకులు గ్రహించి కుచేలునకు స్వర్గ సౌఖ్యము లనుగ్రహించిన దయాపూరిత అనురాగము పచ్చికాయలను పక్వానికిరాని ఫలములను భుజించి శబరికి మోక్షమును ప్రసాదించిన భక్త వాత్సల్యము రామదాసుని భాగవత హృదయమునకు తల్లడిల్లి తానీషాకు ప్రత్యక్షమై అచం దార్కం భక్త రామదాసుని దివ్య చరితము శోభిల్లునట్లు ఆశీర్వదించిన ఆశ్రితజన రక్షణము భక్తజన చరిత్ర పుటలలో అనుక్షణము ప్రతిబింబిస్తూ భక్తుల మానసములను ఉత్తేజపరుస్తూ హృదయములను శాంతింపజేస్తూ ఐహిక భోగలాలసత్వమునకు దూరులై నిరంతర భగవత్ చింతనామృత పానముచేస్తూ జీవించునట్లు తమ త్యాగ మయ జీవితములద్వారా ఇతరులకు ఆదర్శప్రాయమై వెలుగునట్లు దీవించి కాపాడుచున్నవి

పరమ పవిత్రమైన అట్టి భక్త కోటిలో పాండురంగని పాదదాసు డైన భక్త దామాజీపంత్ ఒక ఆదర్శజీవి

బీదరు నవాబు కొలువులో ఉన్నత స్థానము నలంకరించి మంగళ వేధా అను గ్రామములో నివసిస్తూ ఆ మండలములో శిస్తు వసూలుచేయు తానేదారుగా ఉండేవారు శ్రీ దామాజీపంత్ ఆయన భార్య సావిత్రిబాయి భక్తి ప్రపత్తులలో అతిథి అభ్యాగతాదరణతో భర్తకు ఏ మాత్రము తీసి పోని ఉత్తమురాలు పాండురంగని పాదసేవయే ప్రధానముగ భావించి నిరంతరము విఠల నామోచ్చారణతో మైమరచి జీవించే పుణ్యదంప తులు రేపు అనే దృష్టి లేక ఎప్పటికప్పుడు తమకు సరిపోగా మిగిలిన ధాన్యమును ధనమును పేదలకు దానంచేస్తూ నిశ్చింతగా ప్రశాంత జీవన మును కొనసాగిస్తూ అనుష్ఠాన భాగవతులై భక్తజన హృదయ మందిరా లలో సముచిత స్థానాన్ని అలంకరించారు

కాలం ఎప్పుడూ ఒకే రీతిగా ఉండదు కాలరూప ప్రవాహములో ఎన్నో సుడిగుండాలు తలెత్తుతూ ఉంటాయి అంతవరకు ప్రశాంతముగ

సిళ్ళు సిద్ధంచేశావు పైగా నాచేతి దెబ్బలుకూడా తిన్నావాతండ్రీ అని పశ్చాత్తాపముతో కుమిలిపోతూ ఆలయంవైపుకు నడిచాడు పురందరుడు

సుప్రభాత దర్శనం లభించింది కాని అక్కడొక వింతదృశ్యము కన్పించింది పాండురంగని శిరముపై వాపుఏర్పడి యున్నది స్వామి శిరస్సు అలా వాయడానికి కారణమేమిటా అని భక్తులంతా మాట్లాడుకొనుచున్నారు పురందరునికి విషయం అర్థమైంది "హే విఠలా ! తెలియకచేసిన నేరానికి నన్ను దోషిగా నిలబెడుతున్నావా! అప్పన్న అనే భావముతో నేను కొట్టాను అప్పన్నరూపంలో వచ్చింది నీవేనని తరువాత తెలిసింది క్షమాపణ కోరడానికి నీ సన్నిధికి వచ్చాను నీవు ప్రత్యక్ష సాక్ష్యంగా ఇక్కడనిలబడి నా అపచారాన్ని భక్తులకంతా తెలియచేస్తున్నావు అంతటా నిండియున్న నీకు నే కొట్టినదెబ్బ అంతవాపును కల్గించిందా? కాదు నన్ను దోషిగా నిలబెట్టడానికి నీవలా నటిస్తున్నావు ఈ దీనుడిపై అంతకినుక ఎందుకు ప్రభూ! నీ చరణాల నాశ్రయించినవాడను క్షమించి కనికరించివా తండ్రీ అని పురందరుడు ప్రార్థనచేయగానే పాండురంగని శిరముపై నున్నవాపు అదృశ్యమైంది మందహాసంతో పండరీనాథుడు దర్శనమిచ్చాడు

పురందరుడు తన శేషజీవితాన్ని పాండురంగని పాదాలచెంతనే గడిపాడు నిత్యము చంద్రభాగా పవిత్రజలంలో స్నానమాచరిస్తూ విఠలనాథుని దర్శిస్తూ కీర్తనలు గానంచేస్తూ చివరికి పాండురంగనితో ఐక్యమయ్యాడు

పురందరుని హృదయం చాల విశాలమైంది అతనిది సంకుచిత దృష్టికాదు అతని దృష్టి ప్రపంచ వలయమూలలకు ప్రాకగలదు అతనికి కులమత భేదప్రసక్తియే లేదు అతని ప్రేమాలింగనములో ప్రపంచమంతా ఇమిడిపోతుంది అతడు కీర్తనలద్వారా భక్తిని ఎంతగానో ప్రచారము చేశాడు పురందరుడు నాలుగు లక్షల డెబ్బదిఐదువేల కృతులు వివిధరాగాలలో రచించాడు "దాసరేందర దాసర పురందర దాసరు" అను సామెత కర్ణాటకదేశములో బాగా వ్యాపించింది. పురందరదాసుడొక్కడే దాసుడుగానీ ఇతరులు దాసులుకారని దాని అర్థం

ప్రాప్తించడమువలన ముగ్గురు బిడ్డలను పోగొట్టుకొనిన దరదృష్టవంతు తను మిగిలిన భార్య ఇద్దరు బిడ్డలకు ఆహారమందించలేక పొట్ట చేతపట్టు కొని స్వార్థపరుడైన నా సౌఖ్యమును ముఖ్యముగా భావించుకొని మీ గ్రామానికి చేరాను మీరు దయతో నన్నాదరించి కరుణించారు ఆతిథ్యము నొసంగి కాపాడారు కానీ భార్యాబిడ్డలు ఆహారానికి అలమటిస్తూ కాటికి ప్రయాణము చేయ సిద్ధమవుతుంటే నా ఒక్క ప్రాణాన్ని రక్షించుకొనుటకు ఈ పంచభక్ష్య పరమాన్నమును స్వార్థంతో భుజించలేక చింతిస్తున్నాను అని చెప్పగానే దామాజీ భాగవత హృదయము ద్రవిస్తుంది వెంటనే "అయ్యా ! మీరు బాధపడనవసరములేదు మీ కుటుంబమునకు కావలసిన ఆహార ధాన్యములను నేను సమకూర్చగలను మీరు మా గృహములో భుజించి మమ్ములను పావనమొనర్చండి వెంటనే మీకు కావలసిన ధాన్యా దులతో మీ గ్రామమునకు చేరు ఏర్పాట్లు నేను గావించెదను" అని అప్ర యత్నంగా పలికారు దామాజీ

దామాజీ ఇచ్చిన వాగ్దానమునకు ఆ బ్రాహ్మణుడు తృప్తి చెంది ఆనందముతో ఆతిథ్యాన్ని స్వీకరిస్తారు అతిథి నారాయణ స్వరూపమని భావించే భక్త దామాజీ భోజనానంతరము ఆ బ్రాహ్మణునకు కావలసిన ధాన్యమును బండిలో వేయించి అతిథికి నమస్కరించి సంతోషముగా వెళ్ళి రమ్మని ప్రార్థిస్తాడు దామాజీ చూపిన ప్రేమాభిమానాలకు ఆతిథ్య సత్కా రానికి అచ్చెరువంది దయాస్వరూపుడైన పాండురంగడు దామాజీ దంపతు లను చల్లగా కాపాడగలడని హృదయములో భావిస్తూ ఆ బ్రాహ్మణుడు నడక సాగిస్తాడు కదులుతున్న ఆ బ్రాహ్మణునిలో పాండురంగని దివ్య రూపమును గాంచి దామాజీ తన్మయత్వముతో పులకాంకితుడవుతాడు

పాండురంగని దివ్యనామమును ఉచ్చరిస్తూ దామాజీ పంపిన ధాన్యపు బండితో ఆ పేద బ్రాహ్మణుడు పండరీపురంచేరి తన గృహాన్ని సమీపి స్తూంటాడు ఈ భయంకర క్షామపరిస్థితులలో ఇంత ధాన్యము బ్రాహ్మణుని కెలా సంభవించినదో తెలుసుకొనుటకు ప్రజలంతా గుమిగూడారు ప్రశ్నిం

వారు ఆ బ్రాహ్మణుడు దామాజీ త్యాగమయ జీవితాన్ని కొనియాడుతూ జరిగిన వృత్తాంతమంతా తెలియచేస్తాడు

బ్రాహ్మణునిద్వారా దామాజీ సేవానిరతిని గ్రహించిన ప్రజలు అంత కన్నా తమ ఆకలిని నివారించుకొనుటకు మరో మార్గ లేదని అందరూ ఒక్కసారిగా బయలుదేరి మంగళవేఢా చేరుతారు దామాజీని దర్శిస్తారు తమకు వచ్చిన ఇక్కట్లన్నీ వివరిస్తారు ఆకలి ఆక్రందనను వినిపిస్తారు తమ బ్రతుకులను రక్షించమని ప్రాధేయపడతారు

దీనజనుల ఆర్తనాదాలు విన్న దామాజీ పుణ్యదంపతులు భరింపలేని ఆవేదనతో కన్నీళ్ళు పెట్టుకుంటారు ఆకలితో అలమటిస్తున్న ఆ ప్రజలలో వారికి పండరీనాథుడే కనిపిస్తున్నాడు వెంటనే వారి ఆకలి రూపుమాపి వారి ముఖప్రమిదులలో ఆనందజ్యోతులు వెలిగించాలని ఉత్సాహపడుతారు తన ఆధీనములోనున్న రాజధాన్యాగారమును తెరచి ఎవరెవరికి ఎంత అవసరమో అంత ధాన్యమును తీసుకొమ్మని దామాజీ ప్రార్థిస్తారు ఆకలితో అల్లాడిపోతున్న ప్రజాసమూహము ధాన్యాన్నంతా తరలిస్తుంటే దామాజీ దంపతులు రెండు చేతులు జోడించి నమస్కరిస్తూ భగవన్నామామృతాన్ని తనివితీరా గ్రోలుతారు

ధాన్యాగారమంతా ఖాళీ అయిపోయింది దామాజీ దాతృత్వం శిఖరాన్నందుకొంది దామాజీవద్ద కృష్ణముజుందార్ అనే కన్నడ బ్రాహ్మణుడు సహాయ తానేదారుగా పనిచేస్తుండేవాడు కర్కశహృదయుడైన కృష్ణముజుందార్ దామాజీ గొప్పతనమునకు ఆతనికి బీదర్ నవాబ్ బాద్‌షావద్ద ఉన్న గౌరవానికి ఈర్ష్యపడేవాడు దామాజీపై పగసాధించడానికి కారణము అన్వేషిస్తున్న ముంజుదార్‌కు ఈ ధాన్యపంపక వృత్తాంతము చక్కటి ఇతివృత్తంగా దొరికింది ఆలస్యం చేయకుండా బీదర్ నవాబ్ బాద్‌షాకు ఈ విషయం తెలియచేయాలని అభిలాషపడ్డాడు ప్రభుత్వ ధాన్యాగారమంతను దామాజీ ధ్వసంచేసి ప్రజలకు పంచిపెట్టాడని శిక్షార్హుడైన దామాజీపై నేర విచారణ జరిపించవలసినదిగా విజ్ఞప్తిచేస్తాడు

దామాజీ అనుసరించిన తీరు న్యాయసమ్మతం కాదని అదే నిజమైన యెడల దామాజీకి మరణశిక్ష విధించబడుతుందని బీదర్ నవాబు నిర్ణయించి దామాజీని బంధించి తీసుకొనిరమ్మని రాజభటులను ఆజ్ఞాపిస్తాడు రాజభటులు మంగళవేధా చేరుతారు పరిస్థితినంతా దామాజీకి ఎరుక పరుస్తారు సావిత్రిబాయి దుఃఖపూరితవదనంతో భర్తను సమీపించి అశ్రుపూరిత నయనాలతో చూస్తుంది భార్యయొక్క విషాదమునుచూచి చిరునవ్వుతో దామాజీ ఓదార్చుతూ పిచ్చిదానా! దీనికే ఇంతగా దుఃఖించాలా ? మనం మంచి అనుకొన్నదే చేశాం దుఃఖజనుల బాధలను నివృత్తి చేయడమే ప్రథమ కర్తవ్యంగా భావించాము వారికి సహాయము చేయడమే పాండురంగని సేవాగా తలచాము లౌకిక చట్టాలకు పారమార్థిక ప్రవర్తనకు తేడా ఇప్పుడు తెలుసుకున్నాం రాజాంగ్య పరిధిలో ఆలోచించినపుడు నేను చేసింది తప్పే అందులకు నవాబ్ విధించిన శిక్షకు నేను అర్హుడను మరణిస్తున్నామనే ఆవేదన నాలోలేదు పదుగురికి సేవ చేయగలిగామనే సంతృప్తి హృదయాన్నంతా ఆవరించింది నా తండ్రీ అయిన పండరీనాథుడు నన్ను శాశ్వతంగా తన పాదసన్నిధికి చేర్చుకుంటున్నాడు నా సర్వస్వమయిన పాండురంగడు నాకు ముక్తిధామాన్ని ప్రసాదిస్తున్నాడు సావిత్రీ భక్తులు నడచిన బాటలో భాగవతులనుసరించిన మార్గంలో నడచి నీవూ నీ జీవితాన్ని చరితార్థం చేసుకో " అని చివరి సందేశాన్నిచ్చి భటులుముందు నడుస్తుండగా దామాజీ వారి ననుసరిస్తారు "భక్త దామాజీ అమరజీవి సంత్ దామాజీ చిరంజీవి అనే నినాదాలతో భక్తులు కన్నీళ్ళు కారుస్తూ సాగనంపుతారు

గ్రామ పొలిమేరలు దాటగానే తనను పండరీపురం మీదుగా బీదర్ తీసికొని వెళ్ళవలసిందిగా దామాజీ రాజభటులను కోరుతారు వారు అందుకు అంగీకరిస్తారు సాయంత్రానికి దామాజీ పండరీపురం చేరుతారు రాజభటుల అనుమతిపై చంద్రభాగాలో స్నానమాచరిస్తారు పాండురంగని పవిత్ర

గర్భాలయంలోకి ప్రవేశిస్తారు దేదీప్యమానంగా వెలిగిపోతున్న కలియుగ దైవం విఠలనాధుని దర్శిస్తారు కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక పాండురంగని పాదాలను కౌగలించుకొని తమ కన్నీటితో స్వామి పాదాలకు అభిషేకం చేస్తారు

హే పాండురంగ విఠలా నా జీవితానికి శ్రీకారంచుట్టి ఈ దినం ముగించనున్నావా తండ్రీ! నా బ్రతుకంతా నీ కొరకే జీవించాను నీ కొరకు బ్రతకడంలో ఎంత ఆనందముందో నీ స్మరణతో మరణించడము లోనూ అదే ఆనందము వుంది ప్రభూ! నేను చేసింది మంచో చెడో నాకు తెలియదు నీ ప్రేరణే నా చేత ఆ పని చేయించింది పర్యవసానంగా నాకు మరణదండన విధించబడింది లోకం దృష్టిలో నేను దోషినైనా నీ దృష్టిలో నేను నిరపరాధినై తేచాలు భగవాన్ నీ ప్రేమకు నన్ను దూరం చేయవద్దు నీ పవిత్ర పాదసన్నిధి నాకు దూరం చేయవద్దు" అని కుమిలి కుమిలి ఏడుస్తూ చివరిసారిగా పాండురంగనికి నమస్కరించి ఆలయము నుండి వెనుతిరిగి వచ్చాడు

సూర్యాస్తమయమైంది చీకట్లు ముసురుతున్నాయి ఇక ప్రస్తుతం ప్రయాణము సాగదని గుర్తించిన రాజభటులు ఆ రాత్రికి పండరీపురం లోనే విశ్రాంతి తీసుకొని మరునాడు ఉదయం ప్రయాణము కొనసాగించు టకు నిర్ణయించారు ఆ రాత్రి దామాజీతో కూడా అక్కడే విశ్రాంతి తీసుకుంటున్నారు

బీదర్‌లో నవాబ్ బాద్‌షా ఆ సాయంత్రం కొలువుదీర్చి యుండగా ఒక వ్యక్తి డబ్బు సంచిని వినతి పత్రమును పట్టుకొని కొలువులో ప్రవేశి స్తాడు తాను దామాజీ సేవకుడననీ తన పేరు విఠూ అని తెలియస్తాడు దామాజీ తన ద్వారా డబ్బు వినతిపత్రమును పంపినాడని చెప్పి ఆ వినతి పత్రాన్ని నవాబుకు అందిస్తాడు నవాబు దానిని తీసుకొని చదువుతాడు

నవాబ్ బాద్‌షా సన్నిధికి తమ విధేయుడు సేవకుడైన దామాజీ నమస్కరించి వ్రాయునది పండరీపుర ప్రాంతమంతయు కరువు కాట కాలకు లోనైవున్నది ఆహారము లేక ప్రజలు మరణించుచున్నారు ఎంత డబ్బైనను వెచ్చించి ధాన్యమును కొనుటకు ప్రజలు ఉద్యాత లాగుచున్నారు ఇంతకన్న మంచి అవకాశము లభించదని మన ధాన్యాగారములో శిస్తునిమిత్తమువసూలై యున్న ధాన్యమును ఎక్కువ ధరకు విక్రయించి ఆ ధనమంతయు నా సేవకుడైన విఠూ అను వానిచేత పంపుచున్నాను తమరు ఈ ధనమును స్వీకరించి రశీదు ఇచ్చి పంపుదురని తమ యశస్సును పదేపదే ప్రార్థించుచున్నాను

ఇట్లు
మీ సేవకుడు
దా మా జీ పం త్

ఈ ఉత్తరము చదవగానే బాద్‌షా అత్యంత ఉత్సాహముతో ధనమును గ్రహించి రశీదు యిప్పించి విఠూను వెళ్ళిరమ్మనగానే విఠూ వెనుదిరిగి నడుస్తూ అదృశ్యమవుతాడు సభలోనివారందరు దిగ్భ్రాంతి చెందారు బాద్‌షాకు అయోమయ పరిస్థితి ఏర్పడింది ఈ విచిత్ర సంఘటన అందరినీ ఆశ్చర్యంలో ముంచెత్తింది

పండరీపురములో రాత్రివిశ్రమించి బ్రహ్మముహూర్తములో చంద్రభాగాలో స్నానమాచరించి పాండురంగని దర్శించి గీతాపారాయణ చేయుటానికి దామాజీ భగవద్గీత పుస్తకము తెరువగానే అందులో ధనం ముట్టినట్లు నవాబు ఇచ్చిన రశీదు కనుపిస్తుంది దామాజీకి ఆశ్చర్యము వేస్తుంది విషయం అవగతం కాదు రాజభటులతో కలసి బీదర్ నగరానికి నడక సాగిస్తారు దామాజీ వస్తున్న వార్త విని బాద్‌షా తన పరివారముతో ఎదురువచ్చి నమస్కరిస్తారు జరిగిన విషయమంతా తెలుపుతారు విఠూ అదృశ్యమైన రీతిని తెలియబరుస్తారు

దామాజీ శరీరము కంపించింది హృదయము ద్రవించింది కళ్ళు చెమ్మగిల్లాయి కంఠం గద్గదమైంది మెల్లమెల్లగా కంఠాన్ని ఆపుకొని నవాబ్‌కు నమస్కరిస్తూ — "నాకు సేవకుడు లేడు యధార్థానికి విఠూ ఎవరో నాకు తెలియదు నేను ఉదయాన్నే పాండురంగని దర్శనము చేసుకొని గీతాపారాయణ మొదలిడగానే ఆ గ్రంథముతో యిచ్చిన రశీదు కన్పించింది ఇప్పుడు నా స్తవమేమిటో అర్థమవుతున్నది నా ఆరాధ్య దైవమైన విఠలుడే విఠూ రూపములో వచ్చి నన్ను కాపాడాడు అని దుఃఖాన్ని ఆపుకోలేక శిశువులాగా విలపిస్తాడు

నవాబు సత్యమును గ్రహించినవాడై దామాజీపై నేరారోపణ చేసిన కృష్ణమూర్తిందారును చెరసాలలో బంధించమని ఆజ్ఞాపిస్తాడు అంత దామాజీ వినమ్రుడై దయవుంచి తమరు అతనిని శిక్షించకండి దుర్మార్గునిలో కూడా నిండియున్నది దైవత్వమే తాను తెలియక పొరపాటు చేశాడు అతనిని క్షమించి విడిచిపెట్టండి" అని ప్రార్థిస్తాడు

భక్త దామాజీ త్యాగమయ జీవనాన్ని ప్రత్యక్షంగా తిలకించిన నవాబు దామాజీని సమీపించి చేతులు జోడించి నమస్కరిస్తూ మహాత్మా! తమరు ధన్యజీవులు భగవంతుని కరుణను బడసిన పుణ్యాత్ములు ఇక మీదట తమరు మావద్ద ఉద్యోగమును విరమించి మేము మీకు సమర్పించుకొనుచున్న మంగళవేధా మండలమునకు చక్రవర్తులై పరిపాలించవలసింది అని ప్రార్థిస్తారు

ఐహిక సుఖాలు పేరు ప్రఖ్యాతులు పదవీ వ్యామోహాలు ఎండమావులని గ్రహించిన దామాజీ మీ అభిమానానికి అనురాగానికి నేను కృతజ్ఞుణ్ణి ఇక నాకు ఏ పదవీ అవసరంలేదు దీనదయాళుడైన పాండురంగ భగవానుని పవిత్ర సేవలో నా జీవితాన్ని చరితార్థము చేసుకుంటాను ఇప్పుడు నా ప్రయాణము మంగళవేధాకు కాదు పండరీపురానికి అని తన భార్య సావిత్రిబాయి అక్కడకురాగా ఆ పుణ్యదంపతు లిరువురు పండరీపురమునకేగి పాండురంగని నిత్యారాధనలో తమ జీవితాన్ని నీరాజనంలా సమర్పించుకొని ధన్యత చెందారు

• ఓం శ్రీ భాగవతప్రియాయ నమః •



# భక్త నరసీ మెహతా

భగవంతుని దర్శించేందుకే బ్రతుకు వచ్చింది. వచ్చిన బ్రతుకును చచ్చేటంతవరకు అనుభవించాల్సిందే. అందరూ బ్రతుకుతారు. బ్రతుకు కొందరికి భలేగా నడుస్తుంది. మరి కొందరికి బరువుగా మిగులుతుంది. కొందరి బ్రతుకులు భోగాలలో రమిస్తుంటాయి మరి కొందరి బ్రతుకులు బాధల్లో చరిస్తుంటాయి భోగానుభవములో పడినవారు భగవంతుని విస్మరించి కూర్చుంటారు. బాధానుభవములో కదులువారు భగవంతుని స్మరించి తీరుతారు. భోగజీవులందరూ భగవానుని విస్మరింపుచున్నారా? అలాగని బాధితులంతా భగవానుని సదా స్మరింపుచున్నారా? అది సంస్కారానికి వదలాల్సిన విషయము. సాధారణంగా భోగవిషయాలు మానవుని విషయ ప్రపంచానికి గురిచేసి, విచక్షణను పాడుచేస్తాయి. బాధలు మానవునిలో వివేకజ్వాలను రగిలించి విజ్ఞాన పరిధులలో విహరింపజేస్తాయి. కనుక భగవానుని మరిపించే భోగాలకన్నా, భగవంతుని స్మృతికితెచ్చే బాధలే శ్రేయస్కరము.

అగ్నిలో కాలి బంగారు అపరంజిగా మారునట్లు బాధావలయంలో చిక్కిన భక్తుడు భగవంతునికి ప్రీతి పాత్రుడవుతాడు బాధానుభవంలో అతనికి లభించిన విశ్వాసమే దానికి కారణము భగవన్నామమును గానం చేస్తూ భక్తులు బాధలకు ఎదురీదుతుండగా భగవానుడు తన దివ్యకరుణా దృష్టితో వారిని సదా రక్షించి కాపాడుతుంటాడు ముక్కుపచ్చలారని పూవ వయస్కుడైన ప్రహ్లాదుని మదపుటేనుగు త్రొక్కి చంపలేక పోయింది నీరు ముంచలేక పోయింది అగ్ని కాల్చలేక పోయింది హనుమంతుడు లంకానగరమును దహించివేసినను ఆ దావాగ్ని విభీషణుని గృహాన్ని తాక లేక పోయింది బలాఢ్యుడైన దుశ్శాసనుడు తన శక్తినంతా ఉపయోగించి నను ఒక స్త్రీ వలువలను తొలగించలేక పోయాడు భయంకరమైన విషము సుకుమారియైన మీరాబాయిని చంపలేకపోయింది

ఈ మానవాతీత వర్యలన్నిటి వెనుక మనకు గోచరించు సత్య మేమిటి? భక్తులకు భగవంతునిపై అనంత విశ్వాసము—భగవంతునికి భక్తులపై అపార వాత్సల్యము తల్లి ఒడిని ఆక్రమించుటకు విలపించుటయే బిడ్డకు సాధనమైనట్లు భగవానుని పాదసన్నిధిలో తరించుటకు విషాదమే భక్తునికి సాధనము విషాదము బాధవలన పుడుతుంది కనుకనే భక్తులు బాధలనే ఆహ్వానించారు బాధలతో కదిలారు బాధలతో నలిగారు బాధల పోరాటములో భగవానుని గాధలు విన్నారు బాధల కతీతులయ్యారు భావనలో మిగిలారు భావనసమాధిలో నిలిచారు అట్టి భక్తుల కోవకు చెందిన పరమ భక్తాగ్రేసరుడు గుజరాతీయుడైన భక్త నరసీమెహతా నికృష్ట జీవితాన్ని కృష్ణభక్తికి అంకితంచేసి తరించిన ముక్తజీవి

సూర్యోదయం కాబోతున్నది చీకటి తన నేత్రాలను మూయడానికి సిద్ధంగావుంది చీకటిని అమాంతంగా మ్రింగాలని వెలుగు ఉరకలేస్తున్నది చీకటి వెలుగుల అల్లిక సమయంలో ఏదో సుశ్రావ్య గానం వినిపిస్తున్నది ఎవరో మృదుమధురంగా పాడుతున్నారు ఆ అమరగానం అమృతమై శ్రవణానందముగా యున్నది ఎవరిదీ కంఠం? ఎక్కడిదీ కమనీయనాదం? నిద్రిస్తున్న బన్సీధరుడు అమాంతంగా లేచివచ్చి వీధిగుమ్మం ముందు నిల బడ్డాడు

వామనఛాయ గల ఒక పొడుపాటి మనిషి ఒక చేతిలో తంబూర మరొక చేతిలో చిఱతలు ధరించి మెడలో పూలహారం వేసుకొని పాత వళ్యంలో నేత్రాలు మూతబడియుండ

మందిర్ మందిర్ మూరతి తేరీ
ఫిర్‌భీన దేఖే సూరత తేరీ
యుగబీతేన ఆయి మిలన్ కీ
పూరనమాసీ రే

అని సుశ్రావ్యంగా కీర్తన నాలపిస్తూ కదలి వస్తున్నాడు. ఆతని వేష ధారణ అతని కమనీయ సంకీర్తన అతనిలో గోచరించు నిరాడంబరత బన్సీధరుని అమాంతంగా ఆకర్షించాయి. అతడెవడో మహాత్ముడై యుంటా డని బన్సీధరుడు నిర్ణయించుకున్నాడు. అతని పాదాలకు నమస్కరించినచో సకల పాపములు ప్రక్షాళ మగునని భావించి అతనిని సమీపించాడు. దగ్గరగా ఆవ్యక్తిని చూసి నిర్ఘాంతపోయాడు. అంతవరకు అతనిపై ఏర్పడిన గౌరవాభిమానాలు క్షణంలో క్రోధ ద్వేషాలుగా మారాయి. కొన్ని క్షణాల క్రితం అతనిపై ప్రేమ వర్షాన్ని చిందించిన నేత్రాలు ఇప్పుడు క్రోధాగ్నుల్ని చెరుగుతున్నాయి. అతడెవరో కాదు తన సోదరుడు నరసీమెహతా. వారం రోజుల క్రితం తన చేతి దెబ్బలు తిని పారిపోయిన నిర్భాగ్యుడు.

ఓరి దౌర్భాగ్యుడా! ఏమిటీ వేషం? నీకేమి పిచ్చిపట్టలేదుకదా? ఈ వారం రోజులు ఎక్కడ సంచరించావు? మహాభాగవతో త్తముడిలా బయలు దేరావు? ఈ వేషాన్ని ఎవరినుండి గ్రహించావు? నిన్ను ఇలా తయారు చేసిందెవరు? అని ప్రశ్నించాడు అన్నగారైన బన్సీధరుడు.

శ్రీకృష్ణుడే నన్నిలా తయారు చేశాడు. మురళీమనోహరుడే నన్నిలా జీవించమని ఆజ్ఞాపించాడు. శ్యామసుందరుని ఆశీర్వాదబలంతో నే నేనింతటి భాగ్యవంతుడనయ్యాను అని గంభీరంగా పలికాడు నరసీ.

"ఛీ పిరికిపంద జీవితాన్ని గడపలేని నీలాంటి సోమరిపోతులంతా ఈ వ్యర్థప్రసంగాలే చేస్తుంటారు. నీ అప్రస్తుత ప్రసంగాన్ని ఆపు. భార్యా

బిడ్డలను పోషించలేక ఎచ్చివాగుడు వాగుతున్నావు అని కళ్ళెఱ్రజేశాడు బన్సీధరుడు

సోదరా! బన్సీధరా మానవునికి సంసారమనునది క్రొత్తదా? లేక మానవుడు సంసారానికి పరాయివాడా? ఎన్ని జన్మలలో మానవుడు ఈ సంసార జీవనాన్ని కొనసాగించలేదు? ఆహార నిద్రా భయ సంతానాదులతో నిండబడిన ఈ సంసారమంతా ప్రాశస్త్యమైనదా? ఈ మాత్రపు జీవనాన్ని పశుపక్ష్యాదులు సైతము కొనసాగింమనని నీవెరుగవా? సోమరిపోతు పని చేయకుండా వుండగలడేమోగాని ఎదా శ్రీకృష్ణ పదసరోజములచెంత మను గడను సాగించవలయునని అభిలషింమనా? సోదరా నేను సోమరినికాను. శ్రీకృష్ణ ధ్యానచిత్తుడనై అన్యరాగ ఎస్మారణ మొందినవాడను అని సెలవిచ్చాడు నరసీమెహతా

నరసీ పలుకులు బన్సీధరుని ఆగ్రహావేశాలకు గురిచేశాయి ఓయీ! ఉన్మత్తుడా నీవు చేయు భక్తి వాస్తవమే అయితే నీవు వెలిబుచ్చు పలు కలు యదార్థామే అయితే ఈ వేషభాషలెందుకు? భక్తి యనునది మానసిక పరిణామమేగాని బాహ్యప్రదర్శనలు గావు ఈ వేషధారణ ఎందుకు చేసి నట్లు? వారం రోజులు ఇంటినుండి దూరంగావెళ్ళి బాగా ఆలోచించి పదుగురిని మోసం చేయడానికి ఈ వేషాన్ని ధరించి వచ్చావన్నమాట అని ఆవేశంతో పలికాడు బన్సీధరుడు

నరసీ నిట్టూర్పు విడిచాడు ఇంతసేపు వెలిబుచ్చడానికి కిచ్చగించక దాచిపెడుతున్న విషయాన్ని బహిరంగ పరచడానికి నిశ్చయించుకున్నాడు "సోదరా! మోసం చేయడానికి వేషమే ధరించాల్సిన అవసరంలేదు మోసాలు మాయలు నాకు తెలియవు ఇందతా భగవదనుగ్రహమే అది కూడా ముఖ్యంగా మీ ఆశీర్వాదమే వారంరోజులక్రితం దేవాలయమునుండి ఇంటికొచ్చాను మా వదినగారు ద్వేషంతో నామీద చెప్పిన చాడీలు మీరు నమ్మారు నేను చెప్పేమాటలుకూడా వినకుండా నన్ను కొట్టి మీ కసి తీర్చు కున్నారు అంతటితో ఆగక ఇంటినుండి గెంటేశారు అర్ధరాత్రి సమ యాన ఇల్లువదలి బయటికొచ్చాను ఏమిచేయాలో నాకర్థంకాలేదు అమ్మ

గారింటికి వెళ్ళియున్న నా భార్యదగ్గరకు వెళ్ళి భార్యా పిల్లలను చూడాలని పించింది కానీ అక్కడికి వెళ్ళడానికి మనస్సంగీకరించలేదు వెంటనే అరణ్యానికి ప్రయాణమయ్యాను జీవితాన్ని గూర్చి నా మనసులో తీవ్రంగా సంకల్పాలు నడువసాగాయి ఇంతలో అక్కడొక శివలింగం కన్పించింది ఆ శివలింగంముందు కూర్చుని బోరున ఏడ్చాను తలను శివలింగానికేసి బాదుకున్నాను మహేశ్వరునికి నా మీద దయకలిగింది వెంటనే ప్రత్యక్షమయ్యాడు నన్ను ఓదార్చాడు ఏమి కావలయునో కోరమని అడిగాడు నా హృదయము పరవశించిపోయింది మనస్సులో ఆనందం తాండవిస్తున్నది హే పరమశివా పీడకురా ఏమి కోరాలో ఎలా కోరాలో తెలియని అజ్ఞానిని మీ అభీష్టమే నా యభీష్టము అనుగ్రహించండి అని ప్రార్థించితిని శంకరుడు నావైపు చూచి చిరునగవు చిందించాడు అంతే క్షణకాలములో మేమిరువురము గోకులంలో యున్నాము నరసీ! గోకులవాసియైన శ్రీకృష్ణుడు వంశీధరుడై బృందావన పుణ్యభూమిలో సాగించు రాసక్రీడ నాకెంతయో మనోజ్ఞముగా యుండును ఆ దివ్యదృశ్యము నీకు చూపించవలయునని నిన్ను ఇచ్చటకు రప్పించితిని అని సదాశివుడు తెలియజేశాడు నా హృదయం సాగర తరంగమువలె ఉప్పొంగినది

పరమశివుడు నాకు తెలుపుచుండగనే గోకులధామమంతయు శోభాయమానముగా గోచరించసాగినది దివ్య సుగంధములు విరజిమ్మబడుచున్నవి మహదానందమును కలిగించు మలయమారుతము వీచుచున్నది సుశ్రావ్య గంధర్వనాదములు వినిపించుచున్నవి

వ్రజపుర శోభనమూర్తి గోపీమనోహరుడైన శ్రీకృష్ణుడు త్రిభంగీ లలిత స్వరూపముతో నిలబడినవాడై మాధుర్య మురళిని ప్రయోగించుచూ వయ్యారముగా నిలబడెను వీక్షించుచుండగనే రాసవిహారియైన శ్రీకృష్ణుని నుండి మనోహర వేషధారిణియైన రాధాదేవి వ్యక్తమైంది రాధాదేవి శరీరము నుండి ఎనమండుగురు గోపభామలుద్భవించగా ఆ ఎనమండుగిరి నుండి పదునారు వేలమంది గోపభామలు ఆవిర్భవించారు ఇంద్రనీలములతో సమమై ప్రకాశించు దేహముయిగల ఆ గోపభామలు నందనందనుని చుట్టుముట్టి అత్యంత ఆనందమగ్నులై క్రీడించసాగారు

పరమ శివుడు పలికించు మృదంగ శబ్దము న కనుగుణ్యముగా శ్రీకృష్ణుడు అడుగులు వేయుచూ తాళక త్రైన పాలికలు వెయు తాళముతో ఖేదము పొడసూపకుండా తారకాణగా నుండునట్లు తన కనుబొమ్మలను రమణీయంగా త్రిప్పుతూ హృదయములు గ్రవింపునట్లు శ్రీకృష్ణుడు వేణువు నూదసాగెను ఆ యానంద పారవశ్యముతో నేనుకూడా నర్తించుచునే యుంటిని ఏదో దివ్యస్పర్శ నా శరీరము నంటినది నేను కళ్ళు తెరచి చూడగా శ్రీకృష్ణపరమాత్మ నిలబడి యుండెను పదునారువేల గోపికలు ఎనమండుగురు గో ప భా మ ల లో కలసిపోయారు ఎనమండుగురు గోప భామలు రాధాదేవిలో ఐక్యమయ్యారు చూస్తుండగానే రాధాదేవి శ్రీకష్ణ నిలో లీనమైనది

వాసుదేవుడు నాపై తన దరహాసమును చిందించుచుండ నేను వాసు దేవుని పదసరోజములపై బడి విలపించాను శరత్సరోవరమునందలి పద్మ ములను బోలిన శ్రీనాథుని పాదపద్మలకు నన్ను దూరం చేయవద్దని ప్రాదేయపడ్డాను

శ్యామసుందరుడు నన్ను సమీపించి న ర సి! నీవు కేవలము నా సేవకై జన్మించిన భాగవతోత్తముడవు నైతిక జీవనము ప్రేమతత్త్వము అడుగంటుచున్న నేటి మానవ సమాజములో భక్తి జ్యోతుల్ని వెలిగించు టయే నీ కర్తవ్యము నీవు వెంటనే భూలోకమున కరిగి భక్తిని ప్రచారము చేయవలసింది అని తంబూర చిఱుతలు తులసిమాల పీతాంబరమును నాకు బహూకరించెను మరుక్షణమే నేను అరణ్యములో శివలింగమువద్ద నుండుట జరిగినది జరిగినది స్వప్నమాయని ఆలోచించుటకు వీలులేకుండా భగవానుడు నాకు బహూకరించిన వస్తువులు నా చెంతయేనుండుట చూపి నేను తన్మయుడనైతిని ఇదియంతయు భగవానునికి నాపైయున్న ప్రేమకు నిదర్శనమేనని గ్రహించి భగవానుని దివ్యారాధనలో నా శేషజీవితాన్ని చరి తార్థం చేసుకొనవలయునని సంకల్పించితిని అని నరసీమెహతా తన సోద రుడైన బన్సీధరునికి జరిగిన వృత్తాంతమంతయు వివరముగాతెలియజేసెను

వ ర సీ మె హ తా తెలియజేయు వివరమును ప్రక్కనేయుండి వింటున్న బన్సీధరుని భార్య దురితగౌరి ముందుకువచ్చి అహా! ఎంత చక్కటి ఇతివృత్తము నరసీ! భలే ఇంత గొప్ప కవిగా ఎప్పుడు మారితివి? నీ మాటలు విని మోసపోయే వారెవరులేరు? నోరు లేనివాడని భగవంతునిపై అబద్ధము లాడుటకు సిద్ధపడ్డావా? మంచి వ్యాపారాన్నే ఎన్నుకున్నావు ? అన్నది

దురితగౌరి అమాయకత్వానికి నరసీ నవ్వుకున్నాడు అమ్మా! అవును నేను వ్యాపారినే నూతనముగా ఒక క్రొత్త వ్యాపారముకో దిగాను ఎవ్వరూ చేయలేని వ్యాపారాన్ని చేయడానికి సిద్ధపడ్డాను లాభ నష్టాలతో నాకు పనిలేదు వ్యాపారము చేయడమే నాకు హాయి అంటూ కీర్తన గానం చేశాడు నరసీ కీర్తనలన్నీ ఎక్కువగా గుజరాతీ భాషలోనే ఉన్నాయి

సంతో హమారే వేపారియా శ్రీరామ్ నామ్‌నా
వేపారీ ఆవే ఛే బధాగామనా గామ నా
హమరూం వసాణుం సాధు సఘలోనె ఛావే
అరారే వరణజేనె హూరవానే ఆనె ॥సంతో॥

హామరూం వసాణుం కాల కుకాలేం నమూంటే
జెనె రాజాన దండే జెనె చోర న లూంటె ॥సంతో॥

ఆవరీనె ఖాతా బహూమాం లక్ష్మి వరనుం నామ
చీరీ మాం చతురభుజ లఖియూనరసైంయాను కామా ॥సంతో॥

మహాత్ములారా? నేను భగవన్నామమును విక్రయించు వ్యాపారిని అనేక రకాలైన మానవులు నా వద్దకు వత్తురు

సకల తెగల వారికి వివిధ తరగతుల ప్రజలకు కూడా నా సరుకు నచ్చుతుంది నామమే నా సరుకు

ఏసమయంలోకూడా నా సరుకు క్షేమంగానే లభిస్తుంది నాకు వ్యాపారము చేయుటలో కష్టము లేదు నష్టము రాదు

ఈ సరుకుపై రాజు సుంకము విధించడు చోరుడు ఈ సరుకును అపహరించడు

జమాఖర్చుల పుస్తకాలలో భగవన్నామమును నింపడమే నరసీ చేసు పని అతని కాలము ఈ విధముగా ఖర్చు చేయబడుతుంది అని పరవశించి గానం చేశాడు నరసీమెహతా

నరసీ మాటలు బన్సీధరుని కోపమును రెండితంలు చేసినవి నర్సీని ఇంటిలోకి ఈడ్చుకొనిపోయి ఒక గదిలో బంధించాడు నీ పిచ్చి కుదిరే వరకు ఇక్కడే పడియుండుము" అని ఆజ్ఞాపించాడు అహంకారమును సమూలంగా నశింపచేసిన నరసీని ఈనాడు బాధించగల వారెవరు? తాను మానావమానాల కతీతుడు నిందాస్తుతులను లెక్కచేయడు

"జో రాధో తో రోక్ జా మారే నందకుమార్ సుక్ కమరె
కుటుంబ సహకో యే కెడెంగన్ జన్ జన్ ఆగల్ లవన్ రె
ప్రపంచ దూషణముతో నాకేమి పని? నేను నందకుమారుని దాసుడను అతడినితప్ప మరొకరిని సేవించలేను సోదరా! వెళ్ళి నీ పనిలో నీవు నిమగ్నుడవు కమ్ము నాకు నా స్వామికి మధ్య నిలువకుము అని గానం చేశాడు నరసీ

నరసీమెహతా పుట్టుకతోనే మహానుభావుడు పద్మముయొక్క సౌందర్యమును దగ్గరనేయున్న మండూకము గ్రహించలేని విధంగా నరసి హృదయ సౌందర్యమును తన ఇంటిలోనివారే గ్రహించలేక పోయారు గుజరాతీ రాష్ట్రంలో జూనాగడ్ అను పట్టణమున నరసి జన్మించాడు ఆయన తండ్రి దామోదరదాస్ తల్లి లక్ష్మిగౌరి బన్సీధరుడు తన జ్యేష్ఠ సోదరుడు నరసీకి అయిదు సంవత్సరములు నిండకముందే తల్లిదండ్రులు శాశ్వతంగా దురమయ్యారు తన అన్నగారైన బన్సీధరుడు మేనత్తగారైన జయకువరీదేవి నరసీని పెంచి పెద్దచేయసాగారు నరసీ చిన్న

నము నుండి నోరువిప్పి మాట్లాడేవాడు కాదు విలపించేవాడు ఆ బాలుని ప్రవర్తన అందరికి ఆశ్చర్యమును కల్గింపు చుండెను

ఒకనాడు జూనాగడ్‌లో రథోత్సవము జరుగుచుండినది జయకూవం దేవి బాలుడైన నరసీని వెంటపెట్టుకొని రథోత్సవమును తిలకించడానికి వెళ్ళింది అచ్చట ఒక సాధు మహాత్ముని దర్శించి నరసీని ఆ మహాత్ముని పాదాలపై పడవేసి ఆ బాలుడు చిన్ననాటినుండియు మౌనంగానే యున్నాడని తెలియజేసినది వెంటనే ఆ సాధుపురుషుడు నరసీవంక తదేకంగా చూసి నాయనా! ఎందుకు మౌనంగా ఉంటున్నావు? రాధే శ్యామ్ రాధే శ్యామ్ అని గానం చేయి అన్నారు నరసీ వెంటనే రాధే శ్యామ్- రాధే శ్యామ్ - రాధే శ్యామ బోల్ - జై రాధే కృష్ణ బోల్ అని సుస్రావ్యంగా గానం చేశాడు భగవదనుగ్రహం లభించాలేగాని భక్తునికి దుర్లభమంటూ వుండదు ఈ సత్యాన్నే పెద్దవాడైన ఎన్నుట నరసీ చక్కగా కీర్తనరూపంలో గానం చేశారు

> ద్వారదయాకా జబ్ తూ ఖోలే
> పంచమ స్వరమే గూంగా బోలే
> అంధా దేఖె లంగడా చల్‌కర్
> పహుంచె కాశీ రే

హే శ్యామ సుందరా నీదయ యనెడి ద్వారము తెరువబడినచో మూగవాడు పంచమ స్వరములో గానం చేస్తాడు అంధుడు తిలకిస్తాడు కుంటివాడు కాశీ క్షేత్రానికి నడచి వెళ్తాడు అని భగవానుని దయాస్వరూపాన్ని వివరిస్తూ నరసీ గానం చేశాడు

జయకూవరీదేవి సంతోషభరితురాలై నరసి వెంటబెట్టుకొని ఇల్లు చేరింది తన వదినగారైన దురితగౌరి అతి క్రూరస్వభావముగల స్త్రీ ఆమె వలన నరసీ పడరాని బాధలు పడ్డాడు నరసీకి పదునైదు సంవత్సరముల వయస్సు వచ్చింది మనికగౌరియను బాలికనిచ్చి నరసీకి వివాహం చేశారు చిన్న వయస్సులోనే అతనికి ఇద్దరు పిల్లలు గలిగారు అమ్మాయి పేరు కువరీబాయి అబ్బాయి పేరు శ్యామలదాస్

భార్యాపిల్లలను పోషించుటకు నరసీ కాపలాదారు ఉద్యోగంలో ప్రవేశించాడు * ఒకనాడు సంకీర్తనలో మైమరచి ధర్మనిర్వహణయే మరచిపోయాడు ఆ సమయానికి శ్రీకృష్ణుడే భక్త సంరక్షణార్థం నరసీ మెహతా రూపములో వెళ్ళి కాపలావారుగా పనిచేశాడు అది తెలిసిన తరువాత నరసీ క్రుంగిపోయాడు వ్యథ చెందాడు కన్నీళ్ళు కార్చాడు భగవానునిచే పనులు చేయించుటకు కారణమైన ఉద్యోగమును తాను నిర్వహించలేనని భావించి ఉద్యోగమును విరమించాడు అప్పటినుండి నరసీమెహతా ఏ ఉద్యోగము చేయలేదు సంకీర్తనమే తనఉద్యోగము

నరసీ ప్రవర్తన తన వదినగారైన దురితగౌరికి నచ్చేదికాదు నరసీతోపాటు అతని భార్యాపిల్లలనుకూడా పోషించేది ఈబాధను భరించలేక పదిరోజులపాటు అమ్మగారింటిలో గడిపి వద్దామని మనికగౌరి పిల్లలను తీసుకొని వెళ్ళింది ఆమె వెళ్ళగానే నరసీని మరి బాధించడానికి ప్రయత్నించింది లేనిపోని చాడీలన్నీ చెప్పి తన భర్తచే నరసీని కొట్టించి ఇంటినుండి వెడలగొట్టించింది భగవానుని దివ్యవిలాసాలు ఎవరికి అర్థమవుతాయి? ఇంటినుండి వెడల గొట్టబడిన నరసీమెహతా గోకుల ధామంలో

---

* నరసీమెహతా జీవితంలో ఈసంఘటనయున్నట్లు భక్త విజయ గ్రంథములో లేదు నరసీమెహతా మాహాత్మ్యాన్ని బాగా ఆకళింపు జేసుకున్న గుజరాతీయుడైన ఒక సాధు మహాత్మునితో నేను చర్చినపుడు నరసీ ఉద్యోగ వివరణకు కారణమిదియని తెలిసింది ప్రచురణ జరగని మహిమలు నరసీ జీవితంలో ఎన్నోగలవు ఇచ్ఛారామ్‌దేశాయ్ యను నతడు నరసీ జీవితంలోని ఇరవై మహిమలను తన బృహత్కావ్య గ్రంథములో రచించియున్నట్లు బంకిబిహారీ వ్రాసియున్నారు ఆ గ్రంథమునుచూసే మహదవకాశము నాకింకా కలుగలేదు కనుక ఆ గ్రంథములో వ్రాయబడిన విషయాలునాకు తెలియవు

—రచయిత

---

రాసక్రీడా వైభవమును వీక్షించి శివానుగ్రహమునకు పాత్రుడై శ్రీకృష్ణుని కరుణామృతమును పానంచేసి తిరిగి వచ్చాడు ఇదికూడా మాయికమేనని

నిర్ణయించి ఈనాడు అతనిని గదిలో బంధించాడు నరసీకి ఎక్కడైతేనేమి? అతడి మనస్సు సంపూర్ణముగా శ్రీకృష్ణ పదసరోజములచెంత నిలచి పోయింది తానున్నచోటే బృందావనం తననోటి నుండి వచ్చు ప్రతి మాటయు వేదమే నరసీ ఆగదిలో కూర్చుని తన్మయత్వంతో కీర్తనలు గానం చేస్తున్నాడు

నరసి అర్ధాంగియైన మనికగౌరి పుట్టింటి నుండి వచ్చింది భర్త యొక్క స్థితినంతయూ అవగాహన చేసుకుంది పర్యవసాన మేమియాయని ఆలోచించనాగింది ఇంతలో దురితగౌరి వచ్చి మీకుటుంబమునంతయు పోషించుటకు మాకు శక్తిలేదు మీరుఇక్కడి నుండి వెళ్ళి ఎక్కడైనా ప్రత్యేకంగా జీవించండి అని కఠోరంగా పలికింది

నరసి భార్యాపిల్లలతో కలసి ఇల్లు విడచి దూరంగావచ్చాడు ఆ ఊరిలోనే ఒక చిన్న ఇల్లు అద్దెకు తీసుకున్నాడు నిరంతరము కృష్ణ కథా గానముతో కాలక్షేపము చేయసాగాడు కుటుంబ భారాన్నంతా భగవానునిపై నుంచి ప్రశాంతంగా జీవించసాగాడు నరసి భక్తి ప్రపత్తులు భక్తుల నధి కంగా ఆకర్షించాయి భక్తులు నరసీమెహతాను దర్శించి ఆయన గానం చేయు సంకీర్తన నాలకించి కానుకలందచేసేవారు అదియే భగవత్ప్రసాద ముగా భావించి నరసీ జీవిస్తుండేవాడు

నరసీమెహతా తన కుమార్తెయైన కువరీబాయికి బాల్యమునందే వివాహము చేసెను ఆమె సంబంధుల ఇంటిలోనే యున్నది కువరీబాయి రజస్వల అయినట్లు వార్త వచ్చినది నరసీమోహతా అర్ధాంగి భర్తను సమీ పించి అమ్మాయి అల్లుడుగారింటిలో పుష్పవతి అయినట్లు వార్త వచ్చినది గదా ? సారెను తీసుకొనివెళ్ళి ఇవ్వవలసిన ధర్మము మనమీద యున్నది అని తెలియజేస్తుంది

అవును నీవు చెప్పినది ధర్మబద్ధమైన విషయమే నేను తప్పక సారెలిచ్చి వచ్చెదను " అని తంబూర చిఱుతలు ధరించి సంకీర్తనచేయుచూ బయలుదేరెను సంబంధుల ఇంటిలో కాలిడగానే నరసిమెహతాను చూసి

ట ధన్యులు ఆశ్చర్యపడి ఎమిటి? అదేమిటి! హరిదాసువలె కీర్తన గానం చేస్తూ వస్తున్నారు అమ్మాయికి సారెలెక్కడా? అని ప్రశ్నించారు

నరస చిరునవ్వును చిందిస్తూ సారభూతమైన భగవన్నామమే నేను సమర్పించు సారెలు భగవన్నామముకన్నా మించిన భాగ్యమే మున్నది అమ్మాయి సుఖమును వాంఛిస్తూ హరినామ సంకీర్తన చేయడానికి వచ్చాను అని నరసీ తెలియజేశాడు బంధువులకో గుసగుసలు ప్రారంభమయ్యాయి నరసీ వియ్యంకుడు రుసరుసలాడుతున్నాడు నరసీ అల్లుడుగారు త్రాచుపామువలె బుసలు కొడుతున్నాడు

కన్నబిడ్డకు తొలిసారిగా సారె పెట్టలేని దౌర్భాగ్య కుటుంబమా? అని కొందరు వ్యాఖ్యానించసాగారు మర్యాద తెలియని మందభాగ్యులు అని ఇంక కొందరు పలుకుతున్నారు బుద్ధిహీనతను కప్పిపుచ్చుకోవడానికి భక్తి ఒక బురఖా దొరికింది యని మరికొందరు విమర్శిస్తున్నారు అమ్మాయినికూడా తల్లిగారింటికి పంపేస్తే సరిపోతుంది అందరూ కలసి భక్తి చేసుకుంటారు అని అబ్బాయి తల్లి తీర్పు చెప్పేసింది

నరసీ పుత్రిక కువరీబాయి అత్తగారింటిలో అవమానాలపాలైంది తండ్రిని దూరంగా పిలిచి నాన్నా మీ ప్రవర్తన నాకు ఇక్కడ నిలువ నీడ లేకుండా చేసింది పుట్టింటివారు సారె కూడా పంపలేని దౌర్భాగ్యులని నలుగురు నానావిధాల నిందిస్తున్నారు నా బ్రతుకు ఈ విధంగా నగుబాట్లు కావలెనని భగవానుడు నా ముఖాన వ్రాసినట్లున్నాడు అని దుఃఖించింది నరసీ హృదయం ద్రవించిపోయింది ముక్కుపచ్చలారని కువరీబాయి వదనంలో గోచరించే విషాదఛాయల్ని చూడలేక పోయాడు

పశ్చాత్తాప హృదయుడైన నరసీ బంధుజనులను సమీపించి 'మీ రెవరు నా బిడ్డను హేళనచేయవలసిన పనిలేదు సారెకు సంబంధించి మీకు ఏమేమి కావలయునో సెలవియ్యండి ఈ దినమే మీకు సమస్తము సిద్ధము చేసిఉంచగలను అని నరసీ ఆవేశంతో పలికాడు

సారెకు సంబంధించిన వస్తువులన్నీ తెలియజేశారు చీరెలు నగలు పాత్రలు పిండివంటలు అన్నియు వ్రాయసాగారు కుటిలుడైన లేఖకు

దొకడు అపహేళన చేయుచూ వ్రాయసాగాడు అంతా పూర్తి చేసిన తరు వాత నరసీ వియ్యంకుని చేరబిలిచి మరేమైనా కావలయునేమో చెప్పుమని ప్రార్థించాడు. అపహేళన చేయుచూ వ్రాయుచున్న లేఖకుని సమీపించి "వాయనా! నీకు కావలసినదేమైనా వ్రాసుకొనుము" అని నరసీ నమ్రతతో తెలిపెను. వెంటనే దుర్మార్గుడైన ఆ లేఖకుడు ఆహా, లేక ఏమి? తమ లాంటి ఉదారస్వభావులముందు కోరకపోవడము కూడా పాపమే నాకు ఒక గుండుజాయి ఇప్పించండి అని పలుకుతూ ఆ గుండుజాయిని కూడా పత్రములో వ్రాసెను.

నరసీమెహతా ఆ పత్రమును చేతపట్టుకొని వీధిన నడచిపోయెను. ఆ ఊరిలోయున్న పాండురంగస్వామి ఆలయంలో ప్రవేశించెను. బంధువులు ఇచ్చిన పత్రమును ముందుంచుకొని నేత్రములవెంట బాష్పములు రాలుచుండ సుశ్రావ్యంగా సంకీర్తన చేయసాగెను. తనకు సర్వస్వము పాండురంగడే. ఆశ్రిత జనరక్షకుడైన పాండురంగడే తనను ఈ ఆపద నుండి బయటపడెలా చేయాలి. భక్తుని మొర భగవంతుడెందుకు వినడు? గతంలో ఎందరి భక్తుల బాధలనో పోగొట్టి ఉద్ధరించిన భగవానుడు నరసీ మెహతాలాంటి ఉత్తమ భక్తుని ఎందుకు అనుగ్రహించడు? నరసీ హృదయావేదన చరమస్థాయికి చేరింది. వెంటనే కీర్తన గానంచేయడానికి ప్రయత్నించాడు.

తూఁతారా విరద సాంభాళముా జో
జే శామలా నజో ఈశ కరణీ హామారీ రే
లాఖా గ్రేహా మాం జేమ పాండిన ఉగార్యా
బ్రహ్మాండ జ్వాలా వ్యాపీ రే
అర్ధవచనే గజ గణి కా తారీ జయదేవనె
పద్మినీ ఆపీ రే
నరసైఁ యాచం స్వామీ లక్ష్మీవర
మోరీ ఓథ్ తమారీ రే

"హే కృష్ణా! మా అపరాధముం మన్నించి నీ కృపాదృష్టిని మాపై సారించుము లక్కా గృహము దహించబడినపుడు నీవు ఆదుకొని పాండవులను రక్షించలేదా? అంతియేగాక గనిక జయదేవుని సతీ మణి పద్మావతి గజేంద్రాది భక్తుల నెందరినో నీ కృపావీక్షణముచే కాపాడినావు

అనాదినుండి భక్తులను బ్రోచి కాపాడునటుల నిన్నే శరణుజొచ్చిన నన్నుకూడా రక్షించమని నీ భక్తుడైన నరసీ ప్రార్థించుచున్నాడు" అని కీర్తించసాగెను

నరసీ హృదయావేదన భగవానుని కదిలించినది నరసి వద్దనున్న చిటిలోని సరుకులన్నియు ఒక బండిలో వేసుకొని సాక్షాత్తు పాండురంగడె బండి తోలుకొని నరసీ వియ్యంకుని ఇంటికి వచ్చాడు మారువేషంలోనున్న లీలామానుష విగ్రహుని వారెవరూ గుర్తించలేదు పాండురంగడు నరసీ వియ్యంకుని సమీపించి అయ్యా నేను నరసీ సేవకుడను ఈ వస్తువు లన్నీ మీకు ఇవ్వమని పంపగా వచ్చితిని అన్నియు సక్రమముగా నున్నవో లేవో చూసుకొనవలసింది అని చెబుతాడు

బంధువులందరూ ఆశ్చర్యముతో గుమిగూడుతారు విలువైన ఆభర ణములతో కోరినవన్నీ పంపబడినవి చివరలో లేఖకుడు హాస్యానికి కోరిన గుండుజాయి కూడా అందులో కనబడగానే చూసి విస్మయ మొందు తారు అయ్యా! నాకు సెలవివ్వండి అని అడుగుతాడు బండి తోలుకొని వచ్చిన పెద్దమనిషి

"మా న ర సీ ఎక్కడున్నాడు? అని ప్రశ్నించాడు కువరీబాయి మామగారు ఆ మాటకు జగన్నాటక సూత్రధారి నవ్వును ఆపుకోలేక పోయారు తాను చిత్రించిన నాటకంలోని నటులు తననే మించిపోయారని భావించడమే తన నవ్వుకు కారణమైయుంటుంది పాండురంగస్వామి ఆలయంలో నున్నాడ"ని బదులు పలికి తనదారిన తాను వెళ్ళాడు

నరసీ నిజాయితీని మెచ్చుకొంటూ బంధువులందరూ పాండురంగ స్వామి ఆలయం చేరారు అక్కడ పిచ్చివానివలె పడియున్న న ర సీ ని

చూశారు తట్టి లేపారు నరసీ ఉలిక్కిపడి లేచాడు చుట్టూ గుమిగూడి యున్న బంధువులను చూశాడు తనలో భయాందోళనలు తీవ్రస్థాయికి చేరాయి అందరికి నమస్కరిస్తూ అయ్యా! క్షమించండి మీరంతా బంధు వులు అనగా బాధలను అర్థం చేసుకొని ఆదుకొనవలసినవారు నేను తప్ప కుండా మీరు కోరిన వస్తువులతో సహా ఘనంగా సారె పంపుతాను నన్ను నమ్మండి నాకు కొద్ది రోజులు గడువు ఇవ్వండి అని ప్రాధేయపడ సాగాడు

బంధువులకు మతి పోయినట్లయింది ఒకరి ముఖాలు ఒకరు చూసు కున్నారు "అదేమిటి బావా నీవు పంపిన సారె మా ఇంటికి చేరినది నీ సేవకుడు బండిలో తీసుకొనివచ్చి అప్పగించి వెళ్ళాడు అతడు చాలా మంచివాడివలె కన్పట్టుచున్నాడు చివరకు లేఖకుడు కోరిన గుండు జాయిని కూడా నీవు మరచిపోకుండా పంపడము అందరికి చాలా ఆశ్చర్యం వేసింది నీవు ఇక్కడున్నావని అతడే చెప్పి వెళ్ళాడు నిన్ను అర్థం చేసుకోలేక అవమానించాము మమ్మ క్షమించవలసింది అని వియ్యంకుడు నరసిని ప్రాధేయపడ్డాడు నరసీమెహతా జరిగిన సంఘటనను క్షణంలో అర్థం చేసుకున్నాడు హేభక్తవత్సలా! పాండురంగా ఈ దీనుడ్ని రక్షించ డానికి నీవే స్వయంగా వెళ్ళావా? భగవాన్ పైగా నా సేవకుడనని చెప్పావా? శ్యామసుందరా! నీ ప్రేమ అనంతమైనది భగవాన్ నీ దర్శనం నాకు కలుగజేయవా? నీ దివ్యదర్శన భాగ్యాన్ని పొందిన వీరెంత ధన్య జీవులు అని బంధువుల పాదాలపై బడ్డాడు తన హృదయంలో పొంగు తున్న ఆవేశానికి పదములు జోడించి కీర్తించాడు

నిర్బలకే బల ధన నిర్ధనకే
తుమరఖవారె భక్త జననకే
తేరే భజనమే సబ్ కుచ్ పావూ
మిటే ఉదాసీరే

దరిశన దోఘున శ్యామ నాథ మోరీ
అంఖియా ప్యాసీరే

"బలము లేనివారికి నీవే బలానివి ధనములేనివారికి నీవే ధనానివి నీ భజనలో నిరంతరము రమింతు నీ భక్తులకు సర్వమూ నీవే నను కూర్చెదవు కృష్ణా నిన్ను దర్శించవలయునని నా నేత్రములు దాహముతో నున్నవి అని అశ్రుపూరిత నయనములతో కీర్తించాడు నరసీ మెహతా

నరసీ ఆదర్శ గృహస్థుడుగా జీవించసాగాడు తన కుమారుడైన శ్యామలదాస్ మృదంగము వాయించగా తన సతీమణి తాళముల ననుసరించగా తాను సుశ్రావ్యంగా కీర్తనలు గానం చేస్తూ శ్రీకృష్ణ భక్తి సాగరంలో ఓలలాడ సాగాడు మహాత్ములు సకల మానవాళికి సేవచేస్తూ పుణ్యము నార్జించుచుండ మహాత్ములను విమర్శించి వాదించి పాపమును గడించు దుర్మార్గులు కూడా ఎందరో ఉంటారు అట్టి దుర్మార్గుడొకడు నరసీ మెహతా పేరు ప్రఖ్యాతులు భక్తులలో బాగా వ్యాపించి పోతున్నాయని అసూయచెంది నరసీపై వ్యతిరేక ప్రచారం సాగించేవాడు

ఒకనాడు జూనాగడ్‌ను పరిపాలించు చక్రవర్తి కడకేగి నరసీపై చాడీలు చెప్పసాగాడు నరసీ ప్రజలను మోసగించుచున్నాడని ఫిర్యాదు చేశాడు తాను శ్రీకృష్ణ పరమాత్మ రాసక్రీడ వైభవమును తిలకించినట్లును శ్రీకృష్ణుడు తనతో స్వయముగా మాట్లాడినట్లును చెబుతూ ప్రజలను మభ్య పెట్టి మోసం చేయుచున్నాడని తెలియజేసెను

జూనాగడ్ చక్రవర్తి న ర సీ ని పిలిపించి న్యాయవిచారణ చేసెను తాను రాసక్రీడను దర్శించినదియు శ్రీకృష్ణునితో భాషించినదియు యథార్థమేనని నరసీ చెప్పెను "ఋజువేమిటి" అని ప్రశ్నించగా "ఆధ్యాత్మికానుభూతి వ్యక్తిగతమైనది సంస్కారముచే గ్రహించును దానికి సాక్ష్యాలు ఎక్కడనుండి వస్తాయి? ఎవరెవరుపొందు అ ను భ వా ల కు వారి అంతరాత్మయే సాక్షి" అని నరసీ తెలియజేసెను న ర సీ జవాబు చక్రవర్తికి నచ్చలేదు ఆవేశపూరితుడైన భూపతి "నరసీ ఋజువులేనిదే నీ కల్లబొల్లి మాటలు మేము విశ్వసించలేము ఇప్పుడు ఇక్కడే నీవు ఋజువుచేయాలి లేనిచో నీపై చర్యతీసుకొనక తప్పదని" తెలియజేయగా నరసీ నిశ్చేష్టుడై నిలబడి పోయాడు

ఆహా! అద్భుతము! భక్తజన హృదయాకాశములో ఒక అనిర్వచనీయ కాంతి కిరణము! సకల జనులు వీక్షించుచుండ దేవాలయ తలుపులు తమంతట తామే ఊడినవి ఒక పుష్పహారము ఎవరి సహాయము లేకనే తనంతట తానే కదలివచ్చి నరసి మెడ నలంకరించినది అందరికి పూలమాలయే కన్పట్టుచుండ నరసీ నేత్రాలకు శ్రీకృష్ణ పరమాత్మ దర్శన మిచ్చి తానే స్వయముగా నరసీ మెడలో పూలమాల వేసెను కరుణాపూరిత మైన ఆ సంఘటనకు నరసీ పరవశించి మూర్ఛితుడయ్యెను నరసీమెహతా భక్తి పారవశ్యమును గాంచి చక్రవర్తితో సహ సభికులందరు ఆశ్చర్య పడిరి భగవానుడు నరసీని అనుగ్రహించిన రీతికి అందరూ విస్మయ మొందిరి నరసీమెహతా దైవాంశ సంభూతుడని కొనియాడసాగిరి

గుజరాతీ రాష్ట్రంలో బూద్‌నగర్ అను పట్టణమున మదనమెహతా యను ఐశ్వర్యవంతుడుండేవాడు ఆయనకు జ్యోతిబాయి యను కుమార్తె యుండెడిది ఆమెకు వివాహము చేయవలెనని సంకల్పించి తగిన వరుని అన్వేషించమని తన కుటుంబ పురోహితుని పంపాడు ఆ రోజులలో వివాహాది విషయములందు పురోహితుల నిర్ణయమే తుది నిర్ణయము చక్కటి మేధాసంపత్తి దూరదృష్టి సమయస్ఫూర్తి నైతికశక్తి గలవారు పురోహితులుగ నుండెడివారని భావము

పురోహితుడు జూనాగడ్ చేరాడు అచ్చట ప్రముఖ వ్యక్తియైన సారంధరమెహతా అను వ్యక్తిని కలిశాడు తన రాక వివరాల నెరింగించాడు కానీ సారంగధరునికి నరసి అంటే నచ్చదు నరసీ పేరు ప్రఖ్యాతులు విని ఈర్ష్య పడేవాడు పురోహితునితో అయ్యా! మీ మదనమెహతాతో అన్నివిధాల సరితూగగల ఐశ్వర్యవంతుడు మా పట్టణములో నరసీ మెహతా ఒక్కడే నని తెలియజేసెను నరసీని ఈ విధగా అవమానించ డానికి ప్రయత్నించాడు

పురోహితుడు నరసీని సమీపించాడు తన రాక ఉద్దేశ్యాన్ని తెలియజేశాడు అయ్యా! తమరు ఐశ్వర్యవంతులని విని మా మదనమెహతా కుమార్తెను తమ కుమారునికి ఇవ్వడానికి వచ్చితిమి అని తెలిపాడు

పురోహితుని మాటలను నరసీ ఆధ్యాత్మిక ధోరణిలో గ్రహించాడు అవును తాను భాగ్యవంతుడే శ్రీకృష్ణ కృపావీక్షణమును పొందిన తనకన్నా ఈ ప్రపంచలో భాగ్యవంతులెవరు? వెంటనే నరసీ పురోహితునితో "అయ్యా మీ యభీష్టమే జరిగితీరును మీ మదనమెహతాతో బాంధవ్యమును గ్రహించుటకు మేము సిద్ధంగానే యున్నాము ఇదియే మా నిశ్చయము" అని తెలియజేశాడు పురోహితుడు సంతసించి ముహూర్త తిధినిగూడా నిర్ణయించి నరసీవద్ద సెలవు తీసుకొని బాద్‌నగర్ వెళ్ళెను పరమ భాగవతోత్తముడైన నరసీతో వియ్యమొందడము మాహాభాగ్యమని మెహతాతో పురోహితుడు చెప్పెను మెహతా దంపతులు మోదమందిరి

ఈ విషయము తెలిసిన సారంగధర మెహతా తనకు నరసీపై నున్న ద్వేషాన్ని తీర్చుకొనుటకు సరియైన సమయమాసన్నమైనదని గ్రహించాడు మదనమెహతాకు ఉత్తరం వ్రాశాడు నరసీమెహతా దరిద్రుడనియు మదన మెహతా కుమార్తెను తన కుమారునికి వివాహము చేసినచో వారి ఆస్తి నంతయు కాజేయుటకు వీలుపడుతుందని యోచించి ఈ నాటక మాడినాడని నియు ఉత్తరములో తెలియచేయుచుండెను మదనమెహతా ఉత్తరాన్ని చదువుకొని మండిపడ్డాడు వెంటనే నరసీకి ఉత్తరం వ్రాశాడు తన హోదాకు సరిపడునటుల సరితూగునటుల వారు వివాహమునకు రావలెనందనియు, అటుల కానిచో వారి అమ్మాయిని నరసీ కుమారునికి ఇచ్చుట వీలుపడ దనియు తెలిపెను.

నరసీ భార్య మనికగౌరి దిగ్భ్రాంతి చెందింది ఇక తన కుమారునికి వివాహము జరుగదేమోనని భ్రాంతి చెందింది భర్తను సమీపించి బోరున ఏడ్చింది నరసీ భార్యను ఓదార్చుతూ పిచ్చిదానా! ఎందుకంతగా వ్యధ చెందుతావు శ్యామలదాస్ మన పుత్రుడనే వ్యామోహంలో పడి యున్నావా? కాదు రాధాకృష్ణులే యాతని మాతాపితలు వాని వివాహమును వాసుదేవుడే నిర్వహిస్తాడు నిశ్చింతగా భగవన్నామాన్ని జపించు అంతా సవ్యంగా జరిగిపోతుంది" అని భగవంతునిపై తనకున్న ప్రగాఢ విశ్వాసాన్ని కనుపరచాడు

మరునాటి ఉదయమే పెళ్ళి సంబరాలతో బూద్‌నగర్‌కు ప్రయాణము సాగించవలసియున్నది నరసీ మనిక శ్యామలదాస్‌లు మాత్రమే బయలుదేరారు నరసీ తంబూర మీటుచూ సుశ్రావ్య సంకీర్తన చేయుచుండ శ్యామలదాస్ మృదంగము వాయించుచుండ మనికగౌరి తాళములు వేయుచు రిక్తహస్తములతో కుమారుని వివాహము జరిపించడానికి బయలుదేరారు ఇలాగేనా వివాహ నిమిత్తము బయలుదేరవలసినది? సకల మర్యాదలతో వస్తుసామగ్రితో అరుదెంచవలసిందని మదన్ మెహతా ఉత్తరం కూడా వ్రాసియున్నాడు నరసీకి సర్వమూ భగవంతుడే సిద్ధము చేయాలి చేస్తాడనే యాతని ప్రగాఢ విశ్వాసము

సంకీర్తన చేసుకుంటూ నరసీ కుటుంబము ఊరు పొలిమేరలు దాటారు బంధువులంతా వచ్చి వారితో కలిశారు కొన్ని నిముషాలలోనే బంధుజనులు అసంఖ్యాకముగా తయారయ్యారు వివాహ సమయంలో కావలసిన వస్తుసామగ్రిని వారే పళ్ళెరములలో పెట్టుకొని మోస్తున్నరు ఎవరీ బంధువులు? రుక్మిణీనాధుని అనుచరులు శ్యామసుందరుడైన వాసుదేవుడు శ్యామలదాస్ వివాహమును జరిపించడానికి బయలుదేరగానే అతని పరివారమంతయూ వెన్నంటి వచ్చారు శ్రీకృష్ణదేవుడు రాధ రుక్మిణి సత్యభామ జాంబవతి నాగ్నజిత్తి మొదలగు పత్నులతో కూడినవాడై దేవదుందుభులు మ్రోగుచుండ ఉద్ధవ అక్రూర కుచేల గోపికాది భక్తులును ప్రహ్లాద నారద పుండరీక పరాశర అంబరీష శుక శౌనకాది భాగవతోత్తములును కుబేరాది యక్షులును ఇంద్రాది దేవతలును గంగ యమున గోదావరి సింధు నర్మద కావేరి మొదలగు నదీమ తల్లులును స్కంధాది సేనాపతులును పావకాది వసువులును బృహస్పత్యాది విశిష్ట పురోహితులును నారదాది దేవర్షులును భృగ్వాది మహర్షులును కపిలాది సిద్ధులును చిత్రరథాది గంధర్వులును వ్యాసాది మునులును వెంటనడువగా సకల పరివార సమేతముగా నరసీమెహతా పెళ్ళివారంద్రు వైభవోపేతముగా బూద్‌నగర్ చేరిరి

జగన్నాటక సూత్రధారియైన శ్రీకృష్ణుడు అందరికంటె ముందరగా బూద్‌నగర్‌లోని మదనమెహతా గృహంబున కరుదెంచి "నేను నరసీ

పెళ్ళివారి తరపున అగ్రగణ్యుడను అదిగో నరసీ పరివారము వచ్చుచున్నది వారిని గౌరవించి తోడ్కొని వచ్చుటకు మీరు చేసిన ఏర్పాట్లు ఎమి? అని మదన్ మెహతాను శ్రీకృష్ణుడు ప్రశ్నించెను

మెహతా సిగ్గుతో తలవంచెను తన తప్పిదమును మన్నించమని ప్రార్థించుచు చేతులెత్తి పెళ్ళిపెద్దలకు నమస్కరించెను ఆహా! మెహతా ఎంతటి భాగ్యవంతుడు? వచ్చిన అతిధి ఎవరో తెలియకున్నను చేతులు జోడించి నమస్కరించు పుణ్యమునకు నోచుకొనెను శ్రీకృష్ణుడు సంత సించి! మెహతాను ఓదార్చుచూ మీరు దిగులు చెందనవసరము లేదు అంతయూ సవ్యంగా మేము జరిపింతుము అనిచెప్పి రుక్మిణీనాథుడు వివాహ మండప మధ్యమున ఆసీనుడై తన అమృత దృక్కులను నలువైపుల ప్రసరించునట్లు చేయుచూ శ్యామలాదాస్ వివాహమును బహు వైభవముగా జరిపించెను వివాహము పూర్తి అయి నరసీ జూనాగఢ్‌కు వచ్చునంతవరకు శ్రీకృష్ణుడు పరివారసమేతంగా అనుసరించి జూనాగడ్ చేరగానే పరివారముతో అదృశ్యమయ్యెను

భక్తవత్సలుడైన భగవానుని అనంత కృపావిశేషమునకు నరసీ నేత్రాలనుండి ఆనందాశ్రువులు కట్టలు త్రెంచుకొని ప్రవహించినవి భగవద్భక్తులకు భగవానుడే అండగా నిలిచియుండ వారు సాధించలేని దేముంటుంది ?

తేరీ దయాకా అంతనహీహై
హే దుఃఖ నాశీరే

"కృష్ణా నీదయ అనంతమై భక్తుల దుఃఖమును పోగొట్టునదియై యున్నది అని నరసీ భగవానుని కృపావైభవమును గూర్చి కీర్తించెను

ఒకనాడు కొందరు భక్తులు బయలుదేరి ద్వారకకు వెళ్ళుచూ మార్గమున జూనాగఢ్‌కు అరుదెంచిరి వారు ద్వారకకు యాత్ర వెళ్ళుచున్నారనియు తమవద్ద ఆరువందల వరహాల సొమ్ముఉన్నదనియు ఆ సొమ్ముకు హుండీ ఇచ్చువారెవరైనా ఈ పట్టణములో గలరేమో తెలియజేయమని

యడిగిరి. అది విని కొందరు దుండగులు నరసీమెహతా గొప్ప ధనవంతు డనియు అతనికి ద్వారకలో వర్తకశాల కలదనియు హుండీ నివ్వుటకు అతడే సమర్థుడనియు తెలిపిరి

భక్తులు నరసీమెహతా గృహంబును చేరి తమ రాకయొక్క వివరములను తెలియజేస్తూ చోరుల భయముచే ధనమును తీసుకొని వెళ్ళలేక హుండీ(Draft) యడుగుచున్నట్లు తెలిపిరి నరసీ సానుభూతిని కనపరుస్తూ వీరికి ద్వారకావాసుడే దారి చూపగలడని తలంచి హుండీ వ్రాసి ఇచ్చెను

---

జూనాగఢ్
ఆనందనామ సంవత్సరము
ఆషాఢ శుద్ధ ఏకాదశి

ద్వారకలోనుండు అత్యంత ప్రియతములు ఆత్మీయులు వర్తక శాలాధికారియైన శ్రీ సన్వల్‌సా గారికి జూనాగఢ్ నివాసి నరసీ మెహతా నమస్కరించి వ్రాయునది

యాత్రా నిమిత్తమునటకరుదెంచు కొందరు భక్తులు నా దగ్గర కొంత సొమ్ము దాచిరి దాని తాలూకు హుండీని నేను వారికిచ్చి పంపుచున్నాను హుండీని గ్రహించి ధనమునుఅనుగ్రహించెదరని ప్రార్థించుచున్నాను

ఇట్లు
శ్రీకృష్ణ పాదధూళి
న ర సీ మె హ తా

---

నరసీ వ్రాసి ఇచ్చిన హుండీని తీసుకొని భక్తులు ద్వారక చేరిరి అచ్చట వారికి సన్వల్‌సా చిరునామా తెలియలేదు తిరిగి తిరిగి అలసి పోయారు ఎవరినడిగినను ఆ చిరునామాగలవ్యక్తి ద్వారకలో లేడని తెలిపారు

చేయసాగిరి భక్తులు దిగులుచెందసాగిరి జూనాగఢ్ నివాసియగు నరసీ మెహతా తమను మోసము చేసెనని దుఃఖించసాగిరి.

భక్తులు ఇలా చింతించుచుండగానే ఒక వ్యక్తి వారి ముందుకు వచ్చెను అయ్యా తమరెవరు? అని ప్రశ్నించెను వివరమును గ్రహించి "అయ్యా! నేనే సన్వల్‌సాను నరసిమెహతా హుండి ఇచ్చినది నా పేరు తోనే మీరు వచ్చినట్లు యాత్రకి వస్తున్న ఒక భక్తునిద్వారా వరసి చెప్పి పంపగా ఇప్పుడే నాకు తెలిసింది అని వారివద్దనుండి హుండీని గ్రహించి తిరుగి వారికి ధనమిచ్చి వారు చూచుచుండగానే అంతర్ధానమయ్యెను భక్తు లందరు అది దైవలీలయని గ్రహించి అమితానంత భరితులైరి ఆ భక్తు లెంతటి పుణ్యాత్ములో కదా? సాక్షాత్తు ఆ ది దే వు ని దర్శనముతో పునీతు లయ్యారు అట్టి పుణ్యఫల విశేషమున్న వారికే ఇటువంటి అవకాశాలు లభిస్తాయి

నరసీమెహతా ఇచ్చిన హుండీకి భగవానుడు ధనము చెల్లించెననేటి వార్త దేశమంతయు వ్యాపించినది ఈ సంఘటనతో నరసీ భక్తి ప్రప త్తులు విశాలంగా వ్యాప్తి చెందాయి నరసీని దర్శించడానికి అనేక మంది భక్తులు విచ్చేసెడివారు భక్తుల సేవయే భగవంతుని సేవగా భావించి నరసీ వారిని సేవించెడివాడు.

నరసీ కొన్ని వందల కీర్తనలు గుజరాతీ భాషలో రచించాడు గుజ రాతీ వాఙ్మయములో నరసీకి ఒక విశిష్ట స్థానమున్నది తన సందేశాత్మక రచనల ద్వారా జనావళిలో జాగృతిని కల్పించాడు తాను ఆచరించిన విష యాన్నే ఇతరులకు ఆదేశించాడు గుజరాతు దేశంలో సంకీర్తనా ఉద్య మాన్నే సృష్టించాడని చెప్పవచ్చు. అతనికి భగవన్నామమే ప్రాణం సంకీర్తనే తన జీవననాడి చివరకు తన భార్య మృత్యుశయ్యపై పరుండి యున్నప్పుడుకూడా నరసీ చండాలుడని అనాటి సమాజముచే ఒక అస్పృ శ్యుని ఇంటిలో సంకీర్తన చేస్తూ ఉండినాడు

శ్రీకృష్ణుని లీలామాధురిని వర్ణిస్తూ "ఐశ్వర్యలీల యనెడి గ్రంథ మును రచించాడు "రుక్మిణీ కళ్యాణము సుదామ చరిత్ర" మొదలగు

భావగర్భిత విషయాలపై రచనయు సాగించాడు తాను ఆదర్శజీవనాన్ని గడిపాడు ఆదర్శ జీవనాన్ని సాగించినవాడే వైష్ణవుడని తెలిపాడు నిజమైన వైష్ణవు డెలాంటివాడో ఆతని ఆంతరంగిక వైభవమును తన ప్రముఖ కీర్తన "వైష్ణవ జనతో కో తెలియజేశాడు

వైష్ణవ జనతో తెనె కహియె
జెపీడ పరా ఈ జాణెరె
పరదుఃఖే ఉపకార్ కరే తో యే
మన అభిమాన స ఆణే రే ॥వైష్ణవ॥

సకల లోకమాం సహునె బందే
నిందా న కరే కేణీ రే
వాచ కాఛ మన నిశ్చలరాఖె
ఘన ఘన జననీ తేనీ రే ॥వైష్ణవ॥

సమదృష్టినె తృష్ణా త్యాగీ
పరస్త్రీ జేనే మాత రే
జిహ్వాథకీ అసత్యన బోలే
పరధన నవఝూలె హాథ్ రే ।వైష్ణవ॥

మోహమాయా వ్యాపే నహింజేనే
దృఢవైరాగ్య జినా మనమాం రే
రామనామ శుం తాలీలాగీ
సకల తీరథ తేనా తనమాం రే ॥వైష్ణవ॥

వణలోభీనె కపట రహిత ఛే
కామ క్రోధ నివార్యా రే
భణె "నరసైంయ్యో" తేనుం దరశనకరతా
కుల ఏకోతెరె తార్యా రే ॥వైష్ణవ॥

పరుల దుఃఖమును గాంచి వ్యథ చెందువాడే నిజమైన వైష్ణవుడు తాను చేయుచున్నాననే భావనయేలేక పరుల దుఃఖమును నివారించుటకు ప్రయత్నించువాడె వైష్ణవుడు

అతడు సర్వులలో పరమాత్మను సందర్శించును పరులను నిందించడు నిరాకరించడు మనస్సు వాక్కు మనుగడ శుద్ధిగలిగియుండును అతనినిగన్న మాతృదేవి జన్మయే ధన్యము

ఆతడు సమదృష్టి కల్గియుండును వాంఛారహితుడై యుండును పరస్త్రీలలో తన తల్లిని దర్శించును అసత్యమును పలుకడు పరుల ధనము నపహరించడు అతనిని మోహము అంటదు మాయచేరదు దృఢ వైరాగ్యముతో నిండియుండును మనస్సులో సదా రామ నామము కదులుచుండును తన దేహములో సకల పుణ్యతీర్థములు వెలసియుండును

లోభి కానివాడు కపటి కానేకాడు కామక్రోధాల కందనివాడు అట్టి వైష్ణవుని దర్శనమును పొందిన వ్యక్తి కర్మవలయమునుండి విడిపడి తరించును॥

పరమ భాగవతోత్తముడైన నరసీమెహతా హృదయాన్ని పైకీర్తన ద్వారా గ్రహించవచ్చును మహాభక్తుడైన జయదేవుని ప్రభావము నరసీపై బాగాపడినట్లు అతడు రచించిన కీర్తనలద్వారా తెలుస్తుంది జయదేవుని భక్తితత్వమును గోపికల పరాభక్తిని నరసీవిశేషంగా కొనియాడియున్నాడు

నరసీ వైరాగ్య సంపన్నుడు అతనిలో రగిలే భక్తిజ్వాలకు వైరాగ్య చిరుగులతోడై జ్ఞానాగ్నిని ప్రజ్వలింపజేశాయి తన భార్య కుమారుడు గతించిన తరువాత నరసీ నుండి పెల్లుబికిన మాటలే అతని వైరాగ్యమునకు ప్రతీకములై యున్నవి

"భలున్ తమోన్ భగి జంజల్
సుఖె భజనున్ శ్రీ గోపాల్

"భగవంతుని కృపచే వారు గతించిపోయారు నా వ్యధ అంతరించింది ఇక నేను సదా గోపాలుని నిరాటంకిముగా భజింతును" అని నరసీ అప్రయత్నముగా పలికాడు

గానముతో గోవిందుని చేరుటకు నిరంతరము అల్లాడిన నరసీ రాగ జీవనము సాగిసాగి గాన గోవిందమైనది నరసీ జీవచైతన్యము అనంత చైతన్యములో లీనమైనది నరసీబాట సరసము అతని మాట సమరసము పామరస్య జీవనానికి అతని సందేశమొక సంజీవము రాగకాలనులో అతని బ్రతుకొక రాజీవము

• ఓం శ్రీ ఆపద్బాంధవాయ నమః •





# భక్త కాన్హోపాత్ర

అది పవిత్ర పండరీ క్షేత్రం. చంద్రభాగా నదీతీరంలో భక్తజన సంరక్షణార్థం పాండురంగ భగవానుడు వెలసియున్న పరమపుణ్యక్షేత్రం. భక్తులపాలిటి కల్పవృక్షమై, సంత్‌పురుషుల జీవితాలకు పెన్నిధియై ఆర్త త్రాణ పరాయణుడని పేరుగాంచిన కరుణాసముద్రుడు శ్రీ పాండురంగని ప్రేమసన్నిధిలో సర్వ సంకల్పాలు సిద్ధిస్తాయి. ఆ పవిత్ర వాతావరణములో కలతచెందిన మానవ జీవితానికి పరమశాంతి లభిస్తుంది. ప్రేమమయుడైన పాండురంగని వాత్సల్యాన్ని చవిచూచిన వేలాది భక్తులు తనువులను, మనసులను, సంసారాలను త్యాగంచేసి సదా విఠల నామోచ్చరణతో మయూరాలవలె నృత్యంచేస్తూ, ఆనందాశ్రువులు కారుస్తూ, పులకాంకితులై చివరకు ఆ పుణ్యమూర్తిలో ఐక్యమయ్యారు.

పరమ నిదానమైన ఆ పవిత్ర పుణ్యస్థలిలో" పుండరీక వరదా పాహిమాం_పాండురంగ విఠలా రక్షమాం" అంటూ భక్తులు విఠలనాథుని దర్శనానికి వస్తున్నారు. ఆలయ ప్రాంగణంలో కాలిడగానే అప్రయత్నముగా అందరూ ఆగిపోతున్నారు. నోటినుండిమాటలు రావటములేదు. తనువుల్ని

మరచిపోతున్నారు మనస్సులు పట్టు తప్పుతున్నాయి స్వామి సన్నిధిలో ఎవరో పరవశించి పాడుతున్నారు ఆ పాటలో ఏదో ఓదార్పు ఉంది ఆ రాగములో ఏదో అనురాగపూరిత అనిర్వచనీయ ప్రశాంతత నిండుకొని వుంది ఆ గానాన్ని వింటూ కొందరు నిశ్చేష్టులై వున్నారు కొందరు పరవశంతో కన్నీళ్ళు కారుస్తున్నారు కొందరు రెప్పవాల్చకుండా చూస్తున్నారు తన అమృతగానంతో అందరికి తన్మయత్వాన్ని ప్రసాదిస్తున్న ఆ అపూర్వ వ్యక్తి ఎవరు ? ఆవిడే కారుణ్యమూర్తి భక్తకాన్హోపాత్ర పాండురంగని పాదదాసియై తరించిన ఆదర్శమూర్తి లలిత లావణ్య అపురూప సౌందర్య వతి నిష్కళంకయై పాండురంగని సేవలో అన్నీ వదులుకొని ఆదరినీ పోగొట్టుకొని నిరాధారమైన జీవితాన్ని సాగించిన భక్తశిఖామణి తన దివ్య పారవశ్య సంజనిత భక్తి తన్మయతలో ఎందరికో సద్భక్తిని సచ్ఛీలాన్ని ప్రసాదించిన రసమయ స్వరూపిణి తన అమృతగానంతో లోకాన్ని జోకొట్టి పరవశింపచేసిన సంగీత రసధుని నిరంతరము విరలనామ ఛత్రాన్ని ధరించి మోక్షసామ్రాజ్యాన్ని అధిష్టించిన కరుణామయి కాన్హోపాత్ర

పండరీ క్షేత్రానికి సమీపములో మంగళవేఢా అనే గ్రామమున కళావంతుల వంశానికి చెందిన శ్యామ" అనేవేశ్య ఉండెది తనఅందాన్ని తూచగలిగే పురుషులందరికీ తను ఒక ఆటవస్తువు బ్రతుకు బజారులో తన సౌందర్యాన్ని కులవృత్తిపేరిట వేలం వేసుకుంటూ నీచమార్గంలో పయనించి భాగ్యవంతురాలయింది ఆవిడగర్భాన పాపఫలితంగా జన్మించిన శిశువే ఈ కాన్హోపాత్ర బురదనుండు కమలము ఉద్భవించినట్లు బొగ్గు గనులనుండి రత్నాలు బయలు వెడలునట్లు సానివృత్తితో జీవించే శ్యామకు పరమ పవిత్రురాలు కాన్హోపాత్ర కుమార్తెఅయి జన్మించింది

కారణ జన్మురాలైన కాన్హోపాత్ర చిన్ననాటినుండి పాండురంగని పరాభక్తిలో సర్వంమరచి తదేకంగా భగవన్నామామృతాన్ని పానంచేస్తూ ఉండేది కాన్హోపాత్రకు యుక్తవయస్సు వచ్చింది ఆమె రూప లావణ్యము శరీర సౌష్టవము ఎంతటి మగవాడినైనా కలతపెట్టక మానదు పిచ్చివాణ్ణి చేయకపోదు తాను సానివృత్తిలో జీవించినను తన కుమార్తెను

అత్యున్నతముగా తీర్చిదిద్దాలనే తపన శ్యామలో ఉండేది అందుకే తాను అసహ్యించుకొంటున్న వేశ్యావృత్తిలో తన కుమార్తెను ఈనాడు ప్రవేశ పెట్టలేదు

ఒకనాడు ఆ ఊరి గ్రామపెద్దలలో ముఖ్యులు, కోటికి పడగెత్తిన కోటీశ్వరుడు నాగరశేర్ శ్యామ గృహంలోకి వస్తాడు. అది అతనికి నూతన ప్రవేశం కాదు సాని వృత్తిలో జీవితాన్ని సాగించిన శ్యామ కు అతడు సూత్రం కట్టని భర్త ఆవిడ అవసరాలన్నీ తన అవసరాలుగా భావించే వాడు ఆమె పొందుకోసం ఆస్తినంతా తాకట్టు పెట్టడానికైనా వెనుకాడడు అతని ఆదరాభిమానాలతో జీవించిన శ్యామ అతనిమాటకు ఏనాడూ వెను కాడేది కాదు ఆయన ఆజ్ఞాపనలు శిరోధార్యంగా భావించి ఆదరించేది

నాగరశేర్ ఇంటిలోకి రాగానే ప్రథమంగా ముగ్ధరాలైన కాన్హో పాత్రను చూశాడు అతని మనసు ద్రవించింది శరీరం కంపిస్తున్నది కాన్హోపాత్ర అందాన్నిచూసి తను పిచ్చివాడైపోయాడు ఒక్క అడుగులో శ్యామ ఉన్నగదికి వెళ్ళి ఆ అందాలరాశి ఎవరు? అని శ్యామను ప్రశ్నిం చాడు శ్యామ నవ్వుతూ "అదేమిటండీ? మన అమ్మాయేకదా కాన్హోను గుర్తించలేకపోయారా? నిన్ననే తాతగారి యింటినుండి వచ్చింది అని సమాధానమిచ్చింది ఆసమాధాన మునాగరశేర్‌కు చాలా బాధ కలిగించింది శ్యామా? మనఅమ్మాయి అని నీవనడం చాలా అసందర్భంగా ఉంది సానికి వయసు వరుసలేమిటి? ఆయినా పానయోగ్యమయిన సరస్సుఉంటే ఎందరో బాటసారులు దప్పికతీర్చుకుంటారు అంతమాత్రాన వారికి సరస్సుకీ బాంధవ్య మేమిటి? శ్యామా! చెబుతున్నాను జాగ్రత్తగా విను ఒకనాడు నిన్నుకోరిన నా మనస్సు నీ పొందుకై తపించిన నా హృదయం అదే ఆవేశంతో ఈనాడు కాన్హోను కాంక్షిస్తున్నది ఆమెలేనిదే నేను జీవించలేను ఆమె అందానికి నేను తలవంచాను ఆమె సౌందర్యంముందు నేను బికారి నయ్యాను నీవు నీగది ఖాళీచేసి కాన్హోపాత్రకు అప్పగించు ఆ ప్రేమ మూర్తిఆరాధనలో నా శేషజీవితాన్ని చరితార్థం చేసుకుంటాను అన్నాడు

శ్యామకు భూమ్యాకాశాలు ఒక్కటైనట్లనిపించింది తన నికృష్ట జీవితము తనకమార్తె కాన్హోకు రాకూడదని ఎంతగానో తపించింది అందుకే పుత్రవాత్సల్యాన్నికూడా నిగ్రహించుకొని మరొకచోట కాన్హోపెరిగేలా ఏర్పాటుచేసింది కానీ ఏది జరగకూడదనితాను ఊహించిందో అది ఎదురయ్యేసరికి పిచ్చిదానిలా కేరింతలు పెట్టింది గోలచేసింది తన ప్రాణాన్నయినా ఇవ్వడానికి సిద్ధమేగాని కాన్హోను ఈ పాప పంకిలంలో దించలేనని నొక్కి చెప్పింది నాగరశేర్ ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి

అరణ్యాల్ని సైతం భస్మచేసే దావానలంలా అతడు కోపోద్రిక్తుడయ్యాడు పగబట్టిన కోడెనాగులా తయారయ్యాడు ఆ గ్రామములో అతడి మాటకు ఎదురుపలికే వారులేరు దినదినానికి శ్యామ బ్రతుకు ఎడారి జీవనమయింది పలికే దిక్కుకూడా లేకుండా పోయారు డబ్బిచ్చినా సరుకునిచ్చే వారులేరు జీవితం దుర్భరమై దుఃఖమయమై కన్నీటితో తడిసిపోయింది

తల్లికివచ్చిన దీనావస్థను చూస్తున్న కాన్హోపాత్ర తీవ్రంగా ఆలోచించసాగింది ఒకనాటిరాత్రి ఎవరికీచెప్పకుండా తల్లి నిద్రపోగానే తాను ఒంటరిగా బయలుదేరి వెళ్ళింది తనవలన జన్మనిచ్చిన తల్లికి బాధ కలగకూడదని భావించింది కాన్హోపాత్ర కనుపించకపోయేసరికి శ్యామ పిచ్చిదానిలా ఏడవడం ప్రారంభించింది ఈ విషయం మంగళవేఢాలో అందరికి తెలిసింది అమాయకురాలు కాన్హోకు జరిగిన అన్యాయానికి ఊరి ప్రజలంతా పశ్చాత్తాప పడ్డారు నాగరశేర్‌కు తెలిసి శ్యామ ఇంటికి వచ్చాడు కాన్హోపాత్ర ఆత్మహత్యకు గురియై ఉంటుందని అందరూ నిర్ణయించారు నాగరశేర్ తన తప్పుదానికి బాధపడి శ్యామను ఓదార్చుతూ క్షమాపణ కోరాడు

ఇంటినుండి వచ్చిన కాన్హోపాత్ర పాండురంగని పాదసన్నిధిలో సేవ చేస్తూ తన సంకీర్తనతో వేలాది భక్తులు శ్రవణానందం చేకూరుస్తూ జీవిస్తున్నది ఈనాడు విఠలనాథుని సన్నిధిలో గానం చేస్తున్న ఆవిడ ఈ కాన్హోపాత్రయే తనకు ఇప్పుడు సర్వస్వం విఠలనాథుడే ఇంటి ధ్యాసే లేదు తనకు

కాన్హోకు దూరమైన ఆమె తల్లి శ్యామ జీవించలేక పోయింది దిన దినానికి పరిస్థితి విషమిస్తున్నది తనకు సంతోషాన్నిచ్చే శక్తి ఈ ప్రపంచ ములో ఎవ్వరికీ లేదు మృత్యువుకు తప్ప శ్యామను ఈ స్థాయిలోచూచిన నాగరశేర్‌కు బాధ జనించింది పాండురంగ దర్శనముతోనైనా శ్యామకు మనశ్శాంతి చేకూరుతుందని ఆమెను పండరీపురము తీసుకొని వెళాడు చంద్రభాగానదిలో స్నానమాచరించి పాండురంగని దేవాలయములో ప్రవే శించారు అక్కడ వేలాదిభక్తులు భక్తి ప్రపత్తులతో శ్రవణము చేస్తున్న సంకీర్తనలో పాల్గొన్నారు ఆ కంఠ మాధుర్యం వర్ణనాతీతం ఎవరిదీ కంఠం? నాగరశేర్ తదేకముగాచూశాడు అక్కడగానంచేస్తున్న వ్యక్తి కాన్హోపాత్ర ఆమెను చూడగానే తన ఆనందానికి అంతులేదు శ్యామా మన కాన్హో చావలేదు అదిగో అక్కడ పాడుతున్నది తనే అని అప్ర యత్నంగా అన్నాడు మోడుబారిన తన జీవన వృక్షం తిరిగి లలిత పల్ల వాలతో చిగురించుమన్నట్లయింది శ్యామకు తన హృదయం నుండి ఆనంద ప్రవాహము కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తున్నది కానీ దురదృష్టవంతులకు వచ్చే ఆనందము మెరుపులాంటిది నాగరశేర్ మళ్ళీ తన దుష్టభావాన్ని వెల్లడించాడు కాన్హోను ఇంటికి తీసుకురమ్మని తన కప్పగించమని శ్యామను బలవంత పెట్టసాగాడు శ్యామ ఆలోచించింది తన కాన్హో ప్రాణా లతో ఉంది తన కంతకన్నా కావలసిందిలేదు కాన్హో హాయిగా ఉంటే చాలు ఇప్పుడు తను కాన్హోను పలకరించడంవలన ఆమెకు ముప్పు వాటిల్ల గలదని గ్రహించిన శ్యామ గండె బరువుతో నాగరశేర్‌తో పలుకకుండా మగళంవేధా చేరింది

తన కోర్కెను ఈడేర్చుకోడానికి దుష్టుడైన నాగరశేర్ తీవ్రప్రయ త్నం చేయసాగాడు తనస్నేహితుడైన బీదర్ నవాబు "షావాలి" సహా యాన్ని అర్థించాడు షావాలి నాగరశేర్ వాగ్దానముచేసి కాన్హోపాత్రను పట్టి తీసుకొనిరమ్మని భటులకు ఆజ్ఞాపించాడు రాజభటులు కాన్హోను నిర్బం ధించడానికి పాండురంగని ఆలయంలో ప్రవేశించారు వేలాది భక్తులమధ్య పరవశించి గానం చేస్తున్న కాన్హోపాత్రను నిర్బంధించ ప్రయత్నించారు భక్తులు ఎంతగా వారించినా లాభం లేకపోయింది అప్పుడు కాన్హోపాత్ర

తన విఠలనాథుని దర్శించి వస్తానని గర్భాలయంలోకి ప్రవేశించింది కాన్హో హృదయ విహారి అయిన పాండురంగడు చంద్రభాగా నదిని కదిపాడు ఒక్కసారిగ చంద్రభాగానది పొంగడం ప్రారంభించింది ప్రజలంతా ప్రాణాల్ని రక్షించుకోవడానికి పరుగెత్తారు నదిపొంగి స్వామి ఆలయంలో ప్రవేశించింది రాజదూతలు ప్రాణాలు రక్షించుకోవడానికి ప్రయత్నంచేసి విఫలులయ్యారు చంద్రభాగా ఆగ్రహానికి గురి అయ్యారు చంద్రభాగా పవిత్ర జలం స్వామి పాదాలనంటి అభిషేకం చేసింది స్వామి పాదాలవద్ద పడియున్న కాన్హోను తనతో తీసుకెళ్ళి తన గర్భంలో ఇముడ్చుకొంది

ప్రవాహము ఆగగానే పాండురంగని ఆలయమునకు ప్రక్కన "తరటీ" వృక్షము ఒకటి వెలసింది భక్తకాన్హోపాత్రయే స్మృతి చిహ్నంగా వెలసిందని అందరూ భావించారు ఈనాటికీ అక్కడ ఆ భక్త కాన్హో పాత్రకు గుడికట్టి పూజ చేయడం జరుగుచున్నది

భక్త శిఖామణికాన్హో పాత్రను ఉద్ధరించి భక్త జన రక్షకుడన్న బిరుదును పాండురంగడు మరొకసారి సార్థకం చేసుకున్నాడు

• ఓం శ్రీ ముకుందాయ నమః •





# సదాశివ బ్రహ్మేంద్రస్వామి

ఆలకిస్తే కొన్ని విషయాలు అర్థమవుతాయి ఇవి ఒకరి అనుభవాన్ని పురస్కరించుకొని మరొకరు పొందే అవగాహనకు చెందినవి

అనుభవిస్తేనేగాని కొన్ని విషయాలు అర్థంకావు ఇవి తన స్వానుభవాన్ని ఆధారంగా చేసుకొని అనుభూతిపొందే ఆచరణకు సంబంధించినవి.

అనుభవంద్వారా అనుభూతిగా మిగిలే విషయాలు మళ్ళీ రెండు విధాలు (1) అనుభవించిన అనుభవాన్ని తెలియచేసేవి (2) వ్యక్తంచేయను వీలుపడక అవ్యక్తానుభూతిగా మిగిలేవి మొదటిదైన వ్యక్తానుభూతి మనసుకు సంబందించినది రెండవదైన అవ్యక్తానుభూతి మనోబుద్ధులకతీతమైనది

మనసు నుండి పొందే సుఖము దుఃఖమిశ్రితము మనోవలయంలో పరిభ్రమించే మానవుడు నిరంతరము భయాందోళనకులోనై ఉంటాడు ఒక్కొక్కసారి సరిచేయుటకు వీలులేనంతగా మనసును పాడుచేసుకుంటాడు అట్టి విపత్కర సంఘటనలో భయానక సన్నివేశాలలో తన హృదయం నుండి బయలుదేరే అభ్యర్థనను రహస్యంగా తనలోనున్న భగవంతునికి

తెలియచేస్తాడు తన జీవిత రహస్యాలను సత్యదేవుని ఎదుటవుంచి క్షమా భిక్ష కోరుతాడు తన దుఃఖాలను బాపుమాలని ప్రార్థిస్తాడు తన బాధ్యా దులను ఆలకించమని మొరపెట్టుకుంటాడు తన కోర్కెలను తీర్చమని ప్రాధేయపడుతాడు తనముండి వెడిచే ఈ అభ్యర్దనలు ఇతరులకు విను పించవు తనలో కదిలే ఈ ప్రార్దనలు ఇతరులకు వినిపించవు తాను మౌన భాషలో భగవంతునితో ముచ్చటిస్తాడు నిశ్శబ్ద నివేదనను సమర్పించు కుంటాడు అవి భగవంతునికి ఎలా వినపడుతాయి? చక్కగా వినపడుతాయి. అంతర్య ఆలికిడిని తానొక్కడే వినగలడు అంతర్యంలో పరమాత్మ లకి స్తున్నప్పుడు వినే తాను వినిపించే వానికన్న అన్యంగా లేడుకదు? ఎవరు తాను ప్రాణానికి ప్రాణంగా మనసుకు మనసుగా కంటికి కన్నుగా చెవికి చెవిగా ప్రతి శరీరంలో ఉన్నాడు శారిరక మనోబుద్ధులు వ్యక్తమవుతాయి వ్యక్తమయ్యే సంఘాతాన్ని గ్రహించే తాను అవ్యక్తచైతన్యము మనో వ్యక్త విషయాల్ని చైతన్యముచెంత ఉండవమ్ముకాని చైతన్యమును చైతన్య స్థాయిలోనే అనుభవించి అనుభూతి పొందాలి పొందిన అనుభూతి మనసు ద్వారా వ్యక్తంకాదు గనుక అవ్యక్తానుభూతిగా నిలిచిపోతుంది అట్టి అవ్యక్త చైతన్యములో సదా రిమిస్తూ ప్రాపంచిక విషయ ప్రపంచానికి అతీతంగా నిలచి జీవించే ఆత్మజ్ఞానులు మహాత్ములు అట్టివాంలో ప్రధమ శ్రేణికి చెందిన యోగిపుంగవులు నిరంతరము అద్వైతానుభూతిలో ఓలలాడే యతివరేణ్యులు శ్రీ సదాశివ బ్రహ్మేంద్రస్వాములవారు పరతత్వమును పాణిగ్రహణము చేసిన పరమహంస

శబ్దానికి మనోతరంగ చలనానికి ఎతో సన్నిహిత సంబంధము న్నది కొన్ని శబ్దాలు చెవిని పడగానే మనసులో సంకల్పాలు ప్రత్యేక కోణంలో పయనిస్తాయి హృదయంలో స్పందన కల్గుతుంది కావేరి అనెడి పదము వినపడగానే ప్రతి హిందువులో ఒక సంచలనం ఎర్పడు తుంది కావేరి పుణ్యనది బ్రహ్మగిరి కొండలలో బయలుదేరి అయిదు వందలమైళ్ళు పయనించి బంగాళాఖాతంలో కలుస్తున్నది కావేరిని దక్షిణ గంగ" అనికూడా పిలుస్తారు కావేరి పవిత్ర నదీతీరంలోనే మహాజ్ఞాని శ్రీ జ్ఞాన సంబంధులవారు అవతరించారు ఆ పుణ్యతీర్థ సన్నిధిలో ఆసీనుడై

కంబన్ మహాశయుడు రామాయణ రచన సాగింగాడు ఆ పుణ్యస్థలిలో వరించి త్యాగరాజస్వామి కీర్తనలు గానంచేసి తరించాడు

తిరుచనాపల్లి జిల్లాలో నెరూరు అనే గ్రామము కావేరినదీ సమీప మున వున్నది ఆ గ్రామ పొలిమేరలలో అద్భుత ప్రకృతిశోభలీను వన ప్రదేశముంది ఆ వనప్రదేశ మధ్యమున సమాధి నిమగ్నుడైన జ్ఞానివలె చలనరహితమై దేవాలయము దర్శనమిస్తుంది అందు ప్రవేశించగానే శివ లింగ దర్శనము దాని వెనుక బిల్వవృక్షము దాని ఛాయలో మృత్తిక లింగము దర్శనమిస్తాయి ఆ పవిత్ర సన్నిధానమే జీవన్ముక్తుడైన సదాశివ బ్రహ్మేంద్రస్వాములవారి సమాధి ప్రదేశము

యాత్రికులు అసంఖ్యాకముగావచ్చి సమాధిని దర్శించి వెళ్తుంటారు భక్తులు అత్యంత శ్రద్ధాభక్తులతో సేవచేసి వెళ్తుంటారు యతిపుంగవులు విచ్చేసి దర్శించి కొంతకాలమచ్చట సాధన కొనసాగిస్తుంటారు శృంగేరి మఠాధిపతి అయిన స్వర్గీయ నృసింహభారతి శంకరాచార్యులవారు సదాశివ బ్రహ్మేంద్రులవారి పవిత్ర సమాధి సన్నిధానమును తిలకించి తన్మయతలో యాభై శ్లోకాలు శ్రీవారిని స్తుతిస్తూ రచించారు "సదాశివ బ్రహ్మేంద్రుల వారు ఆత్మజ్ఞానుడైన పూర్ణపురుషులు శుద్ధ పరాత్పరులు ముక్తపురుషులు ఆనంద శిఖరాల నధిరోహించారు వేదాంత సత్యస్వరూపమైనవారు" అని శ్రీనృసింహభారతి స్తుతించారు

మోక్ష సోమసుందర అవధాని అనే బ్రాహ్మణుడు ఆంధ్ర ప్రాంతము నుండి కదలి కుంభకోణము సమీపమునో నివాసమేర్పరచుకొని స్థిరపడి పోయారు ఆయన భార్య పార్వతమ్మ అవధాని గొప్ప పండితుడు రామ కృష్ణాదులను భక్తిచేస్తుండేవాడు పార్వతమ్మ ఆదర్శగృహిణి శివ భక్తు రాలు నిరంతరము శివారాధనలో తన బ్రతుకును ధన్యత చేసుకుంటూ జీవి స్తుండేది నిత్యతృప్తులైన ఆ దంపతులలో ఒక నిరాశ చోటుచేసుకొని యుండేది భగవానుడు తమకు సంతానము ననుగ్రహించలేదని వ్యధ చెందే వారు తమ అభీష్టమును తెలియచేయుచు భగవంతుని ప్రార్థనలు చేసే వారు పూజలు సాగించేవారు భక్తుల మొర భగవంతు డాలకించకంటే

మరెవరు ఆలకిస్తారు? ఇంకెవరాదుకుంటారు? కొంతకాలానికి వారికొక పుత్రరత్నము కలిగాడు ముద్దులొలుకు ఆ బాలునికి తమ ఇష్టదైవముల నామములు కలిపివచ్చు విధముగా శి వ రా మ కృ ష్ణ అని నామకరణం చేశారు

దినదిన ప్రవర్ధమానమవుతున్న శివరామకృష్ణలో వింత ప్రవర్తన కనపించేది సదా అంతర్ముఖ వృత్తిలో ఉండేవాడు ధ్యానమగ్నుడై కనుపించేవాడు సకల శాస్త్రాలను ఆపోసించి అందులోని తాత్త్విక రహస్యాలను జీర్ణించుకున్నాడు సునిశిత ప్రజ్ఞావిశేషముతో చూమువారి మనస్సులను అమాంతగా ఆకర్షించేవాడు శివరామకృష్ణకు యుక్తవయస్సు వచ్చింది ఆతనిలో రగుల్కొంటున్న వైరాగ్యజ్వాల తీవ్ర రూపాన్ని దాల్చింది భయంకర దావాగ్నిలా ఏర్పడింది సాంసారిక వ్యామోహాన్ని దహింప చేసేందుకు సిద్ధంగావుంది భగవంతుని పొందుటకే మానవజన్మ ప్రాప్తించినదనియు సన్యాశాశ్రమ స్వీకారముద్వారా భగవంతుని సాధించుట సులభసాధ్యమనియు అదికూడా బ్రహ్మచర్యాశ్రమమునుండే సన్యసించుట ఉత్తమమనియు అభిప్రాయపడ్డాడు గృహస్థ జీవన మాధుర్యాన్ని రుచి చూచుటకు అంగీకరించని ఆతని అంతఃకరణ సన్యాసాశ్రమ స్వీకారానికి ఉరకలు వేయసాగింది

తనయునిలో కలిగే పరిణామాన్ని తల్లిదండ్రులు గ్రహించారు వివాహ నిశ్చయమే ఈ సమస్యను పరిష్కరించగలదని నిర్ణయించారు వివాహ విషయమై కుమారునితో ప్రస్తావించారు శివరామకృష్ణ తల్లిదండ్రులకు నమస్కరించి తనకు వివాహది విషయాలలో ఆసక్తిలేదని భగవంతుని పొందుటయే తన జీవిత లక్ష్యమని తెలియజేశాడు అందుకు తల్లితండ్రులు అంగీకరించలేదు వివాహము జరగవలెనని పట్టుపట్టారు తనకు అయిష్టమైనను జన్మనిచ్చిన తల్లిదండ్రులను తృప్తపరచడానికి వివాహానికి శివరామకృష్ణ అంగీకరించాడు ఆదర్శ తనయుడనిపించుకున్నాడు సుగుణవతియైన ఒక బాలికను చూసి శివరామకృష్ణకు వివాహము చేశారు అప్పుడాతని వయస్సు పదునేడు సంవత్సరములు

శివరామకృష్ణలో రగుల్కొంటున్న వైరాగ్యజ్వాలను వివాహ తొలకరి జల్లు ఆర్పలేకపోయింది తనహృదయంలో నిండియున్న అసంతృప్తి తొలగలేదు తన మనసులో చెలరేగే భగవత్సందర్శనాభిలాష కుంటుపడలేదు సదా ఆలోచనా సాగరములో ఈదులాడేవాడు జీవిత పరిష్కారాన్ని ఊహిస్తూ వ్యధ చెందేవాడు

శివరామకృష్ణ భార్య వ్యక్తురాలయింది తల్లిగారింట వైభవంగా కార్యక్రమము నిర్వహిస్తున్నారు బంధుమిత్రులంతా హాజరయ్యారు ఏర్పాట్లు ఘనంగా జరుగుతున్నాయి షడ్రసోపేతంగా పిండివంటలు తయారు చేస్తున్నారు శివరామకృష్ణకు ఆకలి అధికంగాఉంది వెంటనే పాకశాల గుమ్మం వద్దకు వెళ్ళి నిలబడ్డాడు నాకు ఆకలిగా వున్నది ఆహారము వడ్డిస్తారా? అని ప్రశ్నించాడు కొంతసేపు ఆగమని పాకశాలనుండి జవాబువచ్చింది నా ఆకలి తీవ్రంగా ఉన్నది నాకు పిండివంటలు వడ్డించనవసరములేదు సామాన్య భోజనమును వడ్డిస్తేచాలు లోనికి రమ్మంటారా? అన్నాడు ఎక్కువ కాలము నిరీక్షించ నవసరము లేదు త్వరగా పూర్తవుతుంది అక్కడేవుండు ప్రవేశించకు అని పాకశాలనుండి సమాధాన మొచ్చింది ఆ సమాధాన మిచ్చిందెవరోకాదు తనకు కన్యాదానము చేసిన అత్తగారు

పరిణామక్షణము రావాలేగాని ఒక్క మాట చాలు మనిష మారడానికి అక్కడేవుండు ప్రవేశించకు అన్నమాటల భావాన్ని బాహ్యార్థంలో గ్రహించాడు నిజమే ప్రవేశించకు అన్న మాట సత్యవాక్కు విస్తారమైన సాంసారిక జీవనంలో ప్రవేశించవలదని నాకు తెలియజేస్తున్నారు గృహస్థాశ్రమ పొలిమేరలోని నేను నిలబడాలి జ్ఞానసముపార్జనకు యత్నించాలి క్షుద్బాధనే నివర్తించలేని ఈ మానవులు నాలోరగిలే ఆధ్యాత్మిక ఆకలిని ఎలా రూపుమాపగలరు? అని భావిస్తూ క్షణమైనా అక్కడ నిలవకుండా బాణంలా దూసుకుంటూ వెళ్ళిపోయాడు బంధువులంతా వెతికారు మిత్రులందరూ అన్వేషించారు అనంతానికి ప్రయాణం సాగించిన వాడు అన్యులకు అంత చిక్కుతాడా? వెతికి వెతికి వేసారిపోయారు జాడ తెలియలేదు

తీవ్రవైరాగ్యంతో బయలుదేరిన శివరామకృష్ణ సత్యాన్వేషణలో పరిభ్రమిస్తున్నాడు ఆకలైనప్పుడు భిక్షకు వెళ్ళేవాడు అక్షయపాత్రగా తన దోసిటినే ఉపయోగించేవాడు నదీతీరాలలో వనప్రదేశాలలో ఎక్కువకాలం గడిపాడు భగవానుని సదా తనహృదయంలో భావించుకొని ధ్యానించేవాడు నిలువ నీడలేని తనకు పూజ సలపడానికి ప్రత్యేక మందిరాలెలా లభిస్తాయి? తన హృదయంలోనే గుడి కట్టుకొన్నాడు తన మనోమందిరములో పూజాగదిని నిర్మించుకొని భగవానుని పూజింపసాగాడు తాను ఆచరించిన ఈ మానసిక పూజను శివమానసిక పూజ" అనే కీర్తనలో చక్కగా రచించాడు

హే మహాదేవా నీవైభవము మనసు కతీతమైనది నా మనస్సుతో నిన్నెలా చింతించేది? సర్వాంతర్యామివైన నిన్ను ఏచోటపూజించేది? ఏ ఆసనాన్ని నీకు అమర్చేది? నీ కరచరణాదులు సర్వత్రా వ్యాపించియుండ నీకు అర్ఘ్యపాద్య ఆచమనాదులను ఎలా సమర్పించేది? శుద్ధ స్వరూపమైన నీకు స్నానమెలా చేయించగలను? ఆకాశాన్నే అంబరముగా ధరించిన నీకు ఏ వస్త్రాన్ని చుట్టబెట్టేది? నాగాభరణమైన నీకు ఏ ప్రత్యేకమైన ఆభరణాలు అలంకరించగలను? జాతి కులాలకు అతీతుడైన నీకు యజ్ఞోపవీతమునెలా అర్పించేది? సుగంధభరితమైన భూమికి నీవు ఆధారభూతుడవై యుండ ఏ పుష్పాలతో నిన్ను అర్చించేది? స్వప్రకాశుడవైన నీఎదుట నేను సమర్పించే నీరాజన మేపాటిది? నీ శిరము ఊర్ధ్వ లోకాల నధిగమించి యున్నది నీకు నేను ఛత్రము పట్టుట ఎట్లు? నటరాజసుందరా! నీ ఎదుట నేను నాట్యం చేయగలనా? సామగానలోలుడవైన నీ సన్నిధిలో నేను పాట పాడగలనా? సర్వవ్యాపకమైన నీకు ఎలా సాష్టాంగ దండప్రణామము లాచరించేది? వాక్కుకు అందని నిన్నుగూర్చి ఏమని ప్రార్థించేది? హే జగదీశ్వరా! నీవు నాకు ఏ వరాలు ప్రసాదించనవసరంలేదు నా ఆత్మలో నేను లయించి ఆనందించేలా ఆశీర్వదించు" అని కీర్తించాడు

శివరాముని ప్రార్థన సదాశివుని కదిలించింది భగవదనుగ్రహంతో గురుసాన్నిధ్యం లభించింది కామకోటి పీఠ శంకరాచార్యులైన పరమశివేంద్ర సరస్వతి స్వాములవారి చరణ సన్నిధిచెంత చోటు లభించింది.

పరమ శివేంద్ర స్వాములవారు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడు శివరాముని చూడగానే అతనిలో భాసించే చైతన్యదీపికను దర్శించారు? సదాశివా! అని పిలిచారు గురుసేవ చేస్తూ గురు పవిత్ర పదసరోజములచెంత కఠోర సాధన ఆచరించాడు శ్రావ్యమైన కీర్తనలు అనేకము రచించారు తర్కశాస్త్ర పండితుడై తనపై దండయాత్ర సాగించిన ఎందరో పండితులను ఎదుర్కొని ఓడించారు వ్యాసభగవానుని బ్రహ్మసూత్రములకు పతంజలి మహర్షి యోగసూత్రములకు భాష్యము రచించారు జ్ఞాని ఆంతరంగికానుభూతిని తెలియపరచుచూ "ఆత్మవిలాసము" అనే అరువది ఐదు శ్లోకముల చక్కని గ్రంథమును రచించారు తన రచనలన్నిటినీ తన గురు పాదాలకే అంకితం చేశారు తాను నిమిత్త మాత్రుడనని భావించారు గురు మహిమ వర్ణనాతీతమని శ్లాఘించారు తాను వ్రాసిన కీర్తనలలో చివరన "పరమహంసగురు" అను గురునామాన్ని కీర్తిస్తూ గానం చేశారు

గురువుగారివద్దకు వచ్చు పండితులతో సందర్భానుసారంగా వాదన చేయుచుండెడివాడు సదాశివుని సునిశిత విజ్ఞానముముందు పండితులు నిలువలేక పోయేవారు శరణంటూ తలలు వంచేవారు ఒకనాడు సదాశివునిచే పరాజితుడైన పండితుడు పరమ శివేంద్ర గురువుల చెంతకేరి సదాశివుడు వాచా వేదాంతిగా తయారవుతున్నాడనియు అతని వాచలత్వము వాగాడంబరము జ్ఞాన విస్మృతిని కలిగించుచున్నదనియు ఫిర్యాదు చేస్తాడు పరమ శివేంద్రులవారు సదాశివుని పిలిచి "సదాశివా నీవు మౌనాన్ని పాటించేదెప్పుడు? అని ప్రశ్నిస్తారు గురుదేవా! మీ ఆజ్ఞకొరకే వేచియున్నాను ఇప్పట్నుంచే మౌనవ్రతము నారంభించుచున్నాను అని గురు పాదాలకు ప్రణమిల్లాడు ఆనాటినుండి తాను శరీరాన్ని చాలించినంతవరకు మాట్లాడలేదు ఆ క్షణంనుండి సదాశివుని స్వరపేటిక శాశ్వతంగా మూగబోయింది తనకు తదనంతరము కలిగిన అనుభూతులను తెలియచేస్తూ కీర్తనలు రచించాడు తన నిజస్థితిలో తాను నిలుచుటకు గురుకృపయే కారణమని తెల్పుతూ కీర్తన రచించాడు

బ్రహ్మో వాహంకిల సద్గురు కృపయా ॥ బ్రహ్మో ॥
బ్రహ్మో వాహంకిల గురుకృపయా
చిన్మయ బోదానంద ఘనం తత్
శృత్యంతైకనిరూపిత మతులం
సత్యసుఖాంబుధి సమరస మసఘమ్ । బ్రహ్మో॥

ఆశాపాశ వినాశన చతురం
కోశా పంచకాతీత మనస్తం
కారణ మకారణ మేక మనేకం
కాలాకాల కలిదోష విహీనమ్ ॥ బ్రహ్మో ॥

"నేనే బ్రహ్మమును సద్గురు కృపచేత బ్రహ్మమును నేనే అయి ఉన్నాను సద్గురు మహిమచే చిత్స్వరూపము ఉపనిషత్ప్రతిపాదిత శుద్ధానందము నిష్కళంకము అచలసత్తా సాగరము అమృతానంద స్వరూపమునైన బ్రహ్మముగా నేను అయి వున్నాను ఆశాపాశములను సమూలముగా ఖండించునదియు పంచకోశములకు అతీతమైనదియు అనంతమైనదియు సకల కారణముల వెనుక కారణమైనదియు ఏకమైనదియు అనేకమైనదియు కాలాతీతమైన దియు కలిదోషములంటనిదియు అయిన బ్రహ్మమును నేనే అయి ఉన్నాను

పరమ శివేంద్ర గురువులకు అంతిమ సాష్టాంగ నమస్కారములు చేసి బ్రహ్మేంద్రులవారు బయలుదేరారు పసిబిడ్డవలె వివస్త్ర దేహముతో యాత్ర సాగించారు మనసు నిరంతరము బ్రహ్మ భావముయందు లయించి యుండ దేహమును కర్మఫలాలకు వదిలేసి నిశ్చింతగా జీవించసాగారు ఆత్మసామ్రాజ్య పట్టాభిషిక్తుడై ఆనంద సింహాసనముపై ఆసీనుడై సదా నంద స్వరూపుడై విరాజిల్లసాగారు అయాచితముగా లభించిన ఆహార మును మాత్రమే భుజిస్తూ అదియును లభించనిచో బ్రహ్మానంద రసామృత పానచిత్తుడై రంజిల్లసాగారు

నిర్జన నదీ కృంజగృహే మంజుల పులినైక మంజు తరతల్పే
శేతే కోపి యతీంద్రం సమరస సుఖ బోధవస్తు నిస్తన్ద్రిః

"నదీతీరముకో చిలికిపోయిన పొదరిల్లనే తన గృహముకో అరుదైన అనువైన ఇసుక తిన్నెల పడకపై పవళించి శుద్ధ సచ్చిదానంద స్థలలో ఎరుకగలవాడే ఋష అని తన ఆత్మవిలాస గ్రంథములో తెలియచేసి యున్నాడు.

సదాశివ బ్రహ్మేంద్ర స్వాములవారు పై శ్లోకములో చేసిన వర్ణన తన అంతరంగిక జీవన వికాసమునకు ప్రతిబింబము

ఒకనాడు సదాశివ బ్రహ్మేంద్రులవారికి విశ్రాంతి అవసరముకాగా ఒక పొలములో ధాన్యపు కుప్పవద్ద కూర్చుని విశ్రాంతి తీసుకుంటూ సమాధి నిమగ్నులయ్యారు సూర్యాస్తమయమయింది ధాన్యమును వీక్షించు కాపలావాడు వస్తాడు ధాన్యపుకుప్ప చెంతవున్న సదాశివులవారిని చూసాడు ధాన్యమును సంహారించుటకు ఏతెంచిన తస్కరుడని భావిస్తాడు అతని కోపము ఆకాశాన్నంటింది తన చేతనున్న కర్రతో బుద్ధి చెప్పాలనుకన్నాడు. కొట్టడానికి చేయి పైకెత్తాడు ఎత్తిన చేయి ఎత్తినట్లే ఉన్నది శరీరమంతా స్థాణువులా నిలిచిపోయింది రాత్రంతా అలాగే రాతిబండలా నిలబడిపోయాడు కాపలాదారు ఇందులో ఆశ్చర్యమేముంది ! నిర్వికల్ప సమాధిలో బ్రహ్మానందానుభూతిని అనుభవిస్తున్న సదాశివ బ్రహ్మేంద్రులను హింసించ నెవరితరము? తెల్లవారింది సదాశివులవారు సమాధినుండి బహిర్ముఖమయ్యారు తన ఎదుట శిల్పములవలె నిలబడియున్న కాపలాదారుని చూసి చిరునవ్వును చిందించారు అంతే కాపలావాని శరీరములో చలనము ప్రారంభమైంది సదాశివులవారి వైభవమును ప్రత్యక్షంగా తిలకించిన ఆ కాపలాదారు స్వామి పాదాలపైబడి క్షమాభిక్ష కోరాడు సమశ్శత్రౌచ మిత్రేచ తథామానావమానయోః — శత్రుమిత్రాదులను మానావమానములను సమానముగా భావించే బ్రహ్మేంద్రులవారు నవ్వుకుంటూ త్వరత్వరగా నడుస్తూ వెళ్ళిపోయారు సమాధి జ్ఞానముగల జీవన్ముక్తునికి బాహ్య ప్రపంచ ధ్యాస ఉండదు జీవభ్రాంతిని పోగొట్టుకొనుటచేత అతనికో

అహంకార మమకారాదులు స్ఫురించవు అజ్ఞానము గోచరించదు తాను అనుభవించే సమాధి దేశకాలాదులకు పరిమితమైనదికాదు. నిరంతరము భాసించే సహజ సమాధి రెండవ వస్తువు గోచరించని అద్వైతస్థితి అతడే ముక్తపురుషుడు

ఒకనాడు కావేరీ నదీతీరంలో ఇసుక తిన్నెలపై ఆసీనుడై నదీ తరంగాలను వీక్షిస్తూ అప్రయత్నంగా సమాధిలో ప్రవేశించారు బాహ్య ప్రపంచ స్మృతి కోల్పోయారు అది వర్షాకాలము కుండపోతగా వర్షము కురియుచున్నను సదాశివులవారు చలించలేదు నదిలో నీరు పెరుగు చున్నది అయిననూ స్వామి కదలడం లేదు పై నుండి వెల్లువ వస్తున్న సూచనలు తెలుస్తున్నాయి ప్రజలంతా గుమిగూడి అక్కడనుండి వెంటనే లేచిరమ్మని లేనిచో వరద ముంచెత్తే ప్రమాదమున్నదని ఎంతగా కేకవేసి చెబుతున్నను సదాశివులవారికి వినిపించలేదు నిజమేకదూ! ఇంద్రియ మనో బుద్ధులు అంతర్ముఖమైన జ్ఞానికి బాహ్యశబ్దాలెలా వినిపిస్తాయి? వరద రానే వచ్చింది ప్రజలంతా పరుగెత్తుకుంటూ వెళ్ళి గట్టుమీద దూరంగా నిం బడ్డారు చలించకుండా సమాధి స్థితిలోవున్న సదాశివబ్రహ్మేంద్రులు ప్రవా హంలో కొట్టుకుపోయారు ఆత్మజ్ఞానులైన సదాశివ బ్రహ్మేంద్రులవారి నిష్క్రమణ ఇలా జరిగినందుకు ప్రజలంతా చాలా వ్యథ చెందారు

మూడు నెలలు గడిచింది కావేరీ నదీతీరములో ఒక రైతు ఇసుక త్రవ్వి బండికి నింపుతున్నాడు ఆహా! ఏమి ఆశ్చర్యము? అతని పాఱకు రక్తపు మరకలు కనుపించాయి విస్మయమొందిన ఆ రైతు పాఱ అవతల పెట్టి జాగ్రత్తగా ఇసుకను తీసి చూశాడు ప్రశాంతమూర్తివలె సదాశివ బ్రహ్మేంద్రులవారు ధ్యానస్థితిలో ఉన్నారు ఆ అద్భుత దృశ్యాన్ని ఊరి ప్రజలంతా చూసి దిగ్భ్రాంతి చెందారు సదాశివ బ్రహ్మేందులవారు అపర శివావతారమని భావించారు స్వామివారికి సాష్టాంగ నమస్కారములు చేయుచు జయజయ ధ్వానాలు చేశారు

జ్ఞానికి శరీరము ఉండవచ్చుగాని అతను శారీరక పరధిలో ఉండడు శరీరానికి అవధులున్నాయేగాని జ్ఞానికిలేవు శరీరము ముక్కలైపోయినను

ఖండములైన ఆ దేహభాగాల ద్వారా జ్ఞాని అఖండ స్వరూపమై వెల్గొంద గలడు

శాంత సంసార కలనః కలావానపి నిష్కలః
యస్య చిత్తం వినిశ్చింతం సజీవన్ముక్త ఇష్యతే॥

'ఎవరికి ప్రాపంచిక విషయ ప్రపంచ వాసనలణగి నిర్మలత్వము ప్రాపించినదో ఎవరి శరీర భాగములు అనేకత్వముతో గోచరించు చున్నను తాను అఖండమై వెల్గొందుచున్నాడో ఎవని చిత్తము నిశ్చింతగానున్నదో నిర్వికారమైయున్నదో అతడే జీవన్ముక్తుడు"

అని ఆదిశంకరులు వివేక చూడామణిలో తెలియచేశారు దేహ ధ్యాస లేకుండా కావేరి నదిలో ఇసుకలో కూరుక పోయినను చిరంజీవివలె పునర్దర్శన మిచ్చిన సదాశివ బ్రహ్మేంద్రులవారి ఆధ్యాత్మిక వైభవమును గాంచి స్తంభించి నిలబడియున్న జనసమూహముపై తన చల్లటి చూపులను ప్రసరింపచేసి చిరునవ్వును అందించి మహోత్కృష్టమైన తన స్థితిని తెలియచేయు ఒక కీర్తనను రచించారు

పూర్ణ బోధోహం-సదానంద పూర్ణ బోధోహం ॥పూర్ణ॥
ప్రత్యగాత్మాహం ప్రవితత సత్యఘనోహం
శ్రుత్యంత శతకోటి ప్రకటిత బ్రహ్మాహం
నిత్యోహ మభయోహం అద్వితీయోహం ॥పూర్ణ॥

సాక్షిమాత్రోహం ప్రగలిత పక్షపాతోహమ్
మోక్షస్వరూపోహ మోంకార గమ్యోహమ్
సూక్ష్మోహ మనఘోహ మద్భుతాత్మాహమ్ ॥పూర్ణ॥

నేను పరిశుద్ధ జ్ఞానస్వరూపుడను సదానంద స్వరూపమైన జ్ఞాన స్వరూపుడను అంతరాత్మను నేను సర్వవ్యాపకమైన సత్తాస్వరూపమును శతకోటి పర్యాయములు ఉపనిషత్తులలో ప్రబోధించబడిన బ్రహ్మమును నేనే నేను నిత్యుడను భయరహితుడను అద్వితీయుడను నేను సదా జ్ఞానస్వరూపుడను నేను కేవల సాక్షిమాత్రుడను

పక్షపాత రహితుడను మోక్షస్వరూపుడను ఓంకారముచే తెలియ
బడువాడను సూక్ష్మ స్వరూపమునై యున్నాను నిష్కళంకుడను
అద్భుతమైన ఆత్మస్వరూపుడను నేను సదా జ్ఞానస్వరూపుడను

ప్రజలందరూ ఆశ్చర్యచకితులై కీర్తనను వినిపిస్తుండ సదాశివ బ్రహ్మేంద్రులు నవ్వుతూ నడచి వెళ్ళారు

ఒకసారి కుర్తాలం జలపాతంనుండి తిరునల్వేలికి స్వామి వస్తుంటారు మార్గమధ్యంలో కట్టెల వ్యాపారము చేయువారు కనిపిస్తారు అడవిలో కొట్టిన కట్టెలను ఒకచోట ప్రోగు వేస్తుంటారు సదాశివులవారిని చూడగానే ఏయ్! ఇలారా నీవు ఒక కట్టెమొద్దులాగానే కనుపిస్తున్నావు ఈకట్టెలను తీసుకెళ్ళి ఆ ప్రోగుకో వేయ"మని కట్టెల మోపును స్వామిపై నుంచుతారు స్వామి మారుపలకరు కట్టెలన్నీ శ్రమించి మోస్తారు పని పూర్తిచేసి తన దారిన తాను పోతుండగా కట్టెల వ్యాపారులు పిలిచి ఓ కొయ్యబొమ్మా ఎంతవరకు తమ ప్రయాణము? అని ఎగతాళి చేస్తారు తోటి మనిషిచేత సేవ చేయించుకొని ప్రతిఫలంగా పరాచకాలందిస్తున్న వ్యక్తులు మానవులేనా? కాదు రాక్షసత్వానికి ప్రతిరూపాలు సమదర్శన యోగులైన సదాశివులవారు నవ్వుతూ నడక సాగిస్తారు ఆ ప్రకాశునికి జరిగిన అన్యాయానికి అగ్నిదేవుని హృదయం భగ్గుమంది చూస్తుండగానే కట్టెలమోపులుకాలి భస్మమయ్యాయి ఆ సంఘటనచూసి కట్టెల వ్యాపారస్తులు కలతచెందినవారై సదాశివులవారిని క్షమాభిక్ష కోరాలని ప్రయత్నించారు అప్పటికే స్వాములవారు వెళ్ళిపోయారు ప్రాపంచిక మానవులు జ్ఞానిని సమీపించడం అసంభవమన్నంత దూరంగా వెళ్ళారు

జ్ఞానులైనవారంతా తాము నివసించిన సమాజంలో ఎన్నో బాధలకు గురయ్యారు అసూయాపరుల అనర్థ ఆవేశాలకు మత్సరగ్రస్తుల ఈర్ష్యాద్వేషాలకు ఆహుతయ్యారు అజ్ఞానములో వరించే ప్రాపంచిక మానవులు జ్ఞాని సంచరించే అద్వైత శిఖరాలను దర్శించలేరు తాము దర్శించలేని భూమికలను గురించి అర్థం చేసుకునేందుకు ప్రయత్నించకుండా ఎదురు అపార్థం

చేసుకోవడానికి సిద్ధపడతారు జ్ఞానానికి అజ్ఞానానికి అనాదిగా జరుగుతున్న సంఘర్షణే ఇది

ఆత్మజ్ఞాన విలసితుడై అవధూతవలె సంచరిస్తున్న సదాశివ బ్రహ్మేంద్ర స్వాములవారిని పిచ్చివాడని అనసాగారు పరమ శివేంద్ర స్వాములవారి దగ్గరకేగి తమ శిష్యుడు పిచ్చివాడయ్యాడని ఫిర్యాదు చేశారు ఆ మాటలువిన్న పరమ శివేంద్రులవారు సదాశివునివలె పిచ్చివాడనయ్యే భాగ్యము నా కెప్పుడు వస్తుందో? అని సెలవిచ్చారు జ్ఞానిని జ్ఞానియే అర్థం చేసుకోవాలి పరమ శివేంద్రులవలె అర్థం చేసుకున్నవారు అరుదు అపార్థం చేసుకొని అపవాదులకు గురిచేసినవారే అధిక సంఖ్యలో ఉండేవారు ముఖ్యంగా పండితులు ఒకనాడు సదాశివులవారి జ్ఞానధాటికి తట్టుకోలేక పోయినవారంతా ఈనాటి పరిస్థితిని అవకాశముగా గ్రహించి ఆయనను కాటు వేయడానికి కోడెత్రాచుల్లా తయారయ్యారు సదాశివ బ్రహ్మేంద్రుల వారు జ్ఞాని కాదనియు అతని మౌనమొక బూటకమనియు అవధూతవలె తాను తిరుగుట ఒక నాటకమనియు నిందించసాగారు నిందాస్తుతులను సమానముగా భావించే సదాశివులవారిని ఈ వ్యర్థ ప్రసంగములు కదిలించ లేకపోయాయి ఎప్పటిలాగే స్వామి నవ్వుతూ వెళ్తుండేవారు

ఒకనాడొక ఛాందస బ్రాహ్మణుడు సదాశివ బ్రహ్మేంద్ర స్వాముల వారిని తీవ్రంగా ఎదుర్కొంటాడు తన ప్రవర్తన శాస్త్రసమ్మతముకాదని తెలియచేస్తాడు అవధూతలా సంచరించి లోకాన్ని తాను మోసం చేస్తున్నట్లు ప్రకటిస్తాడు తన ఈ ప్రవర్తనకు శాస్త్ర ప్రమాణము తెలుపనిచో ఇక్కట్లకు గురికావలసి వస్తుందని బెదిరిస్తాడు అంతవరకు స్థాణువులా నిలబడి వింటున్న సదాశివ బ్రహ్మేంద్ర స్వాములవారు నదీతీరములో నిలబడియున్న చాకలివానిని సమీపించి నోరు తెరువమని సైగచేస్తారు అతని నాలుకపై తన అమృత హస్తముతో కొన్ని అక్షరాలు వ్రాస్తారు అంతే నిరక్షరకుక్షియైన చాకలి వేదమంత్రాల నుచ్చరిస్తాడు ఆనాడు జ్ఞానదేవుల వారు మహిషముచే వేదాన్ని పలికించారు ఈనాడు సదాశివ బ్రహ్మేంద్రులు చాకలి వానిచే శృతి మంత్రాలు వినిపించారు మహాత్ముల కరుణ ప్రసరిం

చాలేగాని సాధించలేని కార్యమేముంటుంది? స్వాములవారిని నిందించిన బ్రాహ్మణుని వద్దకువెళ్ళి చాకలి వేదవాఙ్మయాన్ని వినిపించసాగాడు సదా శివేంద్రులవారి ప్రవర్తనను సమర్థిస్తూ శ్రుతి మంత్రాలను ప్రమాణంగా తెలియచేశాడు అతీత జ్ఞానభూమికలో నివసించే జ్ఞాని వేదోక్త కర్మకాండకు అతీతుడని ప్రబోధించాడు మహాత్ముని ఔన్నత్యాన్ని వేదము తెలియచెయుచుండ వేదము ననుసరించవలసిన అవసరము మహాత్మునికి లేదని శృతి సమ్మతంగా తర్కాయుక్తంగా వాదించాడు పండితుని ఓడించాడు

బ్రాహ్మణునికి జ్ఞానోదయమైంది సదాశివేంద్రుల అనుగ్రహంతో చాకలి పండితుడయ్యాడు వేదవాఙ్మయాన్ని ఆపోశించిననూ పండితునికి అజ్ఞానము నశింపలేదు కలతచెందిన మనసుతో కళ్ళవెంబడి కన్నీళ్ళు కాలుచుండ తాను తరించే మార్గమేదో తెలియచేయవలసిందని సదాశివ బ్రహ్మేంద్రులవారి పాదములపై బడి దుఃఖిస్తాడు చింతతీరే మార్గాన్ని బోధించి అనుగ్రహించమని ప్రార్థిస్తాడు? కరుణా సముద్రుడైన సదా శివేంద్ర స్వాములవారు తరుణోపాయంగా ఒక కీర్తన రచించి ఇస్తారు

చింతా నాస్తికిల తేషాం ॥చింతా॥
శమదమ కరుణా సంపూర్ణానాం
సాధు సమాగమ సంకీర్ణానాం ॥చింతా॥
కాలత్రయ జిత కందర్పానాం
ఖండిత సర్వేంద్రియ దర్పాణాం ॥చింతా॥
పరమహంస గురుపద చిత్తానాం
బ్రహ్మానందామృత మత్తానాం ॥చింతా॥

"చింతయేలేదు వారికి చింతయేలేదు ఇంద్రియములను అరికట్టిన వారికి మనసును నిగ్రహించిన వారిక దయార్ద్ర హృదయులకు మహాపురుషుల సంశ్రయము బడసినవారికి చింతయేలేదు త్రికాలములందు కామాన్ని జయించి ఇంద్రియముల గర్వమణచిన వారికి చింతయేలేదు సద్గురూత్తముడైన పరమహంస గురుదేవుల

పావనచరణము లాశ్రయించిన వారికి బ్రహ్మానందరసమును పానముచేసి తృప్తిచెందిన వారికి చింతయేలేదు అలాంటి వారికి చింతలేదు చింతరాదు "

తిరుచందురులో ఒకనాడు వివాహము జరుగుచుండగా సదాశివ బ్రహ్మేంద్రస్వాములవారు ఆ వైపున నడచివస్తున్నారు వివాహ మండపము అత్యద్భుతంగా అలంకరించబడివుంది భజంత్రీలు మిన్నుముట్టేలా శబ్దతరంగాలను విరజిమ్ముతున్నారు పెళ్ళివారంతా అమితానందముతో తిరుగాడుతున్నారు పెళ్ళికుమార్తెను ఇంతలో త్రాచుపాము కరచింది ప్రథమ చికిత్స చేయుచుండగానే ఆవిడ మరణించింది కాలికి రాసిన పారాణి ఆరక ముందే కాటికి ప్రయాణము చేయవలసి వచ్చింది రెండు నిముషాల క్రితం ఆనందోత్సాహాలకు ఆలయమైన వివాహ మండప ప్రాంగణము విషాద ఛాయలతో శోకగ్రస్తమై దుఃఖాలయంలా మారిపోయింది

ఈ విచిత్ర పరిణామాన్ని చూస్తున్న సదాశివేంద్ర స్వాములవారి హృదయం ద్రవించింది పెళ్ళికుమార్తెను సమీపించారు మూతబడియున్న కనురెప్పలను తెరచారు చైతన్య హీనమైన ఆ నేత్రాలలో తన అమృత దృష్టిని సారించారు అంతే నిద్రనుండి లేచినట్లు పెళ్ళికుమార్తె లేచింది భజంత్రీలు తిరిగి ధ్వనింపసాగారు పెళ్ళిపందిరి కలకలలాడసాగింది పెళ్ళివారి హృదయాలు ఆనంద సాగరములై పొంగుతున్నాయి ఆహా కాల ప్రభంజనమా! మాయానిర్మిత ప్రపంచంలో దుఃఖమెంతసేపు ? సుఖమెంతవరకు ?

అందరి దృష్టి సదాశివ బ్రహ్మేంద్రులపై పడింది వధూవరులు స్వామి పాదాలపై పడ్డారు స్వామి యుగపురుషుడని ప్రజలంతా కీర్తిస్తున్నారు మానావమానాలను సమానంగా భావించే సదాశివేంద్రులు చిరునవ్వు నవ్వి చల్లగా చూస్తూ మెల్లగా కదిలిపోయారు జై జై సదాశివ సద్గురుకీ

సదాశివేంద్రులవారు దారిన పోతుండగా కొందరు ముస్లిం యువకులు చూస్తారు దిగంబరియై సంచరిస్తున్న స్వామి పరిస్థితి వారి కర్థం

కాలేదు ఆమార్గంలోనే నడచి వెళ్తున్న ఒక హిందువును పిలిచి కారణమునుగూర్చి ప్రశ్నించారు స్వామి ఆత్మానందమును పానముచేయు పరమహంసయనియు నశించే శరీరము తనుకాదని శరీరమును తెలుసుకొనే క్షేత్రజ్ఞుడే తాననియు అందుచేతనే దేహాధ్యాసను వదలి తిరుగుతున్నారని హైందవుడు తెలియచేస్తాడు వారికో మతద్వేషంకల ఒక ముస్లిం దుండగుని మనస్సు చివుక్కుమంది జీవకారుణ్యమన్నాలేక స్వామివెంట నడచి కత్తితో స్వామిచేతిని ఖండిస్తాడు చేయితెగి భుజాన్నంటుకొని వ్రేలాడుతున్నది రక్తము ప్రవాహంలా స్రవింపుచున్నది ప్రశాంతవదనముతో బాధారహితంగా సదాశివేంద్రులు నడచి వెళ్తుంటారు స్వామి కరమును ఖండించిన ముస్లిం యువకుడు అచ్చెరువంది స్వామి ఎదుట నిలబడి "స్వామీ! మీ చేయి తెగి రక్తం కారుచున్నది అని తెలుపుతాడు అంత వరకు స్వామికి చేయి ధ్యాసేలేదు ముస్లిం యువకుడు చెప్పగానే మరొక కరముతో ఖండించబడిన చేయిని తాకుతారు రక్త ప్రవాహము ఆగుతుంది చేయి మళ్ళీ యధాప్రకారము ఆరోగ్యవంతమవుతుంది తాను చేసిన తప్పిదమునకు దుఃఖిస్తు స్వామిపాదాలపైబడిన ముస్లిం యువకుని ఉద్దేశించి ఒక కీర్తన వ్రాసి ఇస్తారు

నహరే నహి శంకా-కాచిత్ ।నహి రే॥

అజమక్షరం అద్వైత మనంతం
ధ్యాయంతి బ్రహ్మపరం శాంతం ॥నహి రే।

యే త్యజంతి బహుతర పరితాపం
యే భజంతి సచ్చిత్సుఖరూపం ॥నహి రే॥

పరమహంస గురుభణితం గీతం
యే పఠన్తి నిగమార్థ సమేతం ॥నహి రే॥

"తాను అవ్యక్తమై అనిర్దేశ్యమై అలరారు సచ్చిదానందస్వరూపమైన ఆత్మయేకాని క్షీణించే శరీరము కాదనియు ఆ విషయములో సందేహాము అవసరము లేదనియు తెలియచేశారు అత్మ పుట్టుకలేనిది

పశించినది రెండు కానిది అనంతమైనది కమక శాంత స్వరూప మైన బ్రహ్మచింతనమే చేయదగిందని సెలవిచ్చారు
సంసార పరితాపములను వదలి ఆనందరూపమై విలసిల్లు ఆత్మ యందు లయింపవానికి సందేహము ఆవసరము లేదనియు అట్టి పరిపూర్ణ ఆత్మసుఖమును గురుపాదాలచెంత అనుభవమునకు తెచ్చు కొని తరించమని తెలియచేసారు

సదాశివ బ్రహ్మేంద్రులవారు శరీరానికి పరిమితులుకారు దేహేం ద్రియ మనోబుద్ధులు నిరంతరమూ ఆ మహాత్మునికి సేవ చేస్తున్నాయి దేశ కాలాదుల నతిక్రమించిన పుణ్యపురుషుడాయన ఒకే సమయములో సదా శివులవారు అనేకచోట్ల కనుపించినట్లుకూడా ఉన్నది సాగరమున అలలు ఏర్పడునట్లు ఒక్కొక్కసారి వారినుండి మహిమలు ప్రకటింపబడేవి అంతే గాని మహిమలు ప్రదర్శించాలనే అభిలాష వారికిలేదు. శిష్యగణాన్ని తయారు చేసుకొవడంలోగాని ప్రజాప్రశంసలను అదుకోవడంలోగాని వారికి అభిరుచిలేదు పసిపిల్లలంటే వారికి చాలా మక్కువ శాస్త్రజ్ఞానము కలదన్న గర్వముతో విర్రవీగే అహంకార పండితులకన్నా అమాయకంగా జీవించి భగవంతుని నిర్మలత్వానికి ప్రతిరూపాలై విలసిల్లే పిల్లలంటే సదా శివుల వారికి చాలా ఇష్టం

చివరి దశలో స్వాములవారు సంచారము మాని నెరూరులోనే స్థిర ముగా ఉండిపోయారు ఒకనాడు పల్లలుస్వామిని చుట్టుముట్టి మధురలో జరిగే సుందరేశ్వరుని తిరునాళ్ళ చూడవలయునని కుతూహలంగా వుందని వారి మనోభిప్రాయాన్ని తెలియచేస్తారు దీన దయాళుడైన సదా శివ బ్రహేంద్రులవారు చిరునవ్వు నవ్వి కళ్ళు మూసుకోమని ఆ పిల్లలకు సైగచేస్తారు. పిల్లలు కళ్ళు మూసుకోగానే మధురలో ఉంటారు స్వామి పిల్లలకు తిరునాళ్ళు చూపించి తినుబండారములు కొనిపెట్టి మళ్ళీ కళ్ళు మూసుకోమని సైగచేస్తారు పిల్లలు అలాచేయగానే మళ్ళీ నెరూరులో ఉంటారు పసిబిడ్డలద్వారా విషయాన్ని తెలుసుకొనిన తల్లిదండ్రులు ఆశ్చర్య పోతారు సదాశివ బ్రహ్మేంద్రులవంటి జ్ఞానులు చేయలేనిపని ఏముంటుంది.

అయితే వారు ఏది చేసినా స్వలాభాపేక్షతో చేయలేదు ప్రజాగౌరవాల్ని ఆశించి ప్రదర్శించలేదు కీర్తిప్రతిష్ఠల్ని ఆర్జించాలని ప్రకటించలేదు పరుల కొరకు అభిమానరహితంగా ప్రదర్శించారు జీవకారుణ్య బుద్ధితో చేశారు మధురలో పిల్లలకు తిరునాళ్ళ చూపించిన సమయములోనే సదాశివ బ్రహ్మేంద్రులవారు కాశి నెరూరు కంచి పూరి మొదలగు చోట్ల కూడా కనుపించారు

సదా ఆత్మరతుడై ప్రారబ్ధాధీనమైన కాయముతో ఉదాసీనంగా సంచరిస్తూ ఏదీ కోరకుండా ఎవరినీ కాదనకుండా అందరినీ ప్రేమిస్తూ ద్వేషించిన వారికిసైతము ప్రేమను అందిస్తూ వెళ్ళిన ప్రతిచోట మంచిని పంచుతూ తామరాకుపై నీటిబొట్టువలె దేహముతో సంబంధము కల్గి మనుగడను సాగిస్తున్న సదాశివేంద్రులవారు శరీరాన్ని పరిత్యజించి అనంతాత్మగా మిగిలిపోయే సమయమాసన్నమైనది ప్రారబ్ధము నశించినది దేహముతో తనకున్న సంబంధము తెగిపోయింది

ఒకనాడు సదాశివ బ్రహ్మేంద్రులవారు భక్తులందరిని పిలిచి తన అంతిమ సందేశాన్ని వ్రాశారు పాంచభౌతికమైన ఈ శరీరాన్ని నేను త్యజింపనున్నాను ఇక్కడ ఒక గుంట త్రవ్వి అందులో నా శరీరముంచి సమాధి చేయండి సమాధిపై బిల్వమొక్కను నాటండి సమాధి జరుగు సమయానికి కాశీనుండి ఒక బ్రాహ్మణుడు శివలింగమును తీసుకొనివస్తాడు ఆ శివలింగము శ్వేతవర్ణముతో ఉంటుంది శివలింగమును సమాధిముందు ప్రతిష్ఠచేసి నిత్యపూజ జరిగేలా చూడండి భగవంతుని నమ్మి జీవించండి ప్రపంచము స్థిరముకాదు అశాశ్వతము భగవానుడు హృదయకుహరములో యున్నాడు కదిలే ఇంద్రియాలను కదిలించే మనస్సును కట్టివేసి ఆత్మధ్యానంలో స్థిరపడండి సత్యాత్మను తెలుసుకొండి సత్యాన్ని విశ్వసించండి సత్యమే మిమ్మల్ని నడిపిస్తుంది అని వ్రాశారు

సదాశివేంద్రులు దివ్యపారవశ్య స్థితిలో నున్నారు భక్తుల నేత్రాలు చెమ్మగిల్లుతున్నాయి కొందరు దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడుస్తున్నారు తమముందు కదలాడే చైతన్య స్వరూపమును ఇక దర్శించలేము

కదా యని శోకగ్రస్తులై యున్నారు ఒక భక్తుడు ఆవేశపూరితుడై భగవాన్! మిమ్మల్ని వదలి మేము జీవించలేము మీరు వెళ్తే మాకింకెవరు దిక్కు? మేము భగవంతుని చేరేదెలాగు? భగవంతుని సాన్నిధ్యాన్ని పొందుటకు మేము ఏం చేయాలి? తెలియచేయండి అంటూ బోరున ఏడుస్తాడు అంతర్ముఖులవుతున్న సదాశివ బ్రహ్మేంద్రులవారు తీవ్ర ప్రయత్నంతో కళ్ళు తెరుస్తారు దుఃఖిస్తున్న భక్తుని చూస్తారు బ్రహ్మమును చేరు మార్గమును తెలియచేయమని భక్తుడు విలపిస్తున్నాడు బ్రహ్మముకేని పోలెక్కడ? అంతటా నిండియున్న బ్రహ్మమును చేరెదేమిటి? అందరూ బ్రహ్మములోనే యున్నారు వివరి కీర్తనద్వారా తమ అంతిమ సందేశాన్ని వ్రాయచ్చారు

సర్వం బ్రహ్మమయం — రేరే
సర్వం బ్రహ్మమయం
కింవచనీయం కిమవచనీయం
కింరచనీయం కిమరచనీయం ॥సర్వం॥
కిం పఠనీయం కిమపఠనీయం
కిం భజనీయం కిమభజనీయం ॥సర్వం॥
కిం బోధవ్యం కిమబోధవ్యం
కిం భోక్తవ్యం కిమభోక్తవ్యం ॥సర్వం॥
సర్వత్ర సదా హంసధ్యానం
కర్తవ్యంభో ముక్తినిధానం ॥సర్వం॥

ఉన్నదంతా బ్రహ్మమే! అంతటా నిండియున్న భగవంతునిగూర్చి ఎలా చెప్పాలి? ఎలా వ్రాయాలి? ఎలా చదవాలి? ఎలా గానం చేయాలి? ప్రబోధమెలా జరగాలి? ప్రబోధించబడే వారెవరు? నిరంతరము నేనే బ్రహ్మమను భావనతో ఉండిపోవడమే ముక్తి నిండి ఉండటమే మోక్షము అని తెలియచేశారు

నాటకం ముగియగానే తెరపడినట్లు చైతన్యం చైతన్యంలో లయించగానే నేత్రాలు మూతబడ్డాయి సదాశివ బ్రహ్మేంద్రుల శరీరము

అంతిమ శ్వాసను వదిలింది అదే సమయానికి శ్వేతలింగమును తీసుకొని ఒక బ్రాహ్మణుడు అక్కడికి వచ్చాడు తాను కాశీనుండి వచ్చుచున్నాన నియు ఒక మహాత్ముని ఆజ్ఞమేరకు ఇలా తెచ్చితిననియు తెలియచేస్తాడు. త్రికాలవేదులయిన జ్ఞానుల సత్యవాక్కులు వృధాపోతాయా? సదాశివేంద్రుల వారి భౌతికకాయాన్ని సమాధిచేసి దానిపై బిల్వ మొక్కను నాటారు సమాధిముందు శివలింగమును ప్రతిష్టించారు

నవరాత్రి ఉత్సవములు మహాసమాధి పర్వదినము ఇప్పటికీ చాలా ఘనంగా జరుపుతుంటారు సామాధి మందిరంలో నిత్యకైంకర్యమునకుగాను ఒక గ్రామాన్ని వ్రాసి ఇచ్చారు పుదుకోట రాజావారు ఇప్పుడుకూడా నవరాత్రి సమాధి దినోత్సవములు పుదుకోట సంస్థానమువారే నిర్వ హిస్తుంటారు హరికథలతోను వేదాంతోపన్యాసములతోను సదాశివ బ్రహ్మేంద్రులవారి కీర్తనలను గానంచేయు కచేరీలతోను ఆ మహోత్స వములు వైభవంగా కొనసాగుతాయి

కదిలే కొయ్యబొమ్మలా చూచువారికి కనిపిస్తూ తన జీవితకాలంలో లోకకళ్యాణం చేశారు ఈనాడు కదలని బిల్వవృక్షరూపంలో ఆశ్రితులను అనుగ్రహిస్తూ కాపాడుతున్నారు జ్ఞాని లోకాన్ని ఆశీర్వదించడానికి శరీరం అవసరమా ?

పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవా వశిష్యతే

• ఓం శ్రీ దీనబాంధవాయ నమః •





# భక్త నందనార్

భగవానుని సృష్టిలో మానవునికి సముచిత స్థానమున్నది. మంచి చెడులను గూర్చి విచక్షచేసే మనసుండుటయే మానవుని విశిష్ఠతకు కారణము బుద్ధిగల మానవుడు ఆదినుండియు సత్యాన్వేషిస్తై నడక సాగిస్తున్నాడు. విశ్వములో జీవిస్తూవిశ్వాంతర్గత సత్యాలను ఆకళింపు చేసుకోడానికి యత్నించాడు. చట్టబద్ధమైన ఈ సృష్టికి కారణ మొకటుండవలయునని హేతుబద్ధంగా గ్రహించాడు. ఈ సృష్టికి కారణమైన మూలశక్తిని ఉపాసించడానికి ప్రారంభించాడు. ప్రకృతి శోభలోనే భగవానుని దివ్యరూపాన్ని ప్రతిష్టించుకొని ఆరాధించడానికి ప్రయత్నించాడు. సృష్ట్యారాధనలో అంతఃకరణ శుద్ధిపడింది. శుద్ధిపడిన అంతఃకరణలో సత్యము సాక్షాత్కరించింది. విశ్వంలో గోచరించే శోభను తిలకించి, తాదాత్మ్యచెందే తన అంతర్యము విశ్వశోభకన్నా అన్యము కాదని బోధపడింది, బాహ్యసౌందర్యమును అంతర్యంలో అనుభవించడానికి ప్రయత్నించాడు. ఫలితాన్ననుభవించాడు. విశ్వంలో నిండియున్న చైతన్యమే తనలోనూ యున్నదని గ్రహించాడు, విశ్వము జగన్నాథునికి మందిరమైతే, తనలోని ఆత్మకు శరీరమే మందిర

మని గోచరించింది దేహామే దేవాలయమని జీవుడే దేవుడని అనుభవానికి అందినది అంతఃకరణ అదృశ్యమై ఆత్మానందము భాసించింది

స్వానుభవంతో తృప్తిచెందిన ఆత్మవిదుడు అన్యులకు ఆదర్శంగా నిలుస్తాడు ఇతరులను తరింపజేయడానికి ప్రయత్నిస్తాడు జగద్వైభవ మునుగాంచి పరవశుడైన తాను అంతర్యంలో అన్వేషించి ఆత్మైక్యము చెందినట్లే ఇతరులను అట్టి దివ్యానంద స్థితికి చేరవలయునని అభిలషించాడు ఆలోచించాడు ఆలోచనలకు ఆకృతిని కల్పించుకున్నాడు అంతర్యంలోని శోభను ప్రతిబింబించునట్లు బాహ్యంలో ఆలయాన్ని నిర్మించాడు అదియే దేవాలయము భగవానుని దివ్యమయ తేజస్సును అంతర్యంలో దర్శించుటకు ఉపకరించు బాహ్యసాధన పరికరము ఆత్మచైతన్యమును ప్రతిబింబించుటకు ఉపయోగపడు పరిశుద్ధ దర్పణము

దేహములోని దేహిని గూర్చి యోచించి తదనుగుణంగా బాహ్యములో దేవాలయమును నిర్మించుట యనగా దేహీదేహములకు దేవ దేవాలయములకు అతి దగ్గర సంబధమున్నదని గ్రహించక తప్పదు ఆర్ష ఋషుల ఆధ్యాత్మికావగాహన అంతఃకరణశుద్ధి గలవారికే అవగతమవుతుంది.

దేహామే దేవాలయము జీవుడే దేవుడు దేహములో ఆత్మను దర్శించు విధమే దేవాలయములో దేవుని దర్శించుట యను పద్ధతి ద్వారా తెలియజేయబడింది బాహ్యంలో సాగించు అర్చనలు అంతర్యంలో తొంగిచూచు అనుభూతులుగా నిండుటకు ఆగమ సిద్ధాంతాలు ఆవిర్భవించాయి

దేవాలయములో ప్రవేశించునపుడు గోపురముగుండా లోనికేగెదము గోపురము ఎత్తుగానుండును దానిపై అనేక రకములైన బొమ్మలుండును దేవతలు దిక్పాలకులు రాక్షసులు పంచభూతాదులు ఋషులు మొదలగు చిత్రములెన్నియో యుండును మానవుని శిరస్సుయే ఆలయ గోపురమని గ్రహించాలి తలకూడాను గోపురమువలె ఎత్తుగా యుండును దేవాలయ గోపురముపై బొమ్మలున్నట్లే మానవుని మస్తిష్కములోకూడా మానసిక చిత్రములు చోటుచేసుకొనియున్నవి విశ్వపరిపాలనా యంత్రాంగమంతయూ

గోపుర చిత్రములతో గోచరించులాగున మానవ జీవన రీతులన్నియు మనస్సులో వ్యక్తపరచబడి యున్నవి మనిషి మనస్సులో కదిలే దుష్ట సంకల్పాలకు ఆలయ గోపురముపై నున్న బూతుబొమ్మలు నిదర్శనమైయున్నవి. ఆలయ గోపురముపై నున్న బొమ్మలను విస్మరించి లోనికేగునట్లు బాహ్య దృశ్యములను మానసిక సంకల్పాలను అధిగమించి అంతర్ముఖం కావలయునని గ్రహించాలి

ఆలయమునుండి లోనికేతెంచగానే బలిపీఠము వస్తుంది ఆ బలిపీఠము ముందు వ్యక్తి సాష్టాంగ నమస్కారము చేస్తాడు అలాగే అంతర్ముఖమైన భక్తుడు అహంకారాన్ని భగవంతునికి బలి ఇచ్చి సంపూర్ణ శరణాగతుడవుతాడు బలిపీఠమువద్ద సాష్టాంగ నమస్కారము చేయుటలోని అంతరార్ధమిదియే

బలిపీఠమును దాటగానే ధ్వజస్తంభము కన్పిస్తుంది దానిపై ఒక పతాకమువుంది అది గర్భాలయంవైపు దారిచూపునట్లు నిలబడియుంటుంది అహంకారమును సమూలంగా నశింపచేసుకొని భగవానునికి శరణాగతుడైన వ్యక్తికి హృదయ మందిరములో ప్రవేశించే హక్కు ప్రాప్తిస్తుందని భావము

ఆలయములో ప్రవేశించగానే వాహనమూర్తి కనుపిస్తాడు శివాలయములో నందీశ్వరుడు విష్ణు దేవాలయములో గరుత్మంతుడు రామాలయములో హనుమంతుడు విఘ్నేశ్వరుని ఎదుట మూషికము సుబ్రహ్మణ్యుని ఎదుట మయూరము ఉంటాయి వాహనమెలా పూజార్హమైంది? సదా భగవానుని మోయుటచేత అలాగే అహంకారాన్ని త్యజించి సంపూర్ణ శరణాగతుడైన భక్తుడు తన మనస్సులో ప్రాపంచిక విషయాలను మోయకుండా భగవంతుని మోస్తూ జీవించాలని అర్ధము వాహనమూర్తికి భ వానునికి మధ్య నిలువకూడదని చెబుతారు భక్తునికి భగవంతునికి మధ్య నిలువకూడదనేదే అందులోని అంతరార్ధము భగవంతుని చేరేందుకు అనేక మార్గాలు కలవు ఎవరి మార్గాన్ని వారు అనుసరించవచ్చు వారి మార్గము సరియైనదికాదని వాదిస్తూ వారికి అడ్డు నిలవడము అనుచితమనేదికూడా

ధ్వనిస్తున్నది గర్భాలయములోకి ప్రవేశించగానే అంతయూ చీకటి మయంగా యుంటుంది ఏమీ కనుపించదు స్వామి కనపడకుండా తెర వేయబడి యుంటుంది కొద్దిసేపు అక్కడ ప్రశాంతంగా నిలబడగానే తెర తొలుగుతుంది గంటలు మ్రోగుతాయి నీరాజన మివ్వబడుతుంది ఆ దివ్య కాంతిలో స్వామిని దర్శించడము జరుగుతుంది అన్వేషణ అంతరించి అనుభూతి అందుతుంది రెండుచేతులు జోడించి హృదయ స్థానము చెంత నుంచుకొని నమస్కరిస్తూ నేత్రములు మూయడము జరుగుతుంది

అంతర్ముఖుడైన భక్తుడు హృదయ గుహ చెంతకు చేరగానే అవిద్యాంధకారము దట్టముగా వ్యాపించియుంటుంది కొంతకాలము నిర్మలంగా అచ్చటనే వేచియుండి సాధన కొనసాగించాలి తరువాత అజ్ఞానపు తెర తొలగుతుంది అజ్ఞానపు తెర తొలగగానే అనాహత శబ్దమనెడి ఘంటానాదము వినపడుతుంది వెంటనే జ్ఞాన ప్రకాశము నీరాజనం ప్రకాశిస్తుంది ఆ వెలుగులో ఆత్మదర్శన మవుతుంది ఆత్మదర్శన మగుటచేత భక్తుడు కళ్ళుమూసి అంతర్ముఖుడవుతాడు అట్టిదివ్యోన్మత్తస్థితిలో రెండుచేతులు హృదయ స్థానముదగ్గర కలిపి నమస్కరించడము జరుగుతుంది జీవ బ్రహ్మైక్యమే ఆ నమస్కారమునందు గోచరించు అంతరార్థము

పంచేంద్రియ నిగ్రహమే ఆలయములో జరుగు అర్చనలలో గోచరించు అంతరార్థము గర్భాలయము చీకటిగా యుండి భగవానుడు తప్ప మరేమీ గోచరించదు కంటికి స్వామితప్ప మరొక దృశ్యము కనుపించదు ఈ విధముగా దృగేంద్రియము నిగ్రహించబడుచున్నది భగవంతుని తప్ప అన్యవస్తు దర్శనము అవాంఛనీయమనికూడా తెలియజేయబడుచున్నది

ఆలయములో ఉచ్చరించబడు మంత్రములు అక్కడ ధ్వనించు ఘంటానాదము శ్రోత్రేంద్రియమును నిగ్రహించి అంతర్యములో ఆధ్యాత్మిక వాతావరణమును కలుగజేయును భగవత్సంబంధమైన విషయములనే ఆలకించవలయుననెడి భావము స్ఫురించును

ఆలయములో విరజిమ్మబడు పుష్పవాసనలు వెదజల్లబడు అత్తరు సుగంధాలు ఘ్రాణేంద్రియమును నిగ్రహించును నీలో చోటుచేసుకొని

యున్న సకల వాసనలను భగవానుని పాదములచెంత సమర్పించవలయు ననెడి అంతరార్ధము అంతఃకరణకు అందును

ఆలయమునందు అందించబడు తీర్థప్రసాదముల రసేంద్రియమును నిగ్రహించును ప్రసాదమును స్వీకరించుటద్వారా ప్రసాదబుద్ధిని ఏర్పరచుకొనుటయే అందలి సూక్ష్మావగాహనయై యున్నది

చందన భస్మాదులను శరీరమునకు అద్దుకొనుటద్వారా పుష్పములను చెవియందు ధరించుటద్వారా త్వగింద్రియము నిగ్రహించబడుచున్నది స్పర్శద్వారా భగవద్భక్తిని హృదయములో నింపుటకుచేయు ప్రయత్నమై యున్నది

ఈ విధముగా ఆలయ ప్రవేశమును చేసినది మొదలు తీర్థప్రసాదముల స్వీకరించి తిరిగి బయలుదేరునంతవరకు సాధకుడు వేయు ప్రతి అడుగు చేయు ప్రతి సంకల్పము భగవానుని అనంత చైతన్యములో లయించుటకు చేయు ప్రయత్నమైయున్నది పూజ సల్పుకొని తీర్థప్రసాదములు స్వీకరించి గర్భాలయమునుండి బయటికొచ్చిన భక్తుడు ఒక చోట కూర్చుని ధ్యానమగ్నుడై తరువాత లేచి వస్తుంటాడు అనగా భగవానుని దర్శించిన పిదప ఆత్మస్థుడై ఆత్మానందము ననుభవిస్తూ అంతర్ముఖుడై యుండవలయుననుటయే అందలి అంతరార్ధము

ఈ విధమైన అపూర్వ ఆధ్యాత్మిక మహోన్నత భావపటిమతో నిర్మితమైన హైందవ ఆలయాలు నిరుపమాన తాత్త్విక కళాఖండాలు భారత దేశమంతయూ ఇట్టి పవిత్ర ఆలయాలతో నిండియున్నది దేశమంతయూ ఆలయములు నిండియున్నను దక్షిణ భారతదేశములో వెలసియున్న ఆలయాల వైభవము అనిర్వచనీయము అందు గోచరించు శిల్ప చాతుర్యము అద్భుతము కళాసౌందర్యము అసమానము దక్షిణ భారత దేశమున ప్రాశస్త్యమై వెలయు పుణ్యక్షేత్రములలో చిదంబరము ఒకటి చిదంబర క్షేత్రములో నటరాజస్వామి క్షేత్రపాలకులు నటరాజస్వామిని సేవించి తరించిన భక్తులెందరోగలరు వారిలో నందనార్ అగ్రగణ్యులు అంత్యవర్ణమున జన్మించినను తన అకుంఠిత భక్తిశ్రద్ధలతో చిదంబరేశుని కృపకు పాత్రుడై తరించిన మహాత్ముడు

దక్షిణ భారతదేశంలో కావేరీ నదీతీరమున నున్న తంజావూరు పట్టణమునకు దూరమున కొతెరూర్ నదీసమీపమునందలి ఆదనూరు అను గ్రామములో నందనారు జన్మించాడు మాలవాడయందు జన్మించిన నందనారు అస్పృశ్యకులమునకు చెందినవాడు తమ పెద్దలందరు ఊరిలోని అగ్రవర్ణము వారికి సేవచేయుచుండెడివారు పొలము పండించుట పశువులను మేపుట చనిపోయిన పశువులను పాతిపెట్టుట మొ॥ పనులు చేయుచుండెడివారు నందనారు జన్మించిన ఆదనూరు మాలవాడ అశుభ్రతకు మారుపేరు వాడతుట్టు వచ్చిన జంతువుల ఎముకలు చర్మాలు మాంసము నిండియుండి దుర్గంధమును వెదజల్లుచుండేవి నిరంతరము కుక్కలు మొరుగుతూనే యుండేవి కాకులు గ్రద్దలు సదా ఆ వాడచుట్టూ పరిభ్రమిస్తూ ఉండేవి అప్పుడప్పుడు నక్కలుకూడా వచ్చి పర్యవేక్షించి వెళ్తుండేవి పక్షులు కుక్కలు తిని పారవేసిన మాంసపు తునకలు ఎముకలు ప్రతి ఇంటికి ముందో వెనుకో పడియుండి దుర్గంధమును వెదజల్లుచుండేవి శివశివ! ఇట్టి అపరిశుభ్ర అపవిత్ర వాతావరణములో నందనారు జీవించి మనుగడను సాగించవలసి వచ్చింది బాల్యమునందే నందనారుకు శివభక్తి ఏర్పడినది బ్రహ్మముహూర్తంలోనే నిద్రలేచి నదికివెళ్ళి స్నానమాచరించెడివాడు విభూతి ధారణచేసి దూరముగా దర్శనమిచ్చుచున్న శివాలయ గాలిగోపురమును గాంచి పరవశుడై శివ శివ శంభో మహాదేవా! యని గానంచేయుచూ గంతులేసేవాడు ప్రతిరోజు ఉదయమున తన పూజా కార్యక్రమము ముగించనిదే ఎచ్చటికి ఏతెంచెడివాడుకాడు ఏ పనిని ఆచరించెడివాడుకాడు గంగముట్టెడివాడుకాదు తోటి బాలురను తోడుతీసుకొని నదీతీరమున ఆసీనుడై వారికి భక్తిని బోధించెడివాడు వారిచే సంకీర్తన చేయించెడివాడు తాను పొలములో పనిచేయునప్పుడుగాని లేదా పశువులను మేపునపుడుగాని తనకు కొంతకాలము విశ్రాంతి లభించినచో వెంటనే మట్టితో శివలింగమును చేసెడివాడు పుష్పములను తీసుకొనివచ్చి పూజించెడివాడు శివా! నన్ను నీ పాదసన్నిధికి శాశ్వతంగా తీసుకోవా? యని విలపించెడివాడు

భగవాన్ మహేశ్వరా! ఏది నీ రుద్రరూపము నాకు చూపుము నీవు రుద్రుడవై సదా శ్మశాన వాటికలో తిరుగుచుందువు బూడిదను దేహముపై ధరించి ఎముకలమాలను మెడలో వేసుకొని కపాలమును ధరించి భిక్షకు ఏతెంచెదవు నీ దృష్టిలో జనన మరణములు రెండూ సమానమే శిధిలమైన శరీరాలకు విముక్తిని ప్రసాదించి జీవులకు నూతన శరీరముల నందించువాడవు నీవు నీ నివాస స్థానమైన కాశీ క్షేత్రము జీవులకు మోక్ష ద్వారమైయున్నది హే నీలకంఠా! గంగాధరా నీకు దూరమై నేను జీవించ లేను నన్ను శాశ్వతముగా నీ పాదసన్నిధికి చేర్చుకో" అని అహర్నిశలు రోదించేవాడు

నందనారు ప్రవర్తించు తీరు తమ వాడలోల పెద్దలకు నచ్చలేదు అగ్రవర్ణము వారివలె బ్రహ్మముహూర్తమున నదిలో స్నానమాచరించి విభూతిని ధరించి సదాశివ నామస్మరణతో కాలం వెళ్ళబుచ్చుట వారికి కష్టమును కల్గించినది నందనారు ప్రవర్తన ఉత్తమ జాతి వారికి బాధ కల్గించునేమోయని వ్యధ చెందసాగిరి జప తపాదులు ఆపివేయమని ఎన్నో విధాల చెప్పిచూచిరి నందనారుకో మార్పు రాలేదు బెదరించి చూశారు ఆయినా లాభము కనిపించలేదు బాధించి చూశారు నందనారు చలించలేదు

అయ్యా! జప సంకీర్తనలను ఆపమని మీరెందుకు నన్ను బలవంతము చేయుచున్నారో నాకు అర్థం కావడములేదు భగవానుడు మనకు జన్మను ప్రసాదించాడు భగవత్ప్రసాదితమగు జన్మను పవిత్రంగా తీర్చి దిద్దుకోవాలి భగవంతుని పొందేందుకే మానవజన్మ లభించింది ప్రాపంచిక విషయ సుఖాలలోపడి ప్రశస్తమైన మానవజన్మను వృధా చేసుకోవడం భావ్యంకాదు మీరు నా మాటను విశ్వసించండి సత్యమునే పలుకండి ఎవ్వరిని బాధించకండి మాంసభక్షణ మానండి సదా భగవన్నామామృతమును పానంచేసి తరించండి భక్తికి కులమత భేదాలు లేవు మనము అంత్యజులమని భక్తి చేయుటకు అనర్హులమని మీరు భావించకండి వేదాధ్యయనముద్వారా తత్త్వమును గ్రహించి అగ్రవర్ణములవారు తరింతురు మనము త్రికరణ శుద్ధిగా జీవిస్తూ భక్తిచేసి తరించెదము" అని అశ్రువూ

రిత నయనాలతో నందనారు వాడలోని పెద్దలకు తెలియజేసేవారు నంద నారు పలుకులు మాలవాడలోని ప్రజలకు కర్ణ కఠోరముగా నుండెడివి నంద నారు వలన వాడకు ముప్పు వాటిల్లే ప్రమాదముందని భీతిచెందేవారు తమను అనుకరిస్తున్నట్లు అగ్రవర్ణమువారు భావించినచో తద్వారా కలుగు అపాయము ఊహించరానిదని భయభ్రాంతులకు లోనయ్యేవారు తమ వాడ లోని ప్రజలందరు అగ్రకులజులచెంత నూడిగము చేయుచూ జీవింపు చున్నారు వారి ఆగ్రహమునకు లోనైనచో ఆహారముకూడా లభించదేమో నని బాధపడేవారు భక్తిని వదలి అందరివలె బ్రతుకును కొనసాగించమని అనేక విధాల నందనారుకు నచ్చచెప్పడానికి ప్రయత్నించారు వారి ప్రయ త్నాలన్నీ విఫలమయ్యాయి

నందనారు తోడి బాలురను వెంటనిడుకొని శివనామము చేయుమా గంతువేసెడివాడు శివాలయమునకు వెళ్ళి పరమశివుని దర్శనము చేసు కొందుము రండని పురికొల్పేవాడు శివ తిరునాళ్ళలో రథోత్సవసందర్భ మున రథమును లాగినచో కైలాస ప్రాప్తి కలుగునని తెలియజేసెడివాడు నందుని మాటలు బాలుర హృదయాలపై చెదరని ముద్ర వేసినవి పరమ శివుని తిరునాళ్ళ మహోత్సవములో పాల్గొని రథమును లాగుటకు బాలురం దరు పరమోత్సవమును కనుపరచుచుండిరి

ఆదనూరుకు పదిమైళ్ళ దూరమున తిరుప్పంగూరు అను గ్రామము కలదు అచ్చట చక్కటి శివాలయము కలదు భక్తులు విశేష ముగా వెళ్ళి అక్కడ శివదర్శనం చేయుకొనెడివారు తిరుప్పంగూరు గ్రామమువెళ్ళి శివదర్శనం చేసుకొనవలయునని నందునికి కోరిక జనిం చినది నందుని అభిప్రాయమును స్నేహితులందరు ఏకకంఠంతో బలపర చారు శుభ్రంగా స్నానమాచరించి నుదుట విభూతి ధరించి స్వామికి సమ ర్పింపుటకు పుష్పాదులను సేకరించుకొని బాలురందరు కలసి శివ నామ స్మరణ చేయుచు తిరుప్పంగూరుకు ఒయలుదేరారు దారిలో అనేకమంది ఈ బాలభక్తులనుగాంచి ఆశ్చర్యపడిరి చిఱుత ప్రాయముననే ఇట్టి అపార భక్తిని ప్రదర్శించు ఈ బాలురు ప్రహ్లాదుని గుర్తు తెచ్చుచున్నారని స్తుతించి సాగించిరి

నందుని పరివారము తిరుప్పుంగూరు పొలిమేరలకు చేరగానే శివా లయ గాలిగోపురము గోచరించినది నందుని హృదయము ఆనందముతో పొంగులిడినది మనస్సు పారవశ్యంతో నిండియుండ నే త్రములవెంట ఆనంద బాష్పములు కట్టలు త్రెంచుకొని ప్రవహించసాగినవి భావో ద్రేక మును నిగ్రహించుకోలేక నృత్యము చేయుచూ నందుడు గంతులువెసెను బాలురందరు శివ శివ! మహాదేవ! శంకర! అంటూ నినాదాలు చేయ సాగిరి

బాలురందరితో కలసి నందుడు నదిలో స్నానమాచరించాడు భగవ ద్దర్శనానికై తపించుచున్న మనస్సును నిగ్రహించుకోలేక వెంటనే శివ దర్శనానికై శివ సన్నిధికి బయలుదేరారు "నీలకంఠా పాహిమాం అంటూ బాలురందరూ కలసి ఆలయములో ధ్వజస్తంభమువరకు వెళ్ళారు అప్రయత్నంగా అక్కడ ఆగిపోయారు అంత్యజులైన తమకు ధ్వజ స్తంభమువరకే ప్రవేశమున్నది శివదర్శనం చేసుకొనుటకు అర్హతలేదు నందునిహృదయము ముక్కలుకావడానికి సిద్ధంగావుంది నందుని అంతః కరణ ఆవేదనను ఆపుకొలేక కళ్ళకు సరఫరా చేపింది వర్షధారనలె నేత్రాలు కన్నీటిని వర్షింపచేస్తున్నాయి

హే పతితపావన! ఫాలలోచన! పరమేశ్వరా! నీ దర్శన భాగ్య మును పొందవలెననెడి ఉత్సాహంతో నీ పవిత్ర సన్నిధి చేరాము నీ దివ్యదర్శనము లేకుండ మేము వెనుదిరిగి వెళ్ళగలమా ప్రభూ! శైశవము లోనే నా హృదయంలో భక్తి బీజాలు నాటబడ్డాయి గంగాధరా! నిజం చెప్పు వాటిని నా హృదయ క్షేత్రంలో నాటిన అదృశ్య తోటమాలివి నీవు గదా? బీజాన్ని నాటిన నీవే నీరుపోయడానికి సంశయిస్తే మా జీవన వృక్షము ఏమైపోవాలి? హృదయంలో భక్తిని నింపి ఆలయంలో నీ దర్శ నాన్ని నిరోధించుట భావ్యమా తండ్రీ?"

దయాసాగరా! నీలకంఠా! నీ ప్రతిభను నేను వివరించగా విని నిన్ను చూడవలెననెడి ముచ్చటతో నా స్నేహితులందరూ అరుదెంచినారు ఎంతో ప్రయాసతో నీపాదసన్నిధి కేతెంచిన మాపై నిర్దయ జల్లులు కురి

పించుట న్యాయమా ప్రభూ మేము పిల్లలమని నీకు కూడా చులకనగా యున్నదా? హే శంకరా భక్తికి బాలవృద్ధులను భేదముయున్నదా? మార్కండేయుని ఉద్ధరించిన మంగళ స్వరూపుడవు నీవుగావా? మమ్మిలా నెందుకిలా వేధిస్తున్నావు తండ్రీ!

హే కారుణ్యాలయా ఉమానాధా! చంద్రశేఖరా! అస్పృశ్యులమైన మాకు ఆలయ ప్రవేశం కల్పించడానికి నీవు కూడా సంకోచిస్తున్నావా? మాలవాని ప్రవేశంతో ఆలయము మలినపడునని సంశయిస్తున్నావా? గిరిజాపతీ! అధికులకు గౌరవాలు, అధములకు అగచాట్లు మానవ సమాజములోనే దర్శనీయమనుకున్నాను అవి చెంతకూడా చోటుచేసుకున్నవా హే దీనబాంధవా! భక్త వత్సలా! శంకరా! మేము నలుగురిలో నగుబాట్లకు గురికావడం నీకు వినోదమా? దరిచేరిన భక్తుల నుద్ధరించలేని నీ అశక్తతను చూచి మాత్రము ప్రజలు అపహాస్యం చేయరా?

హే సదాశివా కైలాసపతే నీ దర్శనము పొందకుండా తిరిగి మేము వెళ్ళలేము నీ దివ్యదర్శనంతో తరించడమో లేదా నీ దర్శనము లభించలేదని అంతరించడమో ఏదో ఒకటి జరిగి తీరుతుంది హే చంద్రకళాధరా! సర్వేశ్వరా! బాగా ఆలోచించు ఈ నందుడు ఈ ధ్వజస్తంభము వద్దనే పడి ప్రాణాలు అర్పించడానికి సిద్ధంగా యున్నాడు "

"హే భక్తవత్సలా భవానిశంకరా ఈ నందీశ్వరుడు నీకు నాకు మధ్య నిలబడి దర్శనముకానియ్యక అడ్డుపడుతున్నాడు నా ప్రారబ్ధకర్మమే ఈ నందీశ్వరుని రూపంలో ఏతెంచినట్లు గోచరించుచున్నది అని పసిబిడ్డవలెనందుడు విలపించసాగాడు

నందుని ఆర్తి నాగభూషణుని కదిలించింది వెంటనే పరమేశ్వరుడు "నందీశ్వరా ధ్వజస్తంభమువద్ద నందనారను నా భక్తుడున్నాడు అతనికి దర్శనము ప్రాప్తించనిచో ప్రాణత్యాగమునకైనా వెనుకాడడు కనుక నీవు ప్రక్కకు తొలగి నందునికి నన్ను దర్శించు భాగ్యమును కల్గించుము అని తెలియజేసెను

వెంటనే నందీశ్వరుడు ప్రక్కకు తొలగెను ఆనాడు నందునికొరకు ప్రక్కకు తొలగిన నందీశ్వరుడు అలాగే ఈనాటికి ప్రక్కకు తొలగి యుండుట గమనించదగిన విషయము నందీశ్వరుడు ప్రక్కకు తొలగగానే నందునకు పరమేశ్వర దర్శన భాగ్యము లభించెను తోడి బాలురతో కలసి నందుడు పారవశ్యంతో గంతులు వెయుచూ శివనామస్మరణ చేయ సాగెను చంద్రమౌళి నందుని బ్రోచిన విధమును గని భక్తులు మితానంద భరితులైరి నందనారు మహాభక్తుడని ప్రశంపించిరి

పరమశివుని సేవించి నందుడు బయలుదేరి దేవాలయము వెలుపలికి రాగానే ఆలయమునకు ఎదురుగా ఒక చిన్న గుంటక నుపించెను పవిత్రమైన నందుని మనస్సులో ఒక సత్సంకల్ప ముదయించెను ఈచిన్ని గుంటను తటాకముగామార్చినచో అది బహు ప్రయోజనకారిగా నుండునని భావించాడు స్వామిని దర్శించుటకు ఆలయమున కేతెంచు భక్తులు స్నానమాచరించుటకు పశుపక్ష్యాదులు దప్పిక తీర్చుకొనుటకు ఎంతయో ఉపయోగకరముగా నుండునని స్ఫురించింది అంతే తోడి బాలురను వెంటనిడుకొని ఆ గుంటను త్రవ్వడానికి నందుడు ప్రయత్నించసాగాడు పూపవయస్సులోని పిల్లలెక్కడ? తటాకమును త్రవ్వుటమేమిటి? ఇంతటి వజ్రసంకల్పము నందునకేల స్ఫురించినది? తన ప్రయత్నము ఫలించే అవకాశమున్నదా? ఏమో సమస్యను తయారు చేసినవాడే పరిష్కారమునుకూడా అందించునని నందుని విశ్వాసము విశ్వాసముతో జీవించు భక్తుల జీవితాలలో దుర్లభమను పదమే వుండదు

నందుడు గునపముతో గుంటను త్రవ్వుతున్నాడు బాలురుకూడా గుంటను త్రవ్వి మట్టిని దూరంగా తీసుకొనివెళ్ళి పోయుచున్నారు ఇలా చేస్తే తటాకము ఎన్ని సంవత్సరములకు తయారవుతుంది చూస్తుండగనే కొన్ని వందలమంది కూలీలు అక్కడ హాజరై నందుని పనిలో చేయికలిపారు సర్వాంగసుందరమైన తటాకమును తయారు చేశారు తటాకము పూర్తయింది నందుని మనస్సు ఆనందముతో నిండిపోయింది పిలువకనే వచ్చి, ఏమీ ఆశించకుండా ఇంతటి మహోన్నత కార్యాన్ని సఫలీకృతం

చేసిన వందలాది కూలీలకు తన కృతజ్ఞత లందజేయాలని బయలుదేరాడు ఇంకెక్కడి పనివారలు ? పనిపూర్తి కేతెంచిన కూలీయ పని పూర్తికాగానే ఎందుకుంటారు? నందునికి పరిస్థితి ఎరుకపడింది భక్తుని కోర్కెను సఫలం చేయుటకు శివప్రేరణతో కైలాసమునుండి కదలివచ్చిన శివసేవయే ఈ కూలీలని నందుడు గ్రహించి భగవంతుని ఆశ్రితజన రక్షణమునకు పులకాంకితుడై కన్నీరు గార్చెను

నందుడు త్రవ్విన తటాకమునుచూసి గ్రామస్థులందరూ ఎంతగానో సంతోషించారు నందుని ప్రశంసించారు భక్తాగ్రగణ్యుడని కొనియాడారు నందనారు తోడి బాలురతో కలసి మరొకసారి నీలకంఠుని దర్శించి ఆదనూరు బయలుదేరాడు

నందుడు యధాప్రకారము బ్రహ్మముహూర్తముకో స్నాన జప ధ్యానాదులాచరిస్తూ తోడి బాలురతో కలసి సంకీర్తన సాగించుచు ఆనందముగా జీవించుచుండెను ఒకసారి తమ గ్రామమునకు కొద్దిదూరములో వేదీశ్వరాలయంలో జరుగు తిరునాళ్ళను వీక్షించవలయునని నందుడు భావించి తన మిత్ర బృందమునకు తెలియజేసెను వారందరు తమ యజమానులవద్దకెళ్ళి అనుమతించవలసిందని ప్రార్థించగా ఒక్కరోజు మాత్రమే అనుమతి లభించింది అదే మహాప్రసాదంగా భావించి నందుడు మిత్ర బృందముతో కలసి "వేదీశ్వరస్వామి దర్శనానికై బయలుదేరాడు

తిరునాళ్ళ చాలా వైభవముగా జరుగుచున్నది నందుడు మిత్ర బృందముతో కలసి నదిలో స్నానమాచరించి నుదుట విభూతిని ధరించి స్వామిని దర్శించవలెనని ఆలయముచెంత కదుదెంచుచున్నాడు ఇంతలో వేదీశ్వరస్వామి రథోత్సవము ప్రారంభమైనది నందుడు దూరముగా నిలబడి చేతులు జోడించి నమస్కరిస్తూ హే భక్తవత్సలా దయాసాగరా నీ దర్శనభాగ్యమునకు నోచుకోని మాలాంటి అభాగ్యులైన అస్పృశ్యులకు దర్శనమివ్వడానికేనా నీవు ఊరేగుచున్నది? ప్రభూ! ఆలయంలో విశ్రాంతిగా నుండక దీనజనుల నుద్ధరించుటకై ఇలా వీధులవెంట నడుస్తున్నావా? ఆలయానికొచ్చి నిన్ను దర్శించలేని రోగపీడితులకు ముదుసలులకు దర్శన

మీరు టికై ఎండలో ప్రయాణము చేయుచున్నావా॥" అని నందుడు కన్నీరు కార్చుచు విలపించెను. జనులందరు రథమును లాగుచుండ ఆ భాగ్యానికి నోచుకొని నందుడు స్వామిని సరాసరి తన హృదయంలోకి లాగుకొని తృప్తి చెందాడు.

రథోత్సవము సాగుతున్నది. నందుని మనస్సు మరొక చోటికి ఆకర్షింపబడింది. ఆలయ ముఖద్వార ముందు ఒక భాగవతుడు హరికథా కాలక్షేపము చేయుచుండుట చూచి నందుడు మిత్రబృందముతో వెళ్ళి అక్కడ ఆసీనుడయ్యాడు. శివలీలలను శ్రవణంచేయు భాగ్యము కల్గినందుకు సంతసించాడు.

హరిదాసు కథ ప్రారంభించాడు. చిదంబర క్షేత్ర పాలకుడైన నటరాజస్వామి వైభవమును కీర్తించుచు హరిదాసు గానం చేయసాగాడు. నందుడు ఇంతవరకు నటరాజ స్వామిని గూర్చి వినియుండలేదు. నటరాజ స్వామి వైభవము వింటున్నకొద్ది నందునికో నూతన పరిణామము రానాగింది. హరిదాసు భావగర్భితంగా సుశ్రావ్యంగా నటరాజుని వైభవమును గానం చేస్తున్నాడు.

వర్ణించ నెవరి తరము ?
నటరాజ సుందరుని – చిదంబరేశుని
వర్ణించ నెవరి తరము ?
చిదంబర మొక పావన క్షేత్రము
కాశీసేతువులకన్నా యధికము
నాణ్యమైన నటరాజ వైభవము
నయనానందము భవభయహరము ॥వర్ణించ॥
కుడిపాదము క్రింద అజ్ఞానము బలి
ఎడమ పాదము క్రింద జీవన నాట్యరవళి
భక్తులను తరియించు పావన చరితుండు
సుందర రూపుడు చిదంబరేశుడు ॥వర్ణించ॥

హరిదాసు గానము నందుని హృదయంపై గాయాన్ని సృష్టించింది ఎలాగైనా నటరాజస్వామిని దర్శించవలయునని నందునిలో కుతూహలము జనించింది చిదంబరమునకు బయలుదేరుదమని మిత్రబృందాన్ని కోరాడు వారందుల కంగీకరించలేదు ఒక్కరోజుమాత్రమే యజమానిపెద్దనుండి అనుమతి గైకొని వచ్చాము చిదంబరము వెళ్ళినచో యజమాని తీవ్ర ఆవేశమునకు గురికావలసి వస్తుందని చెప్పి చిదంబరమునకు నందుని ప్రయాణమును ఆపించి అందరూ కలసి ఆదనూరు చేరడానికి బయలు దేరుతున్నారు

నందుడు హరిదాసుని సమీపించి అతని పాదాలపై పడ్డాడు మహాత్మా! నటరాజుని చూడవలయునని నా మనస్సు తీవ్రావేశముతో నున్నది నాకు నటరాజుని దర్శనము లభించునా? యని ప్రార్థించాడు

నాయనా! నటరాజస్వామి భక్తజనప్రియుడు దరిచేరువారి దుఃఖమును తృటిలో దూరం చేయువాడు జన్మాధిక్యశ్రేష్ఠులు ఎరిసంపదలు చదువు సంధ్యలు భగవానుడు చూడడు నిశ్చలభక్తి నిరాడంబర జీవనము ప్రేమ ఇవియే భగవంతుడు ఆశించునవి నీవు చిదంబరము వెళ్ళుము ఆర్తత్రాణ పరాయణుడైన నటరాజస్వామి నిన్ను ఆశీర్వదించి అనుగ్రహించును అని తెలియజేసెను

హరిదాసు ప్రేమపలుకులు నందుని చెవులలో ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి మిత్రబృందముతో కలసి నందుడు ఆదనూరు చేరాడు నందుని హృదయంలో శాంతి మాయమైంది నటరాజస్వామి దర్శనానికి మనస్సు ఉరకలు వేయుచున్నది నిరంతరము నందుని మనస్సు నటరాజుని యందే లగ్నమై యున్నది నటరాజస్వామిని దర్శించు సంకల్పముతప్ప మరియొక సంకల్పము నందుని మనస్సులో ప్రవేశించడము లేదు పొలములో పని చేయుచూ ఒక్కొక్కసారి పనిముట్లను పారవేసి శివా! శంకరా! నటరాజ! నర్తన సుందరా! అని గంతులు వేసేవాడు తోడిబాలురు గుమిగూడగానే వారిచే శివ స్మరణచేయించెడివాడు కాలం కదులుతున్నది గడచిన క్షణము తిరిగి వస్తుందన్న నమ్మకము లేదు తొందరగా నటరాజస్వామి

దర్శనము చేసుకొనవలయును అని దుఃఖిస్తూ నేలమీదపడి పొర్లేవాడు ఒక్కొక్కసారి మేనుమరచి నటరాజనామం చెబుతూ నృత్యం చేసేవాడు

ఆహాః ఏమి ఈ పారవశ్యము? ఎక్కడిదీ దివ్యోన్మాదము? నందుడు సామాన్య భక్తుడు కాడు ఈతనిలో కదులు వైరాగ్యజ్వాల ఎంతటి అజ్ఞానారణ్యమునైనను దహించగలదు నటరాజస్వామిని దర్శించా లనెడి నందుని సంకల్పము నెరవేరు శుభసూచనలు కన్పించడము లేదు తనకు నటరాజస్వామికి మధ్య తన యజమాని అడ్డుగోడలా నిలచి యున్నాడు యజమాని అనుమతి నొసంగడు యజమాని అనుమతిలేనిదే తాను చిందంబరము వెళ్లుట సాధ్యపడదు

ఒకనాడు సాహసించి నందుడు యజమానిని సమీపించాడు తన యజమానియైన బ్రాహ్మణునకు చేతులెత్తి నమస్కరించాడు అయ్యా! వందనములు నా మనస్సులో ఒక కోరిక చేరి రాత్రింబవళ్ళు నాకు విశ్రాంతి నివ్వక బాధపెట్టుచున్నది చిదంబర క్షేత్రపాలకులైన నటరాజ స్వామిని దర్శించవల[illegible]నని నా మనస్సు ఆరాటపడుచున్నది జీవుల దుఃఖ ములను హరింపజేయు మోక్షమును ప్రసాదించు నటరాజమూర్తిని చూచుటకు నా నేత్రాలు కుతూహలపడుచున్నవి దయచేసి నాకు అనుమతి నొసంగి ఆశీర్వదించండి నేను చిదంబరము వెళ్ళి నటరాజస్వామిని దర్శించి తిరిగి వచ్చి యధాప్రకారం తమ పొలములో పనిచేయగలవాడను అని నందుడు ప్రార్థించాడు

యజమానియైన బ్రాహ్మణునికి నందుని మాటలు కర్ణకఠోరంగా గోచరించాయి అతని కోపం తీవ్రస్థాయికి చేరింది ఓరీ నందా నీకు మతి చలించలేదుకదా! నీవేమిటి? నటరాజస్వామి దర్శనం చేయడమేమిటి? మానస సరోవరంలో వరాహము జలకమాడగలదా? పండిత సభలో శున కము ఆసీనమై యుండగలదా? మహాయోగులకు ధ్యానావేశమును కల్పించు నటరాజస్వామి సుందరరూపాన్ని దర్శించే హక్కు నీచకులమునందు జన్మించిన నీకెక్కడిది? అనవసర వ్యర్థ ప్రసంగములుమాని పొలముకెళ్ళి పనిచేయుము ఇలాంటి విషయాలు ఇకమీదట మళ్ళీ తలపెట్టినచో నిన్ను శిక్షించక తప్పదు అని గద్దించి లోనికెళ్ళెను

నిరాశ చెందిన మనస్సుతో బరువైన అడుగులు వేసుకుంటూ నందుడు పొలము చేరాడు ఆహారము రుచించడము లేదు కంటిపై రెప్ప వాలడంలేదు. సదా నటరాజ నామస్మరణతో హృదయము నిండిపోయింది గాలికి కదులుతున్న చెట్ల కొమ్మలను చూచి నటరాజుని నాట్యవిన్యాసంగా భావించి నందుడు విలపిస్తున్నాడు ఆకాశాన ధ్వనించిన మేఘగర్జనము విని నటరాజుని డమరుక శబ్దమని విశ్లేష్టుడవుతున్నాడు నింగిని తొంగిచూసే మెరుపులను నటరాజసుందరుని దేహకాంతిగా భావించి ముగ్ధుడగుచున్నాడు కుండపోతగా వర్షము కురియుచుండగా అది నటరాజస్వామి తనపై కురిపిస్తున్న దయామృతమని భావించి గంతులేస్తున్నాడు రాత్రంతయు పొలములో వర్షానికి తడిచి ఉదయాన్నే ఇల్లు చేరుకున్నాడు ఏపని చేయడానికి మనస్సంగీకరించడంలేదు తీవ్రంగా ఆలోచించేవాడు నటరాజా! నటరాజా! అని ఒక్కొక్కసారి గంతులేసేవాడు ఇలా కొంతకాలము గడచింది చిదంబరములో నటరాజస్వామి తిరునాళ్ళ ఇక మూడు రోజులు మాత్రమే యున్నదని నందనారు చెవిని పడింది ఈ సంకల్పము నందునిలో తీవ్రసంచలనాన్ని కల్గించింది ఎలాగైనా చిదంబరము వెళ్ళి నటరాజస్వామి తిరునాళ్ళ మహోత్సవమును తిలకించి ధన్యత చెందవలయునని వజ్రసంకల్పము ఏర్పడింది

నందుడు యజమాని వద్దకెళ్ళి చేతులు జోడించి నమస్కరించాడు మౌనంగా నిలబడ్డాడు "ఎందుకొచ్చావు?" అని యజమాని ప్రశ్నించాడు నందుడు యజమానికి నమస్కరిస్తూ మహాత్మా ఎంతచక్కటి మాట సెలవిచ్చారు ఎందుకొచ్చావు? అని మీరడిగిన ప్రశ్నలో ఎంత గంభీర భావమున్నది? నిజమే మానవుడు ఈ ప్రపంచానికి ఎందుకు వచ్చాడో మరచిపోయాడు ప్రాపంచిక విషయ వాసనాలోలుడై శాశ్వతానందమునే మరచిపోయాడు. నశించిపోయే శరీరమే శాశ్వతమని నమ్మి దానిని రక్షించుకొనుటకు చేయరాని పనులు చేస్తున్నాడు సంసార వ్యామోహానికి లోనై జన్మనిచ్చిన భగవంతునే మరచిపోయాడు విశ్వగారడీ వినోదాన్ని తిలకించడములోనే తన కాలాన్నంతా వృథా చేసుకుంటున్నాడేగాని విశ్వనాథుని పాదాలచెంత జేరి తరించాలని చింతించలేకపోతున్నాడు తాను ఎక్కడ

ఖుడైన వానికి భగవత్సన్నిధిలో చోటు లభించదని శాస్త్రవచనము భృత్యుడైన వానికి స్వామి సేవయె శరణ్యము యజమానిని కష్టములకు గురి చేసిన వానిని భగవంతుడు కూడా అంగీకరించడు నీవు చిదంబరము వెళ్ళుట నాకునూ ఆమోదమే కానీ ఈ మూడు రోజులలో నా పొలమును పండించి ధాన్యమును నా ఇంటజేర్చి వెళ్ళవలెనంది " అని యజమాని తెలియజేసెను

నందునికి పరిస్థితి అవగతము కాలేదు మూడు రోజులలో పొలం పండించుటయా? దుస్సాధ్యము ఇంతటి విషమ పరీక్షను తనెలా నెగ్గ గలడు ? నందనారు మనస్సు తీవ్రంగా ఆలోచింపుచున్నది ఇంతలో యజమాని కల్పించుకొని "నందా! నివు నిజంగా భక్తుడవే అయినచో సందే హించ పనిలేదు భక్తజన రక్షకుడైన వటరాజస్వామి నీ మొర యాలకించడా? గతంలో ఎందరో భక్తులను భగవానుడుద్ధరించాడు నీ భక్తి యధార్థమే అయినచో నిన్నును అనుగ్రహించి తన పాదసన్నిధికి రప్పించు కొనును" అని తెలియజేసెను

యజమాని పలుకులు నందుని మనస్సును తేజోవంతము చేసినవి అవును నిజమే యజమాని మాటలలో సత్యమున్నది నా భక్తి నిజమైనదో కాదో? గ్రహించుటకు చక్కటి తరుణము ఆసన్నమయినది అని చింతించిన నందనారు యజమాని నిర్ణయానికి కట్టుబడెను యజమానినుండి ధాన్యమును గ్రహించి పొలమును చేరెను మూడు రోజులలో భూమిదున్ని పంటను పండించి ధాన్యమును యజమాని గృహంబునకు జేర్చుటయా ? ఆలోచింపకొలది నందునకు పరిస్థితి అయోమయంగా గోచరిస్తున్నది పొలము గట్టుపై కూర్చొని ఆలోచించసాగాడు ఆధారములేని ఆలోచనల్ని కదలించి లాభం లేదని గ్రహించాడు శివస్మరణ ప్రారంభించాడు పొలము గట్టుపై నిలబడి సంకీర్తనము చేయుచు నృత్యము చేయసాగాడు ఆడి ఆడి అలసిపోయాడు పొలము గట్టుపై స్మృతి తప్పి పడిపోయాడు అర్ధరాత్రయింది నందనారు ఏమ యుచున్నాడో పరీక్షించవలయునని యజమాని పొలమువద్దకు వచ్చాడు పొలమంతయూ మైదానమువలె గోచరించుచున్నది భూమిని దున్నే ప్రయత్నముకూడా ఇంకా జరుగలేదు పొలము గట్టుపైబడి నిద్రింపుచున్న నందనారును చూశాడు నందనారు స్థితిని చూసి నవ్వ

కున్నాడు నందుని వైఖల్యానికి సంతోషించాడు వెనుదిరిగి గృహోన్ముఖు డయ్యాడు

నందుడు నిద్రించుచున్నాడు నందుని కార్యముపట్ల నటరాజస్వామి మేల్కొన్నాడు భక్తుని అభీష్టము తీర్చవలసిన సమయం ఆసన్నమైనది శంకరుడే స్వయంగావచ్చి నాగలిపట్టాడు పార్వతీదేవి పీఖ్ళ తోడుతున్నది వినాయకుడు విత్తనములు చల్లుచున్నాడు కార్తికేయుడు కలుపుతీయు చున్నాడు ప్రమథగణమంతా ఘడియలో పెరిగిన పొలాన్ని కోసి మోపులు కడుతున్నారు అష్టదిక్పాలకులు నిలబడి వెన్నునుండి ధాన్యాన్ని వేరు చేశారు నందీశ్వరుడు మూటలుగట్టి ఆ మూటలపై తన ముద్రను ఏర్పర చాడు

తెల్లవారుతున్నది నటరాజస్వామి ఒక రైతు రూపంలో కనిపిస్తూ నందుని నిద్రనుండి లేపాడు ధాన్యము సిద్ధమైందని యజమాని ఇంటికి చేర్చవలసిందని తెలియచేసి తన పరివారసమేతంగా అంతర్ధానమయ్యాడు

నందునికి పరిస్థితంతా అర్థమైంది భక్తవత్సలుడైన నటరాజస్వామి కృపకు తన్మయత్వం కలిగింది శరీరం కంపించింది నేత్రములవెంట బాష్పధారలు రాలాయి నటరాజ నామోచ్చారణ చేయుచూ యజమాని గృహ మును చేరాడు నిద్రించుచున్న యజమానిని లేపాడు ధాన్యము సిద్ధమైన దనియు ఆజ్ఞాపించినచో ధాన్యము బండ్లలోవేసి ఇంటికి తీసుకరాగలననియు నందుడు యజమానికి తెలుపుతాడు యజమానికి నందుని మాటలయందు నమ్మకం కుదరలేదు తానే స్వయంగా బయలుదేరి పొలము వద్దకు వచ్చాడు మూటలుకట్టబడియున్న ధాన్యమును తిలకించాడు ఆ మూటల పైనున్న నందీశ్వరుని ముద్రను దర్శించాడు జరిగించేమిటో యజమానికి అర్థమయింది తన తప్పిదమునకు పశ్చాత్తాపము చెందాడు నందుని నిష్క ళంక భక్తికి యజమానికి గగుర్పాటు జనించింది

యజమాని నందునివైపు చూశాడు రెండు చేతులు కట్టుకొని దాస భావంతో యజమానికి దూరంగా నిలబడియున్న నందనారును వీక్షించాడు అపర ప్రహ్లాదునివలె కన్పట్టుచున్న నందనారును సమీపించాడు చేతులు

జోడించి నమస్కరించాడు నందా నీవు సామాన్య మానవుడివి కావు భక్తాగ్రగణ్యుడవు అశేష భక్తకోటికి ఆదర్శమూర్తివి పరమ శివునిచే పొలము పని చేయించిన పవిత్రాత్ముడవు నీచరిత్ర పావనము నందా! మాయా ప్రభావము అనిర్వచనీయము నీలాంటి పరమ భక్త శేఖరుని అనేక విధాల శంకించాను బాధించాను అగచాట్లకు గురిచేశాను నందా నా పాపమునకు నిష్కృతిలేదు నన్ను క్షమించు అంటూ నందుని పాదాలపై పడటానికి ముందుకురికాడు

వినయసంపన్నుడైన నందుడు వెనుకకువెళ్ళి యజమానిని వారిస్తూ తన వివేకజల్లులు ఆతనిపై కురిపించాడు మహాత్మా తమరు అగ్ర వర్ణమునకు చెందినవారు నేను అంత్యజుడను మీరు నాకు నమస్కరించుట భావ్యంకాదు మీ సేవలో జీవితాన్ని గడపవలసినవాడను మీ నీడ పంచన జీవనయాత్రను సాగించవలసినవాడను నేను మీ భృత్యుడను అని వినమ్రుడై ప్రార్థించెను

"నందా! ఆదిత్యుని రాకచే అంధకారము అదృశ్యమగులాగున నీ దివ్యపారవశ్య భక్తి తన్మయతను వీక్షించిన నాలో అజ్ఞానము అదృశ్యమైనది నందా! కులభేదాలు మానవుని దృష్టిలోనేగాని భగవానుని అనంత కరుణా తేజములో సమస్తమూపావనమే భగవంతుని కృపకు పాత్రుడైన వాడే బ్రాహ్మణుడు ఆత్మతత్త్వమును అవలోకించినవాడే అగ్రకులజాతు జన్మయందలి ఆధిక్యతను ఏకరువుపెడుతూ కర్మభ్రష్టుడగువాడు బ్రాహ్మణుడైననూ అస్పృశ్యుడే నందా! ఇంతవరకు చండాల జీవితమును గడిపిన నేను ఈనాడు నీదివ్యకృపచే బ్రాహ్మణుడుగా జన్మిస్తున్నాను నందా! ఇక మీదట నిజమైన బ్రాహ్మణుడుగా జీవించడానికి ప్రయత్నిస్తాను భగవద్భక్తులయందు కులము నెన్నువాడు రాక్షసుడు భక్తులను బాధించుటకన్నా మించిన పాపములేదు నందుడా ఇకనీవు నాకు భృత్యుడవుకావు నేను స్వామినిగాను మనందరికి స్వామి నటరాజ సుందరుడే మనందరము ఆయన భృత్యులము నందా! నీవు చిదంబరమున కేగుము నటరాజస్వామి తిరునాళ్ళలో పాల్గొనుము స్వామిని దర్శించి ధన్యత చెందుము నీ రాక

కొరకు ఎదురు చూచుచుండును మనమిరువురము కలసి పొలమును సేద్యము చేయుదుము ఇకమీదట ఫలసాయమునందు మనఇరువురికి సమానహక్కు ఉండును అని యజమాని నందునితో చెప్పసాగెను నటరాజస్వామి దివ్య కృపకు పాత్రుడైన నందునిలో ఒక వినూత్న పరిణామం కదులుతున్నది యజమాని మాటలు తన చెవిలో ప్రవేశించలేకపోయాయి ప్రశాంత వదనంతో మనస్సునిండా నటరాజుని నింపుకొని నేత్రాలలో పరమేశ్వరుని రూపును ప్రతిష్ఠించుకొని శివస్మరణ చేయుచూ నిర్మలంగా చిదంబరముకేసి నందుడు నడక సాగించాడు.

నందనారు చిదంబరము చేరాడు నదిలో స్నానమాచరించాడు చిదంబర నటరాజస్వామి ఆలయ శిఖర దర్శనముతో నందుని హృదయం పరవశించిపోయింది తన కలలన్నీ ఫలించాయి ఏ శుభఘడియ కొరకు తానింతకాలము నిరీక్షించాడో అట్టి అమృతఘడియ ముందు నిలిచియున్నది నేత్రాలు అశ్రుపూరితమయ్యాయి జయజయ నటరాజా గంగాధర శంభో!" అంటూ ఆలయ ముఖద్వారంవైపు నడిచాడు తన హృదయేశుడైన నటరాజస్వామిని చేరవలెననెడి ఉత్సాహముతో ఆలయములో ప్రవేశించబోయాడు ఆలయ పర్యవేక్షణాధికారి నందనారును గోపుర ద్వారం ముందు అప్రయత్నంగా ఆపాడు. నందనారునిగూర్చి వివరాలడిగాడు తన వర్ణవిశేషములు వృత్తి వ్యవహారములన్నీ పూసగ్రుచ్చినట్లు ఉన్నదున్నట్లుగా నందుడు వివరించాడు మాలవాడైన నందునకు ఆలయ ప్రవేశం లేదని అధికారి తెలియజేశాడు నందుడు ఎంతగానో ప్రాధేయపడ్డాడు కానీ ప్రయోజనం లేకపోయింది కులతత్త్వాలతో కరుడుగట్టిన పాషాణ హృదయాలు నందుని హృదయ సౌందర్యమును గాంచలేకపోయాయి నందుని హృదయంలో నిరాశాగాలులు తోలుచున్నాయి మనస్సు ఆవేదనతో కుమిలిపోసాగింది నటరాజుని చూడలేని తన బ్రతుకు నిరర్థకమని స్ఫురిస్తున్నది

నటరాజా! నీ ఆలయంలో భక్తి లయతప్పి నాట్యం చేస్తున్నదా! తండ్రీ! సర్వమూ వదలిపెట్టి నీ సన్నిధి కరుదెంచాను రాత్రింబవళ్ళు నిన్నుగూర్చే చింతించాను నీ నామస్మరణయందే కాలాన్ని గడిపాను జీవితంలో ఎదురయ్యే భయంకరకష్టాలను లెక్కచేయకుండా నీ శాంతిధామం

చేరడానికే అనవరతము వ్యధచెందాను తండ్రీ పార్వతీరమణా! ఎందుకు నాకీ శిక్ష విధించావు? నీ దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించలేని ఈ నేత్రాలు నాకెందుకు? నీకు దూరమై జీవించుటకన్నా మరణించుటయే మేలు హే నటన మనోహరా నటశివ సుందరా నిన్ను దర్శించుటకు అనర్హమైన ఈ శరీరము నాకవసరములేదు నేను నీ ఆలయమును వదలి వెళ్ళను నీవు కరుణిస్తే నిన్ను దర్శించి తరిస్తాను లేదా నీ నామస్మరణ చేసుకుంటూ నీ ఆలయం ముందే బ్రతుకును సమర్పించుకొని అంతరిస్తాను అని నందుడు ఆవేశముతో పలికి శివ స్మరణచేస్తూ ఆలయము ముందు కూలబడ్డాడు

గంటలు గడిచాయి రోజులు దొర్లాయి రెండు వారాలు పూర్తయ్యాయి నందుడు ఆహారం ముట్టలేదు శరీరం బలహీనమైంది అయినా శివస్మరణ మానలేదు నందుని పరిస్థితి విషమించింది అగ్రవర్ణములవారైన దేవాలయాధికారులు ఆలోచించారు నందునికి ఆలయ ప్రవేశమివ్వడము వారికి ఇష్టంలేదు ప్రవేశము కల్పించనిచో నందుడక్కడే ప్రాణాలు పోగొట్టుకొనేలా వున్నాడు బాగా ఆలోచించారు చాకచక్యంతో సమస్యను చర్చించారు ఎలాగైనా నందునికి ఆలయ ప్రవేశం కల్పించకూడదు తెలివి తేటల నుపయోగించి నందుని సమస్యను పరిష్కరించడానికి ప్రయత్నించారు.

ఆలయం ముందు పడియున్న నందుని సమీపించి 'ఓయీ నందా అంత్యకులజుడవైన నీవు దేవాలయమునందు ప్రవేశించి నటరాజస్వామిని దర్శించుటకు అనర్హుడవు నటరాజస్వామి రాత్రి మా స్వప్నములో దర్శన మిచ్చాడు నిన్ను శుద్ధిచేసి ఆలయములో ప్రవేశపెట్టమని తెలియజేశాడు భగవానుని నిర్ణయము నీకు సమ్మతమైనచో నీవు అగ్నియందు ప్రవేశించి పరిశుద్ధుడవు కావలయును ఆ తరువాత నిన్ను ఆలయములో ప్రవేశ పెట్టుదుము' అని అధికారులైన బ్రాహ్మణులు తెలియజేశారు ఆహా! పైశాచిక పాండిత్యమా? ఎంతటి ప్రజ్ఞ? ఎంతటి ప్రతిభ? వాస్తవ భక్తితత్వాన్ని హత్య చేసేందుకు ఎన్ని చట్టాలు ఎన్ని సిద్ధాంత రాద్ధంతాలు అబద్ధాలతో

అభియోగాలతో పొట్టనింపుకొనే అధర్మపరులు అంతకన్నా ఉత్తమ సంక ల్పాలెలా కల్గియుంటారు ?

విప్రుల వికృత పలుకులు వినిన నందనారు అమితానంద భరితు డయ్యాడు నిజమే ఇది చక్కటి పరీక్ష ఇది తనలో కవిలే భక్తిశ్రద్ధలకు గీటురాయి తన భక్తి పవిత్రమైతే ఆలయ ప్రవేశం లభిస్తుంది అలా కానిచో అపవిత్రమైన ఆ శరీరముతో భూమిపై నడచి భూమాతను కూడా అపరిశుభ్రము చేయుటకంటే అగ్నిలో ఆహుతి కావడమే శ్రేయోదాయక మని నందనారు నిశ్చయించుకున్నాడు బ్రాహ్మణులవైపు తిరిగి అయ్యా! మీరు నాయెడచూపిన వత్సల్యమునకు నేనుచాలా కృతజ్ఞుణ్ణి అపరిష్కృతి సమస్యగా నిలిచినా నా జీవితానికి ఒక చక్కటి పరిష్కారాన్ని అందించారు మీకు సదా ఋణపడియుంటాను వెంటనే అగ్ని ప్రవేశమునకు ఏర్పాట్లు గావించండి అని నందుడు శిరమొగ్గి బ్రాహ్మణులకు నమస్కరించాడు ఆలయమునకు కుడిప్రక్కన అగ్నిని రగిల్చారు నందుడు నదిలో స్నాన మాచరించాడు విభూతిని ధరించాడు నొసటన చందనాదులు ధరించాడు తడిబట్టలతో వచ్చి బ్రహ్మాండముగా మండుచున్న అగ్నిదేవుని ముందు నిలిచాడు

ఆలయాధికారులైన బ్రాహ్మణులు చుట్టు నిలబడియున్నారు వేలాది భక్త సమూహము ఈ వింతదృశ్యాన్ని వీక్షించడానికి గుమిగూడియున్నారు కొన్ని నిముషాల్లో జరగబోయే పరిణామాన్ని ఊహించుకుంటూ ప్రేక్షకుల హృదయాలు ఆందోళన చెందుతున్నాయి నందునిలో ఆనంద సాగరము పొంగుతున్నది తన నిరీక్షణకు తుదినిర్ణయము జరుగనున్నది తన దుఃఖా నికి అంతిమఘడియ సమీపిస్తున్నది తన ఆవేదన అంతమయ్యే సమయము అతి చేరువలో నున్నది

నటరాజ సుందరుని భక్త వాత్సల్యము నందుని మనస్సులో చలన చిత్రమై కదులుచున్నది తిరుప్పుంగూరులో నందీశ్వరుడు అడ్డుతొలగి పర మేశ్వర దర్శనము కల్పించడము తాను తయారుచేయ సంకల్పించిన తటా కము పరమశివుడు తన పరివారముతో వచ్చి పూర్తిచేయడము తన యజ

మాని ఆజ్ఞానుసారము ఒక్క రాత్రిలో శివ కృపచే పొలము పండించి ధాన్యమును అందించడము — ఈ సన్నివేశములన్నీ మనోఫలకముపై కదలాడసాగాయి పరమ శివుని భక్తిజన ప్రయత్నమునకు నందుని కళ్ళు చెమ్మగిల్లాయి ప్రశాంత వదనంతో నందుడు నటరాజుని ఆలయ శిఖరాన్ని దర్శించాడు చేతులు జోడించి నమస్కరించాడు అక్కడ గుమిగూడి యున్న వేలాది భక్తులకు నమస్కరించాడు అగ్నిదేవునికి సాష్టాంగ నమస్కారము చేశాడు జయజయ శంభో శంకర ! నటరాజ పరమేశ్వర అని స్తుతిస్తూ ఆకాశాన్నంటడానికి ప్రయత్నిస్తున్న అగ్నిజ్వాలల మధ్య అడుగుపెట్టి నిలుమండిపోయాడు

నందుడు అస్తమించాడని విప్రులు సంతోషించారు అమాయకంగా నందుడు అగ్నికి అహుతై పోయాడని జనులంతా విచారించారు నందనారులోని అకుంఠిత భక్తి విశ్వాసాలకు భక్తులు కన్నీరు గార్చారు

ఆహా! ఏమి ఆశ్చర్యము ఆకాశాని కెదుగుచున్న అగ్నిశిఖలు గాలికి చెట్టుకొమ్మలు వాలినట్లు నేలకొరుగుచున్నవేమి ? చూస్తుండగానే అగ్ని యంతయూ అదృశ్యమైనది ఈ అగ్ని శిఖలన్నియు ఒకపూలమాలగా తీరి నందుని మెడ నలంకరించినది నందుని సన్మానించుటలో తొలి యవకాశము తనకే లభించవలయునని అగ్నిదేవుడు అభిలషించాడేమో?

అగ్ని మాయమైంది నందుడు నేత్రాలు మూసి రెండు చేతులు జోడించి నమస్కరిస్తూ నిలబడి యున్నాడు ఒక్కసారి ప్రజా వెల్లువ ఉప్పొంగింది జై జై నటరాజ! జై జై భక్త నందనార్ అను ధనులు మిన్ను ముట్టాయి ఆధ్వని తరంగాల అలికిడికి మూతబడియున్న నందుని నేత్రాలు తెరువబడ్డాయి పరిస్థితంతా అర నిముషంలో నందునికి ఎరుకపడింది నటరాజస్వామి కృపావిశేషానికి నందుని శరీరం కంపించిపోయింది నేత్రాలవెంబడి అశ్రుధారలు రాలాయి గుమిగూడియున్న భక్త సమూహమునకు నందుడు శిరమోడ్చి నమస్కరించాడు ఆలయ పెద్దలైన బ్రాహ్మణాలు ఆహ్వానింపమండ నటరాజ సుందరుని దర్శనానికి నందుడు బయలుదేరాడు

నందుడు ఆలయంలో ప్రవేశిస్తున్నాడు హృదయంలో భక్తిపారవశ్యం తొణికిసలాడుతున్నది అధికానందములో అడుగులు తడబడుచున్నవి నేత్రాలు మూతబడుచున్నవి తన ప్రక్కనే వేదపండితులు ఉచ్చరించు వేదమంత్రాలు తన చెవికో ప్రవేశించడములేదు తన హృదయం నాథని దర్శించబోవు దివ్యోన్మాదంలో నందునికి ప్రపంచపు ఉనికే అగోచరమైంది

నందుడు గర్భాలయంలో ప్రవేశించాడు తన జీవిత గమ్యమైన నటరాజస్వామి ముందు నిలబడి నమస్కరించాడు నటరాజస్వామిని ప్రథమంగా దర్శించాడు

నటరాజ సుందరుని మూర్తి నందుని సంభ్రమాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరి చేసింది ఏమిటీ అద్భుత దృశ్యము? నృత్యభంగిమ నభినయించుచు నిలబడియున్న నటరాజ దివ్యమంగళ విగ్రహము నందుని హృదయమును అమాంతంగా ఆకర్షించింది

నటరాజ స్వామికి రెండు పాదములు నాలుగుహస్తములు గోచరించుచున్నవి కుడిపాదము మరగుజ్జువలె కన్పట్టుచున్న అంధకాసురుడను రాక్షసునిపై ఉంచబడి యున్నది ఎడమపాదము నాట్యభంగిమ నభినయించులాగున పైకి ఎత్తబడి యున్నది శరీరమును సర్పము వస్త్రమువలె చుట్టియున్నది తన నాలుగుచేతులలో పైభాగాము నందలి కుడిచేతిలో డమరకము ఎడమచేతిలో ప్రకాశించుచున్న అగ్ని యున్నది క్రిందిభాగం లోని ఎడమచేయి పైకిఎత్తబడియున్న తన ఎడమకాలిని చూపించుచున్నది కుడిచేయి ఆశీర్వదించులాగున నాట్యాభినయము చేయుచున్నది నందుడా దివ్యమంగళ విగ్రహమును తదేకంగా చింతించసాగాడు ఇందలి భావశిల్పము ఎవరికి గోచరము?

నటరాజా! ఏమిటీ నటనా వైభవము? నందుడు ప్రార్థన ప్రారంభించాడు నటరాజ సుందరుని నటనా కౌశలములోని ఆధ్యాత్మిక రసానుభూతి నందుని కవగతమగుచున్నది నటరాజస్వామి కుడిపాదము క్రిందదాగి యున్న అంధకాసురుడే జగద్విలాసమును నడుపు మాయ// ... ను అణగ

త్రొక్కినవాడు నటరాజస్వామి ఎడమ పాదము పైకెత్తి యుండును అనగా అవస్థాత్రయము నధిగమించి త్రిగుణాతీతమై జగద్విలక్షణమై దేహేంద్రియ మనో బుద్ధుల కతీతమై తురీయాతీతస్థితిలో నిలబడియుండుట యని అర్థము కుడి పాదముతో మిథ్యాజగత్తును అణగద్రొక్కి రెండవ పాదముతో బ్రహ్మైక్యముచెంది జీవింపుటయే నటరాజస్వామి పాదద్వయము మభినయించి అందించు అద్భుత ఆధ్యాత్మిక ప్రదర్శనము

నటరాజస్వామి పై వరుసలోని కుడిచేతిలో డమరకమున్నది డమరకము నుండి శబ్దము జనించును శబ్దము ఆకాశతత్త్వమునకు ప్రతీకము శబ్దము నుండియే జగత్తు ఆవిర్భవించినట్లు వేదాంతము తెలియజేయు చున్నది గనుక డమరకము సృష్టిని కవబరచుచున్నది నటరాజస్వామి ఎడమచేతిలో అగ్నియున్నది అగ్ని దహించు వస్తువై యున్నది కనుక అది లయస్థితికి ప్రతీకమై యున్నది సృష్టిలయాదులు డమరుక అగ్నుల ద్వారా తెలియబడుచుండ ఈ రెండింటిమధ్య స్థిరముగా నిలబడియున్న నట రాజ సుందరుని పై భవము స్థితికి ప్రతీకమై యున్నది కనుక సృష్టి స్థితి లయాదులు తనయందే జరుగుచున్నవని భావము నటరాజస్వామి క్రింద వైపునయున్న ఎడమచేయి పైకి ఎత్తబడియున్న ఎడమకాలును చూపుచున్నట్లు యుంటుంది ఎడమకాలు విలక్షణమైన బ్రహ్మతత్త్వమును తెలియ జేయుటచేత అట్టి బ్రాహ్మీస్థితిని ధ్యానించమని తెలియజేయుటయే ఎడమ చేయి ద్వారా చూపుటలో అంతరార్థము అలా బ్రహ్మపదార్థమును చింతన జేసినవో తప్పక దైవానుగ్రహము లభించునని తెలియజేయుటయే కుడి చేతితో ఆశీర్వదించునట్లు అభినయించుటలోని భావార్థము నటరాజస్వామి మట్టును సర్పము చుట్టబడియున్నది భయంకరమైన సర్పము చుట్టబడి యున్నను నటరాజస్వామి నాట్యము నెలా కొనసాగించుచున్నాడో జీవిత ములో ఎన్ని భయంకర పరిస్థితులు చుట్టుముట్టినను ఆధ్యాత్మిక సాధకుడు తన సాధనను ఆపకుండా కొనసాగించవలయునని తెలియజేయుటయే సర్పము చుట్టుకొని యుండుటలోని అంతరార్థము

నటరాజస్వామి వైభవమంతయూ నందుని పవిత్ర మస్తిష్కములో నిండిపోయింది మనస్సు ప్రశాంతతను పొందినది హృదయం నిర్మలమై

గది శివ భక్తుడైన నందునికి నటరాజస్వామి విగ్రహములో శివ తాండవము కనిపిస్తున్నది అంబికాసమేతుడు సదాశివుడు నృత్యముచేయు సాంబ సదాశివ నృత్యము గన్పట్టుచున్నది

సంధ్యాఘర్మ దివాత్యయో హరికరాఘాత ప్రభూతానన
ధ్వానోవారిద గర్జితం దివిషదాం దృష్టిచ్ఛటా చంచలా
భక్తానాం పరితోష బాష్పవితతి ర్వృష్టిర్మయూరీ శివా
యస్మిన్నుజ్జ్వల తాండవం విజయతే తం నీలకంఠం భజే॥

సంధ్యాసమయము తొలకరికాగా విష్ణుదేవుని ఆనకవాద్యము ఉరుముకాగా ఆకాశమున చేరియున్న దేవతలయొక్క చూపులు మెరుపులుకాగా భక్తులు చిందించు ఆనందబాష్పములు వర్షంకాగా పార్వతీదేవి ఆడనెమలివలె సదాశివుడు మగనెమలి వలె నాట్యము చేయుచున్న ఉజ్జ్వలమైన అట్టి మయూరీ మయూరరూపమై గన్పట్టుచు తాండవ నృత్యము చేయుచున్న సాంబసదాశివుని సేవింతును" అని ఆదిశంకరులు శివానందలహరిలో తెలియజేసియున్నాడు

ఆదిశంకరులు దర్శించిన అనుభూతియే నందనారుకు కలిగినది శరీరము పట్టుతప్పుచున్నది గుడి తలుపులు గంటలు పూజారులు సమస్తము నందునకు నటరాజస్వామివలె గన్పట్టుచున్నారు మనో సంకల్పాలన్నీ ఆగిపోయాయి నందుడు మెల్లగా ముందుకు కదులుతున్నాడు ఆ కదలికలో కూడా తన ప్రయత్నమున్నట్లు గోచరించడములేదు కంటిపై రెప్పవాలడం లేదు నటరాజస్వామి విగ్రహాన్ని సమీపించి మోకాళ్ళపై ఆసీనుడై తన శిరమును నటరాజస్వామి పవిత్ర పాదాలపై వుంచాడు జై జై నటరాజ సుందరా !

"జయహో ! భగవాన్ నటరాజ్
జయహో భక్త నందనార్"

ఆకాశము పిక్కటిల్లేలా భక్త సమూహము జయజయ నాదాలు చేశారు భక్త నందనారు పాదాలను తమకన్నీటితో అభిషేకం చేయడానికి భక్తులంతా గుడిముందు గుమిగూడియున్నారు నటరాజసుందరుని పవిత్ర పాదాలచెంత తన బ్రతుకును నీరాజనంగా సమర్పించుకొని ధన్యతచెందిన నందుని ఇక సేవించగలిగే వారెవరున్నారు? నందనారు ప్రాణం అనంత వాయువుల్లో లీనమై పోయింది నందుడునటరాజస్వామిలో ఐక్యమయ్యాడు కాదుకాదు నందుడే నటరాజ సుందరుడుగా మిగిలిపోయాడు

నందుని భౌతికకాయాన్ని సమాధిచేశారు భగవత్కృపకు గ్రంథాలను చిలుకవలె వల్లించ నవసరంలేదని నిష్కల్మషచిత్తము నిరాడంబర జీవనము నిశ్చల భక్తియే ముఖ్యమని నందనారు తన జీవితముద్వారా ఆదర్శప్రాయము నందించాడు భక్త నందనారు చరిత్రము పరమ పావనము ఆ మహాత్ముని అడుగుజాడల్లో చరించు భక్తులకు మోక్షము కరతలామలకము

• ఓం శ్రీ భక్తవరదాయ నమః •





# సూరదాస్

దట్టమైన చీకటి అలముకున్న సమయాన చక్షుష్మంతుడు కూడా అంధుడే వెలుగు ప్రసరించినంతవరకు తాను కళ్ళున్న గ్రుడ్డివాడే

ఆకాశాన సూర్యుడెలా ప్రకాశిస్తున్నాడో ప్రతి జీవి హృదయంలో భగవానుడలా వెల్గొందుచున్నాడు

సూర్య ప్రకాశము మట్టు వ్యాపించియున్నను నిద్రించువానికి సర్వమూ అంధకారమే ప్రకాశం ఉన్నను వస్తుదర్శనం జరగాలంటే తాను కళ్ళు తెరవాలి

భగవానుడు హృదయంలో ప్రకాశించుచున్నను జ్ఞానాంధుడు దర్శించలేడు అజ్ఞాన కనురెప్పలచే మూతబడియున్న తన విజ్ఞానదృష్టి విశ్వనాథుని దర్శించలేదు విచక్షణాప్రేరితుడై భగవానుని దర్శించడానికి ప్రయత్నించినవానికి సత్యము కరతలామలకము

అతి నిద్రాలోలుడు తొందరగా మేల్కొనలేడు రాజసికతామసికాహారములు మితిమీరి భుజించుట అతి నిద్రకు ఒక కారణమైతే వాంఛాప్రేరిత మనోచాంచల్యము రెండవ కారణమై యున్నది వాంఛాతీతుడై

సాత్త్వికాహారమును భుజించువాడు తొందరగా నిద్రను డి మేల్కొనగలడు వస్తుప్రపంచాన్ని దర్శించగలడు

అలాగే అజ్ఞాన నిద్రాలోలుడు కళ్ళుతెరువలేక పోవడానికి మల విక్షేపాదులు మొదటి కారణమైతే ఆవరణ రెండవకారణమై యున్నది సాధన చతుష్టయ సంపత్తికల్గి శ్రవణమనన నిది ధ్యానముద్వారా మల ఆవరణ విక్షేపాదులను భంగమొనర్చినవాడు జ్ఞానారోగ్యమును పొంది నేత్ర ములు తెరువగుండు అక్కడ జరిగేదిసమదర్శనము సమదర్శనమే సమ్య గ్దర్శనము సమదర్శనము కలిగిన సంత్ పురుషులే సాధుసత్తములు జ్ఞానాంజనము ద్వారా తమ మనోనేత్రాలలోని భేదభావ చత్వారాన్ని తొలగించి అభేద దృష్టిని అద్వైత జ్ఞానమును పొందిన సత్పురుషులే ముక్తజీవులు ఆప్తకాములు

వారి దృష్టి మంగళకరము మహనీయము సకల చరాచరముల యందు భగవానుని వీక్షించేవారి పవిత్ర సన్నిధానములో అజ్ఞానము పటా పంచలవుతుంది ఆనందము తాండవిస్తుంది

కళ్ళున్న అజ్ఞానులకన్నా నేత్రములు లేకున్నను జ్ఞానులె సత్యాన్ని దర్శించగలరు పుట్టుకతో అంధుడైనను అట్టి సత్యదర్శనము పొంది తరిం చిన భాగవతోత్తముడు సూరదాసు మహనీయుడు

మధురా క్షేత్రమున సూరదాస్ మహాత్ముడు జన్మించాడు అతడు జాత్యంధుడు ప్రకృతి శోభలనుగాంచు అదృష్టమునకు నోచుకోని అభా గ్యుడు పుట్టుకతోనే ప్రపంచమును వీక్షించు దృష్టిని కోల్పోయిన సూరదాసు పరమాత్మను దర్శించు జ్ఞాననేత్రమును వెంటనిడుకొని జన్మించాడు

పువ్వు పుట్టగనే పరిమళమును వెదజల్లునట్లు బాల్యముననే సూర దాస్‌లో జనించిన భక్తి కుసుమము సదాచార పరిమళాన్ని వెదజల్లింది నిండు చంద్రుని పండువెన్నెలనుచూచి ఆనందించు అవకాశము అరణ్యానికి లేనట్లు సూరదాస్‌లోని ఆధ్యాత్మిక చింతనా సౌరభాన్ని ఆఘ్రాణించు సంస్కారము తాను జన్మించిన కుటుంబసభ్యులకు లోపించింది పుట్టుకతో

సూరదాసునకు సంక్రమించిన గ్రుడ్డితనమే వారి నాకర్షింపమున్నదిగాని అతనిలో దినదిన ప్రవర్ధమానమగుచున్న ఆధ్యాత్మిక సూర్యప్రకాశము వారి అంధకార జ్ఞానచక్షువును ఆకర్షించలేకపోయింది గ్రుడ్డివాడని సూర దాసుని పలకనగ చూడటానికి ప్రారంభించారు కంచెయే చేను మేసినట్లు తన కుటుంబీకులే నిరంతరము తనను ఎవగించుకోసాగారు పనికిమాలిన చవటయని నిందించేవారు భూమాతకు బరువని దూషించేవారు ఇక బయటవారు సరేసరి వారికి సూరదాసొక ఆటవస్తువు ఆహా! గ్రుడ్డి ప్రపంచమా! పుట్టుకలో ఒక వ్యక్తికి ప్రాప్తించిన గ్రుడ్డితనాన్ని అర్థం చేసుకొని సానుభూతి చూపలేక కళ్ళున్న సమాజమంతా ఒక్కసారి అంధ త్వాన్ని ఆపాదింపకుంది

తన కుటుంబీకులుచేసే నిందాజ్వాలలకు సమాజమందించే అప హాస్య సమ్మెటపోట్లకు సూరదాసు అంతఃకరణయనే బంగారు వన్నెదీరి నిర్మల అపరంజిగా మారింది నిర్మల అంతఃకరణనిర్వికల్పశాంతిని పొందే టందుకు ఉరకలు వేయసాగింది పరిసరాల్ని సూరదాసు చక్కగా అర్థం చేసుకున్నాడు భగవంతుడు తప్ప తనకు శరణ్యమెవ్వరు లేరని గ్రహిం వాడు తన అంధత్వాన్ని చూసి ఏవగించుకున్న సమాజ అంధత్వాన్నిగాంచి నవ్వుకున్నాడు ఒకనాడు ఎవ్వరికి చెప్పకుండా బయలుదేరి ఒంటరిగ నడక సాగించాడు

తాను ఒంటరివాడెలా అవుతాడు? తన హృదయంలో నందనందనుడు క్షణకాలంకూడా దూరంగాకుండా తిష్ఠవేసియున్నాడు తనతో భగవానుడు కలసి నడుస్తూ నడిపిస్తున్నప్పుడు తాను ఒంటరివాడెలా అవుతాడు? తుంటరి మానవులమధ్య వ్యసన మనుగడను సాగించుటకన్న భక్తిభావాలతో ఒంటరి జీవితము గడుపుటయే శ్రేయోదాయకము

దిక్కులు తెలియనివాడుగ జన్మించిన సూరదాసు ఇప్పుడు దిక్కు లేనివాడయ్యాడు బలహీనులకు బలము ధనహీనులకు ధనము జనహీను లకు జనము అనాధులకు నాధుడైన ఆ పరంధాముడేనని భావించిన సూర దాసు మెల్లగ గోకులధామం సమీపించాలని బయలుదేరాడు ఒక గ్రామ పొలిమేరలలో ఆగాడు కదలేక కూర్చుండిపోయాడు

గ్రామపెద్ద ఒకరు ఆ దారిన వెడుతూ సూరదాసును చూశారు సూరదాసు ప్రసన్నవదనము అతనిని ఆకర్షించింది వెంటనే సూరదాసును సమీపించి "అయ్యా తమరెవరు? ఎక్కడినుండి వచ్చారు? అని ప్రశ్నించాడు.

"నాయనా! ఎవరు ఎవరో ఎవరికి ఎరుక అది తెలిసినవాడొక్కడే అతడు నేను కాను కానీ అతని కారుణ్యమే నా మనుగడకు కారణము" అని జవాబిచ్చాడు

సూరదాసు భావగర్భిత పలుకులు అతని మనస్సులో సంచలనాన్ని కలిగించాయి హృదయాన్ని స్పందింపచేశాయి బుద్ధిలో ఆసక్తి వృద్ధిచెందుతుండ మహాత్మా మీరు మహానుభావులవలె గన్పట్టుచున్నారు తమరి నివాస స్థానమేది ? ఎక్కడనుండి వచ్చారు? ఎంతవరకు మీ ప్రయాణము?" అని గ్రామపెద్ద ప్రశ్నించాడు

సూరదాసు మహాత్ముడు చిరునవ్వు నవ్వి నాయనా! ఎక్కడనుండి వచ్చారని అడుగుతున్నావు నీవు అడుగుచున్న దెవరిని? పాంచభౌతికమైన ఈ శరిరము మలిన పూరితమైన తల్లి గర్భంనుండి వచ్చింది నేత్రాలు దారి తప్పి మధ్యలోనే అదృశ్యమయ్యాయి మనస్సంటావా? అది మాయనుండి వచ్చింది ఇక నేనంటావా? నేను పుట్టేవాడినికాను గనుక గిట్టే ప్రసక్తే లేదు ఇక నీవడిగిన తరువాత ప్రశ్న నా ప్రయాణమెంతవరకని? అయితే విను ఏది తెలుసుకొన్న తరువాత మరొకటి తెలుసుకొన నవసరములేదో అట్టి పుణ్యధామాన్ని చేరడానికే నా ప్రయాణము ప్రయత్నము సత్యనాధుని పాదములే నా నివాస స్థానము అని భాషిస్తాడు

గ్రామపెద్ద మనస్సు చైతన్యవంతమైనది హృదయం ఆనందంతో ఉరకలు వేయసాగింది ఆ మహాత్ముని దివ్యవాణి ప్రభావంతో కనువిప్పు కలిగింది శరీరము గగుర్పాటు చెందింది తన బ్రతుకుబాటకు మార్గము లభించినట్లయింది వెంటనే చేతులు జోడించి నమస్కరిస్తూ మహాత్మా మీరు సామాన్యులుకారు మీలో కనుపించే వైరాగ్యము మీముఖతః వెలువడే అమృత భావపరంపరలు మీలో గోచరించే భక్తి పారవశ్యం నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నాయి మీకు సేవచేసే తరించే మహద్భాగ్యాన్ని నాకు

ప్రసాదించండి మీ అడుగుజాడల్లో నా బ్రతుకును సరిచేసుకొనే దివ్యావకాశాన్ని అనుగ్రహించండి మీరు మా గ్రామముకొనే స్థిరపడి మమ్ము కృతార్థులను చేయండి అని సూరదాసు పాదాలపైబడి బోరున ఏడుస్తాడు

సూరదాస్ ఆంతర్యంలో చెలరేగే వైరాగ్యజ్వాలకు బాహ్యంలో అనువైన ఏకాంతవాసము లభించింది సదా హరినామ సంకీర్తనయందు మనస్సు లగ్నం కాసాగింది భగవద్దర్శనార్థం చిత్తము పరుగులు తీయసాగింది కంటిపై రెప్పవాలదు భుజింపుటకు నాలుక ఇచ్ఛగించదు నిరంతరము భగవద్వియోగ దుఃఖాన్ని అనుభవిస్తూ సూరదాస్ కన్నీరు కార్చేవాడు క్రిందపడి దొర్లెవాడు చేతులు జోడించి ప్రార్థించేవాడు లేదా కాష్ట మౌనందాల్చి రాతిబండలా నిశ్చేష్టుడై పడియుండేవాడు తన హృదయంలో పొంగిపొరలే ఆవేదనంతా కీర్తన రూపంలో గానం చేసేవాడు

హరిబిన్ కౌన్ సోఁ కహిం ఏ

మనసిజ వ్యథాజరాత్ అరని లౌఁ ఉర్ ఆంతర్ దహియే
కానన్ భవన్ రైన్ అరువాసర్ కహుఁ న సచు లహియే
కబహుంక్ ఉపజై జియమేఁ ఏసీ జాయ యమున బహియే
సూరదాస్ ప్రభు కమల నయన బినకై సే బ్రజరహియే

మా విషాధగాధను మే మెవరితో విన్నవించుకోవాలి? మానసిక వ్యధ నన్ను క్రుంగదీస్తుంది ఆంతర్యంలో నా హృదయం కుంపటిలా రగుల్కొంటుంన్నది ఇంటిలోవున్న కానలకేగినా రాత్రింబవళ్ళు నేను ఆవేదననే అనుభవిస్తున్నాను నాలో తరమగా నిరాశాగాలుల్ని దోలి యమునలోదూకి మనశ్శాంతిని నొందమని నాబాధ నన్ను ప్రేరేపిస్తున్నది పుండరీకాక్షుడైన శ్యామసుందరుని వదలి ఎలా జీవించాలి? అని సూరదాసు విలపిస్తూ గానం చేశాడు

సూరదాసు అంతఃకరణ భగవత్సందర్శనానికి పరితపించు అట్టి శుభముహూర్తాన శుద్ధాద్వైత వైష్ణవ సిద్ధాంత మూలపురుషులగు వల్లభాచార్యులవారు తీర్థయాత్రలు చేయుచు సూరదాసుయున్న ప్రాంతమునకు అరుదెంచారు మహాత్ములైన వల్లభాచార్యులవారిని దర్శించవలయునని సూరదాస్‌కు

కోర్కె జనించింది వెంటనే బయలుదేరి వల్లభాచార్యులవారి సన్నిధాన మును చేరి వారి పాదములకు సాష్టాంగ నమస్కారం చేశాడు వల్లభా చార్యులవారి పాదస్పర్శచే సూరదాస్‌లోని భక్తి బీజము వీర్యవంతమై ఆనంద వృక్షముగ మారింది అమృతఫలము నందించుటకు సిద్ధంగావుంది

సూరదాస్ భక్తి శ్రద్ధలు వల్లభాచార్యుల వారికి అవగతమయ్యాయి రాధాకృష్ణ ప్రేమతత్త్వాన్ని గూర్చి సూరదాసుకు బోధించారు రాధాకృష్ణ లీలామాధుర్యమునందలి ఆధ్యాత్మిక రహస్యాలను ఎరుకపరచారు సూర దాస్ ఆనందమునకు అవధులు చిక్కలేదు తనకు మంత్రదీక్ష నొసంగి అనుగ్రహించారు వల్లభాచార్యులు

సూరదాసులో అప్పటినుండి ఒక దివ్య పరిణామము పొడసూప సాగింది అత్యద్భుతంగా అతనినుండి కవిత్వము కదలనాగింది రాధాకృష్ణుల దివ్యలీలలను గూర్చి గానముచేయ ప్రారంభించాడు ఆ కీర్తనలే సూర సాగర్" అను పేరుతో ప్రామర్యము నొందినవి సూరదాస్ మహాశయుడు లక్ష గీతములు వ్రాసినట్లు ప్రసిద్ధి ప్రస్తుతము ఎనిమిది వేలు మాత్రమే మిగిలియున్నట్లు తక్కినవి కాలగర్భంలో కలిసిపోయినట్లు తెలియుచున్నది భాగవతమునందలి భక్తితత్త్వాన్ని నిగూఢ ఆధ్యాత్మిక రహస్యాల్ని సూర సాగర్" నందు వర్ణించడము జరిగినది ప్రతి సన్నివేశము పాఠకులు కనులముందు ప్రదర్శింపబడినట్లే చిత్రించడము సూరదాస్‌యొక్క ప్రత్యేక ప్రతిభా వైశిష్టము - మనోహర సన్నివేశ వైచిత్ర్యము వెనుక నిగూఢ ఆధ్యాత్మిక రహస్యములను దాచియుంచుట వారి అద్భుత రచనా విలాసము

సూరసాగర్ నందలి ఒక మణిముత్యమును దర్శించి చర్చించి ఆనందించెదముగాక! భక్తుని హృదయంలో భగవంతుని కొరకు చెలరేగిన పరితాపము భగవదర్శనంతోనే తీరాలనే భావాన్ని రాధాకృష్ణుల ప్రణయ గాధ ద్వారా సూరదాస్ ఎంత మనోరంజకముగ చిత్రించాడో తెలుసు కుందాము

రాధ ఒకనాడు చెలికత్తెలతో కలసి క్రీడిస్తున్నది కొన్ని క్షణాలు రాధ కనుపించలేదు చెలులంతా రాధ కొరకు అన్వేషణ జరిపారు ఒకవృక్ష

ఛాయలో స్పృహలేక పడియున్న రాధను చూసారు భీతిచెందారు ఏదో సర్పము కాటువేసి యుంటుందని గ్రహించారు పరుగెత్తుకుంటూ వెళ్ళి రాధ తల్లియైన సునయనాదేవితో "అమ్మా! మీబిడ్డయైన రాధను కృష్ణ సర్పం కాటువేసింద"ని చెప్పారు

సునయనాదేవి శరీరం కంపిస్తున్నది నేత్రములవెంట అశ్రుధారలు కాలుచున్నవి కంఠం గద్గదమగుచున్నది భోరున ఏడ్వసాగింది ఆమె బాధనుచూచి ఒక వృద్ధుడు "అమ్మా! సునయనాదేవీ! ఆపదను చింతిస్తూ నీ మనస్సు అల్లాడిపోతున్నదేగాని ఆపదనుండి బయటపడు పర్యవసాన మును ఆలోచించలేక పోతున్నది కృష్ణసర్పం కాటువేసి యుంటుందని రాధ చెలికత్తెల అనుమానం దానికి విరుగుడు వేయాలి అది కృష్ణునికే సాధ్యం అతనిని తొందరగా పిలిపించాలి అంటూ సలహా ఇస్తాడు ఆ మాటలు విసిన సునయనాదేవి

నంద సువన గారుడీ ఘలావహు
కహ్యో హమారో సునతనకోవ్హా
తురతజాహు, రే ఆవ హు

"త్వరగా వెళ్ళి నందకిశోరుని తీసుకొని రండి త్వరగా వెళ్ళండి నాబిడ్డకు ఏ ఆపద సంభవించనున్నదో" అని విలపిస్తుంది

ఒక గోపబాలుడు వెంటనేవెళ్ళి యశోద మాతతో అమ్మా రాధను కృష్ణసర్పం కాటువేసిందట నీవు శ్రీకృష్ణుని తొందరగా రాధ చెంతకు పంపాలి శ్రీకృష్ణుని మించిన మంత్రవైద్యుడు మన వ్రజ భూమిలోలేడు మీరు ఆలస్యంచేస్తే రాధ జీవితానికే ముప్పువాటిల్లగలదు అని తెలియచేస్తాడు

ఈ వార్త విని యశోద మందహాస వదనుగాలైందని సూరదాస్ అభివర్ణిస్తాడు రాధను కరచిన కష్ణసర్పం తన కన్నయ్యేనని యశోద గ్రహించినదట తనకు తెలియకనే కృష్ణయ్య మంత్రశాస్త్రంలో ఇంత ప్రావీణ్యం ఎప్పుడు సంపాదించాడాయని పరిహాసంగా ఆశ్చర్యపోతుందట ఆడుకొంటున్న శ్రీకృష్ణుని పిలిచి నాయనా! కన్నయ్యా! రాధను కృష్ణ

సర్పం కాటు వేసిందట పాపం ఏమి అపాయం జరుగుతుందో ! వెళ్ళి రక్షించు అని శ్రీకృష్ణునివైపు నవ్వుతూ వెటకారంగా చూసిందట యశోద మాత

హరి గారుడీ తసో తబ ఆయె
యహ బాసీవృషభాను సుతాసుని
మన మనహరష బఢాయే

శ్రీకృష్ణుడు వెంటనే రాధయున్న స్థలానికి పరుగెత్తుకొంటూ వచ్చాడు రాధను చూశాడు కృష్ణుడు వచ్చాడన్న వార్త రాధ చెవిని పడింది హృదయము ఆనందముతో నిండిపోయింది ఆనంద పారవశ్యంలో నేత్రాలవెంట అశ్రుధారలు రాలుతున్నాయి శరీరము కంపిస్తున్నది ఈ లక్షణాలన్నీ చూసిన సునయనాదేవికి భయమధికమైంది కృష్ణా! నా రాధను రక్షించు నేను నీకు ఋణగ్రస్తురాలనై యుంటాను అని దుఃఖించింది

రాధ యదార్థ స్థితిని గ్రహించిన శ్యామసుందరుడు లోలోన ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ రాధను సమీపించాడు మంత్రోచ్చారణచేయు చున్నట్లు ఊరకున్న పెదవుల్ని అనవసరముగా కదిలింపుతున్నాడు తన అమృత హస్తముతో రాధ శరీరాన్ని స్పృశించాడు అంతే వ్యాధిగాని వ్యాధినుండి రాధ బయటపడింది బాధగాని బాధనుండి విముక్తి పొందింది నిద్రనుండి లేచినట్లు లేచింది పరిస్థితి అర్థంగానట్లు ప్రశ్నల పరంపరలు క్రుమ్మరించి విషయావగాహన చేసుకుంటున్నది రాధా శ్యామసుందరుని దయచేతనే ఈనాడు నీవు రక్షించబడ్డావు అని అప్రయత్నంగా సునయనాదేవి అన్నదట రాధ కృతజ్ఞతతో శ్రీకృష్ణునివైపు చూసిందని సూరదాస్ సూరసాగర్ నందు అపూర్వంగా చిత్రీకరించాడు

సూరసాగర్ నందు చిత్రీకరించబడిన ఈ సంఘటనలో ప్రేమోల్లాస తరంగాలు వెటకారపు శిల్పాలు భావపూరిత విన్యాసాలు సౌందర్యోపాసకులను వెర్రివాళ్ళను చేస్తాయి కృష్ణ విరహాన్ని భరించలేక రాధ పడిపోవడము కృష్ణసర్పం కాటు వేసుంటుందని చెలికత్తెలు చిత్రించడము ఈ కల్పనాతరంగాల వడిని అర్థం చేసుకోలేక పుత్రికా వాత్సల్య సుడిలోపడి

సునయనాదేవి విలపించడము బాధానివారణకు శ్రీకృష్ణ హస్తస్పర్శయే దివ్యౌషధమని వృద్ధుడు తెలియచేయడము ఈ వార్తను వినగానే ఇందులోని మాయా నాటక ప్రభావ విశేషాలను గ్రహించి యశోదాదేవి మందహాసమును చిందించడము తల్లిమాట జవదాటనట్లు విధేయ విద్యార్థిలా శ్రీకృష్ణుడు రాధ ఇంటికి అరుదెంచడము శ్రీకృష్ణుని రాక తెలియగానే రాధ మనస్సులో కలిగిన ఆనందోత్సాహాలు శరీర కంపనాదులద్వారా వ్యక్తం కావడము ఈ గారడి విశేషాలు అర్థంగాని సునయనాదేవి శ్రీకృష్ణుని ప్రార్థించడము అన్నీ తెలిసి ఏమీ తెలియనట్లు పెల్లుబుకుతున్న నవ్వును అపుకుంటూ శ్రీకృష్ణుడు రాధను స్పృశించడము మంత్ర ప్రభావముచే రాధ ఆరోగ్యవంతురాలైనట్లు కళ్ళు తెరవడము—సౌందర్యోపాసకులను ఆనంద శిఖరాలకు మోసుకొని పోతాయి

మరితాత్త్వికుల విషయము : వేదాంతవగాహనాపరులకు ఎలా గోచరిస్తుందో చూడండి చెలికత్తెలనెడి విషయ వాసనా ప్రపంచములో క్రీడిస్తున్న రాధ యనెడి జీవుని మనస్సు వాసుదేవునివైపు మరలగనే అంతవరకు సాగించిన భోగ జీవన క్రీడకు స్వస్తి జరుగుతుంది భగవానుపై మనసు మరలిన జీవుడు రాధవలె నిష్క్రియత్వమునొంది తదేకంగా పరమాత్మను గూర్చియే చింతిస్తుంటాడు రాధ యనెడి జీవునిలో కలిగే ఆంతరంగిక పరిణామాన్ని గుర్తించలేని చెలికత్తెలనెడి ప్రాపంచిక జీవులు భ్రాంతియనెడి కృష్ణసర్పము కాటువేసిందని భావించి గోలచేస్తారు అది వినగానే మనస్సనెడి సునయనాదేవి విలపిస్తూ ఆరాటపడుతుంది అవగాహన కల్గిన బుద్ధి యనెడి వృద్ధుడు కృష్ణ సందర్శనమే దివ్యౌషధమని తెలియచేస్తాడు కృష్ణ సందర్శనము కలుగవలయునన్నచో గురుదేవుని అనుగ్రహం కావాలి యశోదయే అట్టి గురుదేవులు గురుదేవులైన యశోదామాత అనుగ్రహంతో శ్రీకృష్ణుడను దేవుడు రాధ గృహమవే జీవశరీరములో వ్యక్తంకాగానే జీవచైతన్యము ఆత్మచైతన్యముగ మారుతుంది అట్టి దివ్యపారవశ్య ఆత్మానుభూతిలో అనేక శుభ చిహ్నాలు గోచరిస్తాయి అవియే రాధ శరీరము ద్వారా వ్యక్తమైన గగుర్పాటు శరీర కంపనము అశ్రుధార మొదలగునవి భగవానుని స్పర్శచే కలుగు దివ్యానందమే రాధలో కలిగిన

దరహాసము రాధ వెంటనే కళ్ళుతెరచి చూస్తుంది ఆమెకు కృష్ణుడు కనుపిస్తాడు ఆత్మానుభూతిని పొందిన జ్ఞాని ప్రపంచాన్ని దర్శించగనే అతనికి సమస్తమూ కృష్ణమయంగా గోచరిస్తుంది ఇదియే పై సన్నివేశము ద్వారా సూరదాసు సృష్టించి వెలిబుచ్చిన అద్భుత ఆధ్యాత్మికచింతనా ప్రభావ జనిత అపూర్వ చిత్రీకరణ విలాసము

పరమ పవిత్రమైన భాగవత గ్రంధములోని సన్నివేశములను సూరదాస్ చక్కగా వరించసాగాడు భగవనుని లీలామాధుర్యమును వివరింపుటచే సూరదాస్ హృదయమే ఒక బృందావనంగా తయారైంది నిరంతరము పారవశ్య దివ్యోన్మాద స్థితిలో జీవించేవాడు శ్యామసుందరుని సంకల్పము మినహా మరొక సంకల్పము అతని మనస్సులో కదలలేకపోతున్నది భగవద్వియోగమును భరించలేక సూరదాస్ తీవ్రంగా వ్యధచెందేవాడు శ్రీకృష్ణ సందర్శన భాగ్యానికై అహోరాత్రాలు తపించే సూరదాస్ తన ఆవేదనను అణచుకోలేక తీవ్ర అసంతృప్తిని వ్యక్త పరచేవాడు

ప్రీతికర్ కాహూ సుఖ్ న లహ్యో
ప్రీతి పతంగ్ కరీ దీపక్ సౌ ఆపై ప్రాణ్ దహాయో

శారంగ ప్రీతి కరీ జో నాద్ సౌసన్ముఖ బాన్ స్యహాయో

ప్రేమపాశము అతి భయతకరమైనదని ఆ వలలో తగుల్కొనిన జీవికి శాంతిలేదని తన అంతరంగిక విరహవ్యధను సూరదాస్ చిత్రీకరిస్తున్నాడు స్వేచ్ఛగా సంచరించే దీపపు పురుగు దీపాన్ని చూసి ప్రేమించింది దీప కాంతిలోని అరుణకాంతిని తన దేహానికి అందుకోవాలని ఆశించింది దరి చేరింది అతి ప్రేమతో దీపాన్ని ముద్దెట్టుకున్నది పర్యవసానమేమిటి? మరుక్షణమే మాడి మసియైవాలిపోయింది ప్రేమకెందుకింత కసి? ప్రేమ యొక్క రక్కసియా?

విశాలారణ్యంలో వినోదంగా విహరించే లేడి శ్రావ్యమైన సంగీతాన్ని కాంక్షించి తన చలనాన్ని నిరోధించుకున్నది గానమాధురిలో ఓలలాడుతూ సంగీత తరంగాలు కదలివచ్చే కేంద్రాన్ని చేరాలని నడిచింది గాన రస వీచికల ననుసరించి నడుస్తున్నది పాపం! అని మాధుర్య గాన తరం

గాలో-అనివార్య మృత్యుపాశాలో ఆ అమాయకపు లేడి కేమి తెలుసు? దరి చేరింది పొదలమాటున సంగీతబాణం నందించిన బోయవాని వాతపడింది రాత చెడింది జీవన ద్వారము మూతబడింది ఆహా! ప్రేమలో ఇంత పగ ఉన్నదా? ఇది ప్రేమయా? లేక బ్రతుకును వమ్ము చేసేందుకు ప్రేమ రూపంలో ఏతెంచిన మృత్యువా?

పరమ విరహాసక్తితో మేనుమరచి మనస్సు తెరచి తన మూగ బాధను మాధవుని ముందుంచేవాడు సూరదాసు కంటిపై రెప్ప వాలేదికాదు ప్రాపంచిక విషయములతో అరుచి గోచరించింది శ్యామసుందరుని వదలి క్షణకాలమైనను జీవించలేని స్థితికి సూరదాస్ మనస్సు చేరింది సూరదాస్ లోని భక్తి తన్మయత్వమును ఆత్మానుభూతిగాంచి భక్తులు విరివిగా ఏతెంచి దర్శించేవారు కానుక లందించేవాడు కానీ సూరదాస్ బాగా మారి పోయాడు భక్తులిచ్చే కానుకలను నిరాకరించేవాడు నందనందనుని పొందు తప్ప అన్యమైనవన్నీ తుచ్ఛమని భావించేవాడు సూరదాస్‌ను అమితంగ ప్రేమించే భక్తులందరు తనను సన్మానించడానికి ప్రయత్నించారు సూర దాస్ వారికి తన తీవ్ర అభ్యంతరాన్ని తెలియజేశాడు క్షణికమైన గౌరవ ములయందు తనకు ఆసక్తిలేదని తెలిపాడు గోవిందుని సాయుజ్యమే ఘన గౌరవమని చాటాడు

కబహుంక్ చఢ్యో తురంగ
మహా గజ కబహుంక్ బార్ బహా॥
కమల నయన ఘనశ్యామ
మనోహార అనుచర భయో రహా॥

ఒకనాడు సన్మానాలతో పొంగి మరునాడు అవమానాలతో క్రుంగే మనస్సు సూరదాస్ వద్దలేదు ఒకనాడు గజారోహణచేసి మరునాడుఅన్య భార వాహుడై జీవించడము తన అభిమతము కాదని సూరదాస్ మహాశయుడు తెలియజేస్తున్నాడు పద్మనయనుడు ఘనశ్యాముండైనట్టి మనోహర మూర్తియైన శ్రీకృష్ణదేవుని దాసుడుగ తన జీవితమును సాగించుటయే తన మనోభీష్టమని తెలియజేసేవాడు

జై సేహి రాఖౌతై సేహి రహౌ

"నీ సంకల్పానికి అనుగుణ్యంగా జీవించడమే నా కర్తవ్యమని సూరదాసు తన సంపూర్ణ శరణాగత భావాన్ని తెలియజేశాడు

ఒకనాడు సూరదాసు రాధాకృష్ణుల ప్రేమతత్త్వాన్ని గానంచేస్తూ వన ప్రదేశములో విహరింపుచుండెను మనస్సులో నడిచే సంకల్ప ప్రవాహానికి అనువుగా అడుగులు వేయుచూ కదలసాగెను పారవశ్య భూమికలో సంచరించే సూరదాసునకు తాను నడుస్తున్నట్లుకూడా తెలియడంలేదు దారితప్పి అరణ్య ప్రదేశములో ప్రవేశించాడు తాను నడువడానికి వీలులేని విధంగా చిక్కుకపోయాడు ఒకవైపు ముళ్ళపొదలు మరొకవైపు రాళ్ళగుట్టలు ఎటుపోవడానికి వీలుకాలేదు ప్రయత్నించి చూశారు ప్రయోజనం కనుపించలేదు మరి తాను గ్రామానికెలా ఎతెంచాలి? దగ్గరలో జనసంచారమున్నట్లు కూడా లేదు ఈ నిర్జన ప్రదేశంలో తనను రక్షించేవారెవరు ? ఈ విపత్తు నుండి తాను ఎలా విముక్తి పొందగలడు ? తన ఆవేదన ఎవరికి వినపడుతుంది ? తన హృదయేశుడైన శ్యామసుందరుని మనస్సంతా నింపుకొని సుశ్రావ్యంగా గానం చేయసాగాడు

కౌన్ సునే యహ్ బాత్ హమారీ
తుమ్ అవిగత్ అనాథ కె స్వామీ
దీనదయాళ నికుంజ బిహారి
సదా సహాయ కరీ దాసన్ కీ
జో ఉర్ ధరీ సో ఈ ప్రతిపారి।
అబకెహ శరణ జాఊఁ
యాదవపతి రాఖలెఉ బలి ప్రతాప నివారీ
సూరదాస్ చరనన కీ బలి బలి
కౌన్ గుసాఁ తె కృపా బిసారీ

హే శ్యామసుందరా। కృపానిధీ! బృందావన విహారీ! అనాథులకు నీవే నాథుడవు దీనజనులనుగాచి బ్రోచువాడవు నిన్ను శరణు జొచ్చిన భక్తుల నెందరినో నీవు గాచితివని బ్రోచితివని వినువు

లున్నవి కృష్ణా! నీ పవిత్ర పాదపద్మములకు సంపూర్ణ శరణాగతు డనై జీవింపు నన్ను నీవు నిరాకరించినచో నేనిక ఎవ్వరిని ఆశ్ర యింతును? దీనశరణ్యా! సూరదాస్ నీ సేవకే అంకితమైయున్నాడు అతనిని త్రోసిపుచ్చకుము అని గానం చేయసాగాడు

సూరదాస్ చేతికర్రను ఎవ్వరో పట్టుకొని నడిపిస్తున్నట్లు తెలిసింది సూరదాస్ ఆ వ్యక్తిని మెల్లగ అనుసరించాడు బాట సుగమమైంది బాబూ! నీ వెవరు? ఈ నిర్జన ప్రదేశములో దిక్కులేక నిలబడియున్న నాకు విముక్తిని ప్రసాదించావు నీ మేలు ఈ జన్మలో మరువలేను నీ పేరేమిటి? మీ తల్లిదండ్రులెవరు? మీ స్వగ్రామమేది? అని సూరదాస్ ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు నడిపిస్తున్నవ్యక్తి మాట్లాడలేదు గ్రామ పొలిమేరలో ప్రవేశించారు రహదారిపై కాలిడగానే బాబూ ఇక నేను వెళ్ళగలను నాకు ఇంతగ సహాయం చేసిన నీకు కృతజ్ఞుడను ఇప్పుడైనా చెప్పు నీవెవరు? అని సూరదాస్ ప్రశ్నించాడు సూరదాస్‌ను నడిపిస్తున్న అజ్ఞాతవ్యక్తి సూరదాస్ చేతికర్రను వదలి ఘల్లుఘల్లుమను అందెల రవళితో పరుగెత్తిపోయాడు

సూరదాస్ శరీరము కంపించింది మనస్సుపట్టుతప్పింది సుధామయ మైన కాలిగజ్జెల ఆలికిడి తన హృదయాన్ని అమాంతగ అకట్టుకొన్నది పరిస్థితి గ్రాహ్యమైంది తనను నడిపించి తీసుకొని వచ్చిన దెవరో బోధ పడింది అంధకార బంధురమైన తన జీవితంలో ప్రకాశవంతమైన జ్ఞాన జ్యోతిని వెలిగించినవాడే ఈనాడు కర్రపట్టి నడిపించాడు క్షేమకరమైన జీవనబాటలో తన బ్రతుకును మలుపు త్రిప్పినవాడే ఈనాడు అరణ్య ప్రదే శము నుండి తరలించి గ్రామ పొలిమేరలలో నిలిపాడు సూరదాస్‌నేత్రాలు మేఘాలై ఆనంద వర్షధారను కురిపిస్తున్నాయి తనలో ఆలోచనా సుడి ప్రారంభమైంది వెంటనే హృదయంలో విషాదమలుముకుంది సూరదాసు భోరున విలపించాడు

హే లీలామానుషవిగ్రహా నవనీతచోరా నిన్ను గుర్తించలేనను కున్నావా? దిక్కులు తెలియని ఈ గ్రుడ్డివానిపై దయ కలిగిందా? దిక్కు

లేని ఈ సూరదాసు ప్రక్కన నిలబడి అడుగిడి నడపించి నేర్పావా? నడిపించి నటియించి కాఠిన్యంతో విడిపించుకొని వెళ్ళావా? కృష్ణా నేనెంత పాపాత్ముడను? నీవు దగ్గరేయుండి నడుస్తూ నడిపిస్తున్నను నీ దివ్యమంగళ మంజుల రూపమును గాంచుటకు నోచుకోలేకపోతిని ప్రభూ! నా గతజీవన సంచితమంతయు కలసి ఈ అంధత్వ రూపమున అరుదెంచినట్లున్నది సుజనప్రియా! సుదుర్లభా సుందరరూపా! ప్రారబ్దవశాత్తు లభించిన గ్రుడ్డితనముచే నీ సుందర రూపమును గాంచలేకపోయాను కానీ భగవాన్ నా వీనులు చేసిన నేరమేమి? నిన్ను అనేకసార్లు పలుకరించాను నిన్ను గూర్చి వివరించమని ప్రార్థించాను నీవు ఒక్క మాటకూడా నోరుతెరచి మాట్లాడ లేదు గ్రుడ్డివాడనై నీ మంజుల రూపమును గాంచలేని నేను వీనులవిందుగ నీ అమృతవాక్కు నాలకించి తరించేవాడనుగదా? కన్నయ్యా! నా బ్రతుకు నీకూ వేళాకోళమైనదా? అర్హతలేని నాకు అగుపించకూడదని సంశయించావా? ఎచ్చికృష్ణా ఎంతపిలిచినా మారుపలుకకుండా నన్ను విసిగించి ఉడికించి మోసంచేసి వెళ్ళావా! నందనందనా? పో! నువ్వు ఎంత దూరంగా వెళ్ళగలవో చూస్తాను నీవు బాహ్యంలో ఎంత దూరంగా వెళ్ళినా ఆంతర్యంలో నా హృదయ మందిరము నుండి అదృశ్యం కాగలవా? అంటూ విలపిస్తూ పడిపోయాడు

నేలకొరిగిన సూరదాసు మహాత్ముని శిరస్సు నేలనంటలేదు సుకుమార పాదద్వయంపై తలవాలింది సూరదాసు గగుర్పాటు చెందాడు ఆ పాదాలను స్పృశించాడు కుసుమకోమలమైన పవిత్ర పాదద్వయ స్పర్శతో తన హృదయము ఆనంద సాగరంగా మారింది అది తన బాలకృష్ణుని పావన చరణ యుగ్మమని గ్రహించాడు తన కన్నీటితో స్వామి పాదాలనభిషేకం చేస్తూ కన్నా! కరుణించవా? అని అప్రయత్నంగా అన్నాడు

అంతే దయాస్వరూపుడైన శ్యామసుందరుని కరుణ కట్టలు త్రెంచుకొని ఉరికి ది సూరదాస్ నేత్రాలను ఆదిదేవుడు తన అమృత హస్తంతో స్పృశించాడు సూరదాస్ చక్షుష్మంతుడైనాడు భగవానుని మంజుల రూపాన్ని దర్శించాడు సూరదాసు నేత్రాలు ఆనందాశ్రువులను వర్షించు మండ భగవాన్! చాలు ఈనాటితో నా జన్మ చరితార్థమైనది ఆదిదేవుని

ఒప్పురూపు దర్శనంతో నాలోని అజ్ఞానమంతయు అదృశ్యమైనది దేవదేవా! భక్తవత్సలా? నిన్నుగాంచిన నా ఈ నేత్రాలతో ప్రపంచమును గాంచలేను నా నేత్రాలకు మళ్ళీ అంధత్వాన్నే ప్రసాదించు అని బాలకృష్ణుని సూరదాస్ ప్రార్థించాడు వాసుదేవుడు మందహాసమును చిందించాడు దివ్య మానుష విగ్రహుని దరహాసమును గాంచి అంతర్యంలో ఆనందము ననుభవిస్తూ సూరదాస్ అంతర్ముఖుడయ్యాడు వెంటనే ఆయన నేత్రదృష్టి కూడా వెనుదిరిగి హృదయేశునివైపు నడచి అంతర్లీనమైంది

భగవానుని దివ్యదర్శనంతో సూరదాసునిలో వినూత్న పరిణామం గోచరించింది సదా భగవన్నామసంకీర్తనయందు కాలం గడిపేవాడు నిరంతరము రాధాకృష్ణుల మధురలీలలను గానంచేస్తూ పరవశించిపోయేవాడు సూరదాస్ భక్తి పరిమళాలు నలువైపుల వ్యాపించాయి భక్తులు విరివిగ ఆకర్షింపబడ్డారు సూరదాస్ మహాత్ముడని కీర్తించసాగారు

అవంతికా నగరమును పాలించు ప్రభువు చక్కటి భక్తిశ్రద్ధలు కల వాడు అతడి ఆస్థానమునందు ఉద్దండులైన పండిత ప్రకాండు లెందరో గలరు ఒకనాడు తన ఆస్థానములోని సంగీత విద్వాంసు లొకరు గానం చేయగా అనుశ్రావ్య గానమునకు రాజుగారి మనస్సు తృప్తి చెందినది గాయక శిరోమణి! మీగానము మిమ్ములను ఆనంద శిఖరాలకు మోసుకొనిపోయినది మిమ్ములను గాంచిన గానకోవిదులు ఈ దేశములో లేనిమాట వాస్తవము అపర నారదులైన మీరు మా కొలువులో పండితులై యుండుట మా భాగ్యము అని స్తుతించెను గాయకుడు రాజుగారి ప్రశంసలకు అడ్డుపలుకుతూ మహారాజా క్షమించాలి నా గానముతో మిమ్ములను ఆనందపారవశ్యములో ఓలలాడునట్లు చేయగలుగుట నా అదృష్టము అది భగవానుడు నాపై కురిపించిన కరుణావృష్టిగా భావిస్తున్నాను కానీ ప్రభూ! నా గానమునకే మీరంతగా మురిసిపోయారు మధురాక్షేత్రమున సూరదాసను మహాత్ముడు కలడు అతడు జాత్యంధుడు అతడి గానమునకు గంధర్వులు కూడా పరవశించెదరు నాదలోలుడై సూరదాసు గానము చేయుచుండ నారద తుంబురాది గానకళాకోవిదుల సంగీతము నాలకించి నట్లుండును అని తెలియజేసెను

రాజుగారి మనస్సు ఉరకలు వేసింది సూరదాస్ మహనీయుని దర్శించవలయునని అతని గాన మాధుర్యము నాస్వాదించి తృప్తి చెంద వలయుననెడి ఆకాంక్ష రాజుగారి అంతఃకరణలో గాఢంగా పెనవేసుకుంది వెంటనే మంత్రిగారిని పంపి సూరదాస్‌ను ఆహ్వానించి రాజమందిరమునకు తీసుకొనిరమ్మని తెలియజేశాడు సూరదాస్ రాజుగారి విన్నపము నామోదించి రాజమందిరమున కరుదెంచారు రాజుగారి సమక్షములో ఆస్థానపండితు లందరూ వీక్షించుచుండ సుశ్రావ్యంగా గానాలాపన చేయడానికి ప్రారంభిం చాడు సూరదాస్ గానము నాలకించి రాజు పరవశుడై ఆనందబాష్పాలు విడి చాడు అచ్చట ఆసీనులై యున్న పండితమ న్యులందరు విస్మయమొందారు అది సామాన్య గానముకాదు తన ఆరాధ్య దైవమైన శ్యామసుందరుని పొందుకై పరితపించు సూరదాస్ మహాత్ముని హృదయపు లోతులనుండి పెల్లుబికిన సుధామయ అనురాగ స్రవంతులు వ్యాకులచిత్తుల మనోవైకల్యములను ఎరిచేయు అమృత రసమయ ఓషధులు

రాజుగారు సూరదాస్‌ను ఆలింగనం చేసుకొని సన్మానించారు సభికు లందరు అత్యద్భుతంగా ప్రశంసించారు సూరదాస్‌ను ఆ ప్రశంసలు కది లించలేక పోయాయి తన వ్యక్తిత్వాన్నే నందనందుని ఆరాధనలో పూజా పుష్పంగ సమర్పించిన సూరదాస్ హృదయాన్ని నిందాస్తుతులు తాకగలవా?

న ప్రీయతే వన్ద్యమానో, నిన్ద్యమానో న కుప్యతి
నైవో ద్విజతి మరణే జీవనే నాభినన్దతి

పూజించినారని జ్ఞాని తృప్తిచెందడు నిందించినారని కోపమును ప్రకటిం చడు మృత్యువును తలచి భీతిచెందడు జీవనరీతిని గాంచి ముదమొందడు

తనను అమితంగ ప్రేమించి అభిమానించిన ప్రభువును ప్రశంసిం చిన పండితులను ఉద్దేశించే సూరదాస్ మాననీయులారా వందనములు నా నుండి వ్యక్తమయ్యే ప్రతిభ ఏదైనను అది బాలకృష్ణుని వైశిష్ట్యమే నేనొక పనిముట్టును బుధజన సేవకుడను భక్తజన దాసుడను అని తన అంత రంగిక వైభవమును వ్యక్తీకరించు అమృత వచనములను వినమ్రతతో విన్నవించాడు

రాజుగారి కొలువులో సూరదాస్ మహాత్ముడు ప్రదర్శించిన గానకళా వైదుష్యము అంతఃపుర ప్రాంగణాల్లోకి పాకింది సూరదాస్ గానం విన వలయుననెడి తన అభీష్టమును రాణిగారు రాజుగారితో తెలియజేయడం జరిగింది రాణిగారి మనోవాంఛను నెరవేర్చు నుద్దేశ్యముతో రాజుగారు సూరదాస్‌ను సమీపించి రాణిగారి అంతఃపుర మందిరములో గానసభ చేయ వలసిందని ప్రార్థిస్తారు రాజుగారి కోర్కెను సూరదాస్ అంగీకరిస్తారు అంతఃపురమునకేగి గానసభ ప్రారంభిస్తారు సూరదాస్ అంధుడు గనుక అంతఃపుర స్త్రీలందరు ఆ మహాత్ముని ఎదుట ఆసీనులై ఆ మహాత్ముని అమృత గానము నాలకించుచున్నారు. రాధాకృష్ణుల దివ్యలీలా వైభవమును అంతరంగికముగ అనుభవిస్తూ తన అనుభవ సాగర గర్భమునుండి పెల్లు బికిన రసమయ సంగీత తరంగాలను సూరదాస్ అభివ్యక్తం చేయుచుండ అచ్చట ఆసీనులై యున్న అంతఃపుర స్త్రీల నేత్రాలనుండి ఆనందబాష్పాలు నిలువలేక జారుచున్నవి సూరదాస్ గానము చరమస్థాయికి చేరుకుంది శ్రీకృష్ణ వైభవమును గానముచేయుచున్న సూరదాస్ మహాత్ముడు కృష్ణ చైతన్యములో మునకలేయసాగాడు కంఠస్వరం తగ్గుతున్నది సాహిత్యము పట్టుతప్పుతున్నది అప్రయత్నముగా కొన్ని క్షణాలు గానము ఆగిపోతు న్నది గగుర్పాటు చెందుతున్న సూరదాస్ శరీరము ఎడతెగని ప్రవా హము వలె స్రవించుచున్న ఆనందబాష్పములు చూపరులను విస్మయ మొందించు చున్నవి సూరదాస్ పాడలేక ఆపేశాడు తన హృదయ నివాస మైన వాసుదేవుడు దేహమంతయు వ్యాపించాడు మనస్సునంతయు నావరిం చాడు నేత్రాలలో నిలిచిపోయాడు సూరదాస్ మహాత్ముడు తానే చైతన్య స్వరూపంగా మారిపోయాడు అంధత్వము చర్మచక్షువులకేగాని చైతన్యమైన తనకు అంధత్వ మెక్కడిది? సూరదాస్ నేత్రాలు తెరిచాడు. అంతఃపుర మందిరము అంతఃపుర స్త్రీలు. అక్కడ కనుపించు వస్తుజాలము సమస్తము సూరదాస్‌నకు కృష్ణమయముగా గోచరించుచున్నది?

అంతఃపుర పరిచారిక ఒక పాత్రలో పాలు తీసుకొనివచ్చి సూరదాస్ ముందుంచసాగింది. సూరదాస్ ఆవిడనుగాంచి కృష్ణా? నా కొరకు క్షీర

ముసు తెచ్చావా? క్షీరసాగరశయనా నీ అనుభూతిలో ఓలలాడే నాకు ఇక క్షీరముయొక్క అవసరమేమున్నది? అని పలికాడు

అంతఃపుర స్త్రీలు దిగ్భ్రాంతి చెందారు ఏమిటి ? సూరదాస్ అంధుడు కాడా ? ఎంత మోసము జరిగిపోయింది? అని అప్రయత్నముగా అన్నారు

సూరదాస్ మందహాసమును చిందిస్తూ కృష్ణా ప్రపంచములో వెలుతురు లేదు నీలో చీకటి ఉండదు నిన్ను దర్శించిన వానికి అంధత్వం లేదు నిన్ను మరచినవానికి దృష్టియు లేదు అంతయు కృష్ణమయమై యుండ అజ్ఞాన మెచ్చటున్నది? అంధత్వ మెందుకుంటుంది? అంటూ నేల కొరిగాడు

అంతే అయిపోయింది సూరదాసు చైతన్యము కృష్ణచైతన్యములో లీనమైంది చూపరులందరు దిగ్భ్రాంతి చెందారు కన్నీరు కార్చుచు సూర దాస్ పాదాలపై పడ్డారు చూపులేకున్నను అత్యుత్తమబాటలో నడచిన ఆ మహాత్ముని పాదపద్మములను శిరమున ధరించారు ఆతని పాదములు నడ చిన బాటలో తమ అడుగులు వేయు శక్తిని భక్తిని ప్రసాదించమని ప్రణ మిల్లి ప్రార్థించారు

సూరదాస్ అమరరత్నము సూరసాగర్ అమృత భాండము

* ఓం శ్రీ ఆశ్రిత కల్పద్రుమాయ నమః *





# ఏకనాథస్వామి

మానవ జీవనరీతి శరణాగతిపై ఆధారపడి వుంటుంది ప్రతి మానవుడు ఎవరో ఒకరికి శరణాగతుడై వుంటాడు మానవ జీవనబాటలో కనుపించే సానుకూలగతి సామరస్య ప్రగతి శరణాగతి జీవన వికాసమును కాంక్షించు మతి అనుసరించురీతి శరణాగతి

తల్లి విషయములో బిడ్డ శరణాగతితో వర్తిస్తుంది అలా ప్రవర్తించడములో తన బ్రతుకుకు పరిపుష్టిని ఏర్పరచుకుంటుంది భర్త విషయములో భార్య శరణాగతితో మెలుగుతుంది అలా జీవించడములో తన మనుగడకు సార్థకత కల్పించుకుంటుంది యజమానిచెంత సేవకుడు శరణాగతితో ప్రవర్తిస్తాడు అలా బ్రతకడంలో తన జీవితానికి స్థిరత్వాన్ని సంపాదించుకుంటాడు గురువు విషయములో శిష్యుడు శరణాగతితో చరిస్తాడు అలాంటి నడవడికలో తన మార్గాన్ని పదిలపరచుకుంటాడు

అంతేకాదు కొందరు తమ మానసిక భావాలకు శరణాగతులై వుంటారు ఇంక కొందరు మూఢ విశ్వాసాలను శరణుజొచ్చి యుంటారు.

మరికొందరు పరిస్థితులకు శరణంటూ జీవిస్తుంటారు ఎదో ఒక విధంగా ప్రతి ఒక్కరు శరణాగతిలోనే జీవిస్తున్నారు

ఆధ్యాత్మిక రంగంలో ఆత్మానుభూతి నొందుట కుపకరించు అత్యుత్తమ సాధనలలో శరణాగతి ఉత్కృష్టమైనది భవరోగులకు ఇది దివ్యౌషధము బలహీనులకు వజ్రకవచము పతితులకు పావనమంత్రము పవిత్రులకు సాధనతంత్రము భోగికి యోగవ్రతము యోగికి మోక్షప్రదము

సామాన్య మానవుల శరణాగతికి ఆధ్యాత్మిక సాధకునిశరణాగతికి తేడాయున్నది సాధకుడు ఒక్క భగవంతునికే శరణాగతుడై వుంటాడు సామాన్యుడు అనేక విషయాలకు వ్యక్తులకు శరణాగతుడై వుంటాడు సాధకుని శరణాగతిలో మార్పు కనుపించదు సామాన్యుని శరణాగతి మార్పుమీదనే ఆధారపడి యుంటుంది

సాధకనికి ఒకే వాంఛ భగవత్సందర్శనాభిలాష తన బ్రతుకకు గమ్యం భగవంతుడు. తానుశరణుజొచ్చిన భగవంతుడు శాశ్వతుడు ఆనంద స్వరూపుడు నిత్యుడైన భగవానుని శరణుజొచ్చిన భక్తుడు నిత్యతృప్తుడవుతాడేగాని దుఃఖభాగుల కోవలో చేరడు అందుచేత భక్తుని జీవితంలో అసంతృప్తికి ఆస్కారములేదు

సామాన్యునికి అనేక వాంఛలు అందుచేత సంతృప్తికి తన జీవితములో స్థానంలేదు తాను శరణుజొచ్చిన వ్యక్తులు వస్తువులు అశాశ్వతములు దుఃఖస్వరూపములు అనిత్యమైన ప్రపంచము నాశ్రయించిన మానవుడు దుఃఖితుడవుతాడేగాని నిత్యతృప్తుడు కాలేడు

శరణుజొచ్చిన ప్రతిజీవి భగవానుడు రక్షిస్తాడు నీవు పతితుడవా? పవిత్రుడవా? అని భగవంతుడు ఆలోచించడు బిడ్డ మలినంగా వుందని తల్లి నిరాకరిస్తుందా? తన నాశ్రయించిన భక్తులను భగవంతుడు కూడా త్రోసిపుచ్చలేడు మనమే సంపూర్ణముగ భగవంతుని విశ్వసించలేకపోతున్నాము భగవంతుని విశ్వసించ గలిగినచో గంగాదేవి సకలమాలిన్యమును పరిశుద్ధ మొనర్చునట్లు తనను నమ్మిన భక్తులను భగవానుడు పవిత్రులను

చేసి పరమపదాన్ని ప్రసాదిస్తాడు నిరంతరము భగవన్నామామృతి పాన చిత్తులై అతిథి అభ్యాగతులను సేవిస్తూ అరిషడ్వర్గములను అంతమొందించి భగవత్సాన్నిధ్యమును పొంది తరించిన భాగవతోత్తములలో సంత్ ఏకనాథస్వామి సదా స్మరింపదగిన ధన్యాత్ములు

గోదావరీ పుణ్యనదీతీరంలో పైఠనపురమను గ్రామము కలదు ఆ గ్రామములో సూర్యాజీరావు రుక్మాబాయి అను దంపతులుండేవారు నిత్యానుష్టానపరులై అతిథి అభ్యాగత సేవాతత్పరులై ఆదర్శగృహస్థ జీవనమును సాగిస్తూ జీవిస్తుండేవారు అసంతృప్తికి ఆలయమైన నామరూప జగత్తులో శాశ్వతానందము ననుభవించగలిగే వారెందరుంటారు? వెలితిలేని ప్రాణులెందరుంటారు? ఉన్నది పోతుందేమోనన్నబాధ ఒకవైపు సాగుతుంటే లేనిది లభిస్తుందో లేదోనన్న వ్యధ మరొకవైపు లాగుతుంటుంది ప్రతివ్యక్తి ఈ సంశయ ఊయలనెక్కి ప్రయాణము చేస్తూనే వుంటాడు

సూర్యాజీ దంపతులు సంతృప్తికర జీవనమును గడుపుతున్నను వారి హృదయాలలో అర్థంకాని వెలితికూడా చోటు చేసుకొనే యున్నది పున్నామ నరకమునుండి కాపాడి సద్గతిని ప్రసాదించే కుమారుడు లేడని వ్యధ చెందేవారు నిరంతము పాండురంగని సేవచేస్తూ తమ అభీష్టము ననుగ్రహించమని ప్రార్థించేవారు పాండురంగని ఆశీస్సులు ఆ పుణ్య దంపతులకు లభించాయి వారికొక కుమారుడు కలిగాడు ఆ బాలునికి ఎకనాథ్ అని నామకరణం చేశారు

భగవదనుగ్రహంతో జన్మించిన ఏకనాథుడు బాల్యమునుండి ఆధ్యాత్మిక విషయములందు ఆసక్తి చూపుతుండేవాడు ఆసక్తి పెరిగి పెరిగి ఆశయసిద్ధికి అన్వేషణగా పరిణమించింది బాహ్యవిషయములందు అనురక్తి కలగడంలేదు శైశవక్రీడలయందు అభిలాష కనుపించడములేదు నిరంతరము వైరాగ్యజనిత మనస్కుడై ఉదాసీనంగా కనుపించేవాడు పోగొట్టుకొన్న ఏదో వస్తువును వెతుకుతున్నట్లు అతని నేత్రాలు గోచరమయ్యేవి దృష్టి సదా ఆకాశాన్ని అంటిపెట్టుకొని యుండేది భోగభాగ్యాలమధ్య తులతూగుతున్నను భగవంతునికి దూరమైన బ్రతుకు నిరర్థకమని ఆ పసిహృదయం ఆరాటపడసాగింది

ఒకనాడు ఏకనాథుని స్నేహితులరుదెంచి క్రీడింపుటకు రమ్మని కోరుతారు ఏకనాథస్వామికి ఆటయందు ఆసక్తి లేకపోయినను మిత్రుల ప్రోద్బలంపై బయలుదేరుతాడు ఆటసాగుతుండగ ఎకనాథుడు ఓడిపోయాడంటూ మిత్రులందరు కేరింతలు పెడతారు ఏకనాథుడు ఆలోచనా సాగరంలో మునక వేస్తాడు అవును వారు చెప్పునది వాస్తవమే నేను నిజంగానే ఓడిపోయాను భగవానుని మరచి జీవనము కొనసాగింపు నేను అపజయానికి మారుపేరు నేను తప్పక గెలవాలి లేనిచో ప్రశస్తమైన మానవ జన్మయే వృధాపోతుంది గెలుస్తాను తప్పక గెలుస్తాను భగవంతుని గెలుచుకుంటాను అని చింతిస్తూ అంతర్ముఖుడయ్యాడు

ఎకనాథుని స్నేహబృందమంతా క్రీడలయందు లగ్నమనస్కులై యున్నారు ఎకనాథుడు అక్కడనుండి దూరంగా వెళ్ళి ప్రక్కనున్న వనవాటికలో ప్రవేశిస్తాడు వైరాగ్యము హృదయమునుండి పెల్లుబుకు చుండ ఒక వృక్షఛాయలో ఆసీనుడై అంతర్ముఖుడవుతాడు బాహ్యధ్యాసనుండి విడివడి అంతరాత్మలో రమించసాగాడు

ఆటముగియగానే స్నేహితులందరూ కలసి ఎకనాథుని అన్వేషిస్తూ వనప్రదేశాని కరుదెంచారు అచ్చటొక అద్భుత దృశ్యమునుగాంచి నిశ్చేష్టులయ్యారు ఏకనాథస్వామి ధ్యానస్థితిలోయుండ త్రాచుపాము అతని మెడను చుట్టి తన పడగతో స్వామి శిరస్సుకు గొడుగు పట్టినట్లు నిలచి యుండుట చూస్తారు సర్పము తవ మెడను చుట్టియున్నను దేహధ్యాస లేకుండగ ఏకనాథుడు ధ్యానస్థితియందు స్థిరంగా నిలువసాగాడు బాలురు దిగ్భ్రాంతి చెంది చూస్తుండగనే సర్పము ఎకనాథుని వదలి దూరంగా వెళ్ళిపోయింది ఎకనాథస్వామి దృష్టి బహిర్ముఖమైంది స్నేహితులందరు స్వామిని చుట్టుముట్టి జరిగిన విషయమంతా చెప్పారు ఏకనాథస్వామి అలా ఉండటాన్ని గూర్చి ప్రశ్నించసాగారు

స్వామి ప్రసన్నవదనంతో స్నేహితులను సమీపించివారిపై కరుణా దృష్టిని సారిస్తూ మిత్రులారా! నాకు అంతర్యంలో భగవానుని దర్శనం లభించింది భగవానుని అమృతవాక్కు నాకు హృదయంలో వినిపించింది.

దౌలతాబాద్ నగర నివాసమైన జనార్ధనపంత్‌ని గురువుగా స్వీకరించి సేవించమని ఆదేశము అందినది నేను గురు సాన్నిధ్యమును పొందుటకు బయలుదేరుతున్నారు అని మిత్రబృందమును కౌగలించుకొని వారినుండి వీడ్కోలు తీసుకొని వెనుదిరిగి చూడకుండా దౌలతాబాద్ చేరాడు

గురు జనార్ధనపంత్ గృహస్థుడు తాను సంసారములో యున్నను తనలో సంసారములేకుండా జీవించిన మహాజ్ఞాని దత్తాత్రేయ ఉపాసకులు. ప్రతి గురువారము తాను ఒక అరణ్యప్రదేశమునకు వెళ్ళి అక్కడ దత్తాత్రేయుల వారి దర్శనముపొంది తృప్తిచెందేవాడు తాను సంతృప్తికర అంతఃకరణతో జీవిస్తూ తమ దరిచేరు జిజ్ఞాసువులకు మార్గమును చూపి నడిపిస్తూండేవాడు అట్టిశ్రోత్రియ బ్రహ్మనిష్ఠులైన గురు జనార్ధనులవారిని ఆశ్రయించి సేవించి ధన్యతనొందమని హృదయాంతర్యామియైన భక్తవత్సల భగవానుడు ఏకనాథస్వామిని ఆదేశించాడు

భగవదాజ్ఞను శిరసావహించి ఏకనాథస్వామి దౌలతాబాద్ చేరి గురు జనార్ధనుని పాదాలాశ్రయించారు జనార్ధనుడు ఏకనాథుని శిష్యునిగా స్వీకరించాడు మంత్రదీక్ష ఇవ్వకుండా తన ఇంటిఖర్చుల పద్దులను ఒక పుస్తకములో వ్రాస్తుండమని తెలియచేశాడు సద్గురుని ఆదేశానుసారము ఏకనాథుడు జనార్ధనుని ఇంటిపద్దులను వ్రాయుచుండెడివాడు ఒకనాడు పద్దులన్నిటిని కూడికలు చేయుచుండగ ఒక పైస తేడా కనుపించింది ఏకనాథుడు ఎంత శ్రమించినను ఆ తేడాను గుర్తించి సరిచేయలేకపోయాడు రాత్రంతా కంటిపై రెప్పవేయకుండా పరిశ్రమించాడు సూర్యోదయానికి కూడికలో జరిగిన తప్పిదమును గుర్తించాడు అలా గుర్తించగలిగితినన్న సంతోషములో ఎగిరి గంతులేస్తూ శబ్దం చేయసాగాడు ఏకనాథుని విచిత్ర ప్రవర్తనకు కారణం తెలియక గురు జనార్ధనుడు పూజాగృహంనుండి వెలుపలికి వచ్చి తన పారవశ్యానికి కారణము తెలియచేయుమని ఏకనాథుని ప్రశ్నిస్తాడు తాను కూడికలో చేసిన తప్పిదమును దానిని గ్రహించి సరిచేసిన రీతిని పూసగ్రుచ్చినట్లు గురువుగారికి తెలియచేస్తాడుఏకనాథుడు ఏకనాథుని ఏకాగ్రతను బుద్ధి సూక్ష్మతను గ్రహించి జనార్ధనుడు తృప్తిచెందుతాడు కర్తవ్యపరాయణుడైన ఏకనాథుని అంతఃకరణ మంత్రదీక్షకు అనుగుణ్యంగ

యున్నదని గ్రహిస్తాడు కుమారా ఏకనాధా ఈశ్వరార్పణ బుద్ధితో ఆచరింపబడిన కర్మలు మానవునికి ఆధ్యాత్మికోన్నతిని కలిగిస్తాయి గృహ పద్దులను సరిచేయుటకు నీవు ఉపయోగించిన ఏకాగ్రతను భగవానునిపై వినియోగించినచో అనిర్వచనీయానందమును పొందగలవు అని పరోక్షముగా జ్ఞానోపదేశము చేశారు గురు జనార్ధనులు గురుబోధ ఏకనాధునిలో నిద్రాణమైయున్న ఆధ్యాత్మిక శక్తిని ప్రజ్వలింపచేసింది ఏకనాధుడు భగవద్దర్శనము కొరకు పరమ విరహాసక్తితో తపించిపోయాడు

గురు జనార్ధనుడు గురువారమునాడు యథావిధిగ దత్తాత్రేయులవారి దర్శనమునకై అరణ్యమున కేగుచు ఏకనాధస్వామిని వెంటబెట్టుకొని వెళ్ళారు ఏకనాధా! ఈనాడు నీకు గురు దత్తాత్రేయులవారి దర్శనము కాగలదు జాగరూకుడవై యుండుము భగవాన్ దత్తాత్రేయులవారు ఏ రూపముతోనైనను కన్పించవచ్చును భ్రాంతికి లోనుగాకుము అని చెప్పి అరణ్య ప్రదేశమునందు ధ్యానస్థితిలో ఆసీనులైరి

కొంతసేపటికి ఒక వికృత రూపధారి అచ్చట కరుదెంచెను గురు జనార్ధనుడు ఆ నూతన వ్యక్తి పాదములపైబడి ప్రణమిల్లెను ఏకనాధుడు ఆ వ్యక్తిని చూసి అసహ్యించుకుంటాడు జనార్ధనుని ఆశీర్వదించి ఆవ్యక్తి అదృశ్యమవుతాడు

గురు జనార్ధనుడు ఏకనాధుని సమీపించి వత్సా! ఏకనాధా! ఎంత అపచారము చేసితివి ఆ వచ్చిన వ్యక్తి ఎవరో కాదు ఆతడే అనసూయ పుత్రుడైన దత్తాత్రేయులవారు త్రిమూర్త్యాత్మక శక్తి స్వరూపము చేతికందిన అపూర్వ అవకాశమును జారవిడుచుకొంటివి అని తెలియచేయగానే ఏకనాధుడు దుఃఖవదనుడై విలపించసాగాడు. శిష్యుని పరితాపమును గాంచి హృదయము ద్రవించిన గురు జనార్ధనుడు ఏకనాధా! దిగులు చెందకు నీలోనున్న కొద్దిపాటి అజ్ఞానము కూడా ఈ సన్నివేశముతో పటాపంచలైనది వచ్చే గురువారమునాడు నీవు దత్తాత్రేయులవారి దర్శనమును పొందుటయేగాక వారి అనుగ్రహమునకు కూడా పాత్రుడవయ్యెదవు అని ఆశీర్వదించారు

మరుసటి గురువారము గురు జనార్దనుడు ఏకనాథుని వెంటనిడుకొని అరణ్యప్రయాణము సాగిస్తారు ఒక వృక్షఛాయలో ఆసీనులై ధ్యానము చేయుచుండగా మెరుపు మెరుస్తుంది ఒక దివ్య కాంతి వలయం గోచరిస్తుంది నేత్రాలు తెరుస్తారు దత్తాత్రేయులవారు ఒక ఫకీరు వేషముతో దర్శనమిస్తారు అతనిచుట్టూ నాలుగు కుక్కలుంటాయి ఆరు మేకలుంటాయి దత్తాత్రేయులవారు ఏకనాథుని దగ్గరగా పిలిచి అతని చేతికి ఒక ఖడ్గమునిచ్చి తనతో వున్న ఆరు మేకలను ఖండించమని చెబుతారు ఏకనాథస్వామి భగవదాజ్ఞను శిరసావహించి మేకలను ఖండిస్తారు వెంటనే అక్కడ గోచరిమగుచున్న దృశ్యమంతా అదృశ్యమైంది ఫకీరుస్థానే దత్తాత్రేయులవారు ప్రసన్నవదనంతో దర్శనమిస్తారు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల రూపములతో మూడు శిరస్సులు ఆరు చేతులతో దర్శనమిస్తారు శంఖ చక్ర గదా పద్మ త్రిశూలములతో అద్భుత దర్శనమిచ్చి అనుగ్రహిస్తారు ఫాలభాగమున విభూతి ధారణచేసి తులసిమాలను పుష్పహారములను కంఠమునందు ధరించి పాదుకలు పాదములయందు ధరించి కాను ధేనువు వెనుక నిలబడియుండగ దేదీప్యమానంగా దర్శనమిచ్చి అభయప్రదానం చేస్తారు

ఏకనాథస్వామి దత్తాత్రేయులవారికి సాష్టాంగ నమస్కారముచేసి తన కన్నీటితో స్వామి పాదాలకు అభిషేకం చేస్తారు దత్తాత్రేయులవారు ఏకనాథుని చేరబిలిచి "ఏకనాథా ! నీవు ఖండించిన మేకలు ఏమిటో తెలుసా ? అవియే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములనెడి అరిషడ్వర్గములు నీవు అరిషడ్వర్గములను అంతమొందించి అంతః కరణ శుద్ధిని పొందావు ఇక నీ శేషజీవితమును హరి సేవకు వినియోగింపుము. హరిగుణములను అభంగరూపముగ రచించి గానము చేయుచు తరింపుము వాల్మీకి విరచితమైన శ్రీమద్రామాయణ కావ్యము వేదవ్యాస ప్రణీతమైన శ్రీమద్భాగవత గ్రంథము సంస్కృత భాషలో యున్నవి సంస్కృతము తెలియనివారు అందులోని తత్త్వరహస్యములను జీర్ణించుకొనుటకు అవకాశము లేకయున్నది కనుక నీవు రామాయణ భాగవత కావ్యములను ప్రాకృ

తమైన మరాఠీ భాషయందు రచించుము అని అమృత సందేశమునిచ్చి అంతర్ధానమయ్యెను

పూర్ణహృదయముతో సంతృప్తచెందిన అంతఃకరణతో ఏకనాథ స్వామి గురుజనార్ధనుల ననుసరించి దౌలతాబాద్ చేరుతారు దత్తాత్రేయుని వారి దర్శనంతో పాదస్పర్శనంతో ఏకనాథస్వామిలో అవ్యక్తంగాయున్న ఆధ్యాత్మిక చైతన్యము బహిర్గతమైనది నిరంతరము భగవన్నామామృత పానచిత్తుడై కాలం గడిపేవాడు భగవద్గుణ శ్రవణ కీర్తనాదులలో మేను మరచి పరవశించి పోయేవాడు శరీరము పులకాంకితమై నేత్రాల వెంబడి బాష్పాలు రాలుచుండేవి ఏకనాథస్వామిలో పొడసూపే భావగర్భిత ఆధ్యాత్మిక సౌందర్యమును గురుజనార్ధనుడు తిలకించాడు శిష్యుని అసమానభక్తి పాటవమును గుర్తించాడు త్వరలోనే ఏకనాథుడు పరమ భాగవతుల కోవలో చేరనున్నాడని గ్రహించాడు అట్టి పరమ భాగవతుడైన ఏకనాథుని చేత సేవచేయించుకోవటం భావ్యం కాదని భావించాడు ఒకనాడు ఏకనాథుని పిలిచి వత్సా ఏకనాథ భగవంతుడు దయాస్వరూపుడు తనను విశ్వసించి అనుసరించే భక్తులను తానెప్పుడూ రక్షిస్తూనే యుంటాడు నీ భక్తి పరాకాష్ట నందుకున్నది పాండురంగని అనంత కృపాకటాక్షము నీపై వర్షిస్తున్నది నీవు ఈ జన్మలోనే తరిస్తావు ఏకనాథా భక్తుడవైన నీవు పరమ భక్తులు గతంలో నడచిన బాట ననుసరించి జీవించుటయే ధర్మమని నా అభిప్రాయము సతరతి సతారతి లోకాం స్తారయితి తాము తరిస్తూ భక్తులు లోకాన్ని తరింప చేస్తారని నారద భక్తిసూత్ర ప్రబోధము

భాగవతులందరు గృహస్థాశ్రమములోనే తరించారు గృహస్థాశ్రమమే నిరపాయమైనది మోక్షసామ్రాజ్యమును చేరుటకు సులభమైన మార్గము కనుక నీవు నా ఆజ్ఞానుసారము గృహస్థుడవై ఆదర్శజీవితమును గడిపి భక్తిమార్గమును చరించు భాగవతులు అనుకరింపదగిన రీతిలో మనుగడను సాగించి నీవు తరించి లోకాన్ని తరింపచేయుము అని గురు జనార్ధనులవారు తెలుపగా గురువుగారి ఆజ్ఞను ఏకనాథుడు శిరోధార్యంగా భావించి పైఠనపురము వచ్చి తల్లిదండ్రుల ఆదేశానుసారము సకల సద్గుణ

సత్సమ్పన్నురాలు ఆదర్శసుగుణశీలమైన గిరిజాబాయి అను కన్యను వివాహమాడెను

అతిథి అభ్యాగతుల నాదరిస్తూ న్యాయమార్గముతో జీవనమును కొనసాగిస్తూ ఏకనాథ దంపతులు జీవించసాగారు భగవదనుగ్రహంతో వారికి సంతానము కలిగినది కుమార్తెలకు గోదూబాయి గంగాబాయి అనియు కుమారునికి హరిపండితుడనియు నామధారణ చేశారు హరిపండితునితో బాల్యమునందే ప్రజ్ఞాపాటవములు విరబూసినవి సంస్కృతభాష నభ్యసించుటకు వేదవాఙ్మయమును అవోసించుటకు అనుకూలమైన లక్షణములు హరిపండితునిలో ఏకనాథస్వామికి గోచరించినవి హరిపండితుని సంస్కృత విద్యాభ్యాసమునకై కాశీనగరానికి పంపడము జరిగింది

ఏకనాథుని జీవన ప్రకాశము నలువైపుల వ్యాపించినది అతని శీల సౌరభము దశదిశల అలుముకున్నది ఏకనాథస్వామి పరమ భాగవతుడని జనులు వేనోళ్ళ కొనియాడసాగారు క్రోధ రాక్షసి కోరలు తీసిన కారుణ్యమూర్తి ఏకనాథస్వామి యని ప్రజలు ప్రశంసించసాగిరు

పైఠనపురములో ఒక పండితుడుండేవాడు అతడు ధనికుడననే గర్వముతో విర్రవీగుచుండేవాడు తాను తప్ప మరియొక భక్తుడుండకూడదని అభిప్రాయము పుస్తక పాండిత్యమేగాని మస్తక ప్రావీణ్యములేని అసంస్కారి ఏకనాథస్వామిని గూర్చి ప్రజలు చేయు ప్రశంసలు అతనికి కర్ణకఠోరములుగా వినిపించేవి ఎలాగైనా ఏకనాథస్వామిని పదుగురిలో చులకన చేయాలని దృఢసంకల్పముతో వ్యూహ నిర్మాణము చేయసాగాడు.

ఒకనాడొక బ్రాహ్మణుడు పండితునివద్దకు వస్తాడు తన కుమార్తెకు వివాహము చేయలేని స్థితిలో ఆర్థిక యిబ్బందులతో జీవిస్తున్నాననియు కనుక సహకరించి ఆర్థిక సహాయము చేయమని పండితుని కోరుతాడు ఏకనాథస్వామిపై తనకున్న పగను తీర్చుకొనేందుకు అనువైన అవకాశము దొరికిందని ధనికుడైన పండితుడు భావిస్తాడు విప్రునికి ధనసహాయము చేయుటకు తన సమ్మతిని తెలియజేస్తూ అయితే ఆ విప్రుడు ఏకనాథస్వామికి కోపం తెప్పించవలయునని ప్రకటిస్తాడు ధనప్రలోభానికి లోనైన

బ్రాహ్మణుడు పండితుని షరతును ఒప్పుకుంటాడు పేదవాడైన తానుతన కుమార్తెకు వివాహము చేయుటకు మంచి అవకాశము లభించినట్లు భావి స్తాడు

ఏకనాథస్వామి గోదావరీ పుణ్యతీర్థంలో స్నానమాచరించుట విప్రుడు చూస్తాడు స్వామి స్నానమాచరించి గట్టుమీదికి రాగానే విప్రుడు ఏకనాథుని సమీపించి స్వామిపై ఉమ్మివేస్తాడు గోదావరి పుణ్యతీర్థంలో స్నానమాచ రించి పవిత్రంగా ఆలయ ప్రవేశంచేసి భగవానుని దర్శించడానికి వెళ్తున్న ఏకనాథుని తన ఉమ్మిచే విప్రుడు అపవిత్రం చేయుటచేత ఏకనాథస్వామి పునఃస్నానమాచరించుటకు పుణ్యగోదావరిలో దిగారు రెండవసారి స్నాన మాచరించి గట్టుమీదికి వచ్చారు విప్రుడు మళ్ళీ నిస్సంకోచముగా ఏకనాథ స్వామిపై ఉమ్మి వేస్తాడు ఏకనాథుడు తన ముఖములో ఏమాత్రము విషా దముగాని విస్మయముగాని పొడసూపకనే వెళ్ళి గోదావరిలోదిగి మరల స్నానమాచరించి గట్టుమీదకు వచ్చాడు విప్రునికి ఆశ్చర్యంవేసింది తాను రెండు పర్యాయములు ఉమ్మివేసినను ఏ విధమైన కోపమును ప్రకటించకనే స్వామి వెళ్ళి స్నానమాచరించి వస్తున్నాడు ఏమి చేయాలో ఆ బ్రాహ్మ ణునికి అవగతం కాలేదు మళ్ళీ ప్రయత్నము చేసి చూద్దామని భావించి ఏమరైనను హానిచేసి ఎరుగని ఏకనాథస్వామిపై మూడవసారి ఉమ్మి వేసాడు స్వామి మూడవసారికూడా వెళ్ళి గోదావరి తీర్థంలో స్నానమాచ రించి గట్టు మీదికి చేరాడు

బ్రాహ్మణునిలో భ్రాంతిపొరలు తొలగిపోయాయి అజ్ఞానకూడ్యాలు ధ్వంసమయ్యాయి మాహాత్ముల అంతఃకరణశోభ మనస్సును కలవర పర చింది పశ్చాత్తాపంతో హృదయము కుమిలిపోయింది తాను చేసిన తప్పు తన అంతర్యాన్ని ముక్కలుచేస్తున్నది గుండెను అమాంతంగా పిండు తున్నది నేత్రాలవెంట కన్నీరు కారుచుండ చేతులుజోడించి ఏకనాథ స్వామికి నమస్కరిస్తూ మహాత్మా! నేను మూడుసార్లు మీపై ఉమ్మి వేశాను మీరు నన్ను ఒక్కమాటకూడా అనకుండా నిందారోపణ చేయ కుండా వెళ్ళిస్నానంచేసి వస్తున్నారు నిరపరాధులు నిర్మల చిత్తులైన

తమను ఘోరంగా బాధపెట్టాను స్వామీ! పాపాచరణకు పూనుకొనిన నాపై తమకు కోపము రాలేదా? అని బ్రాహ్మణుడు వినమ్రతతో ప్రశ్నించారు

ఏకనాథస్వామి చేతులు జోడించి విప్రునకు వందనమొనరించుచు నాయనా నీ ఋణము ఈ జన్మలో తీర్చుకోలేను నీవుచేసినంతటి ఉప కారము గతంలో నాకు మరెవ్వరు చేయలేదు పవిత్రగోదావరి పుణ్య తీర్థంలో మునక వేసినచో సర్వపాపములు ప్రక్షాళనమగునని బుధజన ప్రబో ధము అట్టి పరమ పవిత్ర గోదావరి పుణ్యజలంలో మూడుసార్లు మునకలేసి నను పుణ్యధామం చేరమని దానికనువుగా మూడు సోపానములను నిర్మిం చిన నీవు నా గురుదేవుడవు అని చెబుతాడు

ఏకనాథస్వామి పలుకులు వినిన విప్రుడు దుఃఖాన్ని ఆపుకోలేక పోయాడు నేత్రములవెంట ప్రవాహంలా అశ్రువులు రాలుతున్నాయి తనను క్షమించమని ప్రార్థిస్తూ ఏకనాథునితాను ఇవ్విధంగా అవమానపరచుటకు గల తెరవెనుక కథను వివరించి తన తప్పిదమును క్షమించమని స్వామి పాదాలపై పడ్డారు

ఏకనాథుడు విప్రుని పట్టిలేపి ఆలింగనం చేసుకొని నాయనా అయ్యో అంతటి ఇక్కట్లలో జీవిస్తున్నావా! నేను కోపపడినచో నీకు ధన సహాయము లభించుననెడి విషయమును ముందుగ నాకు తెలియజేసినచో తప్పక నీమీద కోపమును ప్రకటించెడివాడనుగదా అని తన అమాయక ధోరణిలో ప్రేమవర్షాన్ని బ్రాహ్మణునిపై కురిపిస్తాడు విప్రుడు సిగ్గుపడి చేసిన తప్పిదమునకు చింతిస్తూ తలవంచుకొని వెళ్ళిపోతాడు ఆహా! గగన విశాలమైన భక్తుని హృదయంలో క్రోధరాక్షసి తలదాచుకొను స్థలం కూడా లేకపోయింది కదా జై జై ఏకనాథ సమర్థ

తాను పంపిన విప్రుడు ఏకనాథుని జయించలేక ఓటమి నంగీకరించ వలసి వచ్చిందన్న వార్త పండితునికి తెలిసింది పండితుడు అంతు తెలి యని చింత ననుభవించ సాగాడు దానికితోడు జరిగిన ఈ సంఘటన ప్రజ లలో బాగా వ్యాపించింది ఏకనాథస్వామి యశోవైభవమును విస్తరింప

చేసింది సహజ స్పందనతో ఉవ్వెత్తునలేచే సాగర తరంగములను ఆప గల వారెవరు? సుగంధ భరితమైన పుష్పము వికసించిన తరువాత నలు వైపుల విరజిమ్మబడే దాని సౌరభ ప్రభావమును అరికట్టగల వారెవరు? భక్తుని అంతర్యశోభ వ్యక్తమై జనావళిని రంజింపచేయు సమయాన భక్తుల హృదయములనుండి పెల్లుబికి అభివ్యక్తమవుతున్న అనురాగ ప్రశంసావీచికలను నిశ్చేష్టత నొనర్చు వారెవరు? అది తెలిసినవాడు విజ్ఞానిగా మారుతాడు. తెలియనివాడు అజ్ఞానియై నిలుస్తాడు. అజ్ఞాని విహారానికి పరిధి నెవరేర్పరచగలరు? కనువిప్పు కలిగించు పై సంఘటన పండితుని మనోనేత్రమును శాశ్వతముగా మూసివేసింది. అసూయ కామెర్లతో ఆతడి మనోనేత్రం అనారోగ్యానికి గురియై అనాచార అపరిశుభ్ర జలాన్ని స్రవింపచేస్తున్నది. ఆతటిలోని అసూయాగ్ని చల్లారలేదు. ఎలాగైనను ఏకనాథస్వామిని కోపమునకు గురిచేయక తప్పదు. ఆ ఘనకార్యాన్ని ఈ సారి తన భుజస్కంధాలపైననే వేసుకున్నాడు.

ఒకనాటి మధ్యాహ్న భోజనవేళ పండితుడు బయలుదేరి ఏకనాథస్వామి గృహాని కరుదెంచాడు. భోజనానికి వెడలనున్న ఏకనాథుడు అతిథిని దర్శించాడు. సమీపించాడు. ఆహ్వానించాడు. భోజన సమయానికి విచ్చేసిన అతిథి నారాయణ స్వరూపమని భావించి ఆతిథ్యమును స్వీకరించమని ప్రార్థించాడు. అతిథికి స్నానం చేయించాడు. స్నానానంతరము ఇరువురు భోజనానికి ఆసీనులయ్యారు. ఏకనాథుని ధర్మపత్ని సుగుణశీలయైన భక్తురాలు గిరిజాబాయి వడ్డన చేస్తున్నది. ఏకనాథునికి కోపము తెప్పించి సమాజములో ఆతడిని బలహీనముచేయ సంకల్పించి అరుదెంచిన బ్రాహ్మణునికి ఒక ఆలోచన మెరపులా మదిలో కదిలింది. అంతే ఏకనాథస్వామికి వంగి వడ్డిస్తున్న గిరిజాబాయి వీపుపై రౌతు గుఱ్ఱము నధిరోహించు విధముగా ఎక్కి ఆసీనుడయ్యాడు. హృదయ విదారకమైన ఈ దృశ్యాన్ని ఏకనాథుడు చూశాడు. నిశ్చల చిత్తముతో కరుణాదృష్టిని బ్రాహ్మణునిపై సారించాడు. భార్యనుద్దేశించి గిరిజాబాయీ! అతి జాగ్రత్తగా నుండుము. నీపై ఆసీనుడైయున్న వ్యక్తి ఎవరో కాదు. అతిథియై అరుదెంచిన ఆదినారాయణుడు. నీవు లేచినచో ఆతడు పడిపోగలడు. అలాగే ఉండుము అని తెలియచేశాడు. ఆ

మాటలు వినగానే ఏకనాథుని సహధర్మచారిణియైన గిరిజాబాయి ప్రశాంత వదనంతో అమృతము లొలుకు పలుకులతో అదేమిటండీ! మీ మాటలు నాకు ఆశ్చర్యమును కల్గించుచున్నవి. చిన్నతనములో మన కుమారుడు ఎన్ని పర్యాయములు నాపై ఈ విధంగా అధిరోహించలేదు? నేను అతనిని ఎన్నడైనా పడవేసితినా అని జవాబిచ్చెను. ఆమె ప్రత్యుత్తరముతో బ్రాహ్మణ పండితుని మనస్సు కదిలిపోయింది. అంతే క్రిందికి దిగి ఆ పుణ్యదంపతుల పాదాలపైబడ్డాడు. పసిబిడ్డవలె భోరున విలపించసాగాడు. తనను క్షమించమని పదే పదే ప్రాధేయపడ సాగాడు. ఏకనాథస్వామి ఆ పండితుని ఆలింగన చేసుకున్నాడు. మృదువచనములతో ప్రేమామృతమును అతనిపై వర్షింపచేస్తూ నాయనా బాధపడకు. మనమంతా నిమిత్తమాత్రులము. ఇందులో నీ తప్పు ఇసుమంతైనను లేదు. నా భక్తిని పరీక్షించ వలయునని నా తండ్రి పాండురంగడే అలా సంకల్పించి ఉంటాడు. అది దేవుని హస్తాలలో మనమందరము కీలుబొమ్మలమే. దిగులు చెందకు. ఆయన అతడిని తృప్తపరుస్తాడు. ప్రత్యక్షానుభవంతో విప్రునిలో వినూత్న పరిణామము జనించింది. ఉత్తమ భక్తిమార్గంలో అతడు చరించసాగాడు. సంత్ పురుషుల కృపావీక్షణాలలో జరుగని దేముంటుంది?

పైఠనపుర గ్రామ ప్రజలందరు ఏకనాథస్వామిని భాగవత ప్రవచనము చేయుమని ప్రార్థిస్తూ బలవంతపెట్టసాగిరి. భక్తుల అభీష్టమును నెరవేర్చుటయే భక్తులను సంతృప్తిపరచుటయే భాగవత ధర్మములో ప్రథమముగ గుర్తించు ఏకనాథుడు పాండురంగస్వామి ఆలయములో భాగవతమును మరాఠీ భాషలో ప్రవచించసాగాడు. వేసవి మండుటెండలకు కాలిన భూమాతపై తొలకరి జల్లులు పడినట్లు ప్రాపంచిక విషయవాసనా వడగాడ్పులతో శుష్కించిన పైఠనపుర జనుల హృదయాలలో ఏకనాథ భాగవత ప్రవచన అమృత జల్లులు కురిసినవి. ఏకనాథస్వామి భాగవత ప్రవచన ప్రభావము భక్తజనుల హృదయాలలో చెదరని పవిత్ర ముద్రను వేసింది. జనం నిత్యము తండోపతండాలుగ రాసాగారు. కానీ తండ్రి ఈవిధముగ ప్రవచించుట ఏకనాథుని కుమారుడైన హరిపండితునికి నచ్చలేదు. పరమ పవిత్రమైన భాగవత గ్రంధ విషయములను సంస్కృత భాషలోనే తప్ప

ఇతర భాషలలో రచించకూడదని ప్రవచించకూడదని అతని ప్రగాఢ విశ్వా సము హరిపండితుడు కాశీనగరములో సంస్కృత విద్యాభ్యాసము చేసిన ప్రజ్ఞాశాలి సంస్కృతభాషా విజ్ఞానమును అకుంఠిత దీక్షతో అభ్యసించి అసమాన ప్రజ్ఞాధురంధరుడని పేరుబడినవాడు

హరిపండితుడు ఒకనాడు ఏకనాథుని సమీపించి నాన్నా! మీరు పరమ భాగవత కావ్యమును మరాఠీ భాషలో రచించి ప్రవచించుట మంచిది కాదు కర్మజ్ఞానములను విస్మరించి కేవలము భక్తియే ముక్తికి సోపాన మని మీరు ప్రవచించుట ధర్మవిరుద్ధముగ గోచరించుచున్నది మీరు ఇలా ప్రవచనము సాగించ నవసరము లేదు రేపటినుండి నేనే సంస్కృత భాగవతమును ప్రవచించెదను అని తెలియజేసెను భాగవతోత్తముడైన ఏకనాథస్వామి మహాప్రసాదముగ భావిస్తూ కుమారునే ప్రవచించమని చెప్పెను

హరిపండితుడు మరుసటిరోజు ఆలయ ప్రాంగణములో ప్రవచన కార్యక్రమము ప్రారంభించెను చీకటి పడిగానే సంతలోని జనను అదృశ్య మగునట్లు హరిపండితుని ప్రవచన కార్యక్రమము రెండవ రోజుకు రాగానే భక్తులు పలుచబడసాగిరి నాలుగు రోజులు గడువగనే సభామండప మంతయు ఖాళీయైపోయెను దీనికి కారణమేమిటో అర్థంగాని హరిపండి తుడు రహస్యముగ ఒక భక్తుని సమీపించి నేను చేయు ప్రవచన కార్య క్రమములో భక్తులు అదృశ్యమగుటకు కారణమేమి? అని ప్రశ్నించెను "హరిపండితా చెఱకు రసమునకు అలవాటు పడిన నోటికి గంజి నీరు రుచించనట్లు ప్రేమామృత వర్షధారను కురిపించు ఏకనాథుని భాగవత ప్రవ చనములు వినినవారికి నీవు చేయు భాగవతోపన్యాసములు రుచించునా? అని తెలిపెను

హరిపండితునికి అంతయు అయోమయంగా గోచరించసాగింది ఏక నాథస్వామినే మరల ప్రవచించమని కోరాడు ఏకనాథస్వామి మామూలుగ పూర్వమువలెనే పాండురంగస్వామి ఆలయములో ప్రవచనము ప్రారంభిం

చాడు నీరు నిండిన తామర కొలనులో పద్మములు వికసించినట్లు ఏకనాథుని ప్రవచనము ప్రారంభించగానే విశేషముగ జనులు అరుదెంచసాగిరి ఏకనాథుని అనుష్టానపూర్వక భాగవత జీవన విధానమును గాంచిన హరి పండితునికి కనువిప్పు కలిగెను

హరిపండితునిలో చోటుచేసుకొని యున్న పండితాహంకారము చాలా వరకు అడుగంటి పోయింది జన్మతః సంక్రమించిన కులవ్యవస్థ అతని మనస్సునుండి దూరం కాలేదు ఒకనాడు పేదరాలైన ఒక వృద్ధ స్త్రీ ఏకనాథస్వామి గృహానికరుదెంచింది స్వామి పాదాలకు నమస్కరించి కన్నీరు కార్చుతూ నిలుచున్నది ప్రేమస్వరూపుడైన ఏకనాథస్వామి అమ్మా! నీకు వచ్చిన ఆపద ఏమిటి? ఎందులకలా విలపించు చున్నావు? నీ బాధను నివారించు శక్తి ఈ దాసునకున్నచో తెలియజేయుము అని వినమ్రతతో అడిగారు ఆ ముదుసలి ఏకనాథునికి నమస్కరిస్తూ మహాత్మా! తమరు సర్వజ్ఞులు తమకు తెలియనిదేమున్నది? నేను కడు పేదరాలను నా జీవితములో నాకు ఒకే వాంఛ యుండేది నా సంపాదనతో వెయ్యిమంది బ్రాహ్మణులకు అన్నసంతర్పణ చేయవలెననెడి అభిలాష తీవ్రంగా యుండెది నిరుపేదనైన నాలో చిగురించిన ఈ ఆశ మనస్సులోనే అడుగంటి పోయింది ఎంతగ కూడబెట్టవలయునని ప్రయత్నించినను నా దారిద్ర్యము నన్ను అడుగు ముందుకు వెళ్ళనీయలేదు నా కోరిక ఇక నెరవేరు అవకాశములేదని బోధపడింది నా దురదృష్టానికి నేను దుఃఖించు చుండ ఒక సాధు మహాత్ముడు నన్ను ఓదార్చి ఒక్క భక్తునికి ఆతిథ్యమిచ్చి సంతృప్తిపరచినచో సహస్ర బ్రాహ్మణ అన్నసంతర్పణ చేసిన పుణ్యము లభించగలదనిచెప్పి అట్టి పరమ పుణ్యమూర్తులైన భక్తులు మీరేయని తెలియజేసిరి, నాలో రేగిన బాధానలము వారి చల్లటి వచన జల్లుచే శాంతించినది మహాత్మా! నన్ను కనికరించండి మా ఇంటి కరుదెంచి నేనొసంగు ఆతిథ్యమును స్వీకరించి నన్ను అనుగ్రహించి ఆశీర్వదించండి అని ప్రార్థించింది

ఏకనాథస్వామి మనస్సు ద్రవించింది స్వామి తన అంగీకారమును తెలియజేయు లోపలనే హరిపండితుడు చోటుచేసుకొని పిల్లెదు పరమ

భాగవతోత్తములైన ఏకనాథస్వామి మీ ఇంటికి అతిథ్యమునకు రావడము వీలుపడదు నీకు అంతగ అభిలాష యున్నచో ఆతిథ్యమునకవసరమగు సరుకులు మా ఇంటికి చేర్చినచో ఇక్కడే వంటచేసి స్వామికి వడ్డించడము జరుగుతుంది అని ఖచ్చితంగా చెప్పాడు.

హరిపండితుని వైఖరి చూసి వృద్ధురాలు భీతిచెందింది మరీ పట్టు పట్టినచో అందులకు కూడా అంగీకరించడేమో నన్నభయముతో సరేనని వెళ్ళి అతిథ్యము నొసంగుటకు కావలసిన సరుకులన్నియు తెచ్చి ఇచ్చి నది స్వామి భుజించిన తరువాత ఆ మహాత్ముడు భుజించిన విస్తరిలో మిగిలిన ప్రసాదమును భుజింపుటకు భోజనవేళకు వచ్చెదనని ఏకనాథ స్వామికి తెలిపి వెళ్ళిపోయింది

భోజన సమయానికి వృద్ధురాలు అరుదెంచినది ఏకనాథస్వామి ఇంటిలో భోజన మారగింపుచున్నారని తెలిసి ఇంటి బయట నిలుచుంది హరి పండితుడు వృద్ధస్త్రీని చూశాడు ఆమె రాకకు కారణాన్ని ప్రశ్నించాడు భాగవతోత్తములైన ఏకనాథస్వామి భుజించగా మిగిలిన ప్రసాదమును భుజించి ధన్యత నొందుటకు అరుదెంచితినని వృద్ధురాలు ప్రత్యుత్తర మొసంగినది హరిపండితుడు కలతచెందాడు ఆమె మాటలువిని అతడు తీవ్రంగా వ్యథ చెందాడు కోపోద్రిక్తుడై వీల్లేదు నీవు విస్తరిని ముట్టినచో ఏకనాథస్వామి మలిన పడగలరు కనుక స్వామి భుజించిన తరువాత ఆ విస్తరిని ముట్టు కొని వారి ఉచ్ఛిష్టమును ప్రసాదముగ స్వీకరింపుటకు నీకు అర్హతలేదు అని పలికి తానే స్వయముగ ఏకనాథస్వామి భుజించిన విస్తరిని ఎత్తిపార వేశాడు ఆహా! అద్భుతము! భక్తజనులయెడ భగవానుని కరుణ అపారము అనిర్వచనీయము ఒక విస్తరిని పారవేసి రాగానే అక్కడ మరి యొక విస్తరి గోచరించ సాగినది ఈ విధముగ పండితుడు వేయి విస్తళ్ళను తీయవలసి వచ్చింది ఆహా! ఏమి ఈ ఆశ్చర్యము భగవానుని అనంత కృపావాత్సల్యమునకు ఏకనాథుని నేత్రాలు చెమ్మగిల్లాయి హరి పండితునికో వినూత్న పరిణామం కలిగింది భాగవత సేవలోనే భగవద్విభూతులు నిండియున్నవని గ్రహించాడు ఏకనాథస్వామి పాదాలపై బడి విల పించాడు వృద్ధురాలిని క్షమించమని ప్రార్థించి ఆవిడ పాదాలకుకూడా నమ

స్ఫురించాడు సూర్యోదయము కలగాలేగాని అంధకార మదృశ్యము కావడ మెంత సేపు?

ఏకనాథస్వామి నిరంతరము జపధ్యానాదులతో భగవద్గుణ సంకీర్తన నాదులతో తన్మయత్వ జీవనముతో కాలము గడుపుచుండెను ఒకనాడు పాండురంగ భగవానుడు ఏకనాథస్వామికి స్వప్న దర్శనమిచ్చి ఏకనాథా వాల్మీకి విరచితమైన శ్రీమద్రామాయణ కావ్యమును సులభశైలిలో సంస్కృతము తెలియనివారు చక్కగా చదివి అర్థం చేసుకొనునట్లు మరాఠీభాషలో రచించుము అని తెలియజేసెను ఏకనాథస్వామి మేల్కాని దిగ్భ్రాంతి చెందెను తనకు రామాయణ కావ్యమును రచించు సామర్థ్యమున్నదాయని విస్మయమొంది చింతించసాగెను వెంటనే గురుదేవులైన జనార్దనుల తలంపు మదిలో మెదిలెను వెంటనే గురుదేవులను ప్రార్థించి హృదయములో పాండురంగని ప్రతిష్ఠించుకొని రామాయణ రచనను రమ్యముగా సాగించి పూర్తిచేసెను

రామాయణములో సుందరకాండమునందు సీతాదేవి నన్వేషించుటకు మహేంద్ర పర్వతము నుండి లంకాపురికి లంఘించిన సంఘటనను ఏకనాథస్వామి వ్రాయుచుండెను తన్మయత్వ భూమికలో సంచరించుచున్న ఏకనాథస్వామి మస్తిష్కమంతయు పవనకుమారుడు నిండియుండుటచే ఒక్కసారి హనుమంతునివలె తాను ఎగిరి ప్రక్కవారి ఇంటిలో పడెను ఆ ఇంటి యజమాని ఆంజనేయుని భక్తుడు అతడికి ఏకనాథస్వామియన్న గిట్టదు ఏకనాథుడు వారి ఇంటిలో పడగానే శబ్దము జనించగా ఇంటి యజమాని అరుదెంచి అక్కడ స్పృహతప్పపడియున్న ఏకనాథుని గాంచెను ఏకనాథస్వామిలో అతడికి స్వర్ణదేహముతో హనుమంతుడు గోచరించెను ఏకనాథస్వామి చేతిలోయున్న గంటమును తాళపత్రమును చూసెను అందులో వాయుతనయుండు మహేంద్రపర్వతమునుండి లంకకు లంఘించిన సంఘటన వివరణ జరుగుచుండెను అంతట ఆ ఇంటియజమాని సంభ్రమాశ్చర్యాలతో పులకాంకితుడై ఏకనాథస్వామికి ఉపచర్యలు చేసెను స్వామి స్మృతికి రాగానే ప్రక్క ఇంటి యజమాని ఏకనాథుని పాదాలపైబడి తనను క్షమించమని ప్రార్థించెను ఏకనాథస్వామి భగవత్కృపకు పాత్రుడైన

మహాత్ముడనియు పరమ భాగవతోత్తముడైన ఏకనాథుని ఆపార్థము చేసుకున్న తాను అజ్ఞానిననియు చింతించసాగెను మహాత్ములు నిందాస్తుతులకు అతీతులు వారిలో గోచరించు వైభవమును భగవత్ప్రసాదముగ భావించడము వారికి కలుగు ఇక్కట్లను భగవానుడు తమను సక్రమ మార్గములో నుంచుటకు చేయు ప్రయత్నములుగ స్వీకరించడము సహజమగు పరిపాటి

ఏకనాథస్వామి పరమ భాగవతమూర్తి అద్భుత భక్తి రసాయన దీప్త తనకు ప్రాణసమానమైన భాగవత గ్రంధమును మరాఠీ భాషలోకి అనువదించ ప్రయత్నించసాగెను తాను వ్రాసిన పత్రులను ఎప్పటికప్పుడు ఏకనాథస్వామి గుమిగూడిన భక్తసమూహమునకు వినిపించసాగెను ఒకనాడు పైఠనపురమునుండి ఏకనాథుని అనుయాయులలో ఒకడైన భక్తుడు కాశీనగరమునకు వెళ్ళెను అచట గంగానదీ తీరమున ఆసీనుడై ఏకనాథుడు అనువదించిన మరాఠీ భాగవతమును పారాయణము చేయుచుండెను ఒక పండితుడు అదివిని భాగవత గ్రంధమును మరాఠీభాషలో తెనిగించినదెవరని ప్రశ్నించగా ఏకనాథస్వామి రచించినాడని ఆభక్తుడు సమాధానమొసంగెను అదివినిన పడింతుడు కాశీనగరమందలి సంస్కృత విద్యాపీఠ ఒధిష్ఠాన పాలకులకు ఈ విషయమును ఫిర్యాదు చేసెను అది వినిన మఠాధిపతి కోపోద్రిక్త మనస్కుడై భాగవతమును ప్రాకృతమున రచించుట దోషమనియు అలా అనువాదములు కొనసాగినచో సంస్కృతభాషా పాటవము దెబ్బతినుననియు భావించి భాగవత గ్రంధమును మరాఠీ భాషయందు రచించిన ఏకనాథస్వామిని దోషిగా నిర్ణయించి అతడిని న్యాయస్థానమునకు తీసికొని రావలసునదిగా ఆజ్ఞాపించెను

మఠాధిపతి పంపిన ఇద్దరు ఉద్యోగులు కొన్ని దినములకు పైఠనపురము చేరి విషయమును ఏకనాథుని కెరింగించిరి ఏకనాథుడు మారుపలుకకుండా వారియాజ్ఞానుసారము తాను వ్రాసిన భాగవత ప్రతిని చేతపట్టుకొని కాశీ నగరము చేరెను అచ్చట గంగానది పవిత్ర పుణ్యతీర్థంలో స్నానమాచరించి మఠాధిపతి న్యాయవిచారణచేయు సభాస్థలికరుదెంచెను భాగవత

గ్రంధమును ప్రాకృతమున అనువదించిన ఏకనాధుడు పాపి అనియు అట్టి వాని ముఖము చూచుటకూడా పాపమని భావించి ఒకతెరను కట్టించి ఆ తెరవెనుక ఏనాధుడు నిలబడునట్లు ధర్మాధికారి ఆజ్ఞాపించెను ఎకనాధ స్వామి తెరవెనుక నిలబడియుండెను మారాధిపతికి తప్ప మిగతావారంద రికి ఏకనాధుడు కనిపించుచుండెను మరాధిపతి ఎకనాధస్వామి నుద్దేశించి తీర్పు చెబుతూ పరమ పవిత్రమైన భాగవత గ్రంథమును ప్రాకృతమున రచించుట మహాపాపము ఇది మొదటి తప్పుగా భావించి ఏకనాధుని క్షమించుచున్నాను అతడు అనువదించిన భాగవత ప్రతిని సకల జనులు వీక్షించుచుండ గంగానదిలో పారవేయుడు అని తీర్పుచెప్పెను

న్యాయస్థానమిచ్చిన తీర్పువిని ప్రజలందరు ఏకనాధస్వామి వైపు చూచిరి భక్తులగు వారికి ఏకనాధుడు శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహముగ గోచరించెను సామాన్యులకు వర్ణింపనలవిగాని దివ్యతేజముగా కనుపించెను అద్భుతముగ కన్పట్టు ఈ దృశ్యమును గాంచి పరవశులైన భక్త సమూహము ఏకనాధుడు మహాభాగవతోత్తముడని గ్రహించి ఆ మహాత్ముని దివ్యదర్శనమునుగాంచి తరించమని మరాధిపతిని కోరారు అధికారమదాంధుడైన ఆ మరాధిపతి ఎకనాధుని దర్శించుటకు నిరాకరించి తన యాజ్ఞానుసారము ఏకనాధస్వామి రచించిన భాగవత ప్రతిని గంగానదిలో పారవేయుమని మరల దృవపరచి సభాస్థలిని వదిలి గృహోన్ముఖుడయ్యెను

ఎకనాథస్వామి రాజపరివారము వెంట నడచుచుండ గంగాతీరము చేరెను స్వామి తన భాగవత గ్రంథమును నేత్రములకు అద్దుకొని అధికారుల చేతికొసంగెను వారు ఆ గ్రంథమును గంగానదిలో పారవైచిరి ఎకనాధస్వామి చేతులు జోడించి నమస్కరిస్తూ అమ్మా భాగీరథీ! నా అమాయకత్వంలో అర్హతలేని కార్యమును సాగించుటకు ప్రయత్నించాను అనర్హుడైన నేను రచించిన ఈ గ్రంధము పరమ పావనివైన నిన్ను కూడా కల్మష మొనర్చుతుందేమోనని భీతిచెందుచున్నాను" అని అశ్రుధారలు విడిచాడు సకల జనులు వీక్షించుచుండగనే నదినుండి గ్రంధములు పైకిలేచి పయనించి ఏకనాథుని సమీపించుచున్నవి గ్రంథములే కదలి వచ్చుచున్నట్లు అందరికి గోచరించుచుండగ గ్రంధములను చేతపట్టుకొని

నడచి వచ్చుచున్న గంగాదేవి ఏకనాథస్వామికి భక్తులకు గోచరించ సాగెను. గంగాదేవి ఏకనాథుని సమీపించి "ఏకనాథా! ఈ దినమెంతయో సుదినము 'నీవు రచించిన భాగవత గ్రంథము నాలో గ్రుంకులిడి నన్ను అమితానందముతో ముంచెత్తినది ఇదిగో నీ భాగవత గ్రంథరాజము ఈ అవనిలో సూర్యచంద్రాదులు ప్రకాశించునంతకాలము ఈ పవిత్ర గ్రంథము ముముక్షువులకు మార్గగామియై శోభిల్లు ననుటలో సందియములేదు అని ఆశీర్వదించుచు ఏకనాథస్వామి కిచ్చెను

గంగాదేవి ఏకనాథుని అనుగ్రహించి ఆశీర్వదించిన వార్త మరాధి పతికి తెలిసెను వెంటనే అతడు పరుగెత్తివచ్చి గంగాతీరమున భక్తజనుల మధ్య ఆసీనుడై హరినామ సంకీర్తన గానముచున్న ఏకనాథుని గాంచెను ప్రసన్న గంభీరమైన ఏకనాథుని దివ్యవర్చస్సును గాంచి న్యాయాధికారి ఉన్మత్తుడయ్యెను తన తప్పిదమును మన్నించి అనుగ్రహించమని ఏకనాథ స్వామి పాదాలపై బడెను ఏకనాథుడు న్యాయాధికారిని పట్టి లేవదీసి ఆలింగనం చేసుకొని మహాత్మా! క్షమించడానికి క్షమను కోరడానికి ఇందులో ఏమున్నది? ఈ దాసుడు రచించిన గ్రంథముయొక్క ప్రాశస్త్యమును వికసింప చేయుటకే తమరా శిక్ష విధించారు భగవంతునికి శరణాగతులై జీవించు భక్తులను భగవానుడు ఎన్నడు వృథాచేయడు ఆ వేద సత్యాన్ని పదుగురు గుర్తించుటకే తమరీ న్యాయనిర్ణయం చేశారు అని చేతులెత్తి మరాధిపతికి నమస్కరించుచు వినమ్రుడై ఏకనాథుడు తెలియ చేయగా న్యాయాధిపతి హృదయ స్పందనతో నేత్రాలవెంట బాష్పధారలు విడిచాడ

పరమ భాగవతుడైన ఏకనాథస్వామికి ఒకనాడొక సంకల్పము కలిగెను కాశీనుండి గంగోదకమును తీసుకొనిపోయి రామేశ్వరములో శ్రీరామలింగేశ్వరస్వామికి అభిషేక మొనర్పవలయునని అభిలాష అంకురించెను ఏకనాథుని సంకల్పమును చాలమంది భక్తులు బలపరచి వారు కూడా ఏకనాథునితో కలసి ప్రయాణము సాగించగలమని తెలిపిరి భక్తులను వెంటనిడుకొని హరిపండితునితో కలసి ఏకనాథస్వామిని కాశీ క్షేత్రమునకు బయలుదేరెను కాశీనగరముచేరి అచ్చట విశ్వనాథస్వామిని దర్శించి గంగోదకమును కావిళ్ళతో నింపుకొని రామేశ్వరమును చేరుటకు బయలు

చేరిరి మార్గమధ్యమున ఒక గార్ధభము దప్పి గొని కదలలేని అశక్తతతో పడియుండి నీటికై నాలుక వాచియుండెను ఆ దృశ్యమును చూడగనే ఎకనాథస్వామి మనస్సు కలవరపడెను వెంటనే హరిపండితుడు మోయుచున్న కావడిలోని నీటిని తీసుకొని ఆ గార్ధభమునకు త్రావించి వానికి స్నానము చేయించెను ఆ గాడిదలో ఎకనాథునికి పాండురంగడు దర్శనమిచ్చెను పలకాంక్షిడైన ఎకనాథస్వామి కన్నీరు గార్చుచు సాష్టాంగపడి గార్ధభమునకు నమస్కరించెను తండ్రి చేష్టలు హరిపండితునికి నచ్చలేదు "క్రియాద్వైతమ్ నకుర్యాత్ అను విషయమును హరిపండితుడు విశ్వసించేవాడు గాడిదకు తన తండ్రి నమస్కరించుట తనకు బాధ కలిగించింది అదియును తాను పవిత్రంగా మోసుకొని వచ్చిన కావిడి జలమును రామలింగేశ్వర స్వామి అభిషేకమునకు ఉపయోగపడకపోగా గాడిద స్నానమునకు ఉపయోగించెనని మిక్కిలి వ్యధ చెందెను ఆ రాత్రి ఒక గ్రామ పొలిమేరనోయున్న ఆలయములో అందరును బసచేసి నిద్రించుచుండిరి రామలింగేశ్వర స్వామి హరిపండితునికి స్వప్నదర్శనమిచ్చి హరిపండితా పరమ భాగవతుడైన నీ తండ్రి ఏకనాథుడు ఆచరించిన పవిత్ర కార్యము అంతఃకరణ శుద్ధిచేనని నీకు అవగతము కాలేదు నీలోని అసంపూర్ణ అవగాహనయే నీ ఆవేదనకు కారణము సకలచరాచర ప్రపంచమునకు ఆలంబనమై అధిష్ఠానమై భాసించు చైతన్యమును దర్శించు ఎకనాథస్వామికి అభేద దర్శనమే గాని భేదభావము పొడసూపుటకు ఆస్కారము లేదు చింతించకుము నీ కావడిలోని జలమును గార్ధభమునకు పోసి దాని ప్రాణము నిల్పుకతీర్చి నీతండ్రి నీకు అపార పుణ్యమును సంపాదించి పెట్టినాడు ఏ తండ్రియు తన బిడ్డకు ఇంతటి ఆస్తిని ఇచ్చియుండడు హరిపండితా నీ కావడిలోని జలమును ఎకనాథుడు గార్ధభమునకు పోయుటచే నూరు కావిళ్ళ గంగోదకముతో నాకు అభిషేకము చేయించిన ఫలమును నీవు పొందితివి" అని తెలిపెను

హరిపండితుడు మేలుకొనెను తన స్వప్న వృత్తాంతమును భక్తుల కెరిగించెను హృదయములో భక్త్యావేశము పొంగి పొరలుచుండ తన తండ్రి పాదాలపై పడి తన తప్పిదమును క్షమించమని కోరెను ఏకానాథుడు అమృత వచనములతో హరిపండితా భగవానుడు సర్వాంతర్యామి

ఆయనలేని చోటంటూ లేదు అందరిలో భగవంతుని దర్శించి పూజ్య భావ తో సకల ప్రాణులకు సేవచేయుటయే భాగవత దర్శనము భక్తుల కర్తవ్యము అహంకారమును అంతమొందించుకొని అవగాహనను పెంపొందించుకొని అంతఃకరణ శుద్ధిని పొంది ఆనంద జీవనమును గడుపుటయే ఆదర్శ జీవనము అని తెలిపెను

ఏకనాథస్వామి భక్తజనులతోగూడి రామేశ్వరయాత్ర ముగించుకొని పైఠనపురము చేరెను నిరంతర జపధ్యానాదులతో అతిథి అభ్యాగత సేవ నముతో ఆదర్శ జీవనము గడుపసాగెను ఏకనాథుని భక్తి ప్రపత్తులకు సంతసించిన ద్వారకాపతి ఏకనాథునికి సేవ చేయవలెనని నిర్ణయించుకొని ఒకనాడు పైఠనపురములో ఏకనాథస్వామి గృహమున కరుదెంచెను బ్రాహ్మణ వేషధారియై వచ్చిన ఆ నూతన వ్యక్తినిగాంచి నాయనా! ఎవరు నీవు? ఎచ్చటి నుండి వచ్చితివి? నీ రాకకు కారణంబేమి? అని ఏకనాథుడు ప్రశ్నించెను బ్రాహ్మణ రూపంలో వచ్చిన వాసుదేవుడు వినమ్రతతో చేతులు జోడించి నమస్కరిస్తూ అయ్యా నా పేరు శ్రీ ఖండ్యా మాది ద్వారకా నగరము నేను ఏకాకిని అందరు ఉండి ఎవ్వరూలేని అనాథుడను నేను మీకు సేవచేయుచు మీ గృహంబులోనే యుండెదను నా చేతనైన పని చేసెదను నాకేమీ అవసరములేదు అన్నవస్త్రములొసంగిన చాలును అని తెలిపెను భాగవతోత్తముడైన ఏకనాథస్వామి నాయనా! నీవు అంతగా ప్రాధేయపడ నవసరములేదు నా జీవితమే శ్యామసుందరుని పవిత్ర పాదపద్మములకు అంకితమై యున్నది నాదంటూ ఇచ్చట ఏమీ యును లేదు అంతయు వాసుదేవుని ప్రసాదమే ఇదంతయు రుక్మిణీ నాథుని అన్నదియే కనుక ఈ గృహమును వాడుకొనుటలో నా వస్తువులను ఉపయోగించుకొనుటలో భగవంతుని సంతానమున కంతటికి అధికారము గలదు నీవు నిశ్చింతగ యుండవచ్చును భగన్నామ స్మరణతో అతిథి అభ్యాగత సేవనముతో నీ బ్రతుకును ధన్యత నొనర్చుకొనుము అని పలికి శ్రీ ఖండ్యాను తన ఇంటిలో ఉంచుకొనెను

ఒకనాడు ఏకనాథస్వామి శ్రీఖండ్యాను పిలిచి నాయనా ! ఈ దినము మా తండ్రి యాబ్దికము బ్రాహ్మణ నిమంత్రణ చేసివచ్చితిని పితృ

శ్రాద్ధమున కనుకూలముగ అవసరమైన పిండివంటలతో సకల భోజన పదార్ధములను తయారు చేయుచుండవలెనని తెలియజేస్తాడు యజమాని ఆజ్ఞానుసారము శ్రీ ఖండ్వా షడ్రసోపేతముగ వంటలు తయారుచేయ సాగాడు శ్రీ ఖండ్వా తయారుచేయు వంటల పరిమళము చుట్టు ప్రక్కల వ్యాపించసాగింది ఏకనాధస్వామి పూదోటలో తోటమాలి వృత్తిచేయు అంత్యజులైన దంపతులు ఆ పరిమళము నాఘ్రాణించిరి నేడు మన యజమాని యింట ఎవ్వరి శ్రాద్ధమట ఆహా! ఏమి పరిమళము! కమ్మని పిండి వంటలు తయారగుచున్నవి వారు భుజించిన ఎదప పారవేసిన విస్తళ్ళలో మనకు అపూర్వమైన ఆహారము లభించగలదు అని భార్య భర్తతో చెప్పినది ఆ మాటలకు భర్తయైన అస్పృశ్యుడు ఓసీ పిచ్చిదానా నీ ఆశలు ఫలింపవు శ్రాద్ధకర్మ రోజున బ్రాహ్మణులు తాము భుజించిన తరువాత విస్తళ్ళను పాతిపెట్టుటయో నదిలో వేయుటయో చేయుదురేగాని మామూలుగా పారవేయరు కనుక నీ ఆశలన్నీ నీటిమూటచే అని దిగులుతో పలికెను అతని మాటలు ప్రక్కనే యుండిన ఏకనాధస్వామి వినడము జరిగింది ఆ నిరుపేద దంపతుల ఆక్రందన భాగవతోత్తముడైన ఏకనాధస్వామి హృదయమును కలచివైచినది వెంటనే భార్యవద్దకు వెళ్ళి మన పూదోటలో పనిచేయు అస్పృశ్యదంపతులు పిండివంటల నారగింపవలెనునని కుతూహలపడుచున్నారు తయారైన పిండివంటలు వారికి వడ్డింపుము అని తెలిపెను వెంటనే కరుణామయి అయిన ఏకనాధుని ధర్మపత్ని గిరిజాబాయి వెలుపలికివచ్చి అంత్యజులైన ఆ దంపతులను సమీపించి నాయనా! పిండి వంటలు అధికముగ యున్నవి మీతోపాటు మీవారందరిని తోడ్కొనిరండి వారికికూడా వడ్డించెదను అని తెలియచేయగా సంతృప్తిచెందిన ఆ దంపతులు మాలపల్లి కరుదెంచి తమ బంధుమిత్రాదులతో కలసి విందారగింపుట కరుదెంచిరి గిరిజాబాయి వారికి తృప్తికలుగునట్లు వడ్డించి సంతోషించెను భోజనము చేయుచున్న అంత్యజులలో ఏకనాధుడు శ్రీకృష్ణునిగాంచి పరవశుడయ్యెను సంతృప్తిచెందిన అంత్యజులు ఏకనాధస్వామిని స్తుతించుకుంటూ వెళ్ళిపోయిరి అంత్యజులకు ఏకనాధస్వామి అన్నసంతర్పణ చేసెనన్న వార్త బ్రాహ్మణ సంఘమునకు తెలిపెను బ్రాహ్మణపెద్ద ఏకనాధస్వామిని

పిలిపించి ఏకనాథా! అగ్రకులజులైన బ్రాహ్మణులకు అపకీర్తిని కలి గించుపని చేసితివి ఈశ్వర నైవేద్య నిమిత్తమై తయారైన వంటను ఖున కమునకు పెట్టినట్లు బ్రాహ్మణ నిమంత్రణ చేసిన నీవు బ్రాహ్మణులకన్నా ముందే పితృశ్రాద్ధ దినమున అంత్యజులకు అన్నసంతర్పణ చేసితివి నీవు చేసినది మహాపరాధము అందులకు పరిహారంగా నిన్ను వర్ణమునుండి వెలి వేయుచున్నాము అని తెలిపెను అందులకు ఏకనాథస్వామి చేతులు జోడించి నమస్కరిస్తూ అయ్యా క్షమించండి బ్రాహ్మణ అన్నసంతర్ప ణకై తయారుచేయుచున్న పిండివంటల పరిమళమును అస్పృశ్యదంపతుల ఆఘ్రాణించడము జరిగినది వారు ఆఘ్రాణము చేసిన తరువాత అవి తమకు వడ్డించుట సముచితము కాదనియు అదియునుగాక అవి వారికి వడ్డించి వారికి ఆకలిని అభీష్టమును నెరవేర్చి తమకు ప్రత్యేకముగా వంట చేయించవలెనని అభిలషించి అనుసరించుచున్నాను ఇందులో నా తప్పేదయినా యుండినచో క్షమించి పితృ శ్రాద్ధమును నిర్విఘ్నముగ కొన సాగునట్లు చేయవలసిందని ప్రార్థించెను ఏకనాథుని విన్నపమంతయు చెవిటివానికి సుశ్రావ్య సంగీతము వినిపించినట్లయ్యెను తీవ్ర మానసిక క్షోభలో ఏకనాథస్వామి గృహోన్ముఖుడయ్యెను జరిగిన విషయమును తన భార్యకు తన సేవకుడైన శ్రీ ఖండ్యాకు తెలియజేసెను అంతట శ్రీఖండ్యా ఏకనాథస్వామితో స్వామీ! మీరు చింతించవలదు పరమ భాగవతోత్తము లయిన తమరు నిర్వహించు అబ్దికముకో పాల్గొని నేను చేయు అద్భుత పక్వాన్నములను భుజించు అదృష్టము వారికిలేదు మీరు యధావిధిగ అబ్దిక మును కొనసాగించుడు సాక్షాత్తు పితృదేవతలేవచ్చి ఆరగించి వెళ్ళెదరు అని తెలిపెను శ్రీఖండ్యా సూచనమేరకు ఏకనాథస్వామి పితృశ్రాద్ధము నిర్వహించగనే పితృదేవతలు ప్రత్యక్షమై విందారగించిరి ఏకనాథుడు పర వశుడై ఆనందబాష్పములు రాల్చెను ఈ విషయము బ్రాహ్మణ సమాజ ములో మారుమ్రోగినది ఏకనాథస్వామి ఇంటికి పితృదేవత లరుదెంచి విందారగించి వెళ్ళిరని తెలియగానే వారిలో కలవరము బయలుదేరినది తాము చేసిన తప్పిదమునకు సిగ్గుపడిరి ఎలాగైనను ఏకనాథుని మళ్ళీ తమ సమాజములో కలుపుకొనవలయునని భావించిరి అలాచేయనిచో ఏమి అప

కారము జరుగునో అని సంశయించి భీతి చెందిరి వెంటనే ఏకనాధుని గృహంబున కరుదెంచి ఏకనాధా! నీవు పరమ భక్తుడవు కానీ బ్రాహ్మణ నిమంత్రణ చెప్పి అస్పృశ్యులకు అన్నసంతర్పణ చేసి దోషవైతివి చట్ట రీత్యా నిన్ను శిక్షించక తప్పలేదు అయినను భక్తుడవైన నీ విషయములో చట్టమును కొంత సవరించిన బాగుండునని పెద్దలు సూచించగా మేము నిర్ణయమును మార్చుకున్నాము నీవు చేసిన తప్పిదమునకుగాను నిన్ను శుద్ధి కర్మద్వారా సంస్కరించి మరల మాలో కలుపుకొనవలయునని నిర్ణయించి నాము అని బ్రాహ్మణపెద్ద తెలియజేసెను ఏకనాధస్వామి శిరమొగ్గి నమస్కరించి అయ్యా! తెలిసి నేను ఏ నేరము చేయలేదు పెద్దలైన మీరు ఏ శిక్ష విధించినను దానిని అమలుపరచుటకు నా సంసిద్ధతను వ్యక్తపరచు చున్నాను అని తెలియచేయగా బ్రాహ్మణులు శుద్ధి సంస్కారము చేయ నారంభించిరి ఇంతలో ఒక బ్రాహ్మణుడు దచటికేతెంచి అయ్యా ఇక్కడ ఏకనాధస్వామి ఎవరు? అని ప్రశ్నించెను బ్రాహ్మణ పురోహిత శ్రేష్ఠుడు కలుగచేసుకొని నీకు అతనితో ఏమి పని? అని ప్రశ్నించెను అంతట ఆ బ్రాహ్మణుడు అయ్యా నా దురదృష్టము మీకు గోచరమగుచునే యున్నదికదా! నేను బ్రాహ్మణుడను అయినను పురాకృతకర్మ ప్రభావముచే కుష్ఠురోగినైతిని ఈ మహా ఘోర వ్యాధినుండి విముక్తిని కాంక్షిస్తూ త్ర్యంబక క్షేత్రములో మహేశ్వరునిగూర్చి తపమాచరించితిని దీనదయాళు డైన గిరిజాపతి నన్ను కరుణించి దర్శన మొసంగినాడు నా కుష్ఠువ్యాధిని నిర్మూలించమని నేను ప్రాధేయపడగా పార్వతీరమణుడు నాయనా! పైఠన పురములో ఏకనాధుడను బ్రాహ్మణోత్తముడు కలడు అతడు పితృవిధి సమయమున బ్రాహ్మణ సంతర్పణకుముందే అంత్యజులకు అన్నసంతర్పణ చేసి విశేష పుణ్యము నార్జించినాడు అతడి పుణ్యములో శతాంశమైనను నీ కొసంగినచో నీవీ ఘోర వ్యాధినుండి బయటపడగలవు అని చెప్పి అంతర్ధానమయ్యెను నేను పరమ పుణ్యమూర్తియైన ఏకనాధస్వామి దర్శనము నకై బయలుదేరి వచ్చితిని అనితెలిపెను బ్రాహ్మణులకు ఇది ఒక చక్కని ప్రశ్నాపత్రమువలె వారికి గోచరించెను అతడె ఏకనాధుడని కుతూహలంగా

బ్రాహ్మణునికి చూపించిరి బ్రాహ్మణుడు ఏకనాథుని నమీపించి మహాత్మా ఈ నిర్భాగ్యుని కనికరించి అనుగ్రహించవలె ప్రార్థించగా ఏకనాథ స్వామి ఉదకమును తీసుకొని నేత్రములు మూసుకొని అంతర్యంలో భావన చేసి కుష్ఠురోగి దోసిలిలో ఉదకమును విడిచెను అంతే ఆ కుష్ఠురోగి సుందర శరీరధారియై కన్పట్టెను విప్రులందరు విస్మయమొందిరి తనవ్యాధి నయమగుటచే పరమ సంతోషభరితుడైన బ్రాహ్మణుడు ఏకనాథుని పాద ములపై పడి మహాత్మా! మీ ఋణమును ఈ జన్మలో తీర్చుకోలేను అని దుఃఖించెను కారుణ్యమూర్తియైన ఏకనాథస్వామి బ్రాహ్మణుని భుజముపట్టి లేపి నాయనా! నీ విషయములో నేనొక పనిముట్టును నిన్ను వ్యాధినుండి విముక్తి చేయవలెనని ఉమాకాంతుడు సంకల్పించి ఆ పనిని నా ద్వారా నెర వేర్చినాడు అంతయు మహేశ్వరుని కృపయే వెళ్ళుము సదా భగవన్నామ సంకీర్తనతో బ్రతుకును ధన్యత చేసుకొనుము అని తెలుపగా ఆ బ్రాహ్మ ణుడు పరిపూర్ణ హృదయుడై మరలిపోయెను ఏకనాథస్వామికి శుద్ధి సంస్కా రము చేయతలపెట్టి అరుదెంచిన బ్రాహ్మణోత్తములు తమ అంతఃకరణ లోని మాలిన్యము శుద్ధికాగా ఏకనాథస్వామికి నమస్కరించి మరలిపోయిరి

ఏకనాథస్వామి కీర్తి నలుదిక్కుల వ్యాపించినది ఏకనాథుడు మహా భక్తుడని భాగవతోత్తముడని ప్రజలు కొనియాడసాగిరి ప్రజలుచేయు స్తు తులకు ఏమాత్రము చలించక ఏకనాథుడు నిరాడంబర జీవితమును సాగించు చుకు ఇతరులకు ఆదర్శప్రాయుడని కీర్తిబడసెను ఇది ఇలావుండగా ఒక నాడు ఏకనాథస్వామి ఇంటికి ఒక బ్రాహ్మణుడు వచ్చెను వచ్చిన అతిథి నారాయణుడేనని భావించు ఏకనాథుడు ఆ బ్రాహ్మణునికి పరిచర్యలు చేసి గౌరవించెను బ్రాహ్మణుడు తనరాక వివరములను ఏకనాథస్వామికి వివ రించుచు అయ్యా! నేను ద్వారక క్షేత్రములో శ్రీకృష్ణ సందర్శన భాగ్య మును కాంక్షించుచు తపమొనరించితిని కొన్ని సంవత్సరములు తదేక దీక్షతో సాధన చేసితిని గడచిన ఏకాదశినాటి రాత్రి రుక్మిణీనాథుడు నాకు స్వప్న దర్శనమిచ్చి పైఠనపురములో ఏకనాథస్వామి ఇంట తాను శ్రీఖండ్యా అను నామముతో సేవకవృత్తి యందున్నాననియు వెళ్ళి దర్శించుమని ఆజ్ఞా

ఎంచడము జరిగినది మీలాంటి భాగవతోత్తముల దర్శన భాగ్యముతో నా జన్మచరితార్ధమైనది అని ఎకనాధుని పాదాలపైబడెను

బ్రాహ్మణుని మాటలు ఎకనాధస్వామికి అవగతము కాలేదు శ్రీఖండ్యా తనఇంట పండ్రెండు సంవత్సరములుగ సేవచేయుచున్నాడు శ్రీఖండ్యా భగవంతుడా? తన ఆరాధ్యదైవమైన వాసుదేవుడా? అని ఆలోచింపుచుండగనే శ్రీఖండ్యా కావిడితో నీళ్ళుతీసుకొని వచ్చుచుండెను బ్రాహ్మణుడు శ్రీఖండ్యాను దర్శించెను ఆబ్రాహ్మణునికి శ్రీఖండ్యాశంఖు చక్ర గదా పద్మములను ధరించిన చతుర్భుజమూర్తిలా దర్శనమొసంగెను బ్రాహ్మణుడు గగుర్పాటుచెంది భగవాన్ నన్ను కరుణించావా తండ్రీ అంటూ శ్రీఖండ్యా పాదములపై పడెను అంతే చూచుచుండగనే శ్రీఖండ్యా అదృశ్యమయ్యెను

ఎకనాధస్వామి దిగ్భ్రాంతి చెందెను హృదయములో కల్లోల తరంగాలు ప్రారంభమయ్యెను మనస్సు కలతచెందెను నేత్రములవెంట అశ్రుధారలు ప్రవాహామువలె కారుచున్నవి హే భక్తవత్సలా దీననాధా! దయాసాగరా! మేము నిన్నే నమ్మి బ్రతుకును సాగించాము నీకే శరణాగతులమై మా జీవన నావను నడుపుతున్నాము మమ్మల్నెందుకింత చిన్న చూపు చూశావు? మమ్మల్ని ఎందులకీ బాధలకు గురిచేశావు? పండ్రెండు సంవత్సరములు నీవు మా ఇంటిలో వుండినను నిన్ను గుర్తించలేక గ్రహించలేక జీవించేటట్లు మమ్మల్నెందుకు తయారు చేశావు? ప్రభూ! త్రిభువనపాలకుడవైన నీచేత ఇంటిపనులు చేయించానా? సుకుమారమైన నీ హస్తాలతో కావిడిమోయించానా? భగవాన్ నాపాపానికి పరిహారంలేదు కృష్ణా! నీవు తిన్నావా అని ఎనాడు అడుగలేదు నిత్యము మా భోజనమైన ఎదపే నీవు భుజించేవాడివి కరుణాసముద్రా ఎంగిలి విస్తళ్ళు ఎత్తేవాడివి ఇల్లు శుభ్రపరచేవాడివి చాలుచాలు ఈ ఘోరకృత్యాలు నెమరువేసుకుంటూ మననం చేస్తుకొంటూ మరణయాతన అనుభవింపుటకన్నా ఆత్మహత్యయే శ్రేయస్కరము అని పలికి భార్య ప్రార్ధింపుచున్నను వినకుండా గోదావరికి బయలుదేరెను

ఏకనాథస్వామి రెండడుగులు ముందుకు వేయగానే వెనుక నుండి ఎకనాథా అన్న మధుర స్వరంతో కమనీయకంఠం వినిపించెను ఎంనాడు వెనుదిరిగిచూడగా రుక్మిణీపతి మురళీమనోహరుడై దర్శన మొసంగెను ఎకనాథ దంపతులు స్వామి పవిత్ర పాదాలకు సాష్టాంగ నమస్కార మొనర్చిరి స్వామి ఎకనాథ దంపతులతో ఎకనాథా! నీవు నా అంతరంగిక భక్తుడవు నీవు అనవసరంగా ఆందోళన చెందుతున్నావు నా లీలలు దురవగాహములు అవి తేలికగా బోధపడవు నేను ఎది చేసినా అది లోకకళ్యాణము కొరకై ఉంటుంది అనవసరంగా వ్యథ చెందకు నీవు నా కృపకు పాత్రుడవయ్యావు నిన్ను త్వరలోనే ఈ జన్మలోనే ఉద్ధరించి నాలో ఐక్యము చేసుకొంటాను అని చెప్పి అంతర్ధానమయ్యెను

వాసుదేవుని అమృతవచనములు ఏకనాథునియందు అమర సందేశములై నిలిచినవి సంతృప్తిచెందిన అంతఃకరణతో ఎకనాథ దంపతులు సదా శ్రీకృష్ణ పద పంకజ సేవాతత్పరులై ప్రశాంత జీవనమును గడుపసాగిరి

ఒకనాడు జ్ఞానేశ్వరి గ్రంథికర్తయైన జ్ఞానేశ్వర మహారాజు ఎకనాథ స్వామికి స్వప్నదర్శనమిచ్చి ఆళందీ క్షేత్రములోయున్న తన సమాధి ప్రక్కన పెద్ద వృక్షముండుట వలన ఆ చెట్టువ్రేళ్ళు సమాధిని కదిలించి వేయుచున్నవనియు అందుచేత ఆ సమాధిలో యోగనిష్ఠలోనున్న తనకు భంగము కలుగుచున్నదనియు వెంటనే ఆ సమాధిని బాగుచేయు ఏర్పాట్లు గావించవలసిందనియు సెలవిచ్చెను మరునాటి ఉదయముననే ఏకనాథ స్వామి నిద్రనుండి లేవగానే భక్తులను రప్పించి వారికి తన స్వప్న వృత్తాంతమును ఎరింగించి తంబూర చిఱుతలు ధరించి హరినామ సంకీర్తన గావించుచు భక్తులు వెంటరాగా ఆళందీ క్షేత్రమునకు బయలుదేరెను ఆళందీ క్షేత్రము చేరిరి ఆ ప్రదేశమంతయు భయంకర అరణ్యమువలె గన్పట్టుచున్నది అందు జ్ఞానదేవులవారి సమాధి ఎచ్చట నున్నదో ఎకనాథుల వారికి తెలియలేదు వెంటనే ఏకనాథస్వామి ఒక వృక్షఛాయలో ధ్యానముచేయ నుపక్రమించెను జ్ఞానేశ్వర మహరాజ్ ఏకనాథస్వామికి అంతర్యములో దర్శన మొసంగి సమాధి ప్రదేశమును మనోనేత్రముతో

దర్శింపమనట్లు చేసెను వెంటనే ఏకనాధుడు ఆ ప్రదేశమునకు భక్తులను వెంటనిడుకొని పయనించి మండలము రోజులు అక్కడనే వుండి సమాధిని పునర్నిర్మాణము గావించెను

భక్తబృందముతో గూడి ఏకనాధస్వామి సమాధి ప్రదేశమును పునర్నిర్మాణము గావించుచుండ నిర్మాణమునకు కావలసిన ఇటుకలు సున్నము మొదలగు అవసర వస్తువులను ఒక వ్యాపారస్థుడు సరఫరా చేయుచుండెను అతడే ఆ ప్రాంతములో ఒక ఆహారశాల నేర్పరచి వీరికి అన్నపానాది సౌకర్యములుకూడా చూచుచుండెను డబ్బు ఇచ్చినచో అతడు తీసుకొనేవాడుకాడు పని పూర్తయిన పిదప ఒక్కసారి గ్రహింతునని తెలియజేసెడివాడు పని పూర్తయినది కానీ వ్యాపారి కనుపించలేదు దుకాణము కూడా అదృశ్యమైనది ఈ సంఘటనను భక్తులు అర్ధం చేసుకోలేక తికమకపడిరి అనాటి రాత్రి పాండురంగస్వామి ఏకనాధుని స్వప్నములో కనుపించి ఏకనాధా! నా అంతరంగిక భక్తులైన వారిలో అగ్రగణ్యుడైన జ్ఞానదేవుని సమాధిని బాగుచేసి నాకు అమితానంద మొనగూర్చితివి ఆ యానందమును పటలేక నేనూ మీ ప్రక్కనే యుండి నా మాయచే ఆహారశాలను ఏర్పరచి మీకు అన్నపానాది వసతులు స్వయముగా చూస్తూ కట్టడమునకు అవసరమగు ముడిసరుకును సరఫరాచేయుచు కాలము గడిపితిని ఏకనాధా నీవు నాలో శాశ్వతముగా నిలిచిపోయే క్షణము దగ్గరవుతున్నది ప్రశాంతచిత్తుడవై యుండుము అని చెప్పెను భగవానుని అనంత దయాస్వరూపమునకు అచ్చెరువందుచు భక్తులతోగూడి ఏకనాధస్వామి పైఠనపురము చేరిరి

ఏకనాథస్వామిలో తీవ్రపరిణామము గన్పించసాగెను సదా ఏకనాధుడు అంతర్ముఖుడై యుండసాగెను నేత్రములు ఎప్పుడు ఆకాశమువైపే దృష్టిని సారించియుండేవి ప్రశాంతవదనుడై గోచరించెడివాడు ఒకనాడు భక్తులు హరినామ సంకీర్తన చేయుచుండిరి ఏకనాధస్వామి తన సతీమణి గిరిజాబాయి కుమారుడైన హరిపండితునితో కలసి సంకీర్తన నాలకించుచుండెను సకల జనులు వీక్షించుచుండగనే విఠల! విఠల పాండురంగ అని పలికి ఏకనాథస్వామి నేలకొరిగెను భక్తులందరు గుమిగూడి ఏకనాధుని పలకరించిరి ఇంకెక్కడి ఏకనాధుడు! ఏకనాధుడు ఏకాంబరేశ్వరునిలో లీనమయ్యాడు

ఏకనాథస్వామి నిర్యాణ వార్త పైఠనపురమంతయు వ్యాపించినది భక్తులు తండోపతండాలుగ ఏకనాథస్వామి దర్శనానికి రాసాగిరి భక్తి శిఖామణియైన ఏకనాథుని పాదాలకు నమస్కరించి తమ అంతిమ భక్త్యంజలిని సమర్పించసాగిరి ఇంతలో ఒక దుష్టుడు ఇది ఏమి వైపరీత్యము భక్తికైనా ఒక హద్దంటూ వుండాలి శవానికి నమస్కరించడమేమిట ? ఏకనాథుడు అంతటి మహాత్ముడా? అయితే అతని మరణములో గొప్పతన మేమికన్పించినది? అతడు పదుగురివలె సామాన్యముగా మరణించాడు? అని అసందర్భ అప్రస్తుత అవివేక ప్రలాపము చేయసాగాడు

ఆహా!ఏమి ఆశ్చర్యము భక్తకోటికి అనిర్వచనీయానుభూతి భక్తులు చూచుచుండగనే శవరూపమునవున్న ఏకనాథుడు నిద్రనుండి లేచువానివలె లేచి కూర్చున్నాడు అందరు విస్మయముతో నిశ్చేష్టులయ్యారు ఏకనాథుడు ఏమి పలుకకుండా హరినామ సంకీర్తన చేయసాగాడు ఏకనాథు ననుసరించి భక్తులు పాడుతున్నారు చిఱుతలు తంబూర ధరించి ఏకనాథుడు హరినామ సంకీర్తన చేయుచూ వీధిగుండా నడువసాగెను భక్తులందరు పరవశించి గానమొనర్చుచు వెంటనడువసాగిరి ఏకనాథుడు గోదావరీ తీరమును సమీపించెను భక్తుల నాపవిత్ర తీరమున ఆసీనులకమ్మని సంజ్ఞ చేసెను ఆసీను లైన భక్తుల నుద్దేశించి పరమ భక్తులారా మీ సేవకుడైన ఏకనాథుడు విశ్రమించుటకు అనుమతినివ్వండి మీఅందరికి మరొక్కసారి సాష్టాంగ దండ ప్రణామము లాచరించుచున్నాను మీ ప్రేమకు ఏకనాథుడు సదా ఋణపడియుంటాడు పాండురంగడు ప్రేమమయుడు అమృతస్వరూపుడు విశ్వాసముతో భగవన్నామామృతమును పానం చేయండి ఏకనాథుని ఉద్ధరించినట్లే మిమ్ములను ఉద్ధరించగలడు అని చెప్పి గోదావరి పుణ్యతీర్థములో దిగి నడుములోతు నీటిలో నిలబడి మరొకసారి భక్తజనులకు నమస్కరించి వాసుదేవుని చైతన్యములో లీనమయ్యెను

నీటిలో తేలిన ఏకనాథస్వామి శరీరమును గట్టుపైనుంచి భక్తులు చుట్టుచేరి హరినామ సంకీర్తన చేయుచుండగ హరిపండితుడు తన తండ్రి కళేబరమునకు అగ్నిసంస్కారము చేసెను

భాగవత ధర్మమును ప్రచారముచేసి పరమ భాగవతోత్తముడై జీవించి భాగవతులకు ఆదర్శమై నిలచిన ఏకనాథస్వామి సదా స్మరణీయుడు సర్వసంపూజ్యుడు

* ఓం శ్రీ ద్వారకాపతయే నమః *



# భక్త కనకదాస్

"ఎవ్వరు లేనిచోట ఈ ఫలము నారగించి రావాలి" అంటూ శిష్యులను పిలిచి పండ్లు పంచిపెట్టాడు వ్యాసరాయలవారు.

శిష్యులందరు తమకు నచ్చిన ప్రదేశములకు వెళ్ళి ఎవ్వరు లేనిచోట గురువుగారిచ్చిన పండును భుజించి వస్తారు. ఒక శిష్యుడు మాత్రం ఆ పని పూర్తి చేయలేక తిరిగి తిరిగి పండునుచేతియందిడుకొని గురు సన్నిధిని చేరుతాడు.

"పండు తినకనే వచ్చినావేమి?" అని వ్యాసరాయలు ప్రశ్నించారు.

శిష్యుడు చేతులు జోడించి నమస్కరిస్తూ "గురుదేవా! నేను మహా పాపిని దుర్మార్గుడను గురుదేవుల ఆజ్ఞ పాలించలేని అసమర్ధుడను. తమరి ఆదేశము మేరకు ఎవ్వరు లేనిచోట ఎవ్వరికి తెలియకుండ ఫలమారగించాలని ఎంతగానో ప్రయత్నించాను. గురునాధా నేనెక్కడికివెళ్ళినా భగవంతుడు చూస్తూనేయున్నాడు" అని గురువుగారికి శిష్యుడు విన్నవించాడు.

శిష్యుని విన్నపమునకు గురువుగారైన వ్యాసరాయలవారు సంభ్రమాశ్చర్యములతో పులకాంకితుడయ్యాడు. తన నిర్మల ఆధ్యాత్మిక భావపరంపర

లతో గురుదేవులను విస్మయమొందించిన వ్యక్తి ఎవరో కాదు ఆలాడే భక్త కనకదాసు

విజయనగర సామ్రాజ్యమును శ్రీకృష్ణదేవరాయలు పరిపాలించు రోజులలో యాదవకులమునకు చెందిన వీరప్పనాయకునతడు సేనానాయకుడుగ వుండేవాడు అతని భార్య బచ్చమ్మగారు వీరిరువురు తిరుమలేశుని భక్తులై ఆదర్శ గృహస్థ జీవనమును గడిపెడివారు చిరకాలముగ వారికి సంతానము లేకపోవుటచేత వారి ఇష్టదైవమైన తిరుమలసుందరుని సేవించి సంతానము ననుగ్రహించవలసిందిగ ప్రార్థిస్తారు వారి భక్తికి తృప్తిచెంది బాలాజీ వారికొక పుత్రుని ప్రసాదిస్తాడు భగవత్ప్రసాదితమైన ఆ శిశువుకు తిమ్మప్ప అని నామకరణము చేస్తారు

తిమ్మప్పకు చదువు సంధ్యలయందు మనస్సు లగ్నంకాలేదు విద్య వచ్చే అవకాశములేనందున తండ్రి వీరప్ప తన కుమారునికి వ్యాయామము విలువిద్యలయందు నేర్పరిగ తీర్చిదిద్దినాడు తిమ్మప్ప శైశవదశలోనే తల్లిదండ్రులను పోగొట్టుకొని దిక్కులేని వాడవుతాడు తన ఇరువదవఏట వివాహము చేసుకుంటాడు కానీ అనతికాలంలోనే భార్యావియోగము ననుభవించవలసి వస్తుంది

తిమ్మప్ప ఈ విశాల ప్రపంచంలో ఏకాకిగా మిగిలిపోయాడు జీవితమే ప్రశ్నార్థకముగ మిగిలింది ఏమి చేయాలో అర్థముకాలేదు ఒకనాడు ఆదికేశవస్వామి స్వప్నంలో దర్శనమిచ్చాడు తన భక్తుడుకమ్మని ఆజ్ఞాపించాడు భగవదాజ్ఞను తిమ్మప్ప నిరాకరించాడు జీవితాకాశములో భోగ భాగ్యాలనే రెక్కలతో విహరించాలనే తిమ్మప్పకు భక్తి జ్ఞానమను పదములు చిరాకును కల్గించసాగాయి అనేకసార్లు ఆదికేశవస్వామి స్వప్న దర్శనమిచ్చి భక్తుడవుకమ్మని తిమ్మప్పను హెచ్చరించడము తిమ్మప్ప నిరాకరించడము జరుగుతూ వచ్చింది

ఒకసారి శత్రురాజులు తమ దేశముమీదికి దండెత్తిరాగా తిమ్మప్ప యుద్ధమునకు వెళ్ళవలసివచ్చింది తిమ్మప్ప ధైర్యసాహసములతో మెరుపువలె విజృంభించి శత్రుసైన్యమును చెదరగొడుతాడు వెనుకనే ఒక శత్రు

సైనికుడు వచ్చి తిమ్మప్పపై కత్తి విసురుతాడు వీపుకో ఆ కత్తి గుచ్చు కొనగా తిమ్మప్ప మూర్ఛిల్లుతాడు కొద్దిసేపటికి తిమ్మప్ప స్మృతికి వస్తాడు గాయము తీవ్రబాధను కలిగించుచున్నది కదలనశక్తుడై యున్నాడు ఇంతలో ఆదికేశవస్వామి యుద్ధముకో తిమ్మప్పకు దర్శనమిచ్చాడు స్వామి చిరునవ్వును చిందిస్తూ తిమ్మప్పా! గాయము తీవ్రముగా బాధించుచున్నదా? ఆలోచించు ఇప్పటికి మించిపోయినదేమీ లేదు నాకు భక్తుడివి కా అన్నా కత్తిపోటుతో బాధపడుతు మనోవికంత చెందిన తిమ్మప్ప ఆగ్ర హోదగ్రుడై నన్నెందుకిలా బాధిస్తావు? నేను నీకు భక్తుడను కాలేను నాకు భక్తి నచ్చదు ముక్తిగిట్టదు నన్ను అనవసరంగా విసిగించకు నిన్ను దర్శించాలని నీకొరకు పరితపించే భక్తులు ఈ ప్రపంచములో ఎందరో ఉండగా నన్నే ఎందుకిలా వెంబడిస్తావు? అన్నాడు

తిమ్మప్పా! నీవు గతంలో నా భక్తుడవు చిత్తశుద్ధితో నాకు సేవ చేసి నన్ను స్మరించిన భాగవతోత్తముడవు కర్మవశాత్తు ఇంతవరకు నీవు నన్ను ఆశ్రయించలేకపోయితివి నీవు నన్ను సేవించు శుభఘడియ సమీ పిస్తున్నది నిర్మలమనస్కుడవై నన్ను సేవించు నీ బాధలన్నీ తొలగించి నీకు ముక్తిని ప్రసాదిస్తాను అని ఆదికేశవస్వామి తన దివ్య సందేశాన్ని అందిస్తారు

తిమ్మప్ప తదేకంగా స్వామిపై దృష్టిని సారించి నీవు నన్ను బంధ విముక్తుణ్ణి చేయుమాట వాస్తవమైనచో ప్రస్తుతము నన్ను బాధించుచున్న శారీరక బాధనుండి విముక్తిచేయండి అలా జరిగినచో నిన్ను నేను విశ్వ సించి నీకు భక్తుడను కాగలను అని చెప్పగా దీనదయాళుడు భక్తవత్స లుడైన ఆదికేశవస్వామి తన దివ్యహస్తస్పర్శతో తిమ్మప్పను శారీరక బాధనుండి విముక్తుణ్ణి చేస్తాడు భగవానుని దివ్యకరముల స్పర్శతో తిమ్మప్పలో నిద్రాణమైయున్న ఆధ్యాత్మిక చైతన్యము ప్రభావితమై భక్తి పారవశ్యము పొడచూపుతుంది ఆదికేశవస్వామి నవ్వుతూ అదృశ్యు మవుతారు.

తిమ్మప్పలో తీవ్రపరిణామము కదిలింది. ఒక్కక్షణము కూడా భగవంతుని చూడకుండా స్మరించకుండా మనలేకపోతున్నాడు నేత్రములు

వెంట అశ్రుధారలు ప్రవహించుచున్నవి పరుగు పరుగున ఆదికేశవస్వామి ఆలయానికి చేరుతాడు దేవాలయ ద్వారము మూసియుంటుంది స్వామి వియోగాన్ని భరించలేని తిమ్మప్ప పసిబిడ్డవలె విలపిస్తూ క్రిందపడి దొర్లుతాడు తన హృదయ కవాటమును తెరచి జ్ఞానజ్యోతిని వెలిగించిన కేశవస్వామి గుడి తలుపులు తీయలేడా? అని భావించి దుఃఖిస్తాడు తన హృదయపు లోతులనుండి పొంగివచ్చే విషాదానికి పదములు జోడించి సుశ్రావ్యంగా కీర్తన గానము చేయసాగాడు

బాగిలను తెరెదు సేవెయను కొడు హరియే
కూగిదరూ ధ్వని కేళలిల్లవె నరహరియె॥
పాముపద దొళగె విషధరణ తల్పదలి
సిరిసహిత క్షీర వారిధి యొళిగలు
కరిరాజ కష్టదలి ఆదిమూలా యెందు
కరెయ లక్షణ బందు ఒదగిదేయో, నరహరియె ॥బాగిలు॥
కడు కోపదిం ఖళను ఖత్గవను తెగెదు
నిన్నొడెయ నెల్లిహనెందు కంభవను జడియె
దృఢ భక్తియలి శిశువు బిడదె నిన్నను భజిసె
ముద్దు ఘడిసె కంభ దిందొగెదె నరసింహా ।బాగిలు॥

"హే భగవాన్! నా మొర ఆలకించవా! తలుపు తెరచి నాకు దర్శన మొసంగవా?
క్షీరసాగరమున శేషశయనుడవై యుండి శ్రీదేవి నీ దివ్యపాదము లొత్తుచుండు సమయాన మొసలి బారినుండి రక్షించమని గజేంద్రుడు ప్రార్థించగా గజరాజు మొరవిని బ్రోచిగాచితివిగదా? రాక్షస రాజైన హిరణ్యకశిపుడు భక్తుడైన ప్రహ్లాదుని హింసించి స్తంభమునందు శ్రీహరిని చూపమని ఆజ్ఞాపించగా భక్తుడైన ప్రహ్లాదుని రక్షింపుటకు నరసింహ దేవుడవై స్తంభమునుండి ఆవిర్భవించితివి కదా? నామొర ఎందుల కాలకించవు? నాకు దర్శన మీయకుండుటకు కారణమేమి? అని కీర్తన చేశాడు

స్వామి వియోగాన్ని భరించలేని తిమ్మప్ప పసిబిడ్డవలె విలపిస్తూ తన శిరస్సుతో గుడి తలుపులను బాదుతాడు. శిరస్సునుండి రక్తము స్రవిస్తుంది అయినను తాను తల బాదుకొనుట ఆపడు సాహసోపేతమైన తన భక్తుని భక్తికి మెచ్చి ఆదికేశవస్వామి తిమ్మప్పను అనుగ్రహిస్తాడు గుడి తలుపులు తెరచుకుంటాయి గుడిగంటలు మోగుతాయి ధూపదీపనైవేద్యాల మధ్య మందహాసవదనుడై భక్తాధీనుడైన ఆదికేశవస్వామి దర్శనమిస్తారు

భగవానుని దివ్యమయ దర్శనముతో పులకాంకితుడైన తిమ్మప్ప కరద్వయమును జోడించి నమస్కరిస్తూ తన హృదయావేశములో పొరలి వచ్చుచున్న భక్తి భావలను సుశ్రావ్యంగ కీర్తనద్వారా తెలియజేస్తారు

ఈశ నిన్న చరణ భజనె ఆశేయింద మాడువేన
దోష రాశి నాశగయ్యో (శ్రీ)శకేశవ ॥ఈశ॥

శరణు హొక్కేనయ్య యెన్న, మరణ సమయదల్లి నిన్న
చరణ స్మరణే కరుణి సయ్య నారాయణా ॥ఈశ॥

యేసు జన్మ బందరేనో దాసనల్ల దేనో నాను
ఘాసి మాడ దిరోయేన్న వాసుదేవనే ॥ఈశ॥

ఓ జగదీశ్వరా! నీవైభవాన్ని నా మనసారా కీర్తించనీ ఓ ప్రభూ!
ఆదికేశవా నా లోపాలన్నీ సమూలంగ నాశన మొనర్చుము
ఓ భగవాన్! నేను నీకు సంపూర్ణ శరణాగతుడనయ్యాను నా మరణ
సమయమందు నీ దివ్యరూపమును చూపించి నీ నామస్మరణతో
నిష్క్రమించునట్లు దయతో అనుగ్రహించుము
వాసుదేవా! నీ దివ్యనామ స్మరణ చేయుటకై నాకు అనేక జన్మలు
ప్రసాదించుము" అని కన్నీరు ప్రవాహంలాకారుచుండ నిర్మల చిత్తముతో స్వామిని ప్రార్థిస్తాడు హృదయంలో భక్తి తన్మయతలు తొణికిసలాడుచుండ తిమ్మప్ప జీవితములో వినూత్న పరిణామము కలిగింది కేశవ భక్తుడైన తిమ్మప్ప బంగారు బుద్ధి కలిగి కనక దాసుగ మారిపోయాడు

నాటి తిమ్మప్పకు నేటి కనకదాసుకు పోలికేలేదు భోగభాగ్యాలందు మనస్సును లగ్నంచేసి ఐహికవాంఛాపరుడైన యున్నాడు తిమ్మప్పపేరుతో నిరంతరము భగవన్నామ స్మరణతో పరవశుడై త్యాగమయ జీవనంతో భగవద్దర్శనా కాంక్షితుడైన కనకదాసు వేరు చీకటి వెలుగులు సుఖ దుఃఖాలు మానావమానాలు శీతోష్ణాలు కనకదాసుని దృష్టిలో ఏకమయ్యాయి నిద్రాహారాదులుమాని భగవంతుని దివ్య సందర్శనాభిలాషుడై కనకదాసు విలపించసాగాడు

ఒకనాడు కనకదాసుకు స్వప్నములో కేశవస్వామి దర్శనమిచ్చి హంపి నగరవాసులైన వ్యాసరాయ గురుదేవుల నాశ్రయించి మంత్రదీక్షను పొందవలసినదిగ తెలియజేస్తారు కనకదాసు హంపి నగరముచేరి వ్యాసరాయలవారిని దర్శించి తనను శిష్యుడుగ స్వీకరించి మంత్రదీక్ష నొసంగమని ప్రార్థిస్తాడు శూద్రకులజుడైన కనకదాసుకు మంత్రదీక్ష నొసంగుట వ్యాసరాయల వారికి ఇష్టములేదు తీవ్ర వైరాగ్యజనిత ఆవేశముతో ఉరకలిడే కనకదాసుని మనస్సు మంత్రదీక్షకై ఆరాటపడ సాగింది ప్రార్థనాపూర్వకముగా గురువును అనేకసార్లు ప్రాధేయపడసాగాడు వ్యాసరాయల వారికి విసుగు జనించింది కోపోద్రిక్తుడైన వ్యాసరాయలవారు "దున్నపోతు నామమును జపించు నీకు ఆ మంత్రము బాగా సరిపోతుంది" అని చెబుతారు గురుదేవుని నోట ఆ మాట రాగానే కనకదాసు విశ్వాసపూరిత హృదయముతో దూరంగా వెళ్ళి ఒక నిర్జన ప్రదేశములో దున్నపోతు" నామమును ఉచ్చరించసాగాడు తపస్సు తీవ్రరూపం దాల్చింది భక్తి విశ్వాసములు చరమస్థాయి నందుకున్నాయి తన వాహనమైన దున్నపోతుపై కఠోర సాధన సాగిస్తున్నందుకు యమధర్మరాజు సంతృప్తిచెంది దున్నపోతురూపములో కనకదాసుకు ప్రత్యక్షమవుతాడు కనకదాసు శిరము వంచి నమస్కరిస్తాడు తన వలన ఏమి సహాయము కావలయునో తెలియజేయమని దున్నపోతు రూపములోయున్న యమధర్మరాజు అడుగుతారు తనకేమీ అవసరములేదనియు తన గురుదేవుల అవసరాలేవైనా ఉంటే తీర్చవలసిందని ప్రార్థించి దున్నపోతును వెంటబెట్టుకొని వ్యాసరాయల వారి యొద్దకు కనకదాసు వస్తాడు జరిగిన వృత్తాంతమంతయు నాలకించి

వ్యాసరాయలవారు విస్మయమొందుతారు వ్యాసరాయలవారికి వెంటనే ఒక సంకల్పముదయిస్తుంది తాను త్రవ్విస్తున్న కాలువకు అడ్డముగ ఒక పెద్ద బండ పడి తొలగింప నశక్యమవుతున్నది ఆ బండను తొలగించవలసిం దని దున్నపోతును కోరగా దున్నపోతు ఆ బండను తొలగించి అదృశ్య మవుతుంది నీరు ప్రవహించుటకు అనుకూలముగ దున్నపోతు బండను తొలగించిన ఆ తూమును "కనకతూము" అని పిలుస్తారు చిత్తూరు జిల్లా లోని మదనపల్లి గ్రామమునకు సమీపములో ఈ తూము యున్నది వ్యాస రాయలవారు ఈ సంఘటనను ఆధారముగ గ్రహించి కనకదాసు భక్తి శ్రద్ధలను అవగతము చేసుకొని ఆతడిని తన శిష్యునిగ స్వీకరించి ఆశీర్వ దిస్తారు గురుదేవుని ప్రజా ప్రబోధాలతో ప్రభావితుడైన కనకదాసు నిరం తర తపోధ్యానాదు లాచరించి ఆంతరంగిక ఆధ్యాత్మిక శోభతో విరాజిల్లు తుంటారు

ఒకనాడు వ్యాసరాయ గురుదేవులు తమపూజామందిరములో ఆసీ నులై నేత్రములు మూసుకొని అంతర్యములో మానసిక పూజ చేస్తుం టారు తన ఇష్టదైవానికి అర్చన అభిషేకాదులు మానసికముగా నిర్వహి స్తుంటారు స్వామిని పుష్పమాలాలంకృతుణ్ణి చేయు సందర్భములోగానే వ్యాసరాయలవారు కొన్ని క్షణాలు ఆగిపోతారు కిరీటమును తీసి స్వామికి పూలహారము వేయవలెనా? కిరీటమును అలాగేవుంచి వేయవలెనా? అనే సంశయముతో సతమతమవుతుంటారు అదే సమయానికి పూజాద్రవ్య ములు తీసికొని కనకదాసు వస్తాడు గురుదేవుల మనస్సులో జరిగే సంఘ ర్షణను గ్రహిస్తాడు గురుదేవా కిరీటము పెద్దదిగా యున్నది పూల హారము చిన్నదిగా యున్నది కనుక తమరు ఆ పుష్పహారమును స్వామి పాదాలవద్ద ఉంచండి సరిపోతుంది అని తెలియజేస్తాడు కనకదాసు మహా మాన్వితుడయ్యాడని వ్యాసరాయలవారు గుర్తించి సంతృప్తి చెందుతారు

పవిత్ర తీర్థక్షేత్ర సందర్శనము చేయవలెననెడి కుతూహలము కనక దాసు మనస్సులో జనిస్తుంది గురుదేవుల అనుమతిపొంది తీర్థయాత్రలకు బయలుదేరుతాడు పుణ్యనదులలో స్నానమాచరిస్తాడు పవిత్ర పుణ్యక్షేత్ర

ములను దర్శిస్తూ తిరుమలేశుని దర్శనానికి తిరుపతి వస్తుంటాడు తమ భక్తుడైన బీరప్ప బచ్చమ్మల ముద్దుబిడ్డడు నిరంతర గోవిందనామ స్మరణా మృత పానచిత్తుడు భక్త శిఖామణియైన కనకదాసుడు తన దర్శనముకు అందె మమన్నాడని గ్రహించిన శ్రీనివాసుడు దేవాలయ మహంతుకు స్వప్నంలో దర్శనమిచ్చి కనకదాసును సగౌరవముగ సత్కరించవలెనందని చెబుతాడు కనకదాసు మరునాడు తిరుమలేశుని దర్శనానికి వస్తాడు ఏ ఆడంబరములేక సర్వసామాన్యునివలె గోచరించే కనకదాసును గుర్తించ డము మహంతుకు సాధ్యంకాదు స్వామి దర్శనానికై ఆలయ ముఖద్వారం వద్ద కనకదాసు రోజంతా నిరీక్షిస్తాడు దర్శనము మాత్రం కాలేదు

బాలాజీ దర్శన భాగ్యానికి నోచుకోని తన దురదృష్టానికి చింతిస్తూ రాత్రంతా దేవాలయము ముందే పండుకొని దుఃఖిస్తాడు ఆసమయములో స్వామి ఆభరణాలు ఆనాడే అదృశ్యమవుతాయి ఒంటరిగ రాత్రంతా దేవా లయ ప్రాంగణములో సంచరిస్తూ కనుపించిన కనకదాసే చోరుడని నిర్ణ యిస్తారు కనకదాసును బంధించి న్యాయాధిపతికి అప్పగిస్తారు కనకదాసును త్రాటితో స్తంభానికి కట్టవేసి కొరడాతో తీవ్రముగా కొడుతారు కర్కశ మైన కొరడాదెబ్బలను భరించలేక కనకదాసు మూర్ఛిల్లుతాడు దీనదయాళు డైన వెంకటరమణుడు మహంతుకు స్వప్నంలో దర్శనమిచ్చి జరిగిన వృత్తాంతమంతయు తెలియజేస్తాడు తాను సన్మానించమనిన కనకదాసును అవమానపరచినందుకు మహంతుపై ఆవేశమును చూపుతాడు వెంటనే కనకదాసును విడిపించమని చెబుతాడు మహంతు కనకదాసును బంధించి యున్న ప్రదేశమునకు పరుగెత్తి కనకదాసు పాదాలపైబడి క్షమాభిక్ష కోరు తాడు దైవదర్శనార్థము కనకదాసును ఆలయములోకి తిలికొని వెళ్తాడు దేవాలయ తలుపులుతీయగానే పోయిన ఆభరణములతోసహా స్వామిదర్శన మిస్తారు నేత్రముల వెంట బాష్పములు రాలుచుండ కనకదాసు చేతులు జోడించి స్వామికి నమస్కరిస్తూ భగవాన్! వేంకటరమణా ఆశ్రిత జన రక్షకా నీ లీలలు మాకు అర్థంకావు నీవు భక్తుల నుద్ధరింపతీరు ఊహా తీతము ఆభరణముల అపహరణ వెనుక దాగియున్న నీ ఆశ్రిత జనరక్ష ణము ఆదర్శము అద్భుత మహామాన్వితము ఈ విధముగా నా ప్రారబ్ధ

షము కరిగించి ప్రజలలో నా కీర్తిని యినుమడింపజేయాలని సంకల్పిం చావా? అంటూ గగుర్పాటు చెందుతాడు అనంత కృపాసాగరుడైన వేంకటరమణుని అపార కృపామహామకు కనకదాసుని నేత్రాలు చెమ్మ గిల్లుతాయి

దివ్యానుభవములను పొందుతూ భగవానుని కృపారసమును పానం చేస్తూ కన దాసు శ్రీకృష్ణ సన్నిధానమైన ఉడిప చేరుతాడు శ్రీకృష దివ్య పాదయుగ దర్శనాభిలాషయై ఆలయములో ప్రవేశించడానికి వీలులేదని ధర్మకర్తలు ఆదేశిస్తారు కనకదాసు హృదయము ముక్కలైపోయింది క్షీరసాగరంలా పొంగుతున్న తన హృదయములో విషబిందువులు పడినట్లయింది శ్రీకృష్ణుని దివ్యతేజోమయ రూపమును గాంచలేని తన జన్మ నిరర్థకమనిపించింది తనలో దుఃఖము కట్టలు త్రెంచుకొని ప్రవహిస్తున్నది ఎంతగానో ప్రాధేయపడ్డాడు భగవానుని చరణకమలములను ఒక్కసారి దర్శించు భాగ్యము కల్పించమని యాచించాడు ప్రార్థించాడు భక్తి శూన్యమైన ధర్మకర్తల భావదారిద్ర్యం ఆకాశమువలె అనంతము భగవంతుని వ్యాపార వస్తువుగా భావించి స్వార్థజీవనముతో మెలిగే ధర్మకర్తలకు పరమ భాగవతోత్తముడైన కనకదాసు హృదయావేదనను గ్రహించే శక్తి ఎలా వస్తుంది? కనకదాసు కార్చే కన్నీటిబొట్లు ఆలయ ధర్మకర్తలు నిర్మించుకొనే అహంకార సౌధానికి ఏర్పబడిన గౌరవాభిమానాలనే ఇటుకలను గట్టిపరుచుటకు ఉపయోగపడు సున్నముగుమన్నవేగాని పరిశామానికి పునాది కాలేకపోయాయి.

చెదరిన మనస్సుతో శుష్కించిన హృదయముతో కనకదాసు కదల లేక కదులుతూ ఆలయం వెనుకవైపుకు వెళ్ళి దుఃఖించసాగాడు భక్త వత్సలుడు ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీకృష్ణదేవుని మనస్సు ద్రవించింది భక్తులను భగవంతుడు కాపాడకపోతే మరెవరు కాపాడుతారు? దేవాలయ గర్భగుడి వెనుకవైపు గోడకదిలి పడిపోయింది తూర్పుముఖముగాయున్న భగవానుడు పడమరవైపు తిరిగి భక్త కనకదాసుకు దర్శనమిచ్చాడు జై జై వాసుదేవహరి కనకదాసు స్వామిని దర్శించి ధన్యత చెందారు దానిని ఇప్పటికిని "కనకఖండి" అని పిలుస్తుంటారు అనగా

కనకదాసు స్వామిని దర్శించిన కిటికీ అని అర్థం భక్త కనకదాసుకు దర్శన మొసంగిన పుణ్యద్వారమని భావము

భగవంతుని కృపకు పాత్రుడైన కనకదాస్ తొంభై సంవత్సరాలు జీవించారు కొన్నివేల కీర్తనలు రచించారు అనేక దేవాలయాలు నిర్మించారు మానవాళిలో భగవద్భక్తి చిగురించునట్లు ప్రబోధముగావించారు ఆదికేశవుని పాదపద్మములను నమ్మి తాను తరించడమేగాక తన ఆదర్శనీయ జీవితముద్వారా ఎందరికో స్ఫూర్తిని కల్గించి తరింపచేసిన భక్త కనకదాసుని దివ్యచరితము పవిత్రము పావనమై మోహామహార్ణవమును దాటుటకు అర్హులైన జనులకు చక్కటి నావయై ఆనందతీరములను చేర్చగలదు భక్తాధీనుడైన భగవంతుడు భక్తుల హృదయాంలో దర్శనీయం అట్టి భక్తుల దర్శనమే ముక్తికి సోపానం

• ఓం శ్రీ విచిత్ర చరిత్రాయ నమః •







# సక్కుబాయి

ఫలమారగించాలనే వాంఛతో భూమిలో విత్తనాన్ని ఉంచుతాము మాధుర్య ఫలముల నారగించాలనేది అందులో ముఖ్యప్రయోజనము ముఖ్య ప్రయోజనమైన ఫలము లభించుటకు మునుపే పుష్పములు కాయలు ఆకులు ఛాయ మొదలగు అవాంతర ఫలితాలుకూడా కల్గుతాయి వాంఛించి నది ముఖ్యప్రయోజనమే అయినను అనాయాచితముగ కొన్ని అవాంతర ప్రయోజనాలు కలుగకమానవు అవాంతర ప్రయోజనాలను అనుభవిస్తున్నను వ్యక్తి మనస్సంతయు ముఖ్య ప్రయోజనము మీదనే యుంటుంది అప్రయత్నంగా లభించిన అగంతుక అనుభూతులను నెమరువేసుకుంటూ ముఖ్య ప్రయోజనాన్ని విస్మరించకూడదు అముఖ్య ప్రయోజన విషయానుభూతి అనివార్యమైనను ముఖ్య ప్రయోజన ఫలద్ధియే వాంఛనీయమై లక్ష్యస్థానమై యుండాలి

నిత్యానంద ఫలానుభూతిని వాంఛించి భక్తుడు తన హృదయ క్షేత్రంలో భక్తి బీజాన్ని నాటుతాడు మోక్షఫల సిద్ధియే తాను ఆశించు ముఖ్యప్రయోజనము నిరవధినమై నిరవయకమై నిరంజన స్వరూపమైన

ఆత్మానుభూతి యనెడి ముఖ్య ప్రయోజనము కలుగుటకు మునుపే శారీరక వ్యామోహాలు మానసిక వాంఛలు బుద్ధిలో కల్లోల పవనాలు బయలుదేరుతాయి శారీరక విషయానుభూతి అనెడి వగరుకాయల ననుభవించుటలోను మనోవాంఛలనే పుష్పసౌరభమును ఆఘ్రాణించుటలోను బుద్ధిలో నడచు భావపరంపరల ఛాయలో విశ్రమించుటలోను కాలాన్ని వృథా చేసుకోకూడదు శారీరక మనోబుద్ధులు కదిపి కదిలే వ్యామోహాలు అనిత్య విషయానుభూతులని గ్రహించి నిత్యానంద ఫలసిద్ధికై తీవ్రంగా ప్రయత్నించాలి దేహమనో బుద్ధుల నధిగమించి మోక్షఫలమందించు ఆనందరసానుభూతిలో తన్మయులై నిలవాలి అట్టి జన్మయతా జీవనసౌందర్యం కలిగి చరించువారే భక్తులు భగవంతుడనే ముఖ్య ప్రయోజనమును కాంక్షించి దేహేంద్రియ మనోబుద్ధులతో కలుగు అవాంతర ప్రయోజనాలను విస్మరించినవారు సదా భగవానుని గూర్చియే స్మరించి సంచరించి తరించిన పవిత్రాత్ములు అట్టి మహాభక్తుల కోవకు చెందిన పరమ భక్త సాధ్వీమణి సక్కుబాయి పాండురంగ దేవునిచే తన గృహకృత్యములు చేయించుకున్న ఆదర్శ భక్తశిఖామణి

పరమ పవిత్రమైన పండరీక్షేత్ర సమీపమునందలి ఒక గ్రామంలో సర్వశాస్త్ర పారంగతులు వేదాధ్యాయన పారీణులు ధర్మనిష్ఠులైన గంగాధరుడు కమలాబాయియను బ్రాహ్మణదంపతులకు సక్కుబాయి జన్మించినది కారణ జన్మురాలైన సక్కుబాయి శైశవమునందే అనూహ్య ఆధ్యాత్మిక శోభతో చరించేది మాటలురాని పూపపయస్సులోనే తనలో ఆత్మానంద పల్లవములు చిగురించ సాగినవి నిరంతరము దైవచింతనా జనిత ప్రభావ విశేషముచే కర్రమొద్దువలె పడియుండెది కొన్ని నిముషాలు కంటిపై రెప్పవాలేదికాదు హరినామస్మరణ చెవినిపడగానే ఆనందముతో గంతులు వేసేది హరికథా గానము భగవన్నామ సంకీర్తన జరుగు ప్రదేశములకు తీసుకొనిపోయినచో విలపించుట మాని ఏకాగ్రతతో శ్రవణము చేసేది ఈ బాలికలో గోచరించు పరిణామము తల్లిదండ్రులను కలవరపరచసాగినది

ఒకనాడు సక్కూబాయిని వెంటనిడుకొని తల్లిదండ్రులు పాండు రంగస్వామి దర్శనానికి ఆలయానికి వెళ్లారు సక్కూబాయి పాండురంగని దర్శించింది తనలో అవ్యక్తంగా అణిగియున్న ప్రపత్తి సాగర తరంగ ములవలె వ్యక్తమైంది తనజీవిత గమ్యమేమిటో మనసుకో తళుక్కున మెరసింది పాండురంగని దివ్యచైతన్యము తన బుద్ధి నావరించింది సక్కూ బాయి నిశ్చేష్టయై నిలవడిపోయింది తన నేత్రాలు పాండురంగని ముఖ కమలముపై ధ్యానమగ్నమై యున్నవి స్వామి సేవ పూర్తిచేసుకొని ఇంటి వైపునడుపడానికి తల్లి దండ్రులు సంకల్పించి ఏడుసంవత్సరముల బాలిక యైన సక్కూను తమవెంట రమ్మని సైగచేశారు సకూబాయి కదల లేదు పిలిచారు అయినా పలుకలేదు పరధ్యానంగా ఉందని భావించిన తండి దగ్గరగా నడచి భజము నిమురుతూ అమ్మా! సక్కూ ఇంటికి వెళ్దాంపద అన్నాడు తండ్రి కరస్పర్శతో ఉలిక్కిపడి నిద్ర నుండి మేల్కాంచినట్లు బాహ్యస్మృతిని బడసింది సక్కూబాయి తల్లితండ్రులను ఆయోమయంగా చూసింది నోటివెంట మాట పెగలలేదు నేత్రములవెంట అప్రయత్నముగ బాష్పములు రాలుచుండ అర్థంగాని అమాయకపు చూడ్కు లతో కదలలేక నిలుచున్నది

సక్కూ ! ఎమిటా పరధ్యానము? రా ఇంటికి వెళ్దాంపద" అని తండ్రి తెలియజేశాడు ఎక్కడికి? అని అనాలోచితంగా ప్రశ్నించింది సక్కూబాయి అదేమిటి సక్కూ? మన స్వగృహానికి అన్నది సక్కు తల్లి పెల్లుబుకుతున్న నవ్వును ఆపుకుంటూ స్వగృహమా! దానిని జీవుడు ఎనాడో మరచాడు పరంధామమై శాంతినిలయమై విశ్వాధారమై వెల్గొందు చైతన్యమే తన స్వగృహము అనంతానంద స్వరూపమైన భగ వానుడే తన జీవనమాధుర్యము నిత్య శుద్ధబుద్ధమై భాసిల్లు తన స్వగృహ మును వీడి సంసార ఘోరారణ్యంలో జీవుడు ప్రవేశించాడు కామ వ్యాఘ్ర ముతో సదా పోరాటము సాగించుచున్నాడు క్రోధ సర్పము కోరలలో చిక్కి బుసలుకొడుతున్నాడు లోభ చిలువపట్టులో చిక్కి సతమతమవు తున్నాడు చంచలమైన మోహలేడి చూపులకు సీరసించిపోతున్నాడు పొరలు కప్పిన మదగజపు బలిష్ఠ పాదాల క్రింద నలిగిపోతున్నాడు

మాత్సర్య జంబూక కూనిరాగాల కనుగుణ్యముగ నృత్యముచేస్తూ బ్రతుకును వమ్ముచేసుకుంటున్నాడు మానవజీవిత ప్రాశస్త్యమేమిటో సంపూర్ణముగా మరచిపోయాడు ధర్మచ్యుతుడై భావదారిద్ర్యముతో అజ్ఞాన వీధులలో విహరిస్తున్నాడు కంటకావృతమైన సంసార ఘోరారణ్యంలో పరిభ్రమిస్తూ తుచ్ఛ సుఖపంకమునబడి దొర్లుతూ బ్రతుకును నికృష్టంగా మార్చుకున్నాడు తాను చెడి తోటివారిని అజ్ఞానమడిలో పడద్రోయు చున్నాడు మానవుడై జన్మించి దానవుడుగా మిగిలియున్నాడు " అని అప్రయత్నముగా అన్నది సక్కూబాయి

సక్కూబాయినుండి వెలువడిన భావగర్భిత వాక్కులు తల్లిదండ్రులను విస్మయమొందించాయి సక్కూ ప్రవచించిన వైరాగ్య పలుకులు జననీ జనకులలో నిరాశాగాలుల్ని తోలాయి సక్కూ నోటినుండి పెల్లుబికిన వైరాగ్య వాగ్బాణ వారి హృదయములో నిలిచియున్న వాత్సల్య భవంతిని దహించివేసినట్లయినది తల్లిదండ్రులు చేతులు జోడించి పాండురంగ భగవానునికి నమస్కరిస్తూ హే దీనశరణ్యా! భక్తవత్సలా! విఠలా సక్కూ మాటలు మాకు విస్మయాన్ని కల్గింపుచున్నవి భయభ్రాంతులతో మనస్సు కలతచెందుతున్నది మా పుత్రికయైన సక్కూ ఏమగునోయని బాధ కలుగుచున్నది మమ్ము రక్షింపు అని ప్రార్థించిరి

సక్కూబాయి పాండురంగదేవునికి నమస్కరిస్తూ హే పుండరీక వరదా పండరీశా నా తల్లిదండ్రులు సదా భగవన్నామామృత పానము చేయుచు తృప్తిచెందెడివారు నిత్యానుష్ఠానపరులైన అతిథి అభ్యాగత సేవలో కాలము గడుపువారు వారి ప్రార్థన నాలకింపుము వారి అభ్యర్థన ననుగ్రహింపుము వారి పుత్రికనైన నేను ఏమగుదునోయని వారు భీతి చెందుచున్నారు నిజమే! ప్రభూ! వారు సత్యప్రవచనం చేశారు భగవాన్ నీ సాన్నిధ్యాన్ని పొంది తరించేందుకు మానవజన్మ లభించింది అట్టి ప్రశస్తమైన మానవజీవితము ప్రాపంచిక చవిటినేలలోపడి వృథాగాకుండా రక్షింపు తండ్రీ మెడలో సాంసారిక ముడులు పడకముందే హృదయముడి వీడేలా

ఆశీర్వదించు భవబంధాలలో చిక్కి రొంపి సంసారాన్ని నిర్మించుకోకుండా నిరంతరం భవదీయ పదపంకజముల చెంత నా చిత్తము లయించునట్లు అనుగ్రహించుము హే జగత్పాలకా! హృషీకేశా త్రివిక్రమా భయకంపితమైన భవసాగరములో మునకవేసి నశక్తురాలనై నీ అభయ హస్తమును ఆశ్రయించాను తరింపచేసినా అంతరింపచేసినా నీదే భారము అని దుఃఖిస్తూ మూర్ఛిల్లినది

సక్కూబాయిని తీసుకొని తల్లిదండ్రులు ఇంటికి చేరారు శరీరమును ఇంటికి తీసుకొని రాగలిగారేగాని భగవానుని పూజ్య చరణారవిందముల యందు లగ్నమైన ఆమె చిత్తమును తీసుకొని రాలేకపోయారు సక్కూబాయిలో ఆంతరంగిక పరిణామం మొదలయింది ఏదో ఆలోచిస్తున్నట్లు కనుపించేది ఆహారము పెడితేనే తినేది నవ్వు ఎలా ఉంటుందో మరచి పోయింది అప్రయత్నముగ నేత్రముల వెంట బాష్పములు రాలుచుండేవి బాలికలతో కలసి క్రీడించేదికాదు ఆటలయందు ఆసక్తి బాగా క్షీణించింది ఒంటరిగ కూర్చొని చింతిస్తుండేది రాత్రులందు నిద్రను మరచి కూర్చుని ధ్యానిస్తుండేది

ఒకనాడు సక్కూబాయి ఇసుకలో కూర్చుండి ఆలోచిస్తూ అప్రయత్నముగా ఇసుకతో గుడి కట్టసాగింది చేతులతో గుడి నిర్మాణము చేయుచు చిత్తములో భావమందిరాన్ని నిర్మించుకుంటున్నది తాను ఈ ఇసుక గుడిని నిర్మించునట్లే ప్రపంచములో మానవులు సంసార ఆలయాలు నిర్మించుకుంటున్నారు తన ఇసుకగుడి ఎంత శాశ్వతమో ఈ మాయా నిర్మితసంసారాలు కూడా అంతే శాశ్వతము కదలిపోయే ఇసుక గుడిపై పెంచుకున్న మమతలకు మిగిలేదేమిటో చెదరిపోయే సంసారాలపై ఉంచుకున్న మమకారాలకు కూడా మిగిలేది అదేనని చింతించసాగింది ఇంతలో సదానంద స్వాములవారను యతివరేణ్యుడు ఆ దారిన వెడుతూ చూడక ఆ ఇసుక గుడిపై తన పాదము నుంచాడు గుడి చెదిరిపోయింది తన ఊహ కనుగుణ్యముగానే జరిగినందుకు ఆశ్చర్యపోతూ సక్కూబాయి స్వాములవారిని చూపింది తాను పాడుచేసిన గుడిని నిర్మించినది సక్కూబాయియేనని గ్రహించిన సదానందస్వామి మందహాసమును చిందిస్తూ అమ్మా! గుడి

పాడైనందుకు చింతించకు చెడి పడిపోయే పడి చెడిపోయే గుడి నిర్మాణము కాదు చేయవలసింది చెడని హృదయో ఒడని గుడిని నిర్మించుకో కాలిపోయే శరీరాలతో రాలిపోయే మందిరాలు నిర్మించి నశించేదేముంది మృణ్మయ శరీరాలతో మృణ్మయ మందిరాలు నిర్మించడము కాదు చిన్మయ చైతన్యముతో తన్మయ మందిరాలు నిర్మించాలి ప్రయత్నించు నీ గుడిని పాడుచేసినందుకు పరిహారము చెల్లించివెడతాను అంటూ పాండురంగని దివ్యమంత్రాన్ని ఉపదేశించి ధ్యానించి తరించమని చెప్పి వెళ్ళిపోయారు

సక్కూబాయిలో లక్ష్యసాధనకై అవ్యక్తంగా జరుగుతున్న ప్రయత్నానికి ఆధారము లభించింది తాను అధిరోహించాలని ఉబలాటపడుతున్న సత్యసౌధమునకు సోపానాలు నిర్మించినట్లయినది తన కాలాన్నంతా మంత్రజపములో ఖర్చుచేయసాగింది అంతర్ముఖజీవనానికి బాగా అలవాటు పడిపోయింది సక్కూ ప్రవర్తనను గాంచి తల్లిదండ్రులు కలత చెందారు ఆవిడలో రగిలే వైరాగ్యజ్వాలను ఆర్పనిచో సక్కూ తమకు దక్కదని భావించారు గృహస్థాశ్రమములో ఆవిడను ప్రవేశపెట్టుటయే ఉత్తమ మార్గమని భావించారు శ్రీకృష్ణానదీ తీరమునందలి కరవీరపురమను గ్రామములో మిత్రకాంతుడను వానికిచ్చి వివాహము చేశారు

సక్కూను అత్తవారింటికి పంపారు శరీరానికి స్థానభ్రంశమేగాని చిత్తము మాత్రము గోవిందుని పవిత్ర పాదద్వయమనే స్వస్థానమునందే స్థిరంగా నిలిచిపోయింది సక్కూ పురానికి వెళ్ళిన అత్తగారి గృహము ఆవేదనాలయము సక్కూబాయి అత్తగారు ఒక విచిత్రమైన వ్యక్తి అభినవ మంథరి అని భావించవచ్చు పరనిందతోనే ఆవిడ ఆకలి తీరుతుంది కపట నాటకాలతో కాలాన్ని వెళ్ళబుచ్చుతుంది కఠినాత్మురాలై అసత్య జీవనమునకు అలవాటుపడి వైపరీత్య గుణముతో ప్రవర్తిస్తూ యుంటుంది సక్కూ భర్తలో తల్లి పోలికలే మెండు అతడికి ప్రాపంచిక విషయ భోగములయందు అభిరుచియేగాని ఆధ్యాత్మిక జీవనమునందు ఆసక్తి శూన్యము విరుద్ధ భావాలతో జీవించు వ్యక్తుల గృహములో సక్కూబాయి కాపురము చేయవలసివచ్చింది

సక్కూబాయి పతి సేవయే పరమాత్మ సేవగా భావించి జీవించేది అత్తమామలను సేవించుచు అతిథి అభ్యాగతులను ఆదరించుచు ఆదర్శజీవనమును గడపసాగెను. సదా భగవదారాధనా బుద్ధితో జీవించు సక్కూ ప్రవర్తన అత్తగారికి నచ్చలేదు భగవద్భక్తి యనునది ఒక అనాచారమని నిత్యపూజలు జరుగు గృహము దరిద్ర దేవతకు ఆలయమని తెలియజేసింది భక్తి చేయుట మానమని సక్కూని హెచ్చరించింది భగవంతుని మరచి జీవించమని సక్కూకి బోధ చేయడమనునది శ్వాసక్రియను ఆపు బ్రతుకమని హెచ్చరిక చేయడమే అవుతుంది పాండురంగని చరణ కమలములకు దూరమై సక్కూబాయి జీవించలేదు పాండురంగడే ఆమెకు సర్వస్వము పాండురంగని ఆరాధనయే ఆమెకు జీవము తనకు పాండురంగని యందున్న అపార భక్తి విశ్వాసాలను అత్తగారికి తెలియజేస్తూ వాటిని వమ్ము చేయవద్దని అత్తగారిని ప్రార్థించింది సక్కూ ప్రార్థనను అత్తగారు అంగీకరించలేదు అలాగని భగవదారాధనను సక్కూ కొనసాగించుట ఆపలేదు

ఒకనాడు బ్రహ్మముహూర్త కాలమునే సక్కూబాయి తన పూజా మందిరములో అర్చనాదులు పూర్తి చేసుకొని సంకీర్తన చేయసాగింది సక్కూబాయి సంకీర్తనవలన తనకు నిద్రాభంగమైనదని భావించిన అత్తగారు రుద్రకాళివలె విజృంభించింది సక్కూబాయి పూజామందిరానికి ఆరుదెంచినది ఏమిటీ అసహ్యపు కేరింతలు? ఇది గృహమా? లేక సంతయా? ఈ ఇంటిలో ఇక ఎవ్వరూ నిద్రించనవసరములేదా? దారిద్ర్యానికి మూల హేతువైన ఈ దౌర్భాగ్యపు భక్తిని విడనాడమని నీకు ఎన్నిసార్లు చెప్పాను అని గద్దించింది సక్కూబాయి వినమ్రతతో చేతులు జోడించి అత్తగారికి నమస్కరిస్తూ క్షమించండి బ్రహ్మముహూర్త పుణ్యఘడియలో జీవనాధారమైన జగన్మోహనుని ఆరాధించాలని ఆతృతపడ్డానేగాని మిమ్ములను శ్రమ పెట్టాలని మీకు నిద్రాభంగము చేయాలని నేను భావించలేదు దేవతలు ఋష్యాది మహాత్ములు ఏకశృతితో శ్రీహరిని స్మరించు బ్రహ్మముహూర్త సమయాన ఒళ్ళుమరచి నిద్రించుట అపచారము తపస్సుతో తరించవలసిన శుభసమయములో తమస్సులో పడియుండుట అనాచారము అత్తగారూ!

క్షమించండి నేను బిగ్గరగా సంకీర్తన చేయుటచేత మీకు నిద్రాభంగమైనది ఇకమీదట మీరు నిద్రలేమవరకు నేను మౌనజపములో కాలము గడుపుదును గోవింద నామస్మరణ తమకు గోలగా వినిపించుటచేత గృహమును సంతగా అభివర్ణించారు మీరు చెప్పిందికూడా సత్యమే సంతలో ధనార్జనకై వస్తువులను విక్రయిస్తాడు వర్తకుడు గృహంలోకూడా అదియే జరుగుచున్నది విషయ సుఖమాధుర్యమును కాంక్షిస్తూ జీవుడు తనువును మనస్సును సర్వమును సంసారాలకు అంకితంచేసి అన్యాయమవుతున్నాడు సంసార గాలముకన్నా సంతగోలయేనయం శోకభూయిష్టమైన సంసార జీవనంలోయున్నను శ్రీనాధుని పదపంకజములచెంత చిత్తము నుంచినవారు తప్పక తరించగలరు వారే ధన్యజీవులు వారే నిజమైన భాగ్యవంతులు విష్ణువును మరచుటయే ఆపద శ్రీహరి స్మరణయే నిజమైన సంపద అని సక్కూ భావగర్భితంగా పలికింది

సక్కూ ప్రబోధము అత్తగారిలో ప్రకోపమును రేకెత్తించినది "ఏమిటీ? నాకే నీతులు బోధించుచున్నావా? నీవే భక్తిలో పండినట్లు ఊక దంపుడు ఉపన్యాసాలు చేస్తున్నావు నీ అర్ధరహిత ప్రసంగాన్ని ఆపు నీ వ్యర్ధపూజలన్నీ ఈ ఇంటిలో కొనసాగడానికి వీల్లేదు నీవు అత్తగారింటికి వచ్చింది కాపురం చేయడానికేగాని కైంకర్యంలో కాలాన్ని వృధా పుచ్చడానికికాదు నీవల్ల మా సంసారమే గుల్లగామారె పరిస్థితి ఆసన్నమవుతున్నది నేను బ్రతికియుండగా అలాంటి దుస్థితి రాకూడదు ఇక ఎంతమాత్రమూ సహించేదిలేదు అని పలుకుతూ సక్కూ పూజచేయు శ్రీకృష్ణదేవుని దివ్యమంగళ విగ్రహమును పూజాపీఠము నుండి కదిలించి చేతపట్టుకొని గది బయటకు రాసాగింది సక్కూబాయి హృదయము భయకంపితమైనది తన ప్రాణసమానమైన శ్యామసుందరుని విగ్రహమునకు ఆపద సంభవించినచో తాను జీవించలేదు విగ్రహాన్నివ్వమని ప్రార్ధిస్తూ అత్తగారివెంట పరుగెత్తింది అత్తగారు బాణంలా దూసుకుంటూ పెరటిలోకి వెళ్ళి అక్కడున్న బావిలో మురళీమనోహరుని విగ్రహాన్ని ఎడవేసింది ఆ దృశ్యాన్ని గాంచిన సక్కూబాయి మూర్ఛిల్లింది

సక్కూబాయి కొంతసేపటికి మూర్ఛనుండి మేలుకొని పరుగెత్తు కుంటూ పూజామందిరానికి వెళ్ళింది అక్కడ తన బృందావన గోపాలుడు కనుపించలేదు ఎచ్చి పట్టినట్లయింది నేత్రాంవెంట బాష్పధారలు కారుతున్నాయి శరీరం కంపిస్తున్నది పసిబిడ్డలా బోరున ఏడ్వసాగింది హే కృపానిధీ! పాండురంగా నేను చేసిన నేరమేమిటి? నిన్ను దర్శించకుండా నేను మనగలనా? ప్రభూ నాకు ఎందులకీ శిక్ష విధించావు! నిన్ను దర్శించలేని ఈ నేత్రలు నాకెందుకు? వాటినిప్పుడే పెకలించి వేస్తాను నిన్ను అర్చించని ఈ కరములెందుకు? వాటిని ఈ క్షణమే వంటచెఱకుగా ఉపయోగిస్తాను దయాస్వరూపా! సౌమ్యరూపా ఈ దీనురాలిని కరుణించు నీ సేవలో ఈ దేహాన్ని రాలిపోనీ! నీకు దూరమైన శరీరాన్ని శాశ్వతంగా కూలిపోనీ! అంటూ తీవ్రవేదనతో పూజాపీఠముపై పడిపోయింది జై జై భక్తవత్సల భగవాన్‌కీ జై ఆమె పవిత్ర హస్తాలమధ్య శ్యామసుందరుని విగ్రహం నిలిచింది సక్కూ కళ్ళుతెరచి చూసింది ముకుందుని ముఖారవిందమును గాంచి మురిసిపోయింది తన కళ్ళవెంబడి కారుతున్న ఆనందాశ్రువులతో స్వామి పాదాల నభిషేకించింది "నందనందనా! కరుణించావా తండ్రీ! ఈ దీనురాలిని అనుగ్రహించావా? ప్రేమ హృదయాలలో నివసించే నీవు నా కొరకు జంకూపముతో పడ్డావా? భగవాన్ క్షమించు నాలాంటిదౌర్భాగ్యపు భక్తులవలన నీకూ బాధలు తప్పడంలేదు" అని సక్కూ విలపించింది

"అయ్యో! అయ్యో చేతులు కదలడంలేదు హస్తములు మండుతున్నాయి కరద్వయము ధ్వంసమగుచున్నది అయ్యో అయ్యో నే నీ బాధను భరించలేను అని విలాపము వినిపించింది సక్కూ పరుగెత్తుకుంటూ వెళ్ళింది తీవ్ర ఆవేదన ననుభవిస్తున్న అత్తగారిని చూసింది కరుణామూర్తియైన సక్కూ అత్తగారి బాధను చూడలేకపోయింది పరుగెత్తుకుంటూ వెళ్ళి అత్తగారిని కౌగలించుకుంది అంతే సక్కూబాయి చల్లటి అమృతాలింగనముతో అత్తగారి బాధ అడుగంటిపోయింది అత్తగారు మామూలుగా ఆరోగ్యవంతురాలయ్యారు సత్యనాధుని కూపములో పడవేయుటచేత కలిగిన పాపము సక్కూ ఆలింగనము వలన పరిహారమైనది

సక్కూబాయి పవిత్ర అంతఃకరణకు అత్తగారు ఆకర్షితురాలి య్యారు సక్కూకు ఇకమీదట ప్రేమగా చూసుకోవాలనే నిర్ణయానికి వచ్చారు సక్కూబాయ్కి ఆలింగనముచేత అత్తగారి బాధానివారణ జరిగిన విషయము ఇరుగుపొరుగువారికి తెలిసింది సక్కూబాయిని అందరూ స్తుతించసాగారు అత్తగారికి రాక్షస నామకరణముచేసి ముద్దుగా పిలువుకో సాగారు ఈ అభిప్రాయాలు సక్కూబాయి అత్తగారి చెవినిపడ్డాయి మళ్ళీ క్రోధ సర్పము కోరలు చాచింది సక్కూను కాటు వేయడానికి సిద్ధపడ సాగింది

సక్కూబాయి మహాభక్తురాలని దైవాంశసంభూతురాలని ఇరుగు పొరుగువారు అత్తగారితో చెప్పసాగారు వారు చేయు స్తుతులన్ని అత్త గారికి పుండుపై కారం చల్లినట్లనిపించింది ఆవిడలో క్రోధాగ్ని తీవ్ర రూపాన్నిదాల్చింది సక్కూను సమాజంలో బలహీనంచేయాలని భావిం చింది అందుల కనుగుణ్యంగా ఒక చక్కటి ఇతివృత్తాన్ని తయారుచేసు కుంది ఒక పెద్ద జొన్నలమూటను గదిలోవుంచి సక్కూబాయిని పిండి చేయమని చెప్పింది ఆరోజు ఏకాదశి పర్వదినమైనందున సక్కూబాయి ఉపవాసవ్రతము నాచరిస్తున్నది సక్కూబాయి అత్తగారు ఇరుగుపొరుగు వారిని సంప్రదించింది తన కోడలు సక్కూబాయి ఏకాదశిపర్వదిన సందర్భమున వ్రతదీక్షలో నున్నదనియు ఆమె భక్తిమహిమచే ఈ రాత్రికి జొన్నలను పిండిచేయగలదనియు తెలిపి ఇరుగుపొరుగు వారినుండికూడా పిండిచేయుటకు జొన్నలను సంగ్రహించినది ఇలా ప్రోగుచేసిన జొన్నలు కొన్ని మూటలయినవి అన్నిటిని ఒక గదిలోనుంచి సక్కూబాయిని ఆ గదిలో పెట్టి తాళంవేసింది తెల్లవారుసరికి జొన్నమూటలన్నియు పిండి చేయవలెనని ఆజ్ఞాపించినది

సక్కూబాయికి పరిస్థితి అర్థంకాలేదు తిరుగలివద్ద కూర్చున్నది. పిండిచేయడానికి ప్రారంభించినది ఫలితము అగమ్యమై అనూహ్యంగా గోచరించింది గదినిండిన జొన్నలమూటలను తానొక్కతే ఎలా పిండి చేయగలదు? మరి తనతో సహాయంగా ఎవరున్నారు? చిన్ననాటి నుండి తన జీవితములో తోడుగా నిలచి నిడయెనిలిచిన పాండురంగదేవుడు

కరించావే హే భక్తవత్సలా విఠలా మళ్ళీ నూతన పరీక్షకుగురి చేశావా! భగవాన్! నీ పాదపద్మములకు అంకితమైన నీ భక్తులకు మానవ మానాలుంటాయా? జయాపజయాలు స్ఫురిస్తాయా! యోగక్షేమాలను కని పెట్టే నీవు సదా భక్తులను రక్షింపుచుండగా కర్తృత్వభోక్తృత్వాది విషయాలయందు భక్తులు రమింపుదురా? కరుణాపారీణా కమలనయనా! కాపాడుతండ్రీ ఆర్తత్రాణ పరాయణుడవన్న నీ బిరుదును సార్ధకం చేసుకో అని ప్రార్ధింపుచు సక్కూబాయి మైమరచి నిద్రించింది ఆహా! మహాద్భుతము! అనిర్వచనీయ దివ్యలీలా ప్రదర్శనము జీవుల పాపపు మూటలనే పిండిచేయు జగన్నాథునికి జొన్నలమూటలను పిండిచేయుట కష్టమా? క్షణ కాలములో జొన్నలమూటలన్నీ పిండిగామారాయి సక్కూబాయి నిద్రనుండి మేలుకొని భగవానుడు తనపై కురిపించిన దయామృతాన్ని దర్శించింది హృదయము ఆనందముతో నిండిపోయింది నేత్రములవెంట ఆనంద బాష్పాలు రాలాయి గగుర్పాటు చెందుతున్న మేనును కదిలించి గదితలుపు తెరచింది అత్తగారు అపహాస్యం చేయుచూ సక్కూ! ఇరుగుపొరుగు వారుకూడా వచ్చియున్నారు నీ భక్తి విశేషముచే తయారైన జొన్న పిండిని దర్శించి గ్రహించాలని అరుదెంచియున్నారు ఎండి చేయడము పూర్తయినదా? అని ప్రశ్నించింది

సక్కూబాయి చేతులుజోడించి నమస్కరిస్తూ "అత్తగారూ! మీరు పెద్దలు మీరు నాపై చిందింపు ప్రేమానురాగాలకు నేను ఋణగ్రస్తురాలనై యున్నాను మీ ఋణమునుండి ఎలా విముక్తిపొందాలో అర్ధంగాని అయోమయస్థితిలో యున్నాను భగవానుని అనంతలీలా విశేషములు మీకుబాగా తెలుసు భక్తజనులను కరుణాసముద్రుడైన పాండురంగడు ఉద్ధరింపుతీరు మీ మనస్సుకు అందనిదికాదు అందుచేత పదుగురికి నా భక్తిశ్రద్ధలను వివరించాలని మీరు సంకల్పించి నాకీ పరీక్షపెట్టారు మీ ఊహకనుగుణ్యముగానే జరిగింది పాండురంగని అదృశ్యహస్తం పనిచేసింది దైవ ప్రసాదం పిండిరూపములో వెలిచింది" అని వినమ్రతతో తెలిపింది ఇరుగు పొరుగు తల్లులతో కలపి సక్కూ అత్తగారు గదిలోకి వెళ్ళచూశారు వారు నేత్రాలతో వారే నమ్మలేకపోయారు జొన్నలన్నీ పిండిగా మారియుండుట

చూశారు సక్కూబాయి పాదాలపై పడ్డారు ఇరుగుపొరుగు తల్లులు ఆమె భక్తి ప్రవత్తులను కొనియాడుతూ వెళ్ళిపోయారు సక్కూ అత్తగారి మనస్సు కలతచెందింది సక్కూబాయిపై తనకున్న అసూయ ఆకాశాన్నంటింది ఈర్ష్య ద్విగుణీకృతమైంది కలుషితమైన ఆమె అంతఃకరణ నూతన ప్రయోగాన్ని చిత్రించుకుంటూ అవకాశానికై అర్రులుచాచి వేచియున్నది

సక్కూబాయి ఒకనాడు ఆలయంలో భగవద్దర్శనము పొంది తిరిగి వచ్చుచుండ తనకు శైశవమున మంత్రదీక్ష నొసంగిన సదానందస్వాముల వారిని దర్శించడము జరిగింది సక్కూబాయి ఆనందమునకు అవధులు చిక్కలేదు స్వాములవారి పాదాలపైబడి తన కన్నీటితో స్వామి పాదాల నభిషేకించింది గద్గద కంఠముతో గురుదేవా! తమ దర్శనముతో నా బ్రతుకు ధన్యత నొందినది అని అప్రయత్నంగా పలికింది శైశవమున సక్కూ హృదయంలో తాను నాటిన ఆధ్యాత్మికబీజము శాంతివృక్షమై అమృతఫలము నొసంగుటకు సిద్ధముగాయున్నదని గ్రహించి సదానందస్వామి ఎంతో తృప్తిచెందారు అమ్మా! సక్కూ! సాధన బాగుగా జరుగుచున్నదా? అని ప్రశ్నించారు సదానందస్వామి "గురుదేవా తమ కృపావిశేషముచే సాధన నిర్విఘ్నముగా సాగుచున్నది ఈనాటి తమ దర్శనభాగ్యముతో మరింత అనుభవోపేతముగా సాగగలదని నా విశ్వాసము మహాత్మా! తమ పాదస్పర్శచే మా గృహమును పావనము చేయండి మా ఆతిథ్యమును స్వీకరించి మమ్ము ఆశీర్వదించండి" అని సక్కూబాయి ప్రార్థించింది సక్కూ విన్నపమును మన్నించి శిష్యులతోగూడి సదానందస్వాములవారు సక్కూబాయి ఇంటికి చేరారు

సక్కూబాయి హృదయము ఆనందపారవశ్యముతో నిండియున్నది గురుదేవులైన సదానందస్వామిని ఉచితాసనంపై కూర్చుండబెట్టి పాదపూజ చేసింది స్వాములవారు శిష్యగణముతోగూడి భిక్షను స్వీకరించుచుండగా సక్కూ అత్తగారు వచ్చారు భిక్షను గ్రహించుచున్న సాధువులను చూసి కోపోద్రిక్తతో సక్కూవంక చూడగానే సక్కూబాయి అత్తగారిని సమీపించి అత్తగారూ! వీరే నాకు మంత్రదీక్ష నొసంగి నన్ను ఆశీర్వదించిన మహాత్ములు సదానంద స్వాములవారు పవిత్రాత్ములైన స్వాములవారి

రాంచే మన గృహము పావనమైనది" అన్నది అత్తగారు సక్కూవంక ఆవేశపూరితంగాచూస్తూ అవునవును గృహపావన మెలాఘన్న ముందు గృహము గుల్లగుమన్నది సన్యాసులను పోషించడానికి సాధువులను రక్షించడానికి ఇదేమైనా సత్రమా? ఆశ్రమమా? పనిచేయలేని సోమరులకు అన్యాయమొకమార్గమైంది ఎవరినడిగి వీరికభిక్షను ఏర్పాటుచేశావు? దుర్మార్గురాలా సంసారాన్ని వమ్ముచేయడానికి ఏతెంచావు నీకుసరే బుద్ధిలేదు నీవు ఎలవగానే తగుదునమ్మా అంటూ అరుదెంచి ఆరగించుమన్న ఈ సాధువులకైనా బుద్ధి వుండ నక్కరలేదా! పరుల సొమ్ముకు ఆశపడే వ్యర్థజీవులకు బుద్ధి ఎలా వుంటుంది? వీరు స్వాములుగారు పాలు పోసినవారిని కాటువేసే పాములు" అని తన ఆక్రోశాన్నంతా వెలిబుచ్చింది

సక్కూ మొగము చిన్నబోయింది సదానందస్వాములవారు పరిస్థితి నంతా అర్థంచేసుకున్నారు చేతులు కడుగుకొని దుఃఖించుమన్న సక్కూను సమీపించి "అమ్మా! సక్కూ? అర్థమయింది తల్లీ ప్రహ్లాదుని విశ్వాసముతో ధృవుని ధైర్యముతో జీవిస్తూ శబరిలా నిరీక్షిస్తూండు భగవానుడు కరుణాసముద్రుడు నిన్ను తప్పక తరింపచేస్తాడు" అని ఆశీర్వదించి శిష్యులతో గూడిస్థానిక ఆలయములో బసచేయడానికి వెళ్ళారు సదానందస్వామి

సదానంద స్వాములవారికి భిక్ష నొసంగిన ఈ సంఘటనను ఆధారముగ జేసుకొని కొన్ని దినములు తీవ్రంగా సక్కూను బాధించారు అత్తగారు బాధలన్నీ భగవంతుని చేర్చేందుకు ఉపకరించే సోపానములని గ్రహించిన సక్కూబాయి బాధలన్నింటినీ ప్రశాంతంగా అనుభవించసాగింది

సక్కూబాయి అత్తగారి ద్వేషానికి హద్దులు గోచరించడము లేదు. పరమ పవిత్రురాలైనా సక్కూబాయిలో గోచరించు ఆధ్యాత్మిక శోభనుగాంచి సంతోషించుటకు బదులు తీవ్ర ఆవేదనకు గురియై క్రోధాగ్నిని చెరుగుతూ అలమటించసాగింది అత్తగారు సంస్కారహీనులు అంతకన్నా గొప్పగా ఎలా జీవించగలరు ?

ఒకనాడు సక్కూబాయిని పిలిచి ఒక ఘడియకాలములో చేనుకు నీరు పెట్టవలయుననియు, అలా చేయనిచో తల్లిగారింటికి ప్రయాణము కట్టవలెన

వస్తుందనియు బెదిరించి అవసరమైన పనియుండి గ్రామములోనికి వెళ్ళారు అత్తగారు సక్కూ తీవ్రంగా ఆలోచించింది పదిమంది పురుషులు కలిసి చేయలేని పనిని తానెలా నిర్వహించి పూర్తిచేయగలదు? మరి అత్తగారు వచ్చేలోపల పూర్తిగానిచో తన పరిస్థితి విషమంగా తయారవుతుంది ఆలోచిస్తూ చేను గట్టుపై కూర్చున్నది బావిలోకి తొంగిచూసింది జలపూర్ణమై యున్న బావినిగాంచి భగవాన్! ఈ బావి జలపూర్ణమైనట్లు నా హృదయం చైతన్యశాంతితో నిండేదెప్పుడు? అని చింతించసాగింది జలపూర్ణమైన బావి లోతును తెలియగలరుగాని పరిపూర్ణమైన పాండురంగని అగాధ శాంతి సాగరపు లోతును తెలియగలవారెవరు? బావిలోని నీరు దేహశుద్ధిని కల్గిస్తుంది జీవి దప్పికను తీరుస్తుంది పాండురంగని కృపారసము జీవ మాలిన్యాన్ని తొలగిస్తుంది అనంత దుఃఖాన్ని రూపుమాపుతుంది వృక్షము లను నీరు పోషిస్తుంది భగవానుని కరుణామృతము ఆధ్యాత్మిక వృక్షమును హృదయ క్షేత్రములో పెంచి ఆనంద అమృతఫలము నందిస్తుంది అని చింతించసాగింది సక్కూబాయి

కాలం కదులుతున్నది కడలి పొంగువలె బావిలోని జలముపొంగింది పాదులద్వారా నీరు ప్రవహించి చేనును తడుపుతున్నది ప్రవహించుచున్న జలమునుచూచి భగవాన్! ఈ జల ప్రవాహామువలె నా హృదయంలో సదా ఎడతెగనిభక్తి ప్రవహించునట్లు అనుగ్రహించవా? అని దుఃఖించసాగింది సక్కూబాయి అర్ధఘడియలో చేనంతా నీటితో తడిసిపోయింది అంతేకదూ! జగదాధారమైన జగదీశ్వరుని దృష్టి సారించబడగానే కాలానికి విలువేముంది? ధ్యానపూరిత హృదయంతో ఆనందసామ్రాజ్యంలో సక్కూబాయి విహరించ సాగింది అత్తగారు వచ్చారు కొయ్యబొమ్మవలె చేను గట్టుపై కూలబడి యున్న సక్కూను చూశారు ఓ పాపిష్టిదానా! చేనుకు నీళ్ళు పెట్టమని చెబితే చేను గట్టుపై కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నావా? అని గద్దిం చుచూ ఒక్కసారి తన దృష్టిని చేనువైపుకు సారించింది చేనంతా తడిసి ఉంది ఏమిటీ ఆశ్చర్యము? అరఘడియలో ఇంతటి కార్యమెలా సాధ్యం? అని అప్రయత్నంగా అన్నది అత్తగారు సక్కూబాయి అత్తగారికి నమస్క రిస్తూ సాధ్యవస్తువే తానైయున్న సర్వేశ్వరుడు ప్రత్యేకంగా సాధించవల

సిందెముంటుంది? సాధనలు చేరలేని చోటు రోదనలు సాగరేని మాయి వేదనలు తాకలేని గీటు భగవానుడెనని తెలుసుకొన్నవారికి సాధనలు మిగలవు రోదనలు సాగవు వేదనలు కదలవు అత్తగారూ! నమ్మి చెడినవారు లేరు నమ్మక బాగుపడనివారు లేరు విఠలా! విఠలా! పాండురంగ విఠలా! జై పాండురంగ విఠలా! పారవశ్యంతో పాడుకుంటూ ఇంటివైపు నడచింది సక్కూబాయి

భగద్విభూతులను గొలుసులా అనుభవిస్తున్న సక్కూబాయికో వినూత్న పరిణామము జనించింది నిరంతరము పాండురంగ భగవానుని దివ్యరూపాన్ని దర్శించాలని చంద్రభాగా పుణ్యతీర్థంలో గ్రుంకులిడాలని మనస్సు తపించసాగింది ఒకనాడు నీళ్ళు తిసుకొని వచ్చుటకు చెరువుకు వెళ్ళింది సక్కూబాయి నీళ్ళు తీసుకొని వస్తున్నది తనకు ఎదురుగ వర్కారీ సంత్‌పురుషులు పాండురంగని నామస్మరణచేయుచు పండరీక్షేత్ర దర్శనానికి వెళ్ళుట గాంచినది

రండీ! రండీ జనులారా
రంగని సేవకు కదలండీ ॥రండీ॥
పరమ పవిత్రము పండరీ క్షేత్రము
పావన మంత్రము విఠల నామము ॥రండీ॥
చంద్రనాడియే, చరించే భీమా
సూర్యనాడియే చంద్రభాగా
సుషుమ్నయే రెండిటి కలయిక
వాని గమ్యమె విఠలుని వేడుక ॥రండీ॥
పాపహరము విఠలుని మంత్రము
భవభయహరము విఠల చింతనము
జీవన శాంతికి మోక్షప్రాప్తికి
విఠల దర్శనమే సాధన యంత్రము ॥రండీ॥

సుశ్రావ్యంగా గానముచేయుచు భక్తులు కదులుచుండ కరిగిన హృదయంతో సక్కూ నీళ్ళబిందెను వదిలేసి కన్నీరు కార్చుచు ఆ మహాత్ముల పాదాలపై

పడింది అమ్మా! ఎవరు/తల్లీ నీవు? ఎందుకు దుఃఖించుచున్నావు? అని ప్రశ్నించారాభక్తులు /

మహాత్ములారా వందనములు నేను మహాపాపిని కలియుగ వైకుంఠమైన పండరీక్షేత్రమును దర్శించక నోచుకోని అభాగ్యురాలను పాండురంగదేవుని పాదస్పర్శ భాగ్యమును ఇంతవరకు పొందలేని దుర దృష్టవంతురాలను పవిత్రాత్ములారా! సదా పాండురంగ నామామృతాన్ని ఆస్వాదించు మీరు పుణ్యాత్ములు మహాపాపియైన ఈ సక్కూబాయిని మీ వెంట తీసుకొనివెళ్ళి పాండురంగ దర్శనము చేయించుడు అని సక్కూబాయి ప్రార్థించింది అమ్మా! నీవు మహాభక్తురాలువలె గన్పట్టుచున్నావు నిన్ను మావెంట పండరీకి తీసుకొని వెళ్ళుట మహాద్భాగ్యంగా భావించు చున్నాము పాండురంగ భగవానుని దివ్యదర్శనమునకై పరితపించు హృదయమెంత పవిత్రము అంటూ సక్కూబాయిని తమ వెంటనిడుకొని భక్త సమూహము కదిలింది

సక్కూబాయి పండరికేగుచున్నదన్న వార్త అత్తగారి చెవినిపడింది అగ్రహోదగ్రురాలైన అత్తగారు లేనిపోని చాడీలుచెప్పి కుమారునిలో క్రోధాగ్నిని ప్రజ్వలింపచేసింది తల్లీకొడుకులు కదలివచ్చారు గ్రామ పొలిమేరలలో నామసంకీర్తన గావించుచు నడుచుచున్న భక్త సమూహ మును చేరారు నేత్రములు మూసి హృదయమును తెరచి అందు పాండు రంగదేవుని దివ్యరూపమును ప్రతిష్ఠించుకొని పరవశించి గానముచేయుచు నడచుచున్న సక్కూబాయిని చూశారు నీచురాలా భర్తను సేవించుటయే స్త్రీకి పరమ ధర్మము అట్టి భర్త సౌఖ్యాన్ని కాలరాచి బైరాగులతో కలసి భక్తురాలివలె బయలుదేరావా! సిగ్గులేదూ? అంటూ దూషించసాగింది అత్తగారు

అత్తగారూ ఆవేశపడకండి మీరు పెద్దలు బాగా ఆలోచిం చండి సిగ్గుపడి తలవంచాల్సినపని నేనేమీచెయలేదు మన బ్రతుకుకు ఆధా రమైన పాండురంగదేవుని దర్శించాలని ఆశపడటము నేరమా! సకలప్రాణు లకు సతియు గతియు పాండురంగడే భగవానుని విస్మరించి భోగలాలస త్వముతో చరించుటయే మహాపరాధము మీ ఆజ్ఞలేకుండా నేను బయలు

దేరినందుకు క్షమించండి ఆలోచించి అనుగ్రహించి ఆశీర్వదించండి అని ప్రార్థించింది సక్కూబాయి

ఆవేశపూరితురాలైన అత్తగారు ఏమిటి? నాకు ధర్మాన్ని బోధిస్తున్నావా? పెద్దలయెడ గౌరవము భర్తయెడల భక్తిలేని నీవు భక్తిని గూర్చి ధర్మాన్నిగూర్చి ప్రవచిస్తున్నావా? ఇలా వీధుంవెంట బైరాగులతో తిరగడము మాఇంటి ఆచారముకాదు నీవలన మా వంశ ప్రతిష్ట మట్టిపాలవుతున్నది ఇంతకీ నిన్ను అనుకొని ప్రయోజనమేముంది? ఉన్నాడుగా వంశోద్ధారకుడు! భార్యను చక్కదిద్దలేని చవట! అని కుమారుని నిందిస్తూ అతడిలో పౌరషాన్ని రెచ్చగొట్టసాగింది

తల్లిమాటలకు ఆందోళన చెందిన కుమారుడు కోపోద్రిక్తుడై సక్కూబాయి శిరోకేశములను గట్టిగా పట్టుకొని మూర్ఖురాలా! నీకు పెద్దలను గౌరవించాలనే సామాన్య జ్ఞానముకూడా నశించింది నీ అహంకారానికి హద్దులేకుండా పోయింది ఇకమీదట నీవు భక్తిచేయడానికి వీలులేదు వంటపాత్రవలె ఇంటిలో పడియుండవలసిందేగాని భక్తి ముక్తియనేవచ్చి వేషాలు వేశావంటే నిన్ను శాశ్వతంగా ఆ దేవుడిదగ్గరికే పంపుతాను అని పలుకుతూ భార్యను వీధిలో పలువురు గొంమన్నారనే ధ్యాసకూడా లేక నిర్దాక్షిణ్యంగా ఈడుస్తూ ఇంటికి తీసుకొనివచ్చాడు ఇంటికి రాగానే తల్లీ కొడుకులు కలసి సక్కూను ఒక గదిలో స్తంభానికి త్రాటితోకట్టి బంధించారు ఆహారపానీయాదులుకూడా లేకుండాచేశారు

సక్కూబాయి మనస్సంతా మహాత్ములవెంట నడమమన్నది స్తంభానికి బంధించబడిన సక్కూ జీవచ్ఛవమువలె నిశ్చేష్టయై నిలబడి యున్నది విఠలా! విఠలా అని కొంతసేపు గానం చేస్తుంది పండరీకి వెళ్ళలేని తన దౌర్భాగ్యమును తలచి దుఃఖిస్తుంది మరికొంత సేపు విఠల రూపమును తదేకంగా ధ్యానిస్తూ కంటిపై రెప్పవేయక నిలుచుంటుంది అర్ధరాత్రయింది రోజంతా ఆహారంలేదు అధికదాహంతో నోరెండిపోతున్నది విఠలా! విఠలా అంటూ సక్కూ మూల్గుతున్నది పలకరించే దిక్కుకూడా లేకుండా మిగిలింది ఇట్టి విషమ పరిస్థితిలో సక్కూని ఆదుకొని ఓదార్చే

వారెవరు? సక్కూబాయి దీనావస్థ గాంచి దీనదయాళుడైన పాండురంగ భగవానుని హృదయం ద్రవించింది భక్తురాలి నుద్ధరించడానికి పండరీ పురాన్ని వదలి కదిలాడు సక్కూబాయివలె మారువేషం ధరించి ఫల హారమును మంచితీర్థమును చేతియందిడుకొని సక్కూబాయిని బంధించి యున్నగదిలో ప్రత్యక్షమయ్యాడు సక్కూని బంధవిముక్తురాలిని చేశాడు సక్కూ కళ్ళుతెరచి చూసింది అమ్మా! సక్కూ నీరసంగా యున్నావు కాస్త అల్పాహారమును తీసుకో అంటూ తన స్వహస్తాలతో తినిపించాడు సక్కూ వేషములోనున్న భగవానుడు సక్కూ ఊరటపొందింది అర్ధరాత్రివేళ తనకు ఆహార పానియాదులిచ్చి కాపాడిన స్త్రీ ఎవరాయని చూసింది తొలిచూపులోనే ఆశ్చర్యపోయింది అన్నీ తన పోలికలే అమ్మా! నీవూ నాలాగే యున్నావు నీవెవరు? అని సక్కూ ప్రశ్నించింది

అమ్మా! నేను భక్తదాసుని బ్రహ్మోత్సవములో పాల్గొనడానికి పండరీపురము వెళ్తున్నాను మార్గమధ్యంలో నిన్ను గూర్చి కొందరు భక్తులు చెప్పగా విన్నాను నీలాంటి భక్తురాలితో కలసి పండరీయాత్ర చేయాలని సంకల్పించి వచ్చాను అని చెప్పాడు మాయానాటక సూత్రధారి పండరీయాత్రకు వెళ్తున్న భక్తురాలని తెలియగానే సక్కూబాయి ఆమె పాదాలనంటి నమస్కరించింది ఆహా! ఏమి భాగ్యము? వచ్చిన వ్యక్తి పాండురంగడని తెలియకున్నను పాదాలనంటి నమస్కరించగలిగింది సక్కూబాయి సంస్కారవంతులు అజ్ఞాతంగా నడచినా అది జ్ఞానమార్గమయ్యే ఉంటుంది తన పరిస్థితినంతా అతిధికి సవివరంగా తెలియచేసింది సక్కూబాయి అంతయు సావధానంగా విన్న పాండురంగడు "అమ్మా సక్కూ చింతించకు ఆపదలో కలతచెందకూడదు ఉపాయ మాలోచించి బయటపడుట విజ్ఞుల కర్తవ్యము నాకొక చక్కటి ఆలోచన తట్టుచున్నది మనిద్దరి పోలికలు ఒకేలా ఉన్నాయి మనలో శారీరక భేదాన్నెవరూ గుర్తించలేరు నామాట విను నీవు ఇప్పుడే బయలుదేరి వెళ్ళి ప్రక్క గ్రామంలో బసచేసియున్న సాధుబృందముతో కలసి పండరీపురము వెళ్ళు వమ్మ యధావిధిగా ఈ స్తంభమునకు బంధించి వెళ్ళుము నీవు వచ్చునంత

వరకు నేను ఇక్కడే ఉండగలను నేను నీ వలన బ్రహ్మోత్సవములో పాల్గొనలేకపోయితినని నీవు చింతించవలదు నేను ఎప్పుడూ పండరీపుర ములో నివసించేవానను బ్రహ్మోత్సవాలు నాకు క్రొత్త కాదు నా మాట విను అని సక్కూబాయి ఎంతగాకాదని వాదించినను సక్కూను ఒప్పించి సక్కూబాయి స్థాయిలో తాను నిలబడి సక్కూబాయిని పండరీపురము పంపాడు నటన సూత్రధారి సక్కూబాయి నడచివెళ్ళి ప్రక్క గ్రామంలో బసచేసియున్న సాధు సంఘముతో కలసి పండరీశుని దర్శనార్థమై పండరీ పురము చేరింది

పవిత్ర చంద్రభాగా పుణ్యతీర్థంలో గ్రుంకులిడి పాండురంగదేవుని దర్శించింది భగవానుని దివ్యదర్శనంతో తన అంతఃకరణ స్ఫటికమువలె స్వచ్ఛమై భాసించినది నిత్యము చంద్రభాగా తీరములో భక్తజనులు జరుపు నృత్య సంకీర్తనాదులను తిలకిస్తూ గానము చేయుచు పాండురంగ భగవా నుని సేవించుచు ప్రశాంత జీవనమును సక్కూబాయి గడుపసాగింది

సక్కూబాయి గృహములో మాయా సక్కూయై చెలామణియగు చున్న భగవానుని ప్రవర్తన భర్తను అత్తగారిని విస్మయమొందించు చున్నది కొద్ది రోజులలోనే భర్త ప్రేమనుపొంది అత్తగారిని ఆనందింప చేయడం జరిగింది కామోద్రేకమునకు గురియగు భర్త బారినుండి బయట పడుట యొక్కటే అతికష్టమగుచున్నది వాస్తవానికి భగవానుని దృష్టిలో అదియొక కష్టమా? జగన్నాటక సూత్రధారికి నటనలో నాణ్యత అభినయ ములో ఆతురత యుండుటలో ఆశ్చర్యమేమున్నది?

పండరీపురంలో భగవానుని నిత్యారాధనలో తన బ్రతుకును పండిం చుకుంటున్న సక్కూబాయి ఒకనాడు పూజాసుమములను తెచ్చుటకై పుష్ప వనములో ప్రవేశించినది అక్కడ త్రాచుపాము కాటుకు గురియై మరణిం చింది ఆమె భౌతికకాయన్ని చంద్రభాగా తీరానికి తరలించారు ఆమె జాడ ఏమిటో ఉనికి ఎక్కడో భక్త జనానికి అవగతము కాలేదు ఇలా ఆలోచించుచుండగా సక్కూబాయి గ్రామమునకు సంబంధించిన భక్తులు అచ్చటకు అరుదెంచుట జరిగింది వారు సక్కూబాయిని గుర్తించి తెలియ

జేశారు మృతకళేబరమును వారి గ్రామానికి తరలించు అవకాశంలేనందున పవిత్ర చంద్రభాగా తీరంలోనే దహన సంస్కారము చేయటం జరిగింది పరమ పుణ్యక్షేత్రమగు పండరపురమునే సదా మనస్సులో చింతించుచుండిన సక్కూబాయి చివరగ తన దేహాన్ని పండరీపురంలోనే వదలడం జరిగింది సక్కూబాయి శల్యములను చితాభస్మమును తీసుకొని ఆమె గ్రామస్థులు తిరుగు ప్రయాణము సాగించారు సక్కూ అంత్యకాలంలో లేని భర్తకు శల్య చితాభస్మములను అందచేయాలని సంకల్పించారు

విఠలనాథుడు మాయాసక్కూయై సక్కూబాయి గృహాములో గృహ కృత్యములు చేయుచుండ రుక్మిణీదేవి మనస్సు కలత చెందినది భర్త వియోగాన్ని భరించలేని రుక్మిణీదేవి భర్తను సమీపించి స్వామీ! ఏమిటి మీ భక్తివాత్సల్యము? ఇక మీరు పండరీపురము బయలుదేరక తప్పదు మీ దర్శనభాగ్యానికి అశేష భక్త జనులు అలమటిస్తున్నారు" అని తెలియజేసింది స్వామి మందహాసమును చిందిస్తూ దేవీ నేను సత్యస్వరూపుడనని నీకు తెలుసు అసత్య జీవనానికి నేను అలవాటుపడలేను సక్కూ తిరిగి ఇంటికి వచ్చునంతవరకు నేను ఇక్కడ ఉండెదనని ఆమెకు మాట ఇచ్చాను ఇచ్చినమాట ప్రకారము జీవించటం నావిధి ఆమె ఇంకా రాలేదు ఆమె వచ్చునంతవరకు నేను ఇక్కడనుండి కదిలిరాలేను అని తెలియజేశారు అదిదేవా సర్వజ్ఞులైన మీకు తెలియనిదిలేదు సక్కూబాయి గతించినది ఆమె చితాభస్మమును శల్యములను తీసుకొని గ్రామస్థులిచటికి అరుదెంచుచున్నారు ఇక ఆమె ఈ ప్రపంచానికి లేదు మీరు ఈ నాటకాన్ని ముగించి పండరీ క్షేత్రమునకు తరలిరండి అని రుక్మిణీ దేవి ప్రార్థించింది

రుక్మిణీదేవి మాటలు నాలకించిన విఠలనాథుడు దేవీ! నీ ప్రయత్నము సఫలముకాదు ఆమె రానిదే ఈ ఇల్లు విడవను ఒక వేళ ఆమె శాశ్వతముగా రానిచో నేనిక్కడ శాశ్వతముగా యుండి వారికి సేవలుచేయక తప్పదు తన నిశ్చితాభిప్రాయాన్ని దృఢంగా తెలియజేశారు లీలా మానుష విగ్రహులైన పాండురంగ దేవులు

భగవానుని ఒప్పించలేక మెప్పించలేక నిరాశచెందిన రుక్మిణీదేవి పండరీక్షేత్రమును చేరింది చంద్రభాగా తీరములో బ్రహ్మదేవుని దర్శనమును కాంక్షిస్తూ తీవ్రతపసునారంభించింది బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "తల్లి సర్వజనులు నీ దర్శనార్థమై తపములాచరించుచుండ నీవు ప్రత్యేకించి తపము నాచరించుట నన్ను విస్మయమొందించుచున్నది నీ అభీష్టమును తీర్చగలుగు అవకాశము లభించుట నా అదృష్టము తల్లీ ఆజ్ఞాపించుము అని ప్రార్థించెను

రుక్మిణీదేవి దీనవదనురాలై సృష్టికర్తతో జరిగిన వృత్తాంతమంతయు వివరించి చెప్పింది సక్కూబాయి ఆమె గృహములో ప్రవేశించినచో పాండురంగ దేవుని విడుదల సాధ్యం కాదని తెలిపి దుఃఖించింది బ్రహ్మదేవుడు సంతసించి సక్కూబాయిని పునర్జీవింపచేసి రుక్మిణీదేవికి నమస్కరించి అంతర్ధానమయ్యెను సక్కూబాయి చంద్రభాగాలో స్నానమాచరించి విఠలనాథుని దర్శించి తన గ్రామమునకు ప్రయాణము సాగించింది

సక్కూబాయి చితాభస్మమును తీసుకొని వచ్చిన గ్రామస్థులు సక్కూ భర్తకు శల్యములను చితాభస్మమును అప్పగించి విషయము నెరింగించిరి ఆగ్రహోదగ్రుడైన సక్కూ భర్త ఏమిటీ మీ చిత్తచాంచల్యము సక్కూ ననిపోవడమేమిటి? ఆమె మా ఇంటిలోనే యున్నది అని మాయా సక్కూబాయిని పిలిచి చూపించాడు వచ్చిన గ్రామస్థులు దిగ్భ్రాంతిచెందారు తమ చేతులు మీదుగానే దహన సంస్కారము జరిగింది మరి సక్కూబాయి ఇక్కడున్నదేమిటి? వారు ఆలోచించుచుండగనే యాత్రకు వెళ్ళిన సక్కూబాయి లోనికివచ్చి భర్త పాదములకు నమస్కరించింది ఒకేచోట ఇద్దరు సక్కూబాయిలు కన్పించుసరికి అందరు దిగ్భ్రాంతిచెందారు వాస్తవమేమిటియని అందరూ ఏకకంఠంతో ప్రశ్నించారు సక్కూబాయి వినమ్ర వచనములలో "గ్రామస్థులు చెప్పినదే సత్యము నేను గతించిన మాట వాస్తవము రుక్మిణీదేవి తపఃప్రభావముచే బ్రహ్మదేవుడు నన్ను పునర్జీవింపచేశారు" అన్నది మరి ఈవిడ ఎవరు? అందరూ ఒక్కసారి మాయా సక్కూబాయిని దర్శించారు అంతే మాయా సక్కూబాయి మందహాసం

చిందించి అదృశ్యం కావడం జరిగింది సక్కూబాయికి మాత్రము శంఖ చక్ర గదా పద్మాలతో పాండురంగదేవుడు దర్శనమివ్వడము జరిగింది జగన్మోహనుని దివ్యదర్శనమును గాంచి పులకాంకితయైన సక్కూబాయి స్వామి పాదాలపై వాలింది అంతే సక్కూ జీవచైతన్యము పాండురంగని అనంత చైతన్యములో లీనమైనది

మహాభక్తురాలైన సక్కూబాయి భక్తినిగాంచి చూపరులెల్లరు బిగ్గరగా రోదించారు ఆమె పాదాలపై తలనిడి నమస్కరించారు॰ నిరంతరము భగవదాయత చిత్తముతో జీవించు భక్తులు ధన్యజీవులు వారి సాంగత్యము దుర్లభము లభించినను వారిని అర్థము చేసుకొనుట అగమ్యము అర్థం చేసుకోగలిగినచో అమోఘముయని నారద మహర్షి భక్తి సూత్రాలలో ప్రవచించారు

* ఓం శ్రీ జ్ఞానగమ్యాయ నమః *





# జ్ఞాన సంబంద నాయనార్

శైవ సిద్ధాంతమునందు భగవంతుని చేరేందుకు నాలుగు మార్గాలు తెలియజేయబడ్డాయి అవి (1) దాసమార్గము (2) సత్పుత్ర మార్గము (3) సఖ్యమార్గము (4) సన్మార్గము

శైవ సంప్రదాయమునందు గోచరించు మహాభక్తులైన నాయనార్లలో నలుగురు ఆచార్యులు పైనాల్గు మార్గములలో చరించి ఇతరులు అనుసరించి ఆచరించి తరించుటకు ఆదర్శమై నిలిచారు ఆ నలుగురు మహాత్ములను "సమయాచార్యులు అందురు వారు (1) తిరుజ్ఞాన సంబంధ నాయనార్ (2) సుందరమూర్తినాయనార్ (3) అప్పర్ (4) మాణిక్కవాచకర్ ఈ నలుగురు నాయనార్లు పైన సూచించిన నాలుగు మార్గములకు మార్గగాములై నిలిచారు

మొదటిదైన దాసమార్గమునందు చర్య యే ముఖ్య సాధనమై యున్నది చర్యయనగా భగవత్కార్యములందు పరిచర్యచేసి తద్వారా అంతఃకరణ శుద్ధిపొందుట ఆలయ ప్రాంగణమును శుద్ధి చేయుట పూజా ద్రవ్యములను సిద్ధము చేయుట ఉత్సవ సమయాల్లో స్వామి పల్లకీని భక్తితో

మోయుట స్వామి కైంకర్యమున కూఎయోగించు పాత్రలను శుభ్రము చేయుట మొదలుగునవి ఈ సాధన సాధకుని సాలోక్యస్థితికి గొని పోవును

రెండవదియైన సత్పుత్ర మార్గమునందు క్రియయే ముఖ్య సాధనమై యున్నది కుమారుడు తండ్రికి సేవ చేయులాగున భక్తుడు బిడ్డడై భగవంతుని తండ్రిగా భావించి సేవచేయుటయే క్రియ సాధనలో విశేషము అందుచేతనే దీనిని సత్పుత్ర మార్గమని అందురు ఈ సాధన సాధకుని సామీప్య స్థితికి గొనిపోవును

మూడవదియైన సఖ్యమార్గమునందు యోగమే ప్రధాన సాధనమై యున్నది ధ్యానపూరిత జీవనము అంతర్ముఖానుభూతియే యోగ సాధనలో విశేషము ఈ సాధన సాధకుని సారూప్య స్థితికి గొనిపోవును

నాల్గవదియైన సన్మార్గమునందు జ్ఞానమే ముఖ్య సాధనమై యున్నది సత్పదార్థ నిర్ణయముతో చిత్సేవలో నడచి ఆనందధామము చేరుటయే జ్ఞాన సాధనలో విశేషము అందుచేత దీనిని సన్మార్గ మని అందురు ఈ సాధన సాధకుని సాయుజ్య స్థితికి గొనిపోవును

సమయాచార్యులైన నలుగురు మహాత్ములు ఈ నాలుగు పంథాలు నాచరించి చూపారు ఇందులో ప్రస్తుతము మన కథానాయకులైన జ్ఞాన సంబంధ నాయనార్ రెండవదియైన సత్పుత్ర మార్గమును ప్రతిపాదించారు ప్రవర్తించారు ప్రపంచిచారు ప్రసాదించారు

తంజావూరు మండలమున శీర్గాలి అను గ్రామమున సంబంధులు వారు జన్మించిరి శీర్గాలి పురమును బ్రహ్మపురమనికూడా పిలిచెదరు ఆ గ్రామమున శివభక్తులు భక్తజన సేవాపరాయణులైన శివపాదహృదయన్ భగవతి అను బ్రాహ్మణ పుణ్యదంపతులకు సంబంధులవారు జన్మించిరి అనేక వ్రతముల నాచరించుటచే కలుగుట వలన సంబంధుల వారిని అతి గారాబముగా తల్లిదండ్రులు పెంచసాగిరి

ఒకనాడొక విచిత్ర సంఘటన జరిగెను తండ్రియైన శివపాదహృదయుడు మూడు సంవత్సరముల బాలుడైన కుమారుని ఎత్తుకొని శివాలయము ప్రక్కనున్న తటాకములో స్నానమాచరించుటకు వెళ్ళెను కుమారుడైన

సంబంధులవారిని తటాకపుమెట్లపై కూర్చుండబెట్టి స్నానం చేయుటకు తాను తటాకములో దిగెను సంబంధులవారికి ఆకలి ఎక్కువాయెను వెంటనే సంబంధులవారు తటాకము ప్రక్కనేయున్న శివాలయ గాలిగోపుర శిఖర మునుగాంచి అమ్మా నాన్నా అని ఏడ్వసాగెను కారణజన్ములైన సంబంధులవారి దుఃఖమునుచూచి పార్వతీపరమేశ్వర్లు వృషభ వాహనారూఢులై సంబంధులవారి చెంతకరుదెంచిరి సంబంధులవారిని బుజ్జగించి లాలించిరి పార్వతీదేవి ఒక బంగారు పళ్ళెరములో తన చనుబాలు పట్టి సంబంధులవారి కొసంగెను జగజ్జనని అందించిన క్షీరమును పానముచేయగనే సంబంధులవారిలో జ్ఞానముదయించినది పార్వతీ పరమేశ్వర్లు అంతర్ధానముకాగా శివపాదుడు స్నానాదులు ముగించుకొనివచ్చి కుమారుని గాంచెను సంబంధులవారి నోటినుండి పాలచుక్కలు కారుటచూచి ఏమి! సంబంధునికి ఎవరో పాలివ్వడము జరిగినది అన్య స్త్రీలనుండి క్షీరపానము చేసి సంబంధులవారు మలినమయ్యారని భావించిన తండ్రి శివపాదుడు కుమారా! నీకు పాలిచ్చిందెవరో నిజము చెప్పుము అని గద్దించెను వెంటనే సంబంధులవారు గోపురశిఖరమును చూపెను అపరిపక్వ అంతఃకరణ గల శివపాదునికి ఏమియు గోచరించలేదు సంబంధులవారికి శివుడు అర్ధనారీశ్వర రూపములో దర్శన మొసంగుచుండ పులకాంకితులైన సంబంధులవారు చంద్రశేఖరుని స్తుతిస్తూ ద్రవిడ భాషలో ఒక వృత్తమును ఆశువుగా గానం చేశారు తన కుమారునికి జ్ఞానోదయమైనదని సంబంధులవారు శివానుగ్రహమునకు పాత్రులైనారని గ్రహించిన శివపాదుడు తన కుమారుని భుజముపై నెక్కించుకొని శివదర్శనమునకు ఆలయములోకి ప్రవేశించెను తటాకమువద్ద వృత్తమును గానము చేయుటకుపక్రమించిన సంబంధులవారు ఆలయములో పదివృత్తములను పూర్తిచేసెను పదివృత్తములను గలిపి పత్తిగమ్ అందురు సంబంధులవారు తన తొలిపత్తిగమును ఆలయములోనే పూర్తి చేసిరి సంబంధులవారి ఆధ్యాత్మికానుభూతిని గూర్చిన వార్త వెంటనే గ్రామములో వ్యాపించగా భక్తులు తండోపతండాలుగా అరుదెంచి సంబంధులవారిని దర్శించిరి శివపాదుడు సంబంధులవారిని భుజముపై నెక్కించుకొని గృహమున కేగెను ఆనాటి నుండి సంబంధులవారిని తిరుజ్ఞాన సంబంధులు అని పిలిచెడివారు పార్వతీదేవి

యొసంగిన క్షీరమును పానము చేయుటచే జ్ఞానవంతులైనందున "జ్ఞాన సంబంధార్" అయిరి అనాటికి సంబంధులవారి వయస్సు మూడు సంవత్సరములు గాన తిరుజ్ఞాన సంబంధార్ ఆయిరి తిరుజ్ఞాన సంబంధునగా మూడవయేటనే జ్ఞానమును పొందిన సంబంధులు అని అర్థము వారికి "ఆలు ఢయ ఎలైయార్" అను పేరు కూడా ఎర్పడింది ఆలు ఢయ పిలైయార్ అవగా రక్షించబడిన పుత్రుడని భావము

శివదర్శనముతో సంబంధులవారిలో శుభప్రదమగు కవిత్వము కదల సాగింది తీర్థక్షేత్రములను దర్శించవలయుననెడి కుతూహలము సంబంధుల వారిలో జనించింది చిఱుతప్రాయమైన సంబంధులవారు ఒంటరిగా వెళ్ళ లేరు గనుక తండ్రి శివపాదుడు కుమారుని భుజముపై కూర్చుండబెట్టు కొని తీర్థక్షేత్ర సందర్శనానికి బయలుదేరెను

మొదట తిరుక్కొలక్కా" అను పుణ్యక్షేత్రముచేరి స్నానాదులా చరించి శివదర్శనమునకై ఆలయములో ప్రవేశించిరి సంబంధులవారు మృదువైన హస్తములతో తాళము వేయుచు శివునిగూర్చి కీర్తించసాగిరి సంబంధులవారి గానము నాలకించి భక్తులు తన్మయత్వము చెందిరి ఇంతలో ఒక అద్భుత మహిమ జరిగింది చిన్నారిసంబంధులు తన కోమలమైన కరములతో తాళము వేయుచుండ ఆ సుకుమార కరములు కమలి పోవునని గ్రహించిన పరమశివుడు సంబంధులవారి హస్తములలో బంగారు తాళద్వయము నుంచెను ఆ తాళములపై ఓం నమశ్శివాయ" అను అక్షరములు లిఖించబడియుండెను తన గానమునకు అనుకూలముగా తాళము వేయుటకు పరమశివుడనుగ్రహించిన స్వర్ణతాళములను భగవత్స్వరూపముగా భావించిన సంబంధులవారు భక్తితో ఆ తాళద్వయమును శిరమున ధరించారు. తిరునీలకంఠ యజపనార్ అను వీణావిద్వాంసుడైన భక్తుడు సంబంధులవారి వైభవమునుగాంచి పరవశుడై సంబంధులవారి పాదములకు నమస్కరించి వారుగానముచేయు పత్తికము లకు అనువుగా వీణ వాయించు అవకాశమును కల్పించమని ప్రార్థించి అనుమతి పొందెను ఆనాటినుండి యజపనారు భార్యాసమేతుడై సంబంధులవారి ననుసరించి పయ

నీస్తూ వారి కీర్తనలను వీణపై వాయించుచుండెడివాడు తిరొక్కలక్క అలయములో బంగారు తాళములను మహేశ్వరుడు సంబంధులవారి కొసం గినవార్త దేశంనలుమూలలా వ్యాపించింది సంబంధులవారి యశస్సును భక్తులందరు కొనియాడసాగిరి తనద్వారా ఏ మహిమ వ్యక్తమైనను అదంతయు పరమేశ్వరుని ప్రసాదమే యని సంబంధులవారు భావించి ప్రకటించేవారు

జ్ఞానసంబంధులవారు అక్కడ నుండి బయలుదేరి చిదంబర క్షేత్ర మును దర్శించిరి నటరాజస్వామి ఆలయములో మూడువేలమంది దీక్షితులు శివగణములై నటరాజస్వామిని కీర్తించు అద్భుత దృశ్యమును సంబంధుల వారు దర్శించిరి తిరుపరత్తురై గ్రామ పొలిమేరలకు రాగానే భక్తజనులు పరమశివుని ఆలయములోని ముత్యాల పల్లకిని తీసుకొని సంబంధులవారిని ఆహ్వానించుట కరుదెంచిరి మహేశ్వరుడు తమకు స్వప్నదర్శనమిచ్చి తన అనుంగు పుత్రుడగు తిరుజ్ఞాన సంబంధులవారు తిరువరత్తురై పురమునకు వచ్చుచున్నారనియు వారిని ముత్యాల పల్లకిలో ఊరేగించుచు గ్రామము లోనికి తీసుకొని రావలయుననియు తెలియజేయుటచే వారుముందుగా గ్రామ పొలిమేరలో వేచియుండుట జరిగినదనియు తెలియజేసిరి తిరుజ్ఞానిసంబం ధులవారిని ముత్యాల పల్లకిలో ఊరేగించుచు ఆలయములోనికి తీసుకొనిపో యిరి ఈ సంఘటనతో జ్ఞానసంబంధులవారు ఆచార్యపీఠము నధిరోహించి రని సర్వులు అంగీకరించి ఆశ్రితులైరి తిరువరత్తురై నుండి చండీశ్వర నాయనార్ జన్మస్థలమైన తిరుచ్చైనాలూర్ తిరుక్కడంబై మొదలగు క్షేత్రములను దర్శించిరి ఏ గ్రామమున కేగినను జ్ఞానసంబంధులవారినిరాజ మర్యాదలతో ఆహ్వానించి గౌరవించసాగిరి తిరుచ్చైనాలూర్ మహాభక్తు లైన చండీశ్వర నాయనార్‌ను గూర్చి సంబంధులవారు స్తుతించిరి యాత్ర ముగించుకొని సంబంధులవారు తన తండ్రియు భక్తసమూహమును వెంట రాగా స్వస్థలమైన శీర్కాలి చేరిరి అచ్చట భక్తులు పురజనులు జ్ఞానసం బంధులవారి మాతృదేవిలో కలసి బాలగురుదేవుని ఆహ్వానించి అర్చించు కొని ఆనందించిరి

ఎనిమిదవఏట సంబంధుల వారికి ఉపనయన సంస్కారము గావిం చిరి యథార్థానికి వారికి అలాంటి శిక్షణము అవసరములేదు పుట్టుకతోనే జ్ఞానియై జన్మించిన సంబంధులవారు బ్రహ్మచర్యాది సద్గుణముల నలవరచు కొన నవసరములేదు గురువుల యొద్దనుండి మంత్రదీక్షను స్వీకరించ పని లేదు శాస్త్రజ్ఞానమును సముపార్జించవలసిన అగత్యములేదు అందుచేతనే ఉపనయన సంస్కారమునందు పాల్గొనిన పురోహితులు గురువుల సంబం ధులవారి నుండియే జ్ఞానమును ఒడసి సంతృప్తి చెందిరి

సమయాచార్యులలో ఒకరైన తిరునావుక్కరుసు నయినార్ (అప్పర్) తో సంబంధులవారి కలయిక అపూర్వమైనది సంబంధులవారి మహిమా విశేషములను గురించి వినిన తిరునావుక్కరుసు బాలగురువును దర్శింపనుద్దేశ్యముతో శీర్కాలికి వచ్చిరి పెద్దవారైన తిరునావుక్కరుసు తన దర్శనార్థము శీర్కాలికి అరుదెంచుచున్నారనెడి వార్త చెవిని పడగానే సంబంధులవారు భక్తులు వెంటనడువగా ఎదురేగి వారి నాహ్వానించుచు అప్పా! అని పిలిచిరి ఆనాటినుండి తిరునావుక్కరుసు నాయనార్ ను అప్పర్ అని పిలిచెడివారు ఒకరినొకరు ఆలింగనం చేసుకొనిరి అప్పర్ ను తన గృహమునకు తీసుకొనివచ్చి సంబంధులవారు గౌరవించి పూజించిరి

సంబంధులవారు మహిమాన్వితులైన అప్పర్ తో కలసి తీర్థయాత్ర చేయుటకు బయలుదేరారు అనేక పుణ్యక్షేత్రములు దర్శించారు వేదారణ్య పురంలో ఒక విచిత్ర సంఘటన జరిగినది వేదారణ్యేశ్వరస్వామిని దర్శించ వలయునని అప్పర్ సంబంధులవారు భక్తులతో కలసి ఆలయంలో ప్రవే శించారు గర్భాలయ ద్వారము మూతబడివుంది క్రొత్తగా ఏర్పాటు చేసిన నూతన ద్వారముగుండా భక్తులు దర్శనార్థము వెళ్ళుట జరుగుచున్నది ముఖ్య ముఖద్వారము మూతవేయబడి నూతన ద్వారముద్వారా వెళ్ళుటకు గల కారణమును గూర్చి సంబంధులవారు ప్రశ్నించారు వేదారణ్యేశ్వర స్వామికి గతములో పూజచేయు అర్చకులు సర్వదోషముతో వేదము నుచ్చ రించుటచేత తత్ఫలితముగా ప్రధానద్వారము మూతపడినదనియు మరొక పరిష్కారము లేనందున భగవద్దర్శనార్థమై తపిస్తూ అరుదెంచు భక్తులు నూతన ద్వారమును ఏర్పాటుచేయుట జరిగినదనియు తెలిపిరి నూతన

ద్వారము గుండా ప్రవేశించుటకు సంబంధులవారికి కష్టమైనది. సంబంధులవారు అప్పర్‌ని ప్రార్థించిరి. వెంటనే అప్పర్ నాయనార్ వేదారణ్యేశ్వరుని స్తుతిస్తూ ఒక పత్రికమును గానం చేసిరి. పత్రికము పూర్తి కాగానే ప్రధాన ద్వారము అప్రయత్నముగా తెరువబడినది. భక్తుల మనోభీష్టమును భగవానుడు త్రోసిపుచ్చునా ?

అనేక పుణ్యక్షేత్రములను దర్శించుచు సంబంధులవారు "తిరుప్పాచ్చిలాశ్రమము" అను పురమున కాలిడిరి. ఆ రాజ్యమును పరిపాలించు కొల్లిమాలవన్ అను రాజు సంబంధులవారి రాకనెరింగి అరుదెంచి స్వాముల పాదములపై బడి విలపించెను. రాజుగారి విలాపమునకు కారణమును తెలియజేయమని సంబంధులవారు ప్రశ్నించిరి. అంతట ఆ రాజు తాను శివభక్తుడననియు అనేక వ్రత దాన తప ఫలితముగ తనకొక కుమార్తె కల్గినదనియు దురదృష్టవశాత్తు యుక్తవయస్కురాలైన ఆ బాలికను పిశాచము పట్టి ఎడిపించుచున్నదనియు దేహమంతయు మండుచున్నట్లు ఆ బాలిక వ్యథ చెందుననియు వైద్యములన్నియు విఫలమగుటచే మరొక మార్గము గోచరించక ఆ బాలికను శివసన్నిధిలో పడవేయుట జరిగినదనియు అద్భుత మహామాన్వితులైన జ్ఞానసంబంధులవారు ఆ అమ్మాయిని అనుగ్రహించి ఆశీర్వదించి ఆరోగ్యవంతురాలుగ చేయవలెననియు అభ్యర్థించిరి. సంబంధులవారు చిరునవ్వును చిందిస్తూ ఆ బాలిక క్రిందపడి రోదించుచున్న శివాలయములో ప్రవేశించి ఆ పడుచు దైన్యస్థితినిగాంచి కలతచెందిరి. వెంటనే పరమశివుని స్తుతిస్తూ సంబంధులవారు ఒక పత్రికమును గానం చేసిరి. సంబంధులవారి దైవస్తుతి పూర్తి కాగానే రాజపుత్రిక ఆరోగ్యవంతురాలై నవ్వుతూ లేచి స్వాములవారి పాదములకు నమస్కరించినది.

సంబంధులవారు అచ్చట నుండి బయలుదేరి కొంగు రాష్ట్రమున ప్రవేశించెను. శీతాకాలమగుటచే భయంకరమైన విషజ్వరమొకటి ఆ ప్రాంతమును వ్యాపించెను. అనేకమంది మృత్యుముఖంలో ప్రవేశించిరి. మహాత్ములైన సంబంధులవారు తమ రాష్ట్రములో అడుగుపెట్టుట మహద్భాగ్యమని భావించిన ప్రజలు ఉన్నపళంగా స్వామిచెంతకు పరుగెత్తుకుంటూ వచ్చి వారి బాధను వివరించిరి. కరుణామూర్తులైన సంబంధులవారి

హృదయము ద్రవించెను కాలకూట విషమును మ్రింగి నీలకంఠుడైన భావంమ పరమేశ్వరుడు భక్త సంరక్షణార్థమై ఈ విష జ్వరమును అదృశ్యము చేయరేడా? అని ఆతురుగా ఒక పత్రికమును గానముచేశారు బిడ్డ ఆర్తనాదాన్ని విని తల్లి పరుగెత్తునట్లు సంబంధులవారి ప్రార్థన నాలకించిన మహేశ్వరుడు ఆ ప్రాంతములో వ్యాపించియున్న విషజ్వరమును అదృశ్యం చేశారు

సంబంధులవారివెంట యాత్ర సాగించుమన్న తండ్రి శివపాదుడు శీర్కాళీచేరి యజ్ఞము నిర్వహించవలసిన సమయము సమీపించెను శీర్కాళీలో యజ్ఞ నిర్వహణకు తాను వెళ్ళవలయుననియు అయితే యజ్ఞమును నిర్వహించుటకు వలయు ధనము తనవద్ద లేదనియు కుమారుడైన సంబంధులవారికి తెలియజేయుచు చింతించెను తండ్రి ఆవేదననుగాంచలేని జ్ఞాన సంబధులు పరమశివుని స్తుతించుచు పత్రికమును చెప్పరి

"ధనప్రీతిలేదు ఘనకీర్తియు వలదు
నీదు చరణ భజనె నాకు చాలు
పుణ్యాకార్యములకు పాపనాత్ముల కొరకు
యాచించెద నిన్ను ఆర్తితోడ"

అని సంబంధులవారు గానము చేయగానే చంద్రశేఖరుడు వేయి బంగారు నాణెముల నందించి అనుగ్రహించెను యజ్ఞ నిర్వహణకై తన తండ్రికి ఆ బంగారు నాణెములను సంబంధులవారు సమర్పించెను

జ్ఞాన సంబంధులవారు అక్కడనుండి భక్త సమూహముతో గూడి తిరుమగలమను గ్రామము చేరిరి శివాలయమునకు అరుదెంచుచుండ మార్గ మధ్యమున దృశ్యమునుగాంచి సంబంధులు ఆగిపోయిరి యువకుడైన ఒక వైశ్యుడు చచ్చిపడియుండ అతని శవము ప్రక్కనబడి బోరున ఎడ్చుచున్న యువతిని గాంచెను సంబంధులవారిని చూడగనే ఆ యువతి స్వామి పాదాలపైబడి మహానుభావా! కరుణించుము ఈతడు నా భర్త మేము నూతన దంపతులము తీర్థయాత్రలు చేయుచు వచ్చుచుండగ ఇచ్చట నా భర్తను త్రాచుపాము కాటు వేసినది వికసించిన మరుక్షణమే పుష్పము

నేలలాలినట్లు గృహస్థ జీవనములో ప్రవేశించగానే భర్త వియోగము నను భవింపవలసిన దుర్గతి నాకు కలిగినది నా భర్తను వీడి నేను జీవించలేను నేనూ మరణింపునట్లు ఆశీర్వదించండి అని దుఃఖించెను దీనశరణ్యులైన జ్ఞానసంబంధులవారు విలపించవలదని ఆమెను ఓదార్చి మృత్యుంజయుని వినుతింపుచు పత్రికమును గానము చేసెను మృతిచెందిన కోమటి యువకుడు లేచి కూర్చొనెను దంపతులిరువురు సంబంధులవారి పాదములపై పడిరి నాయనారు వారిని ఆశీర్వదించి మంత్రోపదేశము గావించి అక్కడ నుండి బయలుదేరెను

జ్ఞానసంబంధులవారు అప్పర్ నాయనార్‌తో కలిసి యాత్రసాగిస్తూ మార్గమున తిరునీలకంఠ నాయనార్ శిరుతొండ నాయనార్ మురుగ నాయనార్ కుంగిలియక్కలయ నాయనార్ మొదలగు మహాత్ములను దర్శించి భాషించెను వారి ఆతిథ్యమును స్వీకరించెను

జ్ఞాన సంబంధ నాయనార్ జీవితములో పాండ్య రాజ్యములోని మధురై యాత్ర చాలా ప్రశస్తమైనది విశేషమైనది శివభక్తిని పునర్జీవింప చేయుటలో కీలకమైన పాత్రను మధురలోనే సంబంధులవారు వహించడం జరిగింది ఆ కాలములో కూన్ పాండ్య అను పాండ్యరాజు పరిపాలించుచుండెను మధురై అంతయు జైనమతస్థుల హస్తగతమై యుండెను తాంత్రిక శక్తుల నుపయోగించి రాజుగారైన కూన్‌పాండ్య ను జైనమతములో కలుపుకొనిరి యధారాజ తథాప్రజ అని రాజు ననుసరించి ప్రజలు కూడా ఎక్కువ శాతము జైనమతములో కలిసిపోయారు రాజుగారి భార్యయైన మంగైయర్కరశి ప్రధానమంత్రియైన కులచ్చిరై నయనారు ను జైనమతమును స్వీకరించక శివభక్తితోనే జీవించసాగిరి జైనమత ప్రాబల్యము తగ్గి శైవ సిద్ధాంతమును పునర్నిర్మాణము చేయుటకు తీవ్రముగా ఆలోచించసాగిరి ఆ సమయానికి కారణజన్ములైన జ్ఞాన సంబంధులు అప్పర్ ప్రక్క గ్రామమునకు వచ్చియుండిరని తెలిసింది రాణిగారు ప్రధానమంత్రి కలిసి ఆలోచించిరి జైనుల వలన పాండ్యరాజ్యమునకు సంప్రాప్తించిన దైన్యస్థితిని ఎరుకపరుస్తూ మహాత్ములైన జ్ఞాన సంబంధులవారు వచ్చి శివభక్తిని ప్రజలలో ప్రచారము గావించి తరింప

చేయవలయునని తమ ప్రార్థనను అధికారుల ద్వారా విన్నవించుకొనిరి జ్ఞాన సంబంధులవారు వారి ప్రార్థనను అంగీకరించిరి అప్పర్ నాయనార్ తన అసమ్మతిని తెలియజేస్తూ జైనులు హానిచేయు స్వభావము కలవారై ఉన్నారనియు సంబంధులవారు మధురైకి వెళ్ళుట సముచితము కాదనియు తెలిపిరి అదియునుగాక సంబంధులవారికి ఆ సమయాన గ్రహబలము కూడా క్షీణించియుండుట గమనార్హమని తెలియజేసిరి

జ్ఞానసంబంధులవారు అప్పర్‌వారికి నమస్కరిస్తూ వ మహామ వర్ణనాతీతమనియు శివభక్తులను గ్రహాదోషములు అంటవనియు తెలిపి వెంటనే అతిముఖ్యమైన కోళరుపత్తిక మను వృత్తమును అతువుగా గానము చేసెను

భయమేల! భయమేల భక్తజనులకు
భవభయహారుడై బాంధవుడైయుండ ॥భయ॥
నళినీదళాక్షుడు నీలకంఠుడు

నాగాభరణుడు నటన సుందరుడు
సురనాథుడు సువిశాల హృదయుడు
నందివాహనుడు తోడై యుండగ ॥భయ॥

ఫాలలోచనుడు పరమేశ్వరుడు
చంద్రశేఖరుడు గంగాధరుడు
మార్కండేయుని బ్రోచిన శివుడు
అండగ నిండుగ తోడై యుండగ ॥భయ॥

జ్ఞానసంబంధులవారు ఇక వినరని గ్రహించిన అప్పర్ భయకంపిత మనస్కులై సంబంధులవారికంటె ముందుగనే మధురై చేరవలెనని సంకల్పించిరి అది గ్రహించిన సంబంధులవారు వలదని అప్పర్‌కు నచ్చచెప్పి వారిని చోళరాజ్యమునవే ఉండుమని ప్రార్థించి తాను మధురై చేరెను

సంబంధులవారు మధురై పొలిమేరలకు చేరుకోగానే ప్రధానమంత్రి యగు కులచ్చిరై నాయనారు భక్తసమూహముతో ఎదురుగావచ్చి స్వామిని పూర్ణకుంభంతో ఆహ్వానించిరి సంబంధులవారిని శివాలయమునకు తీసుకొని

వెళ్ళి దర్శనము చేయించిరి సంబంధులవారు ఆలయప్రాంగణములో ఉండ గనే రాణిగారువచ్చి స్వామి పాదపద్మములనంటి నమస్కరించెను అక్కడనుండి రాజమర్యాదలతో జ్ఞానసంబంధులవారిని అతిథిగృహమునకు తోడ్కొని వచ్చిరి

జ్ఞానసంబంధులవారు మదురైవచ్చినారనెడి వార్త జైనులకు తెలిసింది వారు పాండ్యరాజుతో కలిసి సంప్రదించారు జ్ఞానసంబంధుల వారిని మట్టుపెట్టాలని కుట్రపన్నారు సంబంధులవారు విశ్రాంతి తీసుకొనుచున్న అతిథిగృహమునకు నిప్పంటించారు గృహము దహించబడుచుండ సంబంధులవారి భక్తబృందము ఆ దృశ్యమునుగాంచి అగ్నిని ఆర్పివేసిరి జరిగిన వృత్తాంతమంతయు సంబంధులవారికి తెలియజేసిరి జ్ఞాన నేత్రముతో స్వాములవారు ఈ చర్య వెనుకయున్న కుట్రను గ్రహించారు వెంటనే లయకారకుడైన రుద్రదేవుని ప్రార్థించుచు పత్తికమును గానం చేశారు అంతే రాజుగారి దేహమంతయు మండుచుండెను తన శరీరములో కలిగిన మంటలను భరించలేక రాజు దుఃఖించసాగెను జైన వైద్యులు వచ్చి పరీక్షించిరి ఔషధములు వాడిరి అయినను నయముకాలేదు జైనగురువులు పరిశీలించి మంత్రప్రయోగముచేసిరి అయినను మంటలు తగ్గలేదు ప్రధానమంత్రి రాణిగారు కలుగజేసుకొని మహాత్ములైన జ్ఞానసంబంధులవారు మదురై విచ్చేసియున్నారనియు ఆ మహాత్ముని దయచే నయము కావచ్చుననియు తెలిపిరి సంబంధులవారిపేరు చెవినిపడగానే రాజుగారికో ఆశాకుసుమాలు విరబూసినవి సంబంధులవారిని ఆహ్వానించమని తెలియజేసిరి ఈ విషయము నెరింగిన జైనులు సంబంధులవారిని పరీక్షించుటకు చక్కటి అవకాశము లభించినదని సంతసించిరి

జ్ఞానసంబంధులవారు విచ్చేసిరి రాజుగారు సంబంధులవారి పాదములంటి నమస్కరించిరి ఆ దృశ్యమునుగాంచి జైన గురువులు కోపోద్రిక్తులైరి సంబంధులవారు రాజుగారికి చికిత్సచేయ నారభించగానే జైన గురువులు అభ్యంతరము తెలిపిరి తమ వైభవము ఎదుట సంబంధులు తృణసమానమని పలుకసాగిరి అంతట ప్రధానమంత్రి కల్పించుకొని అవసర ప్రసంగాలతో కాలయాపనచేయుట సబబుకాదనియు రాజుగారిబాధను

తొలగింపుటయె ప్రధానమనియు తెలిపి రాజుగారి శరీర కుడిభాగమును సంబంధులవారు ఎడమ భాగమును జైనగురువులు బాగుచేయవలెనని తెలియజేసిరి అందులకు జైనగురువులు సమ్మతించిరి చికిత్స ప్రారంభించ బడెను సంబంధులవారు చికిత్సచేయు కుడిభాగము ఆరోగ్యప్రదమయ్యెను జైనగురువులు చికిత్సచేయు ఎడమభాగమున బాధ అధికమయ్యెను ఈ అద్భుతమునుగాంచి పలువురు జ్ఞానసంబంధులవారిని స్తుతించిరి జైన గురువుల ఓటమిని గుర్తించిన పాండ్యరాజు సంబంధులవారిని శరణు జొచ్చి ఎడమ భాగమునుకూడా బాగుచేయమని ప్రార్థించగా సంబంధుల వారు తిన అమృతహస్తముతో రాజుగారి ఎడమ పార్శ్వమును స్పృశించ గానే మంటలు అదృశ్యమయ్యెను రాజుగారు ఆరోగ్యవంతుడయ్యెను జైనగురువులు సిగ్గుతో తలవంచిరి

జైనగురువులు ఓటమి నంగీకరించలేదు సంబంధులవారిపై మరల పోటీని ప్రకటించారు పోటీవిధానము నిర్ణయించు విధము జైనగురువులు తమదేయని తెలిపిరి దైవాంశ సంభూతులగు సంబంధులవారు అన్నిటికి సరేయనిరి జైనగురువులు మొదటి పోటీని తెలియజేశారు సంబంధుల వారు తాను విశ్వసించు శైవసిద్ధాంత సారమును ఒక తాళపత్రములో వ్రాయ వలెననియు అలాగే జైనగురువులు తాము విశ్వసించు సిద్ధాంతమును వేరొక తాళపత్రముపై లిఖించుదురనియు రెండింటిని అగ్నిలో వేయగా ఏతాళపత్రము కాలిపోకుండా మిగులునో వారిసిద్ధాంతము సత్యసిద్ధాంతమని నిర్ణయించవలసి వుంటుందని తెలిపారు సంబంధులవారు పోటీకి అంగీక రించారు పోటీ నిర్వహించడము జరిగింది జైనులు వ్రాసిన తాళపత్రము మసియై అదృశ్యముకాగా సంబంధులవారు వ్రాసిన తాళపత్రము చెక్కుచెద రక నిలచియుండెను జైనగురువులు ఓటమిని అంగీకరించవలయునని ప్రధానమంత్రి తెలియజేశారు కానీ జైనగురువులందులకు అంగీకరించ లేదు అంతిమపోటీ నిర్వహించవలసిన అవసరమున్నదని వెలిబుచ్చారు సౌమ్యులైన సంబంధులవారు అందులకుకూడా అంగీకరించారు

జైనగురువులు అంతిమ పరీక్ష ప్రక్రియను తెలియజేశారు జైను లువారి మత సిద్ధాంతమును ఒక తాళపత్రముపై వ్రాయుదురనియు సంబం

ధులవారు తన శైవసిద్ధాంతమును మరియొక తాళపత్రముపై వ్రాయవలె ననియు మునుపటి పరీక్షవలె అగ్నియందు పడవేయక వైఘనదిలో పడ వేయుట జరుగుతుందనియు తెలిపిరి ఎవరి తాళపత్రము ప్రవాహములో కొట్టుకపోవునో అది అధమ మతమనియు ఎవరి తాళపత్రము ఏటికి ఏదు రీదునో అది ఉత్తమ మతమనియు తెలిపిరి సంబంధులవారు అందులకంగీ కరించిరి పోటీ నిర్వహించబడినది జైనులు నదిలో విడిచిన తాళపత్రము ప్రవాహముతో నడచివెళ్ళగా సంబంధులవారు వదలిన తాళపత్రము ఏటికి ఎదురీదసాగెను స్వాములవారు చేతితో పట్టుకొని ఆఎనంతరవకు పయ్య నిండమనే యుండెను జ్ఞానసంబందువారి వైభవమును తిలకించి రాజు జైనమతమునువీడి శైవమతమును స్వీకరించెను రాజు ననుసరించి ప్రజ లందరు శైవమతములో ప్రవేశించిరి సూర్యోదయముకాగానే నక్షత్రము లదృశ్యమగునట్లు జ్ఞానసంబంధులవారి ప్రజ్ఞాపకాశము ముందు జైనగురు వులు ఆకసమున నక్షత్రాలు మాయమగునట్లు అదృశ్యమైరి

జ్ఞానసంబంధులవారు మదురైనుండి ప్రయాణము సాగింప సమ యమునకు సంబంధులవారి తండ్రియైన శివపాదుడు యజ్ఞము సంపూర్తి చేసుకొనివచ్చి పాండ్యరాజ్యములో కుమారుని వైభవమునుగాంచి సంతసిం చెను సంబంధులవారు తన తండ్రితో భక్తజనులతో కలసి అప్పర్ వారిని కలుసుకొనుటకు తిరుప్పూంతురుత్తి గ్రామమునకు బయలుదేరారు తిరు ప్పూంతురుత్తి గ్రామ పొలిమేరలకు నేరగానే అప్పర్ వారు ఎచ్చట నున్నారు? అని సంబంధులవారు పల్లకిపై ఆసీనులై వాకబుచేసిరి అంతకు పూర్వమే ఎవ్వరికి తెలియకుండా మారువేషములో అరుదెంచి సంబంధులవారి పల్లకీని మోయుచున్న అప్పర్ నాయనారు ముందుకువచ్చి మహాత్మా! ఇదిగో! ఇక్కడే యున్నాను తమ పల్లకీని మోయుచు నా జన్మను చరితార్థము చేసుకొనుచున్నాను అని పలికిరి అప్పర్ వాక్కులు వినగానే కంపించిన దేహముతో సంబంధులవారు పల్లకీదిగి అప్పర్ వారి చరణకమలములపైబడి "అప్పా! ఎంతపని చేసితిరి సంబంధుడు మీ సేవ కుడని మరచితిరా? అని నేత్రములవెంట కన్నీరుకారుచుండ చేతులు జోడించి నమస్కరించెను అప్పర్ తిరుగి సంబంధుల పాదములు తాకి

సంబంధా। నీ మధురై విజయము అద్వితీయము అద్భుతము అ ప్రతించిరి జ్ఞానసంబంధులవారు అప్పర్‌తో కలిసి సీర్కాలి చేరిరి

సంబంధులవారు ఈ పర్యాయము ఎక్కువకాలము శీర్కాలిలో యుండలేదు కొలది దినములలోనే మరల యాత్ర ప్రారంభించారు ఈసారి తిరువణ్ణామలై దర్శించారు తిరువణ్ణామలై నుండి శ్రీకాళహస్తి కరుదెంచి కన్నప్ప నాయనార్ విగ్రహమువద్ద పూజలు జరిపారు శ్రీకాళహస్తినుండి తిరువలంగాడు చేరారు అచ్చట శివాలయములో కారైక్కాల్ అమ్మాయార్ అను శివభక్తురాలు తన శిరస్సుతోనే నడిచిన వృత్తాంతము సంబంధులవారికి తెలియుటచే సంబంధులవారు ఆలయములో ప్రవేశించక బయటనిలబడె పత్రికము గానముచేసెను అచ్చటనుండి బయలుదేరి తిరువత్తియూర్‌చేరి అక్కడనుండి మైలాపూర్ చేరెను

మైలాపూర్‌లో "శివనేశార్ అను వర్తకుడు కలడు అతడు సంబంధులవారిని ఆహ్వానించి తన గృహామునకు తీసుకొనిపోయెను అశేష ప్రజానీకము సంబంధులవారిని దర్శించుటకు అరుదెంచిరి సకల జనులు వీక్షించుచుండ ఒక కుండనుతెచ్చి సంబంధులవారి ముందుంచెను సంబంధులవారు ఆ కుండలోని వస్తువులనుగాంచి దిగ్భ్రాంతిచెందిరి ఆ కుండలో ఎముకలు బూడిద ఉండెను సంబంధులవారు ఆశ్చర్యచకితుడై శివనేశార్ వైపు చూసెను అంత శివనేశార్ సంబంధులవారికి నమస్కరించుచూ మహాత్మా క్షమించాలి దీనివెనుక నా విషాధగాధ యున్నది నాకు పూంపావై అను అందాలరాశియగు ఒకే ఒక పుత్రికారత్న ముదయించినది ఆమెకు యుక్తవయస్సు వచ్చినది సుగుణాలరాశియై సౌందర్యవతియై గోచరించు ఆ బాలికకు తగిన వరుని అన్వేషించుచుండగ మా మిత్రుల ద్వారా మీ యశోవైభవమును శ్రవణముచేసి మీరే పూంపావైకి సరిపోవు వరులని నిశ్చయించుకున్నాము తమరు మా గ్రామము వచ్చినప్పుడు తమతో సంప్రదించి వివాహాము నిశ్చయించవచ్చునని అభిప్రాయపడ్డాను ఇంతలో పాముకరచి అమ్మాయి గతించింది అమ్మాయి శల్యములను చితాభస్మమును ఈఘటమునందు భద్రపరచినాను మీకొరకువుంచిన అమ్మాయి

గతించగా ఆమె శల్యములు మీ కొరకే ఎదురుచూచున్నవి అని తెలిపెను సంబంధులవారు కొంతసేపు నేత్రములు మూసుకొని తరువాత ఆ ఘటమును స్పృశించారు అంతే ఘటము అదృశ్యమై నవయవ్వన కాంతులతో పూంపావై నిలిచింది ఈ అద్భుత మహిమనుగాంచి అందరూ విస్మయమొందారు వెంటనే శివనేశారు స్వామికి సాష్టాంగ నమస్కారముచేసి మహాపురుషా! నాకు పుత్రి భిక్షపెట్టి నన్ను రక్షించారు మీమేలు ఈ జన్మలో మరువలేను పూంపావైని పునర్జీవింపచేశారు ఆమెను మీ అర్ధాంగిగా స్వీకరించి ఆమెను పునీత చేయండి అని ప్రార్థించెను అంతే సంబంధులవారు మందహాసమును చిందింపుచు శివనేశా తొందరపడకుము నేను ఆమెకు పునర్జన్మను ప్రసాదించాను జన్మనిచ్చిన నేను ఆమెకు తండ్రినగుదును అని చెప్పి భక్తజనులు వెంటనడువగా శీర్కాలి చేరెను. జ్ఞాన సంబంధులవారి అమృతదృక్కుచే పునర్జన్మను బడసిన పూంపావై శివభక్తురాలై భక్తి శ్రద్ధలతో మహేశ్వరునారాధించి శివసాన్నిధ్యము నొందినది

జ్ఞానసంబంధులవారు శీర్కాలి చేరగానే తల్లిదండ్రులు బంధువులు భక్తులు అందరు గుమిగూడిరి సంబంధులవారు గృహస్థాశ్రమమును స్వీకరించి ఆదర్శమార్గమును చూపవలయునని ఒత్తిడిచేసిరి సంబంధులవారు వివాహమునకు ఎంతమాత్రము అంగీకరించలేదు కానీ భక్తుల కోర్కె మేరకు ఒప్పుకొనక తప్పలేదు జ్ఞానసంబంధులవారు వివాహానికి అంగీకరించారు తిరునల్లూరు గ్రామస్థుడు తిరుముత్తై గ్రంథ రచయిత మహాభక్తుడైన నంబియండార్ నంబి కుమార్తెను వధువుగా నిర్ణయించారు వివాహము చాలా వైభవముగా జరిగినది వివాహానంతరము బంధుజన భక్తజనులతో కూడి శివదర్శనానికి ఆలయములోకి ప్రవేశించారు జ్ఞాన సంబంధులవారు శివుని దర్శించి తన తండ్రికి చేతులు జోడించి అంతిమ నమస్కారాన్ని అందించి

నాన్నా! కదలిరానా! నీ చెంతకు
ముగిసింది నాకందించిన పని
తెలిసింది నీ కృప కవధులు లేవని
తెలిసి చూసితే హరమయమేనని

చూసి తెలిపితే తానే తోనని
నాన్నా అంటుకోవా నీతో ఉండిపోవా

పరవశించి పాడుచుండగా వధూవరులు అదృశ్యమై రెండు జ్యోతులు గోచరించాయి చూస్తుండగనే ఆ రెండు జ్యోతులు ఒకటై కదిలాయి కదిలిన ఆ జ్యోతి శివస్వరూపములో ఐక్యమైనది జైజై శంకరా! జైజై తిరుజ్ఞానసంబంధా అని ఆకాశము పిక్కటిల్లేల భక్తులు నాదగర్జన చేశారు ఉజ్జ్వలజ్యోతి సమజ్జ్వలమై శివజ్యోతిగా మారిపోయింది

* ఓం శ్రీ జ్ఞాన గమ్యాయ నమః *





# మీ రా బా యి

వెదురుకొయ్య వేణువై విశ్వమోహనరాగ మందించింది మృగ చర్మము మృదంగమై అమృత ఎలుకు లొలికించింది మట్టికుండ ఘట వాద్యమై కరిక శిలను కరిగించింది

శబ్దము నుండి ఆవిర్భవించిన విశ్వము అనంత శతాబ్దములను దొర్లించింది కడలిపొంగు రీతులగాంచి ఒడలు మరువని మనిషెవ్వరు? కురంగ ఉరకలై గన్పట్టు తరంగఝరులు సారంగరాగ మేళవింపులో ఆనందసాగర అంచులను అందించు నాదస్పందన ముందు వేదపఠన మెందుకు? వాదఘటన లెందుకు?

అణువణువున ఆశగియున్న అనంత అమర నాదాన్ని వెలికితీసి మదిని మేళవించి హృదిని రంగరించి పదము కదిలించిన అది చేరలేని గమ్యమేది? చూపలేని రూపమేది?

సంగీత వాహినిలో దొరలి సరసనాద రాగిణిలో పొరలి సామ రస్య జీవనముతో తరలి సచ్చిదానంద త్రివేణిలో [illegible] [illegible] వారికి ధ్యానధారణ లెందుకు? జ్ఞాన సాధన లెందుకు?

నాదపునాదిపై నిర్మించిన రాగభవంతిలో సర్వజీవన మధురిమలో సరసగాన శృతిని వినదించితే పాడలేని జీవిలేదు ఎలుకలేని చిలుకలేదు

శిల్పి తాకిన శిలలో మధుర కోమలనాదము కదులుచుండే విరించి వరించిన మనిషిలో లలిత లావణ్య నవరాగ ప్రవంతులు కదలి జగన్మోహనమై భాసిల్లవా?

గోవులకు సైతము గగుర్పాటు కలిగించి గమనాన్ని నిరోధించిందెవరు? మణి ఒదిగిన ఫణిని కూడా మైమరపించి పరవశింప చేసిన శక్తి ఏది? విలపించే పసిపాపను అవలీలగ లాలించే మధుర పలుకు ఎవరిది?

అదియే నాదము సర్వజీవన నినాదము మధురభావ వికాసము సామవేద సారము సరసగాన విలాసము విశ్వమందిర ఆరాధనలో అందిన పవిత్ర ప్రసాదము అదియే రాగము ప్రాణమును కదిలించు నాదము ప్రాణులను కరిగించు రసాస్వాదనము

భావాకాశములో సప్తస్వర వర్ణములతో నాదహరివిల్లును నిర్మించి నిర్మించబడిన హరివిల్లులో గిరిధారిని ప్రతిష్ఠించి అర్చించి ఆనందించి అనుభవించిన అనురాగ సుధామయి భక్త మీరాబాయి

కుర్కి సంస్థాన అంతఃపురములో ఆడుకుంటున్న ఐదు సంవత్సరముల బాలిక పరుగెత్తుకుంటూ తల్లిని చేరింది వీధిలో కదులుతున్న వివాహ ఉత్సవమును చూపించుచూ అమ్మా! అలా శబ్దము చేయుచు వెళ్ళుచున్న వారెవరు? అని ప్రశ్నించింది

భజంత్రీలు అన్నది తల్లి

వారి వెనుక ఊరేగుతున్న ఆ ఇరువురెవరు? అన్నదా బాలిక

"నూతన దంపతులు అన్నది తల్లి

అంటే అని అడిగింది అమాయకంగా

"క్రొత్తగా వివాహమైనవారు అని తల్లి జవాబు

"అమ్మా! వివాహమంటే ఏమిటి? మళ్ళీ ప్రశ్నించిందా బాలిక

వివాహమనేది ఒక పవిత్ర బంధము భగవంతుని చేరేందుకు స్త్రీ పురుషుల మధ్య ఎర్పడిన అనురాగ స్పందనము ముఖ్యముగా స్త్రీకి భగవానుడొసంగిన వరము అని తెలియజేసింది తల్లి

అమ్మా నాకెప్పుడు వివాహమవుతుంది? నాభర్త ఎవరు? సూటిగా ప్రశ్నించిందా చిన్నారి

ఆ బిడ్డ ప్రశ్నకు సమాధాన మెలా తెలియజేయాలో అర్థంగాక తల్లి కొన్ని క్షణాలు తికమకపడ్డది ఎదురుగానున్న శ్రీకృష్ణదేవుని విగ్రహమును చూపించి అదిగో అటుచూడు ఆ కృష్ణుడే నీ భర్త అని చెప్పి ప్రక్క గదిలోకి వెళ్ళింది

ఆ బాలిక మెల్లగానడచి విగ్రహాన్ని సమీపించింది శ్రీకృష్ణదేవుని కళ్ళారా దర్శించింది అంతే అక్కడ విగ్రహము గోచరించడములేదు ఆ విగ్రహములో నుండి శ్యామసుందరుడు దోబూచులాడుచున్నాడు మోహనాకారుడై విశాల నేత్రములతో పీతాంబరధారి మురళీగానలోలుడై బృందావన పుణ్యభూమిలో గోపికలతోకూడి రాసక్రీడ జరుపు అద్భుత ఆధ్యాత్మిక చిద్విలాసముతో దర్శనమిచ్చాడు చిరునవ్వుతో ఆ చిన్నారి హృదయాన్ని సంపూర్ణముగా దోచుకున్నాడు ఆమె నేత్రాలలో శాశ్వతముగా నిలిచిపోయాడు ఆమె బ్రతుకునే సిరాజనంలా స్వీకరించాడు ఎవ్వరా బాలిక? అవిడే భక్త మీరా అజ్ఞానాంధకారంలో అలమటిస్తున్న మానవాళికి ప్రేమజ్యోతిని అందించి శాంతిని ప్రసాదించుటకై వెలసిన పరమ భక్తురాలు భావుకురాలు భక్త మీరాబాయి తొలిచూపులోనే తన బ్రతుకును వాసుదేవుని దివ్యచరణాలకు అంకితము చేసిన మీరాబాయి భగవానుని రాసక్రీడా వైభవమును విగ్రహములో దర్శించి పరవశించినదిస్మై

"మే రేతో గిరిధర గోపాల్ దూసరో న కోయీ
తాతమాత భ్రాత బంధు ఆపనో న కోయీ"

గిరిధర గోపాలుడు తప్ప నాకీ ప్రపంచములో ఎవ్వరూలేరు తల్లిదండ్రులు సోదర బంధువులు నాకులేరు నేను అందరిని వదలి

పెట్టాను నాకు సర్వస్వము గిరిధర గోపాలుడే అని అప్రయత్న ముగా గానము చేయసాగింది

గోవింద గానముతో వైమరచిన మీరా అలాగే స్థాణువులా వుండి పోయింది తాను దర్శించిన మురళీమనోహరుని దివ్యమంగళ స్వరూపము ఆమె నేత్రాలకు దూరం కావడములేదు ఆ రూపములోనే మనస్సు నిలిచి పోయింది బుద్ధి స్థిరపడింది హృదయము ప్రశాంతతను పొందింది అలా కొన్ని గంటలు గడిచాయి మీరా మనస్సు బహిర్ముఖం కాలేదు ఆకలి అదృశ్యమైంది దప్పిక దరిచేరలేకపోయింది భోజనవేళకు తల్లి మీరాకై అన్వేషణ ప్రారంభించింది చివరకు గోపాలుని విగ్రహము ముందు కొయ్యబొమ్మలా కూర్చునియున్న మీరానుచూసింది అమ్మా మీరా! భోజ నానికి రా। అని పిలిచింది మీరా పలుకలేదు తల్లీ! మీరా ఏమిటలా చూస్తున్నావు? చూపులకు చూపయై చూడముచ్చటైన చూడామణిని గాంచుచున్నాను" అన్నది మీరాబాయి

"ఏమిటా చూడామణి? ఎక్కడ అని అడిగింది తల్లి.

అదిగో చూడు గోపాల చూడామణి. నా గిరిధర గోపాలుడు " అన్నది మీరాబాయి

"మీరా ఏమిటా మాటలు? నీవెందుకిలా మాట్లాడుతున్నావు?"

"నాకూ అర్ధం కావడములేదు అంటూ మీరాబాయి తనకీనాడు కల్గిన దివ్య దర్శనానుభూతిని కీర్తన రూపంలో గానము చేయసాగింది.

"అజ్ మై దేఖ్యో గిరిధారి"
"సుందరవదన్ మదన్ కీ శోభా చిత్ బన్ అనియారీ"
"బజావత్ బంసీ కుంజన్ మే గావత్ తాల్ తరంగ్
రంగ్ ధ్వని నచత్ గ్వాలగన్ మే"
"మాధురీ వహ్ మూరత్ ప్యారీ బసీరహే నిసిదిన్
హింరదే బిచ్ టరే నహీం టారీ "

సుందర ఘనశ్యాముడైన నా గిరిధారిని ఈనాడు వీక్షించాను అతడి మంజుల ముఖారవింద శోభ మన్మధుని కూడా పరవశింప చేస్తుంది అతని నయనములనుండి కదిలే కాంతి కిరణాలు ఆకర్షణా తరంగాలై యున్నవి

ముజ్జగములను మోహాంపచేయు మురళీరవళితో గోపికలచే పరివేష్టితుడైయున్న అతడి రూపమును గాంచితిని అప్పటి నుండి ఆ విశ్వమోహన రూపము నా హృదయములో నిలిచిపోయినది క్షణ కాలముకూడా నన్ను విడిచిపోకున్నది అని మీరా పరవశించి గానం చేసింది

ప్రాణసమానమైన తన పుత్రిక మీరాబాయిలో గోచరించు అయోమయ ధోరణి తల్లిని కలవరపరచింది తీవ్రప్రయత్నముతో మీరాను ఆ విగ్రహామునుండి దూరంగా తీసుకొనివచ్చింది ఆహారము వడ్డించింది వడ్డించిన పళ్ళెరమును చూడగనే మీరాకు అందులో తన శ్యామసుందరుడు కనుపించసాగాడు వెర్రిచూపులతో ఎచ్చిదానివలె చూస్తున్నది కుమార్తెలో జరుగు అంతరంగిక పరిణామాన్ని గుర్తించిన తల్లి తానే తినిపించసాగింది తాను తింటున్నట్లుకూడా మీరాకు తెలియడములేదు నోరుతెరవమని చెప్పాలి తినమని చెప్పాలి మ్రింగమని తెలియజేయాలి అతి కష్టముమీద ఆహారాన్ని తినిపించింది తల్లి మీరాను తీసుకువెళ్ళి పడుకోపెట్టింది తల్లి ఆలోచిస్తూ వెళ్ళింది మీరా ఆలోచించకుండానే అప్రయత్నంగాలేచింది నడిచింది పూజామందిరాన్ని చేరింది తన ప్రాణనాథుడైన గిరిధర గోపాలుని దర్శించసాగింది దేహస్మృతి సన్నగిల్లింది ఆలోచనా తరంగాలు ఆగిపోయాయి అశ్రువులు వర్షధారవలె కారుచున్నవి ఉన్నపళంగ శరీరము కంపిస్తుంది అప్రయత్నంగా ఒక్కొక్కసారి నవ్వుతుంది అయోమయంగా ఒక్కొక్కసారి ఏడుస్తుంది

ప్రభూ గిరిధర గోపాలా! నిన్నువిడిచి నేను జీవించలేను నీకు దూరమై బ్రతుకలేను నా జీవన నౌకకు నీవే మక్కానివి నీవే మార్గగామివి నీ ప్రేమలో మీరా పిచ్చిదైపోయింది నా విషాదగాధను నీవు

గాంచుటలేదా? విరహాగ్నిచే నా హృదయం మండిపోతున్నది వియోగ బాధచే నా మనస్సు ఎండిపోతున్నది నీ ప్రేమామృతాన్ని కురిపించి మండే నా హృదయాన్ని శాంతింపచేయవా? ఎండే నా మనస్సులో ఆనంద లతలు వికసింపునట్లు చేయవా? అని దుఃఖించుచూ తన హృదయావేదనను కీర్తన రూపంలో గానము చేయసాగింది

జో తుమ్ తోడో పియ - మైం నహీ తో డేరే
తోరీ ప్రీత్ తోడో కృష్ణ-కౌన్ సంగ్ జోడూం ॥జో॥
తుమ్ భయీ సరోవర్-మైం తేరీ మఛియా
తుమ్ భయీ తరువర్-మైం భయీ పంఖియా ॥జో॥
తుమ్ భయీ చందా-మైం భయీ చకోరా
తుమ్ భయీ సోనా-మైం భయీ సుహాగా ॥జో॥
మీరా కే ప్రభు-తుమ్ బ్రజ కే లూంస
తుమ్ మేరే రాకూర్-మైం తేరీ దాసీ ॥జో॥

కృష్ణా! నీవు నన్ను విడిచినా నేను నిన్ను విడువలేను నిన్ను వదలి నేనెవరి నాశ్రయించేది?
నీవనే సరస్సులో చేపనై నేను సంచరిస్తాను నీవనే వృక్షముపై నేను పక్షినై మనుగడను సాగిస్తాను
నీవనే చంద్రుడికై తపించే చకోరమునై జీవిస్తాను నీవనే స్వర్ణముతో ప్రకాశించు ఆభరణమునై నివసిస్తాను
వ్రజపుర శోభనమూర్తియైన ఓ మీరానాయకా! నీవు నా యజమానివి నేను నీ దాసిని

తన హృదయ సాగరపు లోతులలో కదలిన స్పందనము ఉపరితలమైన నేత్రాలను తాకగనే కన్నీటి కెరటాలు తెరలు పొరలుగ కదలసాగినవి తన ఎదుటనున్న మురళీమనోహరుని కంచువిగ్రహాన్ని చూస్తూ నిశ్చేష్టయై పడివుంది తన కాలమంతా ఆ విగ్రహాన్ని దర్శిస్తూనే గడిపేది విగ్రహానికి స్నానము చేయించేది దుస్తులు ధరింపజేసేది అలంకరిం

చేది చూచి ఆనందించేది ప్రక్కనే పడుకొని నిద్రించేది సుశ్రావ్యంగా సంకీర్తన చేసెది పరవశించి నృత్యం చేసేది విగ్రహంతోనే భాషించేది మూగబొమ్మతో మాటలేమిటాయని పరిచారికలు ఆశ్చర్యపడేవారు ఆ బొమ్మ నుండి మురళీధరుడు తనతో భాషించుచుండ అది మూగబొమ్మ యని తనెలా భావించగలదు? తన బ్రతుకుకు గమ్యమక్కడే ఉంది తన జీవన మాధుర్యమంతా ఆ బొమ్మలోనే భద్రపరచబడియుంది ఆ బొమ్మ తనవద్ద ఉంటేచాలు గిరిధారి సాన్నిధ్యము లభించినట్లే భావించేది గిరి ధారి సాన్నిధ్యాన్ని అనుభవించువారికి అంతకుమించి కావలసిన ఆనదం మేముంటుంది?

ఈ విధముగా వారం రోజులు గడిచాయి మీరా హృదయము ఆనంద తాండవము చేయసాగింది కానీ ఆవిడ హృదయానందము భగ్న మయ్యే క్షణము ఆసన్నమయినది తన ప్రాణానికి ప్రతిరూపమై ఈనాడు పూజామందిరములో శోభించుచున్న గిరిధర గోపాలుని విగ్రహము తనకు శాశ్వతముగా దూరము కాబోతున్నది ఒక్కక్షణము విడిచి జీవించలేని మీరా గిరిధారికి శాశ్వతముగా దూరమై బ్రతుకగలదా?

రాణారతన్‌సింగ్ కమలారాణీల ముద్దుబిడ్డయే మీరా మాతా పితలు భగవద్భక్తి గలవారు యువతీరెవ్వలన్నను సంత్ పురుషులన్నను వారికి భక్తిమెండు ఒకనాడు పరివ్రాజకుడైన ఒక మహాత్ముడు కుర్కి సంస్థానమునకురాగా అతనికి ఆతిధ్యమిచ్చి కొంతకాలము తమ సంస్థాన ములో యుండి అతిధ్యము స్వీకరించమని రాజదంపతులు ప్రార్థించిరి వారి ప్రార్థన నాలకించి ఆ మహాత్ముడు కుర్కిలో కొంతకాలము గడిపెను తనవద్దనున్న శ్రీకృష్ణదేవుని కంచు విగ్రహమును రాజుగారి పూజా మందిరములో ఉంచడము జరిగింది ఈనాడు మీరాబాయి ప్రాణప్రదముగ చూచుకుంటున్న విగ్రహమదియే

దేశసంచారము గావించు ఆ సన్యాసి కుర్కి నగరమును వదలిపెట్టి మాత్ర సాగించ నుద్దేశించి రాజదంపతుల నుండి అనుమతిని పొందాడు బయలుదేరుతూ పూజామందిరాని కరుదెంచి తనకృష్ణ విగ్రహామును తీసుకున్నాడు ఆ దృశ్యమును మీరాగాంచి దిగ్భ్రాంతి చెందింది పరుగెత్తు

నంటూ ఆ యతివరేణ్యుని సమీపించి తన గిరిధర గోపాలుని తన కివ్వమని ప్రార్థించింది విలపించింది నీటి నుండి వేరుచేసిన చేపలా అల్లాడిపోయింది కాని సన్యాసి వినలేదు తన ఆరాధ్య దైవమైన శ్రీకృష్ణుని విగ్రహమును మీరా కొనసంగుటకు అతని మనస్సంగీ రించలేదు ఐదు సంవత్సరముల బాలికయైన మీరా తన శైశవక్రీడల కుపయోగింపు నిమిత్తము ఈ విగ్రహము నివ్వమని మారాంచేయుచున్నదే గాని పూజార్హమైన విగ్రహ ప్రాశస్త్యమును గుర్తించలేకపోతున్నదని అభిప్రాయపడిన పరివ్రాజకుడు విగ్రహమును మీరాకు ఇవ్వకనే నవ్వుతూ నిష్క్రమించాడు

మీరా స్తంభించి నిలచింది ఆవిడ ఆశాలత వాడిపోయింది తన జీవననౌక మాడిపోయింది ఉత్సాహము మసకాగా సంతృప్తనుసయ్యె మిగిలింది విధి ఒక్కసారి తన కసనంతా తీర్చుకుంది కృష్ణ విరహాన్ని మీరా భరించలేకపోయింది దుఃఖించింది క్రిందపడి దొర్లింది కృష్ణ దర్శనానికై విలపిస్తూ ఎచ్చిదానివలె గోపాల గిరిధరా యంటూ కేకలేస్తున్నది తల్లిదండ్రులు ఓదార్చడానికి ప్రయత్నించి విఫలులయ్యారు స్వర్ణ విగ్రహాన్ని కొనిపెడతామని ఆశ చూపారు కాని మీరా మనస్సును ఆకర్షించలేకపోయారు తనది హేమబుద్ధి కాదు శ్యామబుద్ధి తనకు కావలసింది బంగారు బొమ్మకాదు తన బ్రతుకుకు పట్టుబొమ్మయైన బాలకృష్ణమ్మ తన గిరిధర గోపాలుడు దర్శనమిచ్చి దోబుచులాడిన ఆ కంచు విగ్రహమే తనకు కావాలి హృదయము అశాంతితో నిండింది విశ్రాంతి సమూలంగా అంతరించింది

దరశ్ బిన్ దూఖన్ లాగే నైన్
జబ్ తో తుమ్ బిఛురె పివప్యారే
కబహుం నపాయో చైన్

గిరిధరా! నీ దర్శనానికై నా నేత్రములు వ్యథ చెందుచున్నవి నీవు నన్ను వదలివెళ్ళిన క్షణము నుండి నా బ్రతుకులో విశ్రాంతి అదృశ్యమైంది అని దుఃఖించసాగింది

ఇలా మూడురోజులు గడిచాయి మీరా పరిస్థితి తల్లిదండ్రులకు సమస్యగా పరిణమించింది స్నానం మానేసింది భోజనం త్యజించింది నిద్రను విసర్జించింది సదా ఆవేదనను ఆలింగనం చేసుకొని అలమటించ సాగింది మీరా దీనావస్థ నుచూసి తల్లిదండ్రులు దుఃఖించారు ఆహారమును భుజించమని బుజ్జగించారు ప్రాధేయపడ్డారు వారి వాక్కులు మీరా చెవిలో ప్రవేశించలేకపోతున్నాయి

విరహ ప్రవాహములో కొట్టుకుపోతున్న మీరాకు బాహ్యశబ్దాలు వినిపించడములేదు గోపాలా! రాధాలోలా! మురళీలోలా నందబాలా అటూ పిలవంచసాగింది కృష్ణా నా వ్యధ నిన్ను చేరలేదా నా బాధ నీకు అర్థంకాదా? నీవులేనిదే నేనెలా జీవించేది?

హేరీ మైతో ప్రేమ్ దివానీ, మేరో దరద్ నజానే కోయ్
సూలీ ఊపర్ సేజ్ హమారీ కిస్ బిధ్ సోనా హోయ్
గగన మండల్ పర్ సేజ్ పియాకీ కిస్ బిధ్ మిల్‌నా హోయ్
ఘాయల్ కీ గతి ఘాయల్ జానే కీ జిన్ లగీ హోయ్
జౌహరీ కీ గతి జౌహరీ జానే, కీ జిన్ జౌహర్ హోయ్
దరద్ కీ మారీ బన్ బన్ డోలూం వైద్య మిల్యా నహీం కోయ్
మీరాం కే ప్రభుపీర్ మిటే జబ్ వైద్య సాంవలియా హోయ్

గోపాలా నీ ప్రేమలో నేను పిచ్చిదాననయ్యాను నా వ్యథను అర్థం చేసుకొనువారెవ్వరు? కత్తులపడకపై పవ్వళించియున్న నాకు నిద ఎలా ప్రాప్తిస్తుంది?
నా ప్రియుడు అందనివాడై గగనమండలమున విహరింపుచున్నాడు నే నతనిని ఎలా కలిసేది?
గాయపడినవాని బాధ ఆలాండి గాయము తగిలినవారికే తెలుస్తుంది
రత్నముయొక్క విలువ రత్నాల వ్యాపారికే తెలుస్తుంది
గాయపడిన హృదయముతో ఈ అరణ్యములో అన్వేషిస్తున్నాను
నా గాయాన్ని మాన్పే వైద్యుడు నాకెక్కడా గోచరించడములేదు

గిరిధరా! నీవే వైద్యుడవై రావాలి మీరా బాధ తీరాలి అని గానం చేస్తున్నది మీరాబాయి

మీరా హృదయావేదనను తన గిరిధర గోపాలుడు గ్రహించాడు ప్రక్క గ్రామములో నిద్రించుచున్న యతివరేణ్యునికి స్వప్నదర్శనమిచ్చి విగ్రహమును వెంటనే తీసుకొనివెళ్ళి మీరాబాయికి అప్పగించమని ఆదేశించాడు భగవదాజ్ఞను శిరోధార్యంగా భావించి సన్యాసి కుర్కీనగరముచేరి విగ్రహమును చేతపట్టుకొని సంస్థానానికరుదెంచి తనకు గలిగిన స్వప్నానుభవమును మీరా తల్లిదండ్రుల కెరుకపరచి విగ్రహాన్నందించుటకు మీరాయున్న గదిలోకి ప్రవేశించాడు

పరివ్రాజకుని చేతిలోయున్న గోపాలుని కలువ విగ్రహాన్ని మీరా దర్శించింది ఆవిడ వదనాన్ని ఆవరించియున్న విషాదఛాయలు అదృశ్యమయ్యాయి ఆనందజల్లులు కురియసాగాయి ఒక్క ఉదుటన పరుగెత్తి సన్యాసి హస్తములయందున్న తన గిరిధర గోపాలుని అందుకుంది గాఢముగా ఆలింగనము చేసుకుంది ముద్దులవర్షం కురిపించింది గిరిధరా నీ మీరాను వదిలి వెళ్ళావా! నాకు తెలుసులే నాకు దూరమై నీవు ఉండగలవా? అంటూ ఆ విగ్రహానికి పన్నీటితో స్నానముచేయించింది అందముగా అలంకరించింది చందనాన్ని పూసింది తులసిమాలను ధరింపచేసింది మళ్ళీ పూజామందిరములో తన శ్యామసుందరుని నిలుపుకుంది ధూప దీప నైవేద్యాలతో స్వామిని అర్చించింది హృదయము ఆనందామృతముతో నిండియుండ తన ప్రేమ పారవశ్యములో గిరిధారిని మనసారా కీర్తించింది గోపాలా ఇక నన్ను వదలి వెళ్ళకు" అని విలపించింది

బసీ మోరె నైనమేం నందలాల
సావరి సూరత్ మోహనీ మూరత్
నైనా బనే బిసాల్ గోపాల్
మీరాకే ప్రభు గిరిధర నాగర
భక్తవత్సల్ గోపాల్

నందకిశోరా! సదా నీవు నా నేత్రాలలోనే ఉండిపో"

శ్యామసుందరా మోహనాకారా! విశాల పద్మలోచనుండవైన నిన్ను దర్శించి నేను తరించాను

గిరిధరా! మీరా నాయకా! భక్తులనుద్దరింపు గోపాలా! నిజముగా నీవు భక్తవత్సలుడవు అని గానంచేసింది

మీరా భక్తి పారవశ్యాన్ని తిలకించి సంభ్రమాశ్చర్యాలతో సన్యాసి స్తంభించిపోయాడు అమ్మా! మీరా భక్తగగనంలో నీవు ధ్రువతారవలె ప్రకాశించగలవు నీ భక్తియే నీకు శాశ్వత అమృతత్వ స్థితి నొసంగి నీ గోపాలునికి దగ్గర చేస్తుంది అని ఆశీర్వదించి వెళ్ళాడు

యతివరేణ్యుని వద్దనుండి సెలవు తీసుకొని మీరా పూజామందిరము లోకి వచ్చింది గిరిధర గోపాలుని విగ్రహాన్ని జళ్ళారా దర్శించింది ఆవిడ మనోగగనంలో అద్భుత చిత్రాలు కదులుతున్నాయి అనూహ్య సంఘటన లేవో ఆవిడ అంతఃకరణను చలింపచేస్తున్నాయి గతస్మృతులేవో ఆవిడ స్మృతిపథంలో మెదులుతున్నాయి మీరా కదలికను కోల్పోయి నిశ్చేష్టయై కూర్చున్నది తన గత జీవిత స్మృతులను నాటకమును వీక్షింపనట్లు వీక్షింపసాగింది

శ్రీకృష్ణుని జన్మస్థలమునకు యాభై మైళ్ళ దూరమున బర్సానా అను గ్రామముండెడిది శ్రీకృష్ణుని చైతన్య ప్రతీకమై భాసిల్లిన రాధాదేవి బర్సానాలో జన్మించింది ఆ గ్రామములోనే అందాలరాశియైన ఒక గోపిక యుండెడిది శ్రీకృష్ణుని స్నేహితులలో ఒకడైన గోపాలునికిచ్చి ఆ గోపికకు వివాహము చేశారు వివాహానంతరము ఆ గోపిక తల్లి కుమార్తెను పిలిచి నీతులు తెలిపి చివరగా ఒక హెచ్చరిక చేసింది శ్రీకృష్ణుడు మాయావి యనియు అతడి చెంతకు వెళ్ళవలదనియు అతడి మురళీగానము విననవలదనియు తెలియజేసింది తల్లి ఉపదేశము కుమార్తె హృదయములో చెదరని ముద్రయై నిలిచింది గోపిక అత్తవారింటికి వచ్చింది నూతన దంపతులను సత్కరించే కార్యక్రమాన్ని వరుని మిత్రబృందము బృందావనంలో ఏర్పాటు చేశారు నూతన దంపతులు బృందావనమున కరుదెంచారు మిత్రులందరు బహుమతు లందించారు శ్రీకృష్ణుడు

తన బహూంమతిని తీసుకొని ముందుకు రాగానే వరుడు మందహాసమును చిందిస్తూ తన భార్యయైన గోపికతో మా ప్రాణానికి ప్రాణమైన మా నేస్తం గోవిందుడు వచ్చాడు ఇతని ఆశీస్సులే మనకు శ్రీరామరక్ష నమస్కరింపుము" అన్నాడు

నూతన వధువైన గోపిక శ్రీకృష్ణుని చూసింది తన తల్లి చెప్పిన పలుకులు వీనులలో కదలసాగాయి. అంతే ముఖము ముడుమకుంది బహుమతిని స్వీకరింపుటకు నిరాకరించింది చూస్తున్న గోపాలుర ముఖాలన్నీ చిన్నబోయాయి. అంతట శ్రీకృష్ణుడు ఈనాడు నేను నీవద్దకు వచ్చినను నీవు నన్ను గుర్తించలేకున్నావు నీకు నీవుగా పరితపిస్తూ నావద్దకు పరుగెత్తుకుంటూ వచ్చే రోజొస్తుంది" అన్నాడు

ఇలా కొంతకాలము జరిగింది గోపాలుని సాన్నిధ్యముతో బృందావన పుణ్యభూమిలో గోపోత్సవాన్ని జరుపుకోవాలని సంకల్పించి వ్రజవాసులందరు అతి వేడుకగా ఉత్సవాన్ని జరుపుకొనుచుండగా ఇంద్రుడు అహంకారముతో కుండపోతగా వర్షం కురిపించగా గోవిందుని శరణు జొచ్చి వ్రజవాసులు రక్షించమని ప్రార్థించగా శ్రీకృష్ణపరమాత్మ గోవర్ధన పర్వతమును తన చిటికెన వ్రేలితో ఏడు దినములు ఎత్తిపట్టి ఇంద్రుని గర్వమణగించాడు

శ్రీకృష్ణుని అనహ్యాంచుకొనిన గోపభామకూడా ఈనాడు పర్వతము క్రింద తలదాచుకొని యున్నది జగన్మోహనమైన గిరిధర గోపాలుని దర్శించగనే ఆమె హృదయమునందలి అజ్ఞానము అదృశ్యమైంపి శ్రీకృష్ణుని వైభవమును గుర్తించలేకపోయినందుకు పశ్చాత్తాపముతో విలపించసాగింది గిరిధారిని సమీపించి గిరిధర గోపాలా! నా తప్పిదమును మన్నించు నన్ను నీ దరిచేర్చుకొని రక్షించు అంటూ విలపించసాగి ది శ్రీకృష్ణుడు మందహాసమును చిందిస్తూ ఆ గోపికతో కలియుగములో నీవు జన్మించినపుడు నేను విగ్రహ రూపములో నీ చెంత కేతెంచెదను నీ కొరకు నీవు పరితపించి ఆలపించు విరహ గీతములు కలి మానవులను ఉద్ధరించు అమృత సందేశములై నిలుచును అని ఆశీర్వదించెను ఆ గోపికయే మీరాబాయి

ఈనాడు సన్యాసి ద్వారా ఆమెకు గిరిధర గోపాలుడు విగ్రహ రూపములో అందించబడ్డాడు అందుచేతనే శ్యామసుందరుని విగ్రహమును చూడగనే అసంకల్పిత గతస్మృతులు ప్రేరేపింపమంద గిరిధర గోపాలా! అని మీరా పిలిచింది

మీరా హృదయములో కృష్ణ భక్తి దినదిన ప్రవర్ధమానమగు చున్నది తన కమనీయ కంఠముతో గిరిధారిని గూర్చి రమణీయముగా కీర్తించసాగింది మీరా భక్తి విశేషాలు ప్రజలలో బాగా వ్యాపించాయి ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి మీరాను దర్శించడానికి అనేకమంది వచ్చేవారు నిరంతరము మీరా శ్రీకృష్ణనామామృత పానములోనే కాలము గడుపసాగింది మీరా ప్రవర్తన తల్లిదండ్రులను భయభ్రాంతులకు గురి చేసింది ఎలాగైనా వివాహమైతే మీరాలో మార్పురాగలదని తల్లిదండ్రులు అభిప్రాయపడ్డారు వరునికై అన్వేషించసాగారు మొగలుచక్రవర్తుల హృదయాలలో భీభత్స తుఫానును కలిగించిన చిత్తూరు సంస్థాన రాజపుత్ర వీరులైన రాణాసంగ కుమారుడు పరాక్రమవంతుడైన భోజరాజుతో మీరా వివాహము నిశ్చయమైనది

పూజామందిరంలో పరవశించి గానము చేస్తున్న మీరాను సమీపించి "అమ్మా మీరా! చిత్తూరు సంస్థాన యువరాజైన భోజరాజుతో నీ వివాహము నిర్ణయమైనది అని తల్లి తెలియచేసింది తల్లి పలుకులు వినగానే చెవిలో పిడుగుపడ్డట్టయింది మీరాబాయికి అదేమిటి? నాకు ఏనాడో గోపాలునితో వివాహమైనదిగా? అన్నది అప్రయత్నంగా మీరాబాయి "మీరా! అది ఆధ్యాత్మిక బంధము లౌకిక జీవనమునకు ఆధ్యాత్మిక బంధములకు పొత్తు కుదరదు నీవు సుఖముగా ఉండాలని హాయిగా జీవించాలని మేము ఈ సంబంధాన్ని నిర్ణయించాము మా మాటను త్రోసిపుచ్చకు" అంటూ తల్లి వెళ్ళింది

మీరా మౌనము వహించింది పెళ్ళి సంబరాలు జరుగుతున్నాయి మీరా తన కాలాన్నంతా పూజాగదిలోనే గడుపుచున్నది వివాహము వైభవముగా జరిగింది పెళ్ళిపీటలమీదకూడాను తనకు వరుడైన భోజరాజు

నకు మధ్య గిరిధారి విగ్రహాన్ని ఉంచుకున్నది గిరిధర గోపాలునితోనే తన వివాహము జరుగుచున్నట్లు భావించింది

వివాహానంతరము మీరాను అత్తవారి ఇంటికి పంపవలసి వచ్చింది మీరా తల్లిదండ్రులైన రతన్‌సింగ్ కమలారాణి దుఃఖాన్ని ఆపుకోలేక పోయారు తల్లి మీరాను సమీపించింది మీరా ప్రశాంతముగా నిలబడి యున్నది మీరా! జ్ఞాపక చిహ్నంగా నీకు ఏమి కావలయునో నీ వెంట తీసుకొని వెళ్ళుము అన్నది మీరా తల్లి మీరాబాయి చిరునవ్వు నవ్వుతూ తల్లివంక చూసి

దేమాం గిరిధారి మోహి దేమాం గిరధారీ
భూషణ్ బసన్ మోహి నాహి భావే
నామాంగ్ భవన్ అటారీ॥
గిరిధర చరన్ కమలకీ సౌ గంధ్
మోహి ప్రాన్ న తె ప్యారీ
మీరాకే ప్రభు గిరిధరనాగర్ బార్ బార్ బలిహారీ॥

తల్లీ నాకు గిరిధారిని ప్రసాదించుము నా గిరిధారిని ప్రసాదించుము భూషణములు కోరను దుస్తులు వాంఛించను భవంతులు ఆశించను అమ్మా నేను సత్యమునే పలుకుతున్నాను విశ్వసించుము నేను గిరిధర గోపాలునికి అంకితమయ్యాను నా ప్రాణము కన్నా అతడే నాకు సన్నిహితుడు అని తెలియజేసింది

తల్లి అనుమతి బడసి పూజామందిరములోని తన గిరిధారి కంచు విగ్రహమును తీసుకొని అత్తగారిల్లయిన చిత్తూరు సంస్థానములో కాలిడింది మీరాబాయి

అత్తగారి ఇంటికి కాపురానికి వెళ్ళిన మీరా గిరిధారి విగ్రహాన్ని సదా కౌగలించుకొని కూర్చునేది విగ్రహసేవలో కాలాన్ని వెళ్ళబుచ్చుతున్నదే గాని భర్తపై ధ్యాసలేదు యువకుడైన భోజరాజు మనస్సులో కదిలే ఆవేశ ప్రవాహానికి మీరా హృదిలో మెదిలే నిర్మల ప్రేమతరంగాలకు పొత్తు కుదరలేదు మీరాను తన మార్గములోకి త్రిప్పుకోవాలని భోజుడెంత ప్రయ

త్నించినను లాభములేకపోయింది గిరిధారి సాహచర్యం వినా మరేవిధమైన జీవన సర్దుబాటుకు కూడా మీరా మనస్సంగీకరించే స్థితిలోలేదు మీరా ప్రవర్తన తనను ఆవేదనకు గురిచేయుచున్నను ఆవిడలో వ్యక్తమవుతున్న ప్రశాంత ప్రవృత్తినిగాంచి భోజరాజు ఆమెను మందలించలేకపోయాడు

భోజుని తల్లి మీరాను సరిచేయడానికి ప్రయత్నించింది గృహస్థాశ్రమ జీవన ప్రాశస్త్యమును వివరించింది భర్తృ సుఖమే వాంఛించదగినదని ఉపదేశించింది కృష్ణధ్యానాన్ని మరచిపొమ్మని ఆదేశించింది బదులుగా తమ ఇలవేల్పుపైన దుర్గాదేవిని ఆరాధింపమని ఆజ్ఞాపించింది అత్తగారి ఆజ్ఞ మీరా హృదయములో అగ్నిని రగిల్చింది గిరిధారి ఆరాధనలో సకల దేవతారాధనలు చోటుచేసుకొని యున్నవని మీరా అభిప్రాయము కృష్ణుని ధ్యానించక జీవించలేని తన అసమర్థతను వ్యక్తంచేస్తూ తీవ్ర ఆవేదనతో కీర్తన గానము చేసింది

వ్రుల్ కట్రో సహి ఇన్ నై నన్ కే గిరిధారి బనపల్ అంత నిహారేన్
జీన్ కలె నభ జేయ్ నంద నందన్ బుద్ధి కతే హరి నంబి సరే
మీరాక హే జర్ జవా హియె వ్రుద్ కుంజ్ బినా పలన్ తర్ ధరే
శిన్ నవే బ్రజ్ రాజ్ బిరా ఉహా సిపి కట్ కున్వన్ కిన్ దరే

గిరిధర గోపాలునికన్నా అన్యమైనవారిని దర్శించినచో ఈ కను
రెప్పలు ముక్కలై పోవుగాక
గోపాలుని నామమును సదా కీర్తించనిచో ఈ నాలుక పగిలి
ముక్కలౌగాక గిరిధారిని ధ్యానించని బుద్ధికి శాశ్వత వీడ్కోలేగతి
వ్రజసుందరుని పూజించని ఈ హృదయము దహించిపోనీ

గిరిధరునికన్నా అన్యమైనవారికి నమస్కరించినచో ఈ శిరము
ఖండింపబడి బావిలో విసిరివేయబడనీ!

అని ఉద్వేగముతో విషాద బాణిలో వినతించింది మీరా మీరా హృదయములో గోవిందుని స్థానాన్ని గుర్తించి, గ్రహించి విస్మయమొందారు మీరా అత్తగారు ఆడపడుచు

భోజరాజు సోదరియైన ఉదా మీరా సమాధానానికి కలత చెందింది మీరాపై పగతీర్చుకోవాలని ప్రయత్నించింది స్నేహాతురాంద్రతో కలిసి ఒక్క చక్కటి ఇతివృత్తాన్ని తయారుచేసింది మీరాపై భోజునికి అనుమానం కలిగేలా చేయాలని సంకల్పించింది మీరాను బాదిం చుటకు ఇంతకన్నా మించిన ఉపాయములేదని గ్రహించింది

మీరా పూజామందిరములో ఒంటరిగవున్న సమయములో ఉదా వెళ్ళింది గది తలుపులు వేసియున్నవి లోనుండి నవ్వులు మాటలు విని పించసాగాయి ఉదా ఆశ్చర్యపోయింది అన్వేషించాల్సిన వస్తువు అర చేతిలో ప్రత్యక్షమైనట్లనిపించింది పరుగెత్తుకుంటూ భోజుని సమీపించి "సోదరా! చిత్తూరు సంస్థాన కీర్తి ప్రతిష్టలు మంటగలిసే సమయిమాసన్నమైనది వంశగౌరవము మట్టిపాలయ్యే దురవస్థ ప్రాప్తించనున్నది రాజ పుత్ర వంశశోభ అణగారిపోయే దుస్థితి దగ్గరవుతున్నది మీరా మన వంశ ప్రతిష్టను నాశనము చేస్తున్నది ఆమె భక్తి ఒక నాటకం ఆమె పారవశ్య మొక బూటకం ఆమెకు పరపురుషునితో అక్రమ సంబంధము ఉన్నది అందుచేతనే ఆవిడ నీతో కాపురము చేయుటకు సుముఖంగా లేదు నేను నా చెవులారా విన్నాను నా మాటలయందు నమ్మకము కలుగనిచో నీవే స్వయంగా వెళ్ళి చూడు పూజామందిరములో తాను తన ప్రియునితో సరసా లాడుట నీవే ప్రత్యక్షంగా వీక్షింము అని పలికింది

సోదరి ఊదా మాటలు భోజునిలో ఉద్రేకాన్ని కల్గించాయి భోజునిలో ఆలోచన అంతరించింది ఆవేశం అందల మెక్కింది ఖడ్గమును చేతబూని మీరా పూజామందిరాన్ని సమీపించాడు గది తలుపులు మూసి ఉన్నాయి లోపల ఎవరో సంభాషిస్తున్నారు మధ్యలో నవ్వులుకూడా విన పడుతున్నాయి ప్రస్ఫుటంగా తెలియకపోయినా ఇద్దరిమధ్య సంభాషణ జరుగుచున్నట్లు అర్థమగుచున్నది భోజుడు తలుపును పగులగొట్టి లోని కేతెంచాడు మీరాను చూశాడు స్తంభించి నిలిచిపోయాడు మీరా ఒక్కతే తన ఒడిలో గిరిధర గోపాలుని ఉంచుకొని నేత్రములుమూసి పరవశించి యున్నది భోజుడు రావడము కూడా ఆవిడ గుర్తించలేదు

రామ మిలణకే కాజ, సఖీ
మేరే ఆరతి ఉర మె జగీరీ
తడ్ ఫత్ తడ్ ఫత్ నపరతహై
విరహాబాణ్ ఉర్ బగీరీ

కృష్ణా! నీ సందర్శనమునకై నా హృదయం తపిస్తున్నది నా మనస్సు కలవరపడుతున్నది విశ్రాంతి ఏమిటో నాకు తెలియడములేదు విరహ బాణము నా హృదయమును గాయపరచింది అంటూ గానం చేస్తున్నది

భోజునకు మతి తప్పినట్లయింది అర్థంకాని పరిస్థితిలో తికమక పడుతున్న భోజరాజు మీరా! అంటూ బిగ్గరగా కేకవేశారు మీరా కళ్ళు తెరచింది ఎదురుగా ఖడ్గధారియై నిలబడియున్న భర్తను చూచింది
ఎక్కడ నీ ప్రియుడు? చెప్పు అతడిని ఎక్కడ దాచావో తెలుపు ముక్కలు ముక్కలుగా అతడిని ఖండిస్తాను అన్నాడు
"అదిగో ఎదుటనే గోచరించుచున్నాడు ఈ గిరిధర గోపాలుడే నా ప్రియుడు చేయగలిగితే అతడిని ముక్కలుగ ఖండించండి" అన్నది మీరాబాయి
మీరా? ఏమిటి నీ అప్రస్తుత ప్రలాపము? నీవు ఉన్మాదినివి కాలేదుకదా?" అన్నాడు భోజుడు

భోజుని మాటలు మీరా చెవిని పడలేదు తన సహజ పారవశ్యంతో నేత్రాలు మూసుకొని హే నందనందనా! మురళీధరా! ఏది ఆ దివ్య రూపమును మళ్ళీ దర్శించనీ! ఆ అమృత పలుకులను మళ్ళీ ఆలకించనీ గిరిధారీ! నవనీతాన్ని దొంగిలించింది నీవేనా? జలకమాడుచున్న గోపికల వస్త్రముల నపహరించిన ఘనుడవు నీవేనా? హేc కృష్ణా! అంతకన్నా ఎక్కువగానే నానుండి దొంగిలించావు అమాయకమైన నా హృదయాన్ని అమాంతంగ అపహరించి నన్ను బికారిని చేశావు తిరిగి ఇవ్వకుండా నీ వద్దనే ఉంచుకున్నావు వాసుదేవా! నా హృదయము నీవద్ద యుండుటయే నాకు క్షేమకరము దానిని జాగ్రత్తగా కాపాడుతావు కదూ? ఏదీ ఆ నవ్వు

ఒక్కసారి ఇంకొక్కసారి మరొక్కసారి కృష్ణా కృష్ణా కృష్ణా " మీరా క్రిందపడి మూర్ఛిల్లింది భోజుడు ఖడ్గమును పారవేసి, అయోమయ ధోరణిలో అడుగులు వేయలేక వేస్తూ గదినుండి వెలుపలికి వచ్చాడు

బోజరాజు తీవ్రముగా ఆలోచించాడు తన భార్య మీరాబాయి పిచ్చిదై పోయిందని నిర్ణయించుకున్నాడు ఆవిడపై తనకున్న క్రోధము సమసిపోయింది దానిస్థానే సానుభూతి అంకురించింది కానీ ఉదా ఆమె చెలికత్తెలు కలిసి మీరాపై దుష్ప్రచారము చేయనారంభించారు మీరా నిందలకు భీతిచెందేదికాదు నిందాస్తుతులు ఆవిడకు సమానము గిరిధర గోపాలుడు మినహా అన్యమైనవాటిని ఆవిడ లెక్కట్టేదు మీరాబాయి భక్తి ప్రపత్తులు ప్రజలనాకర్షించాయి భక్తులు విరివిగా ఏతెంచి ఆవిడ జరుపు భజనలో పాల్గొనేవారు అనేక ప్రదేశముల నుండి మీరా దర్శనార్థం భక్తులరుదెంచేవారు

మీరా కీర్తనల వైభవము ఆవిడలో గోచరించు దివ్యపారవశ్యం నలుదెసల వ్యాపించింది ఈ వార్తలు అక్బర్ పాదుషా కొలువులో కూడా ప్రాకాయి మీరాను దర్శించాలని అక్బర్ కుతూహలపడ్డాడు తన ఆస్థాన సంగీత విద్వాంసుడైన తాన్‌సేన్‌ను వెంటనిడుకొని చిత్తూరుకు బయలుదేరాడు మొగలులకు రాజపుత్రులకు అగర్భ శత్రుత్వము రాజపుత్రస్థానంలో కాలుమోపి అక్బర్ ప్రాణాలతో తిరిగిపోలేడు అందుచేత అక్బర్ తాన్‌సేన్‌లు మారువేషాలు ధరించి చిత్తూరు సంస్థానములో కాలు మోపారు భజన సమయానికి భక్తులతోపాటు మీరా భక్తిచేయు గోపాల మందిరానికి వచ్చారు ఒకమూల ఒదిగి కూర్చున్నారు మీరా రాకకై ఎదురు చూస్తున్నారు

స్వర్ణకాంతి దేహముతో తెల్లటి దుస్తులు ధరించి నడకలో నమ్రత ఉట్టిపడుతుండ, నేత్రములు గిరిధరనాథుని దర్శనానికై ఉత్సాహపడుతుండ మీరాబాయి మందిరములో ప్రవేశించింది ఆమె ప్రవేశించగనే భక్తులు ఆమె పాదాలపై పడుతున్నారు మీరాకు ఎవ్వరూ కనిపించుటలేదు పూజా

మందిరములో శోభించుచున్న గిరిధర గోపాలునిపై దృష్టిసారించి నడుస్తున్నది స్వామి విగ్రహాన్ని సమీపించింది గిరిధారికి సాష్టాంగ నమస్కారము చేసింది గోపాలుని ఆలింగనము చేసుకుంది స్వామి చరణకమలములనంటి ముద్దెట్టుకుంది తన స్థానముకో ఆసీనమై తంబూరను మీటసాగింది

మీరాబాయి తంబూర తంత్రులు మీటుకుంటే అక్బర్ హృదయ నరాలు కదులుచున్నవి ఈవిడ మానవమాత్రురాలుకాదు సాక్షాత్తు దేవతయేనని అక్బర్ తాన్‌సేన్‌లు రహస్యంగా ముచ్చటించుకున్నారు మీరాబాయి తదేకంగా తన గిరిధరగోపాలుని దర్శించింది ఆవిడశరీరం కంపించింది నేత్రాలవెంట అశ్రుధారలు రాలాయి దివ్యోన్మాద స్థితిలో నేత్రాలు మూసి గోపాలుని కీర్తించసాగింది భరించ శక్యముగాని తన హృదయావేదనను విరహతాపమును వివరించడానికి ప్రయత్నిస్తున్నది

కరుణా సునో శ్యామ్ మేరీ
మైతో హూం రహీ చేరీ తేరీ ॥కరుణా॥

తుమారే కారణ సబ్ సుఖ్ ఛోడ్ దియా
అబ్ మోంహి క్యోం తర్ సాకో హూం
విరహ్ విథా లాగీ ఉర్ అంతర్
సోతుమ్ ఆయె బు ఝావో హూం ॥కరుణా॥

అబ్ ఛోఢత్ నహీం బణో ప్రభుజీ
హాంస్ కర్ తురమ్ బులావో హూం
మీరాదాసీ జనమ్ కీ
అంగ్ సే అంగ్ లాగావో హూం ॥కరుణా॥

"ఓ శ్యామసుందరా! నీ దాసియైన మీరా మొరనాలకించుము నాకొరకు వేచియున్న సుఖము లన్నింటినీ నీ కొరకై దూరము చేసుకున్నాను నన్ను నీకు దూరము చేయుదువెందుకని ? విరహవ్యథ నా హృదయమును దహించుచున్నది. నీ దర్శనముతో నా హృదయ

బాధను ఉపశమింపచేయుము గోపాలా అనీ సుశ్రావ్యంగా కీర్తిం చింది మీరా

సంకీర్తన పూర్తికాగానే అక్బర్‌వచ్చి మీరా పాదాలపైన పడ్డాడు ఆశీర్వదించమని అభ్యర్ధించాడు తానొక రత్నాలహారమును బహూకరిస్తూ దానిని గిరిధారికి అలంకరించమని ప్రార్థించాడు మీరా నిరాకరించింది గోపాల రత్నమే తనదైయున్నప్పుడు ఇతర రత్నాలతో అవిడకేమిపని ? అక్బర్ బహూకరించిన రత్నహారమును తీసుకొనలేదు అక్బర్ చేతులు జోడించి నమస్కరిస్తూ భక్తుడైన తాను భగవానుడైన గిరిధర గోపాలు నికి సమర్పించు హారమును తిరస్కారభావముతో చూడవద్దని ప్రార్ధించగా మీరాబాయి గ్రహించడము జరిగింది మీలా భక్తి ప్రపత్తులను మననం చేసుకుంటూ చర్చించుకుంటూ అక్బర్ తాన్‌సేన్‌లు రాజపుత్రస్థానమును వదలి వెళ్ళారు

అక్బర్ తాన్‌సేన్‌తో కలసి పూజామందిరానికి ఏతెంచి రత్నాల హారమును మీరాకిచ్చి ఆమె పాదాలనంటెననెడి విషయము ఎలాగో భోజు నికి తెలిసింది ఆగ్రహోదగ్రుడై భోజుడు మీరా గది కరుదెంచాడు మీరాను సమీపించి దుర్మార్గురాలా! మా వంశ గౌరవాన్ని మంటగలిపేం దుకు అవతరించిన రాక్షసివి నీవు నీవల్లనే మొగలాయి చక్రవర్తులు రాజ పుత్ర స్థానములో కాలుమోపి తిరిగి ప్రాణాలతో సురక్షితముగా వెళ్ళారు ఛీ! నీచురాలా నీ ముఖం చూడడము కూడా పాపమే నీవు నదిలో దూకి చావుము అప్పుడే నా మనస్సు శాంతిస్తుంది అని ఎలుకుతూ వెళ్ళి పోయాడు

గృహస్థ జీవనంలో కూడా మీరా ఆదర్శంగానే జీవించింది భగ వానునికి అంకితమైనశరీరాన్ని భర్తకు అర్పించడమనే నీచవృత్తి మినహా మిగతా విషయాలలో భర్త ఆజ్ఞను శిరోధార్యముగా భావించేది నదిలోదూకి చావమని భర్త ఆజ్ఞాపించాడు భర్తను అసంతృప్తికి గురిచేయలేక భర్త ఆజ్ఞానుసారం నదిలోదూకి తనువును చాలించాలని నిర్ణయించుకుంది పూజా మందిరానికరుదెంచింది గోపాలునికి నమస్కరించింది గిరిధరా! నీ

దాసియైన మీరాకు చివరి వీడ్కోలునిస్తావని ఆశిస్తాను నన్ను శాశ్వతంగా నీ పాదాలవద్దకు తీసుకో అని ప్రార్థించి గిరిధరుని వదలి ఆ రూపానికి హృదిలో గుడికట్టుకొని గోపాలునే స్మరిస్తూ నదీతీరానికి బయలుదేరింది

నదీతీరంలో నిలబడింది మీరా అజ్ఞాన మానవుల అవివేక ప్రలాపాలకు అమాయక హృదయం ఆహుతయ్యే క్షణం ఆసన్నమైనది మీరా ప్రశాంతంగా ధ్యానమగ్నురాలైంది అది సూర్యాస్తమయ కాలము మీరాకు ప్రాప్తించిన దురవస్థను చూడలేక భానుడు అస్తమించనున్నాడు మీరా దీనావస్థనుగాంచి కలతచెందిన సూర్యునిలో విజృంభించె క్రోధాగ్నివలె అరుణకాంతులీనుచున్నవి అస్తమించే ముందు తన అంతిమ కిరణాలతో మీరా పాదములనంటి నిష్క్రమించాలని భాస్కరుడు ఉబలాటపడు చున్నాడు

మీరా నేత్రాలుతెరచి నదీమతల్లికి నమస్కరించింది తన ప్రియుని కలుసుకొనే శుభఘడియ సమీపిస్తున్నందుకు మీరా పరవశిస్తున్నది మీరాని ఆహ్వానించి తనలో కలుపుకొని తాను పునీతం చెందుటకాయన్నట్లు నదిలోని కెరటాలు పైకిలేస్తున్నాయి పరమపవిత్రురాలైన మీరాను తన గర్భంలో సమాధిచేయవలసి వస్తున్నదే అని తాను విలపించుటయాయన్నట్లు లేచిన నదీ కెరటాలు అణగిపోతున్నాయి

మీరా ప్రశాంతంగా నడచింది తన పాదాలు భూమిని వదలడానికి ఉరకగానే వెనుక ఎవ్వరో చేయిపట్టి ఆపారు మీరా వెనుదిరిగిచూసింది ఇంకెవరు? తన గిరిధర గోపాలుడే శ్యామసుందరుడు మందహాసమును చిందిస్తూ "మీరా నీభర్తతో నీకున్న భౌతికబంధము ఈనాటితో తెగిపోయింది ఇక నీవు నా దానివి నా రాజ్యమైన బృందావన పుణ్యభూమిలో నన్ను అన్వేషిస్తూ తరించుము" అని పలికి అదృశ్యమయ్యాడు గోపాలుని దివ్యరూపమును గాంచిన మీరా క్రిందపడి మూర్ఛిల్లినది

మీరాబాయి కొంతసేపటికి మూర్ఛనుండి తేరుకొన్నది హృదయములో గోపాలుని రూపము పెదులుమెండ నాలుకపై గోవిందుని నామము కదులుచుండ మీరా బృందావన పుణ్యభూమికి ప్రయాణము సాగించినది

ఆవిడ ప్రయాణముచేయు మార్గమున అనేకులు ఆవిడలో గోచరించు భక్తి పారవశ్యమును గాంచి ఆమె పాదాలపైబడి నమస్కరించసాగిరి మీరా బృందావనంచేరింది బృందావనము నందలి గోపస్త్రీలు మీరాను దర్శించ గానే రాధాదేవియే వచ్చినదని భావించి ఆవిడను ప్రేమాస్పదంగా ముద్దిడి ఆలింగనం చేసుకున్నారు ఆవిడ పాదాలను కడిగి ఆ పవిత్ర జలాన్ని శిరముపై చల్లుకున్నారు పిన్నలకు ఆవిడ తల్లివలె గోచరించుచున్నది పెద్దలకు బిడ్డవలె కన్పించుచున్నది ఆధ్యాత్మిక జిజ్ఞాసువులకు గురువువలె దర్శనమగుచున్నది పరమ పవిత్రురాలైన మీరా దర్శనంతో సకలమాన వులు సంతృప్తిచెందారు

శ్రీ కృష్ణ రాసలీలా వైభవమును భక్తులకు వివరిస్తూ కృష్ణకథా గానముచే వారినిపరవశింపచేసూ తన ఉన్మాదవ్యవస్థలో నృత్యభంగిమల నభిన యించి వారిని మైమరపింపచేస్తూ బృందావన భక్తుల హృదయాలలో మీరా గురుస్థానము నలంకరించింది తన గత జన్మలో శ్రీ కృష్ణుని దర్శించిన ప్రదేశములను గోపబాలలతో ముచ్చటించిన ప్రదేశములను దర్శించేది వాసుదేవుడు సంచరించిన ప్రదేశములందలి ధూళిని శిరముపై ధరించేది మీరా కీర్తనచేయునపుడు కృష్ణుడు విగ్రహములో దోబూచులాడుచున్నట్లు కొన్ని అద్భుత దృశ్యాలు అంతఃకరణ శుద్ధిగల భక్తులకు గోచరించ సాగాయి మీరా పేరు ప్రఖ్యాతులు నలువైపుల వ్యాపించాయి అనేక ప్రాంతాలనుండి వచ్చిన భక్తులు మీరాను దర్శించి వెళ్ళేవారు

ఆ సమయమునందే మహాత్ములైన జీవగోస్వాములవారు బృందా వనంలో ఉండేవారు ఒకనాడుమహానుభావుడైన జీవగోస్వామిని దర్శించా లని మీరా బయలుదేరి స్వామి కుటీరం వద్దకు వెళ్ళింది కాని మీరాబాయి గోస్వామిని దర్శించుటకు వీలులేదని శిష్యులు ద్వారమునందే మీరాను ఆపారు పరమ పవిత్రులైన జీవగోస్వాములవారి దర్శనమునకు తనను నిరోధించుటకు గల కారణమును తెలియజేయుమని మీరా ప్రశ్నించింది అంతట గోస్వామి శిష్యులు స్త్రీలకు దర్శనము లేదనియు మీరా స్త్రీగనుక ఆమెకుకూడా దర్శనము లభించుట వీలుపడదనియు తెలిపిరి ఆ మాటలకు మీరాబాయి నవ్వి బృందావనంలో గిరిధర గోపాలుడు మినహా పురుషు

...మ ఒలు రాధాదేవి ఏన్నచో మీరే బృందావనమును విడిచిపెట్టి వస్తుంది అని పలికింది లోపలినుండి ఈ సంభాషణ నాల జీవగోస్వామువారు మీరా మహాభక్తురాలని గ్రహించి ఆయనే వచ్చి మీరాను దర్శించి సంతసించినవాడై ఆమెను లోనికి తీసు వెళ్ళెను మీరా భక్తురాలని అపర రాధాదేవి అవతారమని ... జీవగోస్వామి సందేశముతో మీరా ప్రభావము ఆకాశమునంటి ...రాబాయి దిదర్శనముతో తరించవచ్చునని భావించి అనేక ప్రదేశముల భక్తులరుదెంచి ఆమెను దర్శించి వెళ్ళేవారు

ఒకనాడు చిత్తూరు నుండి యాత్రార్థం వచ్చిన కొందరు భక్తులు ...రాను దర్శించడము జరిగింది ఆమెను గుర్తించిన భక్తులు మీరాకు నమస్కరించి చిత్తూరు సంస్థానమునకు తిరిగి అరుదెంచవలసిందని ప్రార్థించడం జరిగింది కానీ మీరా అంగీకరించలేదు ఆ భక్తులు చిత్తూరు ... మీరా బృందావనంలో యున్నట్లు భోజునికి తెలియజేసిరి మీరా వెళ్ళిన ...టినుండి ఎచ్చివాడై యున్న భోజుడు ఆ మాట వినగానే అమృతానంద ...న తేలియాడి వెంటనే మీరాను చేరుటకు బృందావనానికి బయలు ...డు

భోజుడు బృందావనం చేరాడు మీరాను గూర్చి విషయ సేకరణ ...డు రమ్మని పిలిస్తే మీరా వస్తుందన్న నమ్మకము తనకు కలుగ ...దు తానొక సన్యాసి వేషము ధరించాడు బిచ్చగానివలె మీరాను సమీ...ంచాడు దానం చేయమని ప్రార్థించాడు.

...నే బికారిని నా వద్ద ఏమున్నదని అర్థిస్తున్నావు?" అన్నది మీరా ...మ అడిగింది మీరివ్వగలిగినదేనని నావి శ్వాసము అన్నాడు భోజుడు ...తే అడగండి" అన్నది మీరా

...నే భోజుడు తన వేషాన్ని తొలగించాడు భోజుని దర్శించగనే మీరా ...యిపోయింది వెంటనే భర్త పాదాలకు ప్రణమిల్లి నమస్కరించింది ...కోర్కె మేరకు మళ్ళీ చిత్తూరు చేరింది

మీరా యథా ప్రకారము తన ఆరాధనా కార్యక్రమములో [redacted]
యుండేది భోజుడు ఆమె భావాలకనుగుణ్యముగానే జీవించేవ[redacted]
చిత్రం తిరిగింది బ్రతుకు వక్రించింది మీరా భర్త భోజుడు మర[redacted]
ఆనాటికి మీరాబాయి వయస్సు ఇరువదిమూడు సంవత్సరములు [redacted]

భర్త మరణించి కొంతకాలము గడచింది మీరా మామూ[redacted]
భక్తిని కొనసాగిస్తూనే యున్నది భోజుని మరణానంతరము [redacted]
సోదరుడైన విక్రమ్‌సింగ్ రాజయ్యెను భోజుని సోదరియైన ఉ[redacted]
మీరాపై పగసాధించ ప్రయత్నించింది విక్రమ్‌ను రెచ్చగొట్టింది [redacted]
లతో సన్యాసులతో కలిసి తిరుగుతూ పాడుతూ ఆడుతూ వంశ [redacted]
మీరా పాడుచేయుచున్నదనియు విక్రమ్‌కి తెలియజేసింది విక్ర[redacted]
ప్రవర్తనను విరసించాడు మీరాను సమీపించి చిత్తూరు అంతఃపురము[redacted]
భక్తిగీతాలు పాడరాదని శాసించాడు

విక్రమ్ మాటలు విని మీరా చిరునవ్వుతో ఏమున్నదీ ప్రప[redacted]
ములో గిరిధారితప్ప అనవసరంగా ఇతరులతో జగడములు పెంచుకొన[redacted]
బుద్ధిమంతుల లక్షణము గాదు ఆలోచించి జీవితాన్ని సరిదేసుకొని త[redacted]
చండి అని చెబుతూ సందేశాత్మకముగా ఒక చక్కటి కీర్తనను గా[redacted]
చెసింది

దోదిన్ కా మిజ్ మాన్
బిగాడూం కీస్‌సే దోదిన్ కా మిజ్ మాన్
అబ్ తూ సోవత్ సేజ్ పలంగ్ పర్
కల్ తూ జావోగా మసాన్
మాతాపిత సుత్ నారీ ఛోడ్ కే
ఆఖర్ హాథ్ హైరాన్

అనిత్యమైన ఈ రెండు దినాల మాయా జీవితములో అన్యుల
పేచీలు వేయుట అవివేకముకాదా
ఈనాడు స్వర్ణఖచిత పడకపై పవ్వళించినవాడు రేపు స్మశాన
కలో ఒంటరిగ పడియుండుటలేదా?

తల్లిదండ్రులను భార్యాబిడ్డలను వదలి ఏకాకివై నీవు పయనింపుట అనివార్యము ఈ సత్యమును తెలిసి వగచుటెందులకు? అని సుశ్రావ్యంగా గానము చేసింది మీరాబాయి విక్రమ్‌సింగ్ తలవంచుకొని వెళ్ళిపోయాడు

ఉదా విక్రమ్‌లు కలిసి తమ తల్లి ద్వారా మీరాకు వర్తమానము పంపారు అత్తగారు మీరాను సమీపించి అమ్మా! మీరా నా మాటవిను సాధువులతో కలిసి మెలిసి తిరుగుట భాషించుట మంచిదికాదు అని తెలిపింది మీరా అత్తగారితో

"తూమత్ బరజై మాయీంరీ సాధాం దర్‌సన్ జాతీ
రామనామ్ హిరదై బసై మాంహిలె మన్ మాతీ"

అత్తగారూ! సత్పురుష సాంగత్యాన్ని నాకు దూరము చేయకండి నా హృదయములో గాఢంగా నాటుకొనియున్న భగవన్నామముచే నేను ఎచ్చిదాననై యున్నాను అని తెలిపింది ఆ మాటలకు అత్తగారు మారుపలుకలేక వెళ్ళారు

మీరాను ఎలాగైనా వదిలించుకోవాలని ఆమెను ఈ లోకంనుండి లేకుండా చేయడమే అందులకు తరుణోపాయమని గ్రహించిన ఉదా విక్రమ్‌లు కొన్ని ప్రత్యేక ఆలోచనలు చేయసాగారు

ఒకనాడు మీరాబాయికి విషమును పంపారు విషపానం చేయవలయునని రాజాజ్ఞయని తెలిపారు మీరా విషాన్ని పానం చేసింది మరుక్షణమే అది అమృతంగా మారింది

విషపానముచే మీరా మరణించలేదని గ్రహించిన విక్రమ్ ఉదాలు మరొక క్రొత్త పన్నాగము పన్నారు మీరా పూజకై పంపు పూలబుట్టలో విషనాగును పెట్టిపంపారు మీరా పూలబుట్టలోవున్న విషనాగునుచూసింది ఆ సర్పము మీరాకి బాలకృష్ణునివలె గోచరించింది వెంటనే మీరా ఆ సర్పాన్ని ముద్దెట్టుకుంది మీరా స్పర్శ తగలగానే ఆ విషసర్పము వికసిత పుష్పముగా మారింది ప్రాణదాతమైన గిరిధరనాథుడు ఆమె చెంత నుండి రక్షిస్తుండగా ఆమెను చంపగల శక్తి ఎవరికుంటుంది?

మరొకసారి మీరా పవ్వళించు పరుపు క్రింద కత్తులు గ్రుచ్చియుంచారు ఈ విషయము తెలియని మీరా మామూలుగా వెళ్ళి పడుకున్నది వెంటనే కత్తులన్నియు రోజా పుష్పాలుగ మారినవి

ఇక మీరాను వధించు శక్తి తమకు లేదని గుర్తించిన విక్రమ్ ఉదాలు ఆమెకు మరొక మందిరమును నిర్మింపజేసి అంతఃపురము నుండి ఆమెను మందిరానికి సాగనంపారు మీరా ప్రశాంతంగా భక్తి చేసుకొనుటకు మందిరము అనువుగా యుండెను భక్తులు విరివిగా ఎతెంచి మీరా జరుపు భజనలో పాల్గొనుచుండెడివారు

ఒకనాడు రైదాస్ అను మహాత్ముడు మీరా వద్దకువచ్చి ఆమెతో ఆధ్యాత్మిక చర్చ జరిపి ఆమెకు తాత్త్విక రహస్యాలెరిగించి మంత్రదీక్ష నొసంగి ఆమెను పూర్ణాత్మను చేశారు

నహీఁన్ మైన్ పిహర్ సస్ రె నహీఁ పియ జిరె పస్
మీరా నె గోవింద మలియారె గురు మిలియ రైదాస్

తండ్రిపై నాకు అనురాగము లేదు మామపై అభిమానము లేదు
నాభర్తపై ప్రేమయు లేదు నాకు గురువు రైదాస్ లభించాడు
నా ప్రభువైన గోవిందుడు నాకు లభించగలడు"

అని మీరాబాయి గానముచేసియున్నది రైదాస్ గురుమహాత్ముని వలననే ఆమె ఆధ్యాత్మిక మార్గంలో స్థిమితమును పొందినట్లు అనేక కీర్తనలలో తెలియజేసి యున్నది

ఈనాటికీ చిత్తూరులో మీరా మందిరముపైన రైదాస్ మహాత్ముని చిత్రము యున్నది మీరా మందిరానికి దగ్గరగానే రైదాస్ సమాధి కూడా యున్నది

నిరంతర సంకీర్తనా ధ్యానాదులతో తనువును మరచి మనస్సును తెరచి అందులో గిరిధారిని దర్శిస్తూ జీవించసాగింది మీరా ఆమె దూరముగా మందిరములో యున్నను ఉదా విక్రమ్‌ల పగ చల్లారలేదు ఆమెను అనేక బాధలకు గురిచేసేవారు ఒకనాడు మీరా తనపై కుటుంబ సభ్యులు

చేయు దర్శంతమును తెలియజేస్తూ కర్తవ్యము నెరుకపరచమని తులసీ దాస్ మహానీయునికి ఉత్తరం వ్రాసింది

"ఘర్ కె స్వజన్ హమారే జిత్ సబన్ ఉపాధి బఢాయీ
సాధు సంగ్ అరు భజన్ కరత్ మోహీ దేత్ క లేస్
అధాయీ

బాల్‌పనే మీరాకినీ గిరిధర్ లాల్ మిటాయి
సోతో అబ్ ఛూటే నహీం కయోన్ లాలగి లగాన్
బరియాయీ॥

"మహాత్మా! నా ఇంటిలోని వారందరు నన్ను బాధింమన్నారు సాధు పురుష సాంగత్యము భగవద్భక్తియే నా బాధలకు కారణమై యున్నవి

శైశవమునసే నేను గిరిధర గోపాలునికి అంకితమయ్యాను ఇప్పుడు త్రుంచలేని రీతిలో బంధము తయారైనది అని తెలుపుచు కర్తవ్యము నెరుకపరచమని ప్రార్థించినది

మీరాబాయి ఉత్తరమును చూచిన తులసీదాస్ సంతసించినవాడై మీరాలోని ప్రగాఢ భక్తి విశ్వాసాలను అర్థము చేసుకొని తిరిగి ఆమె సమస్యను పరిష్కరిస్తూ సందేశం పంపారు

"జాకె ప్రియ న రామ్ వైదేహి
తజియె తహి కోట్ బైరి సమ్ జదపి పరమ్ సనేహి
తజ్యో పితా ప్రహ్లాద్, విభీషన్ బంధు భరత్ మహా తరి
బలిగురు తజియె కాంత్ బ్రిజ్ బనితన్ భయే ముద్ మంగల్
కారి

తులసీ సో భంత్ పరమ్‌హిత్, పూజ్యప్రాణ్ తే పయరో
జాడే హూయే సనేద్ రామ్‌పాద్ ఆయ్‌సో మత్ హామారో

"సీతారాములను ప్రియముగ నెంచనివారు సన్నిహితబంధువులైనను శత్రువులుగా భావించి త్యజింపుము

ప్రహ్లాదుడు తండ్రిని త్యజించాడు విభీషణుడు సోదరుని వదలి పెట్టారు భరతుడు తల్లికి దూరమయ్యాడు బలిచక్రవర్తి గురువునే త్యజించాడు గోపికాస్త్రీలు గోపాలుని చేరుటకై భర్తలను విసర్జించి అట్టి మంగళకర కార్యము ద్వారా లోకానికి ఆదర్శమై నిలిచారు

తులసీ సందేశము గ్రహించుము ప్రేమించదగినవాడు పూజించదగినవాడు భగవానుడొక్కడె అందులకు అడ్డునిలిచిన వారెవరైనను శత్రువులని గ్రహించి త్యజించుటయే క్షేమము అదియే తులసీ విశ్వాసము" అని తెలిపెను తులసీదాస్ మహనీయుని సందేశము మీరాను ప్రభావితం చేసింది తన గిరిధర గోపాలుని విగ్రహాన్ని తీసుకొని మీరా మరల బృందావనం చేరింది అచ్చట తాను దర్శించదగిన పుణ్యస్థలాలన్నీ దర్శించింది బర్సానాకు వెళ్ళి అక్కడ రాధా స్మృతులను మననము చేసుకున్నది చివరగా మీరా ద్వారకకు చేరింది అక్కడే ఇరవై సంవత్సరములు గడిపింది ఎందరికో జ్ఞానభిక్షను పెట్టింది తన ఆదర్శనీయ జీవితము ద్వారా ఎందరిలోనో భక్తిబీజాలను నాటింది నిత్యసంకీర్తన ఆరాధనలతో ఆమె బ్రతుకు పండింది గిరిధర గోపాలునితో హృదయము నిండింది ఇప్పుడు ఆమె వయస్సు అరువదిఐదు సంవత్సరములు

ఒకనాడు తన పనులన్నీ చూసుకొని మందిరానికి త్వరత్వరగా వస్తున్నది మీరాబాయి తన సర్వస్వమైన గిరిధారిలో శాశ్వతముగా ఐక్యమయ్యే శుభఘడియ దగ్గరపడుటయే ఆమె తొందరకు తన్మయత్వానికి కారణము

భక్తులందరు మందిరములో ఆసీనులయ్యారు మీరాలో ఈనాడు వినూత్న ఆధ్యాత్మికశోభ గోచరించుచున్నది గోపాలుని గూర్చి ఆమె పరవశించి గానం చేసింది ఆమె పారవశ్యము చరమస్థాయినందుకుంది నృత్యం చేయడానికి ప్రారంభించింది మీరా నృత్యమునుగాంచి భక్తులు పరవశించిపోతున్నారు వారి కళ్ళను వారే నమ్మలేక పదేపదే కళ్ళుతుడుచుకొని మరీ చూస్తున్నారు ఒక్కొక్కసారి ఆమె నృత్యభంగిమ అభి

నయించినపుడు ఆమెకో శ్రీకృష్ణుడు సాక్షి గోచరిస్తున్నాడు ఒక్కొక్క సారి శ్రీకృష్ణుడు నృత్యము చేయుచున్నట్లు మీరా కృష్ణునిలో గోచరించు నట్లున్నది నిజమేకదా! మీరాకు ఇక ప్రత్యేక వ్యక్తిత్వమెలావస్తుంది? మీరాయే కృష్ణుడు కృష్ణుడే మీరా

భక్తులందరు చూచుచుండగ మీరా పూజించు విగ్రహమునుండి ఒక వెలుగు మెరిసింది అంతే ఆ వెలుగుతో మీరా అదృశ్యమై జ్యోతి గోచరించింది ఆ జ్యోతి మెల్లగా చరించి విగ్రహములో లీనమైంది విగ్రహములో జ్యోతి లీనం కాగానే విగ్రహము అదృశ్యమైంది భక్తులందరూ జై జై మీరాబాయికీ - జై జై గిరిధర గోపాలక అంటూ విగ్రహమున్న ప్రదేశమున శిరమొగ్గి ప్రార్థించి ఆ పుణ్యప్రదేశాన్ని తమ కన్నీళ్ళతో అభిషేకం చేశారు

* ఓం శ్రీ భక్తార్తి భంజనాయ నమః *





# సంత్ తుకారం

మానవ జీవన బాటలో గమ్యమైన భగవంతునికై గమించువాడు జీవుడు. భక్తి మార్గము భక్తుడు మార్గగామి, గమ్యమును చేర్చునది మార్గము. మార్గమును తెలుపువాడు మార్గగామి. మార్గగామికి మార్గము రిప శితము. అనుభవసిద్ధము.

ఆధ్యాత్మిక రంగములో భక్తులే మార్గగాములు. అజ్ఞానారణ్యములో పరిభ్రమించు జీవుని దారిమరల్చి, లక్ష్యము నెరుకపరచి, గమ్యమును చేర్చువారు భక్తులు. సంత్ పురుషులు భక్తి, విశ్వాసములను రెక్కలు కట్టుకొని ఎగిరి ఎగిరి అనంత నారాయణుని పుణ్యధామములో కాలుమోపిన కారణ జన్ములు. నిరంతర తపోధ్యానాదులయందు అంతఃకరణను శుద్ధిపరచిన మహాత్ములు. అతిథి అభ్యాగతాదరణలో హృదయమును నిర్మల మొనర్చుకొనిన పవిత్రాత్ములు, సదాచార జీవనములో సర్వాత్మ భావమును సంతరించుకొని సమస్థితి నొందిన సత్పురుషులు.

నిత్యానుష్ఠానములో బ్రతుకును శుద్ధిచేసుకొని, రాగద్వేషములను తటస్థ పరచుకొని అభిమాన అహంకారములను అంతరింపచేసుకొని, ప్రేమ నేత్రములతో, కారుణ్య పలుకులతో ధర్మజీవనమును గడుపుచు తమ

ఆరాధ్యదైవమునకై హృదయ కవాటములు తెరచి మహాత్ములు వేచి యుందురు భక్తుని మనస్సులో కదిలిన ఆర్తి భగవానుని కదిలించింది భగవద్విభూతిని హృదయములో అనుభవింపచేసి జ్ఞానస్ఫూర్తిని పొందించి తరింపచేయును తెరువబడియున్న భక్తుని పవిత్ర హృదయములో భగవానుడు ప్రవేశించును కొందరు భక్తులకు భగవానుడు మోహనమూర్తియై కనుపించి వారిని ఉద్ధరించును మరికొందరికి సుశ్రావ్య నాదమై వినిపించి వారిని తరింప చేయును కొందరిని వెంబడించి నడచును మరి కొందరిని నడిపించును వెంబడించును

భగవద్వైభవము భక్తులను నడిపించుచుండ చైతన్య స్వరూపులైన భక్తులు తమ శాంతి జీవనకాంతిచే ముముక్షువులకు మార్గగాములై వారిని ఆదర్శబాటలో నడిపింతురు అనుభవ గమ్యమును చేర్చుదురు అట్టి భక్తుల సాంగత్యము దుర్లభము నమ్రతయేవారికో గోచరించు నాణ్యత సౌమ్యతయే వారిలో అగుపించు సంపద మానవత్వమే వారి జాతి ప్రేమజీవనమే వారి నీతి నిర్మలత్వమే వారి కులము నిరాడంబరతయే వారి గోత్రము జాతి కుల రూప విద్య ధనాది భేదములను విస్మరించి సదా అంతర్యంలో శ్రీహరినే స్మరించి జీవించు భక్తులు ధన్యాత్ములు ఆదర్శ పుణ్యాత్ములు అట్టి మహాత్ముల కోవకు చెందిన భక్తాగ్రగణ్యుడే పాండురంగ చరణ సేవకుడైన సంత్ తుకారాం

పాండురంగదేవుని దాసజనులై జీవించిన మరాఠీ భక్తులలో తుకారాం అగ్రగణ్యులు పండరీనాథుని గురించి తాను రచించిన అభంగాలు ఈనాటికీ మహారాష్ట్ర ప్రజలను ఉత్తేజపరచుచునే యున్నవి అవి కవితాధోరణిలో రచింపబడినవికావు భగవానునికై తుకారాం హృదయములో కదిలిన ఆవేదనయే కీర్తనల రూపంలో వ్యక్తమయింది తల్లి పొందుకై విలపించు పసిపాప ఆక్రందన అందులో గోచరించును ప్రవాహములో కొట్టుకుపోతున్న వ్యక్తి గట్టు చేరడానికై ప్రయత్నిస్తున్నట్లు కన్పించును

పూనాకు సమీపమున ఇంద్రయాణి నదీతీరమున దేహూ అను గ్రామము కలదు భక్తిశ్రద్ధలతో జీవించు వర్కారీ మహాత్ములు ఈ గ్రామ

ములో జీవిస్తుండేవారు వర్కారీ సంప్రదాయములో చరించువారిని వర్కారీ లందురు పాండురంగ భక్తియే వర్కారీ సంప్రదాయములో ప్రధానాంశము ఈ వర్కారీ మార్గము నవలంబించు భక్తులు కొన్ని నియమములను విధిగా పాటి తురు అవి (1) సంవత్సరమునకు రెండు పర్యాయములు అనగా ఆషాఢ శుద్ధ ఏకాదశి కార్తీక శుద్ధ ఏకాదశినాడు పరమ పుణ్యక్షేత్రమైన పండరిపురమువెళ్ళి పాండురంగని దర్శించుట (2) ఏకాదశి పర్వదినముల యందు ఉపవాసవ్రతము నవలంభించుచు రాత్రియంతయు జాగారణయందు సంకీర్తనా జపధ్యానాదులయందు కాలము గడుపుట (3) పాండురంగహరి జై జై రామకృష్ణహరి జై జై అను నామమును సదా కీర్తించుట (4) జాతి కుల ధనాది బేధములను విస్మరించి పదుగురితో జీవించుట (5) భగవానుని అమృత హస్తములలో పరికరములనెడి భావముతో కర్మ లాచరించుచు శరణాగత భావముతో జీవించుట (6) పేదవారిలో పాండు రంగని దర్శించుచు వారికి సముచిత సహాయమందించుట (7) భగవ త్కథా గానముల ద్వారా భగవద్భక్తిని ప్రచారము చేయుట పై లక్షణా లతో జీవించు మహాత్ములను వర్కారీలందురు అట్టి వర్కారీ మహాత్మ లకు నిలయమైన దేహు పుణ్యస్థలిలో సంత్ తుకారాంజీ మహరాజ్ జన్మించాడు

తుకారాం తల్లి కనకాబాయి తండ్రి బల్హోబా వీరు భక్తి ప్రపత్తులు గలవారు తమ ఆరాధ్య దైవమైన పాండురంగని సదా కీర్తిస్తూ జీవిస్తుండే వారు తల్లిదండ్రులలో గోచరమయ్యే భక్తి శ్రద్ధలు కుమారుడైన తుకా రాంలో ఒక్కని అవగాహనను పెంపొందించాయి తుకారాంకు పదునైదు సంవత్స ముల వయస్సు రాగానే రుఖుమాబాయి అను కన్యారత్నమును చూచి వివాహము చేశారు తల్లిదండ్రులు ఆ నూతన దంపతులకు పుత్ర సంతానముకూడా కలిగినది వివాహానంతరము రెండేండ్లకు రుఖుమాబాయి క్షయ రోగమునకుగురియై మరణించింది ఆమె చనిపోయిన కొంతకాలము నకు కుమారుడుకూడా మరణించడము జరిగింది భార్యాపుత్రుల మరణము తుకారాంలో తీవ్ర ఆవేదనను కల్గించింది బ్రతుకుపై విరక్తి జనించింది కుమారునిలో గోచరమవుతున్న వైరాగ్యచిహ్నములనుచూచి తల్లిదండ్రులు

క్షీతిచెందారు తుకారాం మనస్సు మరల్చవలయునని ద్వితీయ వివాహము చేయుటయే మార్గమని తలంచి పూనా నగరములోని ఒక ఆదర్శ కుటుంబ ముతో జిజాబాయి అను కన్యనుచూచి వివాహము చేశారు

తుకారాం ద్వితీయ వివాహానంతరము తల్లిదండ్రులు మరణించారు తుకారాం ముగ్గురు బిడ్డలతండ్రి అయ్యాడు ఆ సమయములోనే మహారాష్ట్ర దేశముకో తీవ్రక్షామ మేర్పడినది బ్రతుకే బరువుగా పరిణమించింది తిండిలేక తనబిడ్డలు అలమటించసాగారు ఈ దుర్భర కఠోర పరిస్థితులను గాంచిన తుకారాం కోమల హృదయము ఆవేదనతో అలమటించసాగింది ఆందోళనతో ఆరాటపడసాగింది తల్లిదండ్రులను పోగొట్టుకున్న విషాద మొకవైపు ఎల్లలకు ఆహారమందించలేని దారిద్ర్యము మరియొకవైపు తుకారాం సుకుమార హృదయాన్ని ముక్కలుచేసివైచినది

ఒకనాటి రాత్రి తుకారాం నిద్రించడానికి పడుకున్నాడు నిద్రపట్ట లేదు ఆలోచనలు సాగర తరంగాలవలె లేస్తున్నాయి ఇంటి వెలుపలికి వచ్చి వీధివంక చూశాడు ప్రకృతంతయూ గాఢాంధకారములో మునిగి యున్నది తన హృదయంలో వ్యాపించియున్న అంధకారము అంతకన్నా ఎక్కువగానే యున్నట్లు తుకారాంకి గోచరించింది ఎవ్వరికి చెప్పకుండా నడక సాగించాడు స్థానిక పాండురంగస్వామి ఆలయము చేరాడు తనకు ముందు తనవంశములో ఏడవ తరమువాడైన విశ్వంభరబువా అను నతడు ఈ ఆలయ నిర్మాణకర్త ఆలయములోకి ప్రవేశించాడు తుకారాం తన తాతయైన విశ్వంభరబువా రంగనికి ఆలయాన్నే నిర్మాణంచేయగా, తాను పాండురంగనికి నైవేద్యాన్ని కూడా సమర్పించలేని దుర్దశలో యున్నందుకు చింతించాడు

"హే పాండురంగా! దయాసాగరా! అగాధమైన ఈ సంసార సాగ రాన్ని ఈద నశక్తుడనై నీ పావన చరణయుగము నాశ్రయించాను కరు ణించు శోకరూపములోపడి కొట్టుమిట్టాడుతున్నాను దారిద్ర్యము నా మన స్సును దహించి వేస్తున్నది జీవితలక్ష్య మేమిటో నాకు బోధపడుటలేదు నిన్ను చేరే మార్గమేమిటో కూడా నాకు తెలియదు ఈతి బాధలలో చలిం

ఘుడేగాని నీతిబోధలలో చరించుట ఎరుగను జపమేమిటో తెలియదు తప మేమిటో అర్థంకాదు గ్రంథపరిశోధనలేదు విద్యాగంధమసలే లేదు నాకు తెలిసిందల్లా ఒక్కటే నీ పాదాలనాశ్రయించడం అందుచేతనే ఈనాడు సమస్తమును పరిత్యజించి నీ పాదాలాశ్రయించాను ఆశ్రితులైన భక్తుల నుద్ధరించు కరుణా సముద్రుడవు నీవని గ్రహించి నీ పాదపద్మములాశ్ర యించాను ఇక నన్ను కడతేర్చు భారము నీదే అని విలపిస్తూ కీర్తన గానము చేయసాగాడు

విఠోబాయీ! విశ్వంభరే! భవచ్ఛేదకే
కోఠేం గుంత్ లీస్ అహో విశ్వవ్యాపకే!
నకరీం నకరీం నకరీం ఆతాం ఆంస్ ఆహేరూ!
వ్యాహావయా ప్రగట్ కై చేం దురీ అంతరూ!

"ఓ విఠోబా నీవే నా తల్లివి ఓ విశ్వంభరా! నీవే జగదాధారుడవు భవబంధములను ఖండించువాడవు జ్ఞానస్వరూపుడవు సర్వవ్యాపివి ఎక్కడ దాగినావు విఠలా! నన్ను అలా చిన్నచూపుచూడకు నన్ను పరిత్యజించకు అంతర్యామివైన నీకు నన్ను అనుగ్రహించుట అసాధ్యమా! నాకు దర్శనమొసంగి రక్షించుటదుర్లభమా! అని విలపించుచు నేలపైపడి మూర్ఛిల్లెను

దీనదయాళుడైన పాండురంగడు నామదేవునితో కలసి తుకారాంకు స్వప్నదర్శనమిచ్చి తుకా అనవసరంగా వ్యధచెందకు నీవు భాగవ తోత్తముడవు భక్తి మార్గములో చరించి నీవు తరించుటయేగాక ఇతరు లకుగూడా మార్గగామివి కాగలవు నీవు చింతించవలదు ఇకమీదట నీవు నా చేతిలో పలికరానివి నన్నుగూర్చి కీర్తించి తరించుము నామదేవుడు వ్రాయగా మిగిలిన అభంగములను పూర్తి చేయవలసిలన బాధ్యత నీమీద యున్నది" అని అమృత సందేశము నొసంగెను

తుకారాం నిద్రనుండి మేల్కొంచినట్లు లేచెను పాండురంగదేవుని దివ్యరూపమే అతని కనులముందు దోబూచులాడుచున్నది హృదయము ఆనందముతో పరవశించి పరవళ్ళు త్రొక్కుచున్నది నేత్రాల వెంట

ఆనంద బాష్పాలు రాలుచున్నవి భగవానుని దివ్యమంగళ విగ్రహమునే స్మృతికి తెచ్చుకుంటూ ఆనందముతో కీర్తన గానం చేశాడు

కాస్యాసీ అమ్హీం హ్యావేం జీవన్ముక్త
సాండు నియాం ధీత ప్రేమ్ సుఖ
సుఖఆస్హాం సారీం కేలేం హేం నిర్మాణ
నిర్ధైవ తేణేం హాణే లాధా

"ఓహో విఠలా! సత్తాస్వరూపుడవైన నీవు శ్యామసుందరుడవై మా కొరకు వెలయుండ అసద్రూపమైన సంసార సాగరములో అజ్ఞానులమై మునకలేయుట మాకు తగునా? ఓ ప్రభూ! నేను మోక్షమును వాంఛించను నీ దివ్యమంగళ విగ్రహమును దర్శించుచు నీ ప్రేమామృతమును పానము చేయుటయే నేను సదా వాంఛి తును

అని గానముచేయుచు పారవశ్యము ఉప్పొంగ దేహము కంపనము చెందుచుండ క్రిందపడి మళ్ళీ మూర్ఛిల్లెను

తుకారాం ఒక చక్కటి స్వప్నమును దర్శించెను తుకారాంజీకి మూడువందల సంవత్సరముల క్రితం మనుగడను సాగించిన బాబాజీ చైతన్య అను మహాత్ముడు స్వప్నంలో తుకారాంను ఆశీర్వదించి మంత్ర దీక్ష నొసంగెను బాబాజీ చైతన్యులవారొసంగిన మంత్రదీక్షచే ఆధ్యాత్మికంగా ప్రభావితులైన తుకారాంజీ పాండురంగని దివ్యానుగ్రహమునకు సంతసించి పరవశించారు తనలో వినూత్న పరిణామం జనించింది మనస్సు కుదుటపడింది భగవద్దర్శనము వినా మరో సంకల్పము అంతర్యంలో కదలడములేదు ఆనందముతో హృదయము ఉరకలువేయసాగింది తనలో గోచరమయ్యే ఆధ్యాత్మిక పరిణామమును వ్యక్తంచేస్తూ తుకారాం ఒక చక్కటి అభంగము గానం చేశారు

ఆపులేం మరణ పాహింలే మీం డోలాం
తే జాహాలా సోహాలా అనురూప
ఏక దేశీ హోతే అహంకారే అధిలాం
త్యాచా త్యాగే జహాలా సుకాలహా

ఖిటలే సూతక్ జన్మ మరణాచే
మీా మాఝో సంకోచ దూర్ జాహలా

"నా నేత్రాలతో నా మరణాన్ని నేను గాంచాను నేను అనంత సామ్రాజ్యములో జన్మించాను నేను అమరుడను
అహంకారాన్ని సమూలంగా అంతరింప చేశాను జనన మరణ చక్రాన్ని నేను దాటాను నేను నాది యమనవి నాలో అదృశ్యమైనవి
నేను పాండురంగనిచే విన్నుకోబడ్డాను సంసార సాగరాన్ని నేను దాటాను భగవన్నామమనే నౌకలో ప్రజలను ఎక్కించుకొని ఈ భవసాగరమును దాటింతును" అని గానము చేసెను

ఆనందసాగరమువలె హృది నిండియుండ తుకారాం దేవాలయం నుండి వెనుదిరిగెను కానీ అతడు ఇల్లుచేరలేదు బంధారా పర్వతశిఖరమునధిరోహించెను అచ్చట ఆసీనుడై పాండురంగ భగవానుని దివ్యవిభూతులను గూర్చి కీర్తించసాగెను క్రూరమృగాలు తుకారాంవద్ద ఆసీనమై యుండేవి పక్షులు అతని ఒడిలో కూర్చొనియుండేవి పాండురంగే సర్వస్వమని భావించిన తుకారాం మహాత్ముడు క్రూరమృగములలో కూడా పాండురంగనే దర్శించేవాడు పశుపక్ష్యాదులుకూడా పాండురంగ చైతన్యంతో నిండియున్నవని అతని ప్రగాఢ విశ్వాసము

ఇలా కొన్ని రోజులు గడిచింది తుకారాం సతీమణి జీజాబాయి తీవ్రంగా ఆందోళన చెందసాగింది ఇంతలో గ్రామస్తులొకరు తుకారాంజీవి భండారా పర్వతముపై దర్శించడం జరుగుతుంది తుకారాం ఒక్కడే భండారాగిరిపై ఆసీనుడై పాండురంగనిగూర్చి కీర్తించుచున్నాడన్న వార్త వారి ద్వారా జీజాబాయికి తెలుస్తుంది ఆవిడ మిశ్రమభావాలతో సతమతమైనది భర్తజాడ తెలిసిందని ఒకవైపు సంతోషపడసాగింది తన భర్త సంసారాన్ని గూర్చి చింతించకుండా పర్వతముపై కూర్చుని బాధ్యతను విస్మరించాడని మరొకవైపు దిగులుపడసాగింది వెంటనే భర్తకు ఆహారం తీసుకొని తాను భండారా పర్వతాన్ని చేరింది భర్తను చూసింది ఆమె

ఆవేదనకు హద్దులేకుండా పోయింది తన అనంతపారవశ్యంలో పాండు రంగని గూర్చి భజింపుమన్న తన భర్త అసమర్ధతకు ప్రతిరూపమని భావించింది

ఏమండీ ఏమిటి మీరు చేస్తున్నది? ఇదియేనా భక్తి? భార్యాబిడ్డలను త్యజించి వారిని పోషించవలసిన మీ బాధ్యతను విస్మరించి ఇలా భగవ న్నామము చేసుకుంటూ జీవించడం ధర్మమా? అని ప్రశ్నించింది

తుకారాం నేత్రాలు తెరచి మానవుడు భగవంతుని పొందేటందులకే జన్మించాడు భగవస్సాన్నిధ్యమును పొందుటకు చేయు ప్రయత్నమే నిజ మైన ధర్మము అని తుకారాం తెలిపాడు

అయితే మీ దేవునికన్నా నా దేవుడే గొప్ప యని జిజాబాయి అన్నది
నీ దేవుడెవరు? అని ప్రశ్నించాడు తుకారాం

సతికి పతియే ప్రత్యక్ష దైవము మీ దైవాన్ని విడిచి మీరెలా జీవించ లేరో నా దైవమైన మిమ్మల్ని మరచి నేను జీవించలేను దయవుంచి ఈ ఆహారమును స్వీకరించి ఇంటికి మరలండి అని ప్రార్ధించింది జిజాబాయి "నేను ఇంటికి రాను నేను అరణ్య ప్రదేశములోనే కాలం గడుపుతూ భగవంతుని స్మరించి తరించెదను అని తన అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు తుకారాం

"మీరు చెబుతున్నది సత్యదూరమువలె కన్పించుచున్నది భగవానుడు అర ణ్యములలో కూర్చొని సాధనచేస్తేనే లభ్యంకాగలడని ఇంటివద్ద సాధన సాగించినచో లభ్యంకాడని ఏ శాస్త్రము తెలుపుచున్నది? భక్తి విశ్వాసాలు ఉన్నవ్యక్తి ఎక్కడున్నను భగవానుని కృపకు పాత్రుడు కాగలడు బాధ్యతలు విస్మరించి సంసారభీతితో పిరికివాడై అరణ్యముల కరుదెంచు వ్యక్తులు భగవానుని దృష్టిలో కూడా అసమర్ధులుగ పరిగణించబడుతారు అని భావగర్భితంగా ప్రవచించింది జిజాబాయి ఆవిడ మాటలు తుకారాంజీ ఆలోచనలను రెచ్చగొట్టాయి ఆవిడ మాటలలో సత్యమున్నదని గ్రహిం చిన తుకారాం భార్య ననుసరించి ఇల్లు చేరాడు.

గృహముకోసున్నను తుకారాం మనస్సు గృహకృత్యాలయందు లక్ష్యం కావడములేదు సదా పాండురంగ దేవుని కీర్తియా చక్కటి అభంగాలు రచించాడు అవి ప్రజలలో బాగా వ్యాపించాయి పాండురంగని దివ్య కళామయ వైభవమును గూర్చి తుకారాం ప్రవచించేవాడు పాండురంగని దివ్యనామాన్ని గానం చేసేవాడు తన సంకీర్తనా ప్రభావముతో భక్తులను ఆనంద సాగరములో ముంచేవాడు కుటుంబ పోషణకు బిచ్చమెత్తేవాడు అదియును క్రమబద్ధంగ నిర్వహించేవాడుకాడు భిక్షకు వెళ్ళాలనే సంకల్ప ముదయిస్తే వెళ్ళేవాడు లేనిచో నామసంకీర్తనయందే కాలమును గడిపే వాడు

పాండురంగ నామవైభవమును ప్రచారము చేయుచు జీవించెడి వాడు భక్తులు అయాచితముగా నొసంగువానిని స్వీకరించుచుండెడివాడు ఒకనాడు తుకారాంజీ ప్రక్కగ్రామమునకు వెళ్ళి సంకీర్తనచేసి మరలి వచ్చుచుండ ఒక చెరకుతోట యజమాని తుకారాంజీకి నమస్కరించి తన తోటలోని చెరకులను కొన్నిటినితీసి తుకారాంజీకి సమర్పించెను అవి తీసుకొని తుకారాం ఇంటికి వచ్చెను తుకారాంజీ ఇంటి గుమ్మం వద్దకు రాగానే అక్కడ బాలురనేకలు క్రీడించుచుండుట తుకారాం చూశాడు వెంటనే తన చేతిలోని చెరకుగడలను ఆ పిల్లలకు ఇచ్చి వారి దరహాస ముతో దోబూచులాడు పాండురంగదేవుని గాంచి ముదమందెను చెరకు లన్నియు బాలురకిచ్చి చివరగ ఒక్క చెరకుగడను చేతపట్టుకొని ఇంటి లోని కేతెంచెను తుకారాం పిల్లలకు చెరకులు పంచిపెట్టుట జిజాబాయి లోనుండి కిటికీ ద్వారా చూసింది ఆమెలో క్రోధాగ్ని చెలరేగింది తన భర్త చెరకుగడలన్నీ వృధా చేసినాడని భావించింది తుకారాం భార్యను సమీపించి మిగిలిన ఆ ఒక్క చెరకుగడను ఇవ్వడం జరిగింది కోపో ద్రిక్తురాలైయున్న జీజాబాయి ఆ చెరకుగడను తీసుకొని నేలపై విసరి కొట్టింది చెరకుగడ రెండు ముక్కలైంది వెంటనే తుకారాం ఆ రెండు చెరకు ముక్కలను చేతపట్టుకొని అహా జీజీ! నామీద నీకెంత ప్రేమ! మిగిలిన ఒక్క చెరకుగడను నేను నీకు ఇవ్వగా దానిని నా కొరకై నీవు రెండు ముక్కలు చేసితివి నేనంటే నీకు ఎంత ప్రేమయోగదా! అని సంతసించెను సహనశీలుడైన తుకారాంజీ హృదయపు లోతులనుండి

వెలువడిన ఆ యవ్యక్త వాక్కులు భార్యయైన జీజాబాయిని సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తినది తాను సహనశీలుడై జీవించడమేక ఇతరులను కూడా క్షమకలిగి జీవించమని ప్రబోధించేవాడు ఓర్పుతో జీవించుటయే బ్రతుకులో నేర్పుయని ప్రవచించేవాడు

తుకారాంజీ రాగద్వేషాలకతీతుడు ద్వేషించిన వారిని కూడా ప్రేమించే అమృతహృదయుడు నామప్రచారములో అతడు అనేక ఇక్కట్లకు గురయ్యాడు ఇక్కట్లన్నీ భగవత్ప్రసాదంగా భావించేవాడు ఒకనాడు తుకారాం వీధిలో నడుచుచుండగ ఒక భక్తుడు చూశాడు అతనికి తుకారాం మార్గదర్శకులు తుకారాం మహాత్ముని బోధనలతో తన జీవితాన్ని దిద్దుకున్నాడు తన ఇంటిముందుగా అనాడు తుకారాం మహాశయుడు వెళ్ళుట గమనించి వెళ్ళి నమస్కరించి తన ఇంటికి ఆహ్వానించాడు తుకారాంని లోనికి తీసుకువెళ్ళాడు ఆ మహాత్ముని పాదాలంటి నమస్కరించాడు స్వీకరించమని పండ్లు పాలు తెచ్చిఇచ్చాడు ఫలహారగిస్తున్న తుకారాంజీని ఆ ఇంటి ఇల్లాలు చూసింది ఆమెకు చాలాకాలముగా తుకారాంపై ద్వేష భావమున్నది తుకారాంజీ బోధల వలన తన భర్త అన్యాయమయ్యాడని ఆవిడ అపోహ అపోహ పెరిగి ఆక్రోశమైంది ఆక్రోశము రగిలి ద్వేషము అంకురించింది ద్వేషము పగామారి ప్రతీకారాన్ని తీర్చుకోవడానికి సిద్ధముగావుంది తుకారాం తన ఇంటిలోనే యున్నాడు పగతీర్చుకొనేందుకు ఇంతకన్నా అనువైన అవకాశము లభించదని ఆవిడ ఆలోచించింది సలసలకాగిన నూనెను ఒక పాత్రయందుంచుకొని వెడుతూ కాలుజారి పడినట్లు అభినయించుచు ఆ వేడి నూనెను తుకారాంపై క్రుమ్మరించింది కానీ తుకారాం మహాశయుడు చలించలేదు అతడి మొగముపై చిరునగవు అదృశ్యము కాలేదు చూచుచుండగనే ఆవిడ శరీరమంతా కాలిన చిహ్నములతో బొబ్బలు లేచాయి భరించలేని బాధతో విలపిస్తూ ఆమె తుకారాం పాదాలపైబడి క్షమించమని ప్రార్థించింది కాపాడమని అర్థించింది వెంటనే తుకారాం పాండురంగ నామము చెబుతూ ఆమెను పట్టి లేపాడు తుకారాం మహాశయుని దివ్యస్పర్శతో ఆమె శారీరకబాధ నివారించబడింది దేహముపై ఏర్పడియున్న బొబ్బలు అదృశ్యమయ్యాయి

తుకారామ్ ఆమెను తదేకంగా చూస్తూ తల్లీ! నిజంచెప్పు నాపై కాగిన నూనెను పోయడము ప్రయత్నపూర్వకముగా చేసిందికాదా? అని అడిగాడు ఆమె కన్నీరు కారుస్తూ మహాత్మా నేను ప్రయత్నపూర్వకముగానే చేశాను మీ వల్లనే నాభర్త భక్తికోదిగి అన్యాయమవుతున్నాడని అపోహపడ్డాను మిమ్మల్ని బాంఛించాలని ప్రయత్నించాను పాపాన్ని మూటగట్టుకున్నాను నన్ను క్షమించండి అని తుకారామ్ పాదాలపై పడింది

తుకారామ్ మందహాసము చిందిస్తూ తల్లీ! తుకారాం వ్యక్తిత్వము ఇంకా మిగిలియున్నదని భావించావా? పాండురంగని దివ్యదర్శనముతో నాలోని అహంకారమంతా సమూలముగా నశించిపోయింది ఇకమీదట తుకారామ్‌కి మిగిలియున్నది పాండురంగడొక్కడే తుకారామ్ చేయగలిగింది నామప్రచార మొక్కటే అని చెప్పి ఆమెను ఓదార్చి ఆశీర్వదించి విఠలనామము చెబుతూ గృహోన్ముఖుడయ్యాడు

తుకారాంజీ భక్తి వైశిష్ట్యము సంకీర్తనా వైభవము నలువైపుల వ్యాపించింది ఎందరో భక్తులు ఆయన మార్గము నవలంబించి జీవించసాగారు తుకారాం అభంగాలు ప్రజలలో బాగా వ్యాపించాయి తుకారాం పాండురంగని దివ్యలీలలను గూర్చి గానము చేయుచు నామసంకీర్తన గావించుచు అనేక ప్రదేశములు పర్యటించెను తుకారాం భక్తి ప్రచారము ప్రజలలో జాగృతిని కల్పించింది అనేక ప్రదేశముల నుండి తుకారాంజీని భక్తులు ఆహ్వానించి సంకీర్తనా సత్సంగ కార్యక్రమములు ఏర్పాటు చేయసాగారు ఒకనాడు పూనా దగ్గర ఒక గ్రామములో తుకారాంజీ సంకీర్తనా కార్యక్రమము నిర్వహించవలసి యున్నది

ఆ గ్రామములో శివశంకర్ అను భక్తుడు కలడు పేదకుటుంబీకుడు ఆశలులేని శివశంకర్ తన భార్య కుమారునితో ఆదర్శ జీవనము గడుపుచుండెడివాడు అతనికి తుకారాంజీ అభంగాలంటే ప్రాణము పరోక్షంగా ఎందరో తుకారాం భక్తి విశేషాలనుగూర్చి ప్రస్తావించగా విన్నాడు తుకారాం తన గురువుగా నిర్ణయించుకున్నాడు ఆయన అభంగాలు

గా ముచేస్తూ తృప్తిచెందేవాడు. సదా పాండురంగ నామస్మరణతో కాలము వెళ్ళబుచ్చెడివాడు తుకారాంని గురువుగా నిర్ణయించుకున్నను ఇంతవరకు తుకారాం మహాశయుని శివశంకర్ చూడలేదు పేదవాడైన తాను దేహు గ్రామానికివెళ్ళి తుకారాంని దర్శించలేకపోయాడు ఉన్నపళంగ తుకారాంజీ సంకీర్తనా సత్సంగమును నిర్వహించుటకై తన గ్రామమునకు వచ్చుచున్నాడనెడి వార్త అతని చెవినిపడింది శివశంకర్ ఆనందానికి అవధులు లేవు హే కరుణా పారీణా! పాండురంగా! ఈ దీనుణ్ణి కరుణించావా తండ్రీ! దేహు గ్రామ నికి వెళ్ళి సద్గురువును దర్శించలేని నా దౌర్భాగ్యస్థితిని తిలకించి నా గురుదేవుని ఈ గ్రామానికి తీసుకొని వస్తున్నావా ఆహా! ఏమి నా భాగ్యము ఈనాడు నా జన్మ ధన్యమైనది రేపటిరోజు నేను సంత్ తుకారాం మహాత్ముని దర్శించబోతున్నాను నా చిరకాలవాంఛ నెరవేరబోతున్నది। అని చింతించుచూ విఠలనామము చెబుతూ గంతులు వేయసాగాడు రాత్రంతా శివశంకర్ నిద్రపోలేదు భగవద్విభూతులను నెమరువేసుకుంటూ మేల్కొనియున్నాడు తుకారాంజీ అభంగాలను గానము చేస్తూ నృత్యము చేయసాగాడు తెల్లవారితేచాలు సూర్యతేజంతో ప్రపంచము ప్రకాశవంతమవుతుంది గురుభాస్కరుని తేజముతో తన హృదయంలో గాఢంగా పెనవేసుకొనియున్న అజ్ఞానాంధకారము సమూలంగా అదృశ్యమవుతుంది శివశంకర్ ఆలోచనలు ప్రవాహంలా కదులుతున్నాయి తొందరగా ఈ రాత్రిని అదృశ్యముచేసి తెల్లవారేలా చేయమని పాండురంగని ప్రార్థించసాగాడు తెల్లవారింది శివశంకర్ తొందరగా పూజ సంకీర్తనాదులు ముగించుకున్నాడు తుకారాంజీ రాక విశేషాలను తెలుసుకొనుటకు గ్రామంలోనికి బయలుదేరనున్నాడు ఇంతలో అతని భార్య వచ్చి తమ ఏకైక పుత్రుడగు రెండు సం॥ ల బాలుడు జ్వరపీడితుడై యున్నట్లు తెలుపుతుంది శివశంకర్ బాలుని పరిశీలించి వైద్యుని తీసుకొని వస్తాడు చికిత్స జరిగింది కానీ వ్యాధి నయం కావడము లేదు క్షణక్షణానికి వ్యాధి తీవ్రరూపాన్ని దాల్చుతున్నది శివశంకర్ సతీమణి ఆందోళన చెందుతున్నది సాయంత్రము నాలుగు గంటలైనది బాలుని పరిస్థితి విషమించింది ప్రమాదస్థితియని వైద్యుడు తెలియజేయడము జరిగింది శివశంకర్ భార్య బోరున ఏడుస్తున్నది ప్రక్కనేయుండి పరిస్థితినంతయు గమని

న్తున్న శివశంకర్ చలించడములేదు పాండురంగని సంకల్పమెలావుంటే అలా జరుగుతుందని భావించి మౌనఏకంగ నామజపము చేయసాగాడు

బాలుడు మృత్యురూపములో ప్రవేశించుటకు సిద్ధముగా యున్నట్లు గోచరిస్తున్నది తల్లి పుత్రశోకముతో కుమిలిపోతున్నది వైద్యుడు బాలుని ప్రక్కనే కూర్చొని చికిత్స సాగిస్తున్నాడు ఇంతలో బయట ఎవో శబ్దాలు వినిపించసాగాయి ప్రజలు తండోపతండాలుగ పరుగెత్తుతున్నారు ఎమిటా యని ఆలోచిస్తూ శివశంకర్ ఇంటి నుండి బయటకు వచ్చాడు పరుగెత్తుతున్న జనసమూహములో ఒకరిని ఎలిపాకు వారు ఎతెంమమన్న దెవ్వట కని ప్రశ్నించాడు తుకారాం మహాత్ముడు తన గ్రామమున కరుదెంమిు జరిగినదనియు ఇక కొద్ది నిముషాలకో పాండురంగస్వామి ఆలయములో సంకీర్తనా సత్సంగము ప్రారంభముకానున్నదనియు తెలిపిరి

శివశంకర్ ఆనందానికి అవధులు చిక్కలేదు ఎంతోకాలముగా తన మనస్సులో మిగిలియున్న తీరనివాంఛ ఇం కొద్ది నిముషాల్లో నెరవేరబోతున్నది సద్గురు దర్శనముతో తన జన్మ చరితార్థము కానున్నది తాను ధన్యజీవి కాబోతున్నట్లు చింతిస్తూ ఆనందిస్తూ ఇంటిలోనికేగి ఉత్తరీయమును పైనవేసుకొని శివశంకర్ బయలుదేరాడు వెళ్తున్న భర్తనుగాంచి ఆయన భార్య ఎక్కడికి వెళ్తున్నారు? అని ప్రశ్నించింది

పాండురంగని ఆలయానికి అన్నాడు శివశంకర్

ఎందులకు? మళ్ళీ ప్రశ్నించింది

"తుకారాం మహాత్ముడు మన గ్రామాని కరుదెంచాడు పాండురంగస్వామి ఆలయములో సత్సంగము జరుగనున్నది ఆ పుణ్యాత్ముని దర్శించి ఆయనౌసంగు అమృత సందేశము నాలకించి సంకీర్తనామృతము తనివిదీర గ్రోలి తరించాలని వెళ్తున్నాను అన్నాడు

"ఏమిటి మీ సాహసం? కన్నబిడ్డ మరణశయ్యపైనుండ మీరు సంకీర్తనలో పాల్గొనడానికి వెళ్తున్నారా? ఎమిటీ విడ్డూరము అన్నదామె శివశంకర్ ఆమెను తదేకముగా చూస్తూ ఎచ్చిదానా! అనవసరముగా అందో

శనచెందకు బిడ్డపరిస్థితి నాకూ అర్థమవుతూనేవుంది వైద్యులు ప్రక్కనే యున్నారు చికిత్సజరుగుతున్నది ఇక్కడనేనుండి చేయగలిగిందేముంది? అంతా పాండురంగని కృప ఎవని అనుగ్రహముతో మనకీబిడ్డ కలిగాడో అతడి ఆశీర్వాదముతోనే జీవించాలి ఆవేదనతో సాధించేదేముంది? మన బిడ్డడైతే మనకు మిగులుతాడు కలిసిరాని బంధమైతే కన్నీటిని మిగిల్చి కనుమరుగవుతాడు ఈ పరిస్థితిలో నేనిక్కడుండి చేయగలిగిందేముంటుంది? భ్రాంతిజన్య ఆవేశమునకు గురియై శాంతిమనుగడను పాడు చేసుకోవడము విజ్ఞుల లక్షణముకాదు తుకారాంలాంటి మహాత్ముని దర్శనానికి దురమై నేను జీవించలేను పాండురంగడు కరుణామయుడు జై జై విఠలా అని పాడుకుంటూ శివశంకర్ వెళ్ళిపోయాడు భర్తసాహసానికి ఆశ్చెరువందిన భార్య నిశ్చేష్టయై నిలబడి పోయింది

శివశంకర్ ఆలయాన్ని చేరాడు భక్తజనులమధ్య ఆసీనుడయ్యాడు కొంతసేపటికి తుకారాంమహరాజ్ ఆలయములోకి అరుదెంచారు ప్రసన్న వదనముతో పాండురంగని దివ్యప్రసాదమా యన్నట్లు గోచరిస్తున్న తుకారాంని చూడగానే శివశంకర్ పరవశించిపోయాడు భక్తాగ్రగణ్యుడైన తుకారాంజీలో గోచరించే ప్రశాంతత శివశంకర్‌ని అమాంతముగా ఆకర్షించింది గురుదేవులైన తుకారాంజీలో పాండురంగని దర్శిస్తూ తన్మయత్వము చెందుతున్నాడు

తుకారాం సంకీర్తన ప్రారంభించాడు పాండురంగని దివ్యనామం తుకారాం కమనీయ కంఠముద్వారా వెలువడుతుంటే భక్తుల హృదయాలు ద్రవిస్తున్నవి అప్రయత్నముగా ఆనందభాష్పాలు రాలుతున్నాయి కేశములు తలెత్తుతున్నాయి మధ్య మధ్య సంకీర్తనను ఆపి సందేశాన్నిస్తున్నాడు తుకారాంజీ భక్తులయెడ భగవానునకుగల అపారప్రేమను తుకారాం వర్ణిస్తుండగా వింటున్న శ్రోతలు దేహవిస్మృతిని పొందుచున్నారు. నామదేవులవారి భగవద్భక్తిని జనాబాయి శరణాగతిని జ్ఞానదేవుల జ్ఞానజీవనమును తుకారాంజీ పరవశించి ప్రవచించసాగారు ఆహా భక్తుల మానసములు భక్తిసాగరములో మునకలేయుచున్నవి తుకారాం

బోధలు శివశంకర్‌లో జ్ఞానబీజములను నాటుతున్నవి పాండురంగదేవునిచే ఎన్నుకొనబడిన భక్తశిఖామణియైన తుకారాంజీ పవిత్రహృదయ గుహ నుండి వెల్లుబుకుతున్న అనుభవ ఆధ్యాత్మిక రత్నములు గాంమవారలను ఉన్మత్తులను చేస్తున్నవి ఈనాటితో తన జన్మ ధన్యమైనదని భగవదను గ్రహముచేత తుకారాం మహాత్ముని దర్శించుట జరిగినదనియు శివశంకర్ తనలోతాను మురిసిపోతూ శ్రవణము చేస్తున్నాడు

ప్రశాంతముగా సాగుతున్న భగవద్గోష్ఠి ఒక్కసారి అమాంతముగ ఆగిపోయింది తుకారాం సంకీర్తన ఆపేశాడు భక్తులు దిగ్భ్రాంతితో చూస్తున్నారు ఒక స్త్రీ పరుగెత్తుకుంటూ ఆలయంలోకి ప్రవేశించింది ఆవిడచేతిలో బిడ్డశవమున్నది ఆమె సరాసరి తుకారాంని సమీపించింది చేతిలోయున్న బిడ్డ మృతదేహమును తుకారాం పాదాలవద్ద పడేసింది నీవేనా తుకారాం భక్తియనే ముసుగుకప్పుకొని పదుగురిని మోసముచేయు చున్న దౌర్భాగ్యుడివి నీవేనా? నీలాంటి వ్యక్తులు సమాజముకో పీడపురు గులు కష్టపడి జీవించను చేతగాక భక్తియనే పేరుతో అనాయాస జీవన మును సాగించుటకు అలవాటుపడ్డ అసమర్థులు అప్రయోజకుడా నీ సంసారాన్ని నీవు పాడుచేసుకున్నావు అంతటితో ఆగక అందరి సంసా రాలను అన్యాయముగా పాడుచేస్తున్నావు నీవు భక్తుడివా? నీ పాండు రంగడు నిజముగా దేవుడేనా? అని రోధించసాగింది పరిస్థితి ఎవ్వరికీ అంతుపట్టలేదు భక్తజనులమధ్య పరవశించి కూర్చునియున్న తనభర్తను చూపిస్తూ అడుగో! ఆ మహాత్ముడే నా భర్త మాకు ఒక్కగానొక్క పుత్రుడు మృత్యుశయ్యపైనున్న కుమారుని వదలిపెట్టి కర్కశహృద యుడై సద్గోష్ఠిలో పాల్గొనాలని అరుదెంచాడు నా బిడ్డ అంతరించాడు ఇదేనా భక్తికిఫలితము? ఇదేనా త్యాగానికి ప్రతిఫలము? మానవుని మస్తి ష్కంలో దైవభావమనునదొక మౌఢ్యం అదొక అంటుజాడ్యం పాండు రంగడు దేవుడుకాడు అతడొక రాతిబండ అని నిందించ సాగింది

శివశంకర్ మెల్లగాలేచి భార్యను సమీపించాడు తన భార్య రాకచే ప్రశాంతముగా కొనసాగుతున్న సత్సంగము భగ్నమైందని భావించాడు

ఆవేదనాపూరిత హృదయముతో అపు నీవ్యర్థప్రసంగాన్ని కొనసాగించకు మతిచెడిన నీకు యతుల జీవనసౌరభము అర్థముకాదు తుకారాంజీ ఎవరని నీ అభిప్రాయము? సంసారిక బాధలు ఆయనకు తెలియచేయుచున్నావా?నీ బిడ్డ చనిపోవడమనేది నీ వ్యక్తిగతమైన సమస్య దానిని పదుగురి ముందుంచి వారి ప్రశాంతతను భంగమొనర్చే హక్కు నీకు లేదు పైగా దైవదూషణ చేయడానికికూడా నీవు వెనుకాడుటలేదు మూర్ఖురాలా! చని పోయిన నీ బిడ్డను తీసుకరావలసింది ఆలయానికికాదు శ్మశానానికి తర లించు మహాత్ములను నిందించిన నీపాపానికి నిష్కృతిలేదు అనిభార్యాపై విరుచుకపడ్డాడు శివశంకర్

భర్తమాటలకు నివ్వెరపోయింది ఆవిడ కోడెత్రాచులా విజృం భించింది ఒక్కసారి ఆవిడ భక్తజనులవైపు తిరిగి మహాజనులారా మీరే న్యాయనిర్ణేతలుగ వ్యవహరించండి కన్నబిడ్డ శవాన్ని మోసుకొని తల్లినైన నేనిప్పటకు వచ్చాను తండ్రిమాట్లాడిన తీరు మీరు చూశారు కదూ? ఇదేనా భక్తి? కన్న తండ్రికుండవలసిన బాధ్యత ఇంతేనా? బండను పూజించిన నేరానికి వీరి గుండెలుకూడా కఠిన శిలలయ్యాయి " అనిఆవిడ మండిపడుతున్నది

తుకారాం ఆలోచించాడు కొన్ని క్షణాలు అంతర్ముఖుడయ్యాడు హే పాండురంగా భక్తవత్సలా ఏమిటీ వైపరీత్య పరిస్థితి? కన్నబిడ్డమృత్యుశయ్యపై యున్నను లెక్కచేయక ఈ భక్తుడు సత్సంగాని కేతెంచాడు విఠలా! నీవే శరణనినమ్మిన భక్తుని నీవు కాపాడనిచో మరె వరు కాపాడగలరు? ఏమిటీ విషమపరీక్ష? రుక్మిణీనాథా నీ పాదాలాశ్ర యించిన భక్తులను నీవు పరీక్షించుట ధర్మముకాదు భక్తుడైన శివశంకర్‌ని నీవు కాపాడాలి నీ భక్తుడు పవిత్రుడని నీవు ఈనాడీసభలో నిర్ణయము చేయాలి లేదా తుకారాం ఈ ప్రపంచానికి మిగలడు అని ప్రార్థించి భగ వన్నామము చేయసాగాడు తుకారాంజీ సంకీర్తనచేయగా అక్కడ గుమి గూడియున్న భక్త సమూహము పరవశించి పాడసాగారు

విఠలా విఠలా! పాండురంగా
పాండురంగా! జై జై విఠలా!

పండరినాథా జై జై విఠలా!
పురందర విఠలా హరి విఠలా!

సంకీర్తన తీవ్రస్థాయికి చేరింది తుకారాంజీ నేత్రాలుమూసి పరవశించి గానము చేయుచు నృత్యము చేస్తున్నాడు ఆహా! అత్యద్భుత లీలా విలాసము భక్తజనహృదయాలలో ఆరని అనుభవ దీపము సకల జనులు వీక్షించుచుండగనే శివశంకర్ భార్య పడవేసిన బిడ్డ మృతకళేబరము కదల సాగింది బిడ్డడు కళ్ళుతెరిచాడు తుకారాంని చూశాడు బల్లి వలె ప్రాకుతూ ముందుకురికి తుకారాం మహాత్మునిపాదాలను గట్టిగపట్టుకున్నాడు తుకారాం ఆ బాలుని ఎత్తుకొని తల్లికి అందిస్తూ "అమ్మా ఇదిగో నీబిడ్డడు మట్టిలో లయించుటకు బదులుగ చిరంజీవియై నీచెంతకరుదెంచిన నీముద్దుల కుమారుడు పాండురంగని అనంత కృపావీక్షణమునకు పాత్రుడై పునర్జన్మ నొందిన అదృష్టవంతుడు తల్లీ! నీబిడ్డను నీవు తీసుకో కానీ పాండు రంగడు బండకాదని భక్తులకు తానే అండయని తెలుసుకో భగవానుని దివ్యకరుణతో సాధించలేనిదంటూ యుండదు భగవంతుని విశ్వసించు బ్రతుకును బాగుచేసుకో ప్రారబ్ధవశాత్తు లభించు ఫలమును ప్రశాంతముగా అనుభవించాలి. భగవన్నామమునందు అకుంఠిత విశ్వాసముంచండి తరించిపోగలరు" అని సందేశమిచ్చి భగవన్నామ ప్రభావమును తెలియ చేయుచు కీర్తన గానము చేశాడు.

నామ ఘేతా ఉరా ఉరీ
హోయ సంసారీచీ తుటీ

ఏసాలాభ బాంధా గాంఠీ! విఠలా పాయీ పడే మిఠీ!
నామ పర తేఁసాధన నాహీఁ! జేతుం ఆణీక కరసీ కాఁహీఁ!
హే కరోనీ సంగే తుకా! నామ ఘేతాం రహూఁ నకా!

"భగవన్నామమును గానము చేయండి భవబంధములనుండి బయట పడండి.

భగవన్నామమునకు మించిన లాభములేదు విఠలుని దివ్య కరుణాదృష్టితో సకల బాధలనుండి విముక్తి పొందగలరు

నామసాధనకు మించిన అత్యుత్తమ సాధనలేదు హరిగుణ శ్రవణ కీర్తనాదులయందు మనస్సును లగ్నముచేసిన భక్తజనులు తప్పక తరించగలరని తుకారాం భేరిని మ్రోగింపుమన్నాడు యని పరవశించి గానము చేసాడు

తన తప్పిదమును గ్రహించి శివశంకర్ సతీమణి తుకారాంజీ పాదాలపై బడి క్షమాభిక్ష నర్థించింది మానావమానాలు తుకారాం మనస్సును తాకలేవు నిందా సుతులకు తాను అతీతుడు తన సహజధోరణిలో సంకీర్తన కొనసాగించి భక్తులను ఆనందింపచేసెను తుకారాంకు భగవన్నామముయందున్న విశ్వాసమునకు నిందా స్తుతులను సమముగ భావించు అతని విశాల దృక్పథమునకు భక్తులు విస్మయమొందారు

తుకారాంజీ నివసిస్తున్న దేహూ గ్రామములో ముంబాజీ సలోమాల్ అను ఇరువురు బ్రాహ్మణ పండితులుండెడివారు కులకక్షతో కుమిలే కుటిలురు వారికి తుకారాంపై మత్సరము మెండు తుకారాం రచించిన అభంగాలు ప్రజలు నెక్కువగా ఆకర్షింపుటయే వారి ఈర్ష్యకు ప్రధాన కారణము శూద్రకులజుడైన తుకారాంలో గోచరించే పాండిత్య వైభవమును చూడలేకపోయేవారు తుకారాంని ప్రజలలో బలహీన పరచడానికి అనేక ఎత్తుగడలు వేశారు కానీ ఫలించలెదు చివరగా ఒక బృహత్పథకాన్ని రూపొందించుకున్నారు తుకారాం గానముచేయు అభంగాలను తాను రచించినవి కావనియు పండితులైన తాము రచించిన కీర్తనలను తుకారాం అపహరించి గానముచేయుచున్నాడనియు న్యాయస్థానమునకు ఫిర్యాదు చేశారు తుకారాం న్యాయస్థానము ముందు నిలబడవలసి వచ్చింది న్యాయాధిపతి తెలియజేసిన అభియోగమునకు తుకారాంజీ సమాధానము చెబుతూ అవును అభంగాలు నేను రచించలేదు చదువు సంధ్యలులేని నేను కీర్తనలెలా రచించగలను? అదంతయూ నా ఆరాధ్యదైవమైన పండరీనాథుని మహిమా విశేషమే పాండురంగడే రచన చేశాడు కీర్తిని నాకు అందించాడు అని రుక్మిణీనాథునియందు తనకున్న ప్రగాఢ విశ్వాసాన్ని వెలిబుచ్చాడు

ముంబాజీ సలోమాల్ మధ్యలో కల్పించుకొని ఇదంతయు నాటకము వంచన చేయడానికి అభినయించే బూటకము తాను చెప్పింది సత్య

మైనచో అందులకు పరీక్ష ఒక్కటే తుకారాం అభంగములను కట్టగట్టి ఇంద్రయాణినదిలో పారవేయాలి అవి వాస్తవముగా పాండురంగడే వ్రాయించినచో తిరిగి సజీవముగా ఆవిర్భవించగలవు అని తమ కుటిల ప్రణాళిక న్యాయాధికారి ముందుంచారు న్యాయాధికారి అది సబబని నిర్ణయించడము జరిగింది తుకారాం మారుపలుకక పాండురంగ నామ జపములో మనస్సును లగ్నము చేశాడు

తుకారాం అభంగాల ప్రతులను శిరమున ధరించి భార్యా పుత్రులు పురజనులు భక్తులు వెంట నడువగ ఇంద్రయాణి నదీతీరమును చేరాడు ప్రధాన న్యాయాధిపతి అచ్చట కరుదెంచాడు ఆయనవెంట ముంబాజీ సలోమాల్ కూడా వచ్చారు తుకారాం! అభంగాలను నీ స్వహస్తముల తోనే ఇంద్రయాణిలో పారవేయుము అని న్యాయాధిపతి తెలిపాడు తుకారాంజీ అభంగాలను చేతపట్టుకొన్నాడు ఇంద్రయాణి నదీమ తల్లికి నమస్కరించాడు నేత్రములవెంట బాష్పములు రాలుచుండ హే విఠలా! పాండురంగా! దీనశరణ్యా! ఈ అభంగాలు నీవేకాని నావికావు కరుణా సముద్రుడవైన నీవు ఈ కీర్తనలన్నీ నీ దాసుడైన ఈ తుకారామునిచే పలికించావు ప్రభూ! ఇవన్నియు నీ ప్రవచనములే ప్రసాదములే ఆనాడు మత్స్యావతారుడవై సాగర గర్భమునయున్న వేదములను వెలికితీసినావు ఈనాడు వేదసారమైన నీ అభంగాలను రక్షించవలసిన బాధ్యత కూడా నీదే అని ప్రార్థించుచు తుకారాం అభంగాలను ఇంద్రయాణిలో విడిచెను

కొన్ని రోజులు గడిచింది అయినా అభంగాలు పైకి రాలేదు తుకారాం నిద్రాహారాలు మాని ఇంద్రయాణి నదీతీరమునందే ఆసీనుడై కీర్తన చేయసాగాడు ముంబాజీ సలోమాల్ తుకారాంని అవహేళన చేయసాగారు అనవసరముగా దీక్షబూని ప్రాణాలు పోగొట్టుకోవలదని హెచ్చరించసాగారు తుకారాం అభంగ రచన అభూత కల్పన యని ప్రచారము సాగించారు ప్రజలను నమ్మించారు తామే అభంగాల రచయితలమని పదుగురికి చాటి చెప్పుకున్నారు శిష్యులను కూడా తయారుచేసుకున్నారు శిష్యులు వెంటరాగా అట్టహాసముగ వీథులవెంట ఊరేగసాగారు

తుకారాం ఇంద్రయాణి నదీతీరమును వదలి కదలలేదు పంద్రెండు రోజులు గడిచాయి ఒక్కసారి దేవదుందుభులు మ్రోగాయి గంగామాత

తన హస్తములయందు అభంగములను నిడుకొని తుకారాం ఎదుట ప్రత్యక్ష మైంది తుకారాంజీకి అభంగములందించి ఆశీర్వదించింది తుకారాం గంగా మాతను స్తుతించాడు ఆమె అదృశ్యమైంది అంతే ముంబాజి యుక్తుల అదృష్టము కూడా అంతరించింది ప్రజలు పెద్దపెట్టున జయజయ ధ్వానాలు చేస్తూ తుకారాం మహాత్ముడని నినాదాలిస్తూ ఆయన పాదాలపై పడ్డారు గంగాదేవి ఇచ్చిన అభంగములను తుకారాం శిరమున ధరించి నడువ సాగాడు భక్తులందరు పెద్ద ఊరేగింపుతో తుకారాంని నడిపించి తీసు కొని రాసాగారు మార్గమధ్యములో ముంబాజీ సలోమాలా లిద్దరూ తమకు ప్రాప్తించిన తాత్కాలిక శిష్యగణమును వెంటనిడుకొని ఎదురయ్యారు. తుకారాం పాదాలపై బడి నమస్కరించారు గురువులు కావాలనే ఉద్దేశ్య ముతో తాము తుకారాంపై అభియోగాలు మోపామని తెలియజేశారు తుకా రాం వారిపై సానుభూతిని క్రుమ్మరిస్తూ మందస్మిత వదనారవిందుడై గురుస్థానము ప్రమాదకరమని హెచ్చరిస్తూ అభంగము గానము చేశాడు

గురుశిష్యణ పేంతో అధ రు ఆకూ
భూతీంనారాయణ ఖరా! ఆప్ణైసాచి దూపరా
మేఘవృష్టి మేం కరావా ఉపదేశ్! పరిగుహనే న కరావా శిష్య!
నాటా లాభే త్యాస! కేల్ అర్థ తర్మాచా
పక నేకాం సాహ్యాకరూం అవదేధరూం లుపంథ!
ఉపదేశీ తుకా మేఘవృష్టి నేం ఆ ఇకా
సంకల్పాసీ ధోకా! సహజతేం ఉత్తిమా!

గురుస్థానము నాక్రమించి శిష్యులను తయారుచేసుకొని పతనము చెందకు గురుస్థానము నిన్ను ఆధ్యాత్మికముగా పతనము చేస్తుంది అందరిలో నారాయణుడు అంతర్యామియై యుండ నీవు గురుపద వినిపొంద నాసించుట అనుచితముకాదా? గురువనెడి అహంకార ముతో జీవించుట ప్రమాదకారియై యున్నదని గ్రహించి సర్వులలో నారాయణుని దర్శించి తరించు తుకారాం బోధకుడై ఈ సందేశము నందించడము లేదు పాండురంగడే తనసుండి మేఘవృష్టివలె ఈ

వచనములను పలికింపమన్నాడు అని గానముచేశాడు. ముంబాజీ సహోమాల్‌లు సిగ్గుపడి తలవంచారు

పూనా నగరములో ఏకాదశి పర్వదినమునాడు తుకారాం పాండురంగ సంకీర్తన చేయుచుండెను విశేషముగా భక్తులు హాజరై శ్రవణంచేయు చుండిరి మహారాష్ట్ర వీరుడైన శివాజీ మొగలుసైనికులచే వెంబడించబడి పూనాచేరాడు తుకారాం సంకీర్తన చేయుచుండిన సభామండపంవద్ద కరు దెంచాడు భక్తజనులలో ఆసీనుడై తుకారాంజీ సంకీర్తననాలకించసాగాడు మొగలు సైనికులు ఎలాగో శివాజీ జాడను పసికట్టారు పాండురంగ దేవా లయ ప్రాంగణమును ముట్టుముట్టారు భక్తులు విషయమంతా పూసగ్రుచ్చి నట్లు తుకారాంజీకి వివరించారు ధర్మదీక్షాపరుడైన శివాజీని రక్షించాలని తుకారాం సంకల్పించాడు శివాజీని రక్షించమని పాండురంగదేవుని ప్రార్థిం చాడు భక్తునిమొర భగవానుడు పెడచెవిని పెడుతాడా? ఆలయంలోని పాండురంగస్వామి విగ్రహమునుండి దీపశిఖంలె నీలికాంతిలో జ్యోతి బయలుదేరుతున్నట్లు తుకారాం దర్శించాడు గుడిబయటకువచ్చి ఆ జ్యోతి శివాజీ రూపమును ధరించి మొగలుసైనికులు దర్శించుచుండగా గుఱ్ఱమును ఎక్కి దూసుకుంటూ వెళ్ళిపోయెను శివాజీ పారిపోవుచున్నాడని తెలుసు కొనిన మొగలు సైనికులు అశ్వారూఢులై శివాజీ ననుసరించిరి అరణ్య మధ్యమున కేగగానే శివాజీ రూపముయున్న పండరీనాథుడు తన విశ్వ రూపమును ప్రదర్శించుచు అనేక గుర్రములపై అనేకమంది శివాజీలు కదులుచున్నట్లు ప్రదర్శించి సైనికులను ఒక్కొక్కరిని ఒక్కొక్క దారిన మళ్ళించి సైన్యము చెల్లాచెదురయ్యేలా చేసెను వెనుదిరిగి పూనాకరుదెంచి తుకారాంజీకి జ్యోతి దర్శనమొసంగి మరల విగ్రహములో లీనమయ్యెను శివాజీ మహారాజు తుకారాం పాదాలనంటి నమస్కరించెను తుకారాం శివాజీని ఆశీర్వదించెను

తుకారాం తనభక్తి పారవశ్యములో గృహధర్మాన్ని సంపూర్ణముగా విస్మరించడము జరిగింది ఇల్లంతా గుల్లయిపోయింది కుటుంబ సభ్యులు ఆకలితో అలమటించే పరిస్థితి ఆసన్నమైంది తన భార్య జీజాబాయి ఆలో చించింది ఏదైనా వ్యాపారము చేసి జీవిస్తే బాగుండునని సంకల్పించింది

కానీ ఏమిలాభము! గతములో తన భర్తచేత ఎన్నో వ్యాపారాలు పెట్టించింది ఉద్యోగాలు చేయించింది పర్యవసానము శూన్యహస్తాలు మిగిలాయి అదియునుగాక ప్రస్తుతము వ్యాపారము చేయుటకు పెట్టుబడికూడా లేదు అలాగని ఊరుకుంటే డొక్కాడదు ఆలోచించింది తన మాంగల్యాన్ని విక్రయించాలని నిర్ణయించుకుంది పసుపు తాడును మెడలో ధరించి మాంగల్యమును విక్రయించింది ఆ డబ్బుతో వ్యాపారము చేయాలని సంకల్పించింది డబ్బు చేతపట్టుకొని తన భర్త తుకారాంను సమీపించింది ఏమండీ! మనము గృహస్థులం భక్తి మంచిదే నేను కాదనను భక్తుడు సంసారాన్ని పాడుచేసుకోమని ఏ ధర్మశాస్త్రము చెబుతుంది? పైగా భక్తుడు ఆదర్శ జీవనాన్ని గడిపి ఇతరులు అనుకరించదగిన వ్యక్తిగా రాణించాలని విజ్ఞులు చెబుతారు మీ భక్తి ఫలితముగా మన ఇల్లంతా గుల్లయిపోయింది దారిద్ర్యము ఇంటిలో విలయతాండవము చేయుచున్నది ఏదో ఒక వ్యాపారము చేయకుంటే పిల్లలనుకూడా దక్కించుకోలేము వ్యాపారము చేయుటకు ఇంటిలో పైస కూడా లేదు నా మాంగల్యాన్ని అమ్మి డబ్బు తీసుకొనివచ్చాను ఆ డబ్బుతో సరుకులు తెప్పిస్తాను మీరు వాటిని అమ్మి మమ్మలను రక్షించండి లేదా మమ్మల్నందరిని ఏ బావిలోనో పడవేసి మీరు భక్తి సాగరములో ఓలలాడండి అంటూ దుఃఖించింది

తుకారాం భార్య మాటలకు స్తంభించిపోయాడు నిజమే ఆమె మాటలలో ఎంతో సత్యముంది తనవల్లనే తన కుటుంబము నానాబాధలకు గురియగుచున్నది భార్య మాంగల్యమును విక్రయించి ధనమునిచ్చుట అతని అంతఃకరణను ముక్కలు చేసింది పశ్చాత్తాపముతో హృదయము కుంమకపోతున్నది తుకారాం భార్యను సమీపించి జీజీ! నాతప్పును నేను తెలుసుకున్నాను నా కారణముగా మీరు అనేక కఠోర బాధలకు గురియ్యారు నేను తప్పక వ్యాపారము చేస్తాను ధనము నార్జిస్తాను మిమ్మలను పోషిస్తాను అని ఉద్వేగముతో పలికాడు భార్య సంతసించింది సరుకులు తెప్పించింది బండిలో వేయించింది భర్తకు అప్పచెప్పింది తుకారాం ఆ సరుకులను తీసుకొని అమ్మడానికి సంతకెళ్ళాడు

"భగవాన్ పండరీశ ! నిన్ను వదలి జీవించలేని నా అసమర్థత సమాజములో అజ్ఞానముగా గుర్తించబడింది అమాయకత్వము నన్నా శ్రయించియున్న నా కుటుంబీకులను అపహాస్యపాలు చేసింది వారికి సంతృప్తిని కలిగించు నిమిత్తము చివరగ ఈ వ్యాపారము చేయుచున్నాను నీ దయయే నా బ్రతుకును నడపాలి అని ప్రార్థించి సరుకులను సంతలో వుంచి నామజపము చేస్తూ కూర్చున్నాడు తుకారాం

పాండురంగని అదృశ్య అమృత హస్తము కదిలింది పండరీనాథు దివ్యకృపావృష్టి తుకారాంపై వర్షించింది జనము ఎడతెరిపిలేకుండా తుకారాం వద్దకువచ్చి సరుకులను కొంటున్నారు చూస్తుండగనే కొద్దిసేపట్లో సరుకులన్నీ అమ్ముడు పోయాయి తుకారాం హృదయము పరవశించి పోయింది పాండురంగని కరుణకు అంతర్యములో పొంగిపోయాడు డబ్బు చేతపట్టుకొని ఇంటికి బయలుదేరాడు తాను చేసిన వ్యాపారమేదీ సక్రమముగ కొనసాగలేదు ఆ పాండురంగని అనంత కృపావిశేషముచే ఈరోజు చక్కగా వ్యాపారము చేయగలిగాడు డబ్బు తీసుకొని వెళ్ళి భార్య కివ్వగానే ఆవిడెంతగానో సంతోషిస్తుంది అని ఆలోచిస్తుండగనే అతనికి మెరుపులాంటి ఆలోచన వచ్చింది స్త్రీలు డబ్బుకన్నా చీరల నెక్కువగా ప్రేమిస్తారు చీరలకన్నా బంగారు నెక్కువగా ఆరాధిస్తారు కనుక తన వద్దనున్న డబ్బును బంగారుగా మార్చి తన భార్యకిచ్చినచో ఆవిడెంతగానో సంతోషించుననని భావించిన తుకారాం ఇంటికి వెళ్ళకుండా సరాసరి నగల దుకాణమువద్ద కెళ్ళాడు తనవద్దనున్న ధనమునకు సరితూగుబంగారమును ఇవ్వమని నగల వర్తకుని కోరాడు నగల వర్తకుడు అతడిచ్చిన ధనమునకు సరితూగు బంగారమును పొట్లముకట్టి తుకారాంకి ఇచ్చాడు తుకారాం పాండురంగ నామము చెప్పుకుంటూ ఇల్లు చేరాడు

భర్త వస్తున్నాడని దూరమునుండియే గ్రహించిన జిజాబాయి ఆశ్చర్యచకితురాలైంది సంతనుండి ఇంతత్వరగా వస్తున్నాడు పైగా సరుకులు లేకుండా ఖాళీగా వస్తున్నాడు భక్తులకు వస్తువులను దానము చేసాడేమో? వ్యాపారాన్ని మళ్ళీ నష్టపెట్టటముంచాడేమో? అని ఆలోచించసాగింది తుకారాం వచ్చాడు భార్య ప్రశ్నించక పూర్వమే తాను వ్యాపారము చేసిన

తీరు పాండురంగని దివ్యకృప పనిచేసిన విధము వివరించసాగాడు జీజా బాయి మురిసిపోయింది తాను సరుకులను విక్రయించగా వచ్చిన ధనమును బంగారముగామార్చి తీసుకరావడము జరిగిందని చెప్పి నగల వర్తకుడిచ్చిన పొట్లమును తుకారాం తన భార్య కిచ్చాడు

జీజాబాయి అధికోత్సాహముతో పొట్లము విప్పి చూసింది చూసిన మరుక్షణమే ఆవిడ కాళీ స్వరూపముగా మారింది అగ్నిని క్రుమ్మరించు వీక్షణములతో తుకారాం వంక చూసింది తుకారాం దిగ్భ్రాంతి చెందాడు ఆమెలో వచ్చిన పరిణామానికి కారణమేమిటో తన కవగతము కాలేదు ఆమె క్రోధము తీవ్రస్థాయికి చేరింది రుద్రస్వరూపమును గుర్తు తెస్తున్నది ఆమెను ఆ విధముగా తుకారాం చూడలేకపోయాడు జీజీ ఎందుకిలా మారిపోయావు? ఏమి జరిగింది? నీనుండి కదిలే ఆ చూపులు నాలో తీవ్రభయభ్రాంతుల్ని రెచ్చగొడుతున్నాయి నిన్ను నేనలా చూడలేను నీవు మామూలుగా మాట్లాడు అన్నాడు

నీవు మనిషివేనా? ఇల్లంతా దరిద్రదేవత ఇనుప పాదాలక్రింద నలిగి గుల్లయి పోయింది చివరగ మిగిలియున్న మాంగల్యాన్ని విక్రయించి డబ్బు తెచ్చి ఇచ్చాను వ్యాపారము చేస్తానని నమ్మించి మా బ్రతుకును నాశనము చేస్తావా? మా చివరి ఆశనుకూడా మంటగలిపావు ఎందుకు మామీద నీకంతపగ? అందరిని ప్రేమించగలిగే నీవు మమ్ములను సదా దుఃఖవలయములో పడదోయుటెందులకు? చెప్పు ఏమిచేశావు? సరుకులు ఎవరి కిచ్చావు? లేదా విక్రయానంతరము వచ్చిన ధనమును ఎవరికైనా ధర్మము చేశావా? నిజం చెప్పు? అంటున్నది తుకారాం సతీమణి జీజా బాయి

"అదేమిటి జీజీ వ్యాపారముతో ఆర్జించిన విత్తమును బంగారంగా మార్చాను, ఆ బంగారమును నీకిచ్చానుగా? అని అమాయకంగా అన్నాడు తుకారాం

ఏమిటి? నాకు బంగారము తెచ్చిఇచ్చావా? మట్టి మనస్సు ఉక్కు హృదయము కలిగిన నీ నుండి బంగారము అందించబడుతుందా? చూడు

అంటూ ఆ పొట్లమును తుకారాంపై విసిరింది తుకారాం పొట్లం విప్పి చూశాడు అక్కడున్నది స్వర్ణము కాదు దానికి బదులుగ రాగి యున్నది. తుకారాం ఆశ్చర్యపోయాడు అయోమయ ధోరణిలో అర్ధాంగివంక చూశాడు

అవునే! నీవు భక్తుడివికదూ? రాగికి బంగారమునకు తేడా తెలియనివాడు భక్తుడా? నీవలాంటి భక్తుడివా? మోసగాడా! భార్యాబిడ్డలను సర్వనాశనము చేస్తున్న నిన్ను ఆ భగవంతుడు కూడా క్షమించడు' అని అనేక విధాల తుకారాంను నిందిస్తున్నది తుకారాం ఒక్క మాట కూడ మారుపలుకలేదు చెట్టువలె నిలబడిపోయాడు వృక్షశాఖలవలె ముఖము వాలిపోయింది జీజాబాయి తుకారాం వంక చూసింది దీనముగా కనుపిస్తున్న తన భర్తను చూసరికి ఆవిడ హృదయము ద్రవించింది మనస్సులో జాలి కదిలింది తన భర్త విషయము తనకు తెలియనిదికాదు ఆతడిని వ్యాపార నిమిత్తము పంపుటయే దోషమని భావించి భర్తను నిందించినందులకు పశ్చాత్తాపము చెందింది వెంటనే తుకారాంని సమీపించి ఏమండీ! లేవండి! భోంచేద్దురుగాని చాలా అలసిపోయినట్లున్నారు మీరు మంచివారే నాకు తెలుసు ఆ నగల దుకాణమువాడే మిమ్మల్ని మోసము చేశాడు అన్నది ఇంతవరకు కొయ్యమొద్దులా నిలబడియున్న తుకారాం ఆ మాట వినగానే ఆమె మాటల నడ్డగిస్తూ జీజీ! నీకు తృప్తిగా నిచో నన్నే ఇంకా దూషించు అంతేకాని ఆ నగల వర్తకుడు నన్ను మోసము చేశాడంటే నేను ఒప్పుకోను అన్నాడు

జీజాబాయికి భర్త ధోరణి అర్థము కాలేదు మరి నగల వర్తకుడు చేసింది మోసము కాదా? అని ఆమె ఆలోచిస్తుండగనే తుకారాం కలుగజేసుకొని జీజీ! పిచ్చిదానా! నన్ను ఆతను మోసము చేయడమేమిటి? నన్నెవ్వరూ మోసము చేయలేరు నాకు రాగియైనా బంగారమైనా ఒక్కటే అన్ని వస్తువులలో అధిష్ఠానమై వెల్గొందు పాండురంగని దివ్యచైతన్యమును దర్శించే నాకు వస్తువులపై వ్యామోహము లేదు నన్నెవ్వరూ మోసము చేయలేరు మోహములో తోయలేరు నగల వర్తకుడూ అంతే ఒతడు నన్ను మోసగించలేదు తానే మోసపోయాడు అంటూ కీర్తన గానము చేశాడు

అది బీజ ఏకలే
ఏకబీజ పోటీ తరుకోటి కోటి
జన్మ ఘేతి సుమనే ఫలే
వ్యాపుని జగతా తూహిం అనంత
బహువిధ రూపా ఘేసి ఘేసి
పరీ అంతీ బ్రహ్మ ఏక్ లే

అదిదైవమైన పాండురంగడే సత్యము ఒకే బీజమునుండి శాఖోప శాఖలు విస్తృతమగునట్లు ఒక చైతన్యమునుండి అనంత విశ్వము విస్తృతమైనది పాండురంగడు జగద్వ్యాపియై యున్నాడు అనంతుడై యున్నాడు అన్ని రూపాలలో గోచరించునది ఉపాదాన కారణమైన తానే ఉన్న ఒకానొక బ్రహ్మపదార్థము తానే " అని గానము చేసెను

ఈ సందేశమునను సరించి తుకారాంజీ మానసిక ప్రాబల్యమును శీలసౌందర్యమును మనము గమనించవచ్చును అతడు సర్వత్రా పాండు రంగనే దర్శించేవాడు పండరీనాధుని దివ్య నామామృత పానముకన్నా అన్యముగా తానేదీ వాంఛించడు వస్తువుపై తనకు మమకారము లేదు వ్యక్తులపై మమతయులేదు అతడి దివ్య కళామయ దృష్టిలో అంతయూ పాండురంగడే

ఒకనాడు శివాజీ మహారాజ్ తుకారాంజీకి భక్తిప్రపత్తులతో విలువైన కానుకలనంపెను కానుకలుతెచ్చిన రాజఉద్యోగులనుద్దేశించి తుకారాం ఆయ్యా శివాజీ మహరాజ్‌కు నాపైయున్న ప్రేమకు నేను కృతజ్ఞుడను కానీ నాకు ఆ కానుకలు వలదు పాండురంగ భగవానుని దాసుడనైన నాకు ఇలాంటి విషయములయందు ఆసక్తి గోచరించదు దయచేసి మీరు తెచ్చిన కానుకలను మీరే తీసుకొని వెళ్ళుడు అని తెలియచేశాడు

తుకారాంజీ కానుకలను నిరాకరించిరనిన విషయము శివాజీ ప్రభువుకు తెలిపెను పేదవాడైన తుకారాంకు ఎలాగైనా సహాయం చేయవలెనని శివాజీ అభిప్రాయము ఆభరణముఖు కానుకలు ఎలాగూ తుకారాం స్వీక

రించడు గనుక కనీసము ఆహారమును కుపయోగించుడం గోధుమలు ఒక మూట పంపెను తుకారాం లేనిసమయాన ఇంటిలో ఎమిచెప్పకుండ ఉంచి రమ్మని శివాజీ తెలియజేసెను రాజభటులు గోధుమల మూటను తుకారాం లేనిసమయముచూచి ఇంటిలోవేసి వచ్చిరి తుకారాం వచ్చి ఆ మూటను చూశాడు భార్యనడుగగా తనకేమీ తెలియదని జీజాబాయి చెప్పెను ఇదంతయు శివాజీపన్నిన యుక్తియని గుర్తించిన తుకారాంజీ తమ గృహములో ఒక్కపూటకు ఆహారముగ సరిపోవు ధాన్యమును మాత్రమే ఉంచుకొని మిగత ధాన్యమును పేదలకు పంచిపెట్టెను ఈ విషయము తెలిసిన శివాజీ మహారాజు తుకారాంజీ ఆదర్శ జీవనంతికి ముదమంది నేత్రములలో ఆనంద బాష్పములను దాల్చెను

తుకారాంజీ తన జీవనయాత్రను ముగించుకొని అమరధామం చేరు క్షణము సమీపించనున్నది తాను నిష్క్రమించు సమయము వారమురోజులుండగనే తుకారాం దెహూ గ్రామములో ప్రతి ఇంటికి వెళ్ళి తనకు ఎనిమిదవ రోజు వైకుంఠమునుండి గరుడవాహనము వచ్చుననియు తనతో పాటు వైకుంఠమేగుటకు అనుసరించువారలను వెంటతీసుకొని వెళ్ళబడునని యు తెలియజేసెను కానీ ఎవ్వరూ ముందుకు రాలేదు చివరిగ తన భార్యయైన జీజాబాయిని పిలిచెను ఆవిడకు ఇంటిపనులు బాధ్యతలున్నాయనియు తాను రాలేననియు తుకారాంకూడా వారమురోజులలో తిరిగి రావలయుననియు అలాగైతేనే భర్తను పంపుటకు తాను అనుమతి నివ్వగలననియు తెలిపెను అమాయకురాలు జీజాబాయి వైకుంఠయాత్ర యను నది తిరిగివచ్చు ప్రయాణముకాదని ఆమెకు తెలియదు తెలియజేసిన సమయమునకు ప్రజలు తండోపతండాలుగ ఇంద్రయాణి నదీతీరమును చేరిరి తుకారాంజీ తంబూర చిఱుతలు చేతపట్టుకొని పాండురంగనామము చెబుతూ నృత్యము చేయసాగెను ఇంతలో వైకుంఠము నుంచి గరుడ వాహనము వచ్చి ఇంద్రయాణి నదీతీరములో తుకారాం ముందు నిలిచెను తుకారాంజీ గరుత్మంతుని పైనున్న విమానములో ఎక్కెను చూస్తున్న జనులందరు కన్నీరు గార్చుచుండిరి తుకారాం అక్కడ గుమిగూడియున్న ప్రజలకు నమస్కరిస్తూ తన చివరి అభంగాన్ని గానము చేసెను

అమ్హీ జాతో అపుల్యా గాంవా
ఆముచా రామరామ ఘ్యావా॥
ఆమచీ తుమచీ హేంచ భేటీ
తుకో బోలా జన్మతుటీ॥
అజవర్ మీ హోతో తుమచ్యా గాంవీ
ఆతాం కృపా అసో ద్యావీ॥
రామకృష్ణ విఠల బోలా
తుకా జాతో వైకుంఠాలా॥

"అందరికీ నా నమస్కారములు మహాజనులారా! నాకు సెల వీయండి నేను వైకుంఠమున కేగుచున్నాను ఇదియే మన కడ పటి కలయిక. నా కర్మత్రయము ధ్వంసమైనది నేను భగవానుని భక్తిచేయుటకు మీరందరూ ఎన్నోవిధాల నాకు సహాకరించారు మీకు నేను కృతజ్ఞుడను "పాండురంగహరి - రామకృష్ణహరి" అనెడి నామోచ్చారణయే నాకీ దివ్యస్థలిని ప్రసాదించినది మీరం దరుకూడా భగవన్నామముతోనే తరించిపోవచ్చని ఎలుగెత్తి చాటు తున్నాను" అని కీర్తనచేసి అంతర్ముఖుడయ్యెను

ప్రజలందరు చూచుచుండగనే విమానము అకాశములో కదిలి కదిలి

కనుమరుగైనది. తుకారాం అమరజ్యోతి ఆయన సందేశము అమూల్యము అమృత తుల్యము ఆనందప్రదము.

* ఓం శ్రీ భక్తమానస నివాసాయ నమః *





# శ్రీ చైతన్య మహాప్రభువు

అరుణోదయ భాస్కర తేజమునకు అర్రులుచాచు చక్రవాకపక్షిలో ప్రథమ కిరణ దర్శనముతో కదిలిన స్పందనమేమిటి? మేనులను చల్లబరచు చంద్రోదయ వీక్షణములో చకోరమునుండి కదిలే అనురాగవందన మేమిటి?

ఆకసమున నీలిమేఘమును చూచి పరవశించు చాతకపక్షి మానస వనవాటికలో చిగురించి పుష్పించే ఆనంద నందనవందనమేమిటి? వసంత ఋతువులోని కోయిలగొంతుక నలంకరించిన ప్రేమరస తరంగాలేమిటి? ఈ స్పందనల వెనుక కదులుతున్న జీవనజ్యోతి ఏమిటి? పారవశ్య ప్రేమానందము. అనూహ్య ఆంతర్య విమలానందము. విశ్వాలయ గర్భగుడిలో దాగియున్న నళినవదనము. చూపులకు చూపుయై భాసిల్లు కమలనయనము. గుండెవడిలో గుసగుసమను అమరభజనము! సకలమును కనిపెట్టి కనికరించు కారుణ్యచరణము.

భగవానుని కారుణ్యచరణ దర్శనము కొరకు తపించువారే భక్తులు. ఆ దివ్యచరణ సన్నిధికి దూరమై వారు జీవించలేరు. ఒక్క క్షణము కను మరుగైనచో పిల్లవానివలె రోదిస్తారు పిచ్చివానివలె పరిభ్రమిస్తారు. ఆర్తి

దివ్యపారవశ్య భక్తిలో మునకలేసి ఎందరో భక్తులు తరించారు. అట్టిభక్త శ్రేణిలో అగ్రగణ్యులు శ్రీ చైతన్యులవారు.

వంగదేశమునందలి నవద్వీపమనుచోట శ్రీ చైతన్యులవారు జన్మించారు. ఆయనతండ్రి జగన్నాథమిశ్ర. తల్లి శచీదేవి. వారికి ఎనమండుగురు ఆడపిల్లలు వరుసగ జన్మించిరి. కానీ ఒక్కరైనను జీవించక అందరు మరణించిరి. కొంతకాలమునకు తొమ్మిదవ గర్భమున ఒక పిల్లవాడు కలిగెను. వానికి విశ్వరూపుడని పేరుపెట్టిరి. విశ్వరూపుడు విజ్ఞానఖనియై, విశేషప్రతిభతో రాణించసాగెను. శైశవముననే వేదవేదాంగముల నభ్యసించి తీవ్రవైరాగ్య మనస్కుడై గృహమును పరిత్యజించి, వెడలిపోయెను. సన్యాసదీక్షను స్వీకరించి, మహాపుణ్యక్షేత్రమైన పండరీపురములో మరణించినట్లు శ్రీ చైతన్యులవారు తన దక్షిణదేశయాత్ర సందర్భములో విషయ సేకరణచేశారు.

విశ్వరూపుడు జన్మించిన కొంతకాలమునకు శచీదేవి మరియొక మగబిడ్డను కనెను. దశమ గర్భమున జన్మించిన ఆబాలునికి "నిమాయ్" అని పేరుపెట్టెను. శచీదేవి వేపచెట్టుక్రింద ఈ బాలుని ప్రసవించుటచే ముద్దుగ "నిమాయ్" అని నామకరణము చేసినట్లు కొందరి అభిప్రాయము. నిమాయ్ చాలా అందమైనవాడు. అందుచే అతనిని గౌరాంగుడని పిలిచెడివారు. తండ్రియైన జగన్నాథమిశ్ర కుమారుని విశ్వంభరుడను పేరుతో పిలువసాగెను. ఆధ్యాత్మిక చింతనతో ఆనందశిఖరముల నందుకొన్న ఈ విశ్వంభరుడే చైతన్య మహాప్రభువాయెను.

శ్రీ చైతన్యునిలో శైశవముననే ఎన్నో ఆధ్యాత్మిక అద్భుతములు గోచరించినవి. చైతన్యునికి నామకరణముచేయు సందర్భమున అందమైన వస్తువులు, పిండివంటలు, వస్త్రములు, బొమ్మలు, గ్రంథములు మొదలగు ఎన్నో వస్తువులనుంచి, వాటిమధ్య బాలుడైన చైతన్యులవారి నుంచి పరీక్షించిరి శ్రీ చైతన్యులు మెల్లగా కదిలి శ్రీమద్భాగవత గ్రంథమును ముట్టుకొనిరి. భావిలో చైతన్యుడు పరమ భాగవతోత్తముడు కాగలడని ఆనాడే పండితులు నిర్ణయించారు.

ఒకనాడు శ్రీ చైతన్యులవారు నేలపై ప్రాకుతూ దగ్గరలో యున్న త్రాచుపామును పట్టుకొనియుండుట తల్లిదండ్రులు దర్శించారు లోకకళ్యాణానికి ఆవిర్భవించిన ఆ మహాత్ముని విషసర్పముకూడా కాటువేయలేక పోయినదని విస్మయమొందారు

చైతన్యుడు ఐదు సంవత్సరముల వయస్సులోనే దుర్భేద్యమైన ఆధ్యాత్మిక విషయాలను మాతృమూర్తియైన శచీదేవితో చర్చించెడివాడట ఒకనాడు శ్రీ చైతన్యులు మట్టి తినుచుండుటతల్లియైన శచీదేవిచూచింది మట్టిని తినవలదనియు దానికి బదులుగ మిఠాయిలను ఆరగించమనితెలియచేసింది మిఠాయిలకు మట్టికి తేడాలేదని చైతన్యుడు తల్లికి వివరించెను మట్టినుండే మిఠాయి వచ్చినదనియు చివరకు మట్టిగానే మారుతుందనియు వివరించెను కుమారునిలో ప్రౌఢమైన ఆధ్యాత్మికావగాహనకు తల్లి అచ్చెరువందెను నాయనా! నిమీః నీవు పలికినమాట వాస్తవమే కానీ మిఠాయివల్ల శరీరము రక్షింపబడుతుంది మట్టివలన గతిస్తుంది కుండలో నీరు నిలుస్తుంది ఆ నీరే మట్టికోపోస్తే ఇంకిపోతుంది మిఠాయిలుమట్టిగా మారవచ్చునేమోగాని అవి శరీరమును కాపాడుతాయి మట్టి శరీరమును నశింపచేస్తుంది నామాటవిను" మని తల్లి అర్థించగానే తల్లి మాటను త్రోసి పుచ్చలేక మట్టితినుట మాని మిఠాయి లారగించెను

ఒకనాడొక సన్యాసి చైతన్యుని ఇంటికరుదెంచెను అతిథిగవచ్చిన సన్యాసి భోజనమారగించునపుడు సంకల్పముచేసి మొదటిముద్దను శ్రీకృష్ణునికని ఆకులో దూరముగ నుంచెను అదిగాంచిన చైతన్యుడు ఆకులోని ముద్దను గ్రహించి భుజించెను తన ఆరాధ్యదైవమైన శ్రీకృష్ణునికి ఇలా మూడు పర్యాయములు సన్యాసి ముద్దలు పెట్టడము జరిగినది మూడుసార్లు చైతన్యుడు ఆరగించి తనకు కృష్ణునికి తేడాలేదనెడి అనుభూతిని సన్యాసికి కలిగించెను

చైతన్యులవారు ఆడుకొనుచుండగా ఆ బాలుని నగలను అపహరించవలెనని సంకల్పించిన చోరులు చైతన్యుని ఎత్తుకొని పారిపోయిరి. కొంత దూరము వెళ్ళగనే వారు మోయలేని బరువుగ చైతన్యుడు మిగిలెను చైత

న్యుని ప్రతిభా విశేషములకు ఆశ్చర్యపడి మళ్ళీ అలాగే తీసుకొనివచ్చి ఇంటివద్ద వదలి వెళ్ళారు తస్కరులు ఒకనాడు మూడు సంవత్సరముల బాలుడైన చైతన్యులవారు తల్లియైన శచీదేవి పాదములపై బడి ఏకాదశి పర్వదినాన ఆహారమును భుజించవలదని ప్రార్థించెను ఈసంఘటన నాధారముగ గ్రహించి చైతన్యులవారి జన్మరాకను గ్రహించవచ్చును చైతన్యులవారి ప్రజ్ఞావిశేషములు బహిరంగ సత్యములైనను కుమారుని విద్యార్జన విషయంలో తండ్రి విముఖత చూపడం జరిగింది తన పెద్దకుమారుడు విద్యాధికుడైనందున సంసారము త్యజించి సన్యాసమును స్వీకరించడము జరిగినది విద్యావంతుడైనచో చైతన్యులు కూడా అన్నగారి పంథాననుసరింమనేమోయన్న సంశయముతో విద్యయందు శిక్షణ నిప్పుటకు నిరాకరించెను ఒకనాడు శ్రీ చైతన్యులు మురికి దిబ్బపైకి ఎక్కి ఆసిన మయ్యారు తల్లి శచీదేవి చూసింది పగిలిపోయిన కుండలు ఎంగిలివిస్తరలు వేసిన మురికి దిబ్బపై తన కుమారుడు నిమాయ్ కూర్చుండుట ఆమెకు బాధ కలిగింది మురికి దిబ్బపై కూర్చొనుట అనుచితమని వెంటనే దిగమని తెలియజేసింది చైతన్యులవారు తల్లితో అమ్మా నేను ఆసీనమైయున్న ప్రదేశము ఎలా అపరిశుభ్రమవుతుంది? నేనున్నచోటనే గంగాది పుణ్యనదులు వెలసియున్నవి పరిశుభ్రత అపరిశుభ్రత యనునవి మానసిక కల్పనలు నాస్పర్శతో అపరిశుభ్రమైన వస్తువులుకూడా శుచిని సంతరించుకుంటాయి నాకు ఆహారమును తయారు చేయుటకు నీవు ఉపయోగించిన పాత్రలుకూడా పవిత్రమే కనుక ఈ దిబ్బలోనున్న పగిలిన కుండపెంకులు పవిత్రతకు చిహ్నములైయున్నవి ఈ కుండపెంకులు ఇక్కడ పడుటచే ఈ దిబ్బ పవిత్రమైనది నేను ఆహారమారగించిన విస్తరులు ఇందు పడియున్నవి అంతకన్నను మించిన పవిత్రత ఎక్కడున్నది?" అని తెలియజేసెను తల్లి అనేక విధముల అభ్యర్థించగా శ్రీ చైతన్యులవారు నాకు విద్యార్జనకు అనుజ్ఞ నొసంగినచో ఈ దిబ్బ దిగి రాగలను అని తెలుపగా కుమారుని విద్యార్జన కుతూహలముచూసి ముదమందిన తల్లిదండ్రులు అందుల కంగీకరించిరి

చైతన్యులవారు విద్యాభాసము ప్రారంభించిరి గంగాదాస పండితుని వద్ద విద్య నభ్యసించసాగిరి విద్యాభ్యాసమునందు చైతన్యులు స్ఫురద్రూపి

ఏకసంతగ్రహి ఆయన ప్రజ్ఞా విశేషములను గాంచి గురువులు విస్మయ మొందెడివారు "నిమాయ్ ప్రశ్నించినచో ఎవ్వరూ సమాధానము చెప్ప లేకపోయేవారు అనంతరము తానే సూత్రమును రచించి దాని భావమును తన సహజ పాండిత్యశైలిలో వివరించెడివాడు" అని చైతన్యులవారి విద్యార్థి దశనుగూర్చి శ్రీ బృందావనదాస్ వంగభాషలో రచించియున్నారు విద్యా సక్తి మెండుగా యున్నను చైతన్యులవారిలో ఆధ్యాత్మిక చింతనమెండుగా గోచరించెడిది స్నానపుగదిలో యున్నను నడుమున్నను భుజించు చున్నను చదువుచున్నను చైతన్యులవారి మస్తిష్కములో శ్యామసుంద రుడే నాట్యము చేయుచుండెడివాడు తన పదకొండవ సంవత్సరమున తనతండ్రి జగన్నాథుడు మరణించడముచే ఆనందముగా సాగు విద్యా భ్యాసము కొంత కుంటుపడినట్లాయెను తన పోషణ భారమంతయు తల్లి శచీదేవిపై పడెను

చైతన్యులవారు తన పందొమ్మిదవయేట విద్యాభ్యాసము పూర్తిచేసు కొని ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించెను న్యాయ అలంకార శాస్త్రము లలో ఆయన మహాపండితుడు న్యాయశాస్త్రములో మేధావియైన గదా ధరుని అలంకార శాస్త్రములో అసాధారణ పాండిత్యముగల ముకుందుని శ్రీ చైతన్యులవారు ఓడించడముకూడా జరిగినది నవద్వీపములోని పండితు లందరు శ్రీ చైతన్యులవారిని అసమాన ప్రజ్ఞాదురంధరులని కీర్తించిరి

ఒకనాడు శ్రీ చైతన్యులు గంగానదికి స్నానమునకరుదెంచుచుండ లక్ష్మీదేవియను తన పొరుగింటి అమ్మాయిని చూసెను ఆమెచే ఆకర్షి తుడై తన తల్లియైన శచీదేవిని ఒప్పించి లక్ష్మీదేవిని పరిణయమాడెను లక్ష్మీదేవి సుగుణశీల విద్యావినయసంపన్నురాలైన లక్ష్మీదేవి ప్రవర్తన చైతన్యుని ఆనందాబ్ధిలో ఓలలాడించేయునది ఆమెకు చిత్రలేఖనముకూడా తెలుసు శ్రీ చైతన్యులవారి చిత్రపటమును ఆమె ఎంతో సుందరముగ చిత్రించినట్లు శ్రీ జయానందుడు చైతన్య మంగళ మను గ్రంథములో తెలియజేసి యున్నాడు

కాశ్మీర్ పండితుడగు కేశవభట్టను నతడు ఒకనాడు నవద్వీపమున కరుదెంచెను సకలశాస్త్ర పారంగతుడగు కేశవభట్టు అనేక ప్రదేశముల పర్యటించి తన తార్కిక ప్రజ్ఞావిశేషములచే ఎందరోపండితులను ఓడిం

చెను నవద్వీపములో నుండు పండితులను ఓడింపుటకు దరుదెంచెను కానీ మహాపండితుడైన శ్రీ కేశవభట్టుతో వాదింపుటకు భీతిచెంది నవద్వీపము లోని పండితులు వెనుకంజవేసిరి శ్రీచైతన్యుడు ముందుకువచ్చి శ్రీకేశవ భట్ రచించిన గంగా స్తవములో ఐదు తప్పులు చూపించి అతనితో వాదించి ఆ పండితుని గర్వమణచెను చైతన్యులవారి ప్రజ్ఞావిశేషములను ప్రత్యక్షముగ తిలకించిన కేశవభట్ విస్మయముచెంది శ్రీచైతన్యులవారికి నమస్కరించాడు అంతట శ్రీ చైతన్య కేశవభట్‌తో ప్రపంచమును జయింపుట విద్యార్జనకు లక్ష్యముకాదు మనకున్న పాండిత్యము ద్వారా భగవానుని సేవించగలిగినచో అదియే విద్యకు గమ్యము గర్వమును పరిత్యజింపుము గోవిందుని భజించి తరింపుము అని సందేశము నొసంగెను చైతన్యులవారి బోధతో కేశవభట్టునియందు గొప్ప పరిణామము పొడసూపినట్లు బృందావనదాస్ వ్రాసియున్నారు

శ్రీచైతన్యులవారు కేశవభట్‌ను ఓడింపుటచే చైతన్యుని కీర్తి నలుమూలల వ్యాపించడము జరిగినది ఈశ్వరపురి పరిచయముతో తనలో కృష్ణభక్తి మెండుగ ఏర్పడినది పండితుల అభిమానుల కోర్కెపై శ్రీచైతన్యులవారు వంగదేశ పర్యటన గావించెను ఆ సందర్భములోనే శ్రీచైతన్యులవారి సతీమణియైన లక్ష్మీదేవి పాముకాటుచే మరణించెను యాత్రానంతరము చైతన్యులవారు ఇంటికి తిరిగి రాగానే ఈ విషాద వార్త చెవిని పడెను శచీదేవి ఆలోచించి నవద్వీప ఆస్థానపండితులైన సనాతన మిశ్రగారి కుమార్తెయైన విష్ణుప్రియదేవినిచ్చి చైతన్యుల వారికి ద్వితీయ వివాహము చేసెను

చైతన్యులవారు కొందరు శిష్యులతో గూడి గయా క్షేత్రమునకు బయలుదేరారు అచ్చట విష్ణుపాదమున తనతండ్రికి పిండప్రదానముచేశారు అచ్చటనే ధ్యానింపుచుండగ భక్తి పారవశ్యములో క్రిందపడి మూర్ఛిల్లెను ఆదే సమయమునకు గతములో తనకు పరిచితుడైన ఈశ్వరపురి మహాత్ముడచటి కరుదెంచి చైతన్యుని మూర్ఛనుండి బహిర్ముఖము చేసెను శ్రీచైతన్యులవారు ఈశ్వరపురిని దర్శించి మహాత్మా! మీ పాదదర్శన స్పర్శనాదులతో నా గయా క్షేత్ర యాత్ర సఫలీకృతమైనది విష్ణుపాదమున

పిండ ప్రదానము చేయుటచేత ఆ పిండము నందుకొనువ్యక్తియే రక్షింప బడును కానీ పరమ పవిత్రమైన ఈ గయలో మిమ్ములను నేను దర్శించ గానే కోట్ల కొలది మా పూర్వీకులు రక్షింపబడెదరు తీర్థక్షేత్రములను పునీతముచేయు మహాత్ములు మీరు మహాత్మా! నా తనువు మనస్సు సర్వము మీ పాదాలకు అంకితమొనర్చుచున్నాను నన్ను ఆశీర్వదించి అమరుడగునట్లు దీవించండి అని పాదములనంటి ప్రణమిల్లెను ఈశ్వరపురి చైతన్యనాశీర్వదించి దశాక్షర గోపాల మంత్రమును నుపదేశించెను

ఈశ్వరపురినుండి మంత్రదీక్షను గ్రహించిన తరువాత శ్రీచైతన్యునిలో వినూత్న పరిణామం గోచరించింది కృష్ణభక్తి హృదయములో స్థిరనివాసము మేర్పరచుకొన్నది అతడు ఒక్కొక్కసారి ఉన్నపళంగ నాట్యము చేయును ఎడ్చును భజన సాగించును క్రిందపడి దొర్లుతూ కృష్ణా! ఎక్కడి కరుదెంచినావు? నన్ను వదిలి నా హృదయమును ముక్కలుచేసి ఎందు దాగి యున్నావు? ప్రతిజీవి హృధయంలో నీవు వసింతువనెడి మాట వాస్తవమా? అంటూ గుండెను తనచేతి నఖములతో గోకెడివాడు

అయి నంద తనుజ కింకరం
పతిత మాం విషయే భవాంబుధౌ
కృపయా తవపాద పంకజ
స్థితధూళీ సదృశం విచనయ

హేనందనందనా! నేను నీ దాసుడను నీకు బానిసను ఈ భవసాగరమున మునిగిపోవు చున్నాను నీ పాదకమలములచెంత రజోలేశమై నన్ను నిలువనీ" అని దుఃఖము కట్టలుత్రెంచుకొని ప్రవహించుచుండ నిరంతరము శ్రీకృష్ణ నామామృతమును పానము చేయుచు విలపించ సాగెను చైతన్యులవారి భక్తిపారవశ్యమును తిలకించిన ఈశ్వరిపురి శ్రీచైతన్యులు పరమ భాగవతోత్తములని రాబోవు తరములవారు తరించుటకు మార్గదర్శకులని కొనియాడిరి.

వాసుదేవుని దివ్యానుభూతులను నెమరువేసుకుంటూ శ్రీచైతన్యులు గయను వీడి నవద్వీపము చేరిరి తన చుట్టునున్న శిష్యులతో శ్రీచైత

న్యులు మాట్లాడుతూ నవద్వీపమునకు ఒక మహాత్ముడరుదెంచి యున్నాడనియు ఆతనిని తనవద్దకు తీసుకురావలసినదనియు తెలియ చేస్తారు శిష్యులు అన్నివైపుల వెళ్ళి అన్వేషిస్తారు వారికి ఆ మహాత్ముని జాడ తెలియలేదు చివరగ శ్రీ చైతన్యులు శిష్యులను వెంటనిడుకొని ఒక భక్తుని ఇంటికరుదెంచి అక్కడ విశ్రాంతి తీసుకొనుచున్న నిత్యానందుని దర్శిస్తారు చిన్ననాటినుండియు కృష్ణభక్తిలో చరించే శ్రీ నిత్యానందుడు చైతన్యుని చూడగానే శ్రీ కృష్ణ సందర్శనభాగ్యం కలిగినంత ఆనందముతో సంతృప్తి చెందుతాడు నిత్యానందుని పూర్వాశ్రమ నామధేయము నితాయ్ చైతన్యుని నిమాయ్ అంటారని మనము తెలుసుకొని యున్నాము నితాయ్ నిమాయ్‌లు బలరామకృష్ణుల వలె కనపడసాగిరి నిత్యానందుని తీసుకొని వెళ్ళి తన తల్లికి పరిచయంచేసి అతడే తన జ్యేష్ఠ సోదరుడని చైతన్య పలికెను శచీదేవి నిత్యానందుని చూసి తన పెద్ద కుమారుడు విశ్వరూపుడే ఈ రూపములో అరుదెంచెనని సంతృప్తి చెందినది

చైతన్యులవారి శిష్యకోటిలో నిత్యానందుడు అగ్రగణ్యుడాయెను శ్రీ చైతన్య బోధామృతమును పదుగురికి పంచుటయే ప్రధాన కర్తవ్యముగ భావించి జీవించుచుండెను. శ్రీ నిత్యానందుడు ఒకనాడు నగరములో భక్తులతో గూడి హరినామ సంకీర్తనము చేయుచుండెను ఆ నగరములో జగన్నాధ మాధవులను ఇరువురు హంతకులుండేవారు వారినే జాగాయి మాదాయి అంటారు వారు చాలా క్రూరస్వభావులు మద్యపానాది దుర్గుణములకు లోనై దోపిడీలు హత్యలు చేస్తూ జీవిస్తుండేవారు శ్రీ చైతన్యుని భక్తి ఉద్యమమన్నచో వారికి అసహ్యము నిత్యానందుడు భక్తులతో కలిసి భజన చేయుచు నగర వీధులలో నడచుచుండ జాగాయి మాదాయిలు తప్పత్రాగి తూలుతూవచ్చి అడ్డగిస్తారు ఏమనుకొనని కష్టము కలిగించని నిత్యానందులవారిపై చేతిలోయున్న మధుపాత్రను విసురుతారు నిత్యానందుని తలకు పెద్ద గాయమవుతుంది రక్తము వెల్లువలా స్రవిస్తుంటుంది భాగవతోత్తములైన నిత్యానందులవారు నాయనా సంతోషము నన్ను కొట్టుటచే మీ కోపము ఉపశమించినదా? నా రక్తధారలు మీకు ఆనందాన్ని కల్గించాయా? అదే నిజమైతే నా శరీరమునందలి రక్తమునంతా చిందిస్తాను

మిమ్మల్ని సంతృప్తిపరుస్తాను కానీ ఒక్కసారి కృష్ణ యనెడి నామము నుచ్ఛరించి రెండు కన్నీటిబొట్లు రాల్చరేరా? అని ప్రార్థిస్తూ పరవశించి కృష్ణనామం చెబుతూ నృత్యం చేస్తుంటాడు

నిత్యానందుడు గాయపడినవార్త శ్రీచైతన్యులవారికి తెలుస్తుంది వెంటనే పరుగెత్తి వచ్చి నిత్యానందుని సమీపిస్తారు నిత్యానందుని శిరము నుండి స్రవిస్తున్న రక్తమును తన వస్త్రముతో తుడుస్తారు నిత్యానందుని గాయపరచిన జాగాయ మాదాయ్‌ల నుద్దేశిస్తూ నాయనా మా భక్తసమూహములో ఒకరిని గాయపరచడమే మీ ఉద్దేశ్యమైనచో మా నితాయ్‌నెందుకు గాయపరచారు నన్నే గాయపరచివుంటె బాగుండేది అని పలికి నిత్యానందుని వెంట పెట్టుకొని గృహోన్ముఖులయ్యారు

నిత్యానందుని అనురాగపు మాటలు చైతన్యుని ప్రేమభాషణములు చోరుల్ని కదిలించి వేశాయి వారిలో అంతరంగికముగా గొప్ప మార్పు జనించింది మరునాటి ఉదయముననే బయలుదేరి చైతన్యులవారిని సమీపించారు క్షమించమని అర్థిస్తూ పాదాలనంటి నమస్కరించారు ప్రేమస్వరూపులైన శ్రీచైతన్యులవారు చోరులను ఆలింగనము చేసుకొని ఆశీర్వదించారు జాగాయి మాదాయిలు శ్రీనిత్యానందుని క్షమాభిక్షకోరుతూ పాదములనంటి దుఃఖించారు నిత్యానందుడు వారి నోదార్చుచు నాయనా! బిడ్డలు తప్పుచేశారని తల్లిదండ్రులు వారిని దూరము చేసుకుంటారా? మీరు నా బిడ్డలు అన్నాడు జాగాయి మాదాయిలు పూర్వపు వాసనలు విడిచిపెట్టి చైతన్యులవారి భక్తి ఉద్యమములో కలసిపోయారు తమ జీవితాంతము వరకు అలాగే భక్తిమార్గములో చరించి తరించారు

శ్రీచైతన్యులవారు కృష్ణతత్త్వమును ప్రచారము చేయుటలో ఒక ఉద్యమాన్నే సృష్టించారని చెప్పకతప్పదు తన శిష్యులను అనుయాయులను ఒకచోట చేర్చి వారిచే హరినామ సంకీర్తన చేయించెడివాడు తాను సంకీర్తనతోపాటు నృత్యము చేయుచు ఆనంద పారవశ్య శిఖరముల నందుకొని తన ననుసరిస్తున్న భక్తులనుకూడా ఆ స్థాయికి చేర్చేవారు నామామృతాన్ని గ్రోలుతూ నృత్యము చేయుచు ఒక్కొక్కసారి తీవ్ర ఉద్విగ్న

మనస్కుడై భరించలేని హృదయావేదనతో క్రిందపడి మూర్ఛిల్లెడివాడు మూర్ఛనుండి లేవగనే కన్నీరు గార్చుచు విలపించెడివాడు

యుగాయితం నిమేషేణ
చక్షుషా ప్రావృషాయితమ్
శూన్యాయితం జగత్ సర్వం
గోవింద విరహేణ మే

ప్రభూ! శ్రీకృష్ణా నీవులేని ప్రతి క్షణము ఒక యుగమై నన్ను బాధించుచున్నది నా నేత్రాలు వర్షధారవలె కన్నీటిని కురిపిస్తున్నవి ఈ ప్రపంచమంతయు నాకు ఎడారివలె గోచరమగుచున్నది గోవిందా అని దుఃఖించుచు నేలపై బడి పొర్లెడివాడు

చైతన్యులవారి దివ్యపారవశ్య భక్తితన్మయతను గాంచి ఎందరో ఆయన భక్తి ఉద్యమములో శాశ్వతముగా చేరిపోయి తమ బ్రతుకుకు సార్థకతను గుర్తించారు అలాంటివారిలో శ్రీ అద్వైతాచార్య శ్రీ నిత్యానందప్రభు శ్రీ హరిదాస్ ఠాకూర్ రూపసనాతన సోదరులు ముఖ్యులు

హరిదాస్ ఠాకూర్ మహాభక్తుడు అతడి పేరు హరిదాస్ అతని లోని భక్తి శ్రద్ధలనుగాంచి శ్రీ చైతన్యులవారు ఠాకూర్ అని పిలిచారు ఆనాటినుండి హరిదాస ఠాకూర్ అని పిలువబడెడివారు హరిదాస్ జీవితమొక విచిత్రమైనది అతడు జన్మతః మహమ్మదీయుడు సంస్కార ప్రభావముచే హరిభక్తి అలవడినది శ్రావ్యమైన కంఠముగల హరిదాస్ అనవరతము హరినామ సంకీర్తన గావించుచు జీవించుచుండెవాడు ప్రతి నిత్యము మూడు లక్షల కృష్ణనామ జపము పూర్తికానిదే నిద్రించెడివాడు కాదు హరిదాస్ భక్తిప్రపత్తులు ఎందరినో ఆకర్షించాయి కానీ ఆధ్యాత్మిక రంగంలో అర్థం చేసుకొని ఆరాధించువారున్నట్లే అసూయతో అసహ్యించుకొని అవమానించేవారుకూడా యుంటారు

మహమ్మదీయుడుగ జన్మించిన హరిదాస్ హిందువైనట్లు హిందువుగా జన్మించిన రామచంద్రుడనువాడు మహమ్మదీయ సంప్రదాయముచే మోహాతుడై ముస్లిములలో కలసి రామచంద్రఖాన్‌గా మారాడు అతడికి

హరిదాసంటే అమితంగా ద్వేషమేర్పడినది ప్రజలలో హరిదాసునకున్న గౌరవప్రశంసలు అతడిని ఈర్ష్యకు గురిచేశాయి హరిదాస్‌ను గూర్చి చెడు ప్రచారము గావించెడివాడు హరిదాస్‌ను ప్రజలలో బలహీనమొనర్చుటకు అనేక ప్రణాళికలాలోచించేవాడు రామచంద్రఖాన్ తన సహచరులతో కలిసి ఒక పన్నాగమును తయారుచేశాడు వేశ్యలను ఎలిఎంచి వారితో సంప్రదించాడు. తన హావభావ విన్యాసములతో హరిదాస్‌ను మోహపూరిత వలయంలో దింపవలెనందని తెలియజేస్తాడు మహాభక్తుడైన హరిదాస్‌ను సమీపించుటకు వేశ్యాంగనలు వెనుకంజవేశారు డబ్బుకక్కుర్తిలో ఒక్క భామిని ముందుకరుదెంచినది హరిదాస్‌ను అశ్లీలం చేయడానికి సాహసించింది

ఒకనాడు యథావిధిగా హరిదాస్ తన గృహములో జపమాచరించుచుండ వేశ్యభామిని లోనికరుదెంచినది అనేక భంగిమల నభిలయిస్తూ నృత్యము చేయసాగింది కానీ హరిదాస్ చలించలేదు చివరగ తన మాధుర్య కంఠమును సవరించుకొని హరిదాస్‌తో మహాత్మా! ధన్యురాలను మీ దర్శన భాగ్యమునకు నోచుకున్న భాగ్యశీలను మన్మధుని ఓడింపచేయగల మీ అందచందాలకు ముగ్ధురాలినై మీ ఛాయలో హాయిని పొందాలని అరుదెంచాను కోరివచ్చిన కోమలిని కాదనక మీ కౌగిలిలో బిగించి కైవల్య సుఖానుభూతిని కల్పించుడు" అని ప్రార్థించింది

హరిదాస్ వేశ్యాంగనపై తదేకంగా దృష్టి సారించి నా నియమ ప్రకారము మూడులక్షల మంత్రజపము నిత్యము పూర్తిచేయవలసియున్నది అంతవరకు వేచియుండుము జపము పూర్తికాగానే నీ కోర్కెతీర్చెదను" అని తెలియజేసెను హరిదాస్ మంత్రజపము కొనసాగించుచుండ ఎదురుగ కూర్చొని హరిదాస్ ముఖారవిందమునందలి ప్రశాంతతను తిలకిస్తున్న వేశ్యాంగనలో పరిణామము పొడసూపినది మోహదృష్టి అంతరించి మంగళదృష్టి ఆవిర్భవించిది మాంసదృష్టి నశించగ మీమాంస సృష్టింపబడి హంస ధ్యానమువైపు మనస్సు మరలింది తనను క్షమించమని వేడుకొంటూ నిశ్చల భగవద్భక్తి తనలో నిండునటుల అనుగ్రహించమని హృదయములో ప్రశాంతత ఉండునటుల ఆశీర్వదించమని ప్రార్థించింది.

కథ అడ్డము తిరిగినందులకు కలతచెందిన రామచంద్రఖాన్ కుటిలత్వాన్ని పెంపొందింపకొని కర్కశముగ ఆలోచించసాగాడు స్థానిక ప్రభువైన నవాబును కలిశాడు హరిదాస్‌పై అభియోగాలు కల్పించి చెప్పాడు మహమ్మదీయుడైన హరిదాస్ హిందువులలో కలియుటయేగాక హిందూధర్మ ప్రచారముద్వారా హైందవ దేవతల నామోచ్చారణ ద్వారా సంకీర్తనద్వారా మహమ్మదీయ మతమును పాడుచేయుటకు సంకల్పించి వంచనచేయుచున్నాడని చెప్పి నవాబు మనస్సును కలవరపరచాడు రామచంద్రఖాన్ మాటలలోని అంతర్యాన్ని గ్రహించలేని నవాబు ఆవేశమునకులోనై హరిదాస్ తీసుకొని రమ్మని ఆజ్ఞాపించాడు న్యాయవిచారణ జరిపాడు హరిదాస్ హైందవ ధర్మమునువీడి మహమ్మదీయ మతములో పునఃప్రవేశము చేయవలెనని ఆదేశించాడు హరిదాస్ అందులకంగీకరించలేదు హరినామమే తన ప్రాణమని తెలిపాడు నవాబు ఆవేశపూరితుడయ్యాడు హరిదాస్ తాడుతోకట్టి కొరడాతో కొట్టుతూ వీధులలో నడిపించమని ఆజ్ఞాపించాడు రాజు ఆజ్ఞ మేరకు హరిదాస్‌ను వీధులలో రాజభటులు కొరడాతో కొట్టసాగారు హరిదాస్ గోవిందనామము నుచ్చరిస్తూ కదులుతున్నాడు రాజభటులు తీవ్రముగ హింసించసాగారు బాధలు భరించలేని హరిదాస్ మరణించినవానివలె పడిపోయి శ్వాసను బంధించాడు హరిదాస్ మరణించాడని నిర్ణయించుకొనిన రాజభటులు అతనిని గంగానదిలో వదిలారు కనుమరుగవగానే హరిదాస్ గంగను ఈది గట్టు చేరాడు ముస్లిం రాజ్యములో తన మనుగడకు రక్షణలేదని భావించాడు నవద్వీపములో భక్తి ఉద్యమమును కదిలిస్తున్న శ్రీ చైతన్యులవారిని గురించి విన్నాడు హరిదాస్ బయలుదేరి నవద్వీపము చేరాడు చైతన్యులవారిని దర్శించాడు ఆ మహాత్ముని దర్శనముతో తనలో తీవ్ర ఆధ్యాత్మిక సంచలనము ఏర్పడింది శ్రీ చైతన్యులవారి పాదాలవద్దనే తన జీవితాన్ని చరితార్థం చేసుకోవాలని నిర్ణయించుకొని చైతన్యుల శిష్యకోటిలో నిలిచిపోయాడు

చైతన్యులవారు నామప్రచార ఉద్యమానికి నిత్యానందులవారిని హరిదాస్ ఠాకూర్‌ని సారథులుగా నియమించారు భగవన్నామామృత పానమే భవరోగమును అంతమొందించు దివ్యౌషధమని చైతన్యులు బోధించెడి

వారు చైతన్యులవారి ప్రభావము నవద్వీపమును కదిలించి వేసినది భక్తుల ఆహ్వానాలపై భక్తుల గృహాలలో ప్రత్యేక సంకీర్తనా కార్యక్రమములు నిర్వహించసాగారు అనాడు నవద్వీపమును నవాబులు పరిపాలించు మండిరి చైతన్యులవారి సంకీర్తన ఉద్యమము వారిలో ఈర్ష్యాసూయలను రేకెత్తించినది సంకీర్తన ఉద్యమాన్ని పాడుచేయాలని ప్రభువైన ఖాజీ అభిప్రాయపడ్డారు చైతన్యులవారి ప్రభావమునుగాంచి ఓర్వలేని కొందరు హిందువులు ఖాజీకి వంతపలికారు హరినామ సంకీర్తనలు జరగడానికి వీలులేదని ఖాజీ వైష్ణవులను శాసించడము జరిగినది

ఒకనాడు ఒక భక్తుని గృహములో అద్వైతాచార్య హరిదాస్ ఠాకూర్‌లు సంకీర్తనను నిర్వహించుచుండ ఖాజీచేతపంపబడిన రాజభటులు గృహములో ప్రవేశించి ఘోరప్రవర్తనతో భక్తులందరికి విస్మయము కల్గించారు సంకీర్తనలో పాల్గొన్న భక్తులను హింసించారు మృదంగము లను ఎగులగొట్టారు వాద్యములను నాశనము చేశారు నిముషకాలములో పరిస్థితినంతా అపసవ్యంగా మార్చారు ఇకమీదట ఖాజీ ప్రభువు పాలించు రాజ్యములో సంకీర్తనలు జరుగరాదని హెచ్చరించారు అలా జరిగినచో ప్రాణములు దక్కవని బెదిరించి వెళ్ళిపోయారు

చైతన్యులవారికి ఈ విషయము తెలిసింది ఎర్యవసానాన్ని గూర్చి ఆయన తీవ్రముగా ఆలోచించారు తరుణోపాయమేమిటాయని తనలో తాను చర్చించుకున్నారు ఉద్యమాన్ని రద్దుచేసుకొని ఖాజీకి శరణాగులు కావాలి లేదా ఖాజీని ఎదిరించి నిలవాలి చైతన్యులవారికి రెండవ భావమే వచ్చింది భక్తులను పిలిచారు తన మనోభావాన్ని తెలియజేశారు హరి నామ ప్రభావమును వివరించారు నామమును నమ్మినవారికి నాశములేదని నొక్కి చెప్పారు మరునాటి సాయంత్రము బహిరంగ సంకీర్తనా కార్యక్రమముద్వారా ఖాజీపై తిరుగుబాటు చేయడానికి నిర్ణయించారు మరునాడు సాయంత్రము విశేషసంఖ్యలో భక్తులు ఒక ఆలయములో గుమిగూడారు హాజరైన భక్త సమూహమును నాలుగు శ్రేణులుగా శ్రీ చైతన్యులు విభ జించారు ప్రథమశ్రేణి శ్రీ అద్వైతాచార్యులు నాయకత్వము వహించారు ద్వితీయ శ్రేణిని హరిదాస్ ఠాకూర్ నడిపించారు తృతీయ శ్రేణికి

శ్రీవాసులు నాయకులై నిలవగా చతుర్ధ శ్రేణికి గదాధర నిత్యానందులు వెంటరాగా శ్రీ చైతన్యులవారే నాయకులై నడిపించారు

అశేష జనప్రవాహముతో అత్యద్భుతరీతిలో సంకీర్తనా ఉత్సవము కదులుతున్నది ఎలుగెత్తి హరినామ స్మరణ చేయుచూ నృత్యము సాగిం చుచు విధులవెంట శ్రీ చైతన్య సంకీర్తనా ఉద్యమ రథము కదులుతున్నది సంకీర్తనారవము ఖాజీచెవులను సోకింది పరిస్థితి అర్ధమైన ఖాజీ వీనులకు ఆ సంకీర్తనారవము లేడికి వ్యాఘ్ర గాండ్రింపువలె తోచెను హృదయ ములో ధైర్యసాహసములు సన్నగిల్లగా సంస్థాన ద్వారములను మూత వేయించెను ఖాజీ సంస్థానము ముందునకు వచ్చినది సంకీర్తనా ఉత్స వము అయినా ఖాజీ తలుపులు తీయలేదు చైతన్యులవారు తలుపు వద్దనే నిలబడిరి ఖాజీ చర్చలు జరుపనిచో తిరిగిపెళ్ళే సమస్యే లేదని చైతన్య భక్తబృందము హెచ్చరించిరి మరొక మార్గములేక శ్రీ ఖాజీ చర్చలకు అంగీకరించెను చైతన్యులవారు ఖాజీ రాజమందిరములోకి చర్చల నిమి త్తమై ప్రవేశించారు

ఖాజీ శ్రీ చైతన్యుల వారిని లోనికి ఆహ్వానించి గౌరవించెను. ఇరు వురి మధ్య చాలాసేపు సంభాషణ జరిగినది గోవధను నిషేధించ వలసిన అవసరమును గూర్చి చైతన్యులవారు ఖాజీకి తెలియజేసిరి గోవులను ఎద్దు లను మహామ్మదీయులు వధించి భుజించుచున్నారనియు అది అమానుష కార్యమనియు చైతన్యులు తెలియజేశారు గోక్షీరమును మానవులు పానము చేయుచుండుటచే గోవు మానవులకు మాతృమూర్తి యనియు అలాగే భూమిని దున్ని ధాన్యము నందించుటచే ఎద్దు మానవులకు తండ్రి లాంటి దనియు తెలిపి మాతాపితలను వధించుట మానవత్వమున కళంకమని తెలియజేసెను చైతన్యులవారి ప్రబోధమును ఆలకించి ప్రత్యుత్తరముగ ఖాజీ "మీ హైందవ ప్రామాణిక గ్రంథములైన వేద పురాణములవలె మాకు ఖురాను పవిత్ర మతగ్రంథము అందులో రెండుమార్గములు తెలియ చేయబడియున్నవి మొదటిది భోగానుభవము రెండవది భోగత్యాగము మొదటి మార్గము ననుసరించువారు మాంస భక్షణ చేయవచ్చును వారికి గోవధ అనివార్యము అదియునుగాక మీ వేద సంప్రదాయమునందు యజ్ఞ

యాగాది క్రతు నిర్వహణ సందర్భముగ జంతుబలి చేయుట ఆచారమై యున్నదికదా। అని తెలియజేశాడు శ్రీ చైతన్యులవారు ఖాజీకి ప్రత్యుత్తరమిస్తూ వేదము గోవధను నిషేధిస్తుంది గోమాత భగవద్విభూతి యని వేదమాత నిర్వచనము యజ్ఞయాగాది క్రతువులయందు జంతుబలి యున్నమాట వాస్తవమే చిక్కి శల్యమైయున్న వృద్ధ జంతువులను బలి ఇచ్చెడివారు పవిత్ర వేదమంత్రోచ్చారణ ద్వారా వాటిని పుణ్యజీవులుగ జేయుటయే అందలి అంతరార్ధము పుణ్యగతిని ప్రసాదించే శక్తిలేనపుడు వధించుట పాపము అని తెలియజేసెను

చైతన్యులవారి ప్రబోధముచే ఖాజీ ప్రభావితుడయ్యెను శ్రీ చైతన్యులవారి సంకీర్తన ఉద్యమములో సభ్యుడై సదా శ్రీకృష్ణ నామామృత పానచిత్తుడయ్యెను ఖాజీలో వచ్చిన పరివర్తనము స్వజనులను ఆకర్షించినది అనేకమంది శ్రీ చైతన్యుల వారికి శిష్యులైరి

చైతన్యులవారి శిష్యులలో వాసుదేవుడను వాడుండెను చైతన్యుడు వాసుదేవుని ఇంటిలో ఒకనాడు ఆశీనుడైయుండి భక్తులు గానముచేయుచుండగ శ్రీకృష్ణుడు మధురాపురమున కొలువుదీరియున్న దృశ్యమును చూపించెను చైతన్యులవారు ప్రదర్శించిన ఈ అద్భుత మహిమ నగరవాసులకు తెలిసినది శ్రీ చైతన్యులవారు సాక్షాత్తు శ్రీకృష్ణ భగవానుడేయని సర్వులు కొనియాడసాగిరి

చైతన్యులవారి శిష్యగణములో మురారియను వాడుండెడివాడు అతడు రామభక్తుడు ఒకనాడు శ్రీ చైతన్యుడు మురారి ఎదుట శ్రీరామ పంచాయతనముగ దర్శన మొసంగి అతనిని కృతార్థుని జేసెను

ఒకనాడు శ్రీ చైతన్యులవారు తన శిష్యుడైన వాసుదేవుని ఇంటిలో సంకీర్తన జరుపుచుండెను అదే సమయమునకు వాసుదేవుని కుమారుడు ఇంటిలో మరణించెను పుత్రుడు మరణించిన వార్త శ్రీ చైతన్యులవారికి తెలిసినచో సంకీర్తన ఆగిపోవునని తలంచిన వాసుదేవుడు హృదయ విదారకమైన ఆ సంఘటనను బయటకు తెలియనీయక మనస్సును వారినామ సంకీర్తనయందు లగ్నమొనర్చి భక్తులమధ్య ఆసీనుడై యుండెను

చైతన్యులవారి కెందులకో సంకీర్తనయందు మనస్సు లగ్నం కావేద అంతట శ్రీ చైతన్యులు వాసుదేవా ఈనాడెందుకో సంకీర్తనవో నా మనస్సు రమించుటలేదు భజన హృదయంగమముగవేదు కారణము నీకు తెలియుండవలెను అది ఏమిటో మాకెఱింగింపుము అని తెలిపెను అంతట వాసుదేవుడు స్వామీ నా కుమారుడు ఆకస్మిక మరణమునకు గురి అయ్యెను అని తెలిపెను ఆ వార్త వినగానే ఆశ్చర్యచకితులైన శ్రీ చైతన్యులవారు వాసుదేవా! నీవు ధన్యజీవివి భక్తలోకమునకు ఆదర్శ మణిదీపానివి పుత్రయోగ దుఃఖమునకు పాల్పడక మనస్సును హరినామస్మరణయందే లగ్నము చేసితివి దారాపుత్రాదులు జలప్రతిబింబములు నారాయణుని నిజసేవలోనే బ్రతుకుకు శాంతి లభిస్తుంది పుత్రుని మరణము సైతము నీ హృదయములోనున్న కృష్ణభక్తిని కదిలించలేక పోయింది నీవు పుణ్యాత్ముడవు అని కన్నీరు విడిచెను అంతట వాసుదేవుడు స్వామీ నా సుపుత్రుడు ధన్యాత్ముడు! అంతటి భాగ్యశాలి మరొకడుండడు తమరు సంకీర్తనచేయు పుణఘడియలో అతడు దేహమును త్యజించెను అని ఆనందముగ పలికెను వాసుదేవా! శ్రీకృష్ణుని పద సరోజములను విశ్వసించి జీవించువారికి అశుభములు దరిచేరవు అనిచెప్పి కుమారుని మృతకళేబరమును తీసుకరమ్మని చైతన్యుడు తెలియచేసెను శ్రీ చైతన్యుడు బిడ్డశవమును మాట్లాడించెను అంతట ఆ బిడ్డడు స్వామీ! నేను ఉత్తమ లోకములకు పోవుచున్నాను నా గమనమును నిరోధించవలదు అని చైతన్యులవారిని ప్రార్థించెను ఆ పసివాని భక్తి ప్రభావమునుగాంచి శ్రీ చైతన్యులవారు విస్మయమొందిరి ప్రహ్లాదుని మరపించు ఆ బాలుని భక్తి పారవశ్యమును తిలకించి భక్తులు ఆనంద బాష్పములు రాల్చారు తమ పుత్రుడు అక్షయానంద స్థానమును చేరుచున్నాడని వాసుదేవుడు అతని సతీమణి సంతసించినవారై శ్రీ చైతన్యదేవుని పద సరోజములపై వ్రాలి కన్నీటితో స్వామి పాదాలనభిషేకించిరి ఈ దివ్య సంఘటననుగాంచి పరవశించినవారై కన్నీటితో నిలబడియున్న భక్త సమూహామునునుగాంచి శ్రీ చైతన్యులు తన అమృత సందేశము నొసంగిరి

చేతో దర్పణ మార్జనం భవమహా దావాగ్ని నిర్వాపణం
శ్రేయః కైరవ చంద్రికా వితరణం విద్యా వధూ జీవనమ్
ఆనందాంబుధి వర్ధనం ప్రతిపదం పూర్ణామృతా స్వాదనమ్
సర్వాత్మస్నపనం పరం విజయతే శ్రీకృష్ణ సంకీర్తనమ్

మానవుని మోహమహార్ణవమున ండత్రోయు అపవిత్ర కామానలమును ఆర్పివేయునదియు మానసిక వికారములను శుద్ధిచేయునదియు అమరానందము నొసంగునదియు జ్ఞానసారమైనదియు ఆనందసాగరమైనదియు సర్వసాధనా గమ్యమైనదియు అగునట్టి శ్రీకృష్ణనామ జ్యోతికి జయము జయము అని సందేశమిచ్చెను

ఇట్లు కొంతకాలము గడిచినపిదప శ్రీ చైతన్యుడు సదా శ్రీకృష్ణ చైతన్యముతో రమించసాగెను గృహస్థజీవనమునందు అరుచి గోచరించసాగెను శ్రీకృష్ణ పదపంజ ధ్యానమగ్నుడై జీవింపుటకనుకూలముగ శ్రీ చైతన్యుడు సన్యాసదీక్ష స్వీకరించి శ్రీకృష్ణచైతన్య నామముతో జీవించసాగెను సన్యాసదీక్షానంతరము శ్రీ చైతన్యులవారు జగన్నాధమునకు బయలుదేరెను శిష్యులనుసరించుచుండ చైతన్యులవారు నామప్రచారము గావించుచు పూరీక్షేత్రము చేరెను పూరీక్షేత్రములో శ్రీ జగన్నాథస్వామి ఆలయమును చేరగనే శిఖరదర్శనము చేసిన చైతన్యస్వామి భావావేశ ఆనందాబ్దిలో మునకవేసెను ఎనిమిదిగంటలసేపు ఒళ్ళుమరచి భావసమాధిలో నిలిచిపోయెను సమాధినుండి బయటకురాగానే జగన్నాధా! శ్రీకృష్ణా రాధేశా? యంటూ గంతులువేసెను

నయనం గల దశ్రుధారయా
వదనం గద్గద రుద్ధయాగిరా
పులకైర్నిచితం వపుఃకదా
తవనామ గ్రహణే భవిష్యతి

హే ప్రభూ! జగన్నాథా నీ నామమును స్మరించుచుండగా నా నేత్రములనుండి ఆనందాశ్రువులు ఎప్పుడు జాలువారునో కదా? ఆనందపారవశ్యములో కంఠము ఎప్పుడు గద్గదమగునో కదా? నా

దేహమెన్నడు పులకాంకితమగునో గదా॥ అని శ్రీకృష్ణ చైతన్య మహాప్రభువు పరితపించుచు స్తుతించెను

చైతన్యదేవుని దివ్యపారవశ్యమును సార్వభౌముడను పండితుడు గాంచెను చైతన్యదేవుని పారవశ్యమొక ఉన్మాదవ్యవస్థ యనియు మానసిక బలహీనతలతో కూడుకొనియున్నదనియు ప్రవచించెను అంతట ఆ సార్వభౌమ పండితుడు చైతన్యులవారిని పరీక్షించనెంచి వాదనకు పూనుకొనెను కానీ చైతన్యులవారి ప్రజ్ఞాపాటవములు అతనిని విస్మయ మొందించినవి అంతట శ్రీకృష్ణ నామామృత విశేషమును గానము చేయుచు నృత్యము సాగించెను ఆ సమయమున శ్రీచైతన్య మహాప్రభువునుండి కోటిసూర్య సమప్రభవమగు దివ్యతేజస్సు బయలుదేర్చి ఆలయమంతయు ప్రకాశవంత మయ్యెను శ్రీ చైతన్యుడు షడ్భాహు స్వరూపుడై సార్వభౌమ పండితునికి దర్శన మొసంగెను రెండుచేతులతో ధనుర్బాణములను ధరించి తానే రాముడని తెలియజేయుచు రెండుచేతులతో మురళి పట్టుకొని తానే శ్యామ సుందరుడని తెలియజేయుచు మిగిలిన రెండు చేతులతో దండకమండలములను ధరించి తన సహజ స్వరూపమును కనపరచుచు దర్శనమొసంగెను చైతన్యదేవుని అద్భుత దృశ్యమునుగాంచి పరవశుడైన సార్వభౌమ పండితుడు చైతన్యుడు శ్రీకృష్ణావతారమేయని నిర్ణయించి చైతన్యమహాప్రభువు శిష్యులలో ఒకడై నామప్రచారము గావించెను చైతన్యదేవుని భక్తిప్రభావమును తెలియజేయుచు చైతన్యశతక మను గ్రంథమును రచించెను

చైతన్యులవారి దివ్యప్రభావము పూరి నగరవాసుల హృదయములపై చెదరని ముద్రవేసినది మానవులేగాక పశుపక్ష్యాదులు కూడా చైతన్యుని సన్నిధానమున కేతెంచి శాంతినిబొంది తరించెడివి పూరీక్షేత్రములో ఒక శునకమునకుగూడా శ్రీచైతన్యుడు ముక్తిని ప్రసాదించినట్లు తెలియ జేయబడియున్నది

చైతన్యులవారి బోధతో ప్రభావితులైన వారిలో రూప సనాతన సోదరులు ముఖ్యులు బెంగాలును పరిపాలించు నవాబు కొలువులో ఈ ఇరువురు సోదరులు మంత్రులుగ నుండిరి సంస్కృతవిద్యయందు నిపుణులై

మేధావులని పేరుగాంచి రూపసనాతన సోదరులు శ్రీ చైతన్యులవారి మహామా విశేషములను గూర్చి విని వారి దర్శనమునకేతెంచిరి చైతన్యుల వారి దర్శనముతో వారిలో నిద్రాణమైయున్న ఆధ్యాత్మిక చైతన్యము బహిర్గతమైనది తమ పదవులను త్యజించి సన్యాసమును స్వీకరించి శ్రీచైతన్య శిష్యగణములో ముఖ్యులై చైతన్యులవారి సందేశమును ప్రచారము నొనరించిరి సన్యాసదీక్షానంతరము రూపసనాతన సోదరులు బృందావన పుణ్య భూమియందే నివసించసాగిరి శ్రీచైతన్యులు కలలుగన్న ఆలయనిర్మాణమును వారు పూర్తిచేసిరి ఆదర్శ జీవనమును గడిపి గురుదేవుని అడుగుజాడలలో పయనించి చివరగ బృందావనములోనే అంతిమశ్వాసను వదిలిరి

శ్రీ చైతన్య మహాప్రభువు దక్షిణదేశయాత్ర సలిపి అనేక ఆలయాలు దర్శించి ప్రజలలో భక్తివిశ్వాసములను పెంపొందించి విరుద్ధ భావాలతో ఆధ్యాత్మిక ప్రచారములు సాగించువారి కుటిలతను రూపుమాపి వైష్ణవధర్మములు వ్యాప్తిచేసెను దక్షిణయాత్ర ముగించుకొని శ్రీ చైతన్యులు తిరిగి జగన్నాథమునకు అరుదెంచిరి కొంతకాలము జగన్నాథమునందుండి తరువాత కాశీయాత్రకు బయలుదేరెను ఉత్తరహిందూస్థానమున యున్న ఉద్దండ పండితులెందరో చైతన్యునిచే ప్రభావితులైరి భక్తి మార్గము ననుసరించిరి

శ్రీ చైతన్య మహాప్రభువు జగన్నాథమున కరుదెంచిరి ఒకనాడు భక్తులు గుమిగూడియుండ శ్రీకృష్ణ నామామృతపానము చేయసాగిరి ఒక్కొక్కసారి పరవశించి నృత్యము చేయసాగిరి మరొక్కసారి కదలలేక నిశ్చేష్టులై నిలబడిపోసాగిరి హృదయము ఆనందసాగరమై పొంగుచుండ నేత్రములు పారవశ్య మేఘములను ధరించి ఆనందవృష్టిని వర్షించుచుండ శ్రీ చైతన్యుడు తన్మయుడై యుండెను చైతన్యుని దివ్యావేశము ఈనాడొక వినూత్న పోకడతో చూపరులకు గన్పట్టసాగెను అంతట చైతన్యుడు నృత్యముచేయుట ఆపి తనలో తానిలా మట్లాడుకోసాగెను

అశ్లిష్య వా పాదరతాం పినష్టు
మామ దర్శన మర్మహతాం కరోతు వా

యథా యథా వా విదధాతు లంపటో
మత్ప్రాణ నాథస్తు స ఏవ నాపరః

హే ప్రభో! జగన్నాథా! నీ అభయ హస్తముతో నన్ను అనుగ్రహించినను లేదా నీ పవిత్ర పాదముతో నన్ను అణగద్రొక్కినను నాకు సంతోషమే! హే మానసచోరా! నేను నిన్ను విడిచి జీవించలేను శాశ్వతముగా నీ పదసరోజములకు నా బ్రతుకును నీరాజనంలా అంకితం చేశాను

అంటూ కీర్తింపుచుండగ దీనదయాళుడు భక్తవత్సలుడైన శ్రీకృష్ణ దేవుడు చైతన్యుని ముందు నిలబడి దర్శన మొసంగెను భగవానుని దివ్య మంగళరూపమును తనివితీరాగాంచి చైతన్యుడు తృప్తిచెందుచుండగ జగన్నాధుడు నడకసారించెను నీటిని వదలి జీవించలేని చేప పగిది శ్రీ చైతన్యుడు భగవానుని అడుగుజాడల ననుసరించెను కదలుచున్న కమనీయ కృష్ణరూపము సాగరముపై అడుగులిడుచు నడచి అదృశ్యమైనది అనుసరించి నడచుచున్న చైతన్యులవారు కూడా సాగరముపై అడుగులిడి నడిచి అదృశ్యమైరి అనంత కృపాసాగరుడైన శ్రీకృష్ణ భగవానుని దివ్య చైతన్యమునందు భక్తాగ్రగణ్యుడైన చైతన్యులవారి జీవచైతన్యము సమరసమై లీనమైనది

* ఓం శ్రీ జగన్నాథాయ నమః *





# ఆంజనేయస్వామి

శ్రీ రాఘవాంఘ్రి సరసీరుహ భృఙ్గరాజం
సీతామనః ప్రియవచో నిచయానుమోదమ్
కారుణ్య పూర్ణహృదయం ముదితాన్తరఙ్గం
భక్తాళిరక్షణగుణం హనుమన్తమీడే

శ్రీరాముని చరణకమలములయందు భ్రమరమై జానకీరమణుని కథాగానముచే సంతృప్తి నొందువాడును కరుణాహృదయుడును నిర్మల అంతఃకరణ గలవాడును భక్తజనుల నుద్ధరించువాడనగు హనుమంతుని స్తుతింతును

శ్రీరామచంద్రుని భక్తుడై భక్తులకు భగవానుడై రాజిల్లు ఆంజనేయుని మహిమలు అద్భుతములు అనంతములు మహావీర్ హనుమాన్ మారుతి బజరంగబలి ఇత్యాది అనేక పవిత్ర నామములతో శోభించు భక్తార్తుల పూజలందుకుంటున్న శ్రీ ఆంజనేయస్వామి ఆశ్రిత జనరక్షకుడు

అంజనేయుడు అపర శివావతారమని శివపురాణమునందు తెలియ చేయబడి యున్నది ఈయన శైశవ క్రీడలన్నియు శివపురాణమునందు దప

వ త్తిరముగా రచియింపబడి యున్నవి అయినను భక్తునిగా రామదూతగా అసమాన ప్రజ్ఞాధురంధరుడుగా ఆదర్శ స్నేహితునిగా పరాక్రమశాలిగా ఆంజనేయుని ప్రభావమంతయు శ్రీమద్రామాయణమునందు చక్కగ విపులీకరించబడినది

బలవంతులైన మల్లయోధులకు తానే అభయకవచము బలహీను లైన పసిపిల్లలకు తానే రక్షకస్థానము భక్తజనులకు తానే సద్గురువు ఆశ్రితజనులకు తానొక కల్పతరువు నిరంతర రామధ్యానంతో తనమాంస శరీరమును మంత్రశరీరముగ మార్చుకొన్న మారుతి కమనీయగాధను పఠించి తరించెదము గాక!

కేసరియను వానరుడు సుమేరు పర్వతముపై ఒకచిన్న రాజ్యమును పాలించుచుండెను ఆయనభార్య అంజన ఒక మహర్షి శాపఫలముగ ఆవిడ వానరియై జన్మించెను ఒకనాడు సంబరాసురుడను రాక్షసుని వధిం చుటకు కేసరి వెళ్ళియుండ అంజన ఉద్యానవనముతో విహరించుచుండెను ఆమె అందమునకు కలతచెందిన మనస్కుడై వాయుదేవుడు ఆమెను అలింగనము చేసుకొనెను వాయుదేవుని అంజన నిందింపసాగెను అంతట వాయుదేవుడు అంజనా! ఆగ్రహించకు! లోక కళ్యాణము జరిగిన ఈ సన్నివేశముతో నేను నిమిత్తమాత్రుడను నా భౌతిక అలింగనచే నీవు అపవిత్రురాలవు కాలేదు నీకు ఈచర్యఫలితముగ ఒక కుమారుడు జన్మించ గలడు అతడు అతులిత పరాక్రమశాలియై బుద్ధిశాలియై భక్తశిఖామణియై తరించి చిరంజీవియై చరించగలడు" అని తెలిపి అంతర్ధానమయ్యెను. అంజన ఒక మగశిశువును ప్రసవించెను ఆంజనేయుడు.

శైశవమునందే ఆంజనేయుడు బలపరాక్రమవంతుడై ప్రజ్ఞానిధియై కన్పట్టసాగెను ఒకనాడు ఆంజనేయుడు ఉదయభానుని దర్శించి అదియొక ఫలమని భావించెను వెంటనే ఆంజనేయుడు తటాలున నెగసి ఉదయగిరి మీదనురికి సూర్యుని మ్రింగుటకు ప్రయత్నించెను అదిగాంచిన ఇంద్రుడు భయభ్రాంతులకు లోనై సూర్యుని రక్షించు నిమిత్తము తన చేతియందున్న వజ్రాయుధమును ఆంజనేయునిపై విసరెను అది వాయుపుత్రునికి వామ

హనువుమీద దగులుటచే మూర్ఛితుడై పడిపోయెను కుమారునికి జరిగిన ప్రమాదమునుగాంచి కలతచెందిన వాయుదేవుడు తన చేష్టలుదక్కి వాయు బంధనము చేసెను పరిస్థితి ప్రళయమువలె భయంకరమై కన్పట్టెను అంత దేవతలు ఇంద్రునితో గూడి వాయుదేవుని వెంత కరుదెంచి ప్రార్థించిరి బ్రహ్మదేవుడు పవనసుతుని తన అమృత హస్తముతో స్పృశించెను వెంటనే హనుమంతుడు లేచి కూర్చొనెను బ్రహ్మాది దేవతలు ఆంజనేయుని ఆశీర్వదించిరి వాయుదేవుని శాంతపరచిరి శాంతినొందిన వాయుదేవుడు తిరిగి సంచారము సాగించెను అంతట బ్రహ్మదేవుడు వాయుదేవా! నీ పుత్రుడు అసమాన ప్రజ్ఞాధురంధరుడు అనేకమంది రాక్షసులను వధింమను రామదూతయై చరింమను ఏ శస్త్రము అతనిని ఛేదించలేదు ఏ అస్త్రము అతనిని అంతమొందించలేదు మృత్యువు అతని కోర్కె మేరకు అరుదెంమను అతడు చిరంజీవియగును అని తెలిపి అంతర్ధానమయ్యెను

బ్రహ్మాదిదేవతల వర ప్రభావముచే ఆంజనేయుని బలపరాక్రమములు అసమానమై అనూహ్యమై ప్రకాశించినవి అయినను హనుమంతునిలో బాల్యచేష్టలు అంతరించలేదు చేరువలోనున్న మున్యాశ్రమముంచేరి వారి వల్కలాజినములు చించి పారవేయుమండెను యాగశాలకుపకరింమ హవిస్సును పాడుచేయుమండెను ఎంత వారించినను అతనిలో మార్పు జనించలేదు అంతట కోపోద్రిక్తులైన మునివర్యులు హనుమంతుని శపించిరి కండకావరమున కనులు మూతపడగా కల్మష చర్యలకు పూనుకొంటివి విజ్ఞుల వచనములను నిరాకరించి నికృష్టముగ ప్రవర్తించితివి హనుమా! ఏ బలపరాక్రమముల అండచూసుకుని నీవు పవిత్రులైన ఋషిపుంగవులను బాధించితివో ఆ బలపరాక్రమములు అవసరసమయమునందు నీకు గుర్తురాకుండుగాక! పదుగురి పయుకరింమ పవిత్ర కార్యము నిర్వహింమనపుడు మరొకరు తెలియజేయుటచే స్మృతిని పొందెదవుగాక యని శపించిరి దాని పర్యవసానంగా ఆంజనేయుడు రామాయణంలో అనేక ఘట్టములలో ముఖ్యాంశములను మరచిపోయెను

వాలి వధానంతరము రామకార్యమునకై వానరులందరిని సిద్ధము చేయమని సుగ్రీవుడు ఆంజనేయునికి ఆదేశమివ్వగా హనుమంతుడు ఆ

విషయమును మరచిపోయి లక్ష్మణుడు సుగ్రీవుని కృతఘ్నుడని నిందించు నప్పుడు హనుమంతుడుకూడా గుర్తించలేదు. వాయునందనుని విచిత్రమైన విస్మృతికి ఇదొక మచ్చుతునక

యుద్ధకాండలో రావణఘాతమునకు లక్ష్మణుడు మూర్ఛిల్లగా సంజీవిని పర్వతమునుండి మూలికను తెచ్చుటకు హనుమంతుని పంపగా సుషేణుడు చెప్పిన మూలిక వివరములను ఆంజనేయుడు మరచిపోవుటచేత ఆలోచించి తుదకు పర్వతమునే తీసుకొనివచ్చెను

రామచంద్రుని రాకనుగూర్చి భరతునకెరింగించి తిరిగి నందిగ్రామ్‌కి వచ్చి రామునికి విషయమును నెరింగింపుట మరచి భరతునివద్దనే వుండి పోయెను ఆంజనేయుడు జరిగిన వృత్తాంతమంతయు భరతునకెరింగించి అతిముఖ్యమైన సీతాదేవి అగ్నిప్రవేశ ఘట్టమును వివరించుట మరచి పోయెను ఇలా రామాయణములో అనేకచోట్ల వాయునందనుని విస్మృతి మనకు గోచరించును జ్ఞానముచేని శక్తి నిస్సారమని గ్రహించిన పవన కుమారుడు సూర్యువద్దనుండి విద్యనార్జించెను

ఆంజనేయుడు రమణీయ చతురుడు నవవ్యాకరణ విశారదుడై శ్రోతల హృదయములను కదిలించి స్పందన కలిగించు రీతులలో భాషించ గలడు ప్రథమ సమాగమములోనే రాముని హృదయమును ఆకర్షించిన ప్రజ్ఞాశాలి ఋష్యమూక పర్వతముపై మొదట శ్రీరామ లక్ష్మణులను కలియగానే ఆంజనేయుడు "మహాత్ములారా! మహేంద్రశోభతో నలరారు మీరెవరు ? మీరు భూమండలాధిపతులని మీ ముఖారవింద శోభ తెలియ జేయుచున్నది మీరు నారబట్టలు ధరించుట విచిత్రముగా యున్నది మీ వేషముల తిలకించి మీరు యతివరేణ్యులని భావించుదమన్నచో మీ వద్ద నున్న ప్రచండ కరవాలముల అవసరమేమిటి ? అనే శంక తలఎత్తుచున్నది మారాజైన సుగ్రీవుని దూతగా మీరాక కార్యము నెరుంగుటకు వచ్చితిని నా పేరు ఆంజనేయుడు వాయునందనుడను సుగ్రీవుని సచివుడను కామరూప శక్తిగలవాడను అని తెలియజేసెను లక్ష్మణుడు తమరాక నెరింగించగానే సంతృప్తిచెందిన ఆంజనేయుడు మీరును మా ప్రభువైన

సుగ్రీవుడును ఒకే నావలో ప్రయాణము చేయుచున్నారు మీరు రాజ్యభ్రష్టులరి సుగ్రీవుడును రాజ్యభ్రష్టుడయ్యెను భార్య వియోగముచే రామ సుగ్రీవులిరువురు వ్యధచెందుచున్నారు. శత్రువులను సంహారించి భార్యలను పొందుటయందు ఇరువురు తమ మనస్సులను లగ్నమొనర్చియున్నారు కావున మీరిరువురికి సఖ్యము సుగమము అనురూపము అని తెలియజేసెను

మారుతి మాటల నాలకించిన రామచంద్రుడు సంతోషభరితుడై లక్ష్మణునితో ఆంజనేయుని గూర్చి తన అభిప్రాయమును ఈ క్రింది విధముగా తెలియజేసెను

నా నృగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః
నా సామవేద విదుషః శక్యమేవం ప్రభాషితమ్॥

"లక్ష్మణా! ఇతడు మాట్లాడిన విధమును విశ్లేషించిచూడ మూడు వేదములను ఆకళింపు చేసుకొన్నవారికే ఈ విధమైన భాషణము అలవడునని తెలియుచున్నది" అని తెలిపెను

ఆంజనేయుని ప్రతిభాకౌశలము వాక్చాతుర్యము భావ స్పందనము శ్రీరామచంద్రుని అవలీలగ ఆకర్షించినది దూతయను పదమునకు సరితూగునటుల వర్తించి వన్నెతెచ్చు వాడితడేనని గ్రహించెను ముఖ్యముగా ఆంజనేయుని భాషణములో తొంగిచూపిన వ్యాకరణ ప్రయోగములు శ్రీరాముని విస్మయ సాగరంలో మునకలేయునట్లు చేసినవి

ఆంజనేయుని ప్రతిభా విశేషములను రాముడెంతగా గ్రహించి అభినందించెనో అలాగే సుగ్రీవుడుగూడ గ్రహించెను వాలి వధానంతరము సుగ్రీవుడు ఆంజనేయుని దూరముగా పిలిచి హనుమా! సీతాన్వేషణ కార్యము ప్రజ్ఞాశాలివి బలపరాక్రమవంతుడవైన నీవే నెరవేర్చగలవని నా ప్రగాఢ విశ్వాసము ఈ విషయములో నీమీదనే నేనాధారపడియున్నాను" అని తెలిపెను సీతాన్వేషణకు బయలుదేరుతున్న ఆంజనేయునితో శ్రీరామచంద్రుడు హనుమా ఈ ఉంగరమును గ్రహింపుము నీవు నా దూతవని సీతకు ఈ ముద్రికయే తెలియజేయగలదు పేర్మిమప్పుడా: నీవు

సీత నన్వేషించి జాడతెలియగలవని నా విశ్వాసము వాయునందనా! సీతను నాకు చూపరేవా? అని పలుకగానే అంజనేయుని అమృత హృదయము ద్రవించెను

వానరులందరు కలిసి సీతాన్వేషణకై బయలుదేరిరి వెతికి వెతికి విసిగిపోయిరి జానకి జాడ తెలియలేదు విసుగుచెందిన వానరులందరు ఆమరణ నిరాహారదీక్ష చేయవలెనని సంకల్పించిరి ఇంతలో ప్రక్క కొండపై నివసిస్తున్న సంపాతియను వృద్ధపక్షిని చూచుట తటస్థించినది రెక్కలు తెగి మునలితనముతో ఆహారము కూడా లభించకపడియున్న సంపాతి వానరుల దుఃఖకారణమును ప్రశ్నించి అంగదునిద్వారా విషయ గ్రహణము చేసెను జటాయువు మరణవార్తవిని దుఃఖించుచు తాను జటాయువు సోదరుడనని తెలియజేసెను రామకార్యమునకు ఉపకరించ వలయునని సంపాతి సంకల్పించెను తనకు దూర శ్రవణ దూరదర్శనాది శక్తులు మహిమలు కలవు తన శక్తి నుపయోగించి సీతాదేవి అక్కడికి వాప్రయోజనముల దూరమునగల రాక్షస రాజ్యమునందు బంధించబడి యున్నదని హనుమంతునికి తెలియజేసెను

సంపాతి పలుకలువిని ఆంజనేయుడు శిఖరమునుండి సాగరము వైపు తన ఏకాగ్రదృష్టిని ప్రసరింపచేసి లంకను గుర్తించెను గరుత్మంతునివలె ఆకాశమున ఎగిరి రామబాణమువలె సాగరముమీదుగా దూసుకపోనాగెను హనుమంతుని గమనవేగమునకు పెద్దపెద్ద వృక్షములు తల క్రిందులై సాగరమున పడినవి మార్గమధ్యమున అతడు అనేక గండము లను ధైర్యముతో ఎదుర్కొని లంకలో కాలుమోపెను అందములో ఇంద్రుని అమరావతిని సిరిసంపదలయందు కుబేరుని అలకాపురిని గుర్తు చేయు లంకానగరమును దర్శించెను

సుందరమైన లంకాపురములో ఆంజనేయస్వామి సీతాన్వేషణ ప్రారంభించెను తననుగూర్చి ఇతరులు అనుమానించకుండా హనుమంతుడు మార్జాలమువలె రూపమును ధరించెను రావణుని భవంతులన్నీ అన్వేషించి చూచెను సీతజాడ ఎక్కడను కనుపించలేదు చివరగ అంజనేయుని దృష్టి అశోకవనముపై బడెను అశోకవనములో ప్రవేశించి ఆ వనశోభను తిల

క్షింశుపు ఒక చెట్టు క్రింద అరుగుపై ఆసీనమైయున్న సునారీరత్నమును చూచెను మాసిన వస్త్రము కప్పుకొని శోకవదనయై కూర్చొనియున్న అందాలరాశిని దర్శించి ఆమెయే సీతాదేవియై యుండవచ్చునని భావించెను ప్రకృతిని ప్రకాశింపచేయుటకు ఉదయభానుడు ఉరకలువేయు సమయాన తాను ఆమెను దర్శించెను ఆమెచుట్టును రాక్షసులు ఖడ్గములు ధరించి ఎక్ర వేష్టితులై యుండిరి సుగుణశీలయై గన్పట్టు ఈసీతాదేవిని విడిచి శ్రీరామచంద్రుడు ఎలా మనగలుగుచున్నాడా యని ఆంజనేయస్వామి తనలోతాను తలపోసుకొనెను

"దుష్కరం కృతవాన్ రామో
హీనో యదనయా ప్రభుః
ధారయత్యాత్మనో దేహం
శోకే నావసీదతి

"ఈరాముడెంత కఠినాత్ముడు ఇతరులెవ్వరు చేయలేనిపనిని తాను చేసిచూపాడు సీతకు దూరమై తానింకా బ్రతికేయున్నాడు అతడింకా మృతి చెందలేదు అతని జీవితము బహుకర్కశమై యుండాలి

సీతాదేవిలోని సద్గుణ శీలసంపదను ప్రథమ దర్శనములోనే హనుమంతుడు అంచనా వేయగల్గెను హనుమంతు డాలోచింపుచుండగనే రావణుడరుదెంచెను పర్వతగమనమా యన్నట్లు కదలివచ్చుచున్న రావణుని రూపమును గాంచి హనుమంతుడు వృక్షశాఖలమాటున దాగెను రావణుని చూడగనే సుడిగాలికి కదలి వృక్షము ఊగునట్లు సీతాదేవి వణకుచుండెను రావణుడు సీతను సమీపించి తనమాట నంగీకరించినచో ముల్లోకములలోని సంపద నంతటిని ఆమె పాదములవద్ద క్రుమ్మరింతునని తెలిపెను రావణుని వాక్కుల నాలకించిన సీతాదేవి రావణుని అప్రస్తుత ప్రలాపమును ఖండించెను అవివేకపు టాలోచనలతో జీవితము నంత మొందింపకోవలదని హెచ్చరించెను నిరాశచెందిన రావణుడు తిరిగి వెళ్ళిపోయెను

రావణుడు వెళ్ళగానే హనుమంతుడు సుశ్రావ్య కంఠముతో రామ కథాగానము చేసెను. ఎతను మాట్లాడించుటకు అదియొక్కటే సూటియైన సుంభమార్గమని గ్రహించెను. హనుమంతుని అమృత వాక్కుల నుండి వెలువడు రామకథా సుధను గ్రోలిన సీతాదేవి సంభ్రమాశ్చర్యాలతో నలువైపుల చూసెను. సీత చూపులలో కదలాడు కారుణ్య దృక్కులను అనురాగ చూడ్కులనుగాంచి ఆవిడయే సీతయని హనుమంతుడు నిర్ణయించుకొనెను. సీతముందు నిలబడి విచిత్రమైన రీతిలో ఆమెను ప్రశ్నించి తన సందేహమును నివృత్తి జేసుకొనెను.

"రోదనాదతినిః శ్వాసాద్ భూమి
సంస్పర్శనాదపి
నత్వాం దేవీమహం మన్యే
రాజ్ఞ సంజ్ఞావధారణమ్"

నీవు దేవతవని నేను భావించను. అధికంగా శ్వాసించి అమితముగ శోకించుటయేగాక నీ పాదములు భూమినంటియున్నవి. "రామ రామ" అని సదా పలుకుచుండుటచేత నీవు సీతవేనని నా సంకల్పము. నా ఆలోచన సరియైనదేనని నేను భావించుచున్నాను యని బహుచక్కగ ప్రవచించెను.

ఆంజనేయుని చూచి ముదమందిన జానకి తన వివరము లన్నియు తెలియజేసెను. రామ సహచర్యంలేని తాననుభవించు దురవస్థను హనుమంతున కెరుక పరచెను. రామలక్ష్మణులను గూర్చి ఇరువదిరెండు ప్రశ్నలు వేసి హనుమంతుని వద్దనుండి జవాబులు గ్రహించెను. అంతట హనుమంతుడు జానకి నుద్దేశించి "అమ్మా! చింతించవలదు నీవు నీపతిని చేరగలవు. ఐరావతముపై ఇంద్రుడు ఆరోహణముచేయ వచ్చునటుల నీవు త్వరలో రామచంద్రుని గాంచగలవు. ఐరావతముపై నెక్కిన మహేంద్రునివలె నా వీపుపై ఎక్కిన శ్రీరాముని దర్శించగలవు" అని తెలియజేయుచు శ్రీరాము డొసంగిన ఉంగరమును సీతాదేవి కొసంగెను.

హనుమంతుని వద్దనుండి ఉంగరమును గ్రహించి ఉత్సాహవదనూ రాలైన జానకి రామప్రతీకమై గోచరించు ఉంగరమును నేత్రములకు అద్దు కున్నది వెంటనే ఆంజనేయస్వామి తన నిజరూపమును చూపి ప్రియవచ నములతో సీత నోదార్చెను. సుగ్రీవుడు తన వానర సమూహముతో రామ కార్యసాధన కుపక్రమించి యున్నాడనియు త్వరలోనే లంకను ముట్టడించు టయు జరుగుననియు తెలియజేసెను సీతామాత నుండి అనుజ్ఞ వడసి హనుమంతుడు తిరిగి ప్రయాణమునకు సిద్ధముకాగా సీతాదేవి హనుమంతు నికి చూడామణి నొసగి దానిని రామునికొసంగమని రామ దర్శనార్థమై సీత బ్రతికియున్నదని రామునికి తెలియజేయుమని చెబుతుంది

హనుమంతుడు బయలుదేరి వచ్చుచుండెను ఇంతలో అతనికొక సంకల్పముదయించెను రావణుని హృదయములో భయభ్రాంతులను కలి గించవలయునని తత్ఫలితముగ సీతకు ఏ ఆపద సంభవించదని భావించి హనుమంతుడు భయంకర రూపమును దాల్చి అశోకవనమంతయు పాడు చేసెను హనుమంతుని బంధించుటకు రావణుడు పంపగా వచ్చిన రాక్షసు లందరు పరాభవించబడిరి రావణుని కుమారుడైన అక్షుడుకూడా హను మంతుని ధాటికి నిలువలేకపోయెను అంతట రావణుని కుమారులలో ఒక డైన ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్ర ప్రయోగముచేసి హనుమంతుని బంధించెను రాక్షసులందరు కలసి హనుమంతుని బంధించి రావణుని ముందుంచిరి హనుమంతుడెవరో ఎవరి ఆజ్ఞమేరకు అతడు లంకలో ప్రవేశించి అశోక వనమును పాడుచేసెనో ప్రశ్నించమని రావణుడు తన అమాత్యుల నాదే శించెను

అంతట ఆంజనేయుడు రావణునివైపు తిరిగి "నీ చరిత్ర ముగియ నున్నది నీ దుండగములు అడుగంటే సమయమాసన్నమవుతున్నది దేవతలనుండి నీవుపొందిన వరాల కారణంగా ఎందరినో బాధించావు రాజ్య ములు కొల్లగొట్టావు విజ్ఞులను హింసించావు స్త్రీల నపహరించావు నీవు పొందిన వరములు సారహీనమగుచున్నవి మృత్యువు నిన్ను సమీపించు టకు సిద్ధపడుచున్నది నీవు అశోకవనములో బంధించియున్న సీత ఎవరో కాదు ఆవిడే నీ పాలిటి మృత్యుదేవత ఆవిడ నీ మెడలో ఉరిత్రాడై

యున్నది కొద్దిరోజులలో ఆ త్రాడు బిగింపబడుతుంది నీవు అంతరించ టము జరుగుతుంది శ్రీరాముడి బహుపరాక్రమశాలి రామబాణముయొక్క శక్తిని నీవెరుగవు వానరవీరులమధ్య శ్రీరాముడు నిలచి సతిను అప హరించిన వానిని వధింతునని శపథము చేయుచున్నాడు రాముడు సత్య స్వరూపుడు అతని మాట సత్యము నీవు అతని చేతిలో వధింపబడుట కంటకన్నా సత్యము నా మాట విను సీతను విడిపించి రాముని శరణు వేడుము అంతకన్నా నీ ప్రాణరక్షణకు మరియొక మార్గములేదు ఆవేశ ముతో వినాశమును కొనితెచ్చుకొనకుము బ్రహ్మరుద్రాదులైనను రాముని ఎదుర్కొని నిలువలేరు యని ఆంజనేయస్వామి దీర్ఘఉపన్యాసం చేసెను ఇక్కడ ఆంజనేయుని ప్రజ్ఞాకౌశలమును సంభాషణా చాతుర్యమును మనము గ్రహించవచ్చును శ్రీరామచంద్రుని బ్రహ్మరుద్రాదు లెదిరించ లేరని ప్రవచించాడు త్రిమూర్తులలో ఇరువురి నామములను తెలిపి శ్రీమహావిష్ణువు నుదహరించుట మానివేసెను మహావిష్ణువే శ్రీరామచంద్రు డని ఆంజనేయుడు భావించుటయే అలా చేయుటకుగల కారణము

ఆంజనేయుని ఆవేశపూరిత వచనములు లంకాధిపతిలో ఆగ్రహ మును కలిగించెను హనుమంతుని వధించమని రావణుడు ఆజ్ఞాపించెను అంతట పరమభక్తుడు రావణుని సోదరుడైన విభీషణుడు అడ్డుపడి దూతను వధించుట ధూర్తలక్షణమని తెలియజేసెను ఆంజనేయుని వధించవలదని రావణుని వారించెను అంతట రావణుడు హనుమంతుని వాలమునకు నిప్పంటించి లంకనుండి వెడలగొట్టమని ఆజ్ఞ యొసంగెను రాక్షస సమూ హము చుట్టుచేరి హనుమంతుని తోకకు గుడ్డలు చుట్టబూనిరి కాని వాలము విచిత్రముగా పెరుగుచుండెను వారు పాతగుడ్డలన్నీ తెచ్చిచుట్టిరి నూనె పోసి వెలిగించిరి నిప్పంటుకోగానే అది భయంకర దావాగ్నివలె కన్పట్ట సాగెను హనుమంతుని లంకానగర వీధులలో నడిపించసాగిరి ఆంజ నేయుడు వెంటనే హ్రస్వరూపమును ధరించి బంధించబడిన త్రాడునుండి దూరిపోయెను బంధ విముక్తుడయ్యెను మరుక్షణమే భయంకర రూప మునుదాల్చి లంకానగరమును మండుతున్న తనవాలముతో దహింపచేయు టకు ప్రారంభించెను చూచుచుండగనే లంకానగరమంతయు మంటలమయ

మయ్యెను ఆంజనేయస్వామి సముద్రతీరము చేరి తన వాలమును సముద్రములో ఆర్పుకొని అక్కడినుండి లంఘించి రామ సన్నిధిని చేరెను లంకా నగరమంతయు మంటలలో చిక్కుకున్నను సీతాదేవి విభీషణుడు నివసించు ప్రాంతములు అగ్నికి ఆహుతి కాకపోవడము ఒక విశేషము

ఆంజనేయస్వామి శ్రీరామచంద్రుని పవిత్రసన్నిధానమును చేరెను వానరులందరును హాజరైరి సీతజాడ తెలిసినదా తెలియజేయమని వరుసగా ఒక్కొక్కరిని అడిగిరి హనుమంతుని వంతువచ్చెను హనుమంతుడు పెదవి విప్పి పలుకక మునుపే దక్షిణ దిక్కుకు తిరిగి చేతులు జోడించి నమస్కరించెను సీత ఆవైపు యుండుటయే దానికి కారణము అహా! ఎంతటి కోమల హృదయము ఎంతటి భక్తిభావము ఎంతటి కర్తవ్య పరాయణత్వము హృదయములను కరగింపు తన వినమ్రతా ప్రవర్తన అన్యులలో అగోచరము తదుపరి అశోకవనములో సీతాదేవి పరిస్థితి నంతయు వివరించి చివరగ జానకి రామునికివ్వమని యొసంగిన చూడా మణిని ఆంజనేయస్వామి శ్రీరామచంద్రునికొసంగెను చూడామణిని చూడ గానే కోదండధారి కన్నులు అశ్రుపూరితములయ్యెను హృదయము నుండి పొంగివచ్చు దుఃఖమును ఆపుకోలేక శ్రీరాముడు ఆంజనేయునివంక చూచి సీత క్షేమమును పదే పదే వివరించమని కోరెను

కిమాహ సీతా వైదేహీ
బ్రూహి సౌమ్య పునః పునః
పిపాసు మివ తోయేన
సిన్చన్తీ వాక్య వారిణా

“హనుమా! తెలుపుము వైదేహి వచనములను పదేపదే వినిపించుము మృత్యుముఖములో పడియున్న నాకు ఆమె పలుకులు సంజీవిని వలె పనిచేయును ఆంజనేయా! ఒకమాసము రోజులలో ఆమెను రావణుని బారినుండి విడిపించనిచో ఆమె మృత్యువాత పడుటకు సిద్ధముగా యున్నదని తెలిపితివి అదే నిజమైనచో ఆమె చిరంజీవిని యనియే భావించాలి నేను ఆమెను వదలి మాసము

రోజులు జీవించేద్ధతిరోలేను ఆంజనేయా! ఆమె ఇంకా ఎమి చెప్ప నది? ఏది దాచకుండా చెప్పుము రొగి ఆరొగ్యమునకై వైద్యుని ఔషధములపై ఆధారపడియున్నట్టు నేను నా జీవితమునకై ఆమె అద్భుత వచనములపై ఆధారపడియున్నాను అని రామచంద్రుడు తన హృదయావేదనను హనుమంతుని ముందుంచెను

కృతం హనుమతా కార్యం
సుమహద్భువి దుష్కరమ్
మనసాపి యదన్యేన
నశక్యం ధరణీతలే

ఈ భూమండలములో ఏ వ్యక్తితన మనస్సులో ఊహించుకొను టకు గూడా దుష్కరమైన పనిని హనుమంతుడు నా కొరకు నెర వేర్చెను అని ఆంజనేయుని శ్రీరామచంద్రుడు శ్లాఘించెను

శ్రీరామచంద్రుడు హనుమంతుని మెచ్చుకొని ఆంజనేయు డందిం చిన అమృత సందేశమునకు సంతసించినవాడై హనుమా! స్వర్గతుల్య మైన ఈ వార్తను కొనితెచ్చిన నీకు సరియగు బహుమానము నిచ్చుటకు నేను దీనుడను ఎమి ఇవ్వలేని నేను నన్నే సమర్పించుకొనుటకు సిద్ధంగా యున్నాను అని హనుమంతుని గాఢాలింగనము చేసుకొనెను హనుమం తుడు ఆక్షణములో సారూప్యముక్తిని పొందినంతగా తృప్తిచెందెను

వానర సహాయమున సాగరముపై వంతెనను నిర్మించి రాముడు లంకను చేరెను రామ రావణసైన్యము యుద్ధమునకు దిగెను రావణుని సైన్యాధిపతియైన ప్రహస్తుడు అగ్నిదేవుని కుమారుడైన నీలుని చేతిలోమర ణించెను శత్రువు బలవంతుడని గ్రహించిన రావణుడు తానే స్వయంగా యుద్ధరంగములో దిగెను సంగ్రామమున కాలుమోపిన రావణుని మొదట ఆంజనేయస్వామి ఎదుర్కొనెను రావణునికి ఎదురు నిలిచి పిడికిలి బిగిం చిన తన చేతిని చూపెను వెంటనే రావణుడు తన అరచేతిలో ఆంజ నేయుని వక్షస్థలమును కొట్టెను బలవంతమైన రావణుని అరచేతి దెబ్బకు హనుమంతుడు స్మృతితప్పెను హనుమంతుడు తొందరగ జాగరూకుడై

తన అరచేతితో రావణుని కొట్టెను ఆంజనేయుని అరచేతి దెబ్బను రుచి చూచిన రావణుడు ఓహో! నీవు ఎదుర్కొనదగిన శత్రువువే యనెను వెంటనే ఆంజనేయుడు లంకాధిపతి నుద్దేశించి నీ పొగడ్తలు నా కిప్పరముచేదు నీ స్తుతులను నేను గుర్తించను గౌరవించను నా చేతి దెబ్బతిని ఇంకా నీవు సజీవుడవై యున్నందుకు నేను లజ్జపడుతున్నాను ఈసారి మరియొక దెబ్బవేసెదను దానితో నీవు సరాసరి యమపురి కేగెదవు యనెను హనుమంతుని వాక్యములు రావణుని ఆవేశమును గుప్పించెను అంతట రావణుడు పిడికిలి బిగించి తనశక్తినంతయు నుపయోగించి హనుమంతుని కొట్టెను హనుమంతుడు రావణుని హస్తఘాతమునకు నిలువలేక మూర్ఛిల్లెను

హనుమంతుడు స్మృతికి రాగానే రావణుడు నీలునితో యుద్ధముచేయుచుండెను తనకు దగ్గరలోయున్న రావణుని వధించుటకు హనుమంతునికి అవకాశమొచ్చెను అయినను ఆంజనేయస్వామి రావణునిపై కురకలేదు

"అన్యేన యుధ్యమానస్య
నయుక్త మభి ధావనమ్"

యుద్ధములో మరియొకరితో యుద్ధము చేయునప్పుడు అతనిని ఎదుర్కొనుట అధర్మము అని తనలోతాను తలపోయుకొనెను రావణుడు ఒంటరిగా లభించునంతవరకు వేచియుందును అని నిర్ణయించుకొనిన ధర్మస్వరూపుడు శ్రీ ఆంజనేయస్వామి

ఆంజనేయస్వామి వీరత్వము అనేకచోట్ల అత్యద్భుతంగా ప్రకటించబడింది రామునిమీదను రాముని సైన్యమంతటి పైనను ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్ర ప్రయోగము చేసెను రామలక్ష్మణులు గాయపడిరి రామసేన రణరంగమున తీవ్ర ఘాతమునకు గురియైనది రాముని సైన్యమంతయు అంతరించినట్లు ఇంద్రజిత్తు తనతండ్రియైన రావణునికి తెలియజేసెను రాత్రి అయ్యెను వానరసేనలో కొందరు మూర్ఛిల్లిరి కొందరు మరణించిరి మరికొందరు మృత్యుముఖంలో ప్రవేశించుటకు సిద్ధముగాయుండిరి ఆంజనేయుడు విభీషణుడుమాత్రము క్షేమముగాయుండిరి! అంతట హను

మంతుడు విభీషణునితో నావద్ద ఒక దీపమున్నది మనము యుద్ధభూమికి ప్రవేశించి గాయపడినవారలకు మనముచేయగలిగిన సహాయముచేసెదము అని తెలియజేయగా ఇరువురుకలసి రాత్రివేళ యుద్ధభూమిలో ప్రవేశించిరి జాంబవంతుని గాంచిరి విభీషణుని కంఠధ్వనిని విన్న జాంబవంతుడు విభీషణా! నీవేనా! నేను నన్ను నేత్రాలతో దర్శించే స్థితిలోలేను నీకంఠ ధ్వని ననుసరించి గుర్తించగలిగాను విభీషణా ఈ యుద్ధభూమిలో హను మంతుని జాడనుగాంచితివా? అని అడిగెను హనుమంతుడు ప్రక్కనే యున్నను నోరు మెదపలేదు విభీషణుడు జాంబవంతునితో అందరూ క్షతగాత్రులై పడియున్న ఈ దుర్దినాన నీవు రామలక్ష్మణుల మనుగడలను సుగ్రీవుడు అంగదాదుల మనుగడలనుగూర్చి ప్రశ్నించక హనుమంతుని గూర్చియే ప్రశ్నించుట నన్ను విస్మయమొందించుచున్నది అనెను విభీ షణా! కారణము లేకపోలేదు హనుమంతుడొక్కడు జీవించియుండినచో మరణించిన మన సైన్యమంతయు తిరిగి జీవించగలరు అంజనేయుడు మరణించినచో మనము బ్రతికినను మృతులతో సమానమే అని జాంబ వంతుడు తెలుపగా అంజనేయునిహృదయము ద్రవించెను హనుమంతుడు వెంటనే జాంపవంతుని పాదములపైబడి తనపై చూపబడిన వాత్సల్యము నకు సంతసించెను జాంబవంతుడు హనుమంతునితో హనుమా! ఈవిప త్కర పరిస్థితిలో మనవారందరిని రక్షించగల ధీరుడవు నీవే నీ శక్తినుప యోగించుము హిమాలయములలో కైలాస ఋషభపర్వతముల మధ్య నాలుగు మూలికలున్నవి వానిని తీసుకొనివచ్చినచో మృతులైన మన వారందరు సజీవులగుదురు క్షతగాత్రులైన వారందరు ఆనందోత్సాహంతో ఆరోగ్యవంతులగుదురు అని తెలిపెను అంజనేయస్వామి వెంటనే హిమా లయమును చేర లంఘించెను హనుమంతుని ఈ దివ్య కృత్యమును ఆక సమునుండి దేవతలుకూడా సంతసముతో వీక్షించినట్టు వాల్మీకి మహర్షి రచించెను హనుమంతుడు ఆ ప్రదేశమును చేరి మూలికలకై అన్వేషిం చెను హనుమంతుని రాకను గుర్తించిన ఆ సజీవమూలికలు తమలోతాము చర్చించుకొని అంజనేయునికి అగుపించకుండా దాగెను విఫల ప్రయత్నము లతో విసుగుచెందిన పవనసుతుడు పర్వతమునే కదిలించి ఎత్తుకొనితిరిగి

ఎచ్చెను హనుమంతుడు పర్వతమును క్రింద ఉంచగనే కుమారునిసాహస కృత్యమును గాంచి ముదమందిన వాయుదేవుడు తీవ్రముగా సంచరించి ఆ మూలికల మీదుగా వీచి రణరంగములో క్షతగాత్రులై యున్న రామ సేనను ఆరోగ్యవంతులుగ జేసెను రామలక్ష్మణులుకూడా గాయములబాధ నుండి విముక్తినొంది ఆరోగ్యవంతులైరి హనుమంతుడు ఆ పర్వతమును తిరిగి తీసుకవెళ్ళి హిమాలయములో యధాస్థానము నందుంచెను అయితే ఇక్కడ ఒక సందేహము తలఎత్తేఅవకాశము లేకపోలేదు వాయుదేవుని సంచారముచే ప్రభవించిన మూలిక మహత్తు రణరంగమునందలి శ్రీరాముని సేనను మాత్రమే బ్రతికించినదా ? మరి అదే రణరంగమున పడియున్న రావణుని రాక్షససైన్యమును పునర్జీవితులను చేయలేదా? అనే సంశయము ఆలోచనాపరులకు తప్పక ఉదయిస్తుంది రావణునివంటి అదృష్టహీనులను బాగుచేయువారెవరు? రావణుడు అంతకుపూర్వమే ఒక ఆదేశము నిచ్చి యున్నాడు రణరంగమున మరణించిన తనసైన్యమును రాత్రికి రాత్రియే తొలగించి సాగరమున పడవేయుమనియు అలాచేయుట వలన తనసైన్యమునందు మరణించినవారి సంఖ్య శత్రుసైన్యమునకు అవగతము కాదనియు భావించి ఆజ్ఞాపించియున్నాడు రావణుని ఆజ్ఞ మేరకు ఆనాడు మరణించిన రావణుని సైనికులను సాగరమున విసరి వేయుట జరిగినది మూలికాప్రభావముచే పునర్జీవితులయ్యే అవకాశము వారికి లభించలేదు

ఆంజనేయుడు రెండవసారికూడా హిమాలయపర్వతమునకు ప్రయాణముచేసెను రావణుని శక్తి ఘాతకమునకు లక్ష్మణుడు మూర్ఛిల్లెను వైద్యనిపుణుడైన సుషేణుడను వానరుడు హనుమంతునిపిలిచి మరియొక సారి తన దివ్యశక్తిచే హిమాలయమునకరిగి సంజీవినిపర్వతముపై నున్న మూలికను తీసుకొనిరమ్మని తెలిపెను రెండవజాంబవంతుడని పేరు గాంచిన సుషేణుని సలహాపై హనుమంతుడు హిమాలయమునకు ప్రయాణము సాగించెను మార్గమధ్యమున రావణుని ప్రేరణచే కార్యమునువిఘ్నము చేయుటకేతెంచిన కాలనేమి యను రాక్షసుని వధించి హనుమంతుడు సంజీవిని పర్వతమును జేరెను సుషేణుడు తెలియజేసిన మూలిక వర్ణనను ఆంజనేయస్వామి మరచిపోయెను వెంటనే గతములో తాను నిర్వహించిన

సాహసకృత్యము స్మృతిలో మెదిలెను వెంటనే సంజీవిని పర్వతమును పెకలించి తీసుకొనివచ్చెను సుషేణుడు మూలికను తీసుకొని లక్ష్మణునిపై ప్రయోగించగా లక్ష్మణుడు నిద్రనుండి మేల్కాంచినట్టు లేచెను

రావణ వధానంతరము శ్రీరాముడు హనుమంతుని పిలిచి రావణ మరణవార్తను సీతకు తెలియజేయమని చెప్పెను హనుమంతుడు సీతను సమీపించి అమృతతుల్యమైన వార్తనందించెను వెంటనే సీతాదేవి హనుమంతునిచూచి హనుమా! ఇంతటి చక్కటి సందేశము నందజేసిననిన్ను సన్మానించుటకు నావద్ద సరియగు బహుమానములేదు లేకపోవడమే మంచిదనిపిస్తున్నది విలువైన రత్నములను విరివిగా బంగారమును త్రిలోకాధిపత్యమును నీ కొసంగినను అవి తుచ్ఛమేనని నా అభిప్రాయము అని తెలియజేసెను

అయోధ్యలో రామపట్టాభిషేకము ముగిసెను వానరయోధులందరు హాజరైరి విభీషణుడు తన నలుగురు అమాత్యులతో కలసి హాజరయ్యెను పట్టాభిషేకానంతరము అందరును తమ స్వస్థానములకు నిష్క్రమింప మండిరి రాముడు హనుమంతునికి ఏమియు నొసంగలేదు ఒకముత్యాల హారమును సీతాదేవి నొసంగెను అమూల్యమైన ఆ ముత్యాల హారమును సీతాదేవి ధరించి తరువాత ఆ ముత్యాల హారమును చేతికి తీసుకొని వానరులను వీక్షించెను సీత హృదయమును అవగతము చేసుకొనక రామచంద్రుడు తనకు ప్రియమైన వారికి ఇవ్వవచ్చునని సీతకు తెలియజేసెను "ఈ ముత్యాలహారముతో తులతూగు సుగుణ సంపన్నుడైన వానికి బహూకరించుము" అని తెలిపెను సీత హనుమంతుని కొసంగెను

అందరూ అయోధ్యను వీడి చనుటకు సంసిద్ధులగుచుండ హనుమంతుడు శ్రీరామచంద్రుని సమీపించెను

స్నేహోమే పరమో రాజం స్త్వయి
తిష్ఠతు నిత్యదా
భక్తిశ్చ నియతా వీర
భావో నాన్యత్ర గచ్ఛతు

యావద్రామ కథావీర
చిరష్యతి మహీతలే
తావచ్ఛరీరే వత్స్యన్తి
ప్రాణా మమ న సంశయః

హనుమంతుడు శ్రీరామునికి నమస్కరించుచు
"రామా! నాకు రామ భక్తి చెదరకుండు నటుల ఆశీర్వదించుము నాకు నీవు వినా మరొకవిషయముపై మనస్సు మరలకుండునటుల అనుగ్రహించుము ఈ భూమండలమున రామ నామమునిలచి యుండువరకు నా మనుగడ కొనసాగునటుల దీవించుము సదా నీ భక్తుడపై జీవింపనటుల కరుణించికాపాడుము అని ప్రార్థించెను ఆంజనేయుని ప్రార్థన నాలకించి సంతసించినవాడై శ్రీరామ చంద్రుడు హనుమా నీకోర్కె తప్పక నెరవేరగలదు రామ కథా గానము జరుగునంతకాలము నీ కీర్తి అందులో భాగమై యుండును నీవు చిరంజీవివై జీవించెదవు అని ఆశీర్వదించెను.

ఎకైక స్యోప కారస్య
ప్రాణాన్ దాస్యామి తే కలే
శేషస్యే హోప కారాణాం
భవామ ఋణినో వయమ్

హనుమా! నీవు అద్భుత కార్యములతో నన్ను సేవించితివి. వానిలో ఏ ఒక్కదానినుండి ఋణ విముక్తుడ నగుటకు నా జీవితమే చాలిపోదు నీవు చేసిన ఒక్కొక్క సేవకు నా ఒక్కొక్క జన్మను సమర్పించినచో ఈ ఆలోచన ద్వారా నేను ఋణ విముక్తుడనయ్యే ఆశయే కనుపించుటలేదు అని శ్రీరాముడు తెలియ జేసెను

ఆంజనేయస్వామి సాహిత్యకళానిధి సంగీత రసజ్ఞుని ఒకసమయమున నారద తుంబురులకు వివాదము వచ్చెను సంగీత విద్యయందుఒకరి కంటె మరొకరు ఘనులని వాదులాడ సాగిరి ఈ తగవునుతీర్చమని వారు